ఓం

# అనుబంధ చతుష్టయము

అనబడు

అద్వైత వేదాన్త భూమిక



శంకరో విజయతే తరామ్

సంకలన కర్త

## స్వామి బ్రహ్మవిద్యానన్ద

శ్లో॥శ్రుతిస్మృతిపురాణానామాలయం కరుణాలయమ్।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్॥

శ్లో॥శాస్త్రం శారీరమీమాంసా దేవస్తు భగవాన్స్వయమ్।
ఆచార్యః శంకరాచార్యః సన్తు మే జన్మ జన్మని॥

శ్లో॥శుష్కవేదాన్తదన్తీశ బృన్దసన్తాప కేసరి।
అసఙ్గానన్దయోగీన్ద్రో గురుర్విజయతే తరామ్॥

ఓం

శ్రీ బ్రహ్మవిద్యానన్ద స్వాములవారిచే

సంకలిత

# అనుబంధ చతుష్టయము

అనబడు

## అద్వైత వేదాన్త భూమిక




*శ్రీసద్గురు మహర్షి మలయాళస్వామి ఆశ్రమమ్*

*ప్లాటు నం.48,కళావతి నగర్(న్యూ సునిల్ నగర్),*

*ఎమ్.ఐ.డి.సి. షోలాపూర్,(మహారాష్ట్రము).*

*పిన్.కోడ్.413006.*

*Email: aumhreemaum@gmail.com*



**శ్లో॥యస్మిన్సర్వం యతః సర్వం యత్సర్వం సర్వతశ్చ యః।**

**యశ్చ సర్వమయో నిత్యం తస్మై సర్వాత్మనే నమః॥**(శాన్తిపర్వము 47-84)

స్థితికాలములో ఎవనియందు సర్వము ప్రతిష్ఠితమైయున్నదో,సృష్టికాలములో ఎవనినుండి సర్వముఉత్పన్నమైనదో,సంహారకాలములోఎవడు స్వయముగా సర్వ స్వరూపుడైయున్నాడో,ఎవడు మూడుకాలములలో విద్యమానమై సర్వత్ర వ్యాపించి యున్నాడో,ఆరోపదశలో ఎవడు సర్వము తానేయై ఉండియు స్వరూపముచే నిర్గుణ నిరాకార,నిర్వికార,సనాతన బ్రహ్మముగానున్నాడో,అట్టి సర్వాత్మకు ప్రణామములు.

## —:పురుషార్థము:—

బ్రహ్మలోకపర్యన్తముగల సకలలోకాధివాసులగు సమస్తప్రాణికోట్లకు వారి మనంబున ఆధ్యాత్మిక,ఆధిభౌతిక,ఆధిదైవికములగు సర్వదుఃఖములనుండి విని ర్ముక్తులమై నిరతిశయము మరియు క్షయశూన్యమును అగు సుఖమును పొం దాలి—అను స్వాభావిక అభిలాష ఉంటుంది.ఈ నైసర్గిక అభిలాషకే దార్శనిక శబ్ద ములలో మోక్షము లేదా పరమపురుషార్థము అంటారు.సకలపురుషుల ఇచ్ఛకు యేది విషయమో అది **పురుషార్థము**నబడును.వ్యక్తిభేదముచే పురుషుల ఇచ్ఛయు అనంతము.అయినను,పురుషార్థములు లోక,వేదములలో ధర్మము,అర్థము,కామ ము మరియు మోక్షము అని ప్రసిద్ధములు.వీనిలో,

1.ఇహలోక,పరలోకసాధనములగు(ధర్మజనక యాగాది సాధనములగు)స్త్రీ,పుత్రు లు,ధనము,గృహము ఇత్యాది ఉపభోగ్య విషయములు **"అర్థము"**లో అంతర్భూత ములగును.

2."ధర్మో మే భూయాత్"నాకు పుణ్యము కావాలి—అను ధర్మజనక యాగాదికర్మ లు చేయుటకు ప్రవర్తకమగు ఇచ్ఛ—**కామము.** పురుషులకు దుఃఖహేతువగు అధర్మజనక నిషిద్ధకర్మలు చేయు ఇచ్ఛ కామము గాదు.

**శ్లో॥ధర్మావిరుదాధో భూతేషు కామోఽస్మి భరతర్షభ।**(గీత.7-11)

లేక,శరీరము,ఇంద్రియములు మరియు మనస్సుచే ఉపరోక్త విషయములన నుభవించవలెనను కోరికయే **"కామము"**అగును.ఎందుకనగా,కొందఱికి ధనాది విషయములు ప్రాప్తములున్ననూ శరీరాదులలో వాటిననుభవించు సామర్థ్యము లే కుండును,కొందఱికి వైషయిక భోగములననుభవించు శక్తిగలిగియున్ననూ విషయ ములు అప్రాప్తములుండును.కావున,పురుషులు ధనాది విషయప్రాప్తి విషయక ఇచ్ఛయు మరియు వాటిని నిరాటంకముగా అనుభవించాలి—అను కోరికయు స్వా భావికముగా కలిగియుందురు.అందువలన,ఈరెండును 'పురుషార్థము'లనబడును.

3.శీఘ్రముగా నశించిపోవు విహితకర్మజన్య,కాలాంతరభావి ఫలజనక అపూర్వము **"ధర్మము"**.

**"వేదప్రతిపాద్యః ప్రయోజనవదర్థో ధర్మః।"**(అర్థసంగ్రహః)

వేదముచేగాని,వేదానుసారి శాస్త్రముచేగాని ప్రతిపాదింపబడినదై,ప్రయోజనము గలదై,అనర్థముకానిదై యేపదార్థముండునో,దానిని **"ధర్మము"**అంటారు.లక్షణము లో"ప్రయోజనవత్"అని చెప్పనియెడల స్వర్గరూపప్రయోజనమునందతివ్యాప్తమగు ను.స్వర్గాదులు"యజేత స్వర్గకామః"ఇత్యాది విధిబోధితములును,ప్రయోజనరూప ములు(సుఖాదిరూపములు)నూ ఉన్నవి.వాటికి ప్రయోజనాంతరాభావమున్నందు న"ప్రయోజనవత్=ప్రయోజనముగలది"అని చెప్పుటచే అతివ్యాప్తిదోషము నివర్తించు ను.వేదప్రతిపాద్యము అను పదమును చేర్చనిచో భోజనాదులందతివ్యాప్తి ప్రాప్తించు ను.ఎందుకంటె,భోజనాదులు తృప్త్యాది ప్రయోజనముగలవై అర్థములున్నవి.అవి రాగాదిప్రాప్తములుగావునవేదప్రతిపాద్యములుకావు,యద్యపి **"అష్టౌగ్రాసామునేర్భ క్ష్యా,షోడశారణ్యవాసినాం,ద్వాత్రింశత్తు గృహస్థస్య,యథేష్టం బ్రహ్మచారిణామ్"**ఇత్యాది వాక్యములచే భోజనాదులుగూడ విధిబోధితములుగా తెలియబడుచున్నవి.తథాపి ఆవచనములు గ్రాసనియమపరకములున్నవి.భోజనవిధాయకములు కావు.అందు వలన,"వేదప్రతిపాద్యః"అను శబ్దనివేశముచే భోజనాదులందుగలుగు అతివ్యాప్తిదోష ము నివర్తించును.అర్థపదమును ప్రయోగించనిచో శ్యేనాదులందతివ్యాప్తి గలుగును. శ్యేనాదులు"శ్యేనేనాభిచరన్ యజేత"(షడ్.బ్రా.4-2-1-2)ఇత్యాది వేదప్రతిపాద్యములు మరియు నరకప్రాప్తిరూప ప్రయోజనముగలవైయున్నవి.కాని,అనిష్ట నరకజనకము

లున్నందున అనర్థములున్నవి.అర్థ ములు కావు.

ఇట్టి ధర్మము యాగాది కర్మరూపము గావచ్చును.లేక, యాగాదికర్మజన్య పుణ్యమై(అదృష్టమై)ననూ కావచ్చును.శాస్త్రప్రక్రియా భేదముచే రెండునూ ధర్మముయొక్క స్వరూపమే.ఈధర్మము అర్థకామములకు సాధనము.యద్యపి కృషివాణిజ్యాది లౌకికకర్మలుగూడ అర్థకామములకు సాధనములుగా కన్పట్టుచున్నవి.తథాపి,వాటియొక్కసఫలతా ధర్మముయొక్క అధీనమైయున్నది.అది ఈజన్మయొక్క ధర్మాచరణరూపమై యుండవచ్చును,లేదా జన్మాంతరములోని పుణ్యరూపమైనా ఉండవచ్చును.లౌకిక ఉపాయములు ధర్మాధర్మజన్య ఫలాభివ్యక్తికి సాధనమాత్రములే.కావుననే,ధర్మము కామార్థములకు సాధనమని చెప్పబడినది.

4.కారణసహిత సర్వదుఃఖములయొక్క అత్యంత నివృత్తి,పరమానందబ్రహ్మప్రాప్తికి **మోక్షము** అంటారు.

ఈ చతుర్విధ పురుషార్థములలో మోక్షము పరమ పురుషార్థమనియు,ధర్మార్థకామములు గౌణపురుషార్థములని చెప్పబడినవి.ఎందుకనగా?

1.స్త్రీ,పుత్ర,బంధు,మిత్ర,ధనాది "అర్థ"రూప పురుషార్థమేది గలదో,అది అనిత్యము. ఎందుకంటె, వారి వియోగము అనివార్యము.సంబంధపడియున్నను **"న వా అరే సర్వస్యకామాయ సర్వం ప్రియం భవతి,ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి"** (బృ.2-4-5; 4-5-5)అని చెప్పబడినట్లుగా స్వార్థపూరిత ప్రేమను వలకబోసేవారేగాని, నిజముగా ప్రేమించువారెవ్వరునూ లేరు. యద్యపి,

**శ్లో॥ప్రీణాతి యః సుచరితైః పితరం స పుత్రో,**
**యద్భర్తురేవ హితమిచ్ఛతి తత్కళత్రమ్।**
**తన్మిత్రమాపది సుఖే చ సమక్రియం యత్,**
**ఏతత్త్రయం జగతి పుణ్యకృతో లభన్తే॥**

శ్రద్ధాభక్తియుక్తుడై శుశ్రూషలచే తండ్రిని సంతోషపెట్టు పుత్రుడే పుత్రుడు.కేవలము పతియే దైవముగా భావించి,అతని హితమునుగోరు పతివ్రత స్త్రీయే నిజమైన పత్నియగును.సుఖములోనూ దుఃఖములోనూ సమానప్రీతిగలవాడై ఆదుకొనువా

డే హితైషి—మిత్రుడనబడును.ఈముగ్గురునూ జగత్తులో పుణ్యాత్మునికే లభింతురు గాన ఈ అర్థరూప పురుషార్థముగూడ నిత్యమని చెప్పవచ్చునుగదా?

తథాపి,బుద్బుదతరంగఫేములు మరియు కమలములు జలజన్యములైనప్పటికినీ అన్నియూ స్థిరములేయనుట కుదురదుగదా.

2.ఎప్పుడైతే అర్థము అస్థిరమో,దానికి సంబంధించిన కామరూప పురుషార్థము గూడ అనిత్యమని అర్థతః సిద్ధమగుచున్నది.

3.నచ ధర్మోఽపి పరమపురుషార్థః, తస్య స్వర్గాదిసాధనత్వేనోపసర్జనత్వాత్।తథా హి శ్రుతిః—**"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"**(తాం.బ్రా.16-155; ఆప.శ్రౌ.10-2-1),""**దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత**"(త్రై.సం.2-2-5);**వాయవ్యం శ్వేతమాలభేత భూతికామః**"(యజు.2-1-1)ఇతి స్వర్గసాధనత్వమాహ ధర్మస్య।స్వర్గసాధనముగా చెప్పబడినందున ధర్మముగూడ పరమపురుషార్థము కానేరదు.

మోక్షేతర ధర్మాదిత్రయాణామపి కృతకత్వేన అనిత్యత్వం ప్రత్యక్షత్వాత్।**"తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్రపుణ్యచితో లోకః క్షీయతే"**(ఛాం.8-1-6).ఏవిధముగా ఈలోకంలో క్రియచే(కృషి,వాణిజ్యాదులచే)నిష్పాదితములగు ధాన్యము, ధనము నశ్వరములని సర్వలోక ప్రత్యక్షసిద్ధములో,అట్లే కర్మసాధ్యములగు స్వర్గాదిలోకములుగూడ కాలాంతరములో పుణ్యక్షయము కాగా నశించిపోవును.**"క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి"(గీత.9-21).**

వాస్తవముగా విచారించినచో ఈ ధర్మాదిత్రయము పురుషార్థములే కావు.ఎందుకంటె,**"ఇష్టం మే భూయాదనిష్టం మే మాభూత్**"మాకు నిరతిశయము అనగా దేనికంటె అధికమైనది లేదో,మరియు క్షయశూన్యము అనగా ఎప్పుడూ నశించనటువంటి సుఖము కావాలి—అను నైసర్గిక ఇచ్ఛ ప్రతి ప్రాణికి ఉంటుంది.ఇటువంటి సుఖము కేవలము మోక్షసుఖము దప్ప వేరొండు లేదు.ఇట్లు ధర్మము అతీంద్రియముగావున శ్రుతిస్మృతులచే అనిత్యమని సిద్ధంచినమీదట తదధీన అర్థ,కామములు అనిత్యములని వేరుగ చెప్పనక్కర లేదు.ప్రత్యక్షసిద్ధములు.కావున,ధర్మార్థకామములు పురుషార్థములే కావు.

తర్హి,కథమేతేషాం పురుషార్థకోటిప్రవిష్టత్వమ్?అట్లైనచో,ధర్మార్థకామములు పురుషార్థములని ఎందుకు చెప్పబడుచున్నవి?

మోక్షమునకు జ్ఞానముద్వారా పరంపరాసాధనములున్నందున గౌణముగా పురుషార్థములని చెప్పబడినవి.జీవనమునకు సాధనమైనందున నాగలిని కృషీవలుని జీవనము **"లాంగలం జీవనమ్"** అని ఔపచారికముగా చెప్పుదురు.ఆయుర్వృద్ధికి హేతువున్నందున నెయ్యిని **"ఆయుర్వైఘృతమ్"**అని ఎట్లు చెప్పబడుచున్నదో,అట్లే ధర్మాదిత్రయమునకు గౌణముగా పురుషార్థములని వ్యవహారము కలదు.

పరిశేషన్యాయముచే"తరతిశోకమాత్మవిత్"(ఛాం.7-1-3);**"బ్రహ్మవిదాప్నోతి పరమ్"** (తై.2-1-1)ఇత్యాది శ్రుతులచే అజ్ఞానసహిత సర్వదుఃఖముల అత్యంతనివృత్తి మరియు పరమానందబ్రహ్మప్రాప్తిరూప మోక్షమే పరమపురుషార్థమని ప్రతిపాదించబడినది.మరియు"న స(చ) పునరావర్తతే"(నా.పరి.9-22; ఛాం.8-15-1)**"తేషాం న పునరావృత్తిః"**(బృ.6-1-15)**"ఏతేన ప్రతిపద్యమానాః ఇమం మానవమావర్తం నావర్తన్తే"**(ఛాం.4-15-6)ఇత్యాది శ్రుతులచే మోక్షముయొక్క నిత్యత్వము ప్రతిపాదించబడినది.అట్లే,

**"యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే"**(గీత.13-13);**"యజ్జ్ఞాత్వానపునర్మోహమేవం యాస్యసిపాండవ"**(గీత.4-35)**"జ్ఞానంలబ్ధ్వాపరాంశాన్తిమచిరేణాధగచ్ఛతి"**(గీత.4-39)**"ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।మాము పేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే"**(గీత.8-16)**"యద్గత్వా న నివర్తన్తే తద్ధామ పరమం మమ"**(గీత.15-6)**"దుఃఖాలయమశాశ్వతమ్"**(గీత.8-15)ఇత్యాది స్మృతివచనములచేగూడ అనిత్యవిలక్షణ మోక్షముయొక్క నిత్యత్వము ప్రతిపాదించబడినది.

**"నాస్త్యకృతః కృతేన"**(ముం.1-2-12)**"యత్కృతకం తదనిత్యమ్"**అను న్యాయముచే ఏది కర్మసాధ్యమో అది అనిత్యముంటుంది.

**శ్లో॥అశ్వమేధసహస్రాణి వాజపేయ శతాని చ।**

**న తరన్తి జరామృత్యూ నిర్వాణాధిగమాద్వినా॥**(మ.భా.అను.దానధర్మపర్వము.145)

వేలకొలది అశ్వమేధయాగములొనర్చిననూ,వందలకొలది వాజపేయయజ్ఞములు చేసిననూ మోక్షము పొందనిచో జన్మ జరా మృత్యువులు తప్పవు.

మోక్షము కర్మచే కలుగదు గావున నిత్యమని సిద్ధించుచున్నది.కర్మఫలములు ఉత్పాద్యము,ప్రాప్యము,సంస్కార్యము మరియు వికార్యము అని నాల్గువిధము లు.ఈ విషయమున మూలగ్రన్థములో 336 వ పృష్ఠమునందు విస్తృతముగా వివ రించబడినది.అక్కడ చూడగలరు.మోక్షము నిత్యమని సర్వమోక్షవాదులచే స్వీకరిం చబడినది.

**శ్లో॥ఉత్పాద్యమాప్యం సంస్కార్యం వికార్యం పరిగణ్యతే।**

**చతుర్విధం కర్మసాధ్యం ఫలం నాన్యదితః పరమ్॥**(స.వే.సి.సా.సం.154)

**ఉత్పత్తిరాప్తిః సంస్కారో వికారశ్చ విధేః ఫలమ్।**

**ముక్తిర్విలక్షణైతేభ్యస్తేనేహానర్థకో విధిః॥**(బృ.వా.సంబన్ధ భాష్యవార్తికము 236)

తస్మాన్నిత్యత్వాత్స్వతః పుమర్థత్వాత్ మోక్షః ఏవ పరమపురుషార్థః।

శంక:—"**అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజినః సుకృతం భవతి**"(శ.బ్రా.2-6-3-1); "**అపామసోమమృతా అభూమ**"(ఋగ్వే.6-4-11;8-48-3);మరియు,

**శ్లో॥యన్న దుఃఖేన సంభిన్నం నచ గ్రస్తమనన్తరమ్।**

**అభిలాషోపనీతం యత్ తత్సుఖం స్వ పదాస్పదమ్॥**(బృ.వా.సారము.1-1-246 & తంత్రవార్తికము)

ఇత్యాది వచనములు సోమపానమునకు అమృతరూప ఫలము,చాతుర్మాస్య యాగమునకు అక్షయసుఖరూప ఫలము చెప్పబడినది.ఏది దుఃఖమిశ్రితము కా నిదో,కాలాంతరములో నశించనిదో మరియు సకలపురుషుల ఇచ్ఛకు విషయ మో—దానిని స్వర్గమందురు.ఇట్లు కర్మఫలముగూడ నిరతిశయ నిత్యసుఖరూప ముగా ప్రతిపాదింపబడుచున్నది.కావున,మోక్షమే నిత్యమని,పరమపురుషార్థమని యెట్లు చెప్పనగును?

సమాధానము:—"**తద్యథేహ**" అను శ్రుతిచే మరియు "**యత్కృతకం తదనిత్య మ్**"అను న్యాయముచేతనూ కర్మఫలము అనిత్యమగునని పూర్వమే చెప్పియు న్నాము.కర్మచేత ఏదైతే అమృతరూపఫలము మరియు అక్షయసుఖరూప ఫలము చెప్పబడినదో అది ప్రళయస్థాయిపర్యంత సుఖమేగాని శాశ్వతసుఖముమాత్రము కాదు.

**శ్లో॥ఆభూతసంప్లవం స్థానమమృతత్వం విభావ్యతే।**

**త్రైలోక్యస్థితికాలో ఽయమపునర్మార ఉచ్యతే॥**(వి.పు.2-8-95)

---

మోక్షముగూడ ఐదువిధములుగా నుండును.1.సాలోక్యముక్తి:—రాజుయొక్క ప్రజలవలె వారివారి ఉపాస్యదేవతా లోకములో నివసించుట.2.సామీప్య ముక్తి:—రాజుయొక్క సేవకునివలె ఉపాస్యదేవతా సమీపములో నివసించుట.3.సారూప్య ముక్తి:—రాజుయొక్క అనుజునివలె ఉపాస్యదేవతా సమానాకారదేహమును పొందుట.4. సాయుజ్య ముక్తి:—రాజుయొక్క పుత్రునివలె సగుణఈశ్వరుని అహంగ్రహోపాసనచే ఉపాస్యముతో తాదాత్మ్యమగుటచేత సకలైశ్వర్యములను పొందుట—దివ్యభోగముల ననుభవించుట,బహుకాలసంకల్పసిద్ధి,ఇచ్ఛవచ్చిన రూపమును ధరించుట,అనేక దేహములను ధరించుట,హిరణ్యగర్భునితోపాటు ప్రళయపర్యంతము ఉండి కల్పాంతమున బ్రహ్మదేవునితోపాటు విదేహముక్తిని పొందను.

సూత్రము:—**జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ.**(బ్ర.సూ.4-4-17)

ఉపాసకునికి జగత్ సృష్ట్యాది వ్యాపారం తప్ప సకలైశ్వర్యములు ప్రాప్తించును.

పై సాలోక్యాది చతుర్విధ ముక్తులు ఉపాసకులకు చెప్పబడినవి.

5.కైవల్యముక్తి:—సచ్చిదానందనిత్యశుద్ధబుద్ధముక్తస్వభావప్రత్యగభిన్నకూటస్థబ్రహ్మస్వరూపముతో అవస్థితమైయుండుట.దీనినే అవిద్యానివృత్తి అనిగూడ అంటారు.

**అవిద్యాస్తమయోమోక్షః సాచ బంధ ఉదాహృతః।**(బ్రహ్మసిద్ధిః పృష్ఠము 119)

**నివృత్తిరాత్మా మోహస్య జ్ఞాతత్వేనోపలక్షితః।**(చిత్సుఖీ.4-8)

అందువల్ల ఈ కైవల్య ముక్తియే ముఖ్యమగు ముక్తి.నిత్యమగు పరమపురుషార్థము.అట్లే సూతసంహితలోగూడ—

**షడ్భావవిక్రియాహీనా శుభాశుభవివర్జితా।**

**సర్వద్వంద్వవినిర్ముక్తాసత్యవిజ్ఞానరూపిణీ॥**

**కేవలం బ్రహ్మరూపోక్తా సర్వదాసుఖలక్షణా।**

**న హేయా నాప్యుపాదేయా సర్వసంబంధవర్జితా॥**

**న దృష్టా న శ్రుతా విప్రో న చాస్వాద్యా న తర్కితా॥**

**సర్వావరణ నిర్ముక్తా న విజ్ఞేయా నిరాశ్రయా॥**

**వాచ్యవాచకనిర్ముక్తా లక్ష్యలక్షివర్జితా।**

**సర్వేషాం ప్రాణినాం సాక్షాదాత్మభూతా స్వయంప్రభా॥**

**ప్రతిబంధవినిర్ముక్తాసర్వదా పరమార్థతః।**

**అవిచారదశాయాం తు ప్రతిబద్ధా స్వమాయయా॥**

**ఏషైవ పరమా ముక్తిః ప్రోక్తా వేదార్థవేదిభిః।**

**అన్యాశ్చ ముక్తయః సర్వా అపరా పరికీర్తితాః॥**

(సూతసంహితా.ముక్తిఖండము 2-30 నుండి 35 వరకు)

శంక:—అట్లైనచో సాలోక్యాదులందు ముక్తి శబ్దప్రయోగము ఎందుకు చేయబడినది?

సమాధానము:—సాలోక్యాది ముక్తిని పొందిన ఉపాసకునికి పునరావృత్తి లేదు.క్రమముగా ముఖ్యముక్తిని పొందును గావున ఉపచారముచే ముక్తిశబ్దము ప్రయోగించనైనది.

**బ్రహ్మణాసహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసఞ్చరే।**

**పరస్యాన్తే కృతాత్మానః ప్రవిశన్తి పరం పదమ్॥**(కూర్మపురాణము 1-12-269)

**"న స(చ) పునరావర్తతే"**(నా.పరి.9-22; ఛాం.8-15-1);**అనావృత్తి శబ్దాత్ అనావృత్తి శబ్దాత్.** (బ్రహ్మసూత్రము.4-4-22)

శంక:—ముఖ్యముక్తి యేదిగలదో,అది ముముక్షువుయొక్క స్వరూపమై,స్వతః సిద్ధమై స్వప్రకాశరూపమైయున్నందున,అతనికి గురువులను ఆశ్రయించి శ్రవణాది విచారముచేయుటకు ప్రవృత్తి కలుగనేరదు.

సమాధానము:—స్వతఃసిద్ధమైనప్పటికిని కంఠచామీకర న్యాయమువలె పరిపూర్ణసచ్చిదానందప్రత్యక్స్వరూపముచే అజ్ఞాతమున్నందున,అపరోక్షానుభవము కొఱకు గురుశాస్త్రాలను ఆశ్రయించి శ్రవణాది విచారముచేయుటకు ప్రవృత్తి ఉపపన్నమగును.

**శ్లో॥ఆత్మా తు సతతం ప్రాప్తోఽప్యప్రాప్తవదవిద్యయా।**

**తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా॥**(ఆత్మబోధ.44)

అవిచారమువల్ల కలిగిన బంధము విచారముచే నివర్తించును.

**శ్లో॥అవిచారకృతో బన్ధో విచారేణ నివర్తతే।**

**విచారేణ వినష్టాయాం మాయాయాం శిష్యతే స్వయమ్॥**

**తస్మాజ్జీవ పరాత్మానౌ సర్వదైవ విచారయేత్।**(వే.పం.10-5)

ఎల్లప్పుడు జీవపరమాత్మల విచారము చేయగాచేయగా జ్ఞానోత్పగలిగి,జ్ఞానముచే అజ్ఞానము నివర్తింపబడి పరమముక్తి లభించును.అందుకే,

**శ్లో॥జ్ఞానాదేవ తు కైవల్యమితి శ్రుత్యా నిగద్యతే।**

**జ్ఞానస్య ముక్తిహేతుత్వమన్యవ్యావృత్తిపూర్వకమ్॥**(సర్వవేదాన్తసిద్ధాన్తసారసం.171)

పరమముక్తి యేదిగలదో,అది జ్ఞానముచేతనే కలుగుతుంది.అన్యమైన కర్మఉపాసనాదులచేగాదు— అని శ్రుతిమాత ముక్తకంఠముతో చాటుచున్నది.

**నాన్యః పన్థా విద్యతేఽయనాయ।**(శ్వే.3-8;6-15);**ఋతే జ్ఞానాన్న ముక్తిః;జ్ఞానాదేవ తు కైవల్యమ్; జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః।**(శ్వే.2-15);**తరతి శోకమాత్మవిత్।**(ఛాం.7-1-3);**నాస్త్యకృతః కృతేన।**(ముం.1-2-12);**బ్రహ్మవిదాప్నోతి పరమ్।**(తై.2-1-1);**బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి।**(ముం.3-2-9).

ఆ జ్ఞానమెట్టిదనిన—శ్రీఆద్యగురు శంకరాచార్యులవారు "**శ్రీఅపరోక్షానుభూతి**"లో 24 నుండి 28 వరకు ఇట్లు సెలవిచ్చియున్నారు.

శ్లో॥బ్రహ్మైవాహం సమః శాన్తః సచ్చిదానన్దలక్షణః।
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

శ్లో॥నిర్వికారో నిరాకారో నిరవద్యోఽహమవ్యయః।
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

శ్లో॥నిరామయో నిరాభాసో నిర్వికల్పోఽహమాతతః।
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

శ్లో॥నిర్గుణో నిష్క్రియో నిత్యో నిత్యముక్తోఽహమచ్యుతః।
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

శ్లో॥నిరమలో నిశ్చలోఽనన్తః శుద్ధోఽహమజరోఽమరః।
నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

అజ్ఞాన తత్కార్యరూప బంధముయొక్క అత్యంత నివృత్తి పరమానంద బ్రహ్మప్రాప్తిరూప పరమముక్తికి సాక్షాత్సాధనమగు తత్త్వజ్ఞానమును స్వతంత్రముగా అన్వే

షణముచేయగూడదు.“**శాస్త్రజ్ఞోఽపి స్వాతంత్ర్యేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం న కుర్యాత్**”। (ముం.భాష్యే.2-1-12).

శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడగు శ్రీగురుదేవుని శ్రీముఖముద్వారా **ప్రజ్ఞానం బ్రహ్మ।** (ఐ.5-3);**అయమాత్మాబ్రహ్మ।**(మాం.2); **తత్త్వమసి।**(ఛాం.6-8-7;6-9-4) మరియు **అహంబ్రహ్మాస్మి।**(బృ.1-4-10)ఇత్యాది మహావాక్యములను నిత్య నిరంతర ఆదరణీయముగా శ్రవణ మనన నిదిధ్యాసనరూప విచారముచేసి జీవబ్రహ్మైక్యజ్ఞానమును పొందవలసియున్నది.“**తద్వి జ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం**”।(ముం.2-1-12);“**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవ యా।ఉపదేక్ష్యన్తితే జ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః**”।(గీత.4-34);**ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః।**(బృ.2-4-5;4-5-6).మరియు,జ్ఞానప్రాప్తికి వలసిన సాధనక్రమము పద్మపురాణాంతర్గత “**శ్రీశివగీత**”లో 13-17 నుండి 25 వరకు ఇట్లు నుడువబడినది.

శ్రీరామ ఉవాచ:—

**శ్లో॥కథం భగవతో జ్ఞానం శుద్ధం మర్త్యస్య జాయతే।**
**తత్రోపాయం హర బ్రూహి మయి తేఽనుగ్రహో యది॥**

శ్రీభగవానువాచ:—

**శ్లో॥విరజ్య సర్వభూతేభ్య ఆవిరిఞ్చిపదావధి।**
**ఘృణా వితత్య సర్వత్ర పుత్రమిత్రాదికేష్వపి॥**
**శ్లో॥శ్రద్ధాలుర్భక్తిశాస్త్రేషు వేదాన్తజ్ఞానలిప్సయా।**
**ఉపాయనకరో భూత్వా గురుం బ్రహ్మవిదం వ్రజేత్॥**
**శ్లో॥సేవాభిః పరితోష్యైనం చిరకాలం సమాహితః।**
**సర్వవేదాన్తవాక్యార్థం శృణుయాత్సుసమాహితః॥**
**శ్లో॥సర్వవేదాన్తవాక్యానాం మయి తాత్పర్యనిశ్చయమ్।**
**శ్రవణం నామ తత్ప్రాహుః సర్వే తే బ్రహ్మవాదినః॥**
**శ్లో॥లోహమణ్యాది దృష్టాన్త యుక్తిభిర్యద్విచిన్తనమ్।**
**తదేవం మననం ప్రాహుర్వాక్యార్థస్యోపబృంహణమ్॥**
**శ్లో॥నిర్మోహో నిరహంకారః సమః సఙ్గవివర్జితః।**

**సదా శాన్త్యాదియుక్తః సన్నాత్మన్యాత్మానమీక్షతే॥**

**శ్లో॥యత్సదా ధ్యానయోగేన తన్నిదిధ్యాసనం స్మృతమ్।**

**సర్వకర్మక్షయవశాద్భృత్సాక్షాత్కారోఽపి చాత్మనః॥**

**శ్లో॥కస్యచిజ్జాయతే శీఘ్రం చిరకాలేన కస్యచిత్॥**

శ్రీమద్భగవద్గీతలో గూడ—

**శ్లో॥మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।**

**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥**(7-3)

**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్।**(18-55)

మోక్షమునకు సాధనము బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము.జ్ఞానమునకు శ్రవణాదులు సాధనములు.శ్రవణాదులకు సాధనము వివేకము,వైరాగ్యము,షట్సంపత్తి మరియు ముముక్షుత్వము—అను సాధనచతుష్టయసంపత్తి.

వివేకము:—"**తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్రపుణ్యచితో లోకః క్షీయతే**"(ఛాం.8-1-6);"**యో వా భూమా తదమృతమ్**"(ఛాం.7-24-1);"**అతోఽన్యదార్త మ్**"(బృ.3-4-2).

వైరాగ్యము:—"**పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్ నాస్త్యకృతః కృతేన**";(ముం.1-2-12)"**నవాఽరే సర్వస్య కామాయ**"(బృ.4-5-6; 2-4-5).

షట్సంపతతి:—"**శాన్తో దాన్త ఉపరతి స్తితిక్షుః సమాహితః(శ్రద్ధావిత్తో)భూత్వాఽఽత్మన్యే వాఽఽత్మానం పశ్యతి**"(బృ.4-4-23)

ముముక్షుత్వము:—"**నచపునరావర్తతే**"(ఛాం.8-15-1);"**నసపునరావర్తతే తత్కైవల్యమ్**"(నారదపరివ్రా.9-22),**నతస్య ప్రాణాఉత్క్రామన్త్యత్రైవ సమవలీయన్తే; బ్రహ్మైవ సన్బ్రహ్మాప్యేతి**"(బృ.4-4-6&నృసింహోత్తరతా.5-2);"**సోఽన్వేష్టవ్యః, సవిజిజ్ఞాసితవ్యః**"(ఛాం. 8-7-1).

పై సాధనచతుష్టయము గలిగి మోక్షమును పొందగోరువాడు వేదాన్తశ్రవణమునకు 1.అధికారియనడును.

2.మోక్షము వేదాన్తములకు ప్రయోజనము.

3.జీవబ్రహ్మల ఏకత్వము వేదాన్తములకు ప్రతిపాద్య విషయము.

4.ప్రతిపాద్యప్రతిపాదకభావము,ప్రాప్యప్రాపకభావము,కర్తృకర్తవ్యభావము,నివర్త్య నివర్తకభావము,బోధ్యబోధకభావము ఇత్యాది సంబంధములు.

**శ్లో॥అధికారీ చ విషయః సంబంధశ్చ ప్రయోజనమ్।**

**శాస్త్రారంభఫలం ప్రాహురనుబన్ధచతుష్టయమ్॥**(స.వే.సి.సా.సం.7)

అధికారి,సంబంధము,విషయము మరియు ప్రయోజనము అను యీ నాల్గింటి సమూహమునకే అనుబంధ చతుష్టయమందురు.ఈ అనుబంధచతుష్టయముయొక్క విస్తృతవిచారణయే ఈ సంపూర్ణ గ్రన్థము—అని విజ్ఞులు తెలియగలరు.



ఓం

**—:సప్తజ్ఞానభూమికలు:—**

ఎందరో మహానుభావులు,అందరికి వందనాలు.

లోకంలో ఎంతోమంది జ్ఞానిపురుషులున్నారు.కాని, అందరియొక్క స్థితి,వ్యవహారము ఒకేతీరుగ లేదు.భిన్నభిన్నంగా ఉంది.

శ్లో॥కృష్ణోభోగి శుకస్త్యాగీ రాజానౌ జనకరాఘవౌ।

వసిష్ఠః కర్మకర్తా చ ఏతే జ్ఞానినః సమాః॥

శ్లో॥దిగంబరో వాపి చ సాంబరో వా,త్వగంబరో వాపి చిదంబరస్థః।

ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా,పిశాచవద్వాపి చరన్త్యవన్యామ్॥(వి.చూ.541)

శ్లో॥కేఽపి వర్ణాశ్రమాచారనిష్ఠాపరా,ముగ్ధబాలప్రమత్తోపమాశ్చాపరే।

రాగినో భోగినో యోగినశ్చేతరే జ్ఞానినాం లక్ష్యతే నైకరూపా స్థితిః॥(స్వారాజ్యసిద్ధిః 3-22)

బ్రహ్మవేత్తలందరికి ఒకేతీరు ప్రారబ్ధము సంభవించదు.వారివారి కర్మానుసారము వారివారి ప్రారబ్ధము వేర్వేఱుతీరుగనుందురు.సాధనాభ్యాస పరిపాకముచేగూడ వారి అవస్థలు(భూమికలు)విచిత్రముగానుండును.వసిష్ఠాదులు కొందరు వర్ణాశ్రమతత్పరులైయుందురు.జడభరతాదులు కొందరు మూఢుల(అజ్ఞుల)వలెను,బాలురవలెను,ఉన్మత్తులవలెను,పిశాచములవలెను,కొందరు దిగంబరులై(నగ్నముగాను),మరికొందరు సాంబరులై(వస్త్రములు ధరించి) సంచరించుచుందురు.సౌభరివంటివారు రాగి(విషయీ)పురుషులవలె కన్పట్టుచుందురు.కృష్ణుడు మొదలగువారు భోగివలెగాన్పింతురు.శ్రీరామచంద్రుడు,జనకుడు మొదలగువారు చక్రవర్తులుగనుండి రాచకార్యములలో నిమగ్నులై ఉందురు.జైగీషవ్యాదులు ఎల్లవేళల ధ్యాననిష్ఠాతత్పరులై బ్రహ్మనందమున తేలియాడుచుందురు.శుకుడు మొదలగువారు పరిపూర్ణవిరక్తులై సంచరింతురు.ఇట్లు విద్వాంసుల విచిత్రవ్యవహారమునకు(నడతలకు) వారి ప్రారబ్ధము మరియు సాధనాభ్యాస పరిపాకవైచిత్ర్యమే హేతువగును.

మహోపనిషత్తునందు ఐదవ అధ్యాయములో సప్తజ్ఞాన భూమికలు చెప్పబడి

నవి.వరాహోపనిషత్ 4 వ అధ్యాయము,యోగవాసిష్ఠము ఉత్పత్తిప్రకరణము 118 వ సర్గము మరియు శ్రీఆద్యజగద్గురు శంకరాచార్యులవారిచే రచింపబడిన సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహములో 939(హింది) వ శ్లోకమునుండి సప్క్మజ్ఞానభూమికలు విస్తారంగా వర్ణించబడినవి.

శ్లో॥జ్ఞానభూమిః శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా।
విచారణా ద్వితీయా తు తృతీయా తనుమానసీ॥
శ్లో॥సత్త్వాపత్తిశ్చతుర్థీ స్యాత్తతోఽసంసత్తినామికా।
పదార్థాభావనా షష్ఠీ సప్తమీ తుర్యగా స్మృతా॥
శ్లో॥ఆసమన్తః స్థితా ముక్తిర్యస్యాం భూయో న శోచతి।
ఏతాసాం భూమికానాం త్వమిదం నిర్వచనం శృణు॥
శ్లో॥స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్షేఽహం శాస్త్రసజ్జనైః।
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః॥
శ్లో॥శాస్త్రసజ్జనసమ్పర్క వైరాగ్యాభ్యాసపూర్వకమ్।
సదాచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా॥
శ్లో॥విచారణాశుభేచ్ఛాభ్యామిన్ద్రియార్థేషు రక్తతా।
యత్ర సా తనుతామేతి ప్రోచ్యతే తనుమానసీ॥
శ్లో॥భూమికాత్రితయాభ్యాసాచ్చిత్తే తు విరతేర్వశాత్।
సత్త్వాత్మని స్థితే శుద్ధే సత్త్వాపత్తిరుదాహృతా॥
శ్లో॥దశాచతుష్టయాభ్యాసాదసంసర్గకలా తు యా।
రూఢసత్త్వచమత్కారాప్రోక్తాసంసత్తినామికా।
శ్లో॥భూమికా పఞ్చకాభ్యాసాత్స్వాత్మారామతయా దృఢమ్।
ఆభ్యాన్తరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్॥
శ్లో॥పరప్రయుక్తేన చిరం ప్రయత్నే నావబోధనమ్।
పదార్థాభావనా నామ షష్ఠీ భవతి భూమికా॥
శ్లో॥భూమిషట్కచిరాభ్యాసాద్భేదస్యానుపలమ్భనాత్।
యత్స్వభావైకనిష్ఠత్వం సా జ్ఞేయా తుర్యగా గతిః॥

శ్లో॥ఏషా హి జీవన్ముక్తేషు తుర్యావస్థేతి విద్యతే।
విదేహముక్తి విషయం తుర్యాతీతమతః పరమ్॥
శ్లో॥యే నిదాఘ మహభాగాః సాప్తమీం భూమిమాశ్రితాః।
ఆత్మారామా మహాత్మానస్తే మహాపదమాగతాః॥

మొదటి జ్ఞానభూమిక శుభేచ్ఛ అని చెప్పబడినది.రెండవది సువిచారణము, మూడవది తనుమానసము,నాల్గవది సత్త్వాపత్తి,ఐదవది అసంసత్తి,ఆరవది పదార్థా భావనము మరియు ఏడవది తుర్యగము—అని జ్ఞానభూమికలు ఏడు పేర్కొనబడి నవి.పురుషుడు మళ్ళీ శోకాకులుడు కానట్టి ముక్తి,వీటిలో నిహితమైయున్నది.ఓ పాపరహితుడా!ఇప్పుడు ఒక్కొక్క భూమికయొక్క లక్షణమును చెప్పెదను వినుము.

1.నేను ఎన్నో జన్మల సుకృతవశముచే పొందిన అత్యుత్తమమైన,అమూల్యమైన మానవదేహమును పశుపక్ష్యాదులవలె కేవలము క్షణికవైషయికసుఖములకై వ్యర్థ పుచ్చుచుంటిని గదా.అహో!ఏమి నా దౌర్భాగ్యము?ఇంకను మూఢునివలె ఉండనే ల?ఇప్పటికైనను వేదాన్తశాస్త్రమును మరియు శ్రోత్రియబ్రహ్మనిష్ఠగురుదేవులను ఆ శ్రయించి,వారి యనుగ్రహమునకుపాత్రుడనై నా యథార్థస్వరూపమును తెలిసికొని నిఃశ్రేయసమగు మోక్షమును పొందెదను—అనునిట్టి వైరాగ్యపూర్వక సత్సంకల్పమే ***శుభేచ్ఛ*** యనిబుధజనులు నుడువెదరు.నిష్కర్షయేమనగా!నిషిద్ధకర్మలను సర్వదా సర్వథా త్యజించి,విధివిహిత యజ్ఞదానాది కర్మల నిష్కామానుష్ఠానముచే కలిగిన శుద్ధాన్తఃకరణమున ఉదయించిన వైరాగ్యోపలక్షిత సాధనచతుష్టయసంపత్తిచే ముక్తి పర్యంతము నిలిచి ఉండునటువంటి,శ్రవణాదులందలి ప్రవృత్తికి ఫలరూపమగు ఆత్మ సాక్షాత్కారముయొక్క ఉత్కట ఇచ్ఛయే ***శుభేచ్ఛ*** యను మొదటి భూమికయగును.

2.సద్గురువుచెంత వేదాన్తశాస్త్రమునభ్యసించుచు,వారి సహవాసములోనుండి వారికి యథోచిత పరిచర్యలుచేస్తూ,దోషదృష్టితో వైరాగ్యమును వృద్ధిపరచుకొనుచూ, మహాత్ముల అడుగుజాడలననుసరించి ప్రవర్తించుటయే సువిచారణము అను రెండ వ భూమికయగును.తాత్పర్యమేమనగా!గురుశుశ్రూష,భిక్షాన్నభోజనము,శౌచాది యతిధర్మముల సహితముగా శ్రవణమననములే యిచ్చట సదాచారమనబడును. అన్య సదాచారము చిత్తశుద్ధికిమాత్రము తోడ్పడును.అది మొదటనే సిద్ధించియున్నది.

3.పూర్వోక్త భూమికలచే సాధనచతుష్టయసంపత్తిపూర్వకముగా చేయబడిన శ్రవణ మననయుక్త నిదిధ్యాసనముచే శబ్దాదివిషయములపట్ల (అసక్తి)విరక్తిగలిగి,మనస్సులోని వాసనలన్నియు క్షీణించుటవలన మనస్సు(సవికల్పసమాధిరూప)సూక్ష్మతను పొందును.*(తను సూక్ష్మతమం మానసం యస్యామితి తనుమానసమ్)*ఈ భూమికలో మనస్సు అత్యంత సూక్ష్మతనొందుటవలన దీనిని తనుమానసము అందురు.

యోగశాస్త్రములో ఇట్లు చెప్పబడినది—

**శ్లో॥శ్రోత్రాదికరణైర్యావచ్ఛబ్దాదివిషయగ్రహః।**

**తావద్ధ్యానమితి ప్రోక్తం సమాధిః స్యాత్తతః పరః॥**

అనగా,ఎంతవరకు శ్రోత్రాది యింద్రియములద్వారా శబ్దాదివిషయములు గ్రహింపబడుచుండునో,అంతవరకు ధ్యానమనబడును.శబ్దాది విషయములనుండి శ్రోత్రాది యింద్రియములయొక్క ఉపరతి సమాధి యగును.

4.ఉపరోక్త భూమికాత్రితయ అభ్యాసముచే మనస్సు శబ్దాది బాహ్యవిషయములనుండి అత్యంత విరక్తినొంది,అట్టి విరతిస్థైర్యముచే,మాయ-తత్కార్యమగు దేహత్రయము,అవస్థాత్రయము మరియు పంచకోశములను శోధించగా,వాటన్నిటికి అధిష్ఠానమై సన్మాత్రరూపముచే నవశిష్ట ఆత్మయందు—జలమిశ్రిత క్షీరమును మరిగించగా మరిగించగా కేవలము దుగ్ధాంశముమాత్రము శేషించునట్లు—జ్ఞాత,జ్ఞానము,జ్ఞేయము(త్రిపుటి)వినాశమగుటచే సాక్షారపర్యంతము యే నిర్వికల్పసమాధిస్థితి యుండునో, దానిని సత్త్వాపత్తి యందురు.*(మనసః పరమాత్మసత్వాత్మనైవాపన్నత్వాదిత్యర్థః)* మనస్సు పరమాత్మసత్వరూపముచే స్థిరపడినందున సత్త్వాపత్తి యనబడును.ఈ భూమికయందుండు వివేకి ***బ్రహ్మవిత్*** *అనబడును.*

5.పై నాల్గు భూమికలను లెస్సగ నభ్యసించుటచే బాహ్యాంభంతర విషయములచే గాని,తద్గతసంస్కారములచేగాని స్పృశింపబడక,అసంగరూపమగు సమాధిపరిపాకముచే వృద్ధినొందిన నిత్య అపరోక్షమును,నిరతిశయానందమునూ అగు బ్రహ్మాత్మభావసాక్షారరూప చమత్కారము దేనియందు ఉత్పన్నమగునో, అట్టి భూమిక అసంసత్తి యను ఐదవ భూమికయగును.

యద్యపి,ఉత్తమాధికారులకు ద్వితీయభూమికలోగూడ శబ్దజన్య అపరోక్షజ్ఞానము చే సాక్షాత్కారముగలుగుట ప్రసిద్ధమున్నది.తథాపి మందమధ్యమాధికారులకుగూ డ చతుర్థభూమికాంతమున గల్గు సాక్షాత్కారమునకంటె పంచమభూమికలో ద్వైత సంస్కార అత్యంత ఉచ్ఛేదోత్కర్షాతిశయముయొక్క దృఢతర ఉపపత్తిని సూచించుట కై చమత్కారమునకు ***"రూఢ"***అని విశేషణమివ్వనైనది.అందుకే చతుర్థబూమికను దాటి పంచమభూమికలో ప్రవేశించిన ఒకానొక జ్ఞానిపురుషుడు ***బ్రహ్మవిద్వరుడు*** అనబడును.*(న విద్యతే అవిద్యా తత్కార్య సంసక్తిః సర్వధా యస్యామిత్యసంసక్తిః)*ఈ భూమిక లో అవిద్యా తత్కార్యమగు దేహాదులతో ఏమాత్రముగూడ సంసర్గము లేకుండును గాన దీనిని అసంసత్తి అని అంటారు.

ఈ భూమికయొక్కఅత్యంత పరిపాకముచే ఉత్తర భూమికాద్వయము ప్రాప్తిం చునను అభిప్రాయముచే చెప్తున్నాడు-"భూమికా పంచకాభ్యాసాత్"—అంటూ,

ఈ ఐదు భూమికలను బాగుగా నభ్యసించుటవలన అత్యంత ఉపరతిగల్గి ఆత్మా రామరూప దృఢస్థితి ప్రాప్తమగును.దానిచే భాహ్యాభ్యంతర పదార్థములెవ్వియును భాసింపవు(అభావమగును).దీనికే ఆరవ భూమికయగు పదార్థాభావనము అందురు.

శంక:—పదార్థములేమియు గోచరింపనిచో దేహయాత్ర ఎట్లు సంపన్నమగును?

సమా:—పరప్రయుక్తేతి—చాలా కాలమువరకు పరప్రయత్నముచే ప్రబోధితుడై ఆయాపదార్థములనుగూర్చి యించుక భానముగల్గి యుండును.ఏలయన?దీని యందు జ్ఞానికి పదార్థములనుగూర్చిన రాగయుక్తమగు భావనయుండనేరదు.ఈ భూమికయందు ప్రతిష్ఠితుడైన జ్ఞాని ***బ్రహ్మవిద్వరీయుడు*** అనబడును.

ఈ యారవ భూమికనే చిరకాలమభ్యసించుటచే జ్ఞానిమహాత్ముడు పరప్రయ త్నముచేగూడ ఉత్థానస్థితికి రాజాలడు.కావున,అతడు భేదభావమంతయు సమసి పోయి,కేవలము స్వస్వరూపమునందు స్థితిని బడయుటచే యేడవదగు ***తుర్యగము*** అను భూమికను అధిరోహించును.

**"నాన్తఃప్రజ్ఞం నబహిష్ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం నప్రజ్ఞానఘనం నప్రజ్ఞం నాప్రజ్ఞం।....**

**........ప్రపఞ్చోపశమం శాన్తం శివమద్వైతం చతుర్థం మన్యన్తే స ఆత్మా"।**(మాం.7; నృసింహోత్తరతాపని.1)ఇట్లు జాగ్రదాద్యవస్థాత్రయమునుండి విముక్తుడై కేవలము,శి

వము,అద్వైతమునగు తురీయస్థితియందు నిలకడజెంది అనుభవసిద్ధ అఖండబ్ర హ్మాత్మస్థితియందుండు జ్ఞానిపురుషుడు ***విద్వద్వరిష్ఠుడు*** అనబడును.

ఉక్త బ్రహ్మవిద్వరిష్ఠుడు—బ్రహ్మవిత్,బ్రహ్మవిద్వర్,బ్రహ్మవిద్వరీయాన్ అనునీమూ డింటిని అతిక్రమించి చతుర్థఅవస్థను చేరుకున్నందున అది ***తుర్యగము*** అని చెప్ప బడుచున్నది.*కిఞ్చిత్కుర్వన్తి షష్ఠభూమికాయాం న వా కుర్వన్తి సప్తమభూమికాయామిత్యతి శయః।*షష్ఠభూమికలో దేహయాత్రకోసము కించిత్కార్యము జరుగును.కాని,సప్తమ భూమికలో యేమియును జరుగదు.రెంటికి ఇంత విశేషము గలదు.*ఇహ=అస్మిన్నేవ దేహే విద్యతే।అతోఽస్యా అవస్థాయాః పరం విదేహముక్తివిషయస్తురీయాతీతం బ్రహ్మైవేతి భూమి-కాం న గణ్యత ఇత్యర్థః॥*ఈ తుర్యగ భూమిక ఈ దేహమునందే ప్రాప్తించును.విదేహము క్తికి సంబంధించిన తరీయాతీత స్థితి యేది గలదో అది బ్రహ్మమే గావున దానిని భూమికలలో లెక్కిచలేదు.

ఓరామా!ఈ తురీయస్థితి జీవన్ముక్తునికే లభించును.విదేహముక్తికి సంబంధిం చిన తురీయాతీతస్థితి దీనికి పరమై యొప్పును.ఏ మహాత్ములు యీ యేడవ భూ మికను అధిరోహించెదరో,వారు బ్రహ్మరూపమగు మహత్పదవిని ప్రాప్తినొందిరనియే యెఱుంగుము.(శ్రీయోగవాసిష్ఠము—ప్రకాశాఖ్య సంస్కృత టీకనుండి).

1—3.పైన వివరించబడిన సప్తభూమికలలో ప్రథమ,ద్వితీయ,తృతీయభూమికలు తత్త్వజ్ఞానమునకు సాధనములు.

4.చతుర్థభూమిక తత్త్వజ్ఞానరూపమున్నందున,అది జీన్ముక్తికి మరియు విదేహ ముక్తికి హేతువగును.ఈ నాల్గవ భూమికారూప జ్ఞానమునకు అధికారులు యిరుతె ఱంగులు.I.జ్ఞానముకలుగుటకు పూర్వము సగుణసాక్షాత్కారపర్యంతము సంపూర్ణ ముగా ఉపాసనలు చేసినవాడు కృతోపాసకుడనబడును.II.జ్ఞానమునకు పూర్వము సంపూర్ణముగా ఉపాసనలు చేసినవాడు కాదు—అకృతోపాసకుడు.

వీరిలో కృతోపాసకుడు వైరాగ్యాది సకలసాధనములచే సంపన్నుడై ఉండును.జ్ఞాన ము కలిగినపిమ్మట అల్పాభ్యాసముచేతనే పంచమాదిభూమికలలో తొందరగా ఆరూఢుడు కాగలడు.

అకృతోపాసకుడైనచో—ఇతనిలో యేవో ఒకటి రెండు సాధనలు స్పష్టంగా గోచరిస్తాయి.మిగతావి గోప్యంగా ఉంటాయి.తీవ్రమైన పట్టుదలగల బుద్ధిమంతుడగుచో చతుర్ధభూమికను పొందగలడు.కాని,బహుకాల అభ్యాసము చేసిననేగాని కదాచిత్ ఒకానొకడు పంచమాదిభూమికలను చేరుకోగలడు.శీఘ్రముగా కాదు.

5—7.పంచమ,షష్ఠ,సప్తమభూమికలు జీవన్ముక్తవిలక్షణానందమునకు సాధనములగును.ఇవ్విధమున సప్తజ్ఞానభూమికలు సవిస్తరముగ వర్ణించబడినవి.



ॐ

**—:గ్రన్థరచనా ప్రయోజనము:—**

పైన వివరించబడినరీతిగా అజ్ఞాన తత్కార్యరూప దేహాదిక బంధముయొక్క అత్యంత నివృత్తి మరియు పరమానంద బ్రహ్మప్రాప్తిరూప మోక్షము(పరమ పురుషార్థము)ను పొంది,క్రమేణ ఉత్తరోత్తర ఉత్కృష్టభూమికలనధిరోహించుటకు పూర్వము అల్ప(నికృష్ట)భూమికయొక్క అత్యంతావశ్యకత ఉంది.మొదటిమెట్టు ఎక్కనిదే తరువాతి పైమెట్లు ఎక్కలేరుగదా!"భూమిక" శబ్దమునకు అర్థము క్షుద్రభూమి అగును."భూమి" శబ్దమునకు క్షేత్రము అని అర్థము.ప్రశస్తమైన ఉన్నతభూమిని అధిరోహించుటకు అల్పభూమిస్వరూపసోపానముయొక్క ఆవశ్యకత ఎంతైనా ఉంది. సత్త్వాపత్తి మొదలుకొని తుర్యగ పర్యంతము ఉత్తరోత్తర ఉత్కృష్టభూమికలను క్రమంగా అధిరోహించవలెనన్న పూర్వపు శుభేచ్ఛాది భూమికాత్రితయమునధిరోహించుట అనివార్యము.క్లిష్టమైన,గంభీరమైన,సూక్ష్మాతిసూక్ష్మమైన పరబ్రహ్మతత్త్వానుభూతిని బడసి లోకోత్తరమగు బ్రాహ్మీస్థితిలో ఉండగలుగాలి—అంటే ప్రథమమున గురుసాన్నిధ్యములో తత్త్వమస్యాది వేదాన్తవాక్యశ్రవణ మనన నిదిధ్యాసనరూప విచారమావశ్యకము.వేదాన్తవిచారము చేయుటకు సాధనచతుష్టయసంపత్తి నిహితమైయున్న శుభేచ్ఛ,సువిచారణ,తనుమానసము అను భూమికాత్రితయసంపన్నుడై యుండవలెను.

ఒకానొక కృషీవలుడు విస్తృతక్షేత్రములో పుష్కలముగా శస్యమును(ధాన్యమును) పండించదలచినచో,ప్రథమమున అల్పమైన కొంతభూమిలో నారు పోసి,దానిని పరిరక్షిస్తూ—అదేసమయంలో తాను చేనువేయదలచిన విస్తృతభూమినిగూడ బాగుగా దున్ని చదునుచేసి ఉంచుతాడు.సరియగు సమయము చూసి అల్పక్షేత్రములోని నారును తీసి విస్తృతభూమిలో నాటుతాడు.నాలుగైదు మాసములవరకు ఎరువులు వేస్తూ,నీటిని విడిచి,కలుపుతీసి,ఆ పంటచేనును పశుపక్ష్యాదులనుండి కాపాడుతూ,తుదకు పంటను తీసి అనుభవిస్తాడు.

ఎట్లు విస్తృతభూమినుండి విపులపంటను(ఫలమును)పొంది అనుభవించుటకై అల్పక్షేత్రముయొక్క ఆవశ్యకతగలదో,అట్లే చతుర్థ,పంచమాది భూమికలయందా

రూఢుడై బ్రహ్మానందరసామృతపానము(మోక్షరూపఫలము)ను అనుభవిచవలెన న్న,వివేకము వైరాగ్యము షట్సంపత్తి మరియు ముముక్షుత్వము—అను సాధనచతుష్టయ యుక్తమైన శుభేచ్ఛాది అల్పభూమికలయొక్క ఆవశ్యకత ఉన్నది.లేక,

"భూమిక"శబ్దమునకు భూమి లేదా క్షేత్రము(భూమిరేవ భూమిక) అని అర్థము. అంకురిత బీజము ఏపుగా పెరిగి(పరిణతిజెంది)ఫలోపకారియగుటకు యోగ్యస్థానము—భూమిక.శస్యము(పంట)ను ఉత్పన్నముచేయుటకు భూమినిచక్కగా సంస్కరింపవలసి ఉండును.అనగా,కంటకములు,కలుపుమొక్కలు తీసివేయుట,ఎత్తుపల్లములను సమముచేయుట,బాగుగా దున్ని చదునుచేయుట—ఇత్యాదిక్రియలు చేయవలసియుండును.అట్లే,విచారబహుళ,దురూహ,దుర్బోధమగు గ్రన్థమునందు ఆసమాప్తిపర్యంతము అధ్యయన ప్రవృత్తికి మరియు అవగతి(అర్థముచేసుకునే)శక్తి ఉత్పాదనమునకు భూమికయొక్క ఆవశ్యకత ఉంది.

నిష్కర్షయేమనగా,**"అధికారీ తు.......సాధనచతుష్టయసంపన్నః ప్రమాతా"**(వేదాన్తసారము)మరియు,

**శ్లో॥అధికారిణమాశాస్తే ఫలసిద్ధిర్విశేషతః।**
**ఉపాయా దేశకాలాద్యాః సన్త్యస్యాం సహకారిణః॥**

**శ్లో॥అతో విచారః కర్తవ్యః జిజ్ఞాసోరాత్మవస్తునః।**
**సమాసాద్య దయాసింధుం గురుం బ్రహ్మవిదుత్తమమ్॥**

**శ్లో॥మేధావీ పురుషోవిద్వాస్ ఊహాపోహవిచక్షణః।**
**అధికార్యాత్మవిద్యాయాం ఉక్తలక్షణలక్షితః॥**

**శ్లో॥వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః।**
**ముముక్షోరేవహి బ్రహ్మజిజ్ఞాసా—యోగ్యతా మతా॥**

**శ్లో॥సాధనాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః।**
**యేషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిద్ధ్యతి॥**

**శ్లో॥ఆదౌ నిత్యానిత్యవస్తువివేకః పరిగణ్యతే।**
**ఇహాముత్రఫలభోగవిరాగస్తదనన్తరమ్॥**
**శమాదిషట్కసంపత్తిః ముముక్షుత్వమితి స్ఫుటమ్॥**(వి.చూ.14 నుండి 19)

ఇత్యాది అభియుక్తోక్తుల ప్రకారము మరియు **“ఆత్మా వాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యః నిదిధ్యాసితవ్యః”**(బృ.2-4-5;4-5-6);**“తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిశన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన”**(బృ.4-4-22)**“శాన్తో దాన్తః ఉపరతిస్తితిక్షుః సమాహితో(శ్రద్ధావిత్తో)భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యేత్”**(బృ.4-4-23)**కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోకః** (బృ.4-4-22)ఇత్యాద్యనేక శ్రుతివచనముల అనుసారము వివేకాదిసాధనచతుష్టయ సంపన్నుడే వేదాన్తవిచారమునకు అధికారియగును.శ్రవణాది విచారముచే బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము పొడమును.జ్ఞానముచే అజ్ఞాననివృత్తిద్వారా మోక్షము సిద్ధించును.కావున,వేదాన్తతత్త్వజిజ్ఞాసువునకు ప్రప్రథమమున సాధనచతుష్టయసంపత్తి గలిగి ఉండుట అత్యంతావశ్యకము.అనివార్యముగూడ.దీనికే ప్రథమభూమికారూప ***“శుభేచ్ఛ”***అంటారు.అట్లే శ్రీమద్భగవద్గీతలో చెప్పబడినట్లు అమానిత్వాది,అద్వేష్టృత్వాది,అభయత్వాది సద్గుణములు గలిగియుండి **“స గురుమేవాభిగచ్ఛేత్ శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్”**(ముం.1-2-12);**“శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్”**(గీత.2-7) అను విధ్యుక్త ప్రకారముగా శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడునూ అగు శ్రీగురుదేవులను శరణువెళ్ళి తత్త్వమస్యాదిమహావాక్యములను శ్రవణమనన నిదిధ్యాసనములను చేయగాచేయగా **“దృశ్యతేత్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః”**(కఠ.1-3-12)అను శ్రుత్యుక్త ప్రకారముగా అత్యంత బుద్ధి సూక్ష్మముకాగా—సువిచారణ,తనుమానసము అను భూమికలను దాటి చతుర్థభూమికయగు సత్త్వాపత్తిని చేరుకొని ముక్తుడగును.ఆపైన సాధనాభ్యాసపరిపాకముచే పంచమాది భూమికలనధిరోహించి జీవన్ముక్తవిలక్షణానందముననుభవించును.

అందువల్ల,ఈ గ్రన్థములో అవాంతరవిషయములు ప్రసంగానుసారము అనేకము చెప్పబడిననూ ముఖ్యముగా 1.***“అధికారి”***అనుబంధము విశేషముగా,విస్తారముగా ప్రతిపాదించబడినది.ఆనుషంగిక ఇతర 2.***సంబంధము,3.విషయము మరియు*** 4.***ప్రయోజనము*** అను అనుబంధములనుగూడ సంక్షేపముగా వివరించనైనది.

**శ్లో॥గురవో బహవస్సన్తి శిష్యవిత్తాపహారకాః।**
**దుర్లభోఽయం గురుర్దేవి శిష్య దుఃఖాపహారకః॥**(కులార్ణవతంత్రము 3-108)

అని చెప్పబడిట్లు ఈ వర్తమానకాలంలో శ్రోత్రియులు బ్రహ్మనిష్ఠులునగు గురువు

లు చాలా విరళమైపోయారు.ఐనను అక్కడక్కడ సద్గురువులు ఉన్నారు.ఆత్మతత్త్వోపదేశాలు చేస్తూఉన్నారుగూడ.కాని,వివేకాది సాధనచతుష్టయసంపన్నులగు అధికారి ముముక్షువులు అత్యంత దుర్లభమైపోయారు.బుభుక్షువులే ఎక్కువైపోయారు.పాశ్చాత్య సంస్కృతి ప్రబలిపోయింది.ప్రాచీన భారతీయ ఆర్యసంస్కృతి అడుగంటిపోయింది.సంస్కృతభాష పూర్తిగాసన్నగిల్లిపోయింది.వైదికసంప్రదాయమును రక్షించే నాథుడులేక అనాథ అయిపోయింది.ఋషిసంప్రదాయము మచ్చుకుగూడ లేదు. ప్రాంతీయభాషలుగూడ మరుగైపోతున్నాయి.కేవలము భుక్తికోసమని లౌకికవిద్యలను మాత్రము పోషిస్తున్నారు.

ఈనాడు ప్రాపంచిక విషయాలు ప్రబలి వాటియందే మునకలు వేస్తున్న జనంలో నూటికో,కోటికో యేఒక్కరో,ఇద్దరో బ్రహ్మవిద్యను అభ్యసించుటకు ప్రవృత్తులైనను,ఉన్నతమగు లౌకికవిద్యను అభ్యసించామన్న ధీమాతో,గురువులను ఆశ్రయించి వారి శుశ్రూషలు చేస్తుంటే తోటివారిముందు మాకు అవమానమౌతుందను అహంకారముతో,వేదాన్తగ్రన్థములను స్వతంత్రముగా చదివి మాకు అంతా తెలిసింది అనుకొని, వేదాన్తతాత్పర్యమును యథాతథముగానెఱుగజాలక విపరీతజ్ఞానమును పొంది సంసారకూపమున కూలుచున్నారు.వర్తమానకాలంలో కొందరు దూరదర్శనులలో ప్రవచనాలు విని కృతార్థులమని తలంచుచున్నారు.కొంతమంది సాధకులకు అధికారి యెవరో,వివేకాది సాధనలేమిటో,గురుశుశ్రూష ఏమిటో,ఆర్షసంప్రదాయమంటే ఏమిటో,మహాత్ములసహవాసంలో ఎలా వ్యవహరించాలో తెలియుటలేదు.కాని,వేదాన్త గ్రన్థాలను మాత్రము స్వతంత్రముగా తిరుగవేస్తున్నారు.

కొంతమంది సాధకులు వారివారి గురువులచెంత శ్రీశంకరాచార్యులవారి గ్రన్థాలను అధ్యయనముచేసి సాధనములగూర్చి తెలిసిగూడ ఆచరించుటలేదు.కనుక,ఈ విషయాలనన్నిటిని దృష్టియందిడుకొని ఏకొద్దిమంది సాధకులకైనా ఉపయోగపడుతుందను అభిప్రాయముతో ఈగ్రన్థమున సాధనచతుష్టయము గూర్చి విస్తారంగా వివరించనైనది.

శంక:—శ్రీవివేకచూడామణి,అపరోక్షానుభూతి,సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము మున్నగు గ్రన్థములలో శ్రీఆద్యజగద్గురు శంకరాచార్యులవారు వివేకాది సాధనముల

నుగూర్చిచెప్పారు.వేదాన్తసారములో శ్రీసదానందమునీంద్రులవారు చెప్పారు.ఇంకా భాషాగ్రన్థాలైన శ్రీవిచారసాగరము,వేదాన్తబాలబోధము ఇత్యాది గ్రన్థములలో సాధనచతుష్టయముగూర్చి చెప్పబడినది.అలాంటప్పుడు మీ గ్రన్థములో విశేషమేమిటి?ఒకవేళ వారు చెప్పిందే మీరు చెబితే పిష్టపేషణమే అవుతుందిగదా!

సమా:—అవును.మహాత్ములు వివేకాదిసాధనములను వారివారి మూలగ్రన్థములలో చెప్పియున్నారు.వారిని అధిగమించి అధికంగా చెప్పే అధికారముగాని,సామర్థ్యముగాని వారి కింకరులము,అల్పమతులమైన మనకెక్కడిది.అయినాగూడ ఆ-యా మూలగ్రన్థములలో చెప్పబడిన విషయాలను టీకాకారులు మరికొన్నియుక్తులు ప్రమాణములిచ్చి మరింత విస్తరించి చెప్పియున్నారు.అట్టి వ్యాఖ్యానాలను ఆధారంగాజేసికొని,మూలగ్రన్థకర్తలకు మరియు టీకాకారులకు అవిరుద్ధముగా వారు చెప్పిన విషయాలకు సంబంధించిన అనుకూల ప్రమాణములు యుక్తులు దాదాపు సకల వేదాన్తగ్రన్థాలలోఅన్యత్రాన్యత్ర ఏవైతే చెప్పబడినవో,వాటినిన్నింటిని ఏకత్ర సంగ్రహించనైనది.అనుబంధచతుష్టయ విషయంలో ఈ ఒక్క గ్రన్థమును అవలోకించినచో అన్యగ్రన్థములను చూడపని ఉండదు.ఎందుకంటే,సకల గ్రన్థకర్తలయొక్క అభిప్రాయమును ఇచ్చట క్రోడీకరించనైనది.సాధనాల విషయంలో కేవల వేదాన్తగ్రన్థములేకాక వేదాన్తేతర దర్శనగ్రన్థాలనుగూడ పరిశోధించి సాధకులకుపయుక్త విషయాలను సంగ్రహించనైనది.ఒక్కొక్క విషయము కూలంకశముగా అవగతిపర్యంతము చర్చించబడినందున ముముక్షువులకు,వక్తలకు,వ్యాఖ్యానకర్తలకు మరియు వేదాన్త పరీక్షలలో పాల్గొను విద్యార్థులకు ఈ గ్రన్థము ఒక ***నిఘంటువు*** వలె ఉపయోగపడుతుంది. ముఖ్యమైనవిషయములను అంకములతో సూచిస్తూ శీర్షికలలో తెలిపి,విషయసూచికలోగూడ సూచించనైనది.అవాంతరవిషయములనుగూడ విషయసూచికలో చూపనైనది.

***"స గురుమేవాభిగచ్ఛేత్" "శాస్త్రజ్ఞోఽపి స్వాతంత్ర్యేణ బ్రహ్మాన్వేషణం న కుర్యాత్"*** (ముం.ఉప.భాష్యమ్ 1-2-12)అని శ్రుతి మరియు ఆచార్యులు చెప్పినట్లు ముముక్షువులు,సాధకులు ఈ గ్రన్థమును స్వతంత్రముగా చదువక,గురువులద్వారా అధ్యయనము చేసి తరించగలరని మనవి. *ఇతి శమ్.*

**—:ఒక్కమాట:—**

పవిత్ర భాగీరథి తీరములో మా శ్రీగురుదేవులగు శ్రీశాన్తిధర్మానన్ద సరస్వతీ స్వాములవారి సన్నిధానములో బృహత్ ప్రస్థానమును అధ్యయనముచేయు కాలములో ***"శ్రీకాళహస్తి"***వాస్తవ్యులు(ప్రస్తుతము మైసూరులోఉంటున్నారు)***"గజేంద్ర"*** (ఇంటి పేరు—పేట)అను ఒక భక్తుడు దూరశ్రవణముద్వారా మాతో మాట్లాడుతూ—స్వామీజీ! మీరు ఇంతకుపూర్వము కర్మ,ఉపాసనమును(భక్తిని)ఆధారంగా చేసికొని ***"శ్రీభ-క్త తుకారాం అభంగవాణి"***అను సద్గ్రన్థమును(***"శ్రీతుకారాం గాథ"*** లోనుండి కొన్ని(108) అభంగములకు వ్యాఖ్యానమును) రచించారు.ఆ గ్రన్థములో—

**శ్లో॥స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్।**

**సాధనం చ భవేత్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్॥**(అపరోక్షానుభూతిః)

**శ్లో॥ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా।**

**మహద్భయపరిత్రాణాద్విప్రాణాముపజాయతే॥**(అవధూతగీత)

అని చెప్పబడినరీతిగా వారివారి స్వస్వవర్ణాశ్రమములకు విధానముచేయబడిన కర్మలను ఫలాభిసంధిరహితముగా(నిష్కామబుద్ధితో—ఈశ్వరార్పణబుద్ధితో)ఆచరిస్తూ,అనన్యభక్తితో ఈశ్వరుని ఆరాధించినచో,ఈశ్వరుని అనుగ్రహముచే సకల పాపములు తొలగింపబడి,చిత్తైకాగ్రతద్వారా అంతఃకరణము శుద్ధిపడి వివేకాది సాధనచతుష్టయ సంపత్తి ప్రాప్తమై వేదాన్త విచారమునకు అధికారి కాగలుగుతాడు అని చెప్పబడినది.ఇంతవరకు చాలా బాగుంది.

**శ్లో॥కోఽహం కథమిదం జాతం కోవై కర్తాఽస్య విద్యతే।**

**ఉపాదానం కిమస్తీహ విచారః సోఽయమీదృశః॥**(అపరోక్షానుభూతిః 12)

అను ఆచార్యోక్తి ప్రకారము:—

ఆపైన,సాధనచతుష్టయమనగానేమి?ఆ సాధనాలుగల్గిన అధికారి కర్తవ్యమేమి?గురూపసత్తి అనగానేమి?గరూపదేశ ప్రకారమెట్టిది?ఆత్మ అనగా యెవరు?పరమాత్మ అనగా యెవరు?ఈ జగత్తేమిటి?దీనికి కారణమేమి?ఇత్యాది ప్రశ్నలు మా అంతఃకరణములో రేకెత్తుచున్నవి.వాటికి సమాధానము పొందాలను జిజ్ఞాస కలుగు

చున్నది.కావున,మా యీ జిజ్ఞాస శాంతించుటకై మాయందు దయదలచి ఒక వేదాన్త గ్రన్థమును రచించి మమ్ములననుగ్రహించండి—అని ప్రార్థించినారు.

వారి ప్రార్థన మాకు ఈశ్వరుని ప్రేరణగా అనిపించింది.సరే,ఇది ఈశ్వరుని సంకల్పమే కాబోలు,అని తలంచి శీతలవాహినియగు శ్రీగంగామాత చల్లని ఒడిలో కూర్చొని గ్రన్థరచన ప్రారంభించాము.ఎట్లెట్లు గ్రన్థరచన సాగతూ ఉంటె అట్లట్లు,వ్రాసిన విషయమును ఛాయాచిత్రములు తీసి దూరశ్రవణయంత్రముద్వారా శ్రీగజేంద్రగార్కి పంపించేవారము.శ్రీగజేంద్రగారు వాటిని వెంటవెంట ముద్రించి,ఆ దస్తావేజును తిరిగి మాకు పంపించేవారు.మళ్ళీ మేము వాటిని సరిజేసి ఉంచేవారము.ఇట్లు అంచెలంచెలుగా కొన్నాళ్ళు సాగింది.ఆ దస్తావేజులనన్నింటిని పునఃపునః తిరుగవేసి,చక్కగా పరిశీలించి, తప్పులను సరిచేసి గ్రన్థరూపములో తీర్చిదిద్దడమైనది.

అయితే,ఈ గ్రన్థములో మేము స్వబుద్ధితో ఒక్క అక్షరముగూడ నివేశము చేయలేదు.

**శ్లో॥యస్య కస్య తరోః మూలం యేనకేనాపి ఘర్షయేత్।**
**యస్మై కస్మై ప్రదాతవ్యం యద్వా తద్వా భవిష్యతి॥**(సుభాషితము)
**శ్లో॥మృగతృషాంభసి స్నాతః ఖపుష్పకృతశేఖరః।**
**ఏష వంధ్యాసుతో యాతి శశశృంగ ధనుర్ధరః॥**(త్రై.భాష్యమ్ 2-1-1)

అన్నట్లుగాగాక, మేము మా కపోలకల్పన ఏమియు చేయకుండా మహాత్ములు అన్యత్రాన్యత్ర చెప్పిన,సాధకులకుపయుక్తములగు విషయాలనే ఒక క్రమపద్ధతిలో చేర్చి ప్రసంగమునకు భంగముకాకుండా ప్రకరణానుసారముగా కేవలము సంకలనము మాత్రము చేసినాము.

**శ్లో॥అమంత్రో అక్షరం నాస్తి నాస్తి మూలమనౌషధమ్।**
**అయోగ్యో పురుషోనాస్తి యోజకస్తత్ర దుర్లభః॥**(సుభాషితము)

అన్నట్లు,సరియైన సంబంధమును కూర్చి యోజనమాత్రము చేసినాము.అయినాగూడ **భ్రమ,ప్రమాద,విప్రలిప్స,కరణఅపాటవములు** అను బుద్ధిగతదోషాలు అక్కడక్కడ ఏమైనా దొరలి ఉండవచ్చును.విజ్ఞులు వాటిని సరిదిద్దుకొని చదువుకోగలరని మనవి.“**సునిపుణానామపి సూక్ష్మ అపరాధ దర్శనాత్**”(బ్ర.సూ.భాష్యమ్ 4-3-14).

# ఒక్కమాట

**"నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే"।**(గీత.4-38)అను శ్రీమద్భగవద్వచనానుసారము మాకు అత్యంత పవిత్రమగు బ్రహ్మవిద్యను ప్రసాదించిన శ్రీశాన్తిధర్మానన్ద సరస్వతి మరియు అన్యాన్య సద్గురుదేవులందరికి మాయొక్క హృత్పూర్వక ప్రణామములు.

ఈ గ్రన్థనిర్మాణములో ఎంతో ఓపికతో బహుళశ్రమకోర్చుకొని మాకు సహాయపడిన శ్రీగజేంద్రగార్కి మరియు మాకు చేదోడుగా ఉండి చక్కటి సేవలనందించిన బ్రహ్మచారి అజయ్ చైతన్యకు ఈశ్వరునియొక్క కరుణాకటాక్షములు సదా ప్రాప్తించుగాక!

ఓం తత్సత్ ఓం

*శ్రీసద్గురు మహర్షి మలయాళస్వామి చరణరజః కణము*

*స్వామి బ్రహ్మవిద్యానన్ద*



**సమర్పణము**

**ॐ**

**శ్లో॥మూకం కరోతి వాచాలం నిర్బుద్ధిం బుద్ధిమత్తమమ్।**

**యత్కృపా తమహం వన్దే అసఙ్గానన్ద సద్గురుమ్॥**

**శ్లో॥శుష్కవేదాన్త దన్తీశ బృన్దసన్తాప కేసరి।**

**అసఙ్గానన్ద యోగీన్ద్రో గురుర్విజయతే తరామ్॥**

విశాలాన్ధ్ర తెలంగాణములలో అధ్యాత్మిక సాధకులుగాని, బ్రహ్మపథాభిముఖుల గు ముముక్షువులుగాని శ్రీసద్గురు మహర్షి మలయాళస్వాములవారిని యెఱుగని వారుండరు.అనుత్తమ తపోమహిమగల,అనల్పమగు ఆత్మశక్తిగల,అకుంఠితమగు పవిత్రసత్ప్రవర్తనగల,సకలప్రాణికోట్ల శ్రేయోభిలాషియు,అమృతోపములైన అధ్యాత్మిక సందేశములనందించిన శ్రీగురుదేవుల కీర్తిని,దివ్యమైన లీలలను వర్ణించుటకు శ్రీశారదాదేవికే సాధ్యముకాదు. అట్లుండ,అల్పమతినగు నేనెంతటివాడను.

**శ్లో॥అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే,**

**సురతరువరశాఖా లేఖనీ పత్రముర్వీ।**

**లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం,**

**తదపి తవ గుణానామీశ పారం న యాతి॥**

శ్రీసద్గురుదేవులు మా హృదయములో ప్రతిష్ఠితులై,గ్రన్థరచనా శక్తినిచ్చి,బద్ధికి చక్కటి స్ఫూర్తినిచ్చి,మమ్ములను ఒక ఉపకరణముగా చేగొని వారే స్వయముగా ఈ సద్గ్రన్థమును రచించినారు.అట్టి శ్రీసద్గురు మహర్షి మలయాళస్వాములవారియొక్క దివ్యచరణారవిందములకు యీ అల్పమగు సద్గ్రన్థపుష్పమును సమర్పించుకుంటున్నాము.

చరాచర సుఖాభిలాషియగు

శ్రీసద్గురు మహర్షి మలయాళస్వామి దివ్యపాదారవిందార్పణమస్తు.

ॐ శాన్తిః శాన్తిః శాన్తిః

**అనుబన్ధ చతుష్టయము**

**అనబడు**

**అద్వైత వేదాన్త భూమిక**

**విషయసూచిక**

ॐ

శ్రీవ్యాసాశ్రమ

—:గురుపరమ్పరా స్తోత్రము:—

ॐ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం తాపసమ్।
పరాశరఞ్చతత్పుత్రం వ్యాసం వేదాబ్జభాస్కరమ్॥

ॐ విరక్తం శ్రీశుకం దేవం జ్ఞానవైరాగ్యరూపిణమ్।
గౌడపాదం చ గోవిన్దం యోగీన్ద్రం జ్ఞానినాం వరమ్॥

ॐ తచ్ఛిష్యం శఙ్కరాచార్యమద్వైత స్థాపకం గురుమ్।
తచ్ఛిష్యాన్పద్మపాదాదీన్ శ్రౌతతత్త్వార్థబోధకాన్॥

ॐ అసఙ్గానన్దగుర్వాదీనస్మద్గురువరాన్పరాన్।
సంభిన్నాజ్ఞానతమసోవన్దే జ్ఞానప్రదాయినః॥

ॐ శ్రీనారాయణగుర్వాద్యాం శివలిఙ్గార్యమధ్యమామ్।
అసఙ్గానన్దపర్యన్తాం వన్దే గురుపరమ్పరామ్॥

ॐ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

ॐ శాన్తిః శాన్తిః శాన్తిః

ఇతి శ్రీగురుపరమ్పరా స్తోత్రమ్



# అనుబన్ధ చతుష్టయము

## అనబడు

## అద్వైత వేదన్త భూమిక

## 1.అద్వైత శబ్దార్థము

అద్వైతమనగా నేమి?"అద్వైత"శబ్దార్థమును తెలుసుకొందము. "నవిద్యతే ద్వైతం-ద్విధాభావోయత్రతదద్వైతమ్".లేదా"నాస్యద్వితీయం వస్త్వన్తరం విద్యత ఇత్యద్వైతమ్".అనగా-దేనికి సజాతీయ విజాతీయ(రెండవ)వస్త్వంతరము లేదో అది అద్వితీయమని వ్యుత్పత్త్యర్థము.పరమాత్మ ఏకమే;అయినప్పటికిని అనాదికల్పిత మాయాయోగముచే ద్విధాభావమును పొందింది."ద్విధా ఇతం-గతం ద్వీతం,తద్భావో ద్వైతమ్".రెండవదిగా అనగా ప్రపంచాకారముగా అయ్యింది. ఏవిధంగా నిద్రాదోషముచే స్వప్నములోసాక్షియే,కల్పిత స్వాప్నికపదార్థముల ఆకారమును పొందునో,అట్లే పరమాత్మ తనయొక్కమాయనుతీసుకొని నానా నామరూపాత్మక ద్వైతప్రపంచరూపంలో అయ్యి గోచరించుచున్నది.

**"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ"**(ఛాం.ఉ.6-2-3)**"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్"**(తై.ఉ.2-6),**"అనేన జీవేనాఽఽత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"**(ఛాం.ఉ.6-3-2) మొదలగు ఉపనిషత్ప్రమాణములు పరమాత్మయే స్వయముగా స్వమాయాయోగముచే జగద్రూపములో(ద్వైత రూపములో)అయినాడని చెబుతున్నాయి.కాని,"**నతు పరమార్థతః**" సత్యము మాత్రంకాదు.స్వరూపముచే శుద్ధం,ఏకం మరియు అద్వితీయమయ్యే ఉన్నాడు.

**శ్లో॥పరమాత్మాద్వయానన్దపూర్ణః పూర్వం స్వమాయయా।**

**స్వయమేవ జగద్భూత్వా ప్రావిశజ్జీవరూపతః॥**(వే. పం.10-1)

కల్పాదియందు అద్వితీయానందస్వరూపుడైనట్టి,పరిపూర్ణుడైనట్టి పరమాత్మ యే స్వమాయచేత స్వయముగా జగద్రూపముగా అయ్యి, స్వరచితజగత్తులో జీవరూపముచే తానే ప్రవేశించెను.

ఇట్లు అవివేకిపురుషులయొక్క మిథ్యానుభవమును అనువాదముచేసిన పిమ్మట"**అధ్యారోపాపవాద న్యాయము**"చే ఆరోపితప్రపంచమును నిషేధిస్తూ ఉత్తరత్ర అపవాదము చేయబడినది.

**"విచారేణ వినష్టాయాం మాయాయాం శిష్యతే స్వయమ్"**॥(వే.పం.10-3)

విచారజనితజ్ఞానముచే మాయ నశించగా తత్కార్యమగు ద్వైతప్ర పంచము నివర్తిపబడును.ఇక స్వయం అనగా అద్వయానంద పరిపూర్ణ పరబ్రహ్మమే అవశిష్టమై ఉంటుంది. కావున,

**"మాయామాత్రమిదం ద్వైతమద్వైతం పరమార్థతః"**।(మాం.కా.ఆ.17)

రజ్జువునందు భ్రాంతదృష్టిచే కల్పింపబడిన సర్పము ఎట్లు వాస్తవంగా లేదో, అట్లే బ్రహ్మమునందు అవివేకులచే కల్పితమగు ఈప్రతీయమాన ద్వైతప్రపంచము పరమార్థముచే లేనిదేయగును.అద్వైత పరమాత్మయే పరమార్థము (సత్యము). **"త్రిషుకాలేష్వేకరూపేణ అవస్థితః యో వస్తుః స పారమార్థికః".**

అందుకే,శ్రీసురేశ్వరాచార్యులవారు ఉపరోక్తవిషయమును తమ వార్తికములో స్పష్టము చేయుచున్నారు.

**శ్లో॥ద్విధేతం ద్వీతమిత్యాహు స్తద్భావో ద్వైతముచ్యతే।**

**తన్నిషేధేన చాద్వైతం ప్రత్యగ్వస్త్వభిధీయతే ॥**(బృహదారణ్యక వార్తికము 4-3-196)

రెండు ప్రకారములుగా అయిన వస్తువునకు ద్వీతమందురు.ఆ ద్విధాభావమునకే ద్వైతమంటారు"**ద్విధా ఇతం-గతం ద్వీతం(**ద్విప్రకారమ్)".పారమార్థిక నిత్యవస్తువగు అద్వితీయ పరబ్రహ్మమే,జగదీశజీవ భేదముచే చిదచిద్రూపముగా ద్వైధీభావమును పొందినది.కాని,సద్గురుసచ్ఛాస్త్రములనాశ్రయించి సమ్యగ్విచారము చేసినచో,తజ్జనిత చరమసాక్షాత్కారరూప అప్రతిబద్ధదృఢాపరోక్షబ్రహ్మజ్ఞానముచే జగదీశజీవభేదభిన్న జడాజడరూప ద్వైతము నిషేధింప(బాధము అనగా త్రైకాలిక అభావనిశ్చయముచేయ)బడగా అద్వితీయప్రత్యగభిన్న పరమాత్మయే శేషించును.

"**న విద్యతే ద్వైతం ద్విధాభావో యత్ర తదద్వైతమ్**"అనువ్యుత్పత్త్యర్థమును యింతవరకు తెలిసికుంటూ వచ్చాము.ఇప్పుడు,"**లక్షణప్రమాణాభ్యాం వస్తుసిద్ధి:**"అను నియమానుసారము"**అద్వైత**"శబ్దముయొక్క లక్షణ,ప్రమాణములను గూర్చి యథామతిగా విచారించెదము.

"**మానాధీనా మేయసిద్ధిః మానసిద్ధిశ్చ లక్షణాత్**"అను వచనానుసారము-తొలుత అద్వైతశ్రుతి ప్రమాణములను కొన్నింటిని అవలోకించెదము.

"**ఏకమేవాద్వితీయంబ్రహ్మ**"(ఛాం.ఉ.6-2-1).ఏకం,ఏవ మరియు అద్వితీయం అను యీమూడు శబ్దములయొక్క ప్రయోగప్రయోజనము ఇలా ఉంది."**ఏకమిత్యనేన స్వగతభేదశూన్యం**"ఏకం అను పదము స్వగతభేదరాహిత్యమును;"**ఏవేత్యనేన సజాతీయభేదశూన్యం**"ఏవ అను పదము సజాతీయభేదరాహిత్యమును;"**అద్వితీయమిత్యనేనవిజాతీయభేదశూన్యంపరిగృహ్యతే**"అద్వితీయమనుపదము విజాతీయ భేదమును నిషేధించుచున్నదని తెలియవలెను.

**శ్లో॥వృక్షస్యస్వగతోభేదః పత్రపుష్పఫలాదిభిః।**

**వృక్షాన్తరాత్సజాతీయో విజాతీయశ్శిలాదితః॥**(వే.పం.2-20)

స్వగతాదిభేదములు అనాత్మవస్తువులలో ఈప్రకారంగా ఉంటాయి.1.వృక్షములో శాఖలు,పత్రములు,పుష్పములు మరియు ఫలములు మొదలగువాటిలో పరస్పర భేదమున్నది.వృక్షము ఒకటే అయినప్పటికిని దాని అవయవములగు పత్రపుష్పఫలాదులందుగల భేదమును స్వగతభేద మందురు.(స్వ=వృక్షము;గత=వృక్షగత=వృక్షములోఉన్న అవయవ;భేదమునకు స్వగతభేద మందురు).లేదా తనలోని పదార్థములతో తనకుగలుగు భేదము స్వగతభేదమనబడును.2.ఒకవృక్షమునకు మరొకవృక్షమునకు వృక్షత్వజాతి ఏకమే అయినప్పటికిని రెంటిలో వ్యక్తిభేదమున్నది.అనగా ఆవృక్షమంటే ఈవృక్షముగాదు. ఈవృక్షమంటే ఆవృక్షంగాదు.దీనికి సజాతీయ భేదమందురు.సజాతి అనగా సమానజాతి(ఒకేజాతి)గల అనేక వస్తువులలోగల భేదము—సజాతీయభేదమనబడును.3.వృక్షమునకు మరియు వృక్షేతరములకు అనగా శిలాదులకు (వృక్షత్వము మరియు శిలాత్వాది)జాతిభేదముండియు వ్యక్తిభేదముగూడ ఉన్నందున, వీటిలోవిజాతీయ(విరుద్ధ జాతీయ)భేదమున్నది.

**శ్లో॥తథా సద్వస్తునో భేదత్రయంప్రాప్తం నివార్యతే।**

**ఐక్యావధారణద్వైత ప్రతిషేధై స్త్రిభిఃక్రమాత్॥**(వే.పం.2-21)

అనాత్మవస్తువులలో భేదత్రయమును ప్రదర్శింపజేసి,సద్వస్తువగు పరమాత్మకుగూడ వస్తుత్వసామాన్యముచే ఆభేదత్రయము ప్రసక్తమగునను శంకను నివారించుటకు పదత్రయప్రయోగముచే భేదత్రయమును నిషేధిస్తూ "ఏకమేవాద్వితీయంబ్రహ్మ"(ఛాం.ఉ.6-2-1)అంటూ ప్రవృత్తమైనది—శ్రుతిమాత. ఏకం, ఏవ

మరియు అద్వితీయం అను మూడుపదములు క్రమంగా ఐక్య,అవధారణ మరియు ద్వైతప్రతిషేధములకు అభిదాయకములు(వాచకములు)అగుచున్నవి. ఎట్లనగా—ఐక్యం=సత్పదార్థము"ఒక్కటి"అనిచెప్తూ శ్రుతిలోని"ఏకం"అనుపదము బ్రహ్మమునందు అవయవములులేవని స్వగతభేదమును నివారించుచున్నది.అవధారణ(ఏవ)=సత్పదార్థము"ఒక్కటియే"అని నిశ్చయమును భోధిస్తూ "ఏవ" పదము బ్రహ్మమునకు(సమానమైన)సజాతీయ రెండవ వస్తువులేదని సజాతీయభేదమును నిరాకరించుచున్నది. ద్వైతప్రతిషేదః="సత్పదార్థముకంటె భిన్నమైనదిలేదు"అనంటూ బ్రహ్మమునకు భిన్నజాతీయమైన రెండవవస్తువు ఉండదని నిరూపిస్తూ"అద్వితీయం"అనుపదము విజాతీయభేదమును నిషేధించుచున్నది.

అట్లే,**"సలిలఏకోద్రష్టాఽద్వైతః"**(బృ.4-3-32)అను శ్రుతిగూడ పరమాత్మ"**అద్వైతము**"అని ప్రతిపాదించుచున్నది."సలిల"ము అనగా పరబ్రహ్మము జలము వలె నిర్మలము(స్వచ్ఛము,శుద్ధము)అని అర్థము.**"అస్నావిరం శుద్ధమపాపవిద్ధమ్"**(ఈశావాస్య.ఉ.8),**"స్వాతిరిక్తకల్మషాభావాత్"**=ఆత్మకంటె అన్యమగు అవిద్యా,తత్కార్యమగు ప్రపంచము కల్పితమై,పరమార్థముచే నత్యంతాభావమున్నందున మరియు దానితో ఏమాత్రముగూడ సంస్పర్శలేనిదై(అసంగమై) యున్నందున ఆత్మ"నిర్మలము".పరమాత్మకు సమానమైన అన్యవస్తువు లేదని"ఏకో"అనుపదము చెబుతుంది.స్వాజ్ఞదృష్టిపరికల్పిత ద్వైతముయొక్క భావాభావాలను ప్రకాశించుచున్నందున ద్రష్టృత్వమును అనువాదముచేసిచెబుతుంది."**ద్రష్టా**"అను పదము.

**"అధ్యస్తమునకు ద్రష్టయే అధిష్ఠానముంటుంది"**-అను నియమానుసారము ద్రష్టయైన ఆత్మకంటె వ్యతిరిక్తమగు అజ్ఞానము,తత్కార్యమగు ప్రపంచము అధి

ష్ఠానజ్ఞానానంతరము బాధితమగుచున్నందున మిథ్యయే. మిథ్యాభూతమగు (అధ్యస్తమగు)పదార్థములకు అధిష్ఠానాతిరిక్తసత్త(స్వతంత్ర సత్త=అస్తిత్వం)ఉం డదు,గనుక ద్రష్టయగు పరమాత్మకంటె అన్యమగు విజాతీయవస్తువులను నిషేధిస్తుంది"**అద్వైతః**"అను పదము.

"**సలిలఏకోద్రష్టాఽద్వైతః**"అను యీశ్రుతి సారాంశమిట్లున్నది:-సుషుప్తిఅవ స్థలోని ఆత్మస్వరూపమును వర్ణిస్తున్నది శ్రుతిమాత.కావున"**సలిలఏకోఽద్ర ష్టా**"అని పదచ్ఛేదముచేయుటలో అనుపపత్తి యేమియు లేదు.ఆత్మవ్యతిరిక్త అవిద్య మరియు అవిద్యాకల్పితప్రపంచమే ఆత్మకు మలము.సుషుప్తిలో అవి ద్య ఉపశాంతిని పొందినందున ఆత్మ నిర్మలమైయున్నది.అక్కడ దృశ్యజాత ము అదర్శనమై పోవుటవలన దృశ్యసాపేక్ష ద్రష్టృత్వముగూడలేదు.అత్మ కేవ లము దృఙ్మాత్రమై,ఏకమే అయిఉన్నది.సుషుప్తిలో ఆత్మసలిలము=నిర్మల ము అని చెప్పబడినందున,ఆత్మకు విజాతీయములగు అవిద్యతత్కార్యరూప జగత్తును నిషేధిస్తూ విజాతీయ భేదరాహిత్యమును సూచించడమైనది.మరి యు అచ్చట ఆత్మ నిర్ధర్మకమైయున్నందున స్వగతభేదము నిషేధింపబడి నది."ఏక"అను పదప్రయోగముచే నానాత్మవాదమును నిరాకరిస్తూ సజాతీయభేద శూన్యమును తెలుపడమైనది.ఈప్రకారంగా సజాతీయ,స్వగత, విజాతీయభేదరాహిత్యమునే"**అద్వైతః**"అను పదము దృఢపరుచుచున్నది.కా వున ప్రత్యగభిన్నపరమాత్మయే"**అద్వైతము**".

అట్లే,"**ప్రపఞ్చోపశమం శాన్తం శివమద్వైతమ్**"(మాం.7)"**అద్వైతమనిర్వాచ్యం బ్రహ్మ**","**అద్వైత పరమానందో విభుర్నిత్యో నిష్కలఙ్క నిర్వికల్పో నిరఞ్జనో నిరాఖ్యాతః శుద్ధోదేవ ఏకోనారాయణోఽద్వితీయోఽస్తి కశ్చిదితి**"(త్రి.మ.నా.1అధ్యా), "**అద్వితీయమనాద్యన్తమ్**"(అన్నపూర్ణ.5-64),"**అద్వితీయఓతశ్చప్రోతశ్చ**"(నృసింహో.8-1)

**“అద్వైతేబోధితేతత్త్వే వాసనా వినివర్తతే”**(వరా.2-70),**“అద్వయానన్ద మాత్రోఽహం చిద్ఘనైకరసోఽస్మ్యహమ్”**(తే.బిం.6-65)ఇత్యాద్యనేక శ్రుతులు పరమాత్మను అద్వితీయస్వరూపముగా వర్ణించుచున్నవి.

**1.“సర్వస్య ప్రపఞ్చస్య బ్రహ్మవ్యతిరిక్తస్య కల్పితత్వేన మిథ్యాత్వాద్విజాతీయభేదశూన్యతా","వాచారమ్భణంవికారో నామధేయం మృత్తి కేత్యేవసత్యం”** (ఛాం.6-1-4),**“తదనన్యత్వమారమ్భణశబ్దాదిభ్యః”**(బ్ర.సూ.2-1-14)**ఇత్యాదిశ్రుతిసూత్రాభ్యాం కార్యస్యకారణాదవ్యతిరేకాత్సర్వస్య కల్పితత్వమ్.**

బ్రహ్మమునందు విజాతీయభేదము సంభవించదు—ఎందుకనగా!బ్రహ్మభిన్నమగునొక సద్వస్తువుండినచో విజాతీయభేదము సిద్ధించును.కాని,బ్రహ్మభిన్న(మరొక)సద్వస్తువనునది లేదు. అవిద్యాసహిత సంపూర్ణకార్యప్రపంచము బ్రహ్మరూప అధిష్ఠానమునందు కల్పితము.కావున“మిథ్యా”అయివున్నది.పైనుదహరించిన ఛాందోగ్య (6-1-4)మరియు బ్రహ్మసూత్రము (2-1-14)లు-బ్రహ్మమునందు విజాతీయభేదము లేదనుటలో ప్రమాణములు.

**శ్లో॥సతోర్హిభేదః పరికల్పనీయో, నాఽసత్సతోర్వాస్తవ భిన్నతాస్యాత్।**

**గఙ్గోదకస్యాఽథ మృగోదకస్య, భేదః కథం వాస్తవతాముపైతి॥**(స్వానుభవాదర్శః 159)

రెండు సద్వస్తువులయందే భేదము సంభవిస్తుంది.కాని,ఒక సద్వస్తువునకు మరొక అసద్వస్తువునకు భేదము ఎలాసంభవించును?సత్యమగుగంగాజలమునకు మరియు మిథ్యామృగజలమునకు వాస్తవ భేదము ఎట్లుసంభవించును? ఘటిల్లదని భావము.

**“కార్యకారణయోరనన్యత్వమ్”** అను నియమానుసారము ఈపరిదృశ్యమాన నామరూపాత్మక ప్రపంచము(కార్యము),"**యతోవాఇమానిభూతానిజాయ**

**న్తే"**(తై.3-1)మరియు"**జన్మాద్యస్యయతః**"(బ్ర.సూ.1-1-2) ఇత్యాది శ్రుతి, సూత్ర ప్రసిద్ధ జగత్కారణమగు బ్రహ్మముకంటె పృథక్సత్తలేనిదై,కల్పితమైయున్నది.కల్పిత వస్తువు అధిష్ఠానస్వరూపమయ్యే ఉండును.కావున అనాద్యనిర్వచనీయ అవిద్యగూడ బ్రహ్మవ్యతిరిక్తముగ పరమార్థతః సిద్ధించుట లేదు.మరియు"**ఏకమేవాఽద్వి తీయం**"(ఛాం.6-2-1),"**నేహనానాస్తికించన**"(బృ.4-4-19)ఇత్యాది శ్రుతులు బ్రహ్మభిన్న సర్వమును నిషేధించుచున్నందున బ్రహ్మము విజాతీయ భేదరహితమని నిర్వివాదముగా సిద్ధమైనది.

2."**తత్వమసి**"(ఛాం.6-8-7&6-9-4),"**అహంబ్రహ్మాస్మి**"(బృ.1-4-10), "**క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి**"(గీత.13-3)**ఇత్యాది శ్రుతిస్మృతిభిర్జీవపరమాత్మనో రత్యంతైక్యప్రతిపాదనేన చేతనాన్తరస్యాసమ్భవాజ్జీవభావస్య మిథ్యాత్వేనాఽజ్ఞాన కల్పితత్వాద్బ్రహ్మణః సజాతీయభేదశూన్యత్వమ్.**

జీవచైతన్యము,ఈశ్వరచైతన్యము మరియు బ్రహ్మచైతన్యము అను చైతన్య సాజాత్యమున్నందునబ్రహ్మమునందు సజాతీయభేదమున్నదిగదా!అనునీశంక సముచితముగాదు.ఎందుకనగా!రెండువస్తువులుండిననేగదా భేదముచెప్పుటకువీలుపడును.కాని,"**తత్త్వమసి**""**అహంబ్రహ్మాస్మి**","**అయమాత్మబ్రహ్మ**"(మాం.2)మరియు"**క్షేత్రజ్ఞంచాపిమాంవిద్ధి**"(గీత.13-2)ఇత్యాదిశ్రుతిస్మృతులు జీవబ్రహ్మలకు అత్యంతైక్యమును ప్రతిపాదించుచున్నవి.ఒకేవస్తువునందుభేదము చెప్పుటకు వీలుపడదుగదా!జీవభావముగాని ఈశ్వరభావముగాని మిథ్యాఽజ్ఞాన కల్పిత ములు. కావున చేతనాంతరము ఘటిల్లనేరదు.

**శ్లో॥మాయాభాసేనజీవేశౌకరోతీతిశ్రుతత్వతః।**

**కల్పితావేవ జీవేశౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్॥**(వే.పం7-3)

**"జీవాభాసేన కరోతి మాయాచావిద్యా చ స్వయమేవ భవతి"**(నృ.ఉ.తా.9) త్రిగుణాత్మకమైన ప్రకృతి జీవేశ్వరులనిరువురను చిదా భాసులుగా(చిత్ప్రతి బింబములుగా)చేసినదని శ్రుతియందు చెప్పబడినందున జీవేశ్వరులుభ యులును మాయాకల్పితులగుచున్నారు.

**శ్లో॥కార్యోపాధిరయంజీవః కారణోపాధిరీశ్వరః।**

**కార్యకారణతాంహిత్వా పూర్ణబోధోఽవశిష్యతే॥**(శుకరహస్యోపనిషత్ 12)

అవిద్యా అథవా అంతఃకరణోపాధికుడు జీవుడని,మాయోపాధికుడు ఈశ్వ రుడని వ్యవహరింపబడుచున్నారు.సమ్యగ్విచారము(శ్రవణ,మనన,నిధిధ్యాస నము)చేసి కార్యకారణోపాధులను(అవిద్య,మాయలను)పరిత్యజించినచో నిష్ప్ర తియోగిక పూర్ణబోధయే మిగిలియుండును.

కావున,జీవేశ్వరవిభాగము మిథ్యాఽజ్ఞానకల్పితమున్నందున జీవేశ్వరుల ను ప్రతిపాదించుటయందు శ్రుతిమాతకు తాత్పర్యములేదు.శ్రుతిషడ్లింగము లచేత జీవబ్రహ్మైక్యమునందే పరమతాత్పర్యంగలదు.ఇట్లు,చేతనాంతరము సి ద్ధింపకపోవుటవలన బ్రహ్మమునందు సజాతీయభేదము నిరాటంకంగా నిషేధిం పబడుచున్నది.

3.**"నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్"**(శ్వే.ఉ.6-19), **"కేవలో నిర్గుణశ్చ"**(శ్వే.ఉ.6-11)**"అసంగోహ్యయంపురుషః"**(బృ.4-3-15&16).**"నిత్యః సర్వగతః స్థాణురచలోఽయంసనాతనః"**(గీత.2-24)**ఇత్యాది శ్రుతిస్మృతిభి రవయవగుణక్రి యాజాతిసంబంధప్రతిషేధేన సృష్ట్యాదివాక్యైర్జ్ఞాయమానావయవగుణాదీనాంశ్రుతి ప్రతిపాద్యత్వాభావేన మాయాకల్పితత్వేన చ మిథ్యాత్వాద్బ్రహ్మణః స్వగతభేద శూన్యత్వమితి భావః।**

అవయవము,గుణము,క్రియ,జాతి మరియు సంబంధము ఈ ఐదింటిలో యే ఒక్కటైనను ఉన్నయెడల స్వగతభేదము సంభవిస్తుంది.కాని, పైనుదహ రించిన"**నిష్కలంనిష్క్రియ**"మిత్యాది శ్రుతిస్మృతి వచనములచే బ్రహ్మమునం దు అవయవాది ఐదింటిని అత్యంతనిషేధముచేయుట జరిగింది.అచ్చటచ్చ ట సృష్ట్యాదిప్రసంగమునందు బ్రహ్మమునకు అవయవగుణాదులను చెప్పిన ప్పటికినీ-అవి ఆరోపితములేగాని వాటిని ప్రతిపాదించే తాత్పర్యం శ్రుతిమాత కులేదు.మరియు అవయవగుణాదులు మాయాకల్పితములు.కావున మిథ్యా భూతములే.అందువల్ల బ్రహ్మము స్వగతభేదశూన్యమై యున్నది.

కావున,"**మానాధీనామేయసిద్ధిః**"అనువచనానుసారము ఉపరోక్త అద్వైతప్రతి పాదక శ్రుతిప్రమాణములను విచారించగా పరమాత్మ"అద్వైతస్వరూపము"అ ని సిద్ధమైనది.మరియు "**విజాతీయ సజాతీయ స్వగత భేదశూన్యత్వం అద్వై తత్వమ్**"అని అద్వైతముయొక్క "**లక్షణము**"గూడ అర్థతః నిష్పన్నమైనది.

## 2.అద్వైత శబ్దముయొక్క లక్షణపరీక్ష

"**సజాతీయవిజాతీయస్వగతభేదశూన్యత్వంఅద్వైతత్వమ్**"అను"**అద్వైత**"లక్ష ణముయొక్క పదకృతి(పరీక్ష)ఈ క్రింది విధంగానున్నది.

"**స్వగతభేదశూన్యత్వమద్వైతత్వమ్**"అని ఇంతమాత్రమే"అద్వైత" లక్షణము చేసినయెడల సాంఖ్యాభిమత ఆత్మయందు అతివ్యాప్తిగలుగుచున్నది.ఎందు కనగా!సాంఖ్యులుకూడ ఆత్మను అవయవ గుణ క్రియ జాతి సంబంధశూన్య మని స్వీకరించెదరు.కావున స్వగతభేదశూన్యత్వము సంభవించుచున్నది. అందువల్ల,వారి ఆత్మయందుకలుగు అతివ్యాప్తిదోషపరిహారార్థము అద్వైతలక్ష ణములో"సజాతీయభేదశూన్యత్వం"అని ఇంతభాగమును అవశ్యముగా నివే

శింపనైనది.సాంఖ్యులు జీవనానాత్వమును స్వీకరించినందున(జీవులలో పర స్పరభేదమును స్వీకరించినందున)సజాతీయభేదశూన్యత్వాభావము ప్రసక్తమ గుచున్నది.అనగా,సజాతీయభేదమే సిద్ధించుచున్నది.కావున,“**సజాతీయభేద శూన్యత్వం**”చెప్పినచో అతివ్యాప్తిదోషం ప్రాప్తించదు.

“**సజాతీయస్వగతదభేదశూన్యత్వమద్వైతత్వమ్**”అని అద్వైతముయొక్క లక్షణముచేసినచో ఆకాశమునందు అతివ్యాప్తికలుగుచున్నది.ఎందుకనగా!ఆ కాశముఒక్కటేగదా.నానా(అనేక)ఆకాశములులేనందున ఆకాశమునకు సజా తీయభేదశూన్యత్వము సిద్ధించుచున్నది.మరియు నిరవయవము,నిష్క్రియ ముగూడఉన్నందున స్వగతభేదశూన్యత్వంగూడ ప్రాప్తిస్తుంది.అందువల్ల లక్ష ణము అతివ్యాప్తిదోషగ్రస్తమగుచున్నది.తన్నివారణార్థము ‘అద్వైత’లక్షణము నందు“విజాతీయభేదశూన్యత్వమ్”అనికూడా అవశ్యముగా జోడించవలెను.అ ప్పుడు ఆకాశమునకు పృథ్వ్యాదులచే విజాతీయభేదమున్నందున విజాతీయ భేదశూన్యత్వముసిద్ధింపకపోవుటవలనఅతివ్యాప్తిదోషముప్రసక్తము కాజాలదు.

ఒకవేళ “**విజాతీయభేదశూన్యత్వమద్వైతత్వమ్**”అని ఇంతమాత్రమే లక్షణ ము చేసినచో,సజాతీయ స్వగతభేదములను అంగీకరించినట్లువుతుంది. అట్ల గుచో“**ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ**”(త్రి.మ.నా.3), (ఛాం.6-2-1), (పైంగ.1)**అను అద్వైత** శ్రుతికి విరోధమేర్పడును.కావున,ఆశ్రుతివిరోధపరిహారము కొఱకు “**సజాతీయ భేదశూన్యత్వము**”చెప్పబడింది.మరియు బ్రహ్మమునందు ఏకరసత్వ సిద్ధికొఱకు“**స్వగతభేదశూన్యత్వము**”చెప్పబడింది.ఈప్రకారంగా“**సజాతీయ,విజా తీయ,స్వగతభేదశూన్యత్వమద్వితీయత్వమ్**”అని నిర్దుష్టమైన సల్లక్షణము చే యబడినది.

ఇంతకుపూర్వము మనము అద్వైతముయొక్కలక్షణము మరియు లక్షణ

పరీక్షగూడ చేస్తూవచ్చాము.ఇప్పుడు ప్రాసంగికముగా లక్షణముగూర్చి కొంచె ము విచారించెదము.

## 3.దోషత్రయరహితము సల్లక్షణము

ప్రశ్న:—లక్షణస్య కిం లక్షణమ్ ?

లక్షణముయొక్క లక్షణమేమిటి ?

సమాధానం:—అసాధారణధర్మో లక్షణస్య లక్షణమ్।

అసాధారణధర్మము లక్షణముయొక్క లక్షణము.

ప్ర:—లక్షణస్య నిష్కృష్టం లక్షణం కిమ్?

లక్షణముయొక్క నిర్దుష్ట(సారభూత)మైన లక్షణమేమిటి?

స:—అవ్యాప్త్యతివ్యాప్త్యసంభవరూపదోషత్రయశూన్యత్వేసతి అసాధారణ ధర్మవ త్వం లక్షణస్య లక్షణమ్.

అవ్యాప్తి,అతివ్యాప్తి మరియు అసంభవము అను మూడు దోషములు లేనిదై న అసాధారణధర్మముయేదో అది లక్షణముయొక్క లక్షణము.

ప్ర:—అసాధారణధర్మః కీదృశో భవతి?

అసాధారణధర్మము ఏవిధంగానుండును?

స:—అవ్యాప్త్యతివ్యాప్త్యసంభవదోషరహిత ఏవాసాధారణధర్మో భవితుం శక్నోతి.

అవ్యాప్తి, అతివ్యాప్తి మరియు అసంభవము అనబడు దోషత్రయము లేనిదై యేధర్మముండునో అదియేఅసాధారణధర్మమనబడుటకు యోగ్యము.

ప్ర :—కింనామ లక్ష్యమ్?

లక్ష్యమనగా ఏమిటి?

స:—యస్య లక్షణం క్రియతే, తల్లక్ష్యం భవతి. యథా గోర్లక్షణం క్రియతే చేత్ గౌః లక్ష్యాభవతి.

దేనియొక్క లక్షణము చేయబడుతుందో,అది లక్ష్యమనబడును.ఉదా:—గోవుయొక్క లక్షణముచేసినచో గోవు లక్ష్యమనబడును.

ప్ర:—లక్షణే కతి దోషాః సంభావ్యన్తే?

స:—లక్షణే అవ్యాప్తిః,అతివ్యాప్తిః,అసంభవశ్చ ఏతేత్రయోదోషాః భవితుం శక్నువన్తి.

లక్షణమునందు అవ్యాప్తి, అతివ్యాప్తి మరియు అసంభవమను మూడు దోషములు ప్రాప్తించే సంభవముంది.

ప్ర:—అవ్యాప్తేః కిం లక్షణమ్? అథవా అవ్యాప్తిదోషస్య కిం లక్షణమ్?

అవ్యాప్తిదోషముయొక్క లక్షణమేమిటి?

స:—లక్ష్యైకదేశావృత్తిత్వమవ్యాప్తేర్లక్షణమ్. యథా కపిలత్వం గోర్లక్షణమ్.

లక్ష్యమునందు లక్షణము ఏకదేశమునవర్తించక(ఉండక)పోవుట అవ్యాప్తిదోషమనబడును.ఉదా:—గోవుయొక్క లక్షణము చేయునప్పుడు గోవు లక్ష్యమగుచున్నది.అయితే లక్ష్యమగు గోవు ఒకటియా?లేక సకలగోవులా?కపిలరంగుగలది గోవు(ఆవు)అని గోవుయొక్క లక్షణము చేసినచో కపిలరంగు అన్ని గోవులలో ఉండదుగదా!మరి,ఇతర గోవులు గూడగోవులే గదా!వాటియందు కపిలత్వమను గోవులక్షణము వర్తించుట(ఉండుట)లేదు. లక్షణము సకలగోవులలో అనుగతమై అసాధారణధర్మమై యుండవలెను.

కావున,లక్ష్యముగూడ సకలగోవులు అని తెలియవలెను.అందువల్ల,కపిల త్వము(కపిలరంగు) లక్ష్యభూతమగు సకలగోవులలో ఉండక—కొన్నిగోవుల లో మాత్రముఉండి కొన్నిగోవులలో లేకపోవుటవలన"కపిలత్వం గోర్లక్షణమ్" అనునది అవ్యాప్తిదోషగ్రస్త మగుచున్నది.

ప్ర:—అతివ్యాప్తేః కిం లక్షణమ్?

అతివ్యాప్తిదోషముయొక్క లక్షణమేమి?

స:—లక్ష్యవృత్తిత్వేసతి అలక్ష్యవృత్తిత్వమతివ్యాప్తేర్లక్షణమ్.

లక్ష్యమునందువర్తించి(ఉండి)లక్ష్యముకానిదాని(వాటి)యందు లక్షణముపో వుటఅతివ్యాప్తియనబడును.యథా"శృఙ్గిత్వంగోర్లక్షణమ్".ఉదా:—కొమ్ములుగల ది ఆవు అని గోవుయొక్కలక్షణము చెప్పినచో,లక్ష్యభూతమగు సకలగోవుల లో లక్షణము వర్తిస్తుంది.అంటే,సకల గోవులకుకొమ్ములు ఉండుట సామాన్య ముకాని,లక్ష్యముకానిమహిష్యాదులలో(బఱ్ఱెలు,గొఱ్ఱెలు,మేకలు,జింకలుమొద లగువాటిలోగూడ)లక్షణము పోవుచున్నది.మహిష్యాదులకుగూడ కొమ్ములుం టాయిగదా.కావున,"శృంగిత్వంగోర్లక్షణమ్"అనునది అతివ్యాప్తిదోషగ్రస్తమగుచున్నది.

ప్ర:—అసంభవస్య కిం లక్షణమ్?

అసంభవదోషముయొక్క లక్షణమేమిటి?

స:—లక్ష్యమాత్రావృత్తిత్వమసంభవస్య లక్షణమ్.యథా ఏకశఫవత్వం గోర్లక్షణమ్.

లక్షణము సంపూర్ణముగా లక్ష్యమునందు ఎచ్చటగూడ వర్తింపకుండుట (ఉండకుండుట)అసంభవదోషముయొక్క లక్షణము.ఉదా!ఒంటిగిట్ట(డెక్క)గల

ది ఆవు—అని లక్షణము చెప్పినచో,సంపూర్ణ లక్ష్యభూతమగు సకల గోవులలో అసంభవదోషము ప్రసక్తమగుచున్నది.ఎందుకంటే,ఒంటిగిట్టె గుఱ్ఱములకు మరియు గాడిదెలకు ఉంటుంది.కాని, ఏ దేశంలోగాని, ఏ కాలంలోగాని ఆవులకు ఒంటిగిట్టె ఉండుట సంభవించదు.

ప్ర:—అవ్యాప్త్యాది దోషత్రయశూన్యం కస్యాపి లక్షణముచ్యతామ్?

అవ్యాప్తి,అతివ్యాప్తి మరియు అసంభవమను మూడుదోషములులేని లక్షణము దేనికైనా చెప్పండి ?

స:—"సాస్నాదిమత్వం గోర్లక్షణమ్" ఇత్యత్ర దోషత్రయే కోఽపి దోషో నాస్తి. మెడక్రింద ప్రేలాడబడు పొడుగాటిచర్మము(గళకంబలము,గంగడోలు)గలిగియుండుట ఆవుయొక్క సల్లక్షణమనబడుతుంది.ఈలక్షణమునందు పైనచెప్పబడిన అవ్యాప్త్యాది మూడుదోషములలో యే ఒక్కదోషముగూడలేదు.అందువల్ల"సాస్నాదిమత్వంగోర్లక్షణమ్"అనునది గోవుయొక్క నిర్దుష్ట లక్షణమనబడును.

ప్ర:—లక్షణస్య ప్రమోజనం కిమస్తి?

లక్షణముయొక్క ప్రయోజనమేమున్నది?

స:—ఇతరభేదజ్ఞానం లక్షణస్య ప్రయోజనమస్తి.

లక్ష్యమును లక్ష్యేతరములనుండి వేరుచేసి తెలుపుటయే లక్షణముయొక్క ప్రయోజనమున్నది.ఉదా:—గోవుయొక్క లక్షణము"సాస్నాదిమాన్"(గంగడోలు గలది ఆవు)అన్నప్పుడు ఆ"సాస్నాదిమత్వ"లక్షణము తన లక్ష్యమగు గోవును గవేతరములైన అశ్వగజాదులనుండి వేరుచేసి చూపెడుతుంది. అనగా!ఈ ఆవు అశ్వము,గజము ఇత్యాదులు కాదు—అని తెలుపుతుంది.ఇదియే లక్ష

ణముయొక్క ప్రయోజనము.మరియు వ్యవహారము(ప్రవృత్తి)గూడప్రయోజన మున్నది.

ప్ర:—కా నామ పరీక్షా?

పరీక్ష అనగా యేమి?

స:—లక్షితస్యలక్షణం సంభవతి నవేతి ప్రమాణతర్కాభ్యాం విచారః పరీక్షా.

లక్ష్యపదార్థము(వస్తువు)నకు చేయబడిన లక్షణము,ఆలక్ష్యపదార్థమును బోధించుటకు యోగ్యమైనదా?కాదా? అని ప్రమాణములచేత మరియు తర్కముచేత చక్కగా విచారించుటయే“పరీక్ష”అనబడును.

ప్ర :—పరీక్షాయాః ప్రయోజనం కిమస్తి?

పరీక్షయొక్క ప్రయోజనమేమున్నది?

స:—లక్షణే దోషాణాం పరిహారః పరీక్షాయాః ప్రయోజనమ్.

లక్షణమునందు ప్రసక్తమగు దోషములను(అవ్యాప్తి,అతివ్యాప్తి,అసంభవమను దోషత్రయమును)పరిహారము చేయుటయే పరీక్షయొక్క ప్రయోజనము.

ఉపరోక్త అవ్యాప్త్యాదిదోషత్రయమేకాకుండా ఇంకా అనేక దోషములు గూడ ప్రసక్తమగును.1.ఆత్మాశ్రయదోషము. 2.అన్యోన్యాశ్రయదోషము, 3.చక్రికాదోషము, 4.అనవస్థాదోషము,5.వినిగమనవిరహము మరియు6.ప్రాగ్లోపము మొదలగునవి.ఏదేనివస్తువుయొక్క నామనిర్దేశముచేసినపిమ్మట ఆవస్తువుయొక్కలక్షణము మరియు పరీక్ష(ప్రమాణ,తర్కములచేత చక్కగా విచారము)చేసినపుడే ఆ వస్తువుకు సంబంధించిన సమ్యక్ జ్ఞానము కలుగుతుంది. అందుకే లక్షణ, ప్రమాణ, పరీక్షలయొక్క అత్యంతావశ్యకత ఉంది.

సరే,ప్రాసంగికమునువదలి ప్రకృతముననుసరించెదము.ఇంతదనుక"అద్వైత" శబ్దముయొక్క విస్తృతవివేచనము చేస్తూవచ్చాము.దీనితో విజాతీయసజాతీయస్వగతభేదరహితమైన ప్రత్యగభిన్నపరబ్రహ్మమే సకలవేదాన్తములకు ప్రతిపాద్యవిషయమని,దానిని ప్రతిపాదించుటయందే ముఖ్యతాత్పర్యముగలవని మరియు తద్విషయక సమ్యక్ జ్ఞానమునుబోధించి సకలముముక్షువులనుద్ధరించుటయేవాటియొక్కముఖ్యలక్ష్యమని సుస్పష్టముగా తెలియబడుచున్నది.

## 4.వేదాన్తము

వేదాన్తమనగా యేమిటి?వేదములయొక్క అన్త్యభాగము,అవసానభాగము, వేదశిరస్సులు వేదాన్తములు–ఉపనిషత్తులు."**వేదాన్తోనామోపనిషత్ప్రమాణం తదుపకారీణి శారీరకసూత్రాదీని చ**"(వేదాన్తసారము)ఆత్మవిషయక ప్రమకు(యథార్థజ్ఞానమునకు)కరణమగు(ప్రమాణమగు)ఉపనిషత్తులే"**వేదాన్త**"శబ్దముచే చెప్పబడుచున్నవి.అట్లే 'బ్రహ్మసూత్రములు' మరియు 'శ్రీమద్భగవద్గీత' ఇత్యాదులు గ్రహించదగును.అనధిగత(అజ్ఞాత),అబాధిత, అసందిగ్ధార్థబోధజనకత్వం అనునది ప్రమాణముయొక్కప్రామాణ్యత అని శ్రీవాచస్పతిమిశ్రులవారు (బ్ర.సూ.1-1-4) లో చెప్పినట్లుగా అబాధితము,అనధిగతమునగు ఆత్మవిషయక నిస్సందిగ్ధ ప్రమకు కరణమగు ఉపనిషత్తులే "**వేదాన్తము**"అను శబ్దవాచ్యములు.

"**వేదాన్త**"శబ్దార్థములో"**ఉపనిషత్ప్రమాణమ్**"అను పదము ప్రసక్తమైనది. ఈ పదమునకు మూడువిధములుగా సమాసము చెప్పవచ్చును.ఒకటి కర్మధారయము,రెండవది తత్పురుషము, మూడవది బహువ్రీహి. ప్రథమ పక్షములో 'ఉపనిషచ్చతత్ప్రమాణమ్'ఉపనిషత్ప్రమాణమ్. ఏది ఉపనిషత్తు గూడ ఉన్నది మరియు ప్రమాణముగూడ.ఈపక్షములో ఆత్మవిషయక జ్ఞానమునకు ఉపనిషత్తు ఏకైక సాధనము-అను అర్థము నిష్పన్నమగుచున్నది. ఉపనిషత్తులకంటె

వ్యతిరిక్తమగు ప్రత్యక్షము, అనుమానము ఇత్యాది ప్రమాణములచేత ఆత్మ యాథాత్మ్యజ్ఞానము కలుగనేరదు.ఈకారణమువల్లనే ఉపనిషత్తులకు 'ఉపనిషత్ప్రమాణమ్'అని చెప్పబడినది.ఒకవేళ ద్వితీయపక్షమునంగీకరించిన చో—'ఉపనిషదః ప్రమాణమ్'ఉపనిషత్ప్రమాణమ్.ఏది ఉపనిషత్తునకు ప్రమాణమో అది ఉపనిషత్ప్రమాణమ్—అని తత్పురుషమగును.**'ఉపనిషచ్ఛబ్దేనచ వేద్యవస్తువిషయావిద్యాఉచ్యతే'**తథాచవక్ష్యతి—**"నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే"**(కఠ. 1-3-15) అథవా **'పరం బ్రహ్మ గమయతీతి బ్రహ్మగమయితృత్వేన యోగాద్ బ్రహ్మవిద్యాఉనిషత్'**.తథా చ వక్ష్యతి—**"బ్రహ్మ ప్రాప్తో విరజోఽభూద్విమృ త్యుః"**(కఠ.2-3-19)అందువల్ల బ్రహ్మవిద్యయే ఉపనిషత్తు అనబడును.(ఉపనిషదితి బ్రహ్మవిద్యా).ఈప్రకారముగా ఆత్మవిషయక యథార్థజ్ఞానమే ఉపనిషచ్ఛబ్దముద్వారా విదితమగుచున్నది.అట్లే ప్రమాణ పదమునకు అర్థము కారణము అని గ్రహించవలెను.ఇట్లు'ఉపనిషత్ప్రమాణమ్'అను పదమునకు అర్థము "ఆత్మవిషయక యథార్థ జ్ఞానమునకు కారణము"అని తెలియవలెను. ఇక తృతీయ పక్షములో 'ఉపనిషదః యత్ర ప్రమాణమ్' ఉపనిషత్తులు దేనియందు ప్రమాణములో అవి ఉపనిషత్ప్రమాణములు.అంటే,ఉపనిషత్తు దేనియందు అనగాఆత్మయాథాత్మ్య జ్ఞానమునందు ప్రమాణము,కారణము అని చెప్పినట్లగును. ఈపక్షములోగూడ ఉపనిషత్తలకు ఆత్మజ్ఞానమునకు కారణత్వము ద్యోతితమగుచున్నది.యద్యపి,మూడు విధములుగా అర్థసంగతి కుదురుచున్నది.అయితే,తత్పురుషము మరియు బహువ్రీహి సమాసములలో లక్షణా చేయవలసి ఉంటుంది. కాని లక్షణావృత్తి జఘన్యము(నికృష్టము).'ముఖ్యే సమ్భవతి లక్షణా న న్యాయ్యః' ముఖ్యవృత్తిచే అర్థావగతి కలుగుచుండగా లక్షణా చేయుట న్యాయము కాదు. ఈ వచనానుసారము కర్మధారయ సమాసమునే అభియుక్తులందరు స్వీకరించారు.

## 5.శారీరక శబ్దార్థము

అట్లే ఉపనిషత్తుల అడుగుజాడల్లో నడుస్తూ,ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మాత్మైకత్వమును ప్రతిపాదించు"శారీరకసూత్రము"గూడ"వేదాన్త"శబ్దముద్వారా చెప్పబడుతుంది.'శరీరమేవ శరీరకం తత్ర భవో జీవః శారీరకః సః సూత్ర్యతే యథా తథ్యేన నిరూప్యతే యైస్తాని శారీరకసూత్రాణి'"**అథాతో బ్రహ్మజిజ్ఞాసా**"(బ్ర.సూ.1-1-1) ఇత్యాదీని.యద్వా శారీరకస్య సూత్రాణి తద్యాథాత్మ్యావాదివేదాన్తార్థ సంగ్రహవాక్యాని (విద్వన్మనోరఞ్జని).శరీరమే'శరీరకం'అని చెప్పబడును.అనగా శరీరము కుత్సితమైనదని అర్థము.ఎందుకనగా—ఈశరీరము నాశవంతమైనది,అనేక దుఃఖాది భోగములకు సాధనమున్నది.కావున కుత్సితశరీరము గనుక శరీరక మనబడుచున్నది."శరీరకే భవః శారీరకః"శరీరములో ఉండువాడు శారీరకుడు. శరీరంలో ఉండుట,అనగా శరీరముతో అభేదభ్రమకు విషయమగుట.శరీరసంబంధముద్వారానే సుఖదుఃఖాది ఉపభోగము సంభవించును. శరీరము జన్మించినచో మరియు మరణించినచో ఆత్మయందు'నేను పుట్టాను, నేను మరణిస్తాను'అను ఆరోపితవ్యవహారము జరుగుతుంది. కావున ఆత్మయే శారీరకుడనబడును. ఈ శారీరకుడే(ఆత్మయే)పరమాత్మ(పరబ్రహ్మము) అని సకలోపనిషత్తులయొక్క తాత్పర్యమును శ్రుత్యనుకూల యుక్తులచే(న్యాయములచే)నిర్ణయించు, వ్యాస భగవానునిచే రచింపబడిన సూత్రాత్మక గ్రంథవిశేషమునకే శారీరకసూత్రములు, బ్రహ్మసూత్రములు,వేదాన్తసూత్రములని అంటారు.దీనికే న్యాయప్రస్థానము, యుక్తి ప్రస్థానము, అనిగూడ అంటారు.

బ్రహ్మసూత్ర అధ్యాసభాష్యాంతమున స్వయముగా శ్రీభాష్యకారులు ఇలా చెప్పారు."**అస్యానర్థహేతోఃప్రహాణాయ ఆత్మైకత్వవిద్యాప్రతిపత్తయే సర్వేవేదాన్తాః ఆరభ్యన్తే.యథాచాయమర్థః సర్వేషాం వేదాన్తానాం తథా వయమస్యాం శారీరక**

**మీమాంసాయాం ప్రదర్శయిష్యామః".**

"సకలానర్థములకు హేతువైన ఈఅధ్యాస నివృత్తికొఱకు, తద్ద్వారా ఆత్మైక త్వవిజ్ఞానప్రాప్తికొఱకు వేదాన్తములన్ని (ఉపనిషత్తులన్ని )ప్రవృత్తములైనవి(వి చారించబడుచున్న వి).సకలవేదాన్తములకు ఇదేప్రయోజనం అనేవిషయం ఈ శారీరకమీమాంసలో మేము ప్రదర్శించనున్నాము".కావున, బ్రహ్మసూత్రము గూడ వేదాన్తశాస్త్రముగా పరిగణించబడుతుంది.

**"వేదాన్త మీమాంసాశాస్త్రస్య వ్యాచిఖ్యాసితస్యేదమాదిమం సూత్రమ్".**(బ్ర.సూ. భాష్యం1-1-1),**వేదాన్తవాక్యకుసుమగ్రథనార్థత్వాత్సూత్రాణామ్.వేదాన్తవాక్యానిహిసూ త్రైరుదాహృత్య విచార్యన్తే.వాక్యార్థవిచారణాధ్యవసాననిర్వృత్తాహి బ్రహ్మావగతిః.** (బ్ర.సూ.భాష్యము1-1-2)వ్యాఖ్యానమునకు విషయీభూతమగు వేదాన్తమీమాంసా శాస్త్రమునకు మొదటిసూత్రము"**అథాతోబ్రహ్మజిజ్ఞాసా**"(బ్ర.సూ.1-1-1). సూత్రాలు వేదాన్తవాక్యాలు అనే పుష్పాలను గ్రుచ్చడంకోసం ఉద్దిష్టమైనవి.సూత్రాలువేదా న్తవాక్యాలను ఉదాహరించి వాటి అర్థాన్నిగూర్చి విచారిస్తాయి.బ్రహ్మసాక్షాత్కా రం వాక్యార్థవిచారణచేసి దానిని నిర్ణయించడంచేత కలుగుతుంది.కాని,అను మానం మొదలైన ఇతర ప్రమాణాలచేత కలిగేదికాదు. (బ్ర.సూ.1-1-2)

శ్రీభాష్యకారులయొక్క ఉపరోక్తవాక్యాలనుబట్టి శ్రీబాదరాయణాచార్యులగు వేద వ్యాసభగవానులచే ప్రణీతమైన బ్రహ్మసూత్రములనబడు శారీరకమీమాంసా శాస్త్రమునకు వేదాన్తవాక్యవిచారణ ముఖ్యకార్యముగా,బ్రహ్మాత్మైకత్వ అవగతి (జ్ఞానము)గౌణకార్యముగా మరియు బ్రహ్మసాక్షాత్కారము అవధి(ఫలము)గ- లదిగా తెలియబడుచున్నది.ఉపనిషత్తులలో ఎక్కడెక్కడ సందేహాన్నికలిగిం- చేవాక్యాలున్నాయో మరియు పురుషబుద్ధికి అగోచరమైన సన్నివేశములు న్నాయో వాటిని సూత్రాలచే నుదహరిస్తూ విచారించడమైనది.

బ్రహ్మవిచారశాస్త్రమనబడు బ్రహ్మసూత్రంలోని—

**అధ్యాయ విషయములు**

**శ్లో॥శాస్త్రం బ్రహ్మవిచారాఖ్యమధ్యాయాః స్యుశ్చతుర్విధాః।**

**సమన్వయావిరోధౌ ద్వౌ సాధనం చ ఫలం తథా॥**(వైయాసికన్యాయమాలా)

1.సమస్తవేదాన్తములకు బ్రహ్మప్రతిపాదనమునందే తాత్పర్యము గలదని చెప్పడానికి శ్రీకృష్ణద్వైపాయనులు"సమన్వయాధ్యాయ"మను ప్రథమాధ్యాయ మును రచించినారు. ఈ అధ్యాయములో ఉపనిషద్వాక్యాల అర్థనిర్ణయం చేయబడింది.2.సాంఖ్యాదితార్కికమతములకు మరియుఅద్వైతసిద్ధాన్తమునకు గలుగు విరోధమును పరిహారముచేస్తూ"అవిరోధాధ్యాయ"మను రెండవ అధ్యాయమును రచించారు.3.బ్రహ్మవిద్యాసాధనాలనుగూర్చి"సాధనాధ్యాయ"(తృతీయాధ్యాయ)ములో చర్చించడమైనది.4.బ్రహ్మవిద్యాఫలాన్ని ప్రతిపాదించేదిగా నాలుగవదగు "ఫలాధ్యాయము"ను రచించడమైనది.

**"వేదాన్తదర్శనం దర్శనేషు సర్వేషు దర్శనీయతమం దర్శనమ్"** సాంఖ్య,యోగ,న్యాయ,మీమాంసాది సమస్తదర్శనశాస్త్రములలో అద్వైతవేదాన్త దర్శనమే అతీవదర్శనయోగ్యము;విచారించి తత్త్వమును అవగతమొనర్చుకొని అనుభవించుటకు ప్రశస్తమైన దర్శనము.**"అనుభవావసానత్వాద్భూతవస్తు విషయత్వాచ్చబ్రహ్మజ్ఞానస్య"**(బ్ర.సూ.భాష్యము1-1-2).బ్రహ్మసూత్రము వ్యవహారభూమిలో అనేకపేర్లతో పిలువబడుచున్నది.

**బ్రహ్మసూత్రముయొక్క వివిధనామాంతరములు**

1.సకలఉపనిషత్తులయొక్కతాత్పర్యము బ్రహ్మమునందే ఉంది అని సూత్ర

ములద్వారా సమన్వయించి చెప్పబడినందున"**బ్రహ్మసూత్రము**"అను పేరుతో విఖ్యాతమైనది.

"**సూచనాత్సూత్రమిత్యాహుఃసూత్రం నామ పరం పదమ్**"(బ్రహ్మోపనిషద్)

**శ్లో॥అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్,**

**అస్తోభమనవద్యఞ్చ సూత్రంసూత్రవిదోవిదుః।**(పరాశర ఉపపురా.18-13/14)

అను వచనానుసారము అత్యల్పమగు శబ్దములద్వారా అతిసంక్షేపముగా పరబ్రహ్మస్వరూపమును,తత్ప్రాప్తిసాధనములు,సగుణనిర్గుణఉపాసనలు మరియు విజ్ఞానఫలమగు మోక్షము మొదలగు సమగ్రవిషయాలు సాంగోపాంగముగా నిరూపింపబడినందువల్లగూడ"బ్రహ్మసూత్రము"అను పేరు సార్థకమైనది.2.ఋగ్వేదాదులయొక్క అంతిమసిద్ధాన్తమును దర్శింపజేసినందువల్ల "**వేదాన్తదర్శనము**"అని వ్యవహరింపబడుతుంది. 3.చతుర్వేదముల ఉత్తర(అంతిమ)భాగముయొక్క అనగా వేదశిఖలగు జ్ఞానకాండాత్మక ఉపనిషత్తులయొక్క మీమాంసా(పూజితవిచారణ)చేయబడినందువలన బ్రహ్మసూత్రమునకు"ఉత్తరమీమాంసా"అనిగూడఅంటారు.అట్లే4."దర్శనప్రస్థానము"ని,5."యుక్తిప్రస్థానము"ని,6."న్యాయప్రస్థానము"నిగూడ అంటారు.7.బ్రహ్మసూత్రమునకు"శారీరకమీమాంసా"అనిగూడ నామాంతరము గలదు."**కుత్సితంశరీరం(స్థూల,సూక్ష్మ)శరీరకం**".అత్యంతమలిన(హేయ)మైన స్థూలసూక్ష్మశరీరములకు శరీరకం అంటారు."**తత్ర భవ శారీరకమ్**"ఆ స్థూలసూక్ష్మ శరీరములతో సంబంధపడి వాటిని అభిమానించే ప్రతిబింబచైతన్యమునకు(జీవునకు)"శారీరకుడు"అంటారు."**తం బ్రహ్మత్వేన కాయతి బోధయతీతి శారీరకంశాస్త్రం**".ఆజీవున్ని బ్రహ్మముతో అభిన్నముగా బోధించు శాస్త్రమునకు"శారీరకమీమాంసాశాస్త్రము"అందురు.

"మీమాంసా"అనగా"పూజితవిచారణ".జీవబ్రహ్మైక్యవిచారమే ప్రశస్యతరమైనందు న"పూజితవిచారణ"మనబడును.ఎందుకనగా!విచారముచేయకుండా జీవునికి పరమపురుషార్థము(మోక్షము)సిద్ధించదు.ఆపూజితవిచారణ ఈ బ్రహ్మసూత్ర గ్రంథముద్వారా చేయబడినందున"శారీరకమీమాంసా"అని వ్యవహరింపబడు చున్నది.

ఉపనిషత్తులలో ప్రాణాద్యుపాసనల వర్ణన యేదిగలదో,అది చిత్తశుద్ధి మరి యు ఏకాగ్రతద్వారా జీవబ్రహ్మల అభేదజ్ఞానమునకు సాధనము(సహాయ ము)న్నందున ఉపాసనలుగూడ జీవబ్రహ్మైక్యమునందే పరమతాత్పర్యము గలవైయున్నవి.కావున,వేదాన్తతత్త్వజిజ్ఞాసువులకు దర్శనీయ(విచారణీయ)శా స్త్రము వేదాన్తదర్శనము(శారీరకమీమాంసాశాస్త్రము).అందుకే, సంప్రదాయుల గు వృద్ధులు ఇలా చెబుతున్నారు.

**శ్లో॥శాస్త్రం శారీరమీమాంసా, దేవస్తు భగవాన్స్వయమ్।**

**ఆచార్యః శఙ్కరాచార్యః సన్తు మే జన్మజన్మని॥**

అర్థం స్పష్టము.

**6.ప్రకరణము**

**శ్లో॥శాస్త్రైకదేశసంబద్ధం శాస్త్రకార్యాన్తరేస్థితమ్।**

**ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదవిచక్షణాః॥**(పరా.ఉపపు.18-21)

అర్థము:—దేనియందు శాస్త్రముయొక్క సమస్త ప్రతిపాద్య విషయములు చర్చింపబడక,ఏకదేశముతో సంబంధపడి అనగా కొన్నివిషయములు మాత్రమే ప్రతిపాదింపబడుతాయో మరియు శాస్త్రముయొక్క కార్యాంతరమునందే

ఉద్దేశముగలద్దై,శాస్త్రముయొక్క ఆశయమునే(అభిప్రాయమునే) అన్యాన్యప్రక్రియలచే ప్రతిపాదించు గ్రంథవిశేషమునకు"**ప్రకరణము**"అని గ్రంథభేదమునెటింగిన విద్వత్పురుషులు చెబుతారు.

అధికారియగు ఆత్మతత్త్వజిజ్ఞాసువునకు శారీరకమీమాంసాశాస్త్రమే(బ్రహ్మసూత్రమే)పరమాదరణీయమని తెలిసికుంటూ వచ్చాము.కావున,ఈ"**అద్వైత వేదాన్త భూమిక**"అను గ్రంథము"**వేదాన్తదర్శనము**"ను శాస్త్రముయొక్క ఏకదేశముతో సంబంధపడిఉంది.శారీరకమీమాంసాశాస్త్రముయొక్క అర్థము(ప్రయోజనము)"మోక్షము"మరియు విషయము"బ్రహ్మాత్మైకత్వము". బ్రహ్మాత్మైకత్వ అవగతి(నిర్గుణబ్రహ్మవిద్య=బ్రహ్మసాక్షాత్కారము)ముఖ్యఉద్దేశ్యముగలదై ఉంది. అనగా!విస్తృత ఉత్తరమీమాంసాశాస్త్రములో సగుణనిర్గుణఉపాసనలు మరియు పరపక్షనిరాసాది విచారాంతరముచేస్తూ,బ్రహ్మవిద్యాప్రతిపాదనముచేయబడింది. కాని,ఇక్కడ(ప్రకరణములో)కేవలము నిర్గుణబ్రహ్మవిద్యకు వలసిన తత్సాధన నిరూపణ మాత్రము చేయబడుచున్నందున శాస్త్రైకదేశసంబద్ధమై ఉన్నది. మరి యు,వేదాన్తదర్శనముయొక్క ముఖ్యకార్యము వేదాన్తవాక్యవిచారము, అట్లే,కార్యాన్తరము(గౌణకార్యము అవగతి=బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము)నకుసాధనములను ప్రతిపాదించుటయే ప్రధాన విషయముగలదైయున్నందున(ప్రకరణలక్షణము సమన్వయమగుచున్నందున)ఈగ్రంథము"ప్రకరణగ్రంథము"—అని సిద్ధించినది.

## 7.శాస్త్రము

ప్రసంగవశమున ప్రకరణమంటే యేమిటో తెలుసుకున్నాము.దానికి ఆనుషంగికమగు"**శాస్త్రము**"అను శబ్దార్థమును తెలిసికొనుట అత్యంతావశ్యకము. "**శాసనాచ్ఛాస్త్రమ్**"అథవా"**శిష్యతేఽనుశిష్యతేబోధ్యతేఽనేనాపూర్వోఽర్థః**(అజ్ఞాతోఽ

ర్థః)**ఇతిశాస్త్రం-వేదః,తదుపజీవిస్మృతీతిహాసపురాణాదిచ"** శాసనముచేయునది శాస్త్రమనబడును.శాసనమనగా మనుష్యుణ్ణి ఏదైనా కార్యమునందు ప్రవృత్త ము(ప్రేరణ)చేయుట లేక నివృత్తముచేయుట.వేదాదులు మనుష్యులను స త్కర్మలయందు ప్రవృత్తమగుటకు మరియు అసత్కార్యములనుండి నివృత్త మగుటకు ఆదేశిస్తాయి.అందుకే"శాస్త్రము" అనబడుతాయి.ముఖ్యంగా కర్తవ్య, అకర్తవ్యములను బోధించు గ్రంథవిశేషమునకు శాస్త్రమందురు.ఏదైనా క్రియా నుష్ఠానమునందు పురుషుణ్ణి ప్రేరేపించు(ప్రవర్తక)వాక్యము విధివాక్యమనబ డును.ఉదా:—**"అగ్నిహోత్రంజుహుయాత్స్వర్గకామః"**(మై.సం.1-8-6)**"దర్శపూర్ణమా సాభ్యాం స్వర్గం భావయేత్**"(ఆ.శ్రౌ.సూ.3-14-81),**"యజేతస్వర్గకామః"** స్వర్గమును కోరువాడు అగ్నిహోత్రమను యాగమునునుష్ఠించవలెను.అట్లే ఇంద్రియకాము లు,పుత్రకాములు,స్వారాజ్యకాములు,భూతి(ఐశ్వర్య)కాములు,పశుకాములు, బ్రహ్మవర్చస్కాములు మొదలగువారికి,వారివారి యభీష్టము నెరవేర్చుటకు అనేకకర్మలను విధానముచేసింది శాస్త్రము.మరియు అనర్థ హేతువులగు అసత్కార్యములనుండి విముఖులనుచేసి పాపప్రవృత్తిని ప్రతిఘటించు వాక్య ములు నిషేధవాక్యములనబడును.ఉదా:—**"కలఞ్జం న భక్షయేత్",**(గీతాభాష్యమ్ 13-2)**"సురాంనపిబేత్","మాంసంనభక్షయేత్"**ఇత్యాదులు.కలంజమునుభుజించ గూడదు.ఏవిధమైన మద్యపానము చేయరాదు.మాంసమును భుజించరాదు. (అభక్ష్యభక్షణము,అపేయపానముచేయగూడదు)ఈమొదలగునవి నిషేధవాక్య ములు. కలంజమనగా—

**శ్లో॥విషాక్తేనైవ బాణేన హతౌ యౌ మృగపక్షిణౌ।**

**తయోర్మాంసం కలంజం స్యాచ్ఛుష్కమాంస మథాపి వా॥**(శబ్దశక్తిప్రకాశికా.పృ.411)

అర్థము:—విషముబూసిన బాణముచే కొట్టగా చంపబడిన మృగ(లేడి)మరియు పక్షులయొక్కమాంసమును లేదా శుష్క(ఎండు)మాంసమును కలంజ మందురు.ఉపలక్షణముగా ఎర్రవెళ్ళిపాయలను,మరియే యితర ప్రాణులయొక్క మాంసమునుగూడ భక్షించగూడదని వేదము "కలఞ్జంనభక్షయేత్" అని నిషేధించినది.

కర్తవ్యాకర్తవ్యములను జ్ఞాపకము చేయుచున్నందున **"శాసనాచ్ఛా స్త్రం"** అని చెప్పబడినది.అయితే కేవలము విధినిషేధపరక గ్రంథవిశేషమునకే శాస్త్రమంటారు-అని ఇంతేగాదు,మరేమనగా"**శంసనాత్ శాస్త్రమ్**"ఏదైనా గూఢతత్త్వమును"శంసన్"అనగా ప్రతిపాదించే గ్రంథవిశేషమునకుగూడ శాస్త్రమంటారు. **"ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశతే"**(కఠ.1-3-12)ఈ ఆత్మ సకల ప్రాణులలో నిగూఢమైయున్నందున తెలియబడుటలేదు-అని చెప్పబడినట్లుగా బ్రహ్మతత్త్వమతిగోప్యమైనది.అటువంటి పరమరహస్యమైన బ్రహ్మతత్త్వమును ప్రతిపాదించు వేదాంతములు(ఉపనిషత్తులు)గూడ**"శాస్త్రమ్"**అని చెప్పబడుతాయి.

భామతీకారులగు శ్రీవాచస్పతిమిశ్రులవారు 1-1-4 బ్ర.సూ.లో ఇలాసెలవిచ్చారు.

**అపిచ వేదాన్తానాం వేదత్వాత్ శాస్త్రత్వ ప్రసిద్ధిరస్తి, ప్రవృత్తి నివృత్తి పరాణాం చ సందర్భాణాం శాస్త్రత్వమ్।**

యథాహు:—**ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేన వా।**

**పుంసాం యేనోపదిశ్యేత తచ్ఛాస్త్ర మభిధీయతే॥** (శ్లోకవార్తికము.శబ్దపరి.శ్లో.4)

వేదాన్తవాక్యములు వేదమే అయినందున**"శాస్త్రము"**అనబడును.ప్రవృత్తి నివృత్తిపరక పదసందర్భమే శాస్త్రపరిభాషలోవస్తుంది.నిత్యమగు అపౌరుషేయ

వేదముద్వారాగాని,కృతకము(అనిత్యమగు)పౌరుషేయ స్మృతీతిహాసపురాణాది పదసందర్భముచేతగాని పురుషులను ఏదైనావిషయము(క్రియ)నందు ప్రవృత్తిని లేక ఏదైనవిషయము(అనర్థకారియగుపాపప్రవృత్తి)నుండినివృత్తిని బోధించు పదసందర్భమునకు"**శాస్త్రము**"అంటారు.నిష్కర్షయేమనగా!విధినిషేధములను బోధించునటువంటి మరియు నిగూఢమగు బ్రహ్మతత్త్వమును ప్రతిపాదించు వాక్యసందర్భమునకుగూడ శాస్త్రమందురు. అందువలన మనుష్యులకు శాస్త్రమే ప్రమాణము.

**శ్లో॥శాసనాచ్ఛంసనాచ్చైవ శాస్త్రమిత్యుచ్యతేబుధైః।**

**శాసనం ద్వివిధం ప్రోక్తం శాస్త్రలక్షణవేదిభిః॥**

**శ్లో॥తత్రైకం విధిరూపేణ తదన్యత్ప్రతిషేధతః**

**శంసనం భూతవస్త్వేకవిషయం న క్రియాపరమ్॥**(పరాశర ఉపపు.18-2/3)

అర్థము:—"**శాసనాచ్ఛాస్త్రమ్**"మరియు"**శంసనాచ్ఛాశాస్త్రమ్"**అని రెండు విధములగు వ్యుత్పత్త్యర్థము బుధజనులచే చెప్పబడుచున్నది. అందులో శాసనము పునః రెండుప్రకారములున్నదని శాస్త్రలక్షణము నెఱింగిన శాస్త్రవేత్తలచే చెప్పబడుతుంది. ఒకటి విధిరూపమని,రెండవది ప్రతిషేధరూపమని. శాసనము అనగా ఆదేశించునది. మానవులకు కర్తవ్యాకర్తవ్యములను బోధిస్తూ సత్కర్మలయందు ప్రవృత్తిని,దుష్కర్మలనుండి నివృత్తిని ఆదేశిస్తూ క్రియాసాధ్యములగు లోకపరలోకసంబంధ ఫలములను తెలియజేస్తుంది శాసనాత్మకశాస్త్రము.ఇక శంసనాత్మకశాస్త్రము నిత్యసిద్ధము అనగా క్రియాసాధ్యము కానిదగు బ్రహ్మవస్తువునుమాత్రం బోధిస్తుంది.ఈ శంసనాత్మకశాస్త్రము— వేదాన్తములనబడు ఉపనిషద్భాగము.

**"అపిచ వేదాన్తానాం వేదత్వాచ్ఛాస్త్రత్వ ప్రసిద్ధిరస్తి"** అని శ్రీవాచస్పతి మిశ్రులవారు సూచించిన ప్రకారంగా వేదశిరస్సులగు వేదాన్తములనబడు ఉపనిషత్తులుగూడ వేదమే.కావున శాస్త్రము అని ప్రసిద్ధి. **"శంసనాచ్ఛాస్త్రమ్"** అను వ్యుత్పత్త్యనుసారము వేదాన్తశాస్త్రము అనాద్యజ్ఞానముచే ఆవృతమైన జీవులయొక్క నిజస్వరూపం—ప్రత్యగభిన్నపరబ్రహ్మతత్త్వము క్రియాసాధ్యము కాదంటూ నిషేధిస్తూ కేవలము సమ్యగ్విచారజనిత అప్రతిబద్ధ దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానమను చరమసాక్షాత్కారముచేతమాత్రమే అనుభవగమ్యమను తత్త్వమును బోధిస్తూ,మోక్షమునకు బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమే ఏకైకసాధనమని తెలియజేస్తుంది.

## 8.ప్రమాణము

**"తస్మాచ్ఛాస్త్రంప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ"** ॥(గీత.16-24)

అర్థము:—ఏది కర్తవ్యము,ఏది అకర్తవ్యము అనే వ్యవస్థచేయడంలో నీకు శాస్త్రమే ప్రమాణము.

**తత్ర ప్రమాకరణం ప్రమాణమ్.తత్ర స్మృతివ్యావృత్తం ప్రమాత్వమ్—అనధిగతాబాధితాసన్దిగ్ధార్థవిషయకజ్ఞానత్వమ్.**(వే.పరిభాష)ప్రమకు యేది కరణమో(అసాధారణకారణమో)అది ప్రమాణమనబడును.అట్లే,అనధిగతము(స్వ అవ్యవహిత పూర్వక్షణావచ్ఛిన్నజ్ఞానవిషయభిన్నము)అనగా యేపదార్థముయొక్క జ్ఞానము వర్తమానమునందు కలుగుచున్నదో,ఆ జ్ఞానముకలుగుటకు పూర్వక్షణములో ఆవస్తువుకు సంబంధించిన జ్ఞానములేకుండుట అంటే పురుషునికి ఆపదార్థము ఇంతకుముందు తెలియబడనిదై యుండాలి.మరియు అబాధితమై(జ్ఞానాంతరముచే బాధింపబడనిదై)యుండాలి మరియు ఎలాంటి సం-

దేహములేనిదై యుండాలి.అటువంటి అర్థము(విషయము)నకు సంబంధిం చిన జ్ఞానమునకు“**ప్రమా”**అంటారు.“అయంఘటః”ఇది ఘటము(కుండ)అను జ్ఞానముకలుగుటకు పూర్వము ఆఘటము అనధిగతము(అజ్ఞాతము)న్నది. మరియు“నా యం ఘటః”(ఇది ఘటము కాదు)అను ఘటనిషేధజ్ఞానమునకు విషయమగుటలేదు.అనగా బాధింపబడుట లేదు.అందువల్ల ఆ ఘటము అ బాధితమున్నది.మరియు దానికి సంబంధించిన సందేహంగూడలేదు.కావున **“ప్రమ”** లక్షణము సమన్వయమగుచున్నది.

**“ఇదంరజతమ్”**ఇత్యాకారక భ్రమజ్ఞానమునందు రజతము(ముత్యపుచిప్ప యందు భ్రాన్తిచే కనిపించు వెండి)పూర్వము అనధిగతమై (తెలియబడనిదై) యున్నప్పటికిని,**“నేదంరజతమ్”**ఇత్యాకారక నిషేధజ్ఞానముచే బాధితమగుచు న్నది.అనగా“ఇది రజతము కాదు”అని మిథ్యాత్వనిశ్చయము గావింపబడుచు న్నది. అందుకని, “ప్రమ” లక్షణము భ్రాన్తిస్థలములో అతివ్యాప్తమగుటలేదు. అట్లే,స్మృతికి విషయము అబాధితమున్నప్పటికిని అనధిగతముండదు,మరే మనగా అధిగతమే(పూర్వముతెలియబడినదే)ఉంటుంది. కావున“ప్రమ”లక్షణ ము స్మృతియందుగూడ అతివ్యాప్తియగుటలేదు.

కావున,వేదాన్తశాస్త్రము—అనధిగతము,అబాధితము మరియు అసందిగ్ధార్థ మునగు ప్రత్యగభిన్నబ్రహ్మముయొక్క ప్రమ అనగా యథార్థజ్ఞానమును కలుగ జేయుటకు అసాధారణకారణము(సాధనము)న్నందున ప్రమాణముగా స్వీకరిం పబడినది మరియు“**అజ్ఞాతార్థజ్ఞాపకం ప్రమాణమ్**”అను“ప్రమాణ” లక్షణము గూడ వేదాన్తశాస్త్రమునకు ఘటించుచున్నది.

కర్తవ్యాకర్తవ్యములను బోధించు విధినిషేధాత్మక వేదభాగము,పంచాగ్ని విద్య,దహరవిద్య,సంవర్గవిద్య,వైశ్వానరవిద్య,శాండిల్యవిద్య—ఇత్యాది ఉపాసనల

ను బోధించు వేదభాగము,అట్లే,స్మృతీతిహాసపురాణాదులుగూడ శాస్త్రములేయని తెలిసికుంటూ వచ్చాము.అందువల్లనవియును ప్రామాణికములే.ఎందుకంటే వాటియందుగూడ"అనధిగతాబాధితాసందిగ్ధార్థబోధకత్వమ్"అను"ప్రమాణ"లక్షణము ఘటిల్లుచున్నది. వీటిచే బోధింపబడు స్వారాజ్యప్రాప్తి, సంతానప్రాప్తి, ఐశ్వర్యప్రాప్తి ఇత్యాది లౌకికఫలములు మరియు స్వర్గాది పరలోకసంబంధమగు ఫలములు వ్యవహారదశలో అబాధితములు.శ్రీశంకరాచార్యులకు పూర్వీకులైన,బ్రహ్మవేత్తయగు సుందరపాండ్య అను ప్రాచీనాచార్యులు ఈ క్రిందివిధంగా చెప్పియున్నారు.

**శ్లో॥దేహాత్మప్రత్యయో యద్వత్ ప్రమాణత్వేన కల్పితః।**

**లౌకికం తద్వదేవేదం ప్రమాణంత్వాత్మనిశ్చయాత్॥** (బ్ర.సూ.భాష్యము 1-1-4చివరలో)

అర్థము:—దేహమే ఆత్మ అనే జ్ఞానం భ్రాన్తి మూలకమే అయినా వ్యవహారానికి సంబంధించినంతవరకు అది ప్రమాణముగా ఎట్లు వైదికులచేత ప్రతిపాదించబడినదో,అట్లే ఔపనిషదులకుగూడా ఈలౌకికవ్యవహారమంతా ఆత్మసాక్షాత్కారంకలిగే వరకు ప్రమాణమే.పారమార్థిక సత్తచేత కాదు."**వేదా అవేదా భవన్తి**"(బృ.4-3-22)వేదములు అవేదములగుచున్నవి."**లోకాఅలోకా భవన్తి**"(బృ.4-3-22)లోకములుఅలోకములగుచున్నవి."**యత్రత్వస్యసర్వమాత్మైవాభూత్తత్కేన కంపశ్యేత్**"(బృ.4-4-15)బ్రహ్మసాక్షాత్కారానన్తరం జ్ఞానిదృష్టిలో సర్వము ఆత్మయే(తానే)అయినదశలో ఏసాధనముచే దేనిని చూడగలడు?అనగా సమస్తదేహాదికప్రపంచము బాధింపబడును."**బాధ**✷ =మిథ్యాత్వనిశ్చయము"అనిఅర్థము.

✷ శ్లో॥సాక్షాత్కృతేత్వధిష్ఠానే సమనంతరనిశ్చితిః। అధ్యస్యమానం నాస్తీతి బాధ ఇత్యుచ్యతే బుధైః॥(వేదాన్తసిద్ధాన్తముక్తావళి-కారికా40);సోపాధికం వా నిరుపాధికం వా పూర్వం ప్రతీతిర్యదిహ

స్తి తస్య,జ్ఞానాంతరాసత్త్వతయా ప్రతీతిః స బాధఇత్యుక్తఇహ ప్రవీణైః॥(స్వానుభవాదర్శః 64) అధిష్ఠాన జ్ఞానోత్తరక్షణములో ప్రతిపన్న ఉపాధియందు అధ్యస్యమానమగు జగత్తు మూడు కాలములలో అత్యంతాభవమున్నదను నిశ్చయజ్ఞానము కలుగుతుంది. ఈ అజ్ఞానతత్కా ర్యముయొక్క త్రైకాలికాభావనిశ్చయమునకే విజ్ఞులచే"బాధ"అని చెప్పబడుచున్నది.అన గా,అధిష్ఠానసాక్షాత్కారానంతరము(సోపాధికము లేక నిరుపాధికమునగు)అధ్యస్త పదార్థ మనునది ఏమీ లేదు అను నిశ్చయమునకే "బాధ" లేక "బాధము" అంటారు.

**"యత్రహి ద్వైతమివ భవతి తదితర ఇతరంపశ్యతి"**(బృ.4-4-15)కాని, సంసారదశలోమాత్రము లోకలోకాంతరములతోసహితమగు సంపూర్ణప్రపంచ ము అబాధితము."ఎక్కడ ద్వైతము—సత్యమువలె తోచునో అక్కడే ఒకరు మరొక దానిని చూచెదరు".

కావున,వేదస్మృతీతిహాసపురాణాది సకలశాస్త్రముల పరమతాత్పర్యము బ్రహ్మాత్మైకత్వప్రతిపాదనమునందే ఉన్నందున వ్యవహారదశలో ప్రమాణములే. అందుకే"**తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యావ్య వస్థితౌ**"అనంటూ శ్రీకృష్ణ పరమాత్మ శ్రీమద్భగవద్గీత 16-24 లో సెలవిచ్చియున్నారు.

**"అజ్ఞాతజ్ఞాపకం ప్రమాణమ్"**అని చెప్పబడిన ప్రకారము మనుష్యులకు ప్రత్యక్షానుమానములకు అగమ్యములగు [15]ప్రేయస్సు,*శ్రేయస్సులగు స్వర్గ, మోక్షములగూర్చి బోధిస్తుంది—ప్రమాణభూతమగు శాస్త్రము(వేదము). పూర్వ మీమాంస వార్తికకారులగు శ్రీకుమారిలభట్టుగారు ఇలా చెప్పియున్నారు.

[1] *విషయాభిముఖ్యేన ఉదేతీత్యభ్యుదయో విషయాధీనం సుఖం స్వర్గాదికమ్।నిత్యం నిరపేక్షం శ్రేయో నిఃశ్రేయసం—మోక్షః।(రత్నప్రభ)

వేదము అనగా—**శ్లో॥ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే।**

**ఏనం విదన్తి వేదేన తస్మాద్వేదస్య వేదతా॥**

అర్థము:—ప్రత్యక్షప్రమాణముచేతగాని,అనుమానప్రమాణముచేతగాని(స్వర్గ, మోక్షములకుసంబంధించిన)ఏఉపాయము=సాధనము తెలియ బడదో,(దానిని)ఆఉపాయమును వేదము తెలియజేస్తుంది.అదియేవేదముయొక్క వేదత్వము.(విద=జ్ఞానే=తెలిసికొనుట)అలమితివిస్తరేణ. అథ ప్రకృతమనుసరామః.

**తతః అన్యాంశ్చ సనకసనన్దనాదీనుత్పాద్య నివృత్తిలక్షణం ధర్మం జ్ఞానవైరాగ్య లక్షణం గ్రాహయామాస।ద్వివిధో హి వేదోక్తో ధర్మః ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణః చ॥**(శ్రీమద్భగవద్గీతా ఉపోద్ఘాతభాష్యమ్)

తరువాత సనక-సనందనాదులను సృష్టించి వారికి జ్ఞానం వైరాగ్యం అనే స్వరూపముగల నివృత్తిలక్షణధర్మమును బోధించాడు—భగవంతుడు.ఆయా వర్ణాశ్రమములకు శాస్త్రముచే విధానముచేయబడిన కర్మలను ఆచరించుట యను ప్రవృత్తిలక్షణమను ధర్మమును మరియు వాటినుండి విరమించి జ్ఞాన మార్గమునవలంబించుటయను నివృత్తిలక్షణమను ధర్మమును లోకహితార్థము ప్రకటముజేసెను.

**శ్లో॥సంసారమేవ నిఃసారం దృష్ట్వా సారదిదృక్షయా।**

**ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః॥**

**ప్రవృత్తిలక్షణం కర్మ జ్ఞానం సన్న్యాసలక్షణమ్।**

**తస్మాజ్జ్ఞానం పురస్కృత్య సన్న్యసేదిహ బుద్ధిమాన్॥**(నారదపరి.3-15,16)

**శ్లో॥కర్మణా బధ్యతే జన్తుర్విద్యయా చ విముచ్యతే।**

**తస్మాత్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః॥**(సన్న్యాసోపనిషత్ 2-18)(శాం.ప.241-7)

సంసారము సారహీనమైనదని చూచి,పరమవైరాగ్యమునాశ్రయించి వివేకి పురుషులు సారభూతవస్తువగు ఆత్మతత్త్వమునెఱుంగదలచి వివాహము చేసి కొనకుండా "**బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ అథవా యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్**"(జాబాలదర్శనోపనిషత్ 4)అని చెప్పబడినట్లు బ్రహ్మచర్యమునుండియే సన్యసించెదరు.కర్మ ప్రవృత్తిమార్గము(ప్రేయోమార్గము),సన్యాసము జ్ఞానమార్గము(శ్రేయోమార్గము-మోక్షమార్గము).జీవుడు కర్మచేత బంధింపబడును,జ్ఞానముచేత బంధవి ముక్తుడగును.అందువలన,తత్త్వమునెఱిగన యతులు సర్వకర్మలను విధిపూర్వకముగా విడిచిపెట్టుదురు(సన్యసించెదరు).

**కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోకః ఇతి। తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి॥**(బృ.4-4-22)

ప్రజలతో(సంతనానముతో)మాకేమి ప్రయోజనము?మోక్షకాములమగు మాకు ఆత్మలోకమే అభీష్టమున్నది—అని యిట్లు ముముక్షుపురుషులు పుత్రేషణమునుండి,విత్తేషణమునుండి,లోకేషణమునుండి పైకిలేచి భిక్షాచర్యమును స్వీకరింతురు(సన్యసించెదరు).

**"పరీక్ష్యలోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతఃకృతేన।**

**తద్విజ్ఞానార్థంస గురమేవాభిగచ్ఛే త్సమిత్పాణిః శోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥"**

(ముం.1-1-12)"**యత్కృతకం తదనిత్యమ్**" ఏదికర్మజన్యమో అది అనిత్యము అను న్యాయానుసారము,లోకలోకాన్తరములలోని ఫలోపభోగములన్నియును కర్మసాధ్యములు గనుక అనిత్యములే(అశాశ్వతములే)అనిబాగుగా విచారిం

చి వాటిపట్ల పరమవైరాగ్యమును పొంది,కేవల మోక్షకామియగు అధికారి పురుషుడు బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముకొఱకు శ్రోత్రియుడు మరియు బ్రహ్మని ష్ఠుడు అయిన సద్గురుదేవుని శరణాగతినొంది,వారియొక్క ముఖారవింద మునుండి తత్త్వమస్యాదివాక్యరూప వేదాన్తశాస్త్రమును శ్రుతిషడ్లింగసహిత ముగ శ్రవణాదులు చేస్తాడు.విధినిషేధరూప సమస్తకర్మలను శాస్త్రోక్తప్రకారము గా పరిత్యజించి కేవలము వేదాన్తశాస్త్రమునే ఆశ్రయిస్తాడు.

పైశ్రుతిస్మృతులలో చెప్పబడినరీతిగా మోక్షకామియగు యే అధికారిపురుషుడు శ్రద్ధాభక్తిపురస్సరముగా వేదాన్తశాస్త్రమును మరియు సద్గరువులను ఆశ్రయించి యే ప్రత్యగభిన్నపరబ్రహ్మతత్త్వమును దెలిసికొని జన్మమరణరూప సంసారమునుండి ముక్తుడగుటకు ఇచ్ఛగించుచున్నాడో, ఆ వేదాన్త శాస్త్రమునకు అనుబన్ధములేమిటి? వేదాన్తశ్రవణమునకు అధికారి యెవరు?అధికారి కర్తవ్యమేమిటి? గురులక్షణములేమిటి? గురుసేవా ప్రకారమెట్టిది? ఈమొదలగు సమగ్ర విషయములను తెలిసికొనుట ముముక్షువులకు అత్యంతావశ్యకమై యున్నది.కావున,పై విషయములను సత్పురుషుల అడుగుజాడలననుసరిస్తూ యథామతిగా సవిస్తరముగా తెలిసికొనుటకు ప్రయత్నించెదము.

ॐ

## 9.మంగళాచరణము

**ॐ ప్రత్యక్ప్రమాణకమసత్యపరాక్ప్రభేదం,**

**ప్రక్షీణకారణవికారవిభాగమేకమ్।**

**చైతన్యమాత్రపరమార్థనిజస్వభావం,**

**ప్రత్యఙ్ప్రమచ్యుతమహం ప్రణతోఽస్మి నిత్యమ్॥**(సంక్షేపశారీరకము 1-3)

ప్రత్యక్స్వరూపమే దేనియందు ప్రమాణమో,పరాగ్రూప బుద్ధి,ఇన్ద్రియ,ప్రపంచ బేదము దేనియందు సర్వథా అసత్యమో(బాధితమో);మాయా,ఆకాశాది కార్య కారణవిభాగము జ్ఞానముచేత దేనియందు బాధింపబడుచున్నవో;చైతన్యస్వ రూపమే దేనియొక్క వాస్తవస్వరూపమో;ఏకమై ప్రత్యగాత్మచేనభిన్న అచ్యుతస్వ రూపమగు యే పరమపదము గలదో,దానికి నేను ప్రతినిత్యము ప్రణమిల్లు చున్నాను.

"ఏకమ్" అను విశేషణయుక్త ప్రత్యక్ మరియు అచ్యుత శబ్దములచే ఏకవిభక్తిబలముచే జీవబ్రహ్మల ఏకత్వమను మహావాక్యార్థరూప అఖండార్థము వ్యక్తమగుచున్నది.సత్యజ్ఞానాది విభిన్న పదముల వాచ్యార్థములలో ఏకత్వము సంభవించనప్పటికినీ లక్ష్యభూత చైతన్యమాత్రము అభిన్నమే. "**చైతన్యమాత్రమే వ పరమార్థోఽత్యన్తాబాధ్యః,పరమానన్దరూపత్వాత్, పరమప్రయోజనరూపత్వాత్, అనౌపాధికస్వభావత్వాద్వా**"।పరాగ్రూపమగు బాహ్య దేహాదికప్రపంచము(మా యా తత్కార్యరూప)దృశ్యవర్గము అత్యన్త అసత్(బాధితము)గావున ప్రత్యగభి న్నపరమాత్మయొక్క అద్వితీయత్వమునకు హాని లేదు.అందువల్ల కార్యకార

ణవిభాగరహిత నిర్వికార అఖండైకరస మహావాక్యార్థరూప ప్రత్యగభిన్నపరమాత్మ(నిర్గుణవస్తువు)యొక్క స్మరణాత్మక మంగళము చేయబడినది.

1.జీవబ్రహ్మల ఏకత్వము సకలవేదాన్తములకు(ఉపనిషత్తులకు)ప్రతిపాద్య విషయము."**అజ్ఞాతబ్రహ్మవిషయం జ్ఞాతం బ్రహ్మ ప్రయోజనమ్**"అను అభియుక్తోక్తి ప్రకారము అజ్ఞానకాలంలో వేదాన్తప్రతిపాద్య విషయమే జ్ఞానోత్తరకాలంలో ప్రయోజనమౌతుంది.మోక్షరూప ప్రయోజనము మరియు బ్రహ్మవస్తువు ఈ రెండు భిన్నములుకావు.2.సర్వానర్థ అత్యన్తనివృత్తి బ్రహ్మానన్ద ప్రాప్తి యేది గలదోఅదియే(మోక్షము)ప్రయోజనము.3.ప్రయోజనప్రాప్తికామోఽధికారి.4.సంబన్ధము యథాయోగ్యమూహనీయము.పై మంగళశ్లోకంలో ప్రత్యక్ మరియు అచ్యుత శబ్దములచే జీవబ్రహ్మైక్యరూప విషయము సూచింపబడినది.తదాధారముగా అనుబన్ధచతుష్టయమును ఊహించవలయును.ఈ అనుబన్ధచతుష్టయ నిరూపణమే ప్రకృత గ్రంథముయొక్క ప్రతిపాద్య విషయము.

**ఓం ఓంకారరూపం త్ర్యహమితి చ పరం యత్స్వరూపం తురీయం,**

**త్రైగుణ్యాతీతనీలం కలయతి మనసస్తేజసింధూరమూర్తిమ్।**

**యోగీంద్రా బ్రహ్మరంధ్రే సకలగుణమయం శ్రీహరేంద్రేణ సంగం,**

**గం గం గం గం గణేశం గజముఖమభితో వ్యాపకం చిన్తయన్తి॥**

ప్రణవస్వరూపుడును,త్రిగుణాత్మకమగు ప్రకృతికి పరమైనవాడును,తురీయరూపుడును,మనస్సును ప్రకాశింపజేయువాడును,తేజోరూపు డును,సింధూరకాంతిగలవాడును,సకలకళ్యాణ గుణమయుడును,గజ ముఖుడును,సర్వవ్యాపియునగు విఘ్నేశ్వరుని యోగులు బ్రహ్మరంధ్రమున పరబ్రహ్మైక్యము కొఱకై

ధ్యానించుచున్నారు.(సంకష్టహరణ గణేశాష్టకమ్ 1)

**శ్లో॥వంశీవిభూషిత కరాన్నవనీరదాభాత్,**

**పీతాంబరాదరుణబింబఫలాధరోష్ఠాత్।**

**పూర్ణేందుసుందరముఖాదరవిందనేత్రాత్**

**కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం న జానే॥**(శ్రీమద్భగవద్గీత మధుసూదని 15-20; 18-78)

ఎవని చేతులు మురళిచే సుశోభితమైయున్నవో,ఎవని శరీరము జలపూరితమేఘమువలె నీలవర్ణము గలదియో,ఎవడు పీతాంబరమును ధరించినవాడో,ఎవడు ఎర్రని దొండపండువలె అధరోష్ఠము(పెదవులు)గల వాడో,ఎవని ముఖము పూర్ణచంద్రునివలె సుందరమైనదో,ఎవడు కమలములవంటి నేత్రములు గలవాడో,అటువంటి సర్వోత్కృష్టమైన శ్రీకృష్ణునికంటె అన్యమగు తత్త్వమును నే నెఱుగను.

**శ్లో॥శ్రీవిద్యాం శివవామభాగనిలయాం హ్రీంకార మంత్రోజ్వలాం**

**శ్రీచక్రాంకిత బిందుమధ్యవసతీం శ్రీమత్సభానాయికామ్।**

**శ్రీమత్ షణ్ముఖ విఘ్నరాజజననీం శ్రీమజ్జగన్మోహినీం,**

**మీనాక్షీం ప్రణతోఽస్మి సంతతమహం కారుణ్యవారానిధిమ్॥**

ఎవరు శ్రీవిద్యాస్వరూపిణియు,భగవంతుడగు శంకరునియొక్క వామ (ఎడమ)భాగమున విరాజమానమైనదియు,"హ్రీం"అను బీజమంత్రముచే సుశోభితమైనదియు,శ్రీచక్రబిందుమధ్యమున నివసించునదియు,దేవసభకు అధినేత్రి

యును,శ్రీషణ్ముఖస్వామి(కార్తికేయుడు)మరియు విఘ్నేశ్వరులకు తల్లియు,జగత్తును మోహింపజేయునదియు,భక్త అభక్తులపట్ల సముద్రములాంటి కరుణగలదియునగు శ్రీమీనాక్షీదేవికి నిరంతరము వందనమాచరించుచున్నాను.

**శ్లో॥శుక్లాం బ్రహ్మవిచారసారపరమామాద్యాం జగద్వ్యాపినీం,**

**వీణాపుస్తకధారిణీమభయదాం జాడ్యాన్ధకారాపహామ్।**

**హస్తేస్ఫాటికమాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం,**

**వన్దే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదామ్॥**

శ్వేతవర్ణముగల్గిన,సంపూర్ణచరాచర జగత్తును వ్యాపించియున్న ఆదిశక్తియు, పరబ్రహ్మవిచారమునకు పరమ అవధిభూతమును,సకలభయములనుండి అభయదాత్రియును,అజ్ఞానాన్ధకారమును పోగొట్టునదియును,తనచేతులలో వీణా, పుస్తకము మరియు స్పటికమాలను ధరించునదియును,పద్మాసనమున విరాజమానమైనదియును,సర్వైశ్వర్యముల చేనలంకృతమైనదియును మరియు సద్బుద్ధిప్రదాత్రియునగు భగవతిశ్రీశారదాదేవికి(సరస్వతీదేవికి)ప్రణమిల్లుచున్నాను.

**శ్లో॥జ్ఞానానన్దమయందేవం నిర్మలస్ఫటికాకృతిమ్।**

**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥**

**శ్లో॥అతీతవైరాగ్యమఖండబోధః,కదా ను మే సిద్ధ్యతి హే దయాళో।**

**సమాధియోగస్య పరస్యనిష్ఠా, సర్వేషుభూతేషు సమత్వ బద్ధిః॥**

పరమదయాస్వరూపుడవగునో పరమాత్మా!అతీతమగు వైరాగ్యము,అఖండమగు బోధ,ఉత్తమమగు సమాధియోగనిష్ఠ,సమస్తప్రాణులయెడల సమభావము నాకెప్పుడు సిద్ధించును?

**శ్లో॥యస్యప్రసాదాదహమేవ సర్వం మయ్యేవసర్వం పరికల్పితం చ।**

**ఇత్థం విజానామి సదాత్మరూపం తస్యాంఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్॥**

ఎవరియొక్క అనుగ్రహముచే "ఈసమస్తము నేనే,నాయందే ఈసమ స్తము కల్పింపబడినది"అని ఈప్రకారముగా సద్రూపఆత్మను యెఱుగుచున్నానో, అట్టి శ్రీగురుదేవుల పాదపద్మములకు సదా ప్రణమిల్లుచున్నాను.

**శ్లో॥ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే।**

**వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః॥**

నిర్గుణము,నిరాకారము,ఆకాశమువలెసర్వవ్యాపకదేహము(స్వరూపము) గల్గియును,ఈశ్వరుడు,గురువు మరియు ఆత్మ—ఈముగ్గరు మూర్తులుగ(సగుణసాకారముగా) ప్రకటమైన శ్రీదక్షిణామూర్తి గురుదేవులకు నమస్కారము.

**శ్లో॥అవధూతసదానన్ద పరబ్రహ్మస్వరూపిణే।**

**విదేహదేహరూపాయ దత్తాత్రేయమహం భజే॥**

**శ్లో॥కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితేరతమ్।**

**వేదాబ్జభాస్కరం వన్దే శమాదినిలయం మునిమ్॥**

**శ్లో॥వక్తారమాసాద్య యమేవ నిత్యా,సరస్వతీ స్వార్థసమన్వితాసీత్।**

**నిరస్తదుస్తర్కకళంకపంకా నమామి తం శంకరమర్చితాంఘ్రిమ్॥**

(సంక్షేపశారీరకము 1-7)

నిత్యా=వేదవాణి(సరస్వతి)యే ఏకైక వ్యాఖ్యాతనుజేరి సమస్త కుతార్కికాది కళంకరూపపంకము(బురద)నుండి ముక్తురాలాయెనో,మరియు తన

వాస్తవిక అర్థయుక్తయై సార్థక్యమునొందెనో అనగా యే వ్యాఖ్యాతచే వ్యావహారిక దృష్టిచేత కర్మకాండము మరియు పారమార్థికదృష్టిచేత జ్ఞానకాండముయొక్క ప్రామాణికత్వము రక్షింపబడెనో,తం అర్చితాంఘ్రిం శంకరం నమామి=అటువంటి పూజ్యచరణులగు శ్రీశంకరాచార్యులకు నమస్క రించుచున్నాను.

**శ్లో।।శుష్కవేదాన్తదన్తీశ బృన్దసంతాపహారిణే।**

**అసంగానన్దయోగీన్ద్రో గురుర్విజయతే తరామ్।।**

**శ్లో।।విద్యాప్రకాశనామానం వేదవేదాన్తకోవిదమ్।**

**గీతాతత్త్వప్రబోద్ధారం సద్గురుం ప్రణతోఽస్మ్యహమ్।।**

**శ్లో।।సదాశివసమారమ్భాం శంకరాచార్య మధ్యమామ్।**

**అస్మదాచార్యపర్యన్తాం వన్దేగురుపరంపరామ్।।**



## 10.అనుబంధ చతుష్టయము

ఏశాస్త్రముయొక్క అభిప్రాయమును సంక్షేపముగా తెలియజేయు ఉద్దేశ్య ముతో ప్రకరణము ప్రవృత్తమైనదో,ఆ శాస్త్రముయొక్క"అనుబంధము"లే గల్గి యుండుట ప్రకరణగ్రంథముయొక్కవైశిష్ట్యము."వేదాన్తసారము"అను గ్రంథా రంభమున శ్రీసదానన్దయతీన్ద్రులవారుగూడ ఇలాచెప్పియున్నారు.**"అస్య వేదా న్తప్రకరణత్వా త్తదీయైరేవానుబంధై స్తద్వత్తాసిద్ధే ర్నతే పృథగాలోచనీయా"।**

ఈగ్రంథము వేదాన్తదర్శనముయొక్క ప్రకరణము.గావున,వేదాన్తశాస్త్ర మునకు యే అనుబంధచతుష్టయము గలదో,అదియే యీప్రకరణ గ్రంథము నకుండును.అందువలన అనుబంధచతుష్టయమును ఈప్రకరణ గ్రంథమున కు వేరుగా చెప్పనక్కరలేదు.ఏ శాస్త్రైకదేశసంబద్ధమై ఏ ప్రకరణముండునో,ఆ ప్రకరణగ్రంథమునకు ఆశాస్త్రీయ అనుబంధములుగలిగియుండుట యుక్తము. లేనిచో శాస్త్రమునకు మరియు ప్రకరణమునకు భిన్నభిన్నవిషయాదులుం డినయెడల శాస్త్రముతో సంబంధములేనిదై(ప్రకరణమునకు)అసంబద్ధప్రలాప మను దోషము ప్రసక్తమగును.

అయితే;ప్రకరణము శాస్త్రీయ అనుబంధముగలదై యుండునను విషయ ము శాస్త్రవిదులెఱుంగుదురు.కాని,శాస్త్రీయ విషయాద్యనభిజ్ఞులగు సామాన్య జిజ్ఞాసువులు ప్రకరణమునందెట్లు ప్రవృత్తులగుదురను శంకప్రాప్తించగా అను బంధచతుష్టయమును అవశ్యముగా చెప్పవలసిన ప్రసక్తి యేర్పడుతుంది. పూర్వమీమాంసావార్త్తికకారులగు శ్రీకుమారిలభట్టుగారు తమ శ్లోకవార్త్తికము ప్రతిజ్ఞాసూత్రమునకు పండ్రెండు మరియు పదిహేడవ పద్యములలో ఈ క్రింది విధముగా సూచించారు.

**శ్లో॥సర్వస్యైవహి శాస్త్రస్య కర్మణో వాపి కస్యచిత్।**

**యావత్ప్రయోజనం నోక్తం తావత్తత్కేన గృహ్యతే॥**

**శ్లో॥సిద్ధార్థం జ్ఞాతసంబంధం శ్రోతుం శ్రోతా ప్రవర్తతే।**

**శాస్త్రాదౌ తేన వక్తవ్యః సంబంధః సప్రయోజనః॥**

అర్థము:—కర్మశాస్త్రముగాని మరియే యితరశాస్త్రముగాని(శాస్త్రముయొక్క) ప్రయోజనం చెప్పనంతవరకు దానియందు యెవరును ప్రవృత్తులుకాజాలరు. శ్రోతాపురుషునికి యేశాస్త్రముయొక్క ప్రయోజనము మరియు సంబంధము జ్ఞాతమైయుండునో,ఆ శాస్త్రమునే శ్రవణముచేయుటకు ప్రేక్షావత్పురుషుడు(వివేకి)ప్రవృత్తుడగును.అందువలన శాస్త్రకర్తయగు విద్వత్పురుషుడు శాస్త్రముయొక్క ఆదియందు(శాస్త్రారంభమున)శ్రోతృపురుషప్రవృత్త్యర్థము శాస్త్రప్రయోజనము మరియు సంబంధమును అవశ్యముగా సూచించాలి. అనగా,అనుబంధచతుష్టయమును తెలుపాలియని అర్థము.

**శ్లో॥ప్రయోజనం సంప్రవృత్తేః కారణం ఫలలక్షణమ్।**

**ప్రయోజనమనుద్దిశ్య మన్దోఽపి న ప్రవర్తతే॥**(స.వే.సి.సా.సం. 11)

అర్థము:—ఫలలక్షణమ్=ఫలమురూప ప్రయోజనము-కార్యమునందు సమ్యక్ప్రవృత్తికి హేతువౌతుంది.ఫలమునపేక్షించకుండా ఎంత మందబుద్ధిగలవాడు గూడ యేకార్యమునందు ప్రవృత్తుడుకాడు.

అట్లే,శ్రీయాస్కమునీంద్రులవారుగూడ వారి నిరుక్తము(3-1-7)లో“**మనుష్య**” శబ్దమును నిర్వచిస్తూ“**మత్వా కర్మాణి సీవ్యతీతి మనుష్యః**”అనిచెప్పారు.మనుష్యుని స్వభావమేమిటంటే—యేకార్యము(పనిని)గూడ ముందుగా విచారించకుండా(ఆలోచించకుండా)చేయుటకు తలపెట్టడు.ఇది లోకంలో అనుభవముగూడ ఉంది.మనుష్యుడు ఎప్పుడైతే,ఈ(అముక)కార్యము చేయుటవలన

నాకు ఇష్టసాధనమౌతుంది(నాఅభీష్టసిద్ధికి హేతువౌతుంది)"ఇదంమదిష్టసాధనమ్"అని,మరియు ఈ(అముక)కార్యమును(పనిని)చేయుటకు నేను సమర్థుడను(నేనుచేయగలను)"ఇదంమత్కృతిసాధ్యమ్"అను నిశ్చయానికొస్తాడో,అప్పుడే ఆకార్యమునందు ఉత్సాహముతో ప్రవృత్తుడౌతాడు(చేయుటకు పూనుకుంటాడు).లేనిచో ఆ కార్యమును చేయుటకు ముందుకు రాడు. పై రెండు ప్రకారముల—అనగా,"ఇదంమదిష్టసాధనమ్"మరియు"ఇదంమత్కృతిసాధ్యమ్" అను జ్ఞానముచేత అనుబంధచతుష్టయము అనాయాసముగా బోధపడుతుంది."ఇదమ్"శబ్దముచేత"విషయము"."మత్"శబ్దముచేత"అధికారి";"ఇష్ట"శబ్దముచేత"ప్రయోజనము"(ఫలము)మరియు"సాధన-సాధ్య"శబ్దములచేత"సంబంధము"యొక్కజ్ఞానము కల్గుతుంది.1.అధికారి,2.విషయము,2.ప్రయోజనము, 4.సంబంధము అను ఈనాలుగు కలిసి"అనుబంధచతుష్టయము"అనబడును.

**"గ్రంథప్రవృత్తి ప్రయోజక జ్ఞానవిషయత్వమ్-అనుబంధత్వమ్"**.గ్రంథమునందు ప్రవృత్తిచేయగల(ఇదంమదిష్టసాధనమ్,ఇదంమత్కృతిసాధ్యమ్)అను జ్ఞానమునకు విషయీభూతములగు ఉపరోక్త విషయాదులు నాలుగు అనుబంధములగును.ఈ అనుబంధచతుష్టయజ్ఞానము కలిగినపిదపయే ప్రేక్షావత్పురుషుడు(వివేకి)గ్రంథమునందు నిస్సందేహంగా ఉత్సాహముతో శ్రవణాదులు చేయుటకు ప్రవృత్తుడగును.

**శ్లో||అధికారీ చ విషయః సంబన్ధశ్చ ప్రయోజనమ్|**

**శాస్త్రారమ్భఫలంప్రాహురనుబన్ధచతుష్టయమ్||**

అధికారి,విషయము,సంబన్ధము మరియు ప్రయోజనము అను యీ అనుబన్ధములు నాల్గును శాస్త్రారంభమను ఫలమునకు నిమిత్తమని పండితులు వచించుచున్నారు.(అనగా ఎచట యీఅనుబన్ధ చతుష్ట యముండునో అచటనే

శాస్త్రమునారంభించవలయునని పండితులు నుడువుచున్నారు).ప్రాయికముగా యీఅనుబన్ధచతుష్టయమును బట్టియే ముముక్షువులు(పాఠకులు)గ్రన్థమునందు నిశ్శంకముచే ఉత్సాహముతో ప్రవృత్తులగుదురు.(సర్వవేదాన్తసిద్ధాన్తసార సంగ్రహము 7).

## 11.అధికారి వర్ణనము

1.అధికారి:—**"మలవిక్షేపరహితత్వేసతి సాధనచతుష్టయసంపన్నత్వే సతి స్వస్వరూపాఽజ్ఞానవాన్—అధికారీ"**ఎవరియందు మలదోషముగాని,విక్షేప దోషముగాని లేవో,స్వస్వరూప అజ్ఞానము మాత్రముగలదో మరియు సాధనచతుష్టయసంపత్తి (వివేకము, వైరాగ్యము, షట్ సంపత్తి మరియు ముముక్షుత్వము) గల్గియుండునో,అతడు వేదాన్త శాస్త్రవిచారమునకు "అధికారి" యగును.

ఈఅభిప్రాయమునే వ్యక్తీకరిస్తూ శ్రీసాధునిశ్చలదాసుస్వామీజీగారు **"శ్రీవిచార సాగరము"**న అధికారి లక్షణమును ఇలా చెప్పియున్నారు.

హిందుస్థానీ దోహా:— **మలవిచ్ఛేప జాకే నహి,కింతు ఏక అజ్ఞాన।**

**షై చవ సాధన సహిత నర, సోఽధికృత మతిమాన ॥**

అట్లే,శ్రీవేదాన్త బాలబోధములో శ్రీపండిత పీతాంబరజీగారుగూడ చెప్పారు :—

హిందుస్థానీ దోహా:— **నాన్యో మల విక్షేప జిస,శేషరహ్యో అజ్ఞాన।**

**సాధనచవ సంయుక్త జో,సో అధికారీ జాన॥**

ఎట్లు,స్థూల శరీరములో—వాత, పిత్త మరియు కఫరూప దోషము లుండునో, వాటి నివారణార్థము ధన్వంతరిఋషి, చరకముని,ఆచార్య సుశ్రుత,వాగ్భట్ మొదలగు వారు ఆయుర్వేద శాస్త్రమును చెప్పియున్నారో,అట్లే అంతఃకరణము

నందు(సూక్ష్మశరీరములో)గూడ మలదోషము,విక్షేపదోషము మరియు ఆవరణ దోషము(అజ్ఞానము)అను మూడు దోషములుండును. వాటి నివారణార్థము కర్మకాండము,ఉపాసనాకాండము మరియు జ్ఞానకాండాత్మక చతుర్వేదము లను పరమేశ్వరుడు ప్రకటముచేసెను."**అస్యమహతోభూతస్య నిశ్వసితమేతద్ ఋగ్వేదో యజుర్వేదః సామవేదో$థర్వాఙ్గీరసః**"(బృ.2-4-10)

## 12.మలదోషము

మలదోషమనగా పాపదోషము.దీనిసే అధర్మము,అపూర్వము మరియు అదృష్టము అనిగూడ పర్యాయముగా చెప్పారు. ఇది జన్మాంతరములలో చేయబడిన అశుభకర్మలచే గలిగిన అతిశయ సూక్ష్మసంస్కారవిశేషము,అప్ర త్యక్షము.కాని,యే పురుషుడు నిషిద్ధకర్మలుచేయుటకు లేక శబ్దాది విషయా లను పొందుటకు ఇచ్చచేయునో,అతని అంతఃకరణములో "మలదోషము"న్నద ని అనుమానము చేయవచ్చును.

**శ్లో|| యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి|**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ||** (గీతా.2-52)

హే అర్జునా!నీవు ఈశ్వరార్పణబద్ధితో నిష్కామకర్మలు చేయగా చేయగా ఎప్పుడైతేనీబుద్ధిలోని(అంతఃకరణములోని)మోహాత్మక=అవివేకము వలనగల్గి న అహంమమాభిమానరూపమగు(అట్లే రాగము,ద్వేషము,కామము,క్రోధము మొదలగు)కాలుష్యము పరిత్యజింపబడునో,అనగా రజోగుణ తమోగుణరూప మలము నివృత్తమై కేవలశుద్ధసత్త్వభావమును పొందుదువో,అప్పుడు ఇంకా వినదగిన అగ్నిహోత్రాదికర్మలకుఫలరూపమైన స్వర్గాదివిషయములకు సంబం ధించిన వైరాగ్యమును మరియు అధ్యాత్మశాస్త్రాతిరిక్త శాస్త్రములద్వారా విని యున్న కర్మఫలరూపస్వర్గాదిభోగములపట్ల వైరాగ్యమునుపొందగలవు.ఇచ్చట

భగవంతుని తాత్పర్యము ఇలాఉంది.ఏమనగా,అశుద్ధాన్తఃకరణమున వైరాగ్యము కలుగుటకవకాశము లేదు. మరేమనగా,శుద్ధాన్తఃకరణముననే గల్గును. అందువలన,యే కాలములో నీ అంతఃకరణమునందు ఈలోకసంబంధమైన శబ్దాది విషయములందును మరియు స్వర్గాదిలోకములలోని దివ్యభోగములందును దోషదృష్టిపూర్వక తీవ్రవైరాగ్యము గలుగునో,ఆకాలమున ఆ వైరాగ్యమునకు ఫలరూపముగా నీ అంతఃకరణము శుద్ధిపడినదని తెలిసికొనుము.ఎంతవరకు ఆ విషయాలలో వైరాగ్యము కలుగదో,అంతవరకు నీ అంతఃకరణము మలినముగానున్నదని తెలియవలెను.(మధుసూదనీ 2-52)

ఈ మలదోషము నిష్కామకర్మచేతను,సర్వభూతదయచేతను లేక ఈశ్వర (ఇష్టదేవత)నామోచ్చారణ,ఆరాధనచేతను నివృత్తమగును.రీతిపూర్వక[2]ఈశ్వర

---

[2] **శ్లో||సన్నిందాఽసతినామవైభవకథా శ్రీశేశయోర్భేదధీః,**

**అశ్రద్ధా శ్రుతిశాస్త్రదైశికగిరాం నామ్న్యర్థవాదభ్రమః|**

**నామాస్తీతి నిషిద్ధవృత్తి విహితత్యాగో హి ధర్మాన్తరైః,**

**సామ్యం నామ్ని జపే శివస్య చ హరేర్నామాపరాధా దశ||**

ఈశ్వర నామజపముయొక్క రీతి ఇట్లున్నది.1.సత్పురుషులను నిందంచుట, 2.అసత్పురుషులవద్ద నామవైభవమును చెప్పుట,3.శివకేశవులు(ఉపలక్షణముచే సూర్యుడు, దేవి మరియు గణపతి మొదలగు)దేవతలయందు భేదబుద్ధి కలిగియుండుట, 4.వేదవచనములయందు అశ్రద్ధ, 5.శాస్త్రవచనములయందు అశ్రద్ధ, 6.గురు వచనములయందు అశ్రద్ధ, 7.ఈశ్వరనామమహిమయందు(ఆదిత్యోయూపః-తై.బ్రా.2-1-5,యజ్ఞస్తంభము ఆది -త్యుడు,ఇత్యాది వచనములవలె స్తుతిబోధకత్వరూప) అర్థవాద భ్రమను కలిగియుండుట, 8.సర్వపాపనివర్తకము నామమున్నదను బుద్ధిచే నిషిద్ధకర్మలాచరించుట, 9.మహత్తరమైన పుణ్యోత్పాదకమగు నామమున్నదను బద్ధిచే విహితకర్మలను త్యాగముచేయుట

నామోచ్చారణచేత మలవిక్షేపములు—రెండు దోషములు నాశనమగును.అన్య మగు నిష్కామకర్మాదులచే కేవలము మలదోషము నివర్తించును.

శ్రీవసిష్ఠమునీన్ద్రులవారు శ్రీరామచన్ద్రులవారికి ఆత్మతత్త్వోపదేశము చేస్తూ—ఓ రఘునన్దన!విషయాసక్తమగు మలినచిత్తముగల పురుషుడు ఆత్మజ్ఞానము యొక్క చమత్కారమునందు ఎప్పుడుగూడ స్థైర్యమునొందజాలడు.ఆత్మవివే కలాభశూన్యుడు,అజ్ఞానయుక్తమనస్సునకు వశీభూతమైనవాడు పరమేశ్వరు నియొక్క సగుణస్వరూపమును ఆరాధించవలయును.

**శ్లో॥చిన్మయస్యాఽద్వితీయస్య నిషకలస్యాఽశరీరిణః।**

**ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూపకల్పనా॥**(రామపూర్వతాపన్యుపనిషత్.1-7)

బ్రహ్మము చిన్మయము,అద్వితీయము,నిష్కలము(నిరవయవము)మరియు శరీరరహితుడు.అయినను, ఉపాసకులయొక్క కార్యార్థము(అనుగ్రహించుటకై) మత్స్యకూర్మాది వివిధరూపములను ధరించి ఆవిర్భవించెను(అవతరించెను).

**శ్లో॥ శఙ్ఖచక్రగదాపాణిమర్చయేత్పరమేశ్వరమ్।**

**తత్పూజనేన కష్టేన తపసా తస్య రాఘువ!**

**కాలే నిర్మలతామేతి చిత్తం వైరాగ్యకారిణా॥**(యో.వా.ఉప.ప్ర.43-30 & 31)

---

మరియు 10.అన్యధర్మముతో నామము సమమైనదను బుద్ధిగలిగియుండుట—ఇవి దశనా మాపరాధములనబడును. వీటిని పరిత్యజించి, 1.ప్రాతఃకాలము, 2.మధ్యహ్నకాలము, 3.సాయంకాలము మరియు మధ్యరాత్రికాలములలో విభాగపూర్వక లక్షపరిమితి లేక అధికముగా ఈశ్వరనామోచ్చారణ చేయుట మరియు దానియందు చిత్తమును స్థిరపర చుట యేది గలదో, అది ఈశ్వరనామజపముయొక్క సామాన్య రీతి యగును

ఓరాఘువ!శంఖము,చక్రము,గదాధారియగు పరమేశ్వరుని పూజించవలెను. పరమేశ్వరుని ఆరాధనవలనను మరియు వైరాగ్యకారియగు క్లేశప్రద తపస్సు వలనను కొంతకాలానికి చిత్తములోని మాలిన్యము తొలగింపబడి నిర్మలమగును(శుద్ధిపడును).

## 13.విక్షేపదోషము

చిత్తచాంచల్యమునకు విక్షేప దోషమందురు. ఎవని చిత్తము వేదాన్త శ్రవణాదులందు లేక మహావాక్యార్థరూప స్వస్వరూపమునందు స్థిరతను పొందుట లేదో,కాని అన్యవిషయములందు భ్రమించుచున్నదో,అతని చిత్తము చంచలమున్నందున అతడు విక్షేపదోషయుక్తుడని యెఱుగవలెను.కావున,అతనికి ఈశ్వరనామోచ్చారణ,అజపా[3](సోఽహం)మంత్రోచ్చారణ,ఈశ్వరమూర్తిధ్యానము మ

[3]"సోహం"అను మంత్రమునకు అజపామంత్రము లేక అజపాగాయత్రీయని అంటారు. దీని జపమునకు అజపాజపము అంటారు. దీనిని రెండవ టిప్పణములో చెప్పబడినట్లుగా జపించననుగూడ చిత్తశుద్ధి కలుగును. లేక దీర్ఘకాలపర్యంతము జపముజేస్తూ, ఎప్పుడు వృత్తి అంతర్ముఖమగునో అప్పుడు శ్వాస బయటకు వెడలునపుడు (సో)సకారమును ధ్యానముచేస్తూ మరియు శ్వాసలోనికి ప్రవేశించునపుడు(హం)హకార ధ్యానమును చేయుచుండిన—ఇది"అజపా"గాయత్రీ యనబడును. ముఖ్యముగా దీనియందు నివృత్తి పరాయణులగు సంన్యాసులకే అధికారము గలదు. ఈ "సోహం" ధ్యానము సోపాధిక ధ్యానమనబడును.

దీనియందు సకారహకారరూప వ్యఞ్జన అక్షరములను తొలగించగా అవశిష్ట "ఓం" అక్షర ఉపాసన నిరుపాధికమగును. యద్యపి "సోహం" మరియు "ఓం" ఈ రెండు శబ్దములకు ప్రత్యగభిన్న పరబ్రహ్మమను ఒకే అర్థము గలదు. అది శుద్ధము గావున నిరుపాధికమే.

రియు నిర్గుణబ్రహ్మచింతన మొదలగు ఉపాసనలచే చిత్తైకాగ్రత గల్గి విక్షేప దోషము నివర్తింపబడును.

**శ్లో॥నిర్విశేషం పరంబ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః।**

**యే మన్దాస్తేఽనుకమ్ప్యన్తే సవిశేషనిరూపణైః॥**

**వశీకృతేమనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్।**

**తదేవాఽఽవిర్భవేత్సాక్షాదపేతోపాధికల్పనమ్॥**(శ్రీమద్భగవద్గీత-మధుసూదని 12-12)

నిర్గుణపరబ్రహ్మమును సాక్షాత్కరించుకొనుటకు అసమర్థుడైన ఏ మందాధికారి ఉన్నాడో,అతడుసగుణబ్రహ్మనిరూపణముచే(ఉపాసనచే)అనుగృహీతుడగును. నిరంతరము సగుణబ్రహ్మ శీలనముచే మనస్సు వశీభూతమైనయెడల,దాని యందు ఉపాధికల్పనారహిత నిర్విశేష పరబ్రహ్మము ఆవిర్భావించును.

**శ్లో॥శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।**

**సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి॥**(గీత.2-53)

చిత్తభూమికలు ఐదు విధములు.క్షిప్తము,మూఢము,విక్షిప్తము,ఏకాగ్రము మరియు నిరుద్ధము.1.అత్యంత చంచలచిత్తమునకు క్షిప్తము అంటారు.

---

అయినను, ॐ అక్షరమునకు సకారహకారరూప ఉపాధులను జోడించినచో "సోహం" శబ్దము నిష్పన్నమగును. అది సోపాధికమగును. కేవల "ॐ" కారధ్యానము నిరుపాధికమగును. ఈ "ॐ" కార ఉపాసనయొక్క విస్తృత వివరణము శ్రీవిచారసాగరము 281 వ అంకమునుండి పంచమతరంగ సమాప్తి పర్యంతము వ్రాయబడినది.

2.నిద్ర,తంద్ర,ఆలస్యాదులుగల చిత్తము మూఢము అనబడును.3.అప్పుడప్పుడు మాత్రం స్థైర్యంగల చిత్తము విక్షిప్తమనబడును. 4.ఒకే విషయమును విషయముచేయు వ్యవధానరహిత(పూర్వవృత్తులకంటె)విలక్షణ సదృశ(సమాన)వృత్తి ప్రవాహముగల చిత్తము ఏకాగ్రము అనబడును.5.సర్వవృత్తులు నిరోధింపబడిన చిత్తము నిరుద్ధమనబడును.అంతిమ భూమికాద్వయము(ఏకాగ్రము,నిరుద్ధము)తత్త్వజ్ఞానోపయుక్తమగును.ప్రథమ భూమికాత్రయము(క్షిప్తము,మూఢము,విక్షిప్తము)తత్త్వజ్ఞానోప యుక్తముకాదు.వాటిని శుద్ధపరచినప్పుడే తత్త్వజ్ఞానము కలుగును. ఇవియే గాక,

నిర్వికల్పసమాధికి విఘ్నములగు లయ,విక్షేపాదులుగూడ గలవు.అఖండ బ్రహ్మవస్తువును అవలంబనము చేయలేకపోవుటవలన చిత్తము(చిత్తవృత్తులు)నిద్రించుటను"లయ"మందురు.అన్య(అనాత్మవస్తువులను)చిత్తము ఆశ్రయించుటను"విక్షేపము"అందురు. ప్రస్తుతము అర్జునుని చిత్తము విక్షిప్తావస్థను చేరుకున్నందున,అతనికి తత్త్వజ్ఞానోదయమగుటకై నిష్కామకర్మ, ఉపాసనలద్వారా విక్షిప్తబుద్ధి నివృత్తి కొఱకు ఉపదేశము చేయబడినది.

శ్రుతివిప్రతిపన్నా=వేదములో చెప్పబడిన అనేక ఫలములను శ్రవణము చేయుటవలన,వాటి తాత్పర్యమును తెలియజాలక,అనేక ప్రకారముల సంశయములు మరియు విపరీతభావనలచే యుక్తమగుటవలన మొదలే విక్షిప్తమైన నీబుద్ధి,యదా=ఏసమయమున నిష్కామకర్మజన్య చిత్తశుద్ధిచే కలిగిన వివేకముతో దోషదర్శనముద్వారా ఆ"విక్షేపము"ను త్యజించి సమాధియందు=పరమాత్మయందు నిశ్చలము=నిలకడ గలిగియుండునో అనగా జాగ్రత మరియు స్వప్నదర్శనరూప విక్షేపరహితము మరియు అచలము=సుషుప్తి, మూర్ఛ,స్తబ్ధీ భావాదిరూప"లయ"లక్షణ చలనరహితమై స్థిరపడునో, అనగా

లయ విక్షేపరూప దోషములను పరిత్యజించి సమాహితమగునో, అప్పుడు— లేక,నిశ్చలా=అసంభావనా మరియు విపరీతభావనలచే రహితమై,అట్లే అచ-లా=దీర్ఘకాలంగా నిరంతరము మరియు సత్కారపూర్వకముగా సేవించుటవలన విజాతీయ ప్రత్యయములచే దూషితముగానిదై వాయురహిత ప్రదేశమునందు ఉంచబడిన దీపముయొక్క జ్వాలవలె నీబుద్ధి యెప్పుడు ఆత్మయందు స్థిరపడునో,అప్పుడు—నీవు జీవబ్రహ్మైక్యరూప సమస్త యోగముల యొక్క ఫలము,తత్త్వమస్యాదివాక్యజన్య అప్రతిబద్ధఅఖండ సాక్షాత్కారమును పొందగలవు.అభిప్రాయమేమనగా!సాక్షాత్కారం కలిగిన పిమ్మట,పునః సాధ్యాన్తరము(సాధించవలసినది మరొకటి)లేనందున కృతకృత్యుడవు, స్థితప్రజ్ఞుడవు **కాగలవు.** (మధుసూదని 2-53).

లేక,శరీరము,వాణి(వాక్కు),మనస్సు మరియు ధనముచే శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు మరియు దయాళువునగు శ్రీ గురుదేవున్ని ఈశ్వరభావముచే సేవించినచో కర్మోపాసనలను ఆచరించకుండానే చిత్తశుద్ధి మరియు ఏకాగ్రతలు గలుగును.విక్షేపదోషము దూరమగును.లేక,కర్తవ్యకార్యవిస్మరణరూప ప్రమాదములేనివాడై(అప్రమాదియై)మందజిజ్ఞాసచేతనైనా వేదాన్తశ్రవణము లేక అభ్యాసమునందు ఆదరపూర్వకముగా ప్రవృత్తుడైనచో, అతనికిగూడ కర్మోపాసనలు లేకుండానే చిత్తశుద్ధి మరియు ఏకాగ్రతలు గలుగును.

**శ్లో॥ నిత్యాభ్యాసవివేకాభ్యాంచిత్తమాశు ప్రసీదతి।**

**ఆమ్ర ఏవ దశామేతి సహకారీం శనైః శనైః॥**(యో.వా.ఉప.43-32)

**"తచ్చింతనం,తత్కథనం,అన్యోన్యంతత్ప్రబోధనమ్"** (పే.పం.7-106)

అనిచెప్పబడినట్లుగా నిరన్తరఅధ్యాత్మచింతనముయొక్క అభ్యాసముమరియు

విచారముచే అతిశీఘ్రముగా చిత్తము నిర్మలమగును.ఎట్లు మామిడి క్రమక్రమంగా మొగ్గలు,పుష్పములు,పిందెలు,కాయలు మున్నగు అనేక అవస్థలలో పరిణామాలను పొందుతూ చివరకు అతిసుగంధమును, మధురాతిమధురమును అగు ఫలరూపదశను చేరుకుంటుందో,అట్లే చిత్తముగూడ సాధనాభ్యాస పరిపాకముచే క్రమక్రమంగా నైర్మల్యావస్థను చేరుకొనును.

**శ్లో ॥దినే దినే తు వేదాన్తశ్రవణాద్భక్తిసంయుతాత్ ।**

**గురు శుశ్రూషయా లబ్ధాత్ కృచ్ఛ్రాశీతి ఫలం లభేత్॥**

అర్థము :—శ్రద్ధా,భక్తి మరియు శ్రోత్రియబ్రహ్మనిష్ఠ సద్గురు దేవున్ని ఈశ్వరాభిన్నముగా భావించి సేవిస్తూ, ప్రతిదినము వేదాన్త శ్రవణము చేయుచుండినచో ఎనుబదికృచ్ఛ్రచాంద్రాయణ వ్రతముల ఫలము లభించును.దానిచే పాపరూపమలనివృత్తిపూర్వక చిత్తశుద్ధి కలుగును.

మరియు"**స తు దీర్ఘకాల నైరన్తర్యసత్కారాసేవితో దృఢభూమిః**"(పాతంజల యోగసూత్రము 1-14)నిత్యము,దీర్ఘకాలము,అంతరాయము లేకుండా(ఎడతెగకుండా)మరియు ఆదరపూర్వకముగా వేదాన్తశ్రవణాభ్యాస ములుచేయుచుండినచో,బుద్ధి వినోదముద్వారా విక్షేపరూప మలనివృత్తిపూర్వకముగా శుద్ధపడి, చిత్తైకాగ్రత కలుగును.దృష్టాంతేతిహాసములతో కూడిన నాటకదర్శనముచే ఎట్లు బుద్ధికి వినోదము కలుగునో—అట్లు అని తెలియవలెను.

ఇక్కడ ఈరహస్యమున్నది:—1.ఎవరికి అప్రతిబద్ధదృఢఅపరోక్షబ్రహ్మజ్ఞానము కలిగినదో, అతనికి యే విధమైన కర్తవ్యముండదని శాస్త్రము చెప్తుంది.

**" జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్యయోగినః।**

**నచాస్తి కించిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్ ॥**

**లోకత్రయేఽపి కర్తవ్యం కించిన్నాస్త్యాత్మవేదినమ్"।** (జాబాలదర్శ 1-23&24)

అర్థము:—బ్రహ్మజ్ఞానామృతముచే పరితృప్తుడైన కృతకృత్యుడగు యోగికి (జీవబ్రహ్మైక్యానుభూతిని పొందిన జ్ఞానికి)మూడులోకములలోగూడ యేమియును కర్తవ్యము లేదు.ఒక వేళ కర్తవ్యమున్నచో అతడు తత్త్వవేత్తయేకాదు.

2.ఎవరికి తీవ్రజిజ్ఞాస ఉండి,మందబోధ(అదృడజ్ఞానము)కలిగినదో,అతనికి శ్రవణాదులయందు కర్తవ్యముంది.కర్మోపాసనలు చేయపని లేదు.

3.ఏ సుబుద్ధికి మందజిజ్ఞాసచే వేదాన్తశ్రవణాదులయందు ప్రవృత్తి కలిగినదో,అతనికిగూడ శ్రవణాదులయందే కర్తవ్యమున్నది గాని కర్మఉపాసనలయందు లేదు.

4.ఎవరికి మందజిజ్ఞాస అయితే ఉంది,కాని శ్రవణాదులయందు ప్రవృత్తి కలుగుటలేదు.అతనికి కర్మోపాసనలయందే కర్తవ్యముంది,కాని శ్రవణాదులయందధికారము లేదు.

5.ఎవరికి వైరాగ్యము లేశమాత్రముగూడ లేదో,మరియు మందజిజ్ఞాస గూడ లేదో—అతనికి సకామకర్మోపాసనలయందే కర్తవ్యమున్నది.ఇట్లు శ్రీమద్భాగవతము ఏకాదశస్కంధము ఇరువదియవ అధ్యాయములో జ్ఞానము,భక్తి మరియు కర్మరూప మూడుయోగముల వ్యవస్థ చేయనైనది.

**అజ్ఞానము**

**"ఆవరణ విక్షేపరూప శక్తిద్వయవత్ త్రిగుణాత్మకం సదసద్భ్యామనిర్వచనీయం అనాది భావరూపం జ్ఞాననివర్త్యమ్ చిన్మాత్రాశ్రయవిషయ కమధ్యాసకార**

**ణమజ్ఞానమ్।అహం బ్రహ్మ న జానామి,అహమజ్ఞః ఇత్యాద్యనుభవాత్।దేవాత్మ శక్తింస్వగుణైర్నిగూఢామ్**(శ్వే.1-3),**అనృతేన ప్రత్యూఢాః**(ఛాం.8-3-2)**తమఆసీ త్**(ఋ.10-11-129)**నీహారేణప్రావృతాః**(ఋ.10-82-7)ఇత్యాది శ్రుతేః।**అజ్ఞానేనా వృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః।జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః**(గీత 5-15 &16)**నాహంప్రకాశసర్వస్య యోగమాయా సమావృతః**(గీత7-25)ఇత్యాది స్మృతేశ్చ"।

ఆవరణము మరియు విక్షేపము అనబడు రెండు శక్తులుగలది, సత్త్వ రజ తమస్సులనబడు మూడు గుణములు గలది,సత్తు అసత్తులకంటె విల క్షణమైనది అనగా అనిర్వచనీయమైనదియు,అనాదియు,భావరూపము,జ్ఞాన ముచే నివర్తింపబడుటకు యోగ్యమైనదియు,చైతన్యమును ఆశ్రయించుకొని, చైతన్యమునే తెలియకుండా జేయుస్వభావము గలదై మరియు దేహాదికప్ర పంచము అను కార్యాధ్యాసకు కారణము యోదియో అది"**అజ్ఞానము**" అని తెలియవలెను.

### 14.ఆవరణ శక్తి

అజ్ఞానము→ఆవరణ విక్షేపరూప రెండు శక్తులు గలది.ఆవరణము అన గా కప్పివేయునది(ఉన్న వస్తువును తెలియకుండా చేయునది)అని అర్థము. అట్లు చేయు శక్తి(సామర్థ్యము)ఆవరణశక్తి అనబడును."నేనుబ్రహ్మమును తెలి యజాలకున్నాను"(నాకు బ్రహ్మము తెలియదు)ఈప్రకారంగా బ్రహ్మమును తెలి యకుండా జేయునది ఆవరణశక్తి. బ్రహ్మము యొక్క స్వరూపలక్షణమగు సత్, చిత్ మరియు ఆనందము(సచ్చిదానందత్వము)—ఈ మూడింటిని కప్పివేయు ఆవరణశక్తి మూడువిధములు.1."బ్రహ్మములేదు"అనునీరీతిగా బ్రహ్మముయొ క్క అసద్భావమును(అస్తిత్వము-సత్తును కప్పివేయునది)ఆపాదించునది"అ సత్త్వాపాదక ఆవరణ"మనబడును.ఇది"బ్రహ్మము ఉన్నది"అను పరోక్షజ్ఞానము

చే నివర్తింపబడును.2.“బ్రహ్మము భాసించుటలేదు”(తెలియబడుటలేదు)అను నీవిధముగా అభానమును అనగా బ్రహ్మముయొక్క అప్రతీతిని ఆపాదించునది—“అభానాపాదకావరణము”అనబడును.ఇది“సచ్చిదానందబ్రహ్మమును నేనే” అను ఈప్రకారమగు దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానముచే నశించును.3.నిత్య నిరతిశయ నిరావరణపరిపూర్ణ ఆనందస్వరూపుడు స్వయముగా తానే ఉండగా“అహం దుఃఖీ”నేను దుఃఖితుడను—అనునీపగిది అనానందమును(దుఃఖమును)ఆపాదించునది“అనానందాపాదకావరణము”అనబడును.ఇదిగూడ దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానము చేతనే నివర్తించును.

## 15.విక్షేప శక్తి

రెండవది విక్షేపశక్తి.విక్షేప మనగా కార్యము.స్థూలసూక్ష్మ శరీరసహిత(పంచకోశములనభిమానించు)చిదాభాసుడు(జీవుడు)మరియుకర్తృత్వభోక్తృత్వములు,జన్మమరణములు,ఆకలిదప్పులు,దర్శనస్పర్శనాది ధర్మయుక్త ప్రపంచము మరియు దాని జ్ఞానము“విక్షేప”మనబడును.దానిని ఉత్పన్నముజేయు సామర్థ్యమునకు“విక్షేప శక్తి”అందురు.

**శ్లో॥శక్తి ద్వయం హి మాయాయా విక్షేపావృతిరూపకమ్ ।**

**విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్సృజేత్ ॥**(వాక్యసుధా. శ్లో.13)

**అన్తర్దృగ్దృశ్యయోర్భేదం బహిశ్చ బ్రహ్మసర్గయోః।**

**ఆవృణోత్యపరాశక్తిఃసాసంసారస్య కారణమ్।**(సరస్వతీ రహస్యోపనిషత్ 17,18,19)

అర్థము:—మాయ తనయొక్క విక్షేపశక్తిచే స్థావరజంగమాది విభాగపూర్వక వివిధాకార స్థూలసూక్ష్మ వ్యష్టిసమష్టిరూప బ్రహ్మాండాంత జగత్తుగాపరిణతిజెందును(సృష్టించును).మరియు ఆవరణశక్తిచే అంతః=హృదయమందు దృక్=ప్ర

త్యగాత్మకు మరియు దృశ్యం=అంతఃకరణముకు,అట్లే బహిః=బాహ్యమున సచ్చిదానందశుద్ధబ్రహ్మమునకు మరియు సర్గః=నామరూపాత్మక సృష్టికి(ఆత్మ అనగా స్వరూపమును ఆవరించి)భేదమును కల్పించి,ఆవరణావచ్ఛిన్న ఆత్మకు కర్తృత్వభోక్తృత్వ,సుఖ,దుఃఖ,మోహాదిరూప సంసారమునకు కారణమగుచున్నది (మాయ).ఉదా:—రజ్జువుయొక్క అజ్ఞానము—స్వావృత రజ్జువునందు సర్ప,దండ,భూచిధ్ర,జలధార,పూలమాల ఇత్యాదులను ఎట్లు ఉత్పన్నము చేయునో, అట్లే మూలాజ్ఞానము(స్వరూపాజ్ఞానము)గూడ తనచేనాచ్ఛాదింపబడిన ఆత్మయందు విక్షేపశక్తిద్వారా ఆకాశాది బ్రహ్మాండాంతమువరకు సంపూర్ణ ప్రపంచమును ఉత్పన్నముచేయును.

**16.అవిద్యయొక్క నామాంతరములు**

**శ్లో ॥ ఏషా హ్యవిద్యాకథితా మాయైషా సా నిగద్యతే ।**

**పరమేతత్తదజ్ఞానం సంసారాది విషప్రదమ్ ॥** (యో . వా. 5-13-89)

**శ్లో॥మాయావిద్యాదిశబ్దైర్యా శ్రుతిషు స్మృతిషూదితా।**

**సా జగత్ప్రకృతిర్మాయా యతో మాయామయా భ్రమాః॥**(ఇష్టసిద్ధిః 1-33)

ఇష్టసిద్ధికారులు శ్రీవిముక్తాత్మాచార్యులు మరియు దానిపైన శ్రీజ్ఞానోత్తమాచార్యులవివరణములో—మాయ, అవిద్యా, తమః, కారణమ్, లయః, శక్తిః, సుప్తిః, మహాసుప్తిః, నిద్రా, అక్షరమ్, ఆవ్యాకృతమ్, అగ్రహణమ్, అవ్యక్తమ్, ప్రధానమ్, ప్రకృతి,మనస్,ఆకాశమ్ ఇత్యాది శబ్దైః **"మాయాం తు ప్రకృతిం విద్యాత్"**(శ్వే.ఉ.4-10) ఇత్యాది శ్రుతిస్మృతీతిహాస పురాణాదివాక్యేషు ఉక్తా యా మాయా సైవ మహదాదేస్సమస్తస్య జగతః ప్రకృతిః। యతో లోకేపి శుక్తిరూప్యాది భ్రమాః

సవిషయా మాయామయాః ప్రదర్శితాస్తస్మాద్రూప్యాది భ్రమవదాత్మనోబ్రహ్మతా భ్రమస్యాపి జ్ఞానమాత్రాపనోద్యత్వం సిద్ధమ్।

శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాదులలో మాయ మొదలుకొని ఆకాశపర్యంతము అనేకపర్యాయశబ్దములచే పిలువబడు మాయయే మహదాది సంసార రూపసకలానర్థములకు హేతువు(ప్రకృతి=కారణము). శుక్తియందు(ముత్యపు చిప్పయందు)రూప్యము(వెండి)తజ్ఞానరూప భ్రమయేదిగలదో,అది మాయామయమని(మాయికమని)లోకంలో సుప్రసిద్ధము.శుక్తిరూప్యభ్రమ శుక్తిరూప అధిష్ఠానజ్ఞానముచే నివర్తించునట్లు ఆత్మయందు అబ్రహ్మత్వభ్రమ మరియు దేహాదిక సంసారభ్రమగూడ జ్ఞానముచే నివర్తించుట సుప్రసిద్ధము.

**శ్లో॥న నిరూపయితుం శక్యా విస్పష్టం భాసతే చ యా**

**సా మాయేతీన్ద్రజాలాదౌ లోకాః సంప్రతిపేదిరే॥**(వే.పం.6-141)

**శ్లో॥విచిత్రకార్యకరణా అచింతితఫలప్రదా**

**స్వప్నేన్ద్రజాలవల్లోకే తేన మాయా ప్రకీర్తితా॥**(దేవీభాగవతము)

**శ్లో॥ప్రకృష్టవాచకః ప్రశ్చ కృతిశ్చ సృష్టివాచకః**

**సృష్టౌ ప్రకృష్టా యా దేవీ ప్రకృతిః సా ప్రకీర్తితా॥**(దేవీభాగవతము)

**అవిద్యాయా అవిద్యాత్వమిదమేవ తు లక్షణమ్**

**యత్ప్రమాణాసహిష్ణుత్వమన్యథా వస్తు సా భవేత్॥**(బృ.వా.181)

**శ్లో ॥అజ్ఞానముచ్యతేపాపం తద్విచారేణనశ్యతి।**

**పాపమూలచ్ఛిదం తస్మాద్విచారం న పరిత్యజేత్॥** (యో.వా.5-42-8)

అర్థము:—దేనిని నిరూపించుటకు అశక్యమో మరియు దేని కార్యము స్పష్ట ముగా గోచరించుచున్నదో, అదియే మాయయొక్క స్వరూపము. ఘటింపదగని కార్యమును ఘటింపజేయునదియు, అచింత్యఫలమునిచ్చునదియు, స్వప్న మువలె మరియు లోకంలోని ఇంద్రజాలమువలె ప్రసిద్ధమైనది యేదో, దానినే లోకులు మాయ అందురు. సృష్టిరచనలో చాలా పటు(నేర్పరి)గావున ప్రకృతి అనబడును.ప్రమాణముయొక్క అసహనము,ప్రమాణముచే నిరూపింపబడ కుండుటయే అవిద్యయొక్క లక్షణము.ఒకవేళ ప్రమాణముచే సిద్ధించినచో దాని యొక్క అవిద్యాత్వము కోల్పోయి, వస్తువేయగును, అవస్తువెట్లగును?విద్యచే నశించును గావున అవిద్య అనబడును.స్వరూపమునాచ్ఛదించుట వలన అ-జ్ఞానమనబడును.అజ్ఞానమే పాపమనిచెప్పబడుచున్నది.ఈపాపము విచారజ నిత జ్ఞానముచేతనే దూరమగును.కావున,పాపములను ఛేదించు విచారము ను త్యజింపగూడదు.

## 17.అజ్ఞానము త్రిగుణాత్మకము

సత్త్వగుణము,రజోగుణము మరియు తమోగుణము అను మూడు గుణ ములే స్వరూపముగా గలది—అజ్ఞానము.కావున,అది త్రిగుణాత్మకము. అజ్ఞాన ముయొక్క కార్యము సుఖ,దుఃఖ,మోహాత్మకత్వము జగత్తులో ప్రత్యక్షసిద్ధము న్నది.ఈ సుఖాదులు(మూడు)యథాక్రమముగా సత్త్వాది మూడు గుణముల పరిణామములున్నవి.“కారణముయొక్కతుల్యస్వభావముగలది కార్యముండు ను”అను నియమానుసారము జగద్రూపకార్యమునందు త్రిగుణాత్మకత్వ దర్శ నముచే,దానికి కారణభూత అజ్ఞానముగూడ త్రిగుణాత్మకమున్నదని కల్పన జేయబడుతుంది.అందుకే,జీవుడు విషయజన్యసుఖానుభవకాలములో సత్త్వ గుణము గలిగిఉంటాడు.క్రియాశీలుడైనప్పుడు రజోగుణమును మరియు మోహ

గ్రస్తుడైనప్పుడు తమోగుణమునుగల్గియుంటాడు.ఇదియే వాస్తవముగా మూడు గుణాలయొక్క స్వరూపము.గుణము అనగా రజ్జువు(త్రాడు)అని అర్థము.ఎట్లు దృఢమైన ముప్పురిత్రాడు పురుషులకు బంధనహేతువుండునో,అట్లే దృఢమగు త్రిగుణాత్మక అజ్ఞానముగూడ జీవులకు బంధనహేతువగుచున్నది.

**శ్లో ॥త్రిభిర్గుణమయైర్భావైరేభిః సర్వమిదం జగత్ ।**

**మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్ ॥**(గీత.7-13)

అర్థము:—ఈత్రిగుణాత్మకమగు ఉత్పత్తిధర్మముగల జాగతికపదార్థములచేత సంపూర్ణజగత్తు(ప్రాణిసమూహము)మోహితమై(వివేకహీనులై),సత్త్వ,రజ,తమస్సులకు(మూడుగుణములకు)అతీతమై=విలక్షణమై,అవినాశియై,జన్మాది షడ్భావవికారరహితమైయున్న నన్ను(పరమాత్మను)తెలియజాలకున్నారు.

**"అజామేకాంలోహితశుక్లకృష్ణామ్"**(శ్వే.4-5);**"దైవీహ్యేషాగుణమయీ"**(గీత.7-14); **"త్వం మాయయా త్రిగుణయాత్మనిదుర్విభావ్యం,వ్యక్తం సృజస్యవసి లుమ్పసి తద్గుణస్థః"**(శ్రీమద్భాగవతము11-6-8)ఇత్యాది శ్రుతి స్మృతులు అజ్ఞానము త్రిగుణాత్మకమనుటలో ప్రమాణములు.

అజా=అనాది=ఉత్పత్తిలేనిది;ఏక=అనేకముకాదు—ఒక్కటే;లోహితం=రజోగుణము;శుక్లం=సత్త్వగుణము;కృష్ణం=తమోగుణము(మూడుగుణములుగలది అజ్ఞానము)గుణమయీ=సత్త్వరజతమస్సులనుమూడుగుణములే తనస్వరూపముగాగలది—అజ్ఞానము అని అర్థము.

## 18.అజ్ఞానము అనిర్వచనీయము

అజ్ఞానము అనిర్వచనీయమున్నది. సద్రూపమనిగాని,అసద్రూపమనిగాని నిరూపించరానిది గనుక అనిర్వచనీయము.ఒకవేళ అజ్ఞానమును సత్యమ

న్నచో సద్రూప బ్రహ్మమువలె అది ఎప్పుడూ నాశనము కానేరదు.అప్పుడు ద్వైతాపత్తి మరియు అనిర్మోక్షప్రసంగమేర్పడును.ఒకవేళ అసత్యమన్నచో స్వరూపహీనమగు వంధ్యాసుతునివలె ప్రత్యక్షముగాగూడదు.కావున సదస ద్విలక్షణమున్నది.సద్విలక్షణమనగా అసద్రూప వంధ్యాసుతునివలె-అని భా వించగూడదు.బ్రహ్మసాక్షాత్కారానంతరము బాధము కలుగుచున్నందున—స ద్విలక్షణము.అసద్విలక్షణమనగా బ్రహ్మమువలె అబాధ్యము(సత్యము)అని కాదు.మరేమనగా!అపరోక్షముగా ప్రతీయమానమగుచున్నది.అందుకే శ్రీమ ధుసూదనసరస్వతీస్వాములవారు ఇలా చెప్పారు—**"సచ్చేన్నబాధ్యేత,అసచ్చే న్నప్రతీయేత,బాధ్యతేప్రతీయతేఽపి,తస్మాత్సదసద్విలక్షణత్వాదనిర్వచనీయమ్"** (అద్వైతసిద్ధి పృ.690 స్వామి యోగీంద్రానంద).కావున సద్విలక్షణము=**బాధయోగ్యము,** అసద్విలక్షణము=**ప్రత్యక్షయోగ్యస్వరూపము**గలదైనందున అజ్ఞానమును అని ర్వచనీయము(మిథ్యా)అని చెప్పుదురు.అట్లే అజ్ఞానకార్యములు సకల సాంసా రిక వస్తువులుగూడ మిథ్యయే అని స్వీకరించబడుచున్నవి.

**శ్లో ॥నాసదాసీద్విభాతత్వాన్నో సదాసీచ్చబాధనాత్ ।**(పే.పం.6-129)

అర్థము:—అజ్ఞానము(మాయ)అందరికి ప్రత్యక్షముగాఅనుభవసిద్ధమున్నం దున అసద్రూపము గాదు. మరియు, **"నేహనానాస్తికించన"** (బృ.4-4-19)ఇత్యాది శ్రుతులచే ఆత్మభిన్న సమస్తము బాధింపబడుచున్నందున సద్రూపము గూడ కాదు.

**శ్లో ॥ప్రత్యేకం సదసత్త్వాభ్యాం విచారపదవీం న యత్ ।**

**గాహతే తదనిర్వాచ్య మాహుర్వేదాన్తవేదినః॥** (చిత్సుఖీ 1-13)

అర్థము:—ఏది సత్త్వరూపముచేగాని,అసత్త్వరూపముచేగాని లేక సదసదు

భయరూపముచేగాని నిరూపణీయము గాదో(విచారపథములోకి రాదో) అది అనిర్వాచ్యము—అని వేదాన్తవేత్తలు చెప్తున్నారు.

అట్లే—ఋగ్వేదము 10-11-129 లో "నాసదాసీన్నో సదాసీత్" అని చెప్పబడినది.

**శ్లో ॥నాసద్రూపా న సద్రూపా మాయా నైవోభయాత్మకా ।**

**అనిర్వాచ్యా శ్రితా జ్ఞేయా భేదబుద్ధిప్రదాయినీ॥** (బృహన్నారదీయము 21-70)

అర్థము:—భేదబుద్ధిని(జగదీశజీవభేధమును)కలుగజేయు మాయ సత్,అసత్ మరియు ఉభయరూపముగానిదై అనిర్వాచ్యమున్నది.

బ్రహ్మసూత్రం 1-4-3 లో శ్రీభాష్యకారులు "తత్త్వాన్యత్వనిరూపణస్యాశక్యత్వాత్" అవ్యక్తరూప మాయ సద్రూపమనిగాని,అసద్రూపమనిగాని,బ్రహ్మముచేనభిన్నమనిగాని లేక భిన్నమనిగాని నిరూపించుటకు శక్యముగానిది—అని-ర్వాచ్యము,అని చెప్పారు.అట్లే,వివేకచూడమణి నూటపదకొండవ శ్లోకంలోగూడ ఈవిధంగా సెలవిచ్చారు.

**శ్లో ॥సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో,**

**భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో।**

**సాంగాప్యనంగాప్యుభయాత్మికా నో,**

**మహాద్భుతాఽనిర్వచనీయరూపా ॥**

వ్యాఖ్య:—అబాధితమైనది సత్తని,బాధితమైనది అసత్తని లోకంలో ప్రసిద్ధము. కుందేటికొమ్ము,ఆకాశపుష్పము,వంధ్యాసుతుడు,నరశృంగము ఇత్యాదులు ఎవరికి ఎప్పుడు ఎక్కడ కనుపించునవి కావు.కావుననవి యసత్పదార్థములు. కాని ఈమాయ,జ్ఞానముచే బాధింపబడుచున్నదని శ్రుతిస్మృతులు చెప్పుచు

న్నవి."**భూయశ్చాన్తే విశ్వమాయా నివృత్తిః**"(శ్వే.1-10)చివరకు మాయ నివర్తించును;

**శ్లో ॥తరత్యవిద్యాం వితతాం హృది యస్మిన్నివేశితే ।**

**యోగీ మాయామమేయాయ తస్మైవిద్యాత్మనే నమః॥**(వి.పు.5-17-14)

యోగి తన హృదయమందు ఎవ్వడిని స్థిరముగ నిలిపినంత మాత్రము ననే,విస్తృతమగు మాయను దాటగలడో,అట్టి విద్యాస్వరూపుడగు అప్రమేయు నకు నమస్కారము.

**"మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే"।** (గీత. 7-14)

నన్నే శరణుబొందువారు ఈమాయను దాటగలరు.కావున,మాయ ఆత్మవ లె సత్పదార్థమని చెప్పవీలులేదు. సత్పదార్థము ఎప్పుడు లేకుండా పోదు."**నా భావో విద్యతే సతః**"(గీత.2-16)అను యీ గీతా వాక్యానుసారము జ్ఞానానంతరము తప్పకుండా అభావమును పొందు యీ మాయకు సత్త్వము లేదు.జ్ఞానము కలుగక పూర్వము దృశ్యమానకార్యరూపమున(జగద్రూపమున)ప్రతీతి యగుట వలన,కార్యరూపమున పరిణామమును చెందుటవలన,మరియు"యద్యత్కా ర్యం తత్తత్సకారణకమ్"ఏదేదికార్యముండునో,అది కారణపూర్వకమయ్యే ఉండు నను నియమానుసారము,ఈజగద్రూపకార్యమునకు పరిణామి ఉపాదానకారణ ము(మాయ)ఉన్నది—అను అనుమితికి విషయమగుటచేతను,ఈమాయ శశ విషాణమువలె అసత్తని చెప్పుటకు వీలులేదు.ఇది సదసదుభయాత్మకము గూడ కాదు.ఎందుకంటే,సదసత్త్వములు వ్యాప్యవృత్తులు.అనగా సత్త్వమున్న చోట అసత్త్వముండుట కవకాశము లేదు.అసత్త్వమున్నచోట ఎన్నటికి సత్త్వ ముండుటకు అవకాశము లేదు.అందుచే మాయయందు కాలభేదముచేత స

త్వాసత్త్వములను స్వీకరించుటకు వీలులేదు.అనగా మాయ కొంతకాలము 'సత్'గా ఉండి,తరువాత'అసత్'అగునని చెప్పి,దానికి సదసదు భయాత్మక త్వమును అంగీకరింప వీలులేదు.మరియు సద్రూపత్వము అసద్రూపత్వము అనునవి వేరువేరుగ లేనప్పుడు తదుభయరూపత్వము అత్యంత అసంభవ మగును.స్వాప్నికపదార్థములు,ఐంద్రజాలిక పదార్థములు దృష్టనష్టస్వభావము గలవై(కనబడి నశించునవై)సదసద్విలక్షణములై(సత్ గాని అసత్ గాని కాక)మిథ్యాభూతములై యెట్లుండునో,అట్లే మాయగూడ మిథ్యాభూతమైయు న్నది. అందుకే శ్రీకృష్ణపరమాత్మ శ్రీ మద్భగవద్గీతలో ఇలా ఉపదేశించాడు.

**శ్లో ॥ నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః ।**

**ఉభయోరపి దృష్టోఽన్తస్త్వనయోస్తత్త్వదర్శిభిః॥**(గీత. 2-16)

అర్థము:—అసత్తునకు సత్త్వము లేదు.సత్తునకు అసత్త్వము లేదు.తత్త్వ వేత్తలు ఈరెంటియొక్క అన్తమును(నిర్ణయమును)బాగుగా చూడగలరు.

కేవలము ప్రాకృత(లౌకిక)దృష్టిగలవారు ఉత్పత్తికిపూర్వము అసత్తుగాను న్న ఘటాదికము ఉత్పన్నమై సత్తుగా అగుచున్నదనియు ఇదియే నశించి మరల అసత్తుగా అగుచున్నదని అనుకొనుచుండవచ్చును.కాని,అది అయుక్త మని భగవంతుడే"ఈరెండింటియొక్క నిర్ణయము తత్త్వవేత్తలచే చూడబడిన ది"అని చెప్పియున్నాడు.కావున ఈమాయ సద్వస్తువు కాదు,అసద్వస్తువు కాదు,ఉభయాత్మకముగూడ కాదు.సత్త్వాసత్త్వములచే నిర్వచింప శక్యముగా నిదిగాన అనిర్వచనీయము.ఈమాయ సద్వస్తువా లేక అసద్వస్తువా అని నిర్వచించుటకు ఎట్లు శక్యముగాదో, అట్లే-

ఇది బ్రహ్మము కంటే భిన్నమైనదా అభిన్నమైనదా అనిగూడ నిర్వచింప

శక్యముగాదు.ఇది బ్రహ్మముకంటె అత్యంతభిన్నము అన్నచో అద్వైతప్రతిపాదక శ్రుతులకు విరోధము కలుగును.లోకంలో శక్తికి శక్తిగలవానికి అత్యంత భేదము కనిపించుట లేదుగదా!ఒకవేళ బ్రహ్మముచే నత్యంతఅభిన్నము అని స్వీకరించినచో బ్రహ్మమువలెనే ఇదిగూడ కాలత్రయాబాధ్యము కావలసియుండును. కావున అభిన్నము కాదు.భిన్నాభిన్నత్వములు పరస్పర విరుద్ధ ధర్మములు గాన మాయ భిన్నాభిన్నమని గూడ చెప్పశక్యము గాదు.

"అనాది మాయయా సుప్తః"(ఆగమ.ప్ర.16)అని శ్రీగౌడపాదాచార్యులు చెప్పినట్లు ఈమాయ అనాది(కారణరహితము-ఉత్పత్తిరహితము)ఉన్నది.అందువలన ఇది సావయవము అని చెప్ప శక్యము గాదు. ఏది సావయవముండునో అది జన్యముంటుంది.ఒకవేళ నిరవయవము అని చెప్పినచో జగద్రూపముగా పరిణామము పొందుట అసంభవమగును.మరియు సావయవత్వ నిరవయవత్వములు పరస్పర విరుద్ధములుగాన ఉభయాత్మకముగూడ కాజాలదు.ఈవిధముగా'సత్'అనిగాని,'అసత్'అనిగాని;బ్రహ్మభిన్నమనిగాని,అభిన్నమనిగాని;సావయవమనిగాని,నిరవయవమనిగాని నిర్వచించుటకు శక్యముకానందున మాయ అనిర్వచనీయము మరియు అత్యంతాశ్చర్యకరమైనది అని అర్థము.కావున, ఉపరోక్త ప్రకారముచేత అనేక యుక్తులు మరియు శ్రుతి స్మృతి ప్రమాణములచేత అజ్ఞానము(మాయ)అనిర్వచనీయము అని నిర్ణయింపబడినది.

## 19.అజ్ఞానము భావరూపము

అజ్ఞానము(మాయ)భావరూపము.అజ్ఞానము సామాసిక శబ్దము. నఞ్ తత్పురుషసమాసము. న+జ్ఞానమ్=అజ్ఞానమ్. నిషేధార్థక "న" కారము నఞ్. దీనికి ఆఱు అర్థములు గలవు.

**శ్లో ॥తత్సాదృశ్యమభావశ్చ తదన్యత్వం తదల్పతా ।**

**అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ ప్రకీర్తితాః ॥**(వాచస్పత్యమ్)

(a)సాదృశ్యము:—న+బ్రాహ్మణః=అబ్రాహ్మణః=బ్రాహ్మణసదృశుడు=బ్రాహ్మణేతర క్షత్రియుడు, వైశ్యుడు.

(b)అభావః:—న+అస్తి=నాస్తి; అస్తిత్వాభావము లేక న+పాపమ్ = అపాపమ్-పాపము యొక్క అభావము.

(c)అన్యత్వము:—న+ఘటః=అఘటః=ఘటభిన్నము=పటః (వస్త్రము)ఇత్యాదులు.లేక న+అశ్వః=అనశ్వః, అశ్వభిన్నము గోవు ఇత్యాదులు.

(d)అల్పత్వము:—న+ఉదరా=అనుదరాకన్యా(కృశోదరీ)-అల్పమైన పొట్ట(కడుపు) గల కన్య.

(e)అప్రాశ్యస్త్యమ్:—న+కేశీ=అకేశి-అశోభనమైనవెంట్రుకలుగలది.

(f)విరోధము:—న+ధర్మః=ధర్మవిరోధి=అధర్మఃలేక న+మిత్రః=అమిత్రః, శత్రువు,లేక న+సురః =అసురః=సురవిరోధి అసురుడు.

పైఆరు అర్థములలో వేదాన్త సిద్ధాన్తానుసారము"విరోధము"అను అర్థము అంగీకరించబడుతుంది.న+జ్ఞానమ్=అజ్ఞానము=జ్ఞానవిరోధి అజ్ఞానమ్ అని అర్థము."జ్ఞానవిరోధము"నుగూడ రెండు విధములుగా చెప్పుకోవచ్చు.1.జ్ఞానమునకు విరోధి జ్ఞానవిరోధి=అజ్ఞానమ్.(జ్ఞానస్య విరోధి జ్ఞానవిరోధి).2.జ్ఞానము విరోధి దేనికి గలదో అది=అజ్ఞానమ్.(జ్ఞానం విరోధి యస్య తదజ్ఞానమ్).ఈ రెండు విధములవిరోధార్థము అజ్ఞానమునకుసుసంపన్నమగును.అజ్ఞానము జ్ఞానమునకు విరోధి ఉన్నది. జ్ఞానము అజ్ఞానమునకు విరోధిగూడ ఉన్నది.

**"సనాతనం పరం బ్రహ్మ జ్ఞాన శబ్దేన కథ్యతే"।**(బృహన్నారదీయము 21-72)

**"ప్రత్యక్ష ప్రమా చాత్ర చైతన్య మేవ, యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ ఇతి శ్రుతేః"**
(వేదాన్త పరిభాష-ప్రథమ పరిచ్ఛేదము)

పై ప్రమాణములచే చైతన్యమే(ఆత్మ లేక బ్రహ్మమే)జ్ఞానశబ్దముచేత చెప్పబడుచున్నది.అజ్ఞానము తనయొక్క ఆవరణశక్తి ప్రభావముతో ఆత్మ(స్వరూప) సాక్షాత్కారము కలుగకుండాచేస్తుంది.ఈకారణముచేత అజ్ఞానము జ్ఞానమునకు విరోధియను మొదటి పక్షము సమన్వయమగుచున్నది.మరియు దీపము వెలిగించిన తత్క్షణమే చీకటి నివర్తింపబడినట్లు—ఆత్మసాక్షాత్కారము(జ్ఞానము)కలుగుటతోడనే(అహంబ్రహ్మాస్మియనువృత్తియందు ఆరూఢచైతన్యము=విశేష చైతన్యము ఉత్పన్నమగుటతోడనే)అజ్ఞానము నివృత్తమగుచున్నందున అజ్ఞానమునకు విరోధి జ్ఞానము—అను రెండవ పక్షముగూడ సంపన్నమగుచున్నది.

ముఖ్యగమనిక:—సామాన్యచైతన్యము అజ్ఞానమునకు విరోధి(బాధకము)కాదు.మరేమనగా సాధకమున్నది.అజ్ఞానమునకు స్వతంత్ర సత్త స్ఫూర్తి లేదు. చైతన్యముయొక్క సత్త స్ఫూర్తిని తీసికొనియే మనుగడ సాగిస్తున్నది.అజ్ఞానము"ఉన్నది","ప్రతీతి"అగుచున్నది—అను వ్యవహారమునకు విషయమగుచున్నది.కావున,వృత్తిఆరూఢ విశేషచైతన్యమే అజ్ఞానమునకు విరోధి ఉన్నది.సరే,

నైయాయికులు—పైన పేర్కొన్న నఞర్థషట్కములో అభావార్థమును గ్రహించి,న+జ్ఞానమ్=అజ్ఞానమ్="జ్ఞానముయొక్కఅభావము"అజ్ఞానము అనిచెప్పుదురు.అద్వైతమతానుసారము అజ్ఞానము భావరూపము.ఒకవేళ అజ్ఞానము అభావమని స్వీకరించినచో,ఈదృశ్యమాన జగత్తు(కార్యము)భావరూపముగాన, దీనికి ఉపాదానకారణముగూడ భావరూపమయ్యే ఉండవలెను.అభావమునుం

డి భావరూపకార్యముఉత్పన్నముకాజాలదుగదా!“కథమసతఃసజ్జాయేత?”(ఛాం. 6-2-2).ఒకవేళ,అజ్ఞానమును భావరూపమన్నచో బ్రహ్మమువలె సద్రూపమగు టచే ద్వైతాపత్తి ప్రసక్తమగునని శంకించవలదు.ఎందుకంటె,అజ్ఞానము వ్యావహారికము,చైతన్యము పారమార్థికము గావున ద్వైతాపత్తి ప్రసక్తిగూడ రాదు.

అజ్ఞానము భావరూపమున్నదనుటలో అనుభవము యుక్తులు మరియు శ్రుతులు ఆధారములుగానున్నవి.“**అహమజ్ఞః,మామన్యం చ నజానామి;అహం బ్రహ్మ న జానామి;శాస్త్రార్థం న జానామి**”నేను అజ్ఞానిని;నన్ను మరియు ఇతరమునుగూడ ఎఱుగను;నేను బ్రహ్మమును ఎఱుగను;శాస్త్రముయొక్క అర్థమును(తాత్పర్యమును)నేను తెలియను—ఇత్యాది అనుభవము అజ్ఞానముయొక్క“భావత్వము”నందు ప్రమాణము.

ఈఅనుభవము జ్ఞానాభావమును విషయము చేస్తుంది—అని అనుటకు వీలులేదు.“అహంసుఖీ”అను అపరోక్షానుభవమువలె“అహమజ్ఞః”ఇత్యాద్యనుభవముగూడ భావరూపమున్నది.అభావము ప్రత్యక్షమునకు(ఇంద్రియమునకు) విషయము కాదు, అనుమానగమ్యము,అనుపలబ్ధివేద్యముండును.

అభావము ప్రత్యక్షగమ్యమని నైయాయికులంటారు.ఒకవేళ వారిని సంతోషపెట్టుటకు వారి మతమును“తుష్యతుదుర్జనన్యాయము”చే స్వీకరించినను ఈ సమస్య ఎదురౌతుంది.ఏమనగా!అభావజ్ఞానమునకు“ప్రతియోగి”మరియు“అనుయోగి”యొక్క జ్ఞానము ఆవశ్యకమున్నది.“అహమజ్ఞః”నేను అజ్ఞానిని,అను ఈ అజ్ఞానానుభవమునకు,జ్ఞానాభావముయొక్క అనుయోగి అహమాత్మక“జ్ఞానము”మరియు జ్ఞానాభావమునకు ప్రతియోగియగు“జ్ఞానము”యొక్క జ్ఞానముగూడ ఉండవలెను.అలాంటప్పుడు,ఆత్మయందు జ్ఞానాభావాత్మక అజ్ఞానమునకు ప్రతియోగియగు జ్ఞానముయొక్క జ్ఞానముగూడ ఉన్నది. మరియు జ్ఞానా

భావమునకు అనుయోగియగు ఆత్మయొక్క జ్ఞానముగూడ ఉన్నది.ఎప్పుడైతే అనుయోగి,ప్రతియోగుల జ్ఞానమున్నదని స్వీకరించబడినదో,"అహమజ్ఞః" నేను అజ్ఞానిని అను యీఅనుభవము అభావాత్మకమనుట"వ్యాఘాతదోష" ముచే బాధితమౌతుంది.**"అసంబద్ధార్థకం వాక్యం-వ్యాఘాతః"** లేక **"పూర్వోత్తర విరోధః–వ్యాఘాతః"**మొదలు చెప్పిన విషయానికి,తరువాత చెప్పిన విషయానికి సంబంధము కుదురక పోతే వ్యాఘాత దోషమేర్పడుతుంది. "వదతః ఏవ విశేషణ ఆఘాతః=వ్యాఘాతః" చెప్పేవాడికే దోషంపడుతుంది.ఉదా:—

**శ్లో ॥యావజ్జీవమహం మౌనీ, బ్రహ్మచారీ చ మే పితా!**

**మాతా తు మమ వంధ్యాసీదపుత్రశ్చ పితామహః ॥** (న్యాయ కోశము)

జీవించియున్నంతవరకు నేను మౌనధారిని(అని స్వయంగా చెప్తున్నాడు). మా తండ్రి నైష్ఠికబ్రహ్మచారి.మా తల్లి గోడ్రాలు(వంధ్య).మా తాతకు సంతానమే లేదు–అని యెట్లు అసంబద్ధార్థక వాక్యములున్నవో,అట్లే జ్ఞానమున్నదని చెప్పుట మరియు జ్ఞానాభాత్మక అజ్ఞానమున్నదని చెప్పుట విరోధముగాన వ్యాఘాతదోషగ్రస్తమగును.నాయందు జ్ఞానమున్నది—అను అనుభవమున్నచో, "అహమజ్ఞః"నేను అజ్ఞానిని–అను అనుభవమెట్లు సంభవము?ఈకారణముచేత "అహమజ్ఞః"ఇత్యాద్యనుభవముద్వారా జ్ఞానాభావాత్మక అజ్ఞానము విషయ మగుటలేదు,మరేమనగా!భావరూప అజ్ఞానమే విషయమగుచున్నదని సిద్ధమైనది.ఈప్రకారంగా అజ్ఞానము భావరూపమున్నదనుటలో అనేక యుక్తులు గలవు. విశేష జిజ్ఞాసగలవారు"అద్వైతసిద్ధి"మొదలగు ఆకరగ్రంథములను అవలోకించదగును.

**"దేవాత్మశక్తింస్వగుణైర్నిగూఢామ్**(శ్వే.1-3)ఇత్యాది శ్రుతులయొక్క ఆధారము

చేగూడ అజ్ఞానము భావరూపమున్నదని స్వీకరించబడినది. దేవుడు అనగా ఈశ్వరుడు,అతనియొక్క ఆత్మశక్తి అనగా పరమాత్మయొక్క స్వరూపభూతమగు(అస్వతన్త్రమగు)జగత్కారణ నిర్వాహికాశక్తి యేదిగలదో,అది సత్త్వ,రజ, తమస్సులు అను మూడుగుణములచే నిగూఢమై=ఆచ్ఛాదితమై=వ్యాప్తమై ఉన్నది.పరబ్రహ్మము ప్రథమమున తన మాయాయోగముచే ఈశ్వరరూపముతోనున్నది.అదియే మరల మాయయొక్కసత్త్వగుణ ప్రాధాన్యముచే విష్ణువురూపములో జగత్ స్థితికి,రజోగుణ ప్రాధాన్యముచే బ్రహ్మ రూపములో జగదుత్పత్తికి మరియు తమోగుణ ప్రాధాన్యముచే శివరూపములో సృష్టిసంహారరూప కార్యమునకు కారణమైనది.

**శ్లో॥సర్గస్థిత్యన్తకరణీం బ్రహ్మ విష్ణుశివాత్మికామ్ ।**

**స సంజ్ఞాం యాతి భగవానేక ఏవ జనార్దనః ॥**(వి.పు. 1-2-66)

అర్థము పైన చెప్పబడినది.జనార్దనః=మాయా విశిష్ట చైతన్యము ఈశ్వరుడని అర్థము.

కావున,అభావాత్మక అజ్ఞానము(మాయ)సత్త్వాది త్రిగుణములు కలిగియుండుట సంభవించదు.ఈకారణముచేతగూడ అజ్ఞానము భావరూపమని గత్యంతరము లేక నైయాయికులు(రుదతాఽపిఅంగీకర్త వ్యమ్=ఇష్టములేకున్నా,ఏడ్చుకుంటూఅయినా)ఒప్పుకొని తీరాల్సిందే.

## 20.అజ్ఞానము అనాది

ఇప్పుడు అజ్ఞానము(అవిద్యా)"అనాది"అను విషయమును కించిద్విచారించెదము.అనాది రెండువిధములు.ఒకటి స్వరూపముచే అనాది,రెండవది ప్రవా

హరూపముచే అనాది.**ఉత్పత్తిరహిత లేక కారణరహిత వస్తువు స్వరూపముచే అనాది** అనబడును.ఈ స్వరూప అనాది పునః షడ్విధములు.

**శ్లో ॥జీవఈశో విశుద్ధాచిత్తథా జీవేశయోర్భిదా ।**

**అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః॥**(సాంప్రదాయిక శ్లోకము)

1.శుద్ధచైతన్యము(బ్రహ్మము),2.అవిద్యా,3.జీవుడు,4.ఈశ్వరుడు,5.అవిద్యా మరియు చేతనములయొక్క సంబంధము,6.ఈఐదు అనాదివస్తువులయొక్క పరస్పర భేదము—వేదాన్తమతములో ఈఆరు-అనాదివస్తువులుగా స్వీకరించబడినవి.

1.బ్రహ్మము అవిద్యకు(మూలప్రకృతికి)అధిష్ఠానమగుటవలన దానికి అవిద్య వలన ఉత్పత్తి సంభవించదు.మరియు అధ్యస్తములగు జీవేశ్వరాది నాల్గింటి యొక్క సిద్ధి,అధిష్ఠాన బ్రహ్మము లేకుండా కాదు;కనుక ఈనాల్గు పదార్థముల చేతను బ్రహ్మముయొక్కఉత్పత్తిగానేర దు.కావునబ్రహ్మముఅనాది.“**అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయమవ్యయః**”।(గీత.13-31),“**అనాదిమత్పరం బ్రహ్మ**”(గీత.13-12)“**అనాదిమత్ త్వం విభుత్వేన వర్తసే**”(శ్వే.4-4)నీవు అనాదియై సర్వత్ర వ్యాపించి యున్నావు.“**అనాద్యనన్తం మహతః పరం**”(కఠ.1-3-15)పరబ్రహ్మము అనాది,అనంతము,మహత్తత్త్వము కంటే పరమైనది.

**శ్లో॥నమః శాన్తాత్మనే తుభ్యం నమో గుహ్యతమాయ చ।**

**అచిన్త్యాయాప్రమేయాయ అనాదినిధనాయ చ ॥**(మైత్రాయణ్యుపనిషత్ 4-15)

అనాది+అనిధనాయ,అని పదచ్ఛేదము.ఉత్పత్తి మరియు వినాశము లేనివారికి నమస్కారము.శేషం స్పష్టమ్.ఇత్యాద్యనేక స్మృతులు,శ్రుతులు బ్రహ్మము అనాది అనుటకు ప్రమాణములు.

2.బ్రహ్మము నిర్వికారమగుటవలన దానిచేత అవిద్యోత్పత్తి సంభవించదు.ఈశ్వరాది నాల్గింటియొక్క సిద్ధి,అవిద్యా సిద్ధి అధీనమైయున్నది,కావున వీనిచేత అవిద్యయొక్క ఉత్పత్తి సంభవిచదు.కాబట్టి అవిద్యయు అనాది.**“అజామేకామ్”** (శ్వే.4-5), **“అనాద్యవిద్యా”**(నిరాలంబోపనిషత్); **“అనాదిమాయయాసుప్తో”** (మాం.ఆగ.16). **“మాయానామ–అనాదిరనన్తవతీ”**(సర్వసారోపనిషత్)

**శ్లో॥స్వాభావిక్యప్యవిద్యేయమనుభూత్యాఽఽవభాసితా ।**

**తమః సూర్యోదయేనేవ జ్ఞానేనోత్కృత్య నాశ్యతే ॥**

**శ్లో॥అనాది కాలమజ్ఞానం జ్ఞానేనాఽఽదిమతా క్షణాత్।**

**దృశ్యతే నాశ్యమానం హి న చాస్యా ఽఽవృత్తిరీక్ష్యతే॥**(బృ.సం. భాష్యవా. 1088&1089)

అర్థము:—ఇయమవిద్యా = ఈఅవిద్య(అజ్ఞానము);స్వాభావికీ = స్వాభావికము (నైసర్గికము;అనాది),అనుభూత్యా = అనుభవముచేత;అవభాసితా = తెలియబడునదియై ఉన్నది.అయినను;సూర్యోదయేనేవ = సూర్యుడుదయించుటతోడనేఎట్లు; తమః = చీకటి;నాశ్యతే = నష్టమగునో;అట్లే,జ్ఞానేనోత్కృత్య నాశ్యతే = బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముదయించిన తత్క్షణమే అజ్ఞానము నష్టమగును.

అజ్ఞానము అనాది కాలము నుండి సుస్థిరమై యున్నప్పటికిని తత్త్వ జ్ఞానముదయించిన క్షణములోనే నశించును.అనగా భూత,భవిష్య,వర్తమాన కాలములలో అత్యన్తాభామున్నదను మిథ్యాత్వనిశ్చయరూప“బాధ”కు విషయమగుచున్నది.అజ్ఞానము నివృత్తమయిన పిదప మళ్ళీ దానియొక్క పునరావృత్తి కనబడుటలేదనుటలో విద్వదనుభవమే ప్రమాణము.

**శ్లో॥అనాదిత్వమవిద్యాయాః కార్యస్యాపి తథేష్యతే।**

**ఉత్పన్నాయాంతు విద్యాయామావిద్యకమనాద్యపి।।**

**ప్రబోధే స్వప్నవత్సర్వం సహమూలం వినశ్యతి।**(వివేకచూడామణి 200&201)

అర్థము:—అవిద్యాతత్కార్యమునకు అనాదిత్వము స్వీకరించబడినది.స్వప్నమునుండి మేల్కొన్న పిదప స్వప్నము ఎట్లు నశించునో,అట్లే బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము(విద్య)ఉత్పన్నమగుటతోడనే ఈపరిదృశ్యమానజగత్తు తనకు కారణమైన అజ్ఞానముతోపాటు నశించును.ఇత్యాది శ్రుతిస్మృత్యనుభవములు అజ్ఞానముయొక్క అనాదిత్వమునకు ప్రమాణములు.

3,4.జీవుడు మరియు ఈశ్వరుడును అనాదులే. వీరు కేవల బ్రహ్మము నుండిగాని,కేవల మాయవలన గాని,లేక ఈ రెంటియొక్కభేదము వలనగాని లేక స్వసిద్ధి అధీన భేదముచేగాని పుట్టుట లేదు.అవిద్యాచైతన్యముల కల్పిత తాదాత్మ్యసంబంధము వలన జీవేశ్వరుల సిద్ధి సంభవించినది. ఈ కల్పిత తాదాత్మ్య సంబంధము స్వయముగా అనాదియగుట వలన జీవేశ్వరులుగూడ అనాదులే.

**“మాయాఖ్యాయాః కామధేనోః వత్సౌ జీవేశ్వరావుభౌ”**(వే.పం.6-236)

జీవేశ్వరులిరువురు మాయ అనబడు కామధేనువుయొక్క బిడ్డలు.అనగా మాయ(అవిద్య)సిద్ధ్యధీనసిద్ధిగలవారని యర్థము.అనగా మాయసిద్ధించిన మీదట జీవేశ్వరులు సిద్ధించినారు.

**“జీవేశావాభాసేన కరోతి మాయా చావిద్యా చ స్వయమేవ భవతి”**

(నృసింహోత్తరతాపనీయోపనిషత్ -9)

**శ్లో ॥ మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః ।**

**కల్పితావేవ జీవేశౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్॥** (పే.పం.7-6)

దర్పణమువలె చైతన్యమును తనయందు ప్రతిబింబించుకొని,చైతన్యము యొక్క ఆభాసముచేత జీవేశ్వరులను మాయ కల్పించుచున్నది.ఈశ్వరునికి ఉపాధియగు మాయగాను మరియు జీవునికి ఉపాధియగు అవిద్యగాను స్వ యముగా మాయయేయగుచున్నది.అందువలన జీవేశ్వరులు మాయా కల్పిత ములు.కల్పిత జీవేశ్వరులచే సంపూర్ణ చరాచర జగత్తు కల్పింపబడుచున్నది. కావున,మాయ అనాదియగుటవలన తత్కల్పిత జీవేశ్వరులు గూడ అనాదులే.

**"జీవేశ్వరప్రకృతయోనిత్యాశ్చానాదయస్త్రయః"**(భవసంతరణోపనిషత్)

జీవ,ఈశ్వర,ప్రకృతి(అజ్ఞానము)ఈమూడును అనాదులని ఉపనిషత్ సాక్షా త్తుగా చెప్పుచున్నది.గావున,జీవేశ్వరులు అనాదులనుట శ్రుతిప్రసిద్ధము. "నిత్యాః" అను శబ్దముచే జ్ఞానోదయపర్యన్త స్థాయిత్వమని తెలియవలెను.

5.బ్రహ్మము మరియు అవిద్య అనాదియగుటవలన వీరి తాదాత్మ్య సంబంధ ముగూడ అనాదిగానున్నది.అందువలన బ్రహ్మవిద్యలచేత సంబంధోత్పత్తిచె- ప్పగూడదు.ఈశ్వరాది త్రయముయొక్క సిద్ధియన్ననో,బ్రహ్మవిద్యల సంబంధ సిద్ధి అధీనమైయున్నది.కనుక ఈశ్వరాది త్రయముచేత సంబంధముయొక్క ఉత్పత్తి సంభవిచదు. కాబట్టి సంబంధముగూడ అనాదిగానున్నది.

బ్రహ్మవిద్యలకు ఒకవేళ సంబంధము చెప్పినచో బ్రహ్మము అసంగము. **"అసంగోహ్యయంపురుషః"**(బృ.4-3-15&16)అను శ్రుతికివిరోధము కలుగునుగదా! యను శంకకు సమాధానము ఈ క్రింది విధముగా నున్నది.

వృక్షము స్వయముగా నచలమగుటవలన ఎవరితో(దేనితో)సంబంధము చేయుటకు ఎక్కడకు వెళ్ళదు.అయినను పక్షియొక్క క్రియవలన వృక్షపక్షి

సంబంధము కలుగుచున్నది.అట్లే,బ్రహ్మము అసంగము,అక్రియము అగుట వలన ఎవరితో(దేనితో)సంబంధము చేయుటకు స్వయముగా ప్రవర్తించదు. అందువలన దానికి దేనితో సంబంధము సంభవించదు.అయినను అవిద్యా స్వభావమువలన బ్రహ్మవిద్యలకు సంబంధము చెప్పబడినది. ఈ సంబంధము కల్పితముగాన బ్రహ్మముయొక్క అసంగత్వమునకు లేశమాత్రముగూడ హానిలేదు.

**"యత్ర యదధ్యాసః తత్కృతేన దోషేణ గుణేన వాణుమాత్రేణాపి స న సంబధ్య తే"**(అధ్యాసభాష్యము)అధ్యస్తవస్తువుయొక్క గుణదోషాలు అధిష్ఠాన మునకెంతమా త్రము అంటజాలవు.[ఈబ్రహ్మవిద్యలసంబంధము కల్పితమను విషయము ను జిజ్ఞాసువులు ఎల్లప్పుడు జ్ఞప్తియందుంచు కొనవలయును].

6.బ్రహ్మము,అవిద్య మొదలగు అయిదు వస్తువులకు ఎట్లు అన్య వస్తువు లచేత ఉత్పత్తి ఘటిల్లదో,అట్లే,తమలో తమచేతను ఉత్పత్తి ఘటిల్లదు.తమ వలన తామే ఉత్పన్నమగునన్నచో ఆత్మాశ్రయదోషముకలుగును.కనుక తమ వలన తమకే ఉత్పత్తిచెప్పగూడదు.ఎందువలన నీఐదింటికి ఉత్పత్తిలేదో,అం దువలన వాటియొక్క పరస్పరభేదము ఉత్పన్నమగుట సంభవించదు. అందు వలన ఆరవదగు భేదముగూడ అనాదిగా నున్నది.

ఈవిధముగా నీయాఱు పదార్థములయొక్క ఉత్పత్తి లేదు గావున యీ ఆఱును స్వరూపముచే అనాదిగా నున్నవి.వీనిలో ఒక బ్రహ్మము త్రికాలాబా ధ్యమగుటవలన అనాది మరియు అనంతమున్నది.అవిద్యాదికములైదు జ్ఞాన ముచేత బాధింపబడుచున్నందున అనాది సాంతములుగానున్నవి.

**21.ప్రపంచము ప్రవాహరూప అనాది**

ఇక ప్రవాహరూపముచే ప్రపంచము అనాది.శుక్తి(ముత్తెపు చిప్ప)యందు రజతము(వెండి),రజ్జువుయందు సర్పము,సాక్షియందు స్వప్నము భ్రాన్తిచే భాసించును.అవి ఘడియ,జాము,నాలుగు జాములపర్యంతము కనుపించిన ను,ఏయే పదార్థములు ప్రతీతమగునో,అవి పూర్వసిద్ధముగాను,అనాది సిద్ధ ముగాను గోచరించును.అయినను శుక్తియొక్క,రజ్జువుయొక్క,జాగ్రత్తుయొక్క జ్ఞానమైనవానికి పదార్థములయొక్క త్రికాలాభావనిశ్చయరూపమైన"బాధ"కలు గును.అందువలన అవి మిథ్యగా నున్నవి.అట్లే,ప్రపంచము ఆరోపదశలో(అజ్ఞాన కాలమందు)అనాది సిద్ధముగా దోచుచున్నది.అయినను అధిష్ఠాన(స్వస్వరూ-ప)జ్ఞానమైనవానికి త్రికాలాభావనిశ్చయరూపమైన"బాధ"కలుగుచున్నది.కాబ ట్టి ప్రపంచము మిథ్య.దానిని ప్రవాహరూపముగా అనాదియని మరియు సాం తమని అందురు.అథవా,

సృష్టియొక్క ఉత్పత్తిప్రలయములు శ్రుతిస్మృతులయందు ప్రసిద్ధము."**ధాతా యథాపూర్వమకల్పయత్**"(మహానారాయణోపనిషత్6-3)అనిచెప్పబడినరీతిగా పూర్వ పూర్వసృష్టుల సదృశముగా ఉత్తరోత్తరసృష్టులు ఉత్పన్నమగుచున్నవి. ప్రపం చముయొక్క ఉత్పత్తివినాశములు కలిగినప్పటికిని బీజాంకురన్యాయమువలె ప్రవాహరూప అనాదియై ఉన్నది.

అత్రైతే శ్లోకాః—

**శ్లో॥యథా స్వప్న ప్రపంచోఽయం మయి మాయా విజృంభితః ।**

**ఏవం జాగ్రత్ప్రపంచశ్చ మయి మాయా విజృంభితః ॥**

అర్థము:—నిద్రాదోషముచే స్వప్నప్రపంచము నాయందు ఎట్లు సృష్టిం చబడి ప్రతీతమగుచున్నదో; అట్లే జాగ్రత్ప్రపంచము గూడ అజ్ఞానము

చేత నాయందే సృష్టించబడి కనబడుచున్నది – అని పురాణవచనము.

కారికా:—**స్వప్నమాయే యథాదృష్టే గంధర్వనగరం యథా।**

**తథా విశ్వమిదందృష్టం వేదాన్తేషువిచక్షణైః॥**(మాండూక్య వైతథ్యప్ర.31)

అర్థము:—స్వాప్నిక పదార్థములు,గారడివానిచే చూపబడు ఐంద్రజాలిక పదార్థములు మరియు చూస్తుండగానే అదృశ్యమైపోవు గంధర్వనగరము ఎట్లు స్వరూపముచే లేనివే అయినప్పటికి అవివేకులచే సత్యపదార్థములవలె చూడబడుచున్నవో,మరియు అత్యల్పకాలములోనే వాటి అభావముగూడ చూడబడుచున్నదో,అట్లే తత్త్వజ్ఞులచే యీ పరిదృశ్యమాన జగత్తుయొక్క అత్యంతాభావము సమాధికాలములో మరియు ఉపనిషద్రూప వేదాన్తములలో చూడబడుచున్నది.**“నేహనానాఽస్తికిఞ్చన”**(బృ.4-4-19)**“నతుతద్ ద్వితీయమస్తి”**(బృ.4-3-23); **“యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్”**(బృ.4-5-15);**“ఆత్మైవేదమగ్ర ఆసీత్”**(బృ.1-4-17) **“బ్రహ్మైవేదమగ్రఆసీత్”**(బృ.1-4-10)**“ద్వితీయాద్వైభయం భవతి”** (బృ.1-4-2)"ఇక్కడ నానా(ద్వైతము)ఏమియును లేదు", “బ్రహ్మ భిన్నము ఏమియును లేదు", “ఏ స్వరూపానుభవదశయందు తత్త్వదర్శికి సమస్తము ఆత్మయే(తన స్వరూపమే)అయినదో”,“సృష్టికిపూర్వము సమస్తజగత్తు ఆత్మయే అయి ఉండెను”, ఉత్పత్తికి పూర్వము సంపూర్ణజగత్తు బ్రహ్మమే అయి ఉండెను.” “భేదజ్ఞానము చేనిస్సందేహముగా భయము(సంసారము)కలుగును.”ఇత్యాదిశ్రుతులచే తత్త్వజ్ఞానులు జగత్తుయొక్క మిథ్యాత్వనిశ్చయమువలన దాని అత్యంతాభావమును దర్శించుచున్నారు.

**శ్లో ॥ విశ్వం దర్పణ దృశ్యమాననగరీతుల్యం నిజాన్తర్గతం,**

**పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా।**

**యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయమ్,**

**తస్మై శ్రీ గురుమూర్తయే నమయిదం శ్రీ దక్షిణామూర్తయే ॥**

భావార్థము:—విశ్వము అనగా జడాజడ జగత్తు.ఇది అద్దములో కనిపించు నగరమువలె తనయందే యున్నది.నిద్రావశమున స్వప్నప్రపంచము స్వప్న ద్రష్టకు ఎట్లు బాహ్యదేశములోనున్నట్లుతోచునో,అట్లే నానావిధ నామరూపము లతో నభివ్యక్తమైయున్న,అనేక కర్తలు,భోక్తలతో కూడియున్న;ప్రతినియత (ఇదిఇప్పుడు,ఇక్కడ,ఇలాఅని నిశ్చితమైన)దేశ,కాల,నిమిత్తములుగల క్రియా ఫలములకు ఆశ్రయము;మనస్సుచేతనూహించుటకు శక్యముకాని రచనావి ధానం గలదియగు నీ జగత్తు—మాయాశక్తిచే జాగ్రదవస్థయందును ఆత్మయందే బాహ్యదేశమునందువలె స్ఫురించుచున్నది.స్వప్నమును అనుభవించి తిరిగి జాగ్రదవస్థకు వచ్చినప్పుడు అనగా మెలకువరాగానే ద్రష్టయగు ఆత్మ యొక్కడే మిగులును.స్వప్నప్రపంచమంతయు అదృశ్యమగును.అట్లే బ్రహ్మాత్మైక్య సాక్షా త్కారము(ప్రబోధము)కలుగగా జాగ్రత్ప్రపంచమంతయు లుప్తమగును.అధిష్ఠా న ప్రత్యగభిన్న సచ్చిదానంద బ్రహ్మస్వరూపము అనుభవగోచరమగును.అట్టి బ్రహ్మాత్మానుభవసంపన్నుడైన గురుమూర్తి శ్రీ దక్షిణామూర్తికి యీ నా నమస్కారము.

**శ్లో॥దీర్ఘస్వప్నమిమం విద్ధి దీర్ఘం వా చిత్తవిభ్రమమ్।**

**దీర్ఘంవాఽపి మనోరాజ్యం సంసారం రఘునన్దన॥**

**(సంసారం దుఃఖ సాగరమ్)** (యో.వా.ని.ప్ర.పూర్వార్థము 28-28)(వరాహోపనిషత్. 2-64)

హే రామచంద్రా!ఈ దేహాదిక సంసారము నిత్యానుభూత ప్రసిద్ధ స్వప్నము కంటె వైధర్మ్యముగలదై బహుకాలస్థాయిగానున్నదను సందేహము వలదు.ఈ

సంసారము ఒక దీర్ఘస్వప్నమని లేక బహుకాల దిఙ్మోహములాంటి చిత్తభ్రమ వంటిదని లేక దీర్ఘకాల మనోరాజ్యము వంటిదని తెలిసికొనుము.

**శ్లో ॥స్వప్నదేహో యథాధ్యస్తస్తథైవాయం హి దేహకః ।**

**అధ్యస్తస్య కుతో జన్మ జన్మాభావే కుతః స్థితిః ॥**

**శ్లో ॥యథా రజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతి వై భ్రమాత్ ।**

**తద్వత్సత్యమవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః ॥**

**శ్లో ॥రజ్జుఖండే పరిజ్ఞాతే సర్పరూపం న తిష్ఠతి ।**

**అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపంచే శూన్యతాం గతే।**

**దేహస్యాపి ప్రపంచత్వాత్ప్రారబ్ధావస్థితి కుతః॥**(నాదబిందూపనిషత్ 24→28)

అర్థము:—స్వప్నశరీరము ఎట్లు అధ్యస్తమో,అట్లే జాగ్రద్దేహముగూడ అధ్యస్తమే. ఆధ్యాసిక స్వప్నపదార్థములు(దేహాదులు)కేవలము ప్రతీతికి విషయమగునే గాని వాస్తవముగా వస్తువులు ఉత్పన్నము కాలేదు.అట్లే ఆధ్యాసికమైన జాగ్రద్దేహముగూడ ప్రతీతమగుచున్నదేగాని పారమార్థికసత్తచే అత్యంతాభావమున్నందున దానికి ఉత్పత్తిలేదు.ఎందువలన ఉత్పత్తిలేదో అందువలన స్థితినాశములుగూడలేవు.రజ్జువును వదిలేసి భ్రమచేత సర్పము ఎట్లు గ్రహించబడుచున్నదో,అట్లే అధిష్ఠానమగు బ్రహ్మమును తెలియజాలక అజ్ఞానముచే భ్రమజెంది మూఢబుద్ధిగలవాడు(అజ్ఞజనుడు)నామరూపాత్మక ప్రపంచమును చూచుచున్నాడు.రజ్జుజ్ఞానముచే ఎట్లు సర్పభ్రాంతి నివర్తించునో,అట్లే అధిష్ఠాన ప్రత్యగభిన్నబ్రహ్మజ్ఞానముచే ఆధ్యాసిక ప్రపంచము శూన్యమైపోవును.అనగా మిథ్యాత్వనిశ్చయరూప"బాధ"కలుగును.ఇట్లు మిథ్యాత్వనిశ్చయము గలిగిన

తత్త్వజ్ఞానిదృష్టిలో దేహముగూడ జగదన్తఃపాతియేగావున ప్రారబ్ధాయత్త శరీరము గూడ బాధితమైనందున, ఇక ప్రారబ్ధమునకు అస్తిత్వమెక్కడ?

**శ్లో॥అనుభూతోఽప్యయం లోకో వ్యవహారక్షమోఽపి సన్।**

**అసద్రూపోయథా స్వప్న ఉత్తరక్షణబాధితః ॥**

**శ్లో ॥సప్నే జాగరితం నాస్తి జాగరే స్వప్నతా నహి ।**

**ద్వయమేవ లయే నాస్తి లయోఽపి హ్యనయోర్నచ ॥**

**శ్లో॥యథైవ వ్యోమ్ని నీలత్వం యథా నీరం మరుస్థలే ।**

**పురుషత్వం యథా స్థాణౌ తద్వద్విశ్వం చిదాత్మని ॥**

**శ్లో ॥యథైవ శూన్యే వేతాలో గంధర్వాణాం పురం యథా ।**

**యథాకాశే ద్విచంద్రత్వం తద్వత్సత్యే జగత్థ్సితిః ॥**

**శ్లో॥యథా తరఙ్గకల్లోలైర్జలమేవ స్ఫురత్యలమ్ ।**

**ఘటనామ్నా యథా పృథ్వీ పటనామ్నాహి తన్తవః ॥**

**శ్లో॥జగన్నామ్నా చిదాభాతి సర్వం బ్రహ్మైవ కేవలమ్ ।**

**యథా వంధ్యాసుతో నాస్తి యథా నాస్తి మరౌ జలమ్ ॥**

**శ్లో॥యథా నాస్తి నభోవృక్షస్తథా నాస్తి జగత్థ్సితిః ।**

**గృహ్యమాణే ఘటే యద్వ న్మృత్తికా భాతి వై బలాత్ ।**

**వీక్ష్యమాణే ప్రపఞ్చే తు బ్రహ్మైవాభాతి భాసురమ్ ॥**(యోగశిఖోపనిషత్ చతుర్థాధ్యాయే)

అర్థము:—ఈలోకము(చరాచరప్రపంచము)అన్న జలాదులచే ఆకలిదప్పు

లు శమించుటమున్నగు అర్థక్రియాకారితారూప వ్యవహారక్షమతా గల్గియున్న ట్లు అనుభూతమగుచున్నను పరమార్థసత్యము మాత్రముకాదు.మెలకువకు రాగానే మరుక్షణములో స్వప్నప్రపంచము ఎట్లు అసద్రూపమగుచున్నదో, అట్లే బ్రహ్మాత్మైకత్వానుభూత్యుత్తరక్షణములో యీవ్యావహారిక జగత్తుగూడ అసద్రూ పమగుచున్నది."**నాసీదస్తిభవిష్యతి**"పూర్వములేకుండెను,ఇప్పుడును—రజ్జువు యందు ప్రతీయమానమగు సర్పము వాస్తవంగా ఎట్లు లేదో,అట్లే ఈపరి దృశ్య మానజగత్తునులేదు.మరియు భవిష్యత్తులోఉండబోదు—అను యీ ప్రకారమగు త్రికాలాభావ నిశ్చయరూప"బాధ"కలుగుచున్నది.స్వప్నమునందు జాగ్రత్తులే దు.జాగ్రత్కాలములో స్వప్నము భాసించుటలేదు.ఈరెండు సుషుప్తిలో కనుపిం చుట లేవు.జాగ్రత్స్వప్నములలో సుషుప్తియునులేదు.ఈనిత్యానుభవ ప్రమాణ ముచే ప్రపంచము సత్యముగాదు మరేమనగా అసద్రూపమని సిద్ధమగుచున్న ది.ఆకాశమునందు నీలిమవలె,ఎండమావులలో(ఊషరభూమి అనగా మరు భూమిలో)జలమువలె,స్థాణువు(మొద్దు)నందు పురుషునివలె-యీ విశ్వము చైతన్యమునందు భ్రాన్తిచే భాసించుచన్నది.రాత్రి పూట పిల్లవాడు ఆకాశములో భేతాళున్ని కల్పించుకొన్నట్లు,గగనమునందు గంధర్వపురమువలె,నేత్రవ్యాధిగ లవానికి ఆకసమున రెండు చంద్రులు కనుపించునట్లు సద్రూప బ్రహ్మమునం దు యీఅసద్రూప జగత్తు విద్యమానమై గోచరించున్నది.ముంచెత్తుకొచ్చే స- ముద్రపు అలలలో జలమే స్ఫురించునట్లు,ఘటములో మృత్తికా,వస్త్రములో తం తువులు(పోగులు)మాత్రమే వ్యాప్తమై యున్నట్లు,(వాస్తవముగా ఘటపటము లు లేనట్లు)యీ జగత్తునకు యథార్థత్వములేదు.అనగా పారమార్థిక సత్యత్వ ములేదు.నామరూపములు మిథ్య."**ఈశావాస్యమిదగ్ంసర్వమ్**"(ఈశా.1)అని శ్రు తిమాత శాసించిన విధముగా ఈజగత్తంతా పరమేశ్వరునిచే వ్యాప్తమై, పరమా

త్మయే జగద్రూపములో దృష్టిగోచరమగుచున్నాడు.అందుకే“**సర్వం బ్రహ్మైవ కేవలమ్**”(యో.శి.4-18;తేజోబిందు.6-4)అని ఉపనిషన్మాత[4] ఉద్ఘోషించుచున్నది.ఎట్లు వంధ్యాసుతునికి(గొడ్రాలుకుమారునికి),ఎండమావుల్లో కనుపించు జలమునకు, ఆకాశవృక్షమునకు ఉనికిలేదో,అట్లే ఈజగత్తునకును ఉనికి(అస్తిత్వము)లేదు. విచారశీలునికి ఘటములో మృత్తికయే గోచరించు విధమున సమ్యక్ వేదాన్త తత్త్వవిచారబలముచేయిప్రపంచమునందణువణులో స్వయంప్రకాశ బ్రహ్మమే అనుభవ గోచరమగును.

(శ్రీసదాశివబ్రహ్మేంద్రస్వాములవారు)

సర్వం బ్రహ్మమయం రే రే, సర్వం బ్రహ్మమయం ||సర్వం||
కిం వచనీయం కిమవచనీయం
కిం రచనీయం కిమరచనీయమ్ ||సర్వం||
కిం పఠనీయం కిమపఠనీయం
కిం భజనీయం కిమభజనీయమ్ ||సర్వం||
కిం బోద్ధవ్యం కిమబోద్ధవ్యం

---

[4] శ్లో||మాతేవ పుత్రమనుబోధయతి శ్రుతిర్హి, లోకం సమస్తమపి యోజయితుం సుఖేన| తస్మాచ్ఛ్రుతేరభిహితార్థ మతంద్రితేన, చిత్తేన సాధయితుమత్ర జనా యతధ్వమ్||(ఆత్మవిద్యావిలాసము 3)లోకంలోని సమస్త మానవులుగూడ సుఖంగా జీవించడానికి ఉపనిషన్మాత బిడ్డలకు తల్లి బోధించునట్లు నిరంతరము బోధించుచున్నది. అందువల్ల ఉపనిషత్తులు బోధించే హితవాక్యాలను ఏమరుపాటు(విరామం)లేకుండా ఎల్లప్పుడు ఇక్కడ(ఈ దేహంలో ఉన్నప్పుడే)మనస్సుద్వారా సాధించడానికి ఓ జనులారా! ప్రయత్నించండి.

కిం భోక్తవ్యం కిమభోక్తవ్యమ్ ||సర్వం||

సర్వత్ర సదా హంసధ్యానం

కర్తవ్యం భో ముక్తినిధానమ్ ||సర్వం||

---

**"ఇందుగల డందులేడని**

**సందేహమువలదు చక్రి సర్వోపగతుండు**

**ఎందెందు వెదకి చూచిన**

**అందందే గలడు దానవాగ్రణి వింటే"** (పోతన భాగవతము-ప్రహ్లాదుడు).

**"మాయామాత్రమిదంద్వైతమద్వైతంపరమార్థతః"**(మాం.ఆగమ.ప్ర.17)

ఈద్వైత ప్రపంచము రజ్జువునందు సర్పమువలె మాయామాత్రమై యున్నది. అద్వితీయ పరబ్రహ్మమే పరమార్థము.

**శ్లో ॥ న చ విజ్ఞాయతే కస్మాత్కాలాత్ప్రభృతి చాగతాః।**

**నిత్యాగమాపాయపరాః ఏతాః సర్గపరమ్పరాః॥**

**అనాదిమత్యోఽవిరతం ప్రస్ఫురన్తి తరఙ్గవత్।**

**పూర్వాత్పూర్వం కిలాభూవం స్తతః పూర్వతరం యథా॥**(యో.వా.స్థితిప్ర.47-18&19)

శ్రీవసిష్ఠభగవానులు శ్రీరామచంద్రునకు ఆత్మతత్త్వోపదేశము చేస్తూ ఈ సృష్టి పరంపరలయొక్క ప్రవాహరూప అనాదిత్వమును చెప్పుచున్నారు.నిత్యము ఆవిర్భావతిరోభావము(ఉత్పత్తి వినాశములు)గల ఈసృష్టిపరంపరలు ఎప్పటి నుండి,ఎక్కడనుండి ప్రాప్తమగుచున్నవి—ఇది తెలియశక్యముగానిది.అనాది

కాలమునుండి నిరంతరము తరంగములవలె స్ఫురించుచున్నవి.వర్తమాన సృష్టికి పూర్వము వేరే సృష్టి యుండెను.దానికి పూర్వము,మరియు దానికి పూర్వముగూడ సృష్టులుండెను.ఇట్లు(బీజాంకురములవలె,దీపశిఖలవలె,నదీప్రవాహమువలె)అనాది ప్రవాహరూపముచే ఈసృష్టిపరంపరలు కొనసాగుచున్నవి.

**"జగత్సర్వమిదంమిథ్యాప్రతీతిః"**(త్రిశిఖిబ్రాహ్మణోపనిషత్2-30)**"జగదేతద్ భ్రమాత్మకమ్"**(మహో.4-65)**"ప్రపంచోఽయమనాదిసిద్ధోభవతి"**(శ్రుతి....)**"అనాదేరన్తవత్త్వంచ సంసారస్య","ఆదావన్తేచయన్నాస్తివర్తమానేఽపితత్తథా"**(మాం.అలాతశాంతి.ప్ర.30&31) ఇత్యాది శ్రుతిస్మృతులు సంసారము భ్రాన్తిసిద్ధము,అనాది మరియు అంతము గలదియని ఉద్ఘోషించుచున్నవి.

**శ్లో ॥ అనాదావిహ సంసారే సంచితాః కర్మకోటయః ।**

**అనేన విలయం యాన్తి శుద్ధోధర్మో వివర్ధతే ॥**

(అధ్యాత్మోపనిషత్. 37;వేదాన్త పంచదశి 1-59)

అర్థము:—అనాదియైన ఈసంసారమునందు సంపాదించబడిన అపరిమితములైన పుణ్యాపుణ్యరూప కర్మలు ఈ సమాధిచేత నాశమును పొందుచున్నవి. నిర్మలమగు సాక్షాత్కారమును కల్గించునట్టి ధర్మవిశేషము(చిత్తశుద్ధి)వృద్ధినొందును.ఇట్లు"**అజ్ఞానము స్వరూపముచే అనాదియని**"మరియు "**అజ్ఞానకార్యమగు యీ ప్రపంచము ప్రవాహరూపముచే అనాదియని**" నిరూపించనైనది.

## 22.జ్ఞాననివర్త్యము అజ్ఞానము

అజ్ఞానముయొక్క లక్షణములో మరొక విశేషణము జ్ఞాననివర్త్యత్వమ్,అనగా జ్ఞానముచే నివృత్తియగుటకు యోగ్యమైనది—అజ్ఞానము.ఏదేని వస్తువుయొక్క అజ్ఞానమున్నచో దానిని తెలిసికొను జిజ్ఞాసచేత విచారించిన దాని జ్ఞానము

కల్గుతుంది.జ్ఞానముచే అజ్ఞానము నివర్తించును.ఇది సర్వానుభవసిద్ధము. సచ్చిదానంద బ్రహ్మస్వరూపము జీవునియొక్క వాస్తవస్వరూపము.కాని,అనాద్యజ్ఞానముచే తన యథార్థస్వరూపమును తెలియజాలకున్నాడు.

**"అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః"।**(గీత 5-15);**అనృతేన హి ప్రత్యూఢాః।**(ఛాం.8-3-2)

స్వప్రకాశ సచ్చిదానంద అద్వితీయ పరమార్థ సత్యజ్ఞానస్వరూప ఆత్మయొక్క ఆవరణచేత(అజ్ఞానముచేత)ఈ మూఢసంసారిజీవులు-నేను అజ్ఞానిని, జీవుడను, కర్తను, భోక్తను,నాకంటె భిన్నమగు యీ దృశ్యమాన జగత్తు నాకు భోగ్యము, ఈ జగత్తునకు కర్త ఈశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వనియంత- ఇత్యాది భేధభ్రమచే మోహితులగుచున్నారు.

**"నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః"।** (గీత.7-25)

నేను లోకులందరికీ తెలియను.నా భక్తులైన ఏకొద్దిమందికో మాత్రమే నేను తెలుస్తాను.పరమేశ్వరుడనైన నాయొక్క అచింత్యప్రజ్ఞావిలాసరూప సంకల్పమే యోగము.ఈ త్రిగుణసంఘటనరూప యోగము వస్తుతః లేనిదేయగు జగత్తును శుద్ధబ్రహ్మరూప అధిష్ఠానమునందు అఘనపటీయసీయగు కల్పనాశక్తిచే గోచరింపజేయుచున్నందున,నాయోగము(సంకల్పము)యోగమాయ అనిచెప్పబడుచున్నది.ఈయోగమాయచే ఆవృతమైనందున మూఢులగుఈలోకము జన్మమరణరహితమగు, సర్వస్వరూపమగు నన్ను తెలియజాలకున్నారు.

ఉపరోక్త భగవద్వచనములచే అజ్ఞానము(మాయ,అవిద్య)స్వరూపావరకముగా తెలియబడుచున్నది.మరియు"అహమజ్ఞః"ఇత్యాద్యనుభవము గూడ ఉంది. నీటిపైని నాచు నీటిని ఆశ్రయించుకొని యుండి నీటినే అగుపడకుండాజేసినట్లు,

గృహాశ్రిత అంధకారము గృహమునే ఆవరించినట్లు,చైతన్యమునకంటె పృథగస్తిత్వములేనిదగు అజ్ఞానము చైతన్యమును(ఆత్మను)ఆశ్రయించుకొనియుండి చైతన్యమునే కప్పివేయుచున్నది, అనగా తెలియకుండాజేయుచున్నది.

**"ఆశ్రయత్వ విషయత్వభాగిని నిర్విభాగ చితిరేవ కేవలా"।**(సం.శా.1-319)

కేవల విభాగరహితచైతన్యమే అజ్ఞానమునకు ఆశ్రయము మరియు విషయమగుచున్నది(అజ్ఞానముచే కప్పబడుచున్నది).ఇటువంటి సర్వానర్థకారియగు జన్మమరణరూప సంసారమునకు కారణమగు అజ్ఞానము(మాయ)ను అధికారి పురుషుడు బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచే నాశనముచేయగలడు—అని శ్రీకృష్ణ పరమాత్మ శ్రీమద్భగవద్గీతలో నుడివియున్నాడు.

**"మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే"।**(గీత. 7-14)

సర్వోపాధిరహిత సచ్చిదానంద అఖండ అద్వితీయ పరమాత్మదేవుడను నేనే అని—ఈప్రకారంగా ప్రత్యగభిన్న బ్రహ్మసాక్షాత్కారమునొందిన ఒకానొక అధికారి పురుషుడు నాయొక్క త్రిగుణాత్మక వైష్ణవీమాయ ను(అవిద్యను)అనాయాసంగా దాటగలడు అనగా నాశనము చేయగలడు.

**శ్లో ॥ తేషామేవానుకంపార్థమహమజ్ఞానజం తమః।**

**నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥** (గీత.10-11)

భావార్థము:—ఎల్లప్పుడు నాయొక్క ధ్యానతత్పరులై ప్రేమపూర్వకముగా నన్ను భజించు భక్తులననుగ్రహించుటకొఱకు వారియొక్క"అహంబ్రహ్మాస్మి" యను అంతఃకరణవృత్తియందు ప్రకాశిస్తూ ఉండి,వృత్తిరూప జ్ఞానదీపముచే అజ్ఞానమువలన కలిగిన తమస్సును(చీకటిని)నాశనము చేస్తాను.

**శ్లో||జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**

**తేషామాదిత్యవద్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**(గీత 5-16)

అర్థము:—కాని,జ్ఞానముచే యెవరి ఆత్మసంబంధమైన అజ్ఞానము నశించి నదో,వారియొక్క జ్ఞానము సూర్యునివలె పరతత్త్వమును ప్రకాశింపజేయును.

ఇత్యాది భగవద్వచనములచే అజ్ఞానము జ్ఞానముచే నివర్తింపబడు తుంది—అని స్పష్టమగుచున్నది. అట్లే, శ్రీ మన్మహాభారతము శాంతి పర్వము 279-11 వ శ్లోకంలో—

**శ్లో||జ్ఞానేన హి యదా జన్తురజ్ఞాన ప్రభవం తమః ।**

**వ్యపోహతి తదా బ్రహ్మ ప్రకాశతి సనాతనమ్ ॥**

అర్థము:—మానవులు ఎప్పుడు జ్ఞానముచే అజ్ఞానమువల్ల కల్గిన చీకటిని నశింపజేయగల్గుదురో,అప్పుడు సర్వవ్యాపకము,స్థూల సూక్ష్మ కారణరూప సర్వోపాధిరహిత అనాదియగు పరబ్రహ్మము ప్రత్యగభిన్నముగా ప్రకాశింపబడు ను.(సాక్షాత్కరింపబడును)-అని చెప్పబడినది. మరియు,

శ్రీవసిష్ఠమునీంద్రులవారుగూడ శ్రీయోగవాసిష్ఠములో జ్ఞానముచేతనే అజ్ఞాన ము నివర్తింపబడునను విషయమును పదేపదే(అడుగడుగున)చెప్తూవచ్చారు.

**శ్లో || సంసారోత్తరణే జన్తోరుపాయో జ్ఞానమేవహి ।**

**తపోదానం తథా తీర్థం అనుపాయా ప్రకీర్తితాః ॥**(యో.వా.2-10-22)

అర్థము:—సంసారసాగరమునుండి తరించుటకు జీవులకు జ్ఞానమే ఏకైక సాధ నము,కాని,తపస్సు,దానము,తీర్థాటన మొదలగునవికావు-అని చెప్పబడినది.

**శ్లో ॥అవిద్యా క్షీయతే తావదాలోకేనాంధతాయథా ।**

**దీపహస్తోయథాభ్యేతి తమోరూప దిదృక్షయా।**

**తథా విలీయతే సర్వం తమస్తాపైర్ష్టుతం యథా॥**

**ఏవమాలోక్యమానైషా క్వాపియాతి పలాయతే।**

**యావన్నాలోక్యతే తావన్న కించిదపి దృశ్యతే।**

**ఆలోకితే యథాఽవిద్యా తత్తథా ప్రతిపద్యతే॥**(యో.వా.నిర్వాణ ప్ర. పూర్వార్ధము. సర్గ.10)

భావార్థము:—విచారించనంతవరకే అవిద్యయొక్క విద్యమానత(అస్తిత్వము) కించిద్విచారించినంత మాత్రముచే అవిద్య అవిద్యమానమై పోతుంది,అంటే దానికి ఉనికియే లేకుండాపోతుంది.భ్రాన్తిచే ప్రతీయమాన రజ్జుసర్పము గూర్చి-ఈ సర్పము వాస్తవమా?లేక కల్పితమా?అని విచారించిన మాత్రముననే సర్పము బాధింపబడి రజ్జువుయొక్క యథార్థస్వరూపము తేలియబడినట్లు;దర్శనశక్తికి ప్రతిబంధకమగు చీకటి ప్రకాశముచే నష్టమగునట్లు;విచారముచే అవిద్యాసహిత సంపూర్ణ జగత్తు నష్టమగును.అరుణోదయ మాత్రముచేతనే అంధకారము పలాయనము చిత్తగించినట్లు మంద మంద ఆత్మవిచారముచేతనే అవిద్య సన్నగిల్లుతుంది.అట్లుండగా,సమ్యగ్విచారజనిత దృఢ అపరోక్షబ్రహ్మా-త్మైకత్వ జ్ఞానోదయమైనచో,ఇక అవిద్య ఎక్కడికి పలాయనమగునో?దాని ఆచూకిగూడ తెలియదు.

ఇక్కడ శ్రీకృష్ణపరమాత్మ మరియు శ్రీవసిష్ఠభగవానులు ఆత్మజ్ఞానమునకు దీపముయొక్క సాదృశ్యరూప రూపకాలంకారమును చెప్పారు.ఈ రూపకాలంకారముచేత వారియొక్కఅభిప్రాయము ఈవిధముగా వ్యక్తమగుచున్నది.అంధకారమును నివృత్తి చేయుటయందు దీపము కేవలము తనయొక్క ఉత్పత్తిని

మాత్రము అపేక్షిస్తుంది. దీపముయొక్క ఉత్పత్తికంటె భిన్నమైన యేయితర కర్మనుగాని,అభ్యాసమునుగాని అపేక్షించదు.మరియు ఆదీపముచే చీకటి నష్ట మైన పిదప పూర్వము విద్యమానమైయున్న ఘటపటాదులే అభివ్యక్తమవు తాయి.పూర్వములేని(అవిద్యమాన)వస్తువులను దీపము ఉత్పన్నముచేయ దు. అట్లే,ఆత్మజ్ఞానముచేత అజ్ఞాననివృత్తి చేయుటయందు ఆత్మజ్ఞానము తనయొక్క ఉత్పత్తిని మాత్రము అపేక్షిస్తుంది.కాని,తన ఉత్పత్తికంటె భిన్నమైన యే యితర కర్మనుగాని,అభ్యాసమునుగాని అపేక్షించదు.మరియు ఆత్మజ్ఞాన ముచే అజ్ఞాన నివృత్యనంతరము పూర్వమే విద్యమానమైయున్న నిత్యశుద్ధ బుద్ధముక్త బ్రహ్మభావరూప మోక్షము అభివ్యక్తమగును.పూర్వములేని(అవి-ద్యమాన)మోక్షమును ఆత్మజ్ఞానము ఉత్పన్నముచేయదు.ఒకవేళ ఆత్మజ్ఞాన ము మోక్షమును ఉత్పన్నము చేయునని అంగీకరించినచో మోక్షమునకు గూడ స్వర్గాదిఫలములవలె అనిత్యత్వము ప్రసక్తమగును.మరియు కర్మాది సాధనాపేక్షగూడ కలుగును.కాని,మోక్షముయొక్క అనిత్యత్వమును యే దర్శ నకారులు(శాస్త్రకారులు)గూడ ఒప్పుకొనరు.“**నిత్యశ్చ మోక్షః సర్వైర్మోక్షవాదిభిర భ్యుపగమ్యతే**”(బ్ర.సూ.భాష్యము.1-1-4)అనిత్యమగు మోక్షమును గోరి యెవరుగూడ ప్రవృత్తులు కారుగదా!

భాష్యకారులు మరియు వారి అనుయాయులుగూడ సమ్యగ్ జ్ఞానముచేత నే అజ్ఞానముయొక్క నివృత్తి కలుగునని[5]భాష్యాదులలో పునః పునః చెప్పావ

[5] **శ్లో॥సూత్రార్థో వర్ణ్యతే యత్ర వాక్యైః సూత్రానుకారిభిః। స్వపదాని చ వర్ణ్యన్తే భాష్యం భాష్యవిదో విదుః॥**(పరాశర ఉపపురాణము 18-15&16)సూత్రాదిరూప మూలగ్రంథములలోని పదములకు పర్యాయరూప స్వపదములను చెప్పి, మూలగ్రంథపదముల అనుసారియగు పదములతో

చ్చారు.“**నచ మిథ్యాఽజ్ఞానస్య సమ్యగ్ జ్ఞానాదన్యత్ర ని వృత్తిరస్తి**”(బ్ర.సూ.భాష్యము. 2-3-30)ప్రత్యగభిన్నపరబ్రహ్మముయొక్క యథార్థజ్ఞానముకలుగకుండా అనాది మిథ్యా అజ్ఞానము నివర్తించదు. “**యతో జ్ఞానమజ్ఞానస్యైవ నివర్తకమ్**”(పంచపాదికా పృష్ఠము.27)జ్ఞానముయొక్క ముఖ్యకార్యము అజ్ఞానమును నాశనము చేయుటయే.అట్లే శ్రీవాచస్పతిమిశ్రులవారుగూడ“**సాక్షాత్కారరూపోహి విపర్యాసః సాక్షాత్కారరూపేణైవ తత్వజ్ఞానేనోచ్ఛిద్యతే**”(భామతీ.పృ.67).అనాదిసిద్ధ అజ్ఞాన తత్కార్య రూప విపర్యయము(దేహాదికభ్రమ)అపరోక్షరూపమున్నది.ఇది దృఢాపరోక్షతత్త్వనిశ్చయముద్వారానే ఉచ్ఛిన్నమగును.పరోక్షజ్ఞానముచే కాదు.దిగ్భ్రమ,అలాతచక్రము(మండుచున్న కొఱివిని గిరగిరా త్రిప్పినచో మంట చక్రమువలె తోచును),నౌకపై పయనించువానికి గట్టునఉన్న వృక్షములు వెనక్కి పరుగిడునట్లు తోచుటవలె,ఎండమావులలోని నీరు మొదలగునవి అపరోక్షభ్రమలు. ఇవి అపరోక్షాత్మక దిగాది తత్త్వనిశ్చయము చేతనే నివృత్తమవుతాయి.పరోక్షజ్ఞానముచే నివృత్తము కావు.

అధికారి పురుషుడు శ్రోత్రియబ్రహ్మనిష్ఠ శ్రీగురుదేవులనాశ్రయించి వేదాన్త శాస్త్రమును(తత్త్వమస్యాది మహావాక్యములను)నిరంతరము విచారించగా అనాత్మాకారరహిత, సర్వోపాధిరహిత శుద్ధచైతన్యాకారమగు “అహంబ్రహ్మాస్మి”అను అప్రతిబద్ధ దృఢాపరోక్షజ్ఞానము అనబడు చరమవృత్తి ఉదయించును.ఆ సాక్షాత్కారరూప వృత్తియందు ప్రతిబింబించిన చైతన్యము,ఎట్లు దీపముత్పన్నమగుటతోడనే అంధకారమును నష్టముచేయునో,అట్లు స్వాశ్రయవిషయక అజ్ఞాన

---

సూత్రార్థమును వర్ణిస్తూ,స్వపదములయొక్క వివరణము అనగా విశేషవర్ణనముగూడ ఎచ్చట చేయబడునో అద్దానిని “**భాష్యము**” అంటారు.

మును నాశనము చేయును.అవిద్యా ధ్వంసమగుటతోడనే ఆ వృత్తిసహిత సర్వకార్యప్ర పంచము నష్టమగును.ఎందుకంటే,**"మూలే నాస్తి కుతః శాఖాః"** అను న్యాయముచే ఉపాదానకారణము నశించినచో ఉపాదేయము(కార్యము) యొక్క నాశనమును సర్వశాస్త్రకారులు అంగీకరితురు.

**శ్లో॥అజ్ఞానం శిథిలీ భూతమేవం నష్టం విదుర్బుధాః ।**

**న నాశేన వినోదేతి పూర్వసంస్థాన విచ్యుతిః॥**(యో.వా.ని.ప్ర.పూర్వా.95-3)

అర్థము:—ఒకవేళ జ్ఞానాభ్యాసపరిపాక క్రమముచే మూలాజ్ఞానము శిథిల మైనచో,అట్లే అజ్ఞానజనిత భ్రమాత్మక సంసారముగూడ నష్టమగును.ఇది బుధ జన సమ్మతము.అజ్ఞానము వినాశమును పొందకుండా,జగత్తుయొక్క ఆకారవి చ్ఛేదము ఎప్పుడుగూడ కలుగజాలదు.కార్యప్రపంచముయొక్క నాశనము మూడు విధములుగా కలుగు చున్నది.

**ఆత్మమాయ మూడువిధములుగా నశించును**

అజ్ఞానములో మూడుశక్తులుగలవు."1.అనేకశక్తిమదవిద్యాయాః ప్రపఞ్చే పారమార్థికత్వాదిభ్రమహేతుశక్తేః,2.అర్థక్రియాసమర్థత్వసమ్పాదకశక్తేశ్చ,3.ప్రార బ్ధకర్మసమకాలీనతత్త్వసాక్షాత్కారేణ నివృత్తావపి అప రోక్షప్రతిభాసయోగ్యార్థా భాసజనికాయాః శక్తేరనువృత్తేః తద్వతీ అవిద్యాపి తిష్ఠత్యేవేతి నోక్తదోషావకాశః" ।(అద్వైతసిద్ధిః. పృష్ఠము.1300 శ్రీ స్వామి యోగీన్ద్రానన్ద హిందీ అనువాదము)

1.ప్రపంచమునందు పరమార్థ సత్యత్వబుద్ధిని సంపాదనముచేయు సామ ర్థ్యరూపశక్తిప్రభావముచే జగత్తు త్రికాలాభాధ్యరూప సత్యముగా స్ఫురించును (కనబడును).వేదాన్తశ్రవణాది అభ్యాసపరిపాకముచే అజ్ఞానములోని ఈశక్తి(ప్ర పంచమునందు పరమార్థబుద్ధిని కలిగించుశక్తి)నివృత్తమయ్యి అర్థక్రియాసామ

ర్థ్యమును సంపాదనముజేయు వ్యావహారిక సత్యత్వబుద్ధి కలుగును.ఈకారణముచే,

2.అజ్ఞానమునందు జగత్తులో వ్యావహారిక సత్యత్వబుద్ధిని సంపాదనము చేయు రెండవశక్తి ఉంది-అని చెప్పబడినది.ఇది ఆత్మతత్త్వసాక్షాత్కారము కలుగుటతోడనే నివృత్తమగును.వ్యావహారిక సత్యత్వమును సంపాదనముచేయు సామర్థ్యరూప ఈశక్తి ఆత్మతత్త్వసాక్షాత్కారముచే నష్టమైన మీదట ప్రపంచము వ్యావహారిక సత్తగలదిగా స్ఫురించదు. కాని,ప్రాతిభాసిక సత్తచే స్ఫురించును. అందుకే,

3.ప్రారబ్ధసమకాలీనతత్త్వసాక్షాత్కారముచే నివృత్తమైనప్పటికిని,జగత్తులో అపరోక్షప్రతిభాసయోగ్యఅర్థాభాసమునుకలుగజేయు ప్రాతిభాసికసత్తను సంపాదనముచేయు మూడవశక్తిగూడ అవిద్యలో గలదని స్వీకరించబడుచున్నది. ఈ ప్రాతిభాసిక సత్తను సంపాదనముచేయు సామర్థ్యరూప అజ్ఞానముయొక్క శక్తి భోగముచే ప్రారబ్ధకర్మ క్షీణించిన పిదప అజ్ఞానముతోపాటు నివృత్తమగును. ఈవిషయములో లోకహితైషిణియగు ఉపనిషన్మాతయే ప్రమాణముగా నున్నది.

**"తస్యాభిధ్యానాద్యోజనాత్తత్త్వభావాద్ భూయశ్చాన్తే విశ్వమాయానివృత్తిః"** (శ్వే.1-10)

**శ్లో॥శాస్త్రేణ నశ్యేత్పరమార్థ బుద్ధిః(దృష్టి), కార్యక్షమా నశ్యతి చాపరోక్షాత్।**

**ప్రారబ్ధనాశే ప్రతిభాసనాశో, హ్యేవం క్రమాన్నశ్యతి చాత్మమాయా॥**(వరాహోప.2-69)

అర్థము:—పారమార్థికము,వ్యావహారికము మరియు ప్రాతిభాసిక భేదముచే జగత్తు మూడు విధములుగా ప్రతీతియగును. అందులో

1.వేదాన్తశాస్త్రముయొక్క అభ్యాసము పరిపక్వమైనచో,పూర్వము అజ్ఞానకాలములో ఏదైతే కార్యసహిత మాయయందు పరమార్థబుద్ధి (సత్యత్వజ్ఞానము)

ఉండెనో,అది నష్టమౌతుంది.కాని,శాస్త్రాభ్యాస పాటవముచే ప్రపంచము మరియు కారణమగు మాయ అనిర్వచనీయమున్నదని తెలిసికొన్నందున కార్యసహిత మాయయందు అర్థక్రియాసామర్థ్యరూప వ్యావహారికత్వ బుద్ధి కలుగును.

2.అనిర్వచనీయమున్నందున వ్యావహారికముగా తెలియబడిన మాయ తత్కార్యరూప ప్రపంచమునందు యే కార్యక్షమతా(అర్థక్రియాకారిత్వ)బుద్ధి (జ్ఞానము)గలదో,అది అద్వైతతత్త్వఅపరోక్షబోధచే నష్టమగును.(స్నానముచేసినచో దేహశుద్ధిగలుగుట,అన్నమును భుజించినచో ఆకలితీరుట,జలము సేవించినచో దప్పికతీరుట మొదలగు క్రియాఫలజనకత్వమును"**అర్థక్రియాకారిత్వ**" మందురు).ఈ వ్యావహారిక అర్థక్రియాకారిత్వబుద్ధి అద్వైత తత్త్వసాక్షాత్కారముచే నివర్తించును.కాని,"**మృగతృష్ణాంబువద్భ్రాన్తిరూపఏవావభాసతే**"।(యో.వా.ని.ప్ర.పూర్వార్ధము94-68)ఎండమావులలోని(మృగతృష్ణికా)జలమువలె ఈ దృశ్యమాన జగత్తు ప్రాతిభాసికముగా స్ఫురించుచుండును.

శంక:—మృగతృష్ణికాజలమువలె ఈ పరిదృశ్యమానజగత్తు ప్రాతిభాసికమున్నదని చెప్పుట అసంగతము.ఎందుకనగా!ఎండమావులలోని నీరు స్నానముచేయుటకుగాని,పానముచేయుటకుగాని ఉపకరించదు.దానిలో మునిగినచో మరణము సంభవించదు.ఏవిధమైన అర్థక్రియాకారిత్వము(కార్యక్షమతా)మృగజలమునందు లేదు.కాని,

**శ్లో॥ఆబ్రహ్మస్తంబపర్యన్తం యద్యయం భాసతే భ్రమః।**

**అర్థక్రియాసమర్థశ్చ తత్కథం దుఃఖకాణమ్॥**(యో.వా.ని.ప్ర.పూర్వా.95-1)

అర్థము:—బ్రహ్మమొదలుకొని స్తంబము(గడ్డిపరక)వరకు ఏదైతే సంసారము భాసమానమగుచున్నదో,ఇది,ఒకవేళ భ్రాన్తిరూపమైన యెడల దీనియందు అర్థ

క్రియాకారితా(కార్యక్షమతా)మరియు దుఃఖహేతుత్వమెందుకు అనుభవగోచర మగుచున్నది?భ్రమాత్మకమృగజలాదులందు అర్థక్రియాసామర్థ్యముగాని,దుఃఖ హేతుత్వముగానికనిపించుటలేదు గదా?

సమాధానము:- **శ్లో॥చోరబాధేఽపి తజ్జన్యభీత్యాదివ**

**చ్చేలదాహేఽపి భస్మైవ చేలాకృతి।**

**జ్ఞానినాం విశ్వమాదేహపాతం స్వతో**

**బాధితత్వేఽపి చాఽఽరబ్ధభోగక్షమమ్ ॥**(స్వారాజ్యసిద్ధిః3-17)

తాత్పర్యము:—స్వప్నమునందు తనను బంధించుటకు లేక వధించుటకు ప్రవృత్తమైనట్లుగా ప్రతీతమైన చోరుడు(దొంగ),స్వప్నమునుండి మేల్కొన్న తత్ క్షణమే బాధితమైనప్పటికి,ఆ స్వాప్నికచోరునివల్ల కలిగిన భయము,హృదయ కంపనాదులు కించిత్కాలము అనువర్తించును.అట్లే,చక్కగా మడతపెట్టబడిన వస్త్రము దహింపబడినచో,ఆకాల్చబడిన వస్త్రముయొక్క భస్మము కించిత్కాలము వస్త్రమువలెనే తోచును.అదేవిధంగా జ్ఞానులకుగూడ సుఖదుఃఖాన్యతర సాక్షాత్కారరూప భోగనిమిత్తము ప్రవృత్తమైన ఈదృశ్యమాన విశ్వము అద్వైతతత్త్వసాక్షాత్కరముచే స్వయముగా బాధింపబడినప్పటికిని జీవితకాలపర్యంతము దేహారంభకప్రారబ్ధకర్మయొక్క సుఖదుఃఖరూప భోగప్రదసామర్థ్యము(కార్యక్షమతా)అనువర్తించును.గారడివాని(మాయావి)చే చూపబడు మాయికపదార్థములు వాస్తవములు కావు(మిథ్య)అని తెలిసియున్నను మాయావియొక్క సంకల్పసామర్థ్యముచే కించిత్కాలము కనబడునట్లు, ఈ ప్రతీయమాన జగత్తు జ్ఞానముచే బాధింపబడినను(మిథ్యాత్వనిశ్చయమైనప్పటికిని)ప్రారబ్ధవేగమున్నంతవరకు(దేహపాతపర్యంతము)ప్రాతిభాసికసత్తచే గోచరించుచునేయుండు

ను.**"తస్యతావదేవచిరంయావన్నవిమోక్ష్యేఽథసంపత్స్యే ఇతి"**(ఛాం.6-14-2) కావున,

3.జ్ఞాతదర్పణగత ప్రతిబింబము బాధితానువృత్తిచే ప్రతిభాసమగునట్లు (కనుపించునట్లు),ఈదేహాదిక కార్యసహిత మాయయొక్క ప్రతిభాస(దేహపాత పర్యంతము జ్ఞానికిగలుగు జగత్ప్రతీతి)ప్రారబ్ధము నాశనమగుటతోడనే నష్టమ గును.ఇట్లు,అత్మ మాయ(అజ్ఞానము)క్రమముగా మూడువిధములుగా నశించును.

ఈ అవిద్య(అజ్ఞానము)యొక్క నాశత్రైవిధ్యమును కొందరు ఈదిగువ ప్రకార ముచే చెప్పుచున్నారు.1.శ్రవణాద్యభ్యాస పరిపాకముచే అజ్ఞానములోని అస త్త్వాపాదకావరణాంశము నశించును,2.తత్త్వసాక్షాత్కారముచే అభానాపాదకా వరణాంశము నష్టమగును.3.జ్ఞానియొక్క ప్రాయణ(మరణ)కాలములో గలుగు చరమ(అంతిమ)సాక్షాత్కారముచే అజ్ఞానముయొక్క విక్షేపాంశనాశనము కలు గును.ఈవిషయంలోగూడ**"తస్యాభిధ్యానాద్యోజనాత్తత్త్వభావాద్భూయశ్చాన్తే విశ్వ మాయా నివృత్తిః"**(శ్వే.1-10)అను శ్రుతిని ప్రమాణముగా గ్రహింతురు.అతనియొ క్క అభిధ్యానముచేత,యోజనచేత మరియు తత్త్వభావముచేత చివరకు విశ్వమాయయొక్క నివృత్తియగుచున్నది.ఈశ్రుతిలోని "అభిధ్యాన" శబ్దముచే శ్రవణాద్యభ్యాసపరిపాకము అని తెలియవలెను.దానిచే అజ్ఞానముయొక్క అస త్త్వాపాదక ఆవరణము నివృత్తమై ప్రపంచమునందలి పారమార్థిక సత్యత్వబుద్ధి నష్టమగును."యుజ్యతేఽనేనేతియోజనమ్"అను వ్యుత్పత్తిచే-"అతనితో ఐక్య మవుతాడు."అను అర్థము నిష్పన్నమగును.అనగా ఆత్మతత్త్వసాక్షాత్కా రము కలుగునని భావము.దానిచే అజ్ఞానముయొక్క అభానాపాదకావరణము నష్ట మై జగత్తుపట్ల యే వ్యావహారికబుద్ధి(జ్ఞానము)ఉండెనో,అది నివృత్తమగును. ఇక ప్రాయణకాలములో యే అంతిమ సాక్షా త్కారము(తత్త్వభావము)కలుగు నో,దానిచే అజ్ఞానముయొక్క విక్షేపాంశము నష్టమగును.అనగా ప్రారబ్ధము

(అవిద్యాలేశము)నశించును.తద్వారా ప్రపంచముయొక్క ప్రతిభాస(ప్రాతిభాసిక సత్త)నష్టమగును.ఈవిధంగా అజ్ఞానతత్కార్యముయొక్క నివృత్తిప్రకారము చెప్ప బడినది.

**శ్లో ॥బోధోఽన్య సాధనేభ్యో హి సాక్షాన్మోక్షైకసాధనమ్ ।**

**పాకస్య వహ్నివజ్జ్ఞానం వినా మోక్షో న సిద్ధ్యతి ॥** (ఆత్మబోధ-2)

తాత్పర్యము:—లోకంలో పాకక్రియ కొఱకు కాష్ఠజలభాండాది సకల సాధనములు సమకూర్చుకొన్నప్పటికి వహ్ని(అగ్ని)లేనిచో పాకము ఎట్లు సిద్ధించదో, అట్లే జ్ఞానము కలుగకుండా మోక్షము సిద్ధించదు.తపోమంత్ర కర్మ యోగాద్యనేక సాధనలుండగా మోక్షమునకు జ్ఞానమే ప్రధానముగా ఎందుకు చెప్పబడుచున్నది?అని శంకించవలదు.అవి పరంపరగా క్రమేణ జ్ఞానముద్వారా మోక్షమునకు సాధనములున్నవి.కాని జ్ఞానము స్వజన్మమాత్రము చేతనే అజ్ఞానమును నిశ్శేషముగా నాశనముచేసి మోక్షమునకు సాక్షాత్సాధనమగుచున్నది.అందువల్ల జ్ఞానము అన్యసాధనముల కంటె ప్రధానమని చెప్పబడినది.

జ్ఞానముయొక్క అపేక్షలేకుండా(జ్ఞానముకలుగకుండా)అన్యసాధనములచే మోక్షము సిద్ధించదా?అను ప్రశ్నకు చాలాఘాటైన సమాధానమిచ్చింది ఉపనిషన్మాత.

**శ్లో॥యదా చర్మవదాకాశం వేష్టయిష్యన్తి మానవాః।**

**తదా దేవమవిజ్ఞాయ దుఃఖస్యాన్తో భవిష్యతి ॥**(శ్వే.6-20)

తాత్పర్యము:—ఎప్పుడైతే మానవుడు పరిచ్ఛిన్నము,మూర్తస్వరూపము (స్థూలము)అగు చర్మమును చుట్టిపేయునట్లు;వ్యాపకము,అమూర్తము అగు ఆకాశమును చక్కగా చుట్టగల్గినట్లయితే,అప్పుడు ఉదయాస్తరహితము, క్షుత్పి

పాసాదులచే అసంస్పృష్టము,[6]స్వయంప్రకాశస్వరూపము అగు దేవుని(పరమాత్మ)యొక్క జ్ఞానములేకుండానే(పరమాత్మనుతెలిసికోకుండానే)అధ్యాత్మిక,అధిభౌతిక మరియు అధిదైవిక దుఃఖములయొక్క అంతము(వినాశము)కలుగగలదు.కావున,నిష్కర్షయేమనగా—ఆకాశమునుచుట్టివేయుట ఎట్లు అసంభవమో,అట్లే బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము కలుగకుండా త్రివిధ దుఃఖములయొక్క అత్యంతిక నివృత్తి అసంభవము.జ్ఞానముచేతనే అజ్ఞాననాశనంద్వారా సర్వదుః

[6] **శ్లో॥చిద్రూపత్వాదకర్మత్వాత్స్వయంజ్యోతిరితి శ్రుతేః। ఆత్మనః స్వప్రకాశత్వం కో నివారయితుం క్షమః॥**(చిత్సుఖీ 1-3)**శ్లో॥అవేద్యోఽపరోక్షోఽతః స్వప్రకాశో భవత్యయమ్।సత్యం జ్ఞానమనన్తం చేత్యస్తీహ బ్రహ్మలక్షణమ్॥**(వేదాన్త పఞ్చదశి 3-28)ప్రత్యగభిన్నపరబ్రహ్మము చిద్రూపమున్నది.అనగా,స్వయంప్రకాశమున్నది.ఎందుకనగా,"**నహ్యాత్మన్యహమనహం వేతి కశ్చిత్సందిగ్ధే, నైవాహమితి వా విపర్యస్యతి**"ఎవరికిగూడ ఆత్మవిషయంలో"నేనేనా కాదా?"అను సందేహముగాని,"నేనుకానేకాదు"అను విపర్యయముగాని లేదు.(ఇది అనుభవము);ఆత్మాస్వయంప్రకాశః, సంవిత్కర్మతామన్తరేణాఽపరోక్షత్వాత్,సంవేదనవత్.(అనుమానము) ఆత్మ స్వయంప్రకాశమున్నది,సంవిద్రూపజ్ఞానమునకు విషయముకానిదై అపరోక్షమున్నందున(కర్తృకర్మవిరోధము మరియు అనవస్థాదోషముప్రసక్తమగుచున్నందున);సంవేదనమువలె (జ్ఞానము జ్ఞానాంతరమునకు విషయముకాదు)

"సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ"(తై.2-1-1)"అత్రాఽయం పురుషః స్వయంజ్యోతిర్భవతి"(బృ. 4-3-9,14)"తమేవభాన్తమనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి"(శ్వే.6-14;కఠ.5-15; ముం.2-2-10)"జాగ్రత్స్వప్నసుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే।తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వ బన్ధైః ప్రముచ్యతే"॥(కైవల్యో.17)ఇత్యాది శ్రుతి ప్రమాణములచేతను ఆత్మయొక్క స్వప్రకాత్వమును నివారించుటకు ఎవరు సమర్థులు కాగలరు?

ఖములయొక్క అత్యంతనివృత్తి నిరతిశయ ఆనందబ్రహ్మ ప్రాప్తిరూప మోక్షము కలుగుతుంది అని పిండితార్ధము.

**శ్లో ॥ముక్తిస్తు బ్రహ్మణస్తత్త్వ జ్ఞానాదేవ న చాన్యథా ।**

**స్వప్రబోధం వినా నైవ స్వస్వప్నో హీయతే యథా॥**(పే.పం.6-210)

అర్థము:—స్వయముగా తాను మేల్కొనకుండా నిద్రాకల్పిత స్వప్నము ఎట్లు నివర్తించదో,అట్లే అద్వితీయ ప్రత్యగభిన్నపరబ్రహ్మముయొక్క ప్రభోధము(సమ్యగ్ జ్ఞానము)కలుగకుండా అజ్ఞానకల్పిత సంసారము నాశనము కాదు. కావున, జ్ఞానము చేతనే అజ్ఞాన నివృత్తి ద్వారా మోక్షము కలుగగలదు.

**"ఏతద్యో వేద నిహితం గుహాయాం సోऽవిద్యాగ్రన్థిం వికిరతీహ సౌమ్య"**(ముం.2-1-10).

హే ప్రియదర్శన! సకల ప్రాణులయొక్క హృదయమందున్నపరబ్రహ్మము ను యే పురుషుడు తనచే అభిన్నముగా తెలిసికొనునో,అతడు తనయొక్క బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే అవిద్యాగ్రంథిని(ముడివలె దృఢపడియున్న ఆవిద్యక వాసనలను)జీవించియుండగనే త్రెంచివేయును.

**"తరతి శోకమాత్మవిత్"**(ఛాం.7-1-3)ఆత్మతత్త్వము నెఱిగినవాడు శోకమును దాటును.అనగా శోకోపలక్షిత అజ్ఞానతత్కార్యరూప సంసారమును దాటివేయును.(మిథ్యాత్వ నిశ్చయము చేసికొనును.)

**"తమేవవిదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథావిద్యతేऽయనాయ"**(శ్వే.3-8 &6-15)

అజ్ఞానాతీతుడు స్వయంప్రకాశస్వరూపుడు అగు మహాపురుషుణ్ణి(పరమాత్మను)తెలిసికొనియే జీవుడు మృత్యువును(జన్మమరణరూప సంసారము

ను)దాటుతాడు.ఎందుకనగా!     పరమపదప్రాప్తికి(మోక్షమునుపొందుటకు)వేరే మార్గము లేదు.

ఈప్రకారంగా వందలకొలది శృతిప్రమాణములు దేహాదిక సంసార భ్రమకు హేతువగు స్వరూపాజ్ఞానము విజ్ఞానముచే విలీనమగు(నాశనమగు)నని ఉద్ఘోషించుచున్నవి.

## 23.ఆశ్రయ విషయభాగిని అజ్ఞానము

అజ్ఞానము(మాయ,అవిద్య)స్వరూపావరకముగా తెలియబడుచున్నది.మరియు"**అహమజ్ఞః**"ఇత్యాద్యనుభవముగూడ ఉంది.నీటిపైని నాచు నీటిని ఆశ్రయించుకొనియుండి నీటినే కప్పివేయునట్లు,గర్భగుడినిఆశ్రయించుకొని ఉన్న అంధకారము గర్భగుడినే కనబడకుండా జేసినట్లు,చైతన్యమునకంటె పృథగస్తిత్వములేనిదగు అజ్ఞానము చైతన్య మును(ఆత్మను)ఆశ్రయించుకొనియుండి చైతన్యమునే కప్పివేయుచున్నది—అనగా తెలియకుండాజేయుచున్నది.

శ్ఃక:—"**న తం విదాథ య ఇమా జజానాన్యద్యుష్మాకమన్తరం బభూవ। నీహారేణ ప్రావృతాః।**"(ఋ.10-82-7)ఏ పురుషుడు బ్రహ్మాచర్యాది వ్రతములు,స్వవర్ణాశ్రమాది ధర్మములను ఆచరించడో,సత్సంగాది పురుషార్థములనాశ్రయంచడో, అతడు పొగమంచులాంటి అజ్ఞానరూప అంధకారముచేత చక్కగా ఆవరింపబడి పరబ్రహ్మమును తెలియజాలడు.ఇత్యాది వేదప్రమాణములచేతను,"**అహం బ్రహ్మ న వేద**"అను అనుభవముచేతను అజ్ఞానము అహంకార విశిష్టచేతనమును(జీవుని)ఆశ్రయించుకొనిఉండి బ్రహ్మమును విషయము చేయునదిగా తెలియబడుచుండగా,అజ్ఞానము చిన్మాత్రమును ఆశ్రయించుకొనిఉండి చేతనమునే కప్పివేయుననుట అయుక్తము—అని యిట్లు శంక ప్రాప్తము

కాగా→సంక్షేపశారీరకము 1-319 లో ↓

సమా:—**శ్లో॥ఆశ్రయత్వ విషయత్వభాగిని నిర్విభాగ చితిరేవ కేవలా।**

**పూర్వసిద్ధ తమసోఽపి పశ్చిమో నాశ్రయో భవతి నాపి గోచరః॥**

కేవలము జీవబ్రహ్మవిభాగరహిత(సజాతీయ విజాతీయ స్వగతభేదరహిత) శుద్ధచైతన్యమే అజ్ఞానమునకు ఆశ్రయము మరియు విషయ మగుచున్నది(అజ్ఞానముచే కప్పబడుచున్నది).కాని,అజ్ఞానము జీవాశ్రితము కాదు. ఎందుకనగా!జీవేశ్వరవిభాగము అవిద్యాతంత్రము(అవిద్యయొక్కఅధీనంలో) ఉంటుంది,కనుక అవిద్య పూర్వసిద్ధమైయున్నది.దానిచే కల్పింపబడిన జీవుడుగాని ఈశ్వరుడుగాని అజ్ఞానమునకు ఆశ్రయముగాని విషయముగాని కాజాలరు.అహంకారాదులు అజ్ఞానజన్యములుగావున అవిద్యాసిద్ధ్యధీనసిద్ధిగల పశ్చాద్భావి(కార్యము)అగు అహంకారం పూర్వభావి(కారణము)అగు అవిద్యకు ఆశ్రయమగుట యుక్తివిరుద్ధము."కారణస్య కార్యవృత్తిత్వాయోగాచ్చ".

శంక:—**శ్లో॥జీవ ఈశో విశుద్ధాచిత్ తథా జీవేశయోర్భిదా।**

**అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః॥**(సంప్రదాయశ్లోకము)

1.జీవుడు,2.ఈశ్వరుడు,3.శుద్ధచైతన్యము,4.జీవేశ్వరులభేదము,5.అవిద్య, 6.అవిద్యాచైతన్యముల సంబంధము—ఈఆఱు అనాదులని స్వీకరించబడినందున,అజ్ఞానమునకు మరియు జీవేశ్వరాదులకు పూర్వాపరభావము అసంభవముగదా?

సమాధానము:—ఆ జీవేశ్వరాదివిభాగము వాస్తవముగాదు,మాయికమున్నది.అది అజ్ఞానతన్త్రము(అజ్ఞానాధీనము)గాన,అజ్ఞానమునకు మరియు జీవేశ్వ

రాదులకుగల పౌర్వాపర్యముగూడ వైదిక వర్ణ పద వాక్య పౌర్వాపర్యముల లె అనాది కల్పితమే.

శంక:—అజ్ఞానము శుద్ధచైతన్యమునాశ్రయించి ఉన్నదనినచో,అహంకారవిశిష్టుడు,చిన్మాత్రముకంటె భిన్నుడగు జీవునికి సంసారప్రాప్తి యెట్లు సంభవము?అజ్ఞానము స్వాశ్రయమునందే కార్యమును ఉత్పన్నము జేయునుగదా!

**శ్లో॥ఉపాధికృత ధర్మాణామధ్యాసో నియమేన యత్।**

**ప్రతిబింబే భవత్యేషోపాధేస్తత్పక్షపాతితా॥**(సంక్షేపశారీరకము 1-319 వ్యాఖ్యలో)

"ఉపాధి యెప్పుడునూ ప్రతిబింబపక్షపాతియైఉండున"ను నియమానుసారము అజ్ఞానముగూడ ప్రతిబింబరూప జీవాశ్రితమయ్యే ఉండవలె నుగాని,శుద్ధచైతన్యాశ్రితముగాదు.మరియు అజ్ఞానమునకు సంసారమును కలుగజేయుట దాని స్వభావమన్నచో ఈశ్వరునికిగూడ సంసారప్రాప్తి గలుగవలెను గదా!

సమాధానము:—సత్యము.జీవునికిగల యీసంసారము అజ్ఞానప్రయుక్తమే. బ్రహ్మముయొక్క అజ్ఞానంవల్లనే కలిగింది.కాని,యీసంసారము అజ్ఞానధర్మము(కార్యము)మాత్రము కాదు. బ్రహ్మభేదమే అనగా బ్రహ్మము, ఈశ్వరుడు, జీవుడు అను భేదమును సృష్టించుటయే దాని కార్యము, కాని సంసారము కాదు.**"ఈక్షతేర్నా శబ్దమ్"**(బ్ర.సూ.1-1-5)ప్రధానము(అజ్ఞానము,మాయ)జగత్కారణము కాదు. ఎందుకంటే, శ్రుతిలో ప్రతిపాదించబడనందున. **"తదైక్షత బహుస్యాం ప్రజాయేయ"**(ఛాం.6-2-3)అను శ్రుతిలో జగత్కారణము ఈక్షణ(ఆలోచన)కర్తయని చెప్పబడినది.ప్రధానములో ఈక్షణజేసే శక్తిలేదుగదా.కావున,చేతనమే సంసారకారణము.**"తత్సృష్ట్వా తదేవా నుప్రావిశత్"**(తై.2-6)చేతనమే అజ్ఞానమును(మాయను)అభిమానించి సృష్టిని రచనజేసి తానే ఆసృష్టిలో ప్రవేశించెను.

**"ప్రకృతిం స్వామవష్టభ్య విస్సృజామి పునః పునః"**(గీత.9-8),**"అహంకృత్స్న స్య జగతః ప్రభవః ప్రలయస్తథా"**(గీత.7-6).ఇచ్చట శ్రీకృష్ణపరమాత్మయొక్క అభిప్రాయమిట్లున్నది.పరమేశ్వరుడనైన నేను కేవలం నాయొక్క కల్పనా మాత్రముచే వివిధప్రకారముల సృష్టిని చేయుచున్నాను.నాకల్పనాశక్తియే ప్ర కృతి లేక మాయ అని చెప్పబడుతోంది.మాయావి(ఐంద్రజాలికుడు)ఎట్లు కేవ లం తన కల్పనాశక్తిద్వారానే ఐంద్రజాలికపదార్థములను(గారడివస్తువులను) సృష్టించి జనులకుచూపించి,వారిని ముగ్ధులనుజేయునో,లేక స్వప్నద్రష్ట ఎట్లు స్వప్నకాలములో తన కల్పనాద్వారా అనేక ప్రకారముల సృష్టిని జేయునో, అట్లే నేనుగూడ కేవల కల్పనాశక్తిద్వారా అనగా మాయ అనబడు అనిర్వచ నీయ ప్రకృతినాశ్రయించి(అభిమానించి)నాయొక్కసత్తాస్ఫూర్తితో దానిని దృఢ మొనర్చి,దానిద్వారా ఇంద్రజాలరూప యీ వివిధప్రకారములైన ప్రపంచము యొక్క సృష్టిప్రలయాలు చేస్తున్నాను.గారడివాడు లేక స్వప్నద్రష్ట ఎట్లు సమస్తమును సృష్టించిగూడ,వాస్తవముగా సృష్టించక దానియందభిమానము లేనివాడైలేశమాత్రముగూడ తనస్వరూపమునుండి విచ్యుతినొందడో,అట్లే నేను సంపూర్ణ జగత్తుకు సృష్టికర్తనైయుండియూ ఎల్లప్పుడు అకర్త అవినాశిస్వ రూపమునందే స్థితమైయుందును.ఐంద్రజాలిక పదార్థాలు ఎట్లు మాయావి కల్పనాశక్తివశమైయుండునో,మరియు స్వప్నద్రష్టద్వారా కల్పిత స్వప్నప్రపం చము స్వప్నద్రష్టయొక్క కల్పనావశమైయుండుటవలన అస్వతంత్రములై ఉండునో,అట్లే నాయొక్క కల్పనాశక్తి(మాయాశక్తి)ద్వారా ఉత్పన్నమయ్యే యీసమస్తభూతకోట్లు(ఆకాశాదిపంచభూతములు తత్కార్యమగుచరాచరము) స్వాభావికంగానే అస్వతంత్రములై(అధ్యస్తవస్తువు అధిష్ఠానముకంటె భిన్నసత్త లేనిదగుటవలన)నావశములోఉండును. కావున ఈజగత్తంతా మాయికము

(మిథ్య).కావున,మాయ(అజ్ఞానము)బ్రహ్మ భేదమే(జీవేశ్వరాదివిభాగమునే)కల్పించునుగాని,సృష్టిని జీవేశ్వరులేకల్పింతురు.**"జీవేశావాభాసేనకరోతి మాయా చావిద్యా చ స్వయమేవ భవతి"**(నృసింహోత్తరతాపనీయోపనిషత్ -9)

**శ్లో॥మాయాభాసేన జీవేశౌ కరోతీతి శ్రుతత్వతః।**

**కల్పితావేవ జీవేశౌ తాభ్యాం సర్వం ప్రకల్పితమ్॥**(పే.పం.7-6)

మాయ—దర్పణమువలె చైతన్యమును తనయందు ప్రతిబింబించు కొని, చైతన్యముయొక్క ఆభాసముచేత జీవేశ్వరులను కల్పించుచున్నది.ఈశ్వరునికి ఉపాధియగు మాయగాను మరియు జీవునికి ఉపాధియగు అవిద్యగాను(శుద్ధసత్త్వ,మలినసత్త్వభేదముచే)స్వయముగా మాయయేయగుచున్నది. అందువలన జీవేశ్వరులు మాయాకల్పితములు.మరియు కల్పిత జీవేశ్వరులచే సంపూర్ణచరాచర జగత్తు కల్పింపబడుచున్నది.కావున,అనాద్యనంతమగు శుద్ధబ్రహ్మమునందు,అనాదిసాంతమాయ కల్పితముగాన,తత్కల్పిత జీవేశ్వరులుగూడ అనాదిసాంతములే. వారిచే కల్పింపబడిన జీవసృష్టి మరియు ఈశ్వరసృష్టిగూడ మిథ్యయే.

**శ్లో॥ఈక్షణాది ప్రవేశాన్తా సృష్టిరీశేన కల్పితా।**

**జాగ్రదాది విమోక్షాన్తః సంసారో జీవకల్పితః॥**(పే.పం.ద.7-4)

అర్థం స్పష్టం—

శంక:—అయితే,"**అహమజ్ఞః**"నేను అజ్ఞానినియను ప్రసిద్ధ అనుభవము మాటేమిటి?

సమాధానము:—"**అహంకారోపలక్షిత ప్రత్యగాత్మాశ్రయవిషయ ఏవాజ్ఞత్వా**

**నుభవః**"అహంకారము(అంతఃకరణము)చే నుపలక్షితమగు యే బ్రహ్మాభిన్న కూటస్థచైతన్యమున్నదో,దానిని అజ్ఞానము ఆశ్రయించుకొని ఉండి,దానినే విష యము చేయుచున్నది(తెలియకుండా చేస్తుంది).

**శ్లో॥చైతన్యం యదధిష్ఠానం లింగదేహశ్చ యః పునః।**

**చిచ్ఛాయాలింగదేహస్థా తత్సంగో జీవ ఉచ్యతే॥**(వేదాంత పంచదశి 4-11)

అధిష్ఠానచైతన్యము కూటస్థము,అహంకారము మరియు దానియందు చైత న్యముయొక్క ప్రతిబింబము(ఆభాసము)—ఈమూడింటి సమూహమునకు జీవుడని చెప్పబడినది.లేదా అహంకారవిశిష్టచేతనమును జీవుడందురు. కూటస్థము విశేష్యము,అహంకారము విశేషణము—రెండుకలిసి విశిష్టము-జీ వుడగును.విశేష్యములోని ధర్మము విశిష్టమునందు ఆరోపింపబడి ఆధ్యాసిక వ్యవహారం జరుగుతుంది.ఎట్లనగా!"దండీపురుషః ఆగతః"దండము(పొడుగాటి కర్ర చేతిలోపట్టుకున్న పురుషుడు వచ్చెను).విశేష్యము పురుషుడు.విశేషణ ము దండము(కర్ర).విశేష్యమగు పురుషునిలోని ఆగమనరూపక్రియ విశి ష్టములో ఆరోపింపబడి"దండీపురుషః ఆగతః"అని వ్యవహారం జరుగుతోంది. అట్లే,అజ్ఞానము సాక్ష్యభిన్నబ్రహ్మచైతన్యమును ఆశ్రయించుకొని ఉంటే అహం కారవిశిష్టచేతనము(జీవుడు) దానిని [7]అభిమానించి(తనయం దారోపించుకొని)

---

[7] **కౌన్తేయ ఇవ రాధేయో జీవః స్వావిద్యయా పరః।**(శ్రీగంగాధరేంద్ర సరస్వతీ కృత వేదాన్త సిద్ధాన్త సూక్తిమఞ్జరీ 42);**కౌన్తేయస్యైవ రాధేయత్వవదవికృతస్య బ్రహ్మణః ఏవ అవిద్యయా జీవభావః।**(సిద్ధాన్తలేశ సంగ్రహః 1-42); **జ్యోఁ అవికృత కౌంతేయ మేఁ రాధాపుత్ర ప్రతీతి। చిదానందఘున బ్రహ్మమేఁ జీవభావ తిహి రీతి।**(వృత్తిప్రభాకరము-హిందుస్థానీ దోహా); **రాజ**

అహమజ్ఞః(నేనుఅజ్ఞానిని)అని వ్యవహరిస్తున్నాడు.జీవుడు అజ్ఞానముచే కల్పితము,గావున అజ్ఞానము జీవునికంటెపూర్వమే సిద్ధించినది.అందుకే,శ్రీసర్వజ్ఞత్వమునీంద్రులు"**పూర్వసిద్ధతమ సోఽపి పశ్చిమో నాశ్రయో భవతి నాపి గోచరః**"అని నిర్వచించినారు.దేనినాశ్రయించుకొనిఉండునో దానినే కప్పివేయుట ఆవరణముయొక్క స్వభావము.కావున,అజ్ఞానము జీవున్ని ఆశ్రయించుకొని ఉండి బ్రహ్మమును తెలియకుండా జేయుననుట అయుక్తము.అజ్ఞానము శుద్ధచైతన్యమునాశ్రయించుకొని ఉండి శుద్ధచైతన్యమునే విషయము చేసి,దానియందు జీవేశ్వర భేదమును కల్పించుచున్నది.మహావాక్యార్థవిచారణానంతరము కలిగిన"**అహంబ్రహ్మాస్మి**"యను జ్ఞానముచే అజ్ఞానము నివర్తించగా నిర్విభాగ శుద్ధచైతన్యమే అవశిష్టమైయుండును.

**శ్లో॥విభేదజనకేఽజ్ఞానే నాశమాత్యన్తికం గతే।**

**ఆత్మనో బ్రహ్మణో ర్భేదమసంతం కః కరిష్యతి॥**(విష్ణు.పు.6-7-96; జాబాలదర్శనోపనిషత్.4-63)

భేదమును కలిగించు అజ్ఞానము జ్ఞానముచే నష్టమైనపిదప, మళ్లీ బ్రహ్మాత్మలకు, లేనిభేదమును ఎవరు కలిగింతురు?

ఒకవేళ అజ్ఞానము జీవాశ్రితమనినచో,"**జ్ఞానాజ్ఞానయోః సమానాశ్రయ విషయనియమాత్**"అనగా జ్ఞానము ఏవిషయమును విషయము(తెలియ) చేయుచున్నదో,జ్ఞానము కలుగకపూర్వము అజ్ఞానముగూడ ఆవిషయమునే ఆశ్రయించుకొని ఉంటుంది.అన్యముయొక్క జ్ఞానముచే అన్యముయొక్క అ

**సూనోః స్మృతిప్రాప్తౌ వ్యాధభావో నివర్తతే। తథైవమాత్మనోఽజ్ఞస్య తత్త్వమస్యాదివాక్యతః॥**
(బృ.వార్తికము 1-1-233/234)

జ్ఞానము నివర్తించదు—అను నియమానుసారము జీవాశ్రిత అజ్ఞానము జ్ఞానముచే నష్టమైనపిదప జీవుడే తెలియబడునుగాని బ్రహ్మముగాదు. అందువల్ల,బ్రహ్మజ్ఞాన సంపాదనము వ్యర్థమగును.

అజ్ఞానమునకు సంసారమును కలుగజేయుట దాని స్వభావమన్నచో, ఎట్లు ప్రతిబింబరూప జీవునికి సంసారం ప్రాప్తించినదో,అట్లే ప్రతిబింబరూప ఈశ్వరునికిగూడ సంసారం ప్రాప్తించవలెనుగదా!అను శంకకు సమాధానముగా—

**జీవేశ్వర స్వరూప నిర్ణయము**

**శ్లో॥సత్త్వశుద్ధ్యవిశుద్ధిభ్యాం మాయావిద్యే చ తే మతే।**

**మాయా బింబో వశీకృత్య తాం స్యాత్సర్వజ్ఞ ఈశ్వరః॥**

**శ్లో॥అవిద్యావశగస్త్వన్యస్తద్వైచిత్ర్యాదనేకధా।**

**సా కారణశరీరం స్యాత్ప్రాజ్ఞస్తత్రాభిమానవాన్॥**(వేదాన్త పంచదశి 1-16& 17)

సత్త్వశుద్ధి=ప్రకాశస్వరూప సత్త్వగుణము అనగా రజోగుణము మరియు తమోగుణములచే అణచబడని(మలినముకాని)సత్త్వగుణము;అవిశుద్ధి=రజతమములచే మలినమైన సత్త్వగుణము—ఈరెండు విధములుగా ప్రకృతియే స్వయంగా మాయ మరియు అవిద్యాభేదముచే అయ్యింది."**మాయా చ అవిద్యా చ స్వయమేవ భవతి**"(నృ.ఉ.తా.9).అందులో శుద్ధసత్త్వగుణప్రధానము మాయ మరియు మలినసత్త్వగుణప్రధానము అవిద్య అనబడును.మాయ-యందలి ప్రతిబింబరూప చిదాత్మ(బ్రహ్మము)ఆ మాయను తన అధీనంలో ఉంచుకుని,సర్వజ్ఞత్వాదిగుణములుగల ఈశ్వరుడగును—అనగా మాయకుని-యామకుడగు పరబ్రహ్మము ఈశ్వరుడనబడును.అవిద్యయందు ప్రతిబింబిత

ఆ పరబ్రహ్మమే అవిద్యకు అధీనుడై(వశగతుడై)జీవుడనబడుచున్నాడు. ఉపాధిరూప అవిద్యలోని అశుద్ధియొక్క న్యూనాధికరూప వైచిత్ర్యముచే జీవుడు→ దేవ,పశు,పక్షి మొదలగు భేదములచే అనేక విధములుగా సంసారియగుచున్నాడు.**"అదితిర్దేవా గన్ధర్వా మనుష్యాః పితరోఽసురాః"**(మహానారాయణోపనిషత్ 13-7)స్థూల సూక్ష్మ శరీరములకు కారణము మరియు ప్రకృతియొక్క అవస్థావిశేషమున్నందున అవిద్యను ఔపచారికముగా"కారణము"అనిగూడ అంటారు.అట్లే,తత్త్వజ్ఞానముచే నష్టమగుచున్నందున"శరీరము"అంటారు.ఈ అవిద్యారూప కారణశరీరమునందు తాదాత్మ్యాధ్యాసచేత**"నేను అజ్ఞానిని"** అను అభిమానముగల జీవుడు"**ప్రాజ్ఞ**"డనబడుచున్నాడు.అవినాశిస్వరూపమగు జ్ఞానదృష్టిగలవాడు ప్రాజ్ఞుడగును.కావున,శుద్ధసత్త్వప్రధాన మాయోపాధిక ఈశ్వరునికి సంసారప్రాప్తి కలుగదు.నిష్కర్షయేమనగా,అజ్ఞానము—శుద్ధచైతన్యమునే ఆశ్రయించుకొనిఉండి శుద్ధచైతన్యమునే తెలియకుండా చేయుచున్నది.

## 24.అధ్యాసకారణము అజ్ఞానము

ఇక,అజ్ఞానముయొక్క లక్షణములో అంతిమ విశేషణము—**అధ్యాస కారణము**.అవిద్యస్వయంగా చైతన్యమునందధ్యస్తము.కారణాధ్యాసయనబడును. [తాను తెలియబడుట కోసము అన్యప్రకాశముయొక్క అపేక్షారహిత స్వపరనిర్వాహక దీపమువలె,సాంఖ్యాభిమత స్వపరనిర్వాహక స్వప్రకాశ ఆత్మవలె, నైయాయికమతలో ఘటపటముల అన్యోన్యాభావరూప భేదము ఘటపటములను పరస్పరముపేరుజేసి సూచిస్తుంది.మరియు ఘటపటములనుండి తనయొక్క భేదమునుగూడ తానే సూచిస్తుంది.కావున,భేదము స్వపరనిర్వాహకము]అట్లే అఘటితఘటనాపటీయసీ,అనిర్వచనీయము, స్వపరనిర్వాహకమునగు అజ్ఞానముగూడ తన అధ్యాసకు(కారణాధ్యాసకు)తానే కారణము

మరియు దేహాదిక సకలప్రపఞ్చరూప కార్యాధ్యాసకుగూడ తానే కారణమగు చున్నది.

చేతనాచేతనాత్మకము,నానా నామరూపములచే వ్యాకృతము(ప్రకటితము), అనేక కర్తృభోక్తృసంయుక్తము,ప్రతినియత దేశ కాల నిమత్త క్రియాఫలాశ్రయ ము,మనస్సుచేతనూహించనలవిగాని రచనారూప యీ జగదధ్యాసకు చేత నాధిష్ఠితమగు నీయవిద్యయే(అజ్ఞానమే)పరిణామి ఉపాదానకారణము.అజ్ఞాన కార్యమగు యీ భ్రాన్తిరూప సంసారము ఐదు విధములు.

**పంచవిధ భ్రమలు**

**శ్లో॥ భ్రమః పంచవిధో భాతి తదేవేహ సముచ్యతే।**

**జీవేశ్వరౌ భిన్నరూపావితి ప్రాథమికో భ్రమః॥**

**శ్లో॥ ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వా ద్వితీయకః।**

**శరీరత్రయ సంయుక్త జీవః సఙ్గీ తృతీయకః॥**

**శ్లో॥ జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః।**

**కారణాద్భిన్న జగతః సత్యత్వం పంచమో భ్రమః॥** (అన్నపూర్ణోపనిషత్.1-13 నుండి 15)

1.భేదభ్రాన్తి,2.కర్తృత్వభోక్తృత్వ భ్రాన్తి,3.సంగభ్రాన్తి,4.వికార భ్రాన్తి,5.బ్రహ్మభిన్న జగత్సత్యత్వ భ్రాన్తి—అని భ్రమలు పంచవిధములు.

1.భేదభ్రాన్తి పునః పంచప్రకారములు.i)జీవేశ్వర భేదము,ii)జీవుల పరస్పర భేదము,iii)జీవజడ భేదము,iv)జడజడ పరస్పర భేదము,v)ఈశ జడ భేదము. ఈ ఐదు విధముల భేదములు ఈ క్రింది యుక్తులచే నిరాకరింపదగును.

i) జీవేశ్వర భేదము కల్పితము(ప్రతిజ్ఞా),అవిద్య మరియు మాయారూప ఉపాధికృతమున్నందున(హేతువు),ఘటాకాశ మఠాకాశభేదమువలె(దృష్టాన్తము).

ii) జీవుల పరస్పర భేదము కల్పితము,సాభాసాన్తఃకరణరూప ఉపాధికృతమున్నందున, నానా ఘటాకాశముల భేదమువలె.

iii) జీవ జడముల భేదము కల్పితము, సాభాసాన్తఃకరణము మరియు నిరాభాస నామరూపమయ ఉపాధికృతమున్నందున, స్వప్నగత చరాచరములవలె.

iv) జడజడ పరస్పర భేదము కల్పితము, నామరూపమయ ఉపాధికృతమున్నందున, రజ్జువుయందు కల్పింపబడిన సర్పదండాదుల భేదమువలె.

v) ఈశ జడ భేదము కల్పితము, సాభాసమాయ మరియు నామరూపమయ ఉపాధికృతమున్నందున, సాక్షి మరియు స్వప్నప్రపంచముయొక్క భేదమువలె.

**శ్లో॥ మానాభావాదయుక్తేశ్చ న భిదేశ్వర జీవయోః।**

**జీవానామచితాం చైవ నాత్మనో న పరస్పరమ్॥**(భేదధిక్కారము 4)

ప్రమాణము మరియు యుక్తుల అభావమున్నందున పైన వివరించిన పంచభేదములు కల్పితములు.

**నిరుపమ నిత్య నిరంశకేఽప్యఖండే,**

**మయి చితి సర్వ వికల్పనాదిశూన్యే।**

**ఘటయతి జగదీశజీవభేదం**

**త్వఘటిత ఘటనా పటీయసీ మాయా॥** (మాయాపఞ్చకమ్)

పంచభేదముల ఖండనమునందు పై ఐదుప్రకారముల అనుమానప్రమాణరూప యుక్తులు గలవు.

బింబప్రతిబింబ దృష్టాన్తముచేగూడ భేదభ్రమ నివృత్తమగును.ఎట్లనగా!దర్పణమునందు ముఖప్రతిబింబము భాసించునపుడు,ఆ ప్రతిబింబము దర్పణమందు లేదు.మఱేమనగా,దర్పణమును విషయము చేయుటకు నిర్గతమైన నేత్రవృత్తి దర్పణమును స్పృశించి,పరావృతమై(తిరిగివచ్చి)బింబరూప ముఖమునే చూచుచున్నది.ఈరీతిగా బింబమగు ముఖముతో ప్రతిబింబము అభిన్నమగుటవలన,ప్రతిబింబము మిథ్యకాదు,మఱేమనగా సత్యము.కాని,ప్రతిబింబ ధర్మములైన(అ)బింబముకంటెభిన్నత్వము,(ఆ)అభిముఖత్వము(విపరీతత్వము),(ఇ)దర్పణస్థత్వము—ఈమూడు మరియు వాటి ప్రతీతి(జ్ఞానము)ఇవన్నియు భ్రాన్తిరూపము.అందువలన,ఈధర్మములను మిథ్యాత్వనిశ్చయరూప బాధము చేసినచో,బింబ ప్రతిబింబములకు ఎల్లప్పుడూఅభేదమున్నదను నిశ్చయము కలుగుతుంది.

అట్లే, శుద్ధబ్రహ్మరూప బింబము,దాని జీవరూప ప్రతిబింబము అజ్ఞానరూప దర్పణమునందు భాసించుచున్నది.స్వప్నమువలె ముఖ్యజీవుడు ఒక్కడే,అతనికంటె భిన్నముగా స్థావరజంగమరూప నానా జీవులు భాసించుచున్నారు. వారు జీవులుకారు.మఱేమనగా జీవాభాసములు.(మిథ్యాజీవులు).ఆ జీవరూప ప్రతిబింబములు ఈశ్వరరూప బింబముతో సదా అభిన్నములు.కాని,మాయాబలముచే ఆ జీవధర్మములగు i)బింబరూపఈశ్వరునికంటె భిన్నత్వము, ii)జీవత్వము,iii)అల్పజ్ఞత్వము,iv)అల్పశక్తిమత్వము,v)పరిచ్ఛిన్నత్వము మరియు vi)జీవనానాత్వాదులు మరియువాటి ప్రతీతిరూపజ్ఞానము ఇవన్నియు భ్రాన్తిరూపము.అందువలన,వాటియొక్క మిథ్యాత్వనిశ్చయరూప బాధము చేసి

నచో,జీవరూప ప్రతిబింబము మరియు ఈశ్వరరూప బింబమునకు సదా అభేదనిశ్చయము కలుగుతుంది.ఈరీతిగా బింబప్రతిబింబ దృష్టాన్తముచే భేదభ్రాన్తి నివృత్తమగును.

ముఖ్యమగు జీవేశ్వరభేద నిషేధముచే తదంతర్గత నాలుగు భేదముల నిషేధము సహజసిద్ధము.సకలభేదములు ఔపాధికములు.ఉపాధులన్నియు మిథ్య. కావున,ఉపాధికల్పితములగు సర్వభేదములు మిథ్యయేయగును.వాస్తవముగా అద్వితీయబ్రహ్మమే అవశిష్టమైయుండును.

2.అంతఃకరణధర్మములగు కర్తృత్వభోక్తృత్వములు ఆత్మయందుప్రతీతియగుచున్నవి.ఇదియే కర్తృత్వభోక్తృత్వభ్రాన్తి.రక్తస్ఫటిక దృష్టాన్తముచే కర్తృత్వభోక్తృత్వభ్రమ నివృత్తమగును.

ఎర్రనివస్త్రముపై లేక జపాకుసుమ సమీపమున నుంచబడిన స్ఫటికమణియందు వస్త్రముయొక్క లేక జపాకుసుమముయొక్క రక్తవర్ణము(ఎరుపురంగు)మణికుసుమముల సంయోగముచే భాసించును. కాని అది వస్త్రముయొక్క లేక కుసుమముయొక్క ధర్మమున్నదిఎందుకనగా,వస్త్రమును లేక జపాకుసుమమును స్ఫటికమునుండి వేఱు చేసినచో స్ఫటికమునందు భాసించుటలేదు.అందువలన,అది స్ఫటికముయొక్క ధర్మము కాదు.కాని,స్ఫటికమునందు భ్రాన్తిచేత భాసిల్లుచున్నది.

అట్లే,అంతఃకరణముయొక్క ధర్మములగు కర్తృత్వభోక్తృత్వములు ఆత్మయందు తాదాత్మ్యసంబన్ధముచే భాసించుచున్నవి.కాని,అవి అంతఃకరణధర్మములున్నవి.సుషుప్తియందు అంతఃకరణము మరియు ఆత్మయొక్క వియోగమైనపుడు ఆత్మయందు భాసించుటలేవు.అందువల్ల,అవి ఆత్మధర్మములుకావు.కాని ఆ

త్మయందు భ్రాన్తిచేత భాసించుచున్నవి.ఈరీతిగా స్ఫటికమునందు రక్తవర్ణ ముయొక్క ప్రతీతి దృష్టాన్తముచే కర్తృత్వభోక్తృత్వ భ్రమ నివృత్తమగును.

3.సంగభ్రాన్తి:—దేహాదులందు అహంతారూపము మరియు గృహాదులందు మమతారూపమగు సంబన్ధము ఆత్మకుగలదు.ఇదే సంగభ్రాన్తి.

లేక,సజాతీయ,విజాతీయ,స్వగతవస్తువులతో ఆత్మకుయే సంబన్ధము ప్రతీతి అగుచున్నదో, అదియే సంగభ్రమ. ఇది ఘటాకాశ దృష్టాన్తముచే నివర్తించును.

ఘటోపాధిగల ఆకాశమునకు ఘటాకాశమందురు. ఆ ఆకాశము యద్యపి ఘటముతో సంబద్ధమై భాసించుచున్నది.తథాపి,ఘటధర్మములగు ఉత్పత్తి నాశములు,గమనాగమనాదులుఆకాశమును స్పృశింపజాలవు.అందువల్ల,ఆకాశము అసంగము.ఘటముతో ఆకాశముయొక్క సంబన్ధము భాసించుట భ్రాన్తి రూపము.

అట్లే,దేహాదిసంఘాతరూప ఉపాధిగలఆత్మ జీవుడనబడును. యద్యపి, ఆ ఆత్మ సంఘాతముతో సంబద్ధమై భాసించుచున్నది.తథాపి, సంఘాతముయొక్కధర్మములగు జన్మమరణములు,లోకపరలోకములకు గమనాగమనాదులు ఆత్మను స్పృశింపజాలవు.ఎందుకంటే,సంఘాతము దృశ్యమున్నది.ఆత్మ దానికి ద్రష్టయైయున్నది.“**ఘటద్రష్టా ఘటాద్భిన్నఃసర్వథా న ఘటోయథా। దేహద్రష్టా తథా దేహో....**”(వాక్యవృత్తిః 15).అందువల్ల,ఆత్మ సంఘాతముకంటె భిన్నమైయున్నది.సంఘాతరూపముకాదు.సంఘాతము పంచమహాభూతముల కార్యమున్నది.కావున,ఆత్మకు సంఘాతముతో అహంతారూపసంబన్ధము లేదు.ఎందువలన ఆత్మ సంఘాతముకంటె వేఱుగా ఉన్నదో,అందువలన సం

ఘాతముతో సంబన్ధిలు అగు స్త్రీపుత్రగృహాదులతోగూడ ఆత్మకు సంయోగ, సమవాయాది యే సంబన్ధమును లేదు.

**శ్లో|| యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే|**

**సర్వత్రావస్థితో దేహే తథాఽత్మా నోపలిప్యతే||**(గీత.13–32)

**"అసంగోహ్యయం పురుషః"**(బృ.4-3-15&16).

ఇట్లు,ఆత్మ అసంగమున్నందున,దేహాదిసంఘాతముతో అహంతామమతారూప సంబన్ధము భ్రాన్తిరూపము.

ఈ రీతిగా ఘటాకాశ దృష్టాన్తముచే సంగభ్రాన్తి దూరమగును.

4.వికారభ్రాన్తి:—దుగ్ధ(పాల)వికారమగు దధి(పెరుగు)వలె బ్రహ్మవికారము జీవజగత్తులు—అను ప్రతీతి వికారభ్రాన్తియగును.రజ్జువుయందు కల్పితసర్పము యొక్క దృష్టాన్తముచే యీ వికారభ్రాన్తి నివర్తించును.

మందాన్ధకారములో రజ్జువు(త్రాడు)పడి ఉంది.దానిని చూచుటకు అంతఃకరణవృత్తి నేత్రముద్వారా వెళ్ళి,అంధకారాది దోషములవలన రజ్జుత్వవిశిష్ట రజ్జువును అనగా రజ్జువుయొక్క యథార్థ స్వరూపమును పొందలేదు.అందువల్ల, ఆ వృత్తిచేత రజ్జువుయొక్క ఆవరణము భంగము(నాశము)కాలేదు.అపుడు,రజ్జు ఉపహితచేతనమును ఆశ్రయిచుకొని ఉన్న తూలావిద్య క్షోభించి(కార్యోన్ముఖమై)సర్పరూప వికారమును ధరించును.ఆసర్పము దుగ్ధపరిణామరూప దధివలె,అవిద్యాపరిణామమగును మరియు రజ్జుఉపహితచేతనముయొక్క వివర్తమగును. చేతనముయొక్క వికారము కాదు.

అట్లే,బ్రహ్మచైతన్యమును ఆశ్రయించుకొని ఉన్న(బ్రహ్మాత్మలస్వరూపమును కప్పిపెట్టుసామర్థ్యముగల)మూలావిద్య ప్రారబ్ధాది నిమిత్తములచే క్షోభమునొంది జీవ జగద్రూప వికారమును ధరించును.ఆ ప్రపంచము అవిద్యయొక్క పరిణామము మరియు అధిష్ఠానరూప బ్రహ్మచైతన్యముయొక్క వివర్తమగును. వికారము(పరిణామము) కాదు.

ఈరీతిగా రజ్జువందు కల్పితసర్పముయొక్క దృష్టాన్తముచే వికారభ్రాన్తి నివృత్తమగును.

5.బ్రహ్మభిన్న జగత్సత్యత్వభ్రమ సువర్ణమందు కుండలాది ప్రతీతి దృష్టాన్తముచే నివృత్తమగును.

పసిడి కారణమనియు, ఆభరణములు కార్యములనియు యిట్లు కనకము మరియు కుండలాదులకు కార్యకారణరూపముచే భేదము భాసిల్లుచున్నది. అది కల్పితము.విచారదృష్టిచే చూచినచో కనకముకంటె కుండలాదులకు భిన్న స్వరూపము లేదు.వాస్తవముగా కనక కుండలములకు అభేదమే గలదు. కావున, సువర్ణముకంటె ఆభరణములకు భిన్నమగు స్వతంత్ర సత్త లేదు.

అట్లే,బ్రహ్మమునకు మరియు జగత్తునకు కార్యకారణభావముచే విశేషముగా భేదము భాసించుచున్నది.అది కల్పితము.విచారదృష్టిచే చూచినచో అస్తిభాతిప్రియరూప బ్రహ్మముకంటె భిన్నముగా నామరూపమయ జగత్తు సత్యముగా సిద్ధించదు.మఱేమనగా మిథ్యయేయని సిద్ధించును.ఏ వస్తువు దేనియందు కల్పితమో,అది దానికంటె భిన్నముగా సిద్ధించదు."కల్పితవస్తునః కిం స్వరూపమ్?అధిష్ఠానరూపమేవ,అధిష్ఠానాన్న భిద్యతే".కావున,బ్రహ్మజగత్తులకు వాస్తవముగా అభేదమే గలదు. బ్రహ్మముకంటె భిన్నముగా జగత్తునకు స్వతంత్ర సత్త లేదు.

ఈరీతిగా కనకకుండల దృష్టాన్తముచే బ్రహ్మభిన్న జగత్సత్యత్వభ్రమ నివర్తించును.

## 25.అధ్యాస లక్షణము

పూజ్యపాదులగు శ్రీజగద్గురు ఆద్యశంకరాచార్యులవారు బ్రహ్మసూత్ర ఉపోద్ఘాత భాష్యంలోఅధ్యాస[8]లక్షణమును"**స్మృతిరూపఃపరత్రపూర్వదృష్టావభాసఃఅధ్యాసః"** అని చెప్పారు.పూర్వము చూడబడిన(అనుభూత)పదార్థమునకు సదృశము (సజాతీయము)నగు పదార్థము వేరొకదాని యందు—అనగా,స్వాత్యంతాభావా ధికరణమునందు అవభాసము(ప్రతీతి)అగుటను"అధ్యాస"అని నిర్వచించినారు. పై"స్మృతిరూపః"అను వాక్యంలో"పరత్రావభాసః"వేరొకదానియందు అవభాస మగుట—ఇంతభాగము మాత్రమే అధ్యాసలక్షణమగును."స్మృతిరూపః"మరి యు "పూర్వదృష్ట" అను రెండు పదములు లక్షణమునకు ఉపపాదకము లు—(సాధకములు,సమర్థకము)లున్నవి.

అవభాసమనగా భాసించుట—ప్రతీతియగుట—లేని వస్తువుగోచరించుట (అగుపడుట)అగును."పరత్ర"అను పదము సప్తమీ విభక్తి అయోగ్య అధికర ణవాచకమున్నది.ముత్తెపుచిప్పయను అయోగ్యాధికరణమునందు వెండియొ క్క అవభాసమువలె.రజతము(వెండి)యొక్క అవభాసమునకు యోగ్యస్థల ము రజతమే యగును.ముత్తెపుచిప్పకాదు.ముత్తెపుచిప్ప అయోగ్యాధికరణ మగును. దేనియందు ఆరోప్యముయొక్క అత్యంతాభావముండునో,అది

---

[8] అధ్యాస శబ్దము ఉపనిషత్తులలో:—**శ్లో॥అహం మమేతి యో భావో దేహాక్షా దావనాత్మని। అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా బ్రహ్మనిష్ఠయా॥**(అధ్యాత్మోపనిషత్ 1); **శ్లో॥స్వప్నదేహో యథాఽధ్యస్తస్తథై వాయం హి దేహకః।అధ్యస్తస్య కుతో జన్మ జన్మాభావేకుతః స్థితిః॥**(నాదబిందూపనిషత్ 24/25)

దానికి(ఆరోప్యమునకు)అయోగ్యస్థలమగును.అనగా,ఒకే అవచ్ఛేదమునందు (అధికరణమునందు),ఒకే కాలమునందు దేనియందు దేనియొక్క సంసర్గావ భాసము గోచరిస్తున్నప్పటికినీ,దానియందు(అధికరణమునందు)దానియొక్క (ఆరోప్యముయొక్క)అత్యంతాభావముండునో,ఆ అధికరణమునందు అవభాస మగుపదార్థము"అధ్యాస"అనబడును.శుక్తి(ముత్తెపుచిప్ప)యందు ఇదంతా అవచ్ఛేదముచేత(ఇదంరజతమ్)ఒకేకాలమందు రజతముయొక్క సంసర్గావ భాసము కలుగుతుంది మరియు దాని అత్యంతాభావముగూడ ఉంది.కావు న,రజతము"అధ్యాస"అనబడును.అందుచేత,"స్మృతిరూపః"అను ఉపరోక్త అ ధ్యాసయొక్క పరిష్కృతలక్షణము ఇట్లు నిష్పన్నమగుచున్నది.**"ఏకావచ్ఛేదే న సంసృజ్యమానే స్వాత్యంతాభావవతి అవభాస్యత్వమధ్యస్తత్వమ్"**ఒకే అవ చ్ఛేదమునందు ఒకేకాలమందు దేనియందు(అధికరణమునందు)దేనియొ క్క(ఆరోప్యముయొక్క)అత్యంతాభావముండియూ,దానియొక్క(ఆరోప్యము యొక్క)సంసర్గావభాసము తెలియబడునో,ఆ అధికరణమునందు ఆ ఆరో ప్యపదార్థము"**అధ్యాస**"అనబడును.శుక్తియందు ఇదంతావచ్ఛేదముచే,ఒకే కా లమందు రజతముయొక్క సంసర్గావభాసము మరియు దాని అత్యంతాభావ ముగూడ తెలియబడుచున్నది.ఈప్రకారము లక్ష్యమునందు(అధ్యాసయందు) లక్షణము సమన్వయమగుచున్నది.ఇది సాది మరియు అనాది అధ్యాసము లకు సాధారణలక్షణమగును.

## అధ్యాస లక్షణ పరీక్ష

(తర్కప్రమాణాభ్యాం వస్తుతత్త్వావధారణమ్ పరీక్షా)

సంయోగములో అతివ్యాప్తి దోషపరిహారము కొఱకు లక్షణములో"ఏకావ చ్ఛేదేన"అను పదము చేర్చడమైనది.ఒక వానరము(కోతి)వృక్షశాఖపై కూ

ర్చోని ఉంది.ఆ వృక్ష కపిసంయోగముయొక్క సంసర్గము(సంబన్ధము) యేది గలదో,దానియొక్క అవభాసము మరియు ఆ సంసర్గముయొక్క అత్యంతా భావము ఏకకాలమందు వృక్షమున గలవు.ఎట్లనగా,వృక్షాగ్రభాగమున కపి సంయోగము మరియు వృక్షమూలమున కపిసంయోగముయొక్క అత్యంతా భావముగూడ ఏకకాలమందు గలవు.ఈవిధంగా అధ్యాసలక్షణములో అతి వ్యాప్తి దోషము కలుగుతుంది. తన్నివారణార్థము లక్షణములో"ఏకావచ్ఛే దేన"అను పదము నివేశింపబడినది.వృక్షముయొక్క భిన్నభిన్న అవయవ ములలో ఒకేసమయంలో సంసర్గావభాసము మరియు దాని అత్యంతాభావ ము గలదు.అనగా,శాఖావచ్ఛేదముచే కపిసంయోగము మరియు మూలావ చ్ఛేదముచే సంసర్గముయొక్క అత్యంతాభావము గలదు. అవచ్ఛేదభేదము న్నందున సంయోగమునందు అతివ్యాప్తి దోషము రాదు.

భూతలమునందు మొదట ఘటముయొక్క అభావము గలదు.తరువాత, అదే భూతలమునందు ఒకఘటమును తెచ్చిఉంచినచో,భూతలముతో ఘట సంయోగముయొక్క భానము(ప్రతీతి)అవుతుంది.కావున,అధ్యాస లక్షణము ఘటమునందు అతివ్యాప్తి దోషగ్రస్తమగు చున్నది.ఎందుకనగా—ఏకావచ్ఛేద మున(ఏకాధికరణమునందు)ఘటసంయోగము మరియు తదత్యంతాభావ ముగూడ ఉంటున్నవి.అందుకే,ఈ అతివ్యాప్తి దోషనివృత్యర్థము లక్షణములో "స్వసంస్పృజ్యమానే"అను పదము జోడించనైనది.దీనిచే,ఒకేకాలమందు అభా వము మరియు దేని అభావముగలదో,దాని సంసర్గము—రెండును అపేక్షిత ములై యున్నవని చెప్పబడినది. భూతలమునందు భిన్నభిన్న కాలములో ఘటాభావము మరియు దాని సంసర్గమున్నందున అతివ్యాప్తి దోషము ప్రాప్తించదు.

పృథ్వీలో భాసించు గంధమునందు అతివ్యాప్తిని తొలగించుటకై లక్ష ణములో"స్వాత్యంతాభావవతి"అను పదము ఇవ్వబడినది.లేనిచో,గగనాభావ యుక్త పృథ్వీలోగంధము భాసించుటవలన,ఆగంధము మిథ్యాకాగలదు.అత్యం తాభావమునందు"స్వ"విశేషణమిచ్చుటవలన అతివ్యాప్తి గలుగదు.స్వ(గంధ ము)యొక్క అత్యంతాభావము భూమిలో లేదు.దీనిచే గంధమునందు అతివ్యాప్తి దోషము రాదు.

కావున,అధ్యాస లక్షణమునకు శుక్తిరజతమునందు అవ్యాప్తి దోషప్రసక్తిగూడ లేదు.

శంక:—"స్మృతిరూపః పరత్ర పూర్వదృష్టావభాసః"అను అధ్యాసలక్షణము నందు ఉపరోక్తరీతిచే అతివ్యాప్తి మరియు అవ్యాప్తి దోషములు నివర్తింపబడి ననూ,దృష్టాన్తములోఅసంభవదోషము సంభవించును. ఎందుకనగా,శుక్తియం దు రజత(వెండి)సామగ్రులేమియులేనేలేవు.అలాంటప్పుడు,శుక్తితో రజతసం సర్గము(సంబన్ధము)ఎక్కడనుండివచ్చును?ఒకవేళ,స్మర్యమాణ సత్యరజతమే శుక్తియందు అధ్యస్తమై అవభాసమగుచున్నదనినచో,అది యుక్తముగాదు. ఎందుకంటే,అన్యథాఖ్యాతి స్వీకారమగును.కావున,శుక్తియందు రజత సామ గ్రులు లేనందున రజతసంసర్గము ఎట్లు కలుగును?

సమాధానము:—ఈ శంకను పరిహరించుటకుగాను మరియు లక్షణము ఉపపన్నము(సుసంపన్నము)అగుట కొఱకుగాను"స్మృతిరూపః"అను పదని- వేశము చేయనైనది.స్మరింపబడునది స్మృతి—సత్యరజతాదులు. వాటియొక్క రూపముతో సమానరూపముగలది—స్మృతిరూపము.అనగా,స్మర్యమాణ పదా ర్థమునకు సదృశ పదార్థము. కాని స్మర్యమాణము కాదు."సాదృశ్యము"అని చెప్పుటవలన ఆరోప్యము,స్మర్యమాణముకంటె భిన్నమైనదని సూచింపబడిన

ది.అందువలన,అన్యథాఖ్యాతి స్వీకృతిరూప దోషములేదు.సాదృశ్యమును తెలియజేయుట కొఱకు"పూర్వదృష్ట"పదము ఇవ్వబడినది.పూర్వదృష్టము=పూర్వము చూడబడినది(పూర్వానుభూతము).పూర్వపు అనుభవజన్య సంస్కారముద్వారా అధ్యాస కలుగుతుంది.కావున,పూర్వదృష్టావభాసము అని చెప్పబడును.స్మర్యమాణము మరియు ఆరోప్యము—రెండుగూడ సంస్కారజన్య జ్ఞానమునకు విషయములు.ఇదియే వాటిలోని సాదృశ్యము.ఎందుకంటే, స్మృతి మరియు ఆరోప్యము రెండునూ సంస్కారజన్యములే.

శంక:—ఒకవేళ,స్మృతి మరియు ఆరోప్యము రెండూ సంస్కారజన్యజ్ఞానములే అగుచో,ఆరోప్యమునకుగూడ స్మృతి అను సంజ్ఞ(పేరు)ఎందుకు లేదు?

సమాధానము:—కేవల సంస్కారజన్యము స్మృతియగును.కాని,ఆరోప్యము కేవల సంస్కారజన్యము కాదు.మరేమనగా,అవిద్యాది దోషములు,సంప్రయోగము మరియు సంస్కారము—ఈమూడింటిచేత(ఆరోప్యము—అధ్యాస)కలుగుతుంది.అందుకని,ఆరోప్యమునకు స్మృతి సంజ్ఞ లేదు.ఇక్కడ సంప్రయోగము అనగా అధిష్ఠానముయొక్క సామాన్యజ్ఞానము అని చెప్పబడినది.ఎందుకనగా,అహంకారాధ్యాసమునందు ఇంద్రియసంసర్గము కలుగదు.నిష్కర్షయేమనగా ఆరోప్యము స్మర్యమాణసదృశముంటుంది,కాని దానిచే అభిన్నము ఉండదు.ఈప్రకారముగా దోషము,సంప్రయోగము మరియు సంస్కారబలముచే శుక్తియందు రజతోత్పత్తియగును.ఇందువలన,"స్మృతిరూపః"మరియు"పూర్వదృష్టః"అను పదములచే"పరత్రావభాసః"[అన్యపదార్థమునందు అన్యముయొక్క అవభాసము అధ్యాసము]—అను అధ్యాసలక్షణము ఉపపన్నమగుచున్నది.

దోషము,సంప్రయోగము మరియు సంస్కారముచే ఉత్పన్నమగుట యేది గలదో,అది కార్యాధ్యాసయొక్క లక్షణమగును—అని ఇతర వ్యాఖ్యానకర్తలు

చెప్తున్నారు.మరికొందరు ఈక్రిందివిధంగా చెప్తున్నారు—ఏమనగా,"స్మృతిరూపః"అనగా స్మర్యమాణ సదృశము.ప్రమాణ అజన్యజ్ఞానమునకు విషయమగుటయే ఇక్కడ సాదృశ్యమగును.ఎందుకనగా,స్మృతి మరియు ఆరోప్యము రెండుగూడ ప్రమాణజన్యములు కావు."పూర్వదృష్టః"అను పదము పూర్వదృష్ట సజాతీయ బోధకమున్నది.ఎందుకంటే,నూతనంగా ఉత్పన్నమగు అనిర్వచనీయ రజతాదులు పూర్వదృష్టములుగావు. నిష్కర్షయేమనగా,"స్మృతిరూపః" మరియు"పూర్వదృష్టః"అను పదములచే ప్రమాణ అజన్యజ్ఞానమునకు విషయమై,పూర్వదృష్ట సజాతీయవస్తు ప్రతీతియగుట శుక్తిరజతము,రజ్జుసర్పము ఇత్యాదిస్థలములలో ప్రసిద్ధము.ఇట్లు,"పరత్ర" "అవభాసః"అను ఈరెండు పదములచే అధ్యాస లక్షణము చెప్పబడినది.స్మర్యమాణ గంగానది మొదలగు వాటియందు అతివ్యాప్తి నివారణార్థము"పూర్వదృష్ట సజాతీయ"పదము ఇవ్వబడినది.మరియు నూతన ఘటాదులందు అతివ్యాప్తి నివృత్యర్థము"ప్రమాణఅజన్య"ఇత్యాది పదములు జోడించనైనవి.వ్యాకరణ రీతిగా(స్మర్యమాణ సదృశః పరత్ర పూర్వదర్శనాత్ అవభాస్యతే ఇతి అర్థాధ్యాసే యోజనా తథా స్మృతి సదృశః పరత్ర పూర్వదర్శనాత్ అవభాసః ఇతి జ్ఞానాధ్యాసే వాక్యం యోజనీయమితి సంక్షేపః)స్మర్యమాణసదృశమగు పదార్థము అన్యపదార్థమునందు పూర్వదర్శనముచే అవభాసితమగుట=అర్థాధ్యాసమని, మరియు స్మృతిసదృశమగు జ్ఞానము అన్యపదార్థమునందు పూర్వదర్శనముచే అవభాసము=జ్ఞానాధ్యాసమని యోజనచేయవలెను.ఘఞ్ ప్రత్యయము కర్మార్థమందు మరియు భావార్థమందు ప్రయోగింపబడుతుంది. కావున,1.స్మర్యత ఇతి స్మృతిః=అర్థాధ్యాసము; స్మరణం స్మృతిః=జ్ఞానాధ్యాసము,2.దృశ్యత ఇతి దృష్టః=అర్థాధ్యాసము,దర్శనమ్ ఇతిదృష్టః=జ్ఞానాధ్యాసము;3.అవభాస్యత ఇతి

అవభాసః=అర్థాధ్యాసము,అవభాసనం అవభాసః=జ్ఞానాధ్యాసము; 4.అధ్యస్యత ఇతి అధ్యాసః=అర్థాధ్యాసము;అధ్యసనం అధ్యాసః=జ్ఞానాధ్యాసము.(రత్నప్రభ అనువాదము). లేక,

స్వ(తనయొక్క)అభావాధికరణమందు అవభాసమును భ్రమ లేక అధ్యాస అందురు.ఉదా!శుక్తియందు రజతభ్రమ కలుగునపుడు అచట,1.స్వ అనునది రజతము తజ్జ్ఞానమును.2.దానియొక్క పారమార్థిక లేదా వ్యావహారిక అభావము.3.దాని అధికరణము అనగా అధిష్ఠానమగు శుక్తి,లేక శుక్తి విశిష్టచేతనము అథవా శుక్తిఉపహితచేతనము లేక ఇదంతారూప వృత్త్యుపహిత చేతనము.4.దానియందవభాసమగు రజతము దానిజ్ఞానమును ఇవన్నియు భ్రమయనబడును.

అథవా,అధిష్ఠానమునకన్న విషమసత్తగల అవభాసమును భ్రమ లేక అధ్యాసయని చెప్పుదురు.పైన చెప్పబడినట్లుగా వ్యాకరణరీతిగా అధ్యాస పదమునకు మరియు అవభాస పదమునకును విషయము (అర్థాధ్యాసము)మరియు జ్ఞానమును(జ్ఞానాధ్యాసము)అని రెండునూ వాచ్యమగును. కావున—

అర్థాధ్యాసము మరియు జ్ఞానాధ్యాసమని అధ్యాస రెండువిధములు. అందులో,

**అర్థాధ్యాసమనేకవిధములు**

1.కొన్నిచోట్ల, కేవల సంబన్ధమాత్రాధ్యాస కలదు.

2.కొన్నిస్థలములందు సంబన్ధవిశిష్ట(సహిత)సంబన్ధి యొక్క అధ్యాస కలదు.

3. కొన్నిచోట్ల, కేవల ధర్మాధ్యాస యుండును.

4. మఱికొన్నిచోట్ల, ధర్మవిశిష్ట ధర్మ్యధ్యాస కలదు.

5. వేఱుకొన్నిచోట్ల, అన్యోన్యాధ్యాస యుండును.

6. ఇతర కొన్నిచోట్ల, అన్యతరాధ్యాస యుండును. ఈ అన్యతరాధ్యాస రెండు విధములు.

1.ఆత్మయందు అనాత్మయొక్క అధ్యాసము.2.అనాత్మయందు ఆత్మాధ్యాసము.ఈరీతిగా అర్థాధ్యాసమనేక విధములు.పూర్వోక్త లక్షణము సర్వత్ర సమన్వయించును.

ముఖ్యసిద్ధాన్తమందైతే సకలాధ్యాసములకును అధిష్ఠానము చేతనమే యగును.రజ్జుసర్పము ప్రతీతియగుచోట"ఇదమాకార వృత్త్యవచ్ఛిన్న చేతనాభిన్నమగురజ్జ్వవచ్ఛిన్నచేతనమే సర్పమునకధిష్ఠానము. రజ్జువు అధిష్ఠానము కాదు.ఈవిషయము శ్రీవిచారసాగరమునందు 133 నుండి 146 వ అంకము వరకు విపులంగా వ్రాయబడినది. అచ్చట,

1.చేతనమునకు పరమార్థసత్త గలదు.2.లేక,దాని ఉపాధియగు రజ్జువు వ్యావహారికముగాన రజ్జ్వవచ్ఛిన్న చేతనమునకు వ్యావహారికసత్త గలదు. ఉక్త రెండు ప్రకారములుగాను(అధ్యస్త)సర్పమునకు, దాని జ్ఞానమునకును ప్రాతిభాసికసత్త యుండుటవలన అధిష్ఠానసత్తకన్నను విషమసత్తగలఅవభాసము సర్పము,తజ్జ్ఞానమును అగును.కావున,అర్థము(విషయము),జ్ఞానములునగు నీరెంటికీ అధ్యాసయనియు, అవభాసమనియు చెప్పుదురు.

## సత్తా త్రైవిధ్యము

సత్తకు(ఉనికికి)త్రివిధ భేదములు గలవు.1.ప్రాతిభాసికము,2.వ్యావహారికము,3.పారమార్థికము.

1.దేనికి బ్రహ్మజ్ఞానము లేకయే రజ్వాద్యవచ్ఛిన్న చేతనజ్ఞానము వలననే "బాధము"కలుగుచున్నదో దానికి ప్రాతిభాసికసత్త గలదు.(రజ్జుసర్పము-శుక్తి రజతము మున్నగునవి ఈ ప్రాతిభాసిక సత్త గలవి యగును)

2.బ్రహ్మజ్ఞానములేక దేనికి బాధ కలుగుట లేదో,బ్రహ్మజ్ఞానము కలుగగా, దేనికి అధిష్ఠానముకన్న వేఱగు సత్తాస్ఫూర్తి యుండుటలేదో దానికి వ్యావహారిక సత్త గలదు.(అవిద్య,ఆకాశాదులు వ్యావహారికసత్త గలవి).

3.త్రికాలములందును దేనికి బాధ కలుగుట లేదో,దానికి పారమార్థికసత్త గలదు.ఇది చేతనమొకటియే యగును.

ఎట్లనగా,అర్జునుడు సన్న్యాసియై సుభద్రను(కృష్ణునిచెల్లెలును)అపహరించుకెళ్ళాడు.ఈ కథ మహాభారతంలో(ఆదిపర్వమునందు అధ్యాయము 218 నుండి 220)ప్రసిద్ధము.ఈ సన్నివేశమును నటులు నటిస్తున్నపుడు,ప్రేక్షకులు సన్న్యాసియైన ఆ నటునియందు"ఈ అర్జునుడు మిథ్యా సన్న్యాసియైనాడు"అని యిట్లు అర్జునభావమును మరియు సన్న్యాసిభావమును ఆరోపించెదరు.అక్కడ ఆ నటునియొక్క వాస్తవస్వరూపము(దేవదత్తుడు)పారమార్థికసత్తవలె ఉన్నది.తనయందు ఆరోపింపబడిన అర్జునభావము వ్యావహారికసత్తవలెనగును.అర్జునునియందు ఆరోపించిన సన్న్యాసిభావము ప్రాతిభాసికసత్తవలెనున్నది.నటునివలె పారమార్థికసత్త యేదిగలదో అది అకల్పితము.అర్జునభావమువలె చిరకాలస్థాయియగు వ్యావహారికసత్తయు మరియు సన్న్యాసిభావమువలె అల్పకాలస్థాయియగు ప్రాతిభాసికసత్తయును రెండును కల్పితములే.

ఈరీతిగా సకలాధ్యాసములందును ఆరోపితముకన్న అధిష్ఠానమునకు

విషమసత్త గలదు.ఏపదార్థమునందు ఆధారత్వము తోచుచున్నదో ఆ పదార్థ మును అధిష్ఠానమందురు.ఈ ఆధారత్వ(ధర్మము)పారమార్థికముగానుండని, లేక ఆరోపితముగానుండని,దాని పారమార్థికమునందు ఈ ప్రసంగమునందా గ్రహము లేదు. ఎందుకనగా,ఎట్లు ఆత్మయందనాత్మాధ్యాసము గలదో,అట్లే అనాత్మయందాత్మాధ్యాసము గలదు.అనాత్మయందు పరమార్థముగా ఆత్మ యొక్క ఆధారత్వము లేదు. అయితే ఆరోపిత ఆధారత్వమున్నది. కావున, ఈ ప్రసంగమునందు ఆధారమాత్రమే అధిష్ఠానమని చెప్పబడినది.

యద్యపి,ఆత్మకధిష్ఠానమనాత్మయని చెప్పుటవలన ఆత్మకారోపితత్వము సంభవించుటవలన నదియు కల్పితమే యగును.తథాపి,భాష్యకారులగు శ్రీజ గద్గురువు ఆద్యశంకరాచార్యులు శారీరక మీమాంసా శాస్త్రారంభమున ఆత్మానాత్మలయొక్క అన్యోన్యాధ్యాసను నిరూపించియున్నారు.కావున,అనా త్మయందాత్మయొక్క అధ్యాసనిషేధము సంభవించదు.అనగా,అనాత్మయం దాత్మాధ్యాసయు సంభవించును.**పరస్పరాధ్యాసను అన్యోన్యాధ్యాస** యందురు. కావున,అనాత్మతయందాత్మాధ్యాసను అంగీకరరించి పూర్వోక్త శంకకు సమా ధానము చెప్పవలసియున్నది.

ఆ సమాధానమిదియగును.అధ్యాసము ద్వివిధము.1.స్వరూపా ధ్యాసము, 2.సంసర్గాధ్యాసము.

1.ఏపదార్థముయొక్క స్వరూపమనిర్వచనీయమో,అది స్వరూపాధ్యాసయన బడును.శుక్తియందు రజతముయొక్క స్వరూపాధ్యాస గలదు.

ఆత్మయందు అహంకారాద్యనాత్మలయొక్క స్వరూపాధ్యాస గలదు.

2.అట్లే,ఏ పదార్థములయొక్క స్వరూపము వ్యావహారికముగానైనను,పార

మార్థికముగానైనను ప్రథమతః సిద్ధించియుండ,పిమ్మట అనిర్వచనీయ సంబ న్ధముత్పన్నమగునో—అది సంసర్గాధ్యాసమనబడును.ఎట్లు?ముఖమునందు దర్పణముయొక్క ఏసంబన్ధమునులేదు.ముఖదర్పణములు రెండును వ్యావ హారికములే.అచ్చట,దర్పణమందు ముఖముయొక్క సంబన్ధము తోచుచు న్నది.అట్లే, **"లోహితః స్ఫటికః"** జపాకుసుమమునందు తాదాత్మ్యసంబన్ధముతో రక్తవర్ణము పూర్వసిద్ధమైయుండగా,దానిది స్ఫటికమునందు అనిర్వచనీయ తాదాత్మ్యసంబన్ధముత్పన్నమైతోచును.ఈఅనిర్వచనీయ సంబన్ధము కల్పిత ము.అధ్యాసనివృత్తికాలంలో అనిర్వచనీయసంబన్ధము మాత్రము నివర్తించును. జపాకుసుమమునందుగల పూర్వసిద్ధ రక్తవర్ణముయొక్క తాదాత్మ్యసంబన్ధము సుస్థిరము(అబాధ్యము).అట్లే,అనేక స్థలములందు సంబన్ధులు వ్యావహారిక ములుగానున్నవి.వాటి సంబన్ధములును,సంబన్ధజ్ఞానములును అనిర్వచనీ యములుగానుత్పన్నమై యున్నవి. వాటిని సంసర్గాధ్యాస మందురు.

అట్లే,చేతనముయొక్క అధ్యాసము అహంకారమందులేదు.చేతనమో పార మార్థికము.దాని సంబన్ధాధ్యాసము అహంకారమందు కలదు.ఆత్మత్వము చే తనమందున్నది.అయితే,అహంకారమందు తోచుచున్నది.దీనివలన ఆత్మ యొక్క తాదాత్మ్యము చేతనమందు గలదై అహంకారమందు తోచుచున్నది. కావున,ఆత్మచేతన తాదాత్మ్యసంబన్ధము అహంకారమందు అనిర్వచనీయ ముగానున్నది.

అథవా,ఆత్మయందుగల తాదాత్మ్యము(అభేదసంబన్ధము)పూర్వసిద్ధముగాన ఆ పూర్వసిద్ధతాదాత్మ్యము **యొక్క** "అనిర్వచనీయసంబన్ధము"అహంకారము నందు ఉత్పన్నమై తోచుచున్నది.కావున,చేతనము కల్పితముకాదు.అయితే, చేతనతాదాత్మ్యసంబన్ధము అహంకారమునందు కల్పితము.లేక,ఆత్మచేతన

ముయొక్క తాదాత్మ్యము **యొక్క** సంబన్ధము కల్పితము.అధ్యాసనివృత్తికా లంలో ఈ"అనిర్వచనీయసంబన్ధము"మాత్రమునివర్తించును.పూర్వసిద్ధ ఆత్మచే తనతాదాత్మ్యము సుస్థిరము(అబాధ్యము).ఈరీతిగా,

1.ఎక్కడ పారమార్థిక పదార్థముయొక్క అభావము గలదై,దాని ప్రతీతి ఎచ్చట కలుగుచున్నదో,అచ్చట పారమార్థిక పదార్థముయొక్క అనిర్వచనీయ సంబన్ధము వ్యావహారిక పదార్థమందుత్పన్నమగుచున్నది.తజ్ఞానమును అని ర్వచనీయముగానే ఉత్పన్నమగుచున్నది.

2.వ్యావహారిక పదార్థముయొక్క అభావముండగా నెచటతోచుచున్నదో నచట అనిర్వచనీయముగానే సంబన్ధి ఉత్పత్తి యగుచున్నది.సంబన్ధియొక్క జ్ఞానమును అనిర్వచనీయమే. కొన్నిచోట్లయందు సంబన్ధమాత్రమున్ను సంబన్ధముయొక్క అనిర్వచనీయ జ్ఞానమున్ను ఉత్పత్తియగును.సకలాధ్యాసములందును అధ్యస్థములయొక్క విషమసత్తయే అనిర్వచనీయ సత్తయగును.

ఆత్మాధ్యాసము అనాత్మయందు కలుగినచో,అక్కడగూడ అధిష్ఠాన అనాత్మ వ్యావహారికమేయగును.ఆత్మ అధ్యస్తము కాదు.ఆత్మయొక్కసంబన్ధము అనాత్మయందధ్యస్థము కావున,అది అనిర్వచనీయము.సదసద్విలక్షణమును "అనిర్వచనీయ"మందురు.

పూర్వప్రసంగమునందు గలిగిన శంకా సమాధాన విషయంలో చతుర్విధ శంకలు :—

1.ప్రథమ శంక:—స్వప్నప్రపంచముయొక్క అధిష్ఠానము సాక్షియని చెప్ప బడినది.అది సంభవించదు.ఎందుకనగా,ఏది ఏ అధిష్ఠానమందు ఆరోపింపబడుచున్నదో,అది ఆ అధిష్ఠానముతో సంబన్ధము గలదిగా తోచుచున్నది.ఎట్ల

నగా,రజతము శుక్తియందారోపితము.అది"ఇది రజతము" అని శుక్తియొక్క ఇదంతతో సంబన్ధముకలదిగా తోచుచున్నది.ఆత్మయందు కర్తృత్వము మొద లగునవి ఆరోపితములు.అవి"అహంకర్తా"అని ఆత్మతో సంబన్ధము గలవిగా తోచుచున్నవి.అట్లే,స్వప్నమందలి గజతురగాదులు సాక్షియందారోపితమగు-నేని"నేను గజము,నేను తురగము"అనియిట్లు సాక్షితోసంబన్ధము గలవిగా తోచవలయును.(గజము అనగా ఏనుగు; తురగము అనగా గుఱ్ఱము).

2.ద్వితీయ శంక:—"శుక్తియందు రజతాభావము వ్యావహారికమును,పార మార్థికమును అగును"అని చెప్పబడినది.ఇది అసంగతము.ఎందుకనగా,అ ద్వైతవాదమందు చేతనమొకటియే పారమార్థికమగును.తద్భిన్నమగుదాని ని పారమార్థికమని అంగీకరించినచో అద్వైతవాదమునకు హాని కలుగుచున్న ది.పారమార్థిక రజతములేదు.కావున,పారమార్థిక రజతాభావమున్నదని చెప్పుట సమంజసమగును.కాని,పారమార్థికాభావమున్నదనిచెప్పుట సమం-జసము కాదు.

3.తృతీయ శంక:—"శుక్తియందు అనిర్వచనీయ రజతముయొక్క ఉత్పత్తి నాశములు కలుగుచున్నవి"అని పూర్వము చెప్పబడినది.అదియును సంభ వించదు.ఎందుకనగా,రజతమునకుత్పత్తి నాశములు గలుగుచో,ఘటము యొక్క ఉత్పత్తి నాశములవలె రజతముయొక్క ఉత్పత్తినాశములును గోచ రములు గావలెను.ఎట్లు,ఘటముయొక్క ఉత్పత్తి గలుగునెడ"ఘటముత్ప న్నమగుచున్నది"అని ఘటోత్పత్తి తెలియుచున్నదో,ఘటనాశము గలుగునె డ"ఘటమునశించినది"అని ఘటనాశమున్ను తెలియుచున్నదో,అట్లే శుక్తి యందు రజతోత్పత్తి కలుగునెడ"రజతముత్పన్నమైనది"యని రజతోత్పత్తి యు తెలియవలెను.శుక్తిజ్ఞానమువలన ఆ రజతము నాశమగునేని"రజత

మునకు శుక్తిదేశమందు నాశము కలిగినది"అని యిట్లు దాని(రజత)నాశ మున్ను తెలియవలెను.

శుక్తియందు కేవల రజతము తోచుచున్నదేగాని దాని ఉత్పత్తి నాశము లు తోచుట లేదు.కావున,ఇతర గ్రన్థ రీతిగా అన్యథాఖ్యాతి మొదలగునవియే సమంజసముగా నున్నవి. అనిర్వచనీయఖ్యాతి సంభవించదు.

4.నాల్గవ శంక:—"సదసద్విలక్షణమగు అనిర్వచనీయ రజతము మొదల గునవి ఉత్పన్నమగుచున్నవి"అని పూర్వముచెప్పబడినది.అదియు సర్వథా అసంగతమే యగును.

సద్విలక్షణము అసత్తు.అసద్విలక్షణము సత్తు.సద్విలక్షణముగా నుండున ది అసత్తు కాదనుట విరోధము. అట్లే, అసద్విలక్షణము సత్తు కాదనుటయు విరోధమే.

ఈ నాలుగు శంకలు చెప్పబడినవి.ఈ శంకలకు సమాధానము క్రమము గా చెప్పబడుచున్నది.

1.ప్రథమ శంకకు సమాధానము:—"సాక్షియందు స్వప్నాధ్యాస కలుగునెడ 'అహంగజః' 'మయి గజః' అని తోచవలెను.అను శంకకు సమాధానము— పూర్వానుభవజన్య సంస్కారము వలన అధ్యాసము కలుగుచున్నది.ఎట్లు పూర్వానుభవము కలుగుచున్నదో,అట్లే సంస్కారమును కలుగుచున్నది.సం స్కారమునకు సమానమైన అధ్యాస కలుగుచున్నది.సకలాధ్యాసములకు ను ఉపాదానకారణమగు అవిద్యయో సమానముగానున్నది.అయితే నిమిత్త కారణము పూర్వానుభవజన్య సంస్కారమగును.ఎట్లు అనుభవజన్య సంస్కా రము కలుగుచున్నదో,అట్లే అవిద్యా పరిణామమున్ను కలుగుచున్నది.(య

దాకారానుభవాహి తసంస్కారసహకృతావిద్యాకార్యత్వంతదాకారానుభవవిషయ త్వమిత్యేవానుగతనియామకమ్)

i)ఏ పదార్థముయొక్క"అహంతా"రూప జ్ఞానజన్యసంస్కారసహిత అవిద్య యున్నచో ఆ పదార్థముయొక్క అహంతారూప అవిద్యాపరిణామమగు అ ధ్యాస కలుగుచున్నది.

ii)దేనియొక్క"మమతా"రూప అనుభవజన్యసంస్కారసహిత అవిద్య ఉన్నదో, ఆ పదార్థముయొక్క మమతారూప అవిద్యాపరిణామమగు అధ్యాస కలుగు చున్నది.

iii)ఏ పదార్థముయొక్క"ఇదంతా"రూప అనుభవజన్యసంస్కారసహిత అవిద్యయున్నదో,ఆ పదార్థముయొక్క ఇదంతారూప అవిద్యాపరిణామమగు అధ్యాస కలుగుచున్నది.

స్వప్నముయొక్క గజాది విషయముల పూర్వానుభవమున్ను ఇదంతా రూపముగానే కలుగుచున్నది.అహంతాదిరూపముగా అనుభవము కలుగు టలేదు.కావున,అనుభవజన్యసంస్కారమును,గజాదులను గోచరింపజేయు ఇ దంతారూముగానేయున్నది.కావుననే"అయంగజః"అని తెలియుచున్నది."అ హం గజః""మయి గజః" అని తోచుటలేదు.

సంస్కారము అనుమేయము.కార్యానుకూల సంస్కారముయొక్క అను మితి కలుగుచున్నది.సంస్కారమును కలుగజేయు పూర్వానుభవము అధ్యా సరూపము.దానిని కలుగజేయు సంస్కారమును ఇదంతారూపముగానే కలు గుచున్నది.అధ్యాసము ప్రవాహరూప అనాదియగును.కావున,ప్రథమానుభ వమందు ఇదంతారూపత్వమునకు యే హేతువు లేదు.అనాది పక్షమందు

ఏదొక అనుభవమును ప్రథమమున లేదు.పూర్వపూర్వస్థితములకన్నను, వెనుక వెనుక నుండునవి యన్నియు అనుభవరూపములగును.

2.ద్వితీయశంకకు సమాధానము:—"అభావమును పారమార్థికమని గ్రహించినచో,అద్వైతహాని గలుగును"అను రెండవశంకకు ఇది సమాధానము— సకలపదార్థములును సిద్ధాన్తమందు కల్పితములు.వాటి అభావము పారమార్థికమే.అది బ్రహ్మరూపము.ఎందుకంటే,భ్రాన్తిచేత—చైతన్యాత్మక బ్రహ్మమునందు చైతన్యాత్మకత్వముయొక్క అభావము భాసించుటయే కల్పిత శుక్తిరజతము,రజ్జుసర్పము మరియు ప్రపంచముయొక్కభానము(ప్రతీతి)అగుచున్నది. కల్పితపదార్థముయొక్క ధ్వంససమయంలో చైతన్యాత్మకతా అభావముయొక్క అభావమగును.అందువలన చైతన్యాత్మక బ్రహ్మమే భాసించును.భావపదార్థమునకే అభావము చెప్పుట పొసగును(ప్రాప్తస్య ప్రతిషేధో భవతి).అభావముయొక్క అభావము(నాశము)భావరూపమగును."అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తునః భావస్యైవ హ్యాభావత్వం నాశోఽభావస్య భావతః"(సూత సంహిత యజ్ఞవైభవఖండము 2-8)ఇది శ్రీ భాష్యకారులకును సమ్మతము.కావున, అద్వైతహాని కించిన్మాత్రమును లేదు.

3.తృతీయ శంకకు సమాధానము:—"శుక్తియందు రజతోత్పత్తిని అంగీకరించినచో,దాని ఉత్పత్తి గోచరము కావలయును"అను శంకకు ఇది సమాధానము—శుక్తియందు తాదాత్మ్యసంబన్ధమువలన రజతము అధ్యస్థము.శుక్తియొక్క ఇదంతా సంబన్ధము రజతమందధ్యస్థము.కావున,"ఇదం రజతమ్" అను ఈరీతిగా రజతము తోచుచున్నది.ఎట్లు శుక్తియొక్క ఇదంతా సంబన్ధము రజతమందధ్యస్థమో,అట్లే శుక్తియందు ప్రాక్సిద్ధత్వధర్మమును అధ్యస్థమే యగును.

రజతావభాసకాలమునకు పూర్వము సిద్ధించియుండునది శుక్తియగును. ఈరీతిగా శుక్తియందుప్రాక్సిద్ధత్వధర్మమున్నది.దానిసంబన్ధముయొక్క అధ్యాసయు రజతమందున్నది.ఇట్లు"ఇదానీంరజతమ్—ఇపుడు రజతము" అను జ్ఞానం కలుగుట లేదు."పూర్వము కలిగిన రజతమును చూచుచున్నాను" అను జ్ఞానం కలుగుచున్నది.ఈజ్ఞానమునకు విషయము ప్రాక్సిద్ధత్వము.అది రజతమందు లేదు.అయితే రజతమందు ఇపుడు సిద్ధించినధర్మమున్నది. ప్రాక్సిద్ధత్వము రజతమందు తోచుచున్నది.

అచట రజతమందు అనిర్వచనీయమగు ప్రాక్సిద్ధత్వముయొక్క ఉత్పత్తిని అంగీకరించినచో గౌరవము కలుగుచున్నది.(అనావశ్య పదార్థ స్వీకృతిః గౌరవమ్).శుక్తియొక్క ప్రాక్సిద్ధత్వజ్ఞానం రజతమందు అంగీకరించినచో అన్యథాఖ్యాతిని ఒప్పవలసియున్నది.ఇటువంటి చోట్లలో,అన్యథాఖ్యాతిని అంగీకరించియున్నారు.అట్లైనను శుక్తియొక్కప్రాక్సిద్ధత్వధర్మముయొక్క అనిర్వచనీయ సంబన్ధము రజతమందు ఉత్పత్తి యగుచున్నదను పక్షము సమంజసముగానున్నది.

ఈ కారణమువలన శుక్తియొక్క ప్రాక్సిద్ధత్వసంబన్ధ జ్ఞానమువలన ఉత్పత్తి జ్ఞానమునకు ప్రతిబంధము కలుగుచున్నది.ఎందుకనగా,1.ప్రాక్సిద్ధత్వము, 2. వర్తమానఉత్పత్తియగు నీ రెండును పరస్పర విరోధులగును.ఎచ్చట ప్రాక్సిద్ధత్వమున్నదో,అచట అతీతోత్పత్తియున్నది.వర్తమానోత్పత్తి యుండుచోట ప్రాక్సిద్ధత్వముండుట లేదు.

కావున,శుక్తియందుగల ప్రాక్సిద్ధత్వసంబన్ధజ్ఞానమువలన ఉత్పత్తి జ్ఞానమునకు ప్రతిబంధము కలుగుటవలన రజతోత్పత్తి గలిగియు ఆఉత్పత్తి జ్ఞానము కలుగుటలేదు.

"రజతమునకు నాశము కలుగునెడ అది తెలియవలెను"అని చెప్ప బడి నది.దానికిది సమాధానము:—అధిష్ఠానజ్ఞానము కలిగినచో,అప్పుడు(అధ్యస్థ) రజతముయొక్క నాశము కలుగుచున్నది.అధిష్ఠానజ్ఞానముచే రజతముయొ క్క బాధనిశ్చయము కలుగుచున్నది."శుక్తియందు త్రికాలములందును రజ తములేదను నిశ్చయము బాధయన బడును".ఈలాంటి నిశ్చయము నాశ జ్ఞానమునకు విరోధియగును.ఎందుకనగా,నాశమందు ప్రతియోగి కారణమగు చున్నది.బాధమువలన ప్రతియోగియొక్క"ఎప్పుడును లేమి"తోచుచున్నది. దేనిది"ఎప్పుడునులేదు"అను జ్ఞానముకలుగుచున్నదో దానియొక్క నాశము సంభవించదు.

అథవా,ఎట్లు ఘటము మొదలగువాటికి దండాదులవలన పగలుట,చూర్ణ మగుట ఇత్యాదిరూప నాశము కలుగుచున్నదో,అట్లు కల్పితపదార్థములకు నాశము కలుగుటలేదు.అయితే అధిష్ఠానముయొక్క జ్ఞానముచే అజ్ఞానరూప ఉపాదానసహిత కల్పితములకు నివర్తి కలుగుచున్నది.అధిష్ఠానమాత్రావశే షమే అజ్ఞానసహిత కల్పితములయొక్క నవర్తియని చెప్పబడును.ఆ అధి ష్ఠానము శుక్తియగును.దాని అవశేషరూప రజతనాశము అనుభవసిద్ధము. కావున,రజతముయొక్కనాశజ్ఞానముకలుగదు-అని చెప్పుట సాహసమేయగును.

4.చతుర్థశంకకు సమాధానము:—"సదసద్విలక్షణమనుట విరుద్ధము"అ ను శంకకు ఇది సమాధానము—స్వరూపము లేనిదానిని సద్వి లక్షణమని యు,స్వరూపముండుదానిని అసద్విలక్షణమని చెప్పినచో విరోధమగును.ఎం దుకనగా,ఒకేపదార్థమందు స్వరూపరాహిత్యమును, స్వరూపసాహిత్యమును ఉండదు.కనుక,సదసద్విలక్షణమనుటకు పూర్వము చెప్పబడిన అర్థము కాదు.

i)"త్రైకాలిక అబాధ్యత్వం లేదా బాధరాహిత్యం సత్యత్వమ్"త్రికాలములందును దేనికి బాధము కలుగుటలేదో దానిని సత్తందురు.దేనికి బాధ కలుగుచున్నదో అది సద్విలక్షణము.సద్విలక్షణమను పదమునకు బాధయోగ్యమనుటయే అర్థమగును.

ii)వంధ్యాపుత్రుడు,శశశృంగము,ఆకాశపుష్పము,కూర్మరోమము ఇత్యాదులు అసత్తనబడును.అసద్విలక్షణము స్వరూపముగలది యగుచున్నది.అసద్విలక్షణమను పదమునకు స్వరూపముగలది యనుటయే అర్థమగును.

ఈలాగు,బాధయోగ్య(మిథ్యయని నిశ్చయించుటకుతగిన),స్వరూపము గలది సదసద్విలక్షణమనుటకు తాత్పర్యము.**[సచ్చేన్న బాధ్యేత,అసచ్చేన్న ప్రతీయేత–బాధ్యతే ప్రతీయతేఽపి.తస్మాత్ సదసద్విల కషణమనిర్వచనీయమ్]** (అద్వైతసిద్ధి-హిందీఅనువాదము, స్వామి యోగీంద్రానంద, పృష్ఠము 690).

ఇట్లు,ఎక్కడెక్కడ భ్రమజ్ఞానము కలుగుచున్నదో, అక్కడక్కడ అనిర్వచనీయ పదార్థముయొక్క ఉత్పత్తి కలుగుచున్నది.

కొన్నిచోట్ల సంబంధియొక్క ఉత్పత్తి కలుగుచున్నది.ఎట్లనగా,శుక్తియందు రజతోత్పత్తియున్నది.రజతమందు శుక్తియందలి తాదాత్మ్యసంబన్ధముయొక్క ఉత్పత్తి కలుగుచున్నది.శుక్తియందలి తాదాత్మ్యమునకు రజమందన్యథాఖ్యాతి లేదు.అట్లే శుక్తియందు ప్రాక్సిద్ధత్వధర్మమున్నది.దాని అనిర్వచనీయ సంబన్ధోత్పత్తి రజతమందు కలుగుచున్నది. దానియందును అన్యథాఖ్యాతి లేదు.

*ముముక్షువులకు ఒక ముఖ్యగమనిక:*—అధ్యాసకలుగుటకు పూర్వమే సిద్ధమైఉన్న వస్తువుయొక్కగాని లేదా దాని ధర్మముయొక్కగాని స్వరూప

ముచే అధ్యాస కలుగదు.మరేమనగా దాని సంబన్ధముది మాత్రము అధ్యాస కలుగును.మరియు అధ్యాసనివృత్తమైన మీదట పూర్వసిద్ధవస్తువుది బాధము కలుగదు.అబాధ్యమై ఉంటుంది.అటువంటి వస్తువుది కేవల సంబన్ధాధ్యాస (సంసర్గాధ్యాస)అవుతుంది.ఉదా:—శుక్తియొక్క ఇదంతారూపతాదాత్మ్యసంబన్ధ ముయొక్క అధ్యాస రజతమునందు అగుచున్నది.ఆత్మయొక్క తాదాత్మ్య సంబన్ధాధ్యాస అనాత్మయగుఅహంకారాదులయందు కలుగుచున్నది.ఆత్మయొ క్క అధ్యాస కలుగదు.ఒకవేళ ఆత్మయొక్క అధ్యాసను అంగీకరించి నచో,అధ్యా సనివృత్తికాలంలో ఆత్మగూడ నివృత్తము కావలయును.కాని,ఆత్మయొక్క నివృ త్తి కాదు. అనుభవవిరోధముగూడ.

మరియు,పూర్వము అప్రసిద్ధవస్తువుయొక్క స్వరూపాధ్యాస కలుగును. అనగా స్వరూపముచే అనిర్వచనీయముగా ఉత్పన్నమై ప్రతీతమగును.మరి యు అధ్యాసనివృత్తికాలంలో స్వరూపముచే అత్యంతికముగా నివృత్తమగును. ఉదా:—శుక్తియందు రజతము,ఆత్మయందు అహంకారాద్యధ్యాసము. అలమితి విస్తరేణ.

సరే, ఇంతదనుక—

**"ఆవరణవిక్షేపరూపశక్తిద్వయవత్,త్రిగుణాత్మకం,సదసద్భ్యామనిర్వచనీయం, అనాది,భావరూపం,జ్ఞాననివర్త్యం,చిన్మాత్రాశ్రయవి షయకమధ్యాసకారణమజ్ఞాన మ్**"అను అజ్ఞానముయొక్క స్వరూపమునుగూర్చి విస్తృతవిచారణ యథామతి గా చేయడమైనది.ఇంకా న్యూనాధికములు విజ్ఞులు విచారించగలరు.ఈ అజ్ఞా నము గుఱించి అశేషముగా విచారించుట బ్రహ్మదేవుని వల్లగూడ సంభవించదు.

**శ్లో॥న నిరూపయితుం శక్యా విస్పష్టం భాసతే చ యా।**

**సా మాయేతీంద్రజాలాదౌ లోకాః సంప్రతిపేదిరే॥**(వే.పం.6-141)

నిరూపించుటకశక్యమైనది,విస్పష్టముగ గోచరించునది యేదో అదియే మాయ యని ఇంద్రజాలాదులందు ప్రసిద్ధముగా జనులు చెప్పుదురు.

**శ్లో॥విచిత్రకార్యకరణా అచింతితఫలప్రదా।**

**స్వప్నేంద్రజాలవల్లోకే తేన మాయా ప్రకీర్తితా॥**(దేవీభాగవతము)

అర్థం స్పష్టం.

**శ్లో॥నిరూపయితుమారబ్ధే నిఖిలైరపి పండితైః।**

**అజ్ఞానం పురస్తేషాం భాతి కక్షాసు కాసుచిత్॥**(వే.పం.6-143)

ఎంత పండితమార్తాండులైనను అందరికి ఏదో ఒక స్థాయియందు అజ్ఞానమే ముందు నిలుస్తుంది.చివరకు "మాకేమియు తెలియదు"అని స్వీకరించాల్సిందే. అజ్ఞానమునుగూర్చిగాని,సృష్టిరహస్యమునుగాని ఎవరికిని భేధింప శక్యముగా దు.అందుకేదానిని మాయ అందురు.దానిని బ్రహ్మానుభవముచేతనే తెలియదగును.

**"మాయా యాం సర్వసంభవాత్"**;(వే.పం.ద.6-159)**"అనిర్వచనీయా సైవ మాయా జగద్బీజమ్"**(గణేశోత్తరతాపనీయోపనిషత్);**అనిర్వాచ్యామూలప్రకృతిరాసీత్"**(పైంగలోపనిషత్ 1-2).

కావున,కైముతిక న్యాయమునంగీకరించి దానిగుఱించి మరీ ఎక్కువగా విచారించక ఇంతటితో ఉపసంహరించెదము.కాని,జన్మమరణరూప సంసారమునకు మరియు సర్వానర్థములకు ముఖ్యకారణమైన యీ అజ్ఞానముయొక్క నివృత్త్యుపాయముగూర్చి విచారించుట మనకు(సకల ముముక్షువులకు)కర్తవ్యము, శ్రేయస్కరము గూడ ఉంది.

## 26.అజ్ఞానము ఎక్కడనుండి వచ్చినది?

అజ్ఞానవిషయములో శ్రీవసిష్ఠమునీంద్రులవారియొక్క స్వీయవచనములు.

**శ్లో॥నూనం స్థితిముపాయాతా సమాసాద్యపదం స్థితా ।**

**కుతో జాతేయమితి తే "రామ" మాస్తు విచారణా ॥**

**శ్లో॥ఇమాం కథమహం హన్మీత్యేషా తేఽస్తు విచారణా ।**

**అస్తంగతాయాం క్షీణాయామస్యాం జ్ఞాస్యసి "రాఘవ"॥**

(శ్రీయోగవాసిష్ఠము-స్థితిప్రకరణము.41-32 & 33;మహోపనిషత్ 5-114 &115)

భావార్థము:—పరమాత్మయందు ఈఅవిద్య ఎక్కడనుండి వచ్చినది? అను ప్రశ్నకుసమాధానముచెప్తూ:—హేరామ!సర్వానర్థకారియగు యీ అవిద్య ఎట్లో ఒకట్లు ఎక్కడ నుండియో పుట్టి ఉండవచ్చును.కాని, "ఇది(అజ్ఞానము)అవశ్య ముగా ఉంది మరియు పరమపదమును(చైతన్యమును)ఆశ్రయించుకొని ఉన్న దను" విషయము ఆబాలకమలాసన పర్యన్తము అనుభవసిద్ధము.హే రాఘవ! ఈ అవిద్య ఎక్కడనుండి ప్రాప్తించినది అను విచారము చేయకుము.దీనిని ఎలా (ఏఉపాయముచేత)నాశనముచేయాలి-అని విచారించుము(ఆలోచించుము). ఈఅవిద్య అస్తమైనపుడు లేక క్షీణించినపుడు అనగా బాధింపబడినపుడు, ఇది ఎక్కడనుండి వచ్చినది,ఎట్లు వచ్చినది,ఎట్లు నష్టమైనది—ఇలాంటి అనేక ప్రశ్నలకు సమాధానము స్వయముగా నీవే పొందగలవు.

ఈ అవిద్య అనాదియా?లేక సాదియా?ఒకవేళ అనాదియగుచో ఆత్మవలె నిత్యము కాగలదు.అప్పుడు ద్వైతాపత్తి కలుగగలదు.లేక సాదియన్నచో(ఉత్ప త్తిగలది-అన్నచో)దానికి కారణము చెప్పవలసి వచ్చును.అట్లే అవిద్య సత్య మా?లేక అసత్యమా?ఒకవేళ సత్యమన్నచో జ్ఞానముచే నివర్తింపబడుటకు

యోగ్యముకాదు.అప్పుడు అనిర్మోక్షప్రసంగమేర్పడును.లేక అసత్యమన్నచో వంధ్యాసుతునివలె,శశిశృంగమువలె సంవాది వ్యవహారక్షమతా అనుపపన్న మగును.ఇట్లు అవిద్యావిషయక అనేక శంకలు గలుగవచ్చును.అవిద్య నాశ నమైనచో ఈ శంకలన్ని గూడ నశించును-అని భావము.

**శ్లో॥అహో దార్ఢ్యమవిద్యాయా న కశ్చిదతివర్తతే।**

**ప్రమాణం వస్త్వనాదృత్య పరమాత్మేవ తిష్ఠతి॥**(వివరణ ప్రమేయసంగ్రహము- ప్రథమ వర్ణకము)

అహో!ఏమి ఆశ్చర్యము!అవిద్యకు ఎంతటి ప్రబల దుష్టత్వము గలదు?దీని ని ఎవరుగూడ అతిక్రమించలేక పోతున్నారే?ప్రమాణసిద్ధ వస్తువునుగూడ తిర స్కరించి పరమాత్మపైననే తన అధికారమును నిక్షిప్తమొనర్చి తిష్ఠవేసి కూర్చున్నదే?

**శ్లో॥వస్తుతః కిల నాస్త్యేషా విభాత్యేషా న వేక్షితా।**

**అసతో భ్రాన్తతాం సత్యరూపాం జానాతు కః కుతః॥**(యో.వా.4-41-34)

అర్థము:—వస్తుతః అవిద్యయనునది లేనేలేదు.విచారము చేయనందున భా సించుచున్నదేగాని,వాస్తవముగాలేదు.అసద్భ్రాన్తిని సత్యరూపముగా ఎవరు, ఎట్లు తెలిసికొనెదరు?

అజ్ఞానము సర్వానుభవసిద్ధముగావున అజ్ఞానముయొక్క అజ్ఞానము యెవ రికి గూడ లేదు.అలాంటప్పుడు అజ్ఞానము అంటే ఏమిటి?అది స్వప్రకాశఆత్మ యందు ఎట్లు ప్రాప్తించినది?అనాదియా?సాదియా?అది సత్యమా?అసత్యమా? అని ప్రమాణముచే సమాధానమును తెలియగోరుట“తమోదీపన్యాయము” వలె మూర్ఖత్వమేయగును.

**శ్లో॥అజ్ఞానం జ్ఞాతుమిచ్ఛేద్యో మానేనాత్యన్తమూఢధీః।**

**సతు నూనం తమః పశ్యేద్దీపేనోత్తమతేజసా** ॥(వేదాన్తసిద్ధాన్తముక్తావళి 39 వ శ్లోక వ్యాఖ్యానములో)

అర్థము:—అత్యంత మూఢబుద్ధిగలయే పురుషుడు ప్రమాణముచే అజ్ఞానమును తెలియగోరునో,అతడు నిశ్చయముగా ఉత్తమప్రకాశముగల దీపముచే అంధకారమును(చీకటిని)వెతుకుచున్నాడని తెలియవలెను.

**శ్లో॥అవిద్యాయాః అవిద్యాత్వం ఇదమేవ తు లక్షణమ్ ।**

**యత్ప్రమాణాసహిష్ణుత్వమన్యథా వస్తు సా భవేత్॥** (బృ.సం.భాష్య వార్తికము-181)

అర్థము:—"ప్రమాణముయొక్క ఆఘాతమును సహించలేక పోవుటయే"అవిద్యయొక్క అవిద్యాత్వమునందు అసాధారణ(విశేష)లక్షణముగా స్వీకరించబడుచున్నది. ఒకవేళ అవిద్య ప్రమాణగమ్యమైనచో, అది తన అవిద్యాత్వమును కోల్పోయి వస్తువేయగును. అవస్తువెట్లగును?

**శ్లో॥దుర్ఘటత్వమవిద్యాయా భూషణం నతు దూషణమ్।**

**కథఞ్చిద్ఘటమానత్వేఽవిద్యాత్వం దుర్ఘటం భవేత్॥**(ఇష్టసిద్ధిః 140)

అవిద్యయొక్క స్వరూపము దుర్ఘటము-దుష్ప్రతిపాద్యము-ప్రమాణముద్వారా దురుపపాద్యత్వము(అనిరూపితత్వము)యేదిగలదో,అది అవిద్యకు శోభిస్తుంది(భూషణమే).అది దానికి దోషముగాదు.ఎందు కంటే,ఒకవేళ ఎట్లోఒకట్లు అవిద్యయొక్క స్వరూపము ఘటింపబడినచో(ప్రమాణముచే నిరూపింపబడినచో),దానియొక్క అవిద్యాత్వమే సమా ప్తమౌతుంది.

అందవలన,ఓరఘుకులదీపమా,రామచంద్రా!అవిచారముచే వచ్చిన ఈ అవి

ద్య విచారముచే నివర్తించును,గావున స్వాత్మవిచారమునవశ్యముగా చేయుము.

అయితే, ఓశ్రీగురుదేవా!యీ విచారము ఎంతవరకు చేయవలెను?

చెబుతాను రామచంద్రా! సావధాన చిత్తుడవై వినుము.

**శ్లో॥తావత్ప్రక్షాల్యతే ధాతుర్యావద్ధేమైవ శిష్యతే ।**

**తావదాలోక్యతే సర్వం యావదాత్మైవ లభ్యతే ॥**(యో.వా.ఉపశమ.58-42)

అర్థము:—మేలిమి బంగారము శేషించు వరకు స్వర్ణకారుడు ధాతువును యెట్లు మళ్ళీమళ్ళీ కాచుచుండునో,అట్లు ఆత్మలాభము(స్వస్వరూపసాక్షాత్కారము)కలుగునంతవరకు జీవ,జగత్,పరమాత్మల విషయక విచారణ పునః పునః చేస్తూ ఉండవలెను.అలా చేసినచో,

**శ్లో॥ విచారణా పరిజ్ఞాత ఏతస్మిన్పరమేశ్వరే ।**

**అభ్యుదేతి పరానన్దో లబ్ధే ప్రియజనే యథా॥**(యో.వా.ఉపశమ ప్ర.35-16)

అర్థము:—చిరకాల వియుక్త బంధుప్రాప్తిచే ఎట్లు పరమానందము గలుగునో, అట్లే చిరకాల విచారముచే స్వాత్మజ్ఞానము కలుగుతుంది.దానిచే అజ్ఞాననివృత్తి ద్వారా పరమానంద ప్రాప్తిరూప మోక్షము సిద్ధించును.

ఈరీతిగా ఆత్మతత్త్వవిచారము(శ్రవణ,మనన,నిదిధ్యాసనములు)చేయగోరు (ముముక్షు)పురుషుడు“అధికారి”అయిఉండవలెను అని అధికారియొక్క లక్షణమును విచారిస్తూ వస్తున్నాము.అధికారి లక్షణమేమనితెలుసుకున్నాము?"**మలవిక్షేపరహితత్వేసతిసాధనచతుష్టయసంపన్నత్వేసతిస్వస్వరూపాజ్ఞానవత్త్వమ్**"మలదోషము, విక్షేపదోషము లెవరియందులేవో, స్వరూపాజ్ఞానము మాత్రము గల్గియుండి,సాధన చతుష్టయసంపత్తి యుక్తుడెవరో,అతడు వేదాన్త

విచారమునకు అధికారియగును.అందులో మలదోషము,విక్షేపదోషము మరి యు అజ్ఞానములనుగూర్చి విస్తారంగా తెలుసుకుంటూ వచ్చాము.ఇప్పుడు సాధనచతుష్టయసంపత్తిగూర్చి మహర్షులపదచిహ్నములననుసరిస్తూ తెలిసి కొనుటకు ప్రయత్నించెదము

1.వివేకము,2.వైరాగ్యము,3.శమాదిషట్కసంపత్తి మరియు4.ముముక్షుత్వమ్. ఈనాల్గుసాధనముల సమూహమునకు సాధనచతుష్టయము అంటారు.లో కంలో వెండి, బంగారము, డబ్బు, పశువులు, భూమి మొదలగునవి సంపత్తి అనబడుతాయి.ఈసంపద ఐహికసౌఖ్యము నకుపయోగపడుతుంది.అట్లే య జ్ఞయాగాదులనుష్ఠించుటకుపయోగపడుటద్వారాస్వర్గాదిపరలోకసౌఖ్యమునకు గూడ సాధనమగుచున్నది.ఎట్లు ఐహికసంపత్తి ఈలోకసంబంధమైన,పరలోక సంబంధమైన సుఖములకు హేతువగుచున్నదో,అట్లే ముముక్షువునకు సాధ నచతుష్టయము అలౌకికమైన మోక్షసుఖమునకు కారణమగుచున్నది.కా వున,ఇదియే ముముక్షువుయొక్క సంపత్తి.అందువలన,వివేకాది నాలుగు సాధనములయొక్క సముదాయమునకు"**సాధనచతుష్టయసంపత్తి**"అని మన పూర్వీకులు పరమపూజ్యులు అయిన మహర్షులు చెప్పారు.

శ్రీసదానన్దయతీన్ద్రులవారు"**వేదాన్తసారము**"అనుగ్రంథములో అధికారిని ప్రస్తావి స్తూ ఇలా అనుగ్రహించారు.

### 27.అధికారి విశేషనిరూపణము

**"అధికారీతు విధివదధీతవేదవేదాఙ్గత్వేన ఆపాతతోఽధిగతాఖిలవేదార్థోఽ స్మిన్జన్మనిజన్మాన్తరేవా కామ్యనిషిద్ధవర్జనపురస్సరం నిత్యనైమిత్తిక ప్రాయశ్చి**

**త్తోపాసనానుష్ఠానేన నిర్గతనిఖిలకల్మషతయా నితాన్తనిర్మలస్వాన్తః సాధనచతుష్టయసంపన్నః ప్రమాతా”।**

విధిపూర్వకముగా వేదవేదాంగములను అధ్యయనముచేసి,సామాన్యముగా సమస్తవేదార్థమును అవగాహనచేసికొన్నవాడై,యీజన్మ యందుగాని గతజన్మలలోగాని కామ్యనిషిద్ధకర్మలను పరిత్యజించి,నిత్యనైమిత్తికప్రాయశ్చిత్త ఉపాసనాదులననుష్ఠించుటద్వారా సమస్త కాలుష్యము(రాగద్వేషలోభమోహాదిదోషముల)నుండి ముక్తుడై,తత్ఫలితముగా అత్యంతనిర్మలఅంతఃకరణముగలవాడై,సాధనచతుష్టయసంపన్నుడగు ప్రమాతయే వేదాన్తాధ్యయనమునకు“**అధికారి**” యగును.

ప్రమాత అనగా తత్త్వమసి,మొదలగు వేదాన్తవాక్యరూప ప్రమాణముద్వారా బ్రహ్మరూపప్రమేయమును తెలియగోరు జిజ్ఞాసువు,అనగా వేదాన్తశాస్త్రాధ్యయనమునకు అధికారి-అనితెలియవలెను.

ఈసందర్భంలో “**విధి**”అనగా బ్రహ్మచర్యాదులని తెలిసికోవాలి.

మనకు వేదములు నాలుగు-అని వేదమే చెప్తుంది.

“**ఋగ్వేదోయజుర్వేదఃసామవేదఅథర్వణశ్చతుర్థమ్**”(ఛాం.7-1-4)

వేదాంగములుఆరు:—**శిక్షావ్యాకరణంఛందోనిరుక్తంజ్యోతిషంతథా।**

**కల్పశ్చేతిషడంగానివేదస్యాహుర్మణీషిణః॥**

1.శిక్ష,2.వ్యాకరణము,3.ఛందస్సు,4.నిరుక్తము,5.జ్యోతిషము,6.కల్పము.

కర్మ రెండు ప్రకారములు.1.విహితకర్మ, 2.నిషిద్ధకర్మ.

పురుషప్రవృత్త్యర్థము వేదము దేనియొక్క స్వరూపమును బోధించినదో, అది విహితకర్మ అనబడును.“**జ్యోతిష్టోమేనస్వర్గకామోయజేత**”;“**రాజా రాజసూయేన యజేత**”;“**బ్రాహ్మణో బృహస్పతిసవేన**”(ఆపస్తంబశ్రౌతసూత్రము 10-2-1;తాండ్యబ్రాహ్మణము18-2-3)మొదలగునవి.అధర్మము(పాపము)నుండి నివృత్తికొఱకు వేదము దేని స్వరూపమును బోధించినదో అది నిషిద్ధకర్మ అనబడును.“**నహింస్యాత్సర్వాభూతాని**”(మ.భా.వనపర్వము.213-34),“**బ్రాహ్మణోనహన్తవ్యః**”(...?)“**తథాపి బ్రాహ్మణశ్చైవ న హన్తవ్యః కదాచన**”(పద్మపురాణము 1-47-20)ఇత్యాది.స్వభావసిద్ధమైన రాగద్వేషాదివశముచే చేయబడు చేష్టారూపక్రియలు“**కర్మ**”లు అనబడవు.మరియు వేదమునందు వేటియొక్క విధానముగాని నిషేధము గాని చేయబడలేదో,అటువంటి రాగద్వేషరహిత స్వాభావిక గమనశౌచాదిరూప క్రియలు ఉదాసీనక్రియలనబడుతాయి.ఇవిగూడ“**కర్మ**”లుగా పరిగణించబడవు. మరేమనగా,ప్రవృత్తి లేక నివృత్తినిమిత్తము వేదము దేనియొక్క స్వరూపమును బోధించినదో అదియే“**కర్మ**” అనబడును.

## 28. చతుర్విధ విహిత కర్మలు

విహితకర్మలు పునః చతుర్విధములు.1.ప్రాయశ్చిత్తకర్మ, 2.కామ్యకర్మ, 3.నైమిత్తికకర్మమరియు 4.నిత్యకర్మ.

1.పాపనివృత్త్యర్థము విధానముచేయబడునది“**ప్రాయశ్చిత్తకర్మ**” అనబడును.

**శ్లో॥ప్రాయోనామ తపఃప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే।**

**తపోనిశ్చయసంయుక్తం ప్రాయశ్చిత్తమితిస్మృతమ్॥**(అంగీరసస్మృతి-ఉత్తరార్ధము.4-1)

అర్థము:—ప్రాయమనగా తపస్సు,చిత్తగామనగానిశ్చయము.నిశ్చయ సంయు

క్త తపస్సునకు ప్రాయశ్చిత్తమందురు.ఉదా:—పాపక్షయసాధనములగు చాంద్రాయణాదులు.అట్లే,యతికి(సన్యాసికి)శాస్త్రము ద్రవ్యగ్రహణమును నిషేధించినది. మరియు సన్యాసికిగూడ ద్రవ్యమును గ్రహించగూడదను ఇచ్ఛయును ఉంది.అయినను శాస్త్రవిధిని ఉల్లంఘించి అనగా,లోభవశమునగాని, పరేచ్ఛాప్రాబల్యముచేగాని ద్రవ్యమును ప్రమాదముచే గ్రహించినయెడల యతికి పాపమగును.ఆపాపక్షయముకొఱకు గ్రహించిన ద్రవ్యమును త్యాగముచేసి, మూడురోజులు ఉపవాసముండవలెను.ఇది అతనికి ప్రాయశ్చిత్తమనబడును. "అవశ్యముగా చేయుటకు యోగ్యమగు కార్యమును విస్మరించుట(చేయకుండుట)**ప్రమాద**"మనబడును. పునఃప్రాయశ్చిత్తము రెండు విధములు.I. అసాధారణ ప్రాయశ్చిత్తము II. సాధారణ ప్రాయశ్చిత్తము.

I.జ్ఞాతపాపవిశేష నివృత్తికొఱకు శాస్త్రము యే కర్మను విధానము చేయునో, అది అసాధారణ ప్రాయశ్చిత్తము అనబడును.ఉదా:—ఇంతకు ముందు చెప్పబడిన-యతికి విధానం చేయబడిన ఉపవాసము.

II.గతజన్మలలో చేయబడిన అనేక అజ్ఞాత సర్వపాపముల నివృత్తి కొఱకు శాస్త్రము యేకర్మను విధానంచేయునో,అది సాధారణప్రాయశ్చత్తమనబడును. ఉదా:—గంగాస్నానము,ఈశ్వరనామోచ్చారణము,విష్ణుసహస్రనామ పారాయణము మరియు జ్ఞానవృద్ధులగు మహాత్ముల పాదసేవనము మొదలగునవి.

2.ఫలనిమిత్తమై విధానముచేయబడిన కర్మ"**కామ్యకర్మ**"అనబడును. ఉదా:—స్వదేశమునందు వర్షములుపడక కరువుకాటకములేర్పడినపుడు, రాజు ప్రజలనుండి ధనమును సేకరించి వర్షమును గోరి"**కారీరయాగము**" చేస్తాడు.వృష్టిరూప ఫలాపేక్షచే చేయబడుటవలన ఇది కామ్యకర్మ అనబడు

ను.అట్లే స్వర్గాది ఇష్టసాధనములగు జ్యోతిష్టోమాదులు, సంతానమును కోరిచేయు పుత్రకామేష్టి మొదలగునవి తెలియవలెను.

3.ఏదేని నిమిత్తవిశేషముపస్థితమైనపుడు యేకర్మలు శాస్త్రముచే నవశ్యకరణీయములని విధానముచేయబడినవో,వేటిని చేయకుంటే ప్రత్యవాయము(పాపము)చేకూరునో,చేసినచో పుణ్యరూప ఫలములేదో అవి నైమిత్తిక కర్మలనబడును.ఉదా:—జాతేష్టికర్మ."**వైశ్వానరంద్వా దశకపాలంనిర్వపేత్పుత్రేజాతే**"పుత్రుడుజన్మించినపుడు పండ్రెండుకపా లములయందుపురోడాశను(యవపిండితోచేసినరొట్టెలు)వైశ్వానరదేవునకుప్రదానము చేయవలెను.అట్లే శ్రాద్ధ,గ్రహణ కాలస్నానము మరియు అవస్థావృద్ధులు,జాతివృద్ధులు,ఆశ్రమవృద్ధులు,విద్యావృద్ధులు,ధర్మవృద్ధులు మరియు జ్ఞానవృద్ధులు ఇంటికి వచ్చినప్పుడు ఆదర భావముతో లేచినిలబడుట,నమస్కరించి సత్కరించుట మొదలగునవి నైమిత్తికకర్మలు."విద్యా"శబ్దముచే శాస్త్రజ్ఞానము,జ్ఞానశబ్దముచే అపరోక్షజ్ఞానమును తెలియవలెను.పూర్వపూర్వము వారికంటె ఉత్తరోత్తరము వారు ఉత్తములు.

**శ్లో||ధనవృద్ధా వయోవృద్ధా విద్యావృద్ధాస్తథైవ చ|**

**తే సర్వే జ్ఞానవృద్ధస్య కింకరాః శిష్యకింకరాః||**(మైత్రేయ్యుపనిషత్2-24)

ధనవృద్ధులు మొదలుకొని విద్యావృద్ధుల వరకు,వీరందరూ జ్ఞాన వృద్ధునికి శిష్యులు.అతని శిష్యులకు శిష్యులు.అనగా,జ్ఞానవృద్ధుడు ప్రపంచంలో అందరికంటె శ్రేష్ఠుడు.అటువంటి జ్ఞానిపురుషుని సేవించినచో దృష్టఫలము, అదృష్టఫలము రెండును లభించగలవు.

4."**అకరణేప్రత్యవాయసాధనాని సంధ్యావందనాదీని—నిత్యాని**".కొన్ని వేదోక్తకర్మలు-చేయుటవలన క్రొత్తగా పుణ్యము కలుగదు.కాని,అవి చేయకపోవుటవల

న తప్పక పాపముమాత్రము కలుగును.అట్లు కర్మలనాచరించకపోవుటవలన కలుగు పాపము, కలుగకుండుటకొఱకే ఆకర్మలను ఆచరించవలసి ఉంటుంది. వీనినే నిత్యకర్మలంటారు.ఉదా:—సంధ్యావందనము,పంచమహాయజ్ఞములు మొదలైనవి గృహస్థునకు నిత్యకర్మలై యున్నవి. మనుస్మృతి 3-68&70లో

**శ్లో॥పఞ్చసూనా గృహస్థస్య చుల్లీ పేషణ్యుపస్కరః।**

**కణ్డనీ చోదకుమ్భశ్చ బధ్యతే యాస్తు వాహయన్॥**

**శ్లో॥అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్।**

**హోమో దైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్॥**

గృహస్థుడు—చుల్లీ=పొయ్యి,పేషణి=విసుర్రాయి(తిరుగలి),మరియరోలు,రోకలి, చేట,జల్లెడ,అలుకుగుడ్డ,చీపురు,నీళ్ళకడవ మొదలగు ఉపకరణములచే కలుగు ప్రాణిహింసాత్మక పాపమును పొందుచున్నాడు. దానిని పోగొట్టుకొనుటకై పంచమహాయజ్ఞములను ప్రతిదినముచేయ వలెను.అవిక్రమముగా—1.బ్రహ్మ యజ్ఞము=వేదాధ్యయనంచేయుట,చేయించుట;2.పితృయజ్ఞము=పితృదేవతల కిచ్చుతర్పణము;3.దైవయజ్ఞము=యజ్ఞయాగాదులు-దేవతలనుద్దేశించిచేయు ద్రవ్యత్యాగము4.భూతయజ్ఞము=భూతబలి-బలి అనగా అన్నము.పశుపక్ష్యా దులకుఅన్నమును(ఆహారమును)ఇచ్చుట.5.నృయజ్ఞము=అతిథులను గౌర వించుట మనుష్యయజ్ఞమనబడును.

పూర్వమీమాంసాశాస్త్రానుసారము కర్మవ్యవస్థగూర్చి సంక్షేపముగా తెలుసు కున్నాము.

వేదాన్తమతానుసారము నిత్యనైమిత్తికకర్మలకుగూడ స్వర్గాదిఫలములు స్వీ కరించబడినవి.నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానంవల్ల ప్రత్యవాయం(పాపము)కలు

గకపోవడమేఫలం,మరొకఫలంలేదని చెప్పుటకు ప్రమాణమేమిలేదు.ఆకర్మా నుష్ఠానాన్ని అనుసరించి పుట్టే మరొకఫలంగూడ ఉంటుంది.**"తద్యథాऽమ్రేఫ లార్థే నిర్మితే ఛాయాగంధావనూత్పద్యేతే,ఏవం ధర్మం చర్యమాణమర్థా అనూ త్పద్యన్తే"**(ఆపస్తంబధర్మసూత్రము1-20-3)ఫలములకొఱకు మామిడిమొక్కను నాట-గా దానినుండి నీడ మరియు సుగంధముగూడ ఎట్లు కలుగుతాయో అట్లే ధర్మం(కర్మను)ఆచరిస్తూంటే మరికొన్ని అవాంతరఫలములుకూడ కలుగు తాయి. నిత్య నైమిత్తికకర్మల నాచరించకపోతే పాపోత్పత్తిచెప్పడమయుక్తము. ఎందుకనగా,అభావమునుండి భావము(పాపము)ఎలా ఉత్పన్నమగును? **"నాపి నిత్యానామకరణా దభావాత్ప్రత్యవాయ భావోత్పత్తిః—నాసతోవిద్యతేభావః, కథమసతఃసజ్జాయేత"**(గీతాభాష్యము4-18).మరియు ఈవిషయమై బ్రహ్మసూత్రభాష్య ము4-3-14లో శ్రీమజ్జగద్గురుఆద్యశంకరాచార్యులవారు సయుక్తికముగా,సప్రమా ణములచే విస్తారముగా చర్చించారు.*అక్కడ చూడండి.*కావున,వేదాన్తమతాను సారము సమస్తకర్మలు సకామపురుషునికి సంసారమునకు హేతువులగు ను. నిష్కామపురుషునికి అంతఃకరణశుద్ధిద్వారా మోక్షమునకు హేతువులగుచున్నవి.

**శ్లో॥యుక్తఃకర్మఫలంత్యక్త్వాశాన్తిమాప్నోతినైష్ఠికీమ్।**

**అయుక్తఃకామకారేణఫలేసక్తోనిబధ్యతే॥**(గీత. 5-12)

యుక్తః అనగా నేనుచేయు ఈకర్మలు"**ఈశ్వరప్రీత్యర్థమేగాని నాస్వప్రయోజన ముకొఱకుకావు**"అను అభిప్రాయముగల పురుషుడు కర్మఫల త్యాగపూర్వ కముగా కర్మలనాచరిస్తూ,నైష్ఠికీమ్ అనగా చిత్తశుద్ధి,నిత్యా నిత్యవివేకము,స న్యాసము(వైరాగ్యము)మరియు జ్ఞాననిష్ఠాక్రమముచేనుత్పన్నమగు మోక్షమ నబడు శాంతిని పొందుచున్నాడు.కాని,యెవడు అయుక్తుడో అనగా ఈకర్మలు "**ఈశ్వరునికొఱకే, నాస్వప్రయోజనము కొఱకుకావు**"అనునభిప్రాయశూన్యుడు.

కామకారేణ అనగా సకామభావముచే ప్రవృత్తుడైనందున“**ఈకర్మఫలము నా స్వప్రయోజనముకొఱకే**”అను అభిప్రాయముచే ఫలాసక్తుడై ప్రవృత్తుడైనందున నతడు కర్మలచేనిఃశేషముగా(నితాంతము)సంసారబంధమునుపొందుచున్నాడు. అందువలన నీవుయుక్తుడవై కర్మచేయుము—అని శ్రీకృష్ణపరమాత్మ అర్జునులవారినుద్దేశించి ప్రభోధించెను.

కావున,ముముక్షువైనవాడు కర్మలను ఈశ్వరార్పణబుద్ధితో ఫలాభి సంధి రహితుడై స్వవర్ణాశ్రమోచిత విహితకర్మలను శ్రద్ధాపూర్వకముగా నాచరించవలయును.అట్లయినచో,అంతఃకరణశుద్ధికలిగిఆత్మజ్ఞాననిష్ఠాయోగ్యతాప్రాప్తిద్వారాబ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచేపరమవిశ్రాంతిరూపమోక్షము సిద్ధించును.

## 29.ఉపాసనలు

“**ఉపాసనాని సగుణబ్రహ్మవిషయక మానసవ్యాపారరూపాణి శాండిల్య విద్యాదీని**”.మానసికమైన సగుణబ్రహ్మారాధన ఉపాసన యగుచున్నది. “**ఉపాసనం నామ యథాశాస్త్రం ఉపాస్యస్య అర్థస్య విషయీకరణేన సామీప్యముపగమ్య తైలధారావ త్సమానప్రత్యయ ప్రవాహేణ దీర్ఘకాలం యదాసనం తదుపాసనమ్**”.(గీతాభాష్యం12-3)

ఉపాస్యవస్తువును శాస్త్రములో చెప్పబడిన ప్రకారంగా తనబుద్ధికి విషయ-ముగాజేసికొని ఆ తత్త్వమువద్దకుజేరి తైలధారవలె సమానమైన వృత్తులప్ర-వాహముతో చాలాకాలమువరకు ఆస్థితియందుండుట ఉపాసనయనబడును. శాండిల్యవిద్య(ఛాం.3వఅధ్యా.1ఖం);దహరవిద్య(ఛాం.8అధ్యా)మొదలగు ఉపాసనలననుష్ఠించినచో చిత్తైకాగ్రతద్వారా బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమునకు తోడ్పడును. ఇట్టి ఉపాసనాసౌలభ్యముకొఱకే త్రిమూర్త్యాదిరూపములు రూపొందించబడినది.

**శ్లో॥చిన్మయస్యాద్వితీయస్య నిష్కలస్యాశరీరిణః।**

**ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూపకల్పనా॥**(రామపూర్వతాపన్యుప 1-7)

పరబ్రహ్మము స్వయముగా చిన్మయము=స్వయంప్రకాశస్వరూపము;అద్వితీయము=సజాతీయ,విజాతీయ,స్వగతభేదశూన్యము; నిష్కలం=నిరవయవము;అశరీరి=శరీరరహితుడు,నిర్గుణనిరాకారమైయుండియు ఉపాసకులయొక్క కార్యార్థమై,వారిని అనుగ్రహిచుటకై సగుణసాకారరూపమును కల్పించుకొని శివ,కేశవ,దేవీ,గణపతి మరియు రామకృష్ణాద్యనేక అవతారములను ధరించెను.

**"స్యాత్పరమేశ్వరస్యాపి ఇచ్ఛావశాన్మాయామయం రూపం సాధకాను గ్రహార్థమ్"** (బ్ర.సూ.భాష్యము1-1-20)సాధకులను అనుగ్రహించుటకొఱకు పరమేశ్వరునికిగూడ మాయాకల్పితమైన రూపం ఆ పరమేశ్వరుని ఇచ్ఛ ప్రకారము ఉండవచ్చును.

"**ఏతేషాం నిత్యాదీనాం బుద్ధిశుద్ధిః పరంప్రయోజనమ్**।ఈ నిత్యనైమిత్తికాది కర్మలు చిత్తశుద్ధిని కలిగించును.**ఉపాసనానాంతు చిత్తైకాగ్ర్యమ్**.ఉపాసనలు చిత్తఏకాగ్రతను కలిగించును.ఇదియే వీని పరమప్రయోజనము.

**తమేతం ఆత్మానం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన**(బృ.4-4-22)ఇత్యాదిశ్రుతేః,వేదపాఠమువలనను యజ్ఞయాగాదులద్వారాను ఆఆత్మతత్త్వమును బ్రాహ్మణులు తెలియగోరుచున్నారు.అని బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది.

**"ధర్మేణపాపమపనుదతి"**(మహానారాయణోపనిషత్)**తపసాకల్మషంహన్తి** (మను.12-104) ఇత్యాదిస్మృతేశ్చ".ధర్మముచేత మరియు తపస్సుచేత పాపములను తొలగించుకొనుచున్నారు-అని మనుస్మృతి చెప్పుచున్నది.

**"స్వేస్వేకర్మణ్యభిరతః సంసిద్ధింలభతే నరః"**(గీత.18-45)

తమతమ స్వవర్ణాశ్రమోచిత కర్మలనుచేయుచు మానవుడు సంసిద్ధిని పొందుచున్నాడు—అనిగీతయు చెప్పుచున్నది.కావున,ఉపరోక్తరీతిచే వేదవే-దాంగములను శాస్త్రోక్తవిధిని అధ్యయనముచేసి సామాన్యముగా సమస్తవేదార్థమును అవగాహనచేసికొనినవాడై,యీజన్మయందుగాని జన్మాంతరమందుగాని,కామ్యనిషిద్ధకర్మలను త్యజించుటయేగాక నిత్యనైమిత్తికప్రాయశ్చిత్త ఉపాసనాదులననుష్ఠించి అఖిలపాపములనుండి ముక్తుడై,తత్ఫలితముగా మిక్కిలి నిర్మలమైన స్వాంతముగలవాడై,సాధనచతుష్టయముతోగూడిన జిజ్ఞాసువే వేదాంత విచారమునకు“**అధికారి**”యగుచున్నాడు—అని సదానన్దయతీన్ద్రులవారు వేదాన్తసారములో చెప్పారు.

సాధనచతుష్టయమనగా, 1.వివేకము, 2.వైరాగ్యము, 3.శమాదిషట్సంపత్తి, మరియు4.ముముక్షుత్వము-అని ఇంతకుపూర్వముతెలిసికుంటూ వచ్చాము. వీటియొక్క విస్తారవర్ణనము వివేకచూడామణిలో పందొమ్మిదవ శ్లోకమునండి ఇరువదియెనిమిదవ శ్లోకమువరకు,అపరోక్షానుభూతిలో మూడవ శ్లోకము నుండి తొమ్మిదవ శ్లోకపర్యన్తము మరియు సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహములో పదునైదవ శ్లోకము మొదలుకొని రెండువందల ఏబదిమూడవ శ్లోకపర్యన్తము శ్రీజగద్గురువు ఆద్యశంకరాచార్యులవారు చేసియున్నారు. ఇంకా అనేకప్రకరణగ్రంథములలో ప్రదర్శింపబడినవి. విశేషజిజ్ఞాసగలవారు పైగ్రంథముల నవలోకించదగును.

ఇది హేయము,ఇది ఉపాదేయము అను వివేచనము కలుగనిచో సుఖదుఃఖమోహాత్మకము,సర్వానర్థములకు నిలయము,విషతుల్యమగు శబ్దాదివి-షయసంశ్లిష్టమునగు సంసారమునందు హేయబుద్ధి(వైరాగ్యము)ఉదయించుట కవకాశములేదు.అందుకే వైరాగ్యమునకంటె మొదలు వివేకము చెప్పడ

మైనది.రాగనివృత్తి కలుగనిదే శమాదుల ప్రాప్తి సంభవించదు.కావున,శమాది షట్కసంపత్తికి పూర్వము వైరాగ్యము చెప్పబడినది.శాన్త్యాదులులేకుండా ముముక్షా ఉదయించదు.అందువల్ల శమాదులను ముముక్షుత్వమునకు పూర్వము నిర్దేశించనైనది.వివేకము,వైరాగ్యము,షట్సంపత్తి-ఈమూడు సాధనములచే సంపన్నపురుషునికి అవశ్యముగా ముముక్షుత్వము ఏొడముతుంది. ముముక్షాగలవాడు నియమముచే(తప్పకుండా)బ్రహ్మజిజ్ఞాసయందు ప్రవృత్తుడగును. అందుకే అధికారిపురుషునికి నాల్గుసాధనములు చెప్పబడినవి.

లోకములోఘటము,పటము మొదలగునవి కార్యములని ప్రసిద్ధము.మట్టి, దారము మొదలగునవి కారణములు.పటముఉన్నచోట మట్టిలేదు.అందుచే పటమునకు మట్టికారణము కాదు.ఘటమున్నచోట తంతువులులేవు.అందుచే ఘటమునకు ఏొగులు కారణము కావు.కాని మట్టిఉన్నప్పుడే ఘటముండును.మట్టిలేనిచో ఘటముండదు.తంతువులున్నప్పుడే పటముండును.తంతువులులేనిచోపటముండదు.ఈవిధముగా(యత్సత్త్వేయత్సత్త్వమ్—అన్వయః, యదభావేయదభావః వ్యతిరేకః)"అది ఉన్నప్పుడే ఇది ఉండును.అది లేనిచో ఇదిఉండదు"-అను అన్వయవ్యతిరేకములచే మట్టికి మరియు ఘటమునకు కారణకార్యభావము(మట్టికారణము-ఘటముకార్యము)ఉన్నదని నిర్ణయింపబడుచున్నది.

ఇట్లే,వివేకాదులున్నప్పుడే బ్రహ్మజిజ్ఞాసకలుగుచున్నది.వివేకాదులు లేనిచో బ్రహ్మజిజ్ఞాస కలుగుటలేదు.ఈ అన్వయవ్యతిరేకములచే బ్రహ్మజిజ్ఞాసకు వివేకాదులు కారణమని నిర్ణయింపబడుచున్నది.కావున వివేకాది సాధనచతుష్టయసంపత్తిగలవాడే బ్రహ్మవిద్యయందు"**అధికారి**"యని నిశ్చయింపబడుచున్నది.

## సాధనచతుష్టయ విషయములో ప్రమాణములు

ఈ వివేకాదులను సూచించుటకు శ్రుతులు యుక్తులు ప్రమాణములు.

1.“**తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే**”(ఛాం.8-1-6)ఈలోకమున సేవాదికర్మలచే సంపాదించిన భోగాదికము—కృషిచే ధాన్యము,వాణిజ్యముచే ధనము మొదలగునవి ఎట్లు క్షీణించిపోవుచున్నవో,అట్లే యజ్ఞాది సంపాదితమగు పరలోకసుఖముగూడ క్షీణించును. “**యోవైభూమాతదమృతమ్** (ఛాం.7-24-1);**అతోఽన్యదార్తమ్**” (బృ.3-4-2)ఏ బ్రహ్మ స్వరూపముగలదో అది అనశ్వరము;దానికంటేభిన్నమైనదంతయు నశ్వరము. “**నజాయతేమ్రియతేవావిపశ్చిత్**”(కఠ.2-18)అపరిలుప్త చైతన్యరూపమగు ఈఆత్మ జనింపదు,మరణించదు.“**యత్కృతకంతదనిత్యమ్**”ఏది కర్మసాధ్యమో అది అ-నిత్యమను ప్రసిద్ధన్యాయముచేగూడ ఉపోద్బలితములై ఆత్మకు నిత్యత్వమును,అనాత్మకు అనిత్యత్వమును బోధించుచు వివేకజ్ఞానసంపాదకములుగా ఉన్నవి.

2.“**పరీక్ష్యలోకాన్కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాత్,నాస్త్యకృతఃకృతేన**” (ముం.1-2-12)కర్మలచే సంపాదించబడిన స్వర్గాదిలోకాలను పరీక్షించి బ్రాహ్మణుడు(సాధకుడు)వైరాగ్యమును పొందవలెను.కర్మలచేనిత్యమగు మోక్షరూపఫలము లభింపదు—అనుశ్రుతియు,“**నవాఽరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి**”మొదలు“**ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి**”పర్యంతముగల (బృ.4-5-6&2-4-5)శ్రుతియు—భర్తయొక్క సుఖమునుగోరి భర్తను భార్య ప్రేమించుటలేదు,తనప్రీతికోసమే......లోకములోసర్వమును తనకొఱకే ప్రియమగుచున్నది-ఇత్యాది శ్రుతులు ఆత్మభిన్నములగు సమ స్తవస్తువులయందు వైరాగ్యమును ప్రతిపాదించుచున్నవి.

3.“**శాన్తో దాన్త ఉపరతి స్తితిక్షుః సమాహితః(శ్రద్ధావిత్తో)భూత్వాఽత్మన్యే**

**వాఽఽత్మానం పశ్యతి"**(బృ.4-4-23)శాంతుడు(అంతరింద్రియనిగ్రహముగలవాడు), దాంతుడు(బహిరింద్రియనిగ్రహముగలవాడు),ఉపరతుడు(విక్షేపరహితుడు లేక ఈషణత్రయములేని సన్యాసి),తితిక్షువు(సుఖదుఃఖాదిద్వంద్వములను సహించుకొనియుండువాడు),సమాహితుడు(సర్వేంద్రియవ్యాపారరహితుడై, ఆత్మయందుయేకాగ్రచిత్తముతోనుండువాడు)ఈచెప్పబడినలక్షణములతోగూడిన వాడై ఈ కార్యకరణసంఘాతుమునందే(దేహేంద్రియసం ఘాతమునందే)ఆత్మను దర్శించుచున్నాడు.ఈ బృహదారణ్యక శ్రుతి శమాదిషట్కమును బోధించుచున్నది.

4.**"నచ పునరావర్తతే"**(ఛాం.8-15-1);**"నస పునరావర్తతే తత్కైవల్యమ్"**(నారద పరివ్రా.9-22),**నతస్య ప్రాణా ఉత్క్రామన్త్యత్రైవ సమవలీయన్తే; బ్రహ్మైవసన్బ్రహ్మాప్యేతి"**(బృ.4-4-6&నృసింహోత్తరతా.5-2)మోక్షమును పొందినవాడు మరలతిరిగి జన్మకురాడు,బ్రహ్మముగానున్నవాడై బ్రహ్మమును బొందుచున్నాడు—ఇత్యాది శ్రుతులు మోక్షము నిత్యమనిచెప్పుచూ దానిపై ఇచ్ఛను కలిగించుచున్నవి. కావున,ప్రమాణాంతరములచే తెలియబడనిదియు,కాలత్రయాబాధ్యము,పరమ పురుషార్థస్వరూపమును అగు బ్రహ్మమును ప్రతిపాదించు యథార్థప్రమాణరూప ఉపనిషత్తులు"**సోఽన్వేష్టవ్యః, సవిజిజ్ఞాసితవ్యః**"(ఛాం. 8-7-1) ఇత్యాది వాక్యాలచే వివేకాదులుగల పురుషునికి బ్రహ్మతత్త్వజిజ్ఞాసకు యోగ్యతను, అధికారిత్వమును సూచించుచున్నవి.సరే,ఇప్పుడు వివేకాదులనుగూర్చి యథాక్రమముగా యథామతిగా సవిస్తరముగా తెలుసుకొనుటకు ప్రయత్నించెదము.

## 30.వివేకము

**నిత్యానిత్యవస్తువివేక స్తావత్బ్రహ్మైవ నిత్యంవస్తు,తతోఽన్యదఖిలమనిత్యమితివివేచనమ్.**బ్రహ్మమేనిత్యమైనవస్తువు బ్రహ్మముకంటె యితరమైన సమ

స్తమును అనిత్యము-అను విచక్షణాజ్ఞానమే నిత్యానిత్యవస్తువివేకము."**కాలానవచ్ఛిన్నత్వంనిత్యత్వమ్**".కాలమర్యాదలేనిది నిత్యము అనగా భూత,వర్తమాన,భవిష్యత్-అన్ని కాలములలో నాశనములేనిది నిత్యము అనబడును. "**తద్విపరీతమనిత్యమ్**"దానికంటె భిన్నమైనది అనిత్యమనబడును.ఆపాత(సామాన్య)ముగా వేదార్థజ్ఞానముగల అనుమానకుశలునికి బ్రహ్మమే నిత్యవస్తువు తద్భిన్న సకలము అచేతనము,అనిత్యము అనువివేకము(విచక్షణాజ్ఞానము)కలుగుతుంది."**నిత్యంవిభుంసర్వగతంసుసూక్ష్మమ్**"(ముం.1-16);"**ఆకాశవత్సర్వగతశ్చనిత్యః**"(ఈప్రమాణము పెక్కుచోట్ల వినబడుచున్నది,కాని ప్రస్తుతము ఏ ఉపనిషత్తులోను కనుపించుటలేదు);"**అజోనిత్యఃశాశ్వతోయం**"(కఠ.2-18);"**సత్యంజ్ఞానమనంతం**"(తై.2-1-1);"**యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతినాన్యద్విజానాతి స భూమా**"(ఛాం.7-24-1); "**యోవైభూమాతదమృతమ్**"(ఛాం.7-24-1)ఇత్యాది శ్రుతులచే శుద్ధచైతన్యము(బ్రహ్మము)నిత్యమని విశుద్ధసత్త్వసంపన్నుడగు వివేకిపురుషునికి తెలియబడును.

అట్లే,"**నేహనానాస్తికించన**"(బృ.4-4-19&కఠ.2-1-11);"**నేతినేతి**"(బృ.3-9-26);"**అతోఽన్యదార్తమ్**"(బృ.3-4-2);"**యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృణోత్యన్యద్విజానాతితదల్పమ్,అథ యదల్పంతన్మర్త్యమ్**"(ఛాం.7-24-1)ఇత్యాది శ్రుతివచనములచే బ్రహ్మముకంటె భిన్నమగు ప్రపంచము అనిత్యమనిగూడ ఆ వివేకిపురుషునికి అవగతమగుచున్నది.

**శ్లో॥బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యేవంరూపో వినిశ్చయః।**

**సోఽయం నిత్యానిత్యవస్తు వివేకః సముదాహృతః॥**(వి.చూ.20)

అర్థము:—త్రికాలాబాధ్యము,దేశకాలవస్తుపరిచ్ఛేదరహితము,సర్వాధిష్ఠానమగు బ్రహ్మము సత్యము.తద్వ్యతిరిక్తము సకలము మిథ్యయనెడు నిశ్చయజ్ఞానము "నిత్యానిత్యవస్తువివేకము" అనబడును.మరియు,

అనుమానప్రయోగము:—**వివాదాస్పద అచేతనవర్గము అనిత్యమున్నది** (ప్రతిజ్ఞా);**నానా నామరూపములచేవిభక్తమైయున్నందున**(హేతువు);ఉదా:— **ఘటపటస్తంభాదులవలె.**

ఉపమాన ప్రమాణము:—స్వప్నప్రపంచము వివిధనామ రూపములచే విభక్త మై ప్రతీతమైనప్పటికి మేల్కొన్నపిదప అనిత్యముగా నిశ్చ యింపబడుతుం ది.ఇది సర్వలోకప్రసిద్ధము.కాని,తాను(స్వప్నద్రష్ట)మాత్రము అవిభక్తమై(ఏక రూపముగా),అవ్యభిచరితమై,నిత్యమైయుండును.అట్లే ఈ వ్యావహారికవిభక్తజా గ్రత్ప్రపంచముగూడ అనిత్యము అని భోధపడుచున్నది.అపుడు అవిభక్తబ్ర హ్మము నిత్యమని అర్థతః,అనాయాసముగానిశ్చయింపబడుతుంది.ఎట్లు క్షీర నీరముల నొకటిజేసి సమ్ముఖమునందుంచినచో హంసపక్షి క్షీరనీరములను విభాగముజేయునో,అట్లు అహంకారమాదిగాగల సమష్టివ్యష్టిరూప సకలప్రపం చమునందు జడము మరియు చైతన్యము రెండుపదార్థ ములుగలవు.వాని యొక్క విభాగముచేయుటయే వివేకమందురు.

**ఆక్షేపము**:—పైనపేర్కొనిన శ్రుతులు మరియు అనుమానాది యుక్తులచే జగ త్తు అనిత్యమని అనగా మిథ్యయని మరియు బ్రహ్మము సత్యము అని తెలి యబడిన మీదట,మళ్ళీ ఉత్తరసాధనలగు వైరాగ్యాదులనవలంబించి జగత్తు ను బాధించుటకు జ్ఞానసంపాదనమునందు ప్రయత్నముచేయుటలో ప్రయో జనమేమిటి?

**సమాధానము**:—శాస్త్రము మరియు యుక్తులచే ఆపాతపరోక్షజ్ఞానము కలు గుటచే జగత్తుఅనిత్యము(మిథ్య)యని సత్యవస్తువు బ్రహ్మమని తెలుసుకొ న్నప్పటికిని బ్రహ్మమును అద్వితీయత్వ,ప్రత్యగభిన్నత్వాదిరూపముచే అపరో క్షముగా నిశ్చయముచేసుకొనలేదు,మరియు ప్రపంచముపట్ల అపరోక్షమిథ్యా

త్వనిశ్చయముచేయబడనందున జిజ్ఞాసనివృత్తముకాలేదు.అందువలన ప్రపంచముయొక్క అపరోక్షబాధార్థము ఉత్తరసాధనలసహిత జ్ఞానముయొక్క ప్రయోజనమున్నది.ఈ ఆత్మానాత్మవిచక్షణజ్ఞానరూపవివేకము, వైరాగ్యాదిఉత్తరోత్తరసకల సాధనములకు హేతువు(కారణము)అగుచున్నది.వివేకహీన వైరాగ్యాదులు ఊషరభూమిలో నాటబడిన కదళీవృక్షమువలె నిష్ఫలములగును.

హిందుస్థాని దోహా:—**అవినాశి ఆతమ అచల, జగ తాతై ప్రతికూల।**

**ఐసోజ్ఞాన వివేక హై, సబ సాధనకో మూల॥**(విచారసాగరము)

**ఆక్షేపము**:—అన్యులను జయింపనిచ్ఛగల విజిగీషుపండితునకుగూడ ఆత్మనిత్యము,ఆత్మభిన్న సకలదేహేంద్రియాది ప్రపంచమనిత్యము—అను భేదజ్ఞానరూపమైన వివేకమున్నది.ఆ వివేకము వైరాగ్యాద్యుత్తర సాధనములకు హేతువుకావచ్చునుగదా!

**సమాధానము**:—విజిగీషుపండితునకు శాస్త్రాభ్యాసముచే వివేకము గలిగినను అది నిష్కామకర్మోపాసనారహితమై అశుద్ధమగు అంతఃకరణ ప్రదేశమునందు దయించుటవలన సారభూతమైన ప్రదేశమునుండి పెకిలించి మరుభూమిలో నాటబడిన కదళీవృక్షమువలె వైరాగ్యాద్యుత్తర సాధనరూపములైన కదళీవృక్షములయొక్క పరంపరకు **హేతువుగాజాలదు.**

**శ్లో॥చిత్రామృతం నామృతమేవవిద్ధి;**

**చిత్రానలం నానలమేవవిద్ధి।**

**చిత్రాఙ్గనా నూనమనఙ్గనేతి,**

**వాచావివేకస్త్వవివేక ఏవ॥**(శ్రీయోగవాసిష్ఠము-స్థితిప్రకరణము 18-69)

చిత్రపటములో గీయబడిన కలశములోని అమృతము,అమృతముగాదు. అట్లే చిత్రపటమునందు కనుపించు ప్రజ్వలించుచున్నఅగ్ని—అగ్నిగాదు.మరియు చిత్రములోగాన్పించు అతిలోకసుందరి—స్త్రీకాదు.ఇవియన్నియు ఆభాసమాత్రములే.అట్లే విజిగీషునియందుగల వివేకము, వాచావివేకముమాత్రమే. అది వివేకముగాదు, అవివేకమేయగును.

శుద్ధాంతఃకరణమునందుదయించిన వివేకము సజల,సరసభూమియందు నాటబడిన కదళీవృక్షన్యాయమున వైరాగ్యాద్యుత్తరసాధనరూపములైన కదళీవృక్షములయొక్క పరంపరకు హేతువగును.కనుక నిట్టి వివేకము వైరాగ్యమునకు కారణమగును.ఆవైరాగ్యము శమాదిషట్కసంపత్తికి కారణమగును. ఇట్లు ఉత్తరోత్తరసాధనములకు పూర్వపూర్వసాధనములు నిమిత్తకారణములు.మరియు శుద్ధాంతఃకరణమను భూమి సర్వసాధనములకు ఉపాదానకారణముగానున్నది.కావున,సాధకపురుషునకు చిత్తశుద్ధిపూర్వకముగా వివేకము సంపాదించుట అత్యంతయోగ్యము. (శ్రీవిచారసాగరమునుండి)

**శ్లో॥ అగాధ మరణావర్త కల్లోలాకులకోటరే।**

**తృష్ణాతరఙ్గతరలే స్వమనశ్చణ్డమారుతే॥**

**శ్లో॥ మహాజడలవాధారే సంసారవిషమార్ణవే।**

**ఇన్ద్రియగ్రాహగహనే వివేకః పోతకో మహాన్॥**(యో.వా.ని.ప్ర. ఉత్తరార్ధము 48 వ సర్గ.శ్లో.38 & 39)

అర్థము:—అగాధము మరియు మరణరూప సుడిగుండములయొక్క కల్లోలములచే వ్యాకులమగు కోటరములతో యుక్తమును,తృష్ణారూప తరఙ్గములచే నతిచంచలమును,తన మనోరూప ఝంఝామారుతముచే యుక్తము

ను,స్థావరాది గొప్పగొప్ప భూతముల(ప్రాణుల)వంటి జలకణములచే వ్యాప్త మును,భయంకరరూప సంసారసముద్రము ఇంద్రియరూప మొసళ్ళచేనతిగ హనమై యున్నది.అటువంటి దుస్తరసాగరమును దాటుటకు "**వివేకమే**"ఒక గొప్ప నావవంటిది.

## 31.వైరాగ్యము

**ఐహికానాం స్రక్చందనవనితాది విషయభోగానాం కర్మజన్యతయా అనిత్య త్వవ దాముష్మికాణా మప్యమృతాది విషయభోగానా మనిత్యతయా తేభ్యో నితరాం విరతిః ఇహాముత్రార్థ ఫలభోగవిరాగః।**(వేదాన్తసారము)

ప్రారబ్ధానుసారము ఈలోకములో సంప్రాప్తశరీరముతో సంబంధపడి యున్న స్రక్=పూలమాల,చందనము,వనిత=స్త్రీ,గృహము,క్షేత్రము=భూమి,పశువులు,భృత్యాది=సేవకులు మొదలగు విషయజన్యసుఖరూపభోగములు, కృషి=వ్యవసాయము,వ్యాపారము మొదలగు కర్మజన్యభోగములును ఎట్లు అనిత్యములో,అట్లేఆముష్మిక=పరలోకసంబంధమైన అమృతాది విషయసేవన జన్య ఆనందములుగూడ యాగాదికర్మజన్యములున్నందున“**యత్కృతకంతద నిత్యమ్=యేదిక్రియా సాధ్యమో అది అవశ్యముగానశ్వరమే**” అనున్యాయము ననుసరించి అనిత్యములగుటకు యోగ్యములు అని బాగుగా నిశ్చయించుకొని,ఇహపరసకలభోగములు విషమిశ్రితాన్నమువలె,వాంతిజేయబడిన అన్నమువలె,కాకిమలమువలె అత్యంతహేయములుగాభావించి వాటినుండి విముఖమగుటయే ఇహాముత్రార్థఫలభోగవిరాగ మనబడును.

**ఆబ్రహ్మస్తంబపర్యన్తైః సర్వప్రాణిభిః సర్వప్రకారస్యాపి దుఃఖస్య స్వరసతః ఏవ జిహాసితత్వాత్ తన్నివృత్యర్థా ప్రవృత్తిరస్తి స్వరసతః ఏవ।**(నైష్కర్మ్యసిద్ధి-ఆరంభములో)

**"నాకు నిరతిశయసుఖముకావాలి,దుఃఖమణుమాత్రముగూడవలదు"**అను అభినివేశము అఖిలప్రాణికోట్లకు స్వాభావికముగా ఉంటుంది.ఈఅభినివేశముచే ఎంతో ఉత్సాహముతో పురుషప్రయత్నము చేసినప్పటికిని వారికి అభిలషిత మైన నిరతిశయసుఖము,ఆత్యంతికదుఃఖాభావము లభించుటలేదు.ఎందుక నగా,సముద్రంపై పయనించి ఆవలితీరమునుచేరుట,రాజునుమచ్చిక చేసికొని అతనికి ప్రీతిపాత్రుడగుట మొదలగు అతికష్టమైన ఉద్యోగము(ప్రయత్నము) అనగా జీవితాంతము ప్రయత్నము చేసిచేసి చివరకు ఫలప్రాప్తిసమయానికి వారే స్వయంగా నశించుచున్నారు—కొందరు. మరికొందరు సుఖసాధనముల గు స్రక్చందనవనితాదులను పొందినప్పటికి వ్యాధ్యాదులచే పీడింపబడి భోగ ములననుభవింపజాలకున్నారు.ఇంకొందరు కించిద్విషయసుఖములను పొం దినను భోగ్యములగు పుత్రభార్యాదులు నశించుటవలనగాని,వారి వియోగ మువలనగాని,వారితో వైరముకలుగుటవలనగాని,సమకూర్చుకొనబడిన భోగ్య జాతముక్షీణించిపోవునేమో అను భయముచేతగాని—ఇత్యాది సంతాపములచే క్షణకాలముగూడ సుఖమును పొందలేకపోతున్నారు.అంగవైకల్యము,క్షుత్పి పాసాదులచే కొట్టబడినవారై హాకష్టము!దరిద్రులు బహుళదుఃఖముననుభ వించుచున్నారు.ఇటువంటి బహుదుఃఖసంకుల సంసారమున లేశమాత్రసుఖ మునునుభవించుచున్నప్పటికి,విశుద్ధాంతఃకరణముగలవాడు[విపులధనము న్నను కృపణుడు(లోభి)దానినంటుకొననట్లు]వాటిచేనంటుకొనక వైరాగ్యము నొందును.పుణ్యాపాపములచే గలుగు సుఖదుఃఖములన్నియు వివేకముగల వారికి దుఃఖరూపములేయను విషయము భగవాన్ శ్రీపతంజలిచే యోగదర్శన ము 2-15 లోచెప్పబడినది.

**"పరిణామతాపసంస్కారదుఃఖైర్గుణవృత్తివిరోధాచ్చదుఃఖమేవసర్వం వివేకినః"।**

పరిణామతాపసంస్కారదుఃఖములచేత సత్త్వరజస్తమోగుములయొక్క ప్రకాశాది చిత్తవృత్తుల పరస్పర బాధ్యబాధకభావరూప విరోధమువలన భోగసాధనమగు నీజగత్తంతయు వివేకవంతునికి దుఃఖ రూపమేయగును.

**శంక**:—పైనచెప్పబడిన విధముగా ఈలోకసంబంధమైన సుఖములు అనిత్యత్వాది దోషదూషితములున్నందున వాటిపట్ల హేయబుద్ధితో వైరాగ్యమును పొందితే పొందవచ్చును,కాని పారలౌకికస్వర్గాదిసుఖములు "అక్షయ్యంహవైచాతుర్మాస్యయాజినఃసుకృతంభవతి"(శతపథబ్రాహ్మణము2-6-3-1);"అపామసోమమమృతాఅభూమ"(ఋగ్వేదము6-4-11)అక్షయసుఖములుగా చెప్పబడినందున వాటినుండి పురుషుడు ఉత్థానమునొందడు(విరక్తుడుకాజాలడు).

**సమధానము**:—ఐహికములగు స్రక్చందనవనితాదిభోగములు ఎంత అనిత్యములో—యజ్ఞయాగాదికర్మఫలములుగా ప్రాప్తించు ఆముష్మికమైన స్వర్గాది అమృతసేవనాది భోగములుగూడ అంత అనిత్యములేయగును."**క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశన్తి**"(గీత.9-21)పుణ్యముక్షీణించగా మర్త్యలోకమునుచేరుచున్నారు-అనుగీతావచనముచేతను,"**తద్యథేహకర్మజితోలోకఃక్షీయతఏవమేవాముత్ర పుణ్యజితోలోకఃక్షీయతే**"(ఛాం.8-1-6).ఈలోకములోకృషి,వాణిజ్య,సేవాదికర్మలచే ప్రాప్తమగు పరాధీనోపభోగములు యెట్లు క్షీణించునో,అట్లే అగ్నిహోత్రాది పుణ్యకర్మలచే ప్రాప్తమగు స్వర్గాదిపరలోక పరాధీనోపభోగములుగూడ నశించుచున్నవి-అను శ్రుతిచేతను ఈకర్మఫలములన్నియు అనిత్యములేయని తేటతెల్లమగుచున్నది.

"**అక్షయ్యంహవై**"(శతపథబ్రాహ్మణము2-6-3-1)"**అపామసోమమమృతాఅభూమ**"(ఋగ్వేదము6-4-11)ఇత్యాదిశ్రుతులలో"**అక్షయ**"మరియు"**అమృత**"శబ్దములచేచెప్పబడు కర్మజన్య యే సుఖమున్నదో,అదిప్రళయకాలపర్యంతస్థాయిత్వముగల సాపేక్షి

క నిత్యసుఖము అను అభిప్రాయముచే చెప్పబడినది.

**శ్లో॥ఆభూతసంప్లవం స్థాన మమృతత్వం విభావ్యతే।**

**త్రైలోక్యస్థితికాలోఽయ మపునర్మారఉచ్యతే॥**(వి.పు. 2-8-97)

భూతముల ప్రళయపర్యంతస్థాయిత్వమునకే"**అమరత్వము**"అని చెప్పబడిన ది.మూడులోకముల స్థితికాలమువరకే పునర్జన్మరాహిత్యరూప అమృతత్వ ము చెప్పబడినది.కాని,నిరపేక్షిక,నిరతిశయ,నిత్యసుఖరూప మోక్షము కాదు. ఏది జన్యమో అది నిత్యము,భావవరూపము అనుట అదృష్టచరము(అనుభ వరోధము).వివేకికి ఎట్లు ఐహికభోగములపట్ల వైరాగ్యముగలుగునో,అట్లే బ్ర హ్మలోకపర్యన్తముగల సకలభోగములపట్ల వైరాగ్యము గలుగుట సంభవమే.

**శ్లో॥నకాంక్షే విజయం కృష్ణ నచ రాజ్యం సుఖానిచ।**

**కింనో రాజ్యేన గోవింద! కిం భోగై ర్జీవితేన వా॥**(గీత.1-32)

హేకృష్ణా!నేను యుద్ధముజేసి విజయమును పొందగోరుటలేదు.మరియు రా జ్యమునుగాని,రాజభోగములనుగాని పొందగోరుటలేదు.ఓగోవిందా!రాజ్యముువ లనగాని,రాజ్యభోగములచేతగాని,చివరకు జీవించుటయందుగానియేమి ప్రయో జనముగలదు?

ప్రాసంగికముగా "కృష్ణ"మరియు "గోవింద" శబ్దార్థములను తెలిసికొందము:—

**శ్లో॥కృషిర్భూవాచకః శబ్దోణశ్చ నిర్వృత్తి వాచకః।**

**తయోరైక్యం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే॥**(యాస్కనిరుక్తము)

**శ్లో॥కృషిర్భూవాచకః శబ్దోణశ్చ నిర్వృత్తి వాచకః।**

**విష్ణుస్తద్భావయోగాచ్చ కృష్ణోభవతి సాత్వతః॥**(మ.భా.ఉద్యోగ పర్వణి 70-5)

అర్థము:—"కృష్"ధాతువు సత్త అర్థమునకు వాచకమున్నది.(భూ=సత్తాయాం);"ణ" శబ్దము నిర్వృతి=ఆనందము అను అర్థమును బోధిస్తుంది.ఈ రెండు భావములతో యుక్త మైయున్నందున,రెంటియొక్క ఐక్యమును అనగా యేది సద్రూపము మరియు ఆనంద రూపమును అగు(ఉపలక్షణముచే చిద్రూపమునగు)విష్ణువు=వ్యాపకపరమాత్మ యేది గలదో అదియే "కృష్ణ"శబ్దమునకర్థము.("విశిష్టః శుద్ధాన్నాతిరిచ్యతే"—అను న్యాయానుసార ము,అనగా ఘటాకాశము మహాకాశముకంటె వేఱు కానట్లు—ఆ సచ్చిదానందఘన పర మాత్మయే సగుణసాకారరూపంలో యదుకులమున అవతరించిన శ్రీకృష్ణుడు)

**శ్లో॥అహో భాగ్యమహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్।**

**యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనమ్॥**(శ్రీమద్భాగవతము 10-14-32)

అహో! నందబాబా మరియు వ్రజవాసులగు గోపగోపీజనులయొక్క భాగ్యమేమని చెప్పను. వీరెంతటి భాగ్యవంతులు.ఎంతటి ధన్యజీవులు.ఎందుకంటె,పరమానందస్వరూప-సనాతన -పరిపూర్ణ పరబ్రహ్మమే వీరికి మిత్రుడుగా అనగా పరమహితైషియగు సుహృదుడుగా శ్రీకృష్ణరూపంలో నందకులమున జన్మించెను.

**కృష్ణమేనమవేహి త్వమాత్మానమఖిలాత్మనామ్।**

**జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాభాతి మాయయా॥**(శ్రీమద్భాగవతము 10-14-55)

ఈ శ్రీకృష్ణుడే మీ అందరి ఆత్మలయొక్క(సకల జీవులయొక్క)ఆత్మ అనగా స్వరూపమని తెలియండి.జగత్కల్యాణము కొఱకై తన యోగమాయను ఆశ్రయించి శరీరధారివలె కన్ప ట్టుచున్నాడు.

**ఏతే చాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్।**(శ్రీమద్భాగవతము 1-3-28)

---

1."గో" అనగా భూమియని అర్థము.

**శ్లో॥నష్టాం వై ధరణీం పూర్వమవిందద్యద్గుహాగతామ్।**

**గోవింద ఇతి తేనాహం దేవైర్వాగ్భిరభిష్టుతః॥**(మహాభా.శాం.ప.342-70)

అర్థము:—పూర్వము నష్టమై రసాతలమునకు వెళ్ళిన పృథివిని,నేను వరాహరూపమును ధరించి తిరిగి పొందితిని.కావున,దేవతలు వారి వాణిచేత నన్ను"గోవిందు"డని స్తుతించిరి. "గాం—పృథివీం విందతి-ప్రాప్నోతి ఇతి గోవిందః" పృథివిని ఎవడు పొందెనో వాడు గోవిందుడు-శ్రీహరి.

**2.శ్లో॥అహం కిలేంద్రో దేవానాం త్వం గవామింద్రతాం గతః।**

**గోవింద ఇతి లోకాస్త్వాం స్తోష్యన్తి భువి శాశ్వతమ్॥**(హరివంశ పురాణము 2-19-45)

అర్థము:—నేను దేవతలకు ఇంద్రుడనైయున్నాను. నీవు గోవులకు ఇంద్రుడవైయున్నావు.కావున,నేటినుండి సనాతనుడవగు నిన్ను ఈ భూతలముననున్న లోకులందరు "గోవిందుడ"ని స్తుతించెదరు—అని దేవేంద్రుని వచనము.

**3.శ్లో॥గౌరేషా తు యతో వాణీ తాం చ వేద యతో భవాన్।**

**గోవిందస్తు తతో దేవ మునిభిః కథ్యతే భవాన్॥**(హరివంశ పురాణము 3-88-50)

అర్థము:—ఓ దేవా!ఈ వాణి"గౌ"అను పేరుతో ప్రసిద్ధమున్నది.దానిని నీవెఱుగుదువు గాన,మునులు నిన్ను "గోవిందుడు" అని చెప్పుదురు.

4.గోభిరేవ యతో వేద్యో గోవిందః సముదాహృతః।(శ్రీవిష్ణుతిలకములో)

గోభిః వాణీభిః విందతే, వేత్తి వేదాన్త వాక్యైర్వా ఇతి గోవిందః।"గో" అనగా వాణిచేత భగవంతుడు ప్రాప్తమగును లేదా వేదాన్తవాక్యములచే తెలిసికొందురు.కావున, "గోవిందుడు" అనబడును.(విష్ణుసహస్రనామ భాష్యము)

5.గో అనగా వేదము.మత్స్యావతారమెత్తి హయగ్రీవుడను రాక్షసుని సంహరించి వేదములను తిరిగి పొందినందువలన శ్రీహరి "గోవిందుడ"య్యెను.

**శ్లో॥గురూనహత్వాహిమహానుభావాన్శ్రేయోభోక్తుంభైక్ష్యమపీహలోకే।**

**హత్వార్థకామాంస్తుగురూనిహైవభుంజీయభోగాన్రుధిరప్రదిగ్ధాన్॥**(గీత.2-5)

మహనీయులు మరియు పూజ్యులు అయినవారిని చంపుటకంటె యీలోకంలో భిక్షాటనముచేసికొని జీవించుట మంచిపని. ఏలయన?ఈగురుజనులను వధించి ఈప్రపంచమునందు నేను రక్తముతోకూడిన సంపదను,కోరికలతోగూడిన భోగములను ఎట్లు అనుభవించగలను?వారిని వధించినందువలన నాకు లభించునవి ఇహలోకభోగములేగదా!

**శ్లో॥ఏతాన్నహన్తుమిచ్ఛామిఘ్నతోఽపిమధుసూదన।**

**అపిత్రైలోక్యరాజ్యస్యహేతోఃకింనుమహీకృతే॥**(గీత. 1-35)

ఓ మధుసూదన!వారందరూ నాపైదండెత్తివచ్చి నన్ను బాధించిన(చంపిన)ను సరే—నేనుమాత్రము ముల్లోకముల రాజ్యాధిపత్యమును పొందుటకైనను నాబంధువులైన వీరినందరిని చంపజాలను.అలాంటప్పుడు ఒకచిన్న రాజ్యముకొఱకు నేనువారినందరిని ఎలాచంపగలను?—ఇత్యాది అర్జునుని వాక్యములచేతను,

**“సస్యమివమర్త్యఃపచ్యతే, సస్యమివాజాయతేపునః”** (కఠ.1-1-6)

మర్త్యః=మరణధర్మముగలమానవుడు పైరువలె పండుచున్నాడు,జీర్ణమై నశించుచున్నాడు.మరల,సస్యమివ=పైరువలె,అజాయతే=ఆవిర్భవించుచూఉండును.ఇక ఖేదపడుటెందులకు?

**శ్వోభావామర్త్యస్యయదంతకైతత్,సర్వేన్ద్రియాణాంజరయన్తితేజః।**

**అపిసర్వంజీవితమల్పమేవతవైవవాహాస్తవనృత్యగీతే॥** (కఠ 1-1-26)

ఓయమరాజా!“నూరేళ్ళుజీవించే కొడుకులనూ,మనుమలనూ,పశువులమందలనూ,ఏనుగులనూ,గుర్రాలనూ,ఎంతైనాబంగారమునూ,భూమిపై సువిశాల సామ్రాజ్యాన్ని మరియు నాకు ఇచ్చవచ్చినంత జీవితకాల మునూ-ఇంకా మానవలోకంలో దుర్లభమైన ఏమేమి కోరికలుగలవో వాటన్నిటినీ నీయిష్టప్రకారము అడుగుము.మానవులకు లభ్యంకాని సంగీతవాద్యాలతో విహారరథములూ,అపురూపసుందరులైన కన్యలనూ,వారిసేవలను ఇవన్నియు నీకు వరముగాప్రసాదిస్తాను నీవు కోరుకో”—అనిఅంటున్నావు.కాని,నీవుచెప్పే ఇవన్నీకూడా క్షణికములే.శ్వోభావాః=రేపటివరకే అస్తిత్వముగలవి.(శ్వఃఉభావాః=రేపటివరకు వీటికి అస్తిత్వముంటుందను నియమము లేనివి)రేపటివరకుండునో, ఉండవో అను సందేహభావముగల అనిత్యములగు భోగ్యపదార్థములు. మనుష్యుని సర్వేంద్రియముల తేజస్సును(బలప్రతాపములను)జీర్ణ శీర్ణమొనరించుచున్నవి.అందువల్ల,ధర్మము,వీర్యము,ప్రజ్ఞ,తేజము మరియు యశస్సు మొదలగువాటిని నశింపజేయుటవలన,ఈభోగములన్నియు అనర్థకములు. ఇక జీవన విషయమందువా!వినుము.బ్రహ్మదేవుని సంపూర్ణ జీవనము(ఆయువు)గూడ అల్పమే.అలాంటప్పుడు అస్మదాదుల దీర్ఘజీవనము మాటేమి

టి?అందువలన,ఈ వాహనాదులు,నృత్యగీతాలు,ఆమోదప్రమోదాలు అన్నీ నీకే ఉండనిమ్ము.చనిపోయిన పిదప అనుభవించేదెవరు?భోగములు అశాశ్వత ములు.ఇవన్నియు కోరదగినవికావు.వీటిచే ఆత్మశాంతిలభించదు.కావున, మోక్షసాధనమగు ఆత్మజ్ఞానమునే నేను వరించెదను.ఇత్యాది నచికేతుని వాక్యములచేతనూ వివేకియగువానికి ఇహాముత్రఫలభోగవిరాగము గలుగుట సంభవిస్తుంది-అని సుస్పష్టముగాతెలియుచున్నది.

మరియు శ్రీవ్యాసభగవానులుగూడ ఈక్రిందివిధంగా సెలవిచ్చియున్నారు.

**శ్లో॥యచ్చకామసుఖంలోకేయచ్చదివ్యంమహత్సుఖమ్।**

**తృష్ణాక్షయసుఖస్యైతేనార్హతః షోడశీంకలామ్॥**(మ.భా.శాన్తిపర్వము174-46& 177-51)

ఈలోకంలో యేయే వైషయికసుఖములున్నవో మరియు స్వర్గాదిపరలోక ములలో యేయే దివ్యమైన,ఉత్కృష్టమైన సుఖములుగలవో—ఇవన్నియుగూ డ తృష్ణాక్షయము(వైరాగ్యము)వల్లగల్గుసుఖములో పదహారవవంతుకుకూడా సరితూగవు.

**శ్లో॥ఇంద్రలోకేమహాదుఃఖం ప్రాజాపత్యే మహత్తరమ్॥**

**విష్ణులోకే చ రౌద్రే చ దుఃఖమేవ విచారతః॥**

(సూతసంహిత యజ్ఞవైభవఖండము 17-67)

ఇంద్రలోకముచేరుకున్నను దుఃఖమునుండి విముక్తిలేదు.అపురూప సుంద రియగు రంభ ఒకతె,కాని ఆమెనుకోరువారు అనేకులు.కావున, దుఃఖము కలుగుట సహజము.ఒకరికి అధికారము అధికమైతే మరొకరికి న్యూనము. అందువలనగూడ దుఃఖమే.హిరణ్యకశ్యపునిలాంటి బలపరాక్రమములుగల అసురులతో భయము,పుణ్యము క్షీణించుచున్నదిగదా—అను భయముచే

దుఃఖము ఉండనే ఉంటుంది.ఒకవేళ ప్రజాపతి(బ్రహ్మదేవుని)పదవిని పొందిన నూ ఆపత్తులు తప్పవు.ఎప్పుడూ దేవదానవయుద్ధము జరుగుతూనే ఉం టుంది.ఇద్దరుగూడ ప్రజాపతిబిడ్డలే,కావున,యెవరి పక్షమును స్వీకరించాలి? పురుషుని రెండు కళ్ళలో యేకన్నును పొడుచుకొని గ్రుడ్డివాడుకావాలని ఇచ్ఛగించును?మహాదేవుడు రాక్షసులకు యథేచ్ఛవరములను ప్రసాదిస్తాడు. ఆ వరములను అవకాశముగా తీసుకొని రాక్షసులు— దేవతలను,మహర్షుల ను,మానవులను పీడిస్తుంటారు.పాపము!సంకటములో పడిన ప్రజాపతి యే దోఒక వ్యవస్థచేయవలసియుండును.విష్ణులోకములోగూడ దుఃఖములు త- ప్పవు.అది వైభవసామ్రాజ్యము.వైభవతారతమ్యముచే దుఃఖము ధృవము (నిశ్చితము).ఒకవేళ అక్కడికివెళ్ళిన విష్ణుభక్తుడు అక్కడి దివ్యభోగములచే ఆకర్షింపబడి భోగపరాయణడైనచో అధోగతినిశ్చయము.ఒకవేళ భోగములన నుభవించకుండ ఇంద్రియనిగ్రహముగల్గియున్నచో—ఈలోకమునకు వ్యర్థము గా యేలవచ్చితిని?అను దుఃఖముకలుగును.అట్లే రుద్రలోకముగూడ దుః- ఖాలయమే.ఇక్కడ భూత,ప్రేత,పిశాచములసమాజము.వారిని చూస్తేనే భయ మేస్తుంది.ఒక్కోసారి గణేశాదులు స్వయంగా తమతండ్రియగు శివునితో తల పడతారు.ఆతగవులో అన్యాయముగా ప్రమదగణము దెబ్బలు తినవలసి వచ్చును. ఒక్కోసారి రావణుడువచ్చి కైలాసమును కదుపుతాడు. నీచమైన రాక్షసులకు గణాధ్యక్షపదవి లభిస్తుంది.పూర్వపు అనుచరులు చూస్తూ ఉండి పోతారు.పార్వతీపరమేశ్వరులు రహస్యముగా ముచ్చటించుకొనునపుడు పొర పాటున ఎవరైన విన్నచో వెంటనే వారికి శాపము ఇవ్వబడును.అందువల్ల, చాలాఉత్తమము-దివ్యమైనవిగా ప్రసిద్ధిజెందిన లోకాలలోగూడ దుఃఖములే. ఇది,అది,ఇంత,అంత అని చెప్పనేల?శరీరమును"**నేను,నాది**"అని యెంతవర

కు భావించెదరో,అంతవరకు దుఃఖపరంపరరూప ప్రవాహములో కొట్టుకు పోవా ల్సిందే.లేశమాత్రముగూడ సుఖములభించదు.విచారించినచో **కేవలము ఆత్మ యే(తనస్వరూపమే)సుఖరూపము,అన్యదఖిలం"దుఃఖాలయమశాశ్వతమ్"**(గీత. 8-15)ఇంకను ఇహపరభోగములయందుగల దోషములను దర్శించి దృఢవైరా గ్యమును పొందగోరువారు యజ్ఞవైభవఖండములోని పదిహేడవ అధ్యాయము ను సంపూర్ణముగా,యోగవాసిష్ఠము వైరాగ్యప్రకరణమును నిఃశేషముగా మరి యు భర్తృహరి వైరాగ్యశతకమునుగూడ అవలోకించదగును.విస్తారభయము చే మేము వ్రాయుటలేదు. కావున,

**"తద్యథేహకర్మజితో"**(ఛాం.8-1-6)ఇత్యాదిశ్రుతులచేతను,**"ఆబ్రహ్మభువనాల్లో కాఃపునరావర్తినోఽర్జున"**(గీత.8-16)ఇత్యాది స్మృతిప్రమాణములచేతను మరియు **"యత్కృతకంతదనిత్యమ్"**ఇత్యాది యుక్తులచేతను ఆబ్రహ్మస్తంబ పర్యన్తము ఐహికపారలౌకికసమస్తభోగములను"**కాకవిష్ఠ**"వలె అత్యంత హేయములని భావించి దోషదృష్టిచే భోగేచ్ఛాత్యాగమే—"**వైరాగ్యము**"నబడును.

## 32.దోషదర్శన ప్రకారము

ప్రాసంగికము*గా దోషదర్శనమునుగూర్చి యథామతిగా తెలిసికొందము.దోష దర్శనము మూడువిధములు.1.భోగవిషయకదోషదర్శనము,2.భోగ్యవిషయక దోషదర్శనము, 3. భోక్తృవిషయకదోషదర్శనము.

[*అన్యోద్దేశేఽన్యసిద్ధిః, నిరూపణయోగ్యత్వం వా ప్రసంగః]

**1."సుఖదుఃఖాన్యతరసాక్షాత్కారో భోగః"**సుఖదుఃఖములలో ఏదో ఒకదాని సాక్షా త్కారము(ప్రత్యక్షానుభవము)నకు భోగమందురు.(తర్కభాష)లేక,**"ఆనందమాత్ర అనుభవో భోగః"**(వేదాన్తినః)కేవల ఆనందముయొక్క ప్రత్యక్షానుభవమునకు భోగ

మందురు.అనగా ఐహికవిషయములతోగాని,పారలౌకికవిషయములతోగాని ఇంద్రియములసంబంధమువల్ల గల్గిన క్షుద్రసుఖలేశమునకు భోగము అంటారు.పురుషుణ్ణి శబ్దాదివిషయములలో ప్రవృత్తము చేయగల రజోగుణము యొక్క బుద్ధివృత్తి—విశేషరూపరాగద్వేషములతో కూడియున్నందున ఈభోగములు దుఃఖమూలములు. **"రజసస్తుఫలందుఃఖమ్"**(గీత.14-16)రజోగుణకార్యమున్నందున భోగములు దుఃఖహేతువులు.

**శ్లో॥యావన్తఃకురుతేజన్తుః సంబంధాన్మనసఃప్రియాన్।**

**తావన్తోఽస్యనిఖన్యన్తే హృదయే శోకశఙ్కవః॥**(వి.పు.1-17-66)

రంజనాత్మకవృత్తిరూప రాగముతో జీవుడు తనకు ప్రియమును గల్గించు శబ్దాదివిషయములతో ఇంద్రియసంయుక్తమనస్సుయొక్క సంబంధమును ఎంతెంత దృఢపరుచుచుండునో,అంతంతశోకకంటకములు తనహృదయములో దృఢముగా నాటుకొనుచుండును.

**శ్లో॥యేహిసంస్పర్శజాభోగాదుఃఖయోనయఏవతే।**

**ఆద్యన్తవన్తఃకౌన్తేయనతేషురమతేబుధః॥**(గీత. 5-22)

శబ్దాదివిషయాలయందు దోషదర్శనముయొక్క అభ్యాసముచేతనే విషయాలయందుగల ప్రీతి నివృత్తమవుతుంది—అని భగవానుడు చెప్తున్నాడు. ఓ కౌన్తేయ=అర్జునా!ఏవి విషయేంద్రియసంయోగమువలన గల్గు సుఖానుభవములుండునో,అవి దుఃఖకారణములేయగును.మఱియునవి ఉత్పత్తివినాశములుగలవైయుండును.కావున,నిర్మలబుద్ధి గలవాడు(వివేకి)ఆవిషయసుఖములయందు ఆసక్తిలేనివాడైయుండును.ఆత్మసుఖానురక్తుడైయుండును.విషయసుఖములందు రెండుదోషాలను చూపెట్టాడు భగవంతుడు.

1.దుఃఖయోనయః(దుఃఖహేతువులు),2.ఆద్యన్తవన్తః(ఆదిఅంతములుగలవి)

**1.దుఃఖయోనయః:—**ఒకవిషయము ఒకానొకవ్యక్తికి సుఖమునిస్తుంది.కాని అదేవిషయము మరొకరికి దుఃఖమును కలుగజేస్తుంది.ఉదా:—లడ్డు అందరికి ఇష్టమే.వాటిని అనుభవించేవ్యక్తికి మొదటిలడ్డు చాల మధురముగా ఉంటుం ది.అట్లే వరసగా పదిలడ్లుతిన్నాడనుకోండి.ఆ పదవలడ్డు చేదుగాఉంటుంది. మరిన్నితినుమంటే దుఃఖపడతాడు.అవే లడ్లు మధుమేహమున్నవానికి దుః ఖాన్ని కలుగజేస్తాయి.ఇప్పుడు విచారించండి.నిజంగా లడ్లలో సుఖముందా? ఒకవేళ సుఖముంటే అందరికీ అన్నికాలాల్లో,అన్నిదేశాల్లో ఒకేవిధంగా సుఖాన్నిఇవ్వాలిగదా!అగ్నిలో దాహకత్వముంటుంది.అది ఎవరు ముట్టుకు న్నా,ఎప్పుడు ముట్టుకున్నా,యేదేశంలోనైనను కాలుస్తుంది.విషయసుఖము అలాంటిది కాదు.కావున వాస్తవముగా విషయాలలో సుఖములేదని తేట తెల్ల మైనది.సంసారములో ఎక్కడగూడ నిజమైన సుఖములేదు. జీవులకు సంసారము సారమైనదని, సుఖరూపమని భ్రాన్తిగల్గుచున్నది.

**శ్లో॥అసారే ఖలు సంసారే సుఖభ్రాన్తిమనీషిణామ్।**

**లాలాపానమివాంగుష్ఠే బాలానాం క్షీరవిభ్రమః॥**(సుభాషితము)

బొటనవ్రేలునుండి పాలుస్రవిస్తున్నవను భ్రమచే పసిపిల్లలు తమ బొట నవ్రేలును నోట్లోపెట్టుకొని చీకునట్లు(చప్పరించునట్లు)ఈమనుష్యులు అసార మగు సంసారమున సుఖమున్నదని భ్రమజెందుచున్నారు గదా!పిల్లవాని నోటినుండి లాలాజలమువస్తుంటే,అంగుష్ఠమునుండి వస్తుంది—అని భ్రమజెం దినట్లు జీవులు విషయేంద్రియసంబంధమువలన గల్గిన ప్రియ,మోద,ప్రమో దవృత్తులయందు ఆత్మసుఖముయొక్క ప్రతిబింబసుఖముననభవిస్తూ విష

యములనుండియే మాకుసుఖము లభిస్తున్నదని భ్రాన్తిజెందుచున్నారు. శ్వానము(కుక్క)ఎండిన ఎముకను కొరుకగాకొరుకగా ఆ ఎముక చిట్లిపోయి, ఒకముక్క తన చిగుళ్ళకు గ్రుచ్చుకొనగా తననోటినుండి వెలువడిన రక్తము కొరుకుచున్న ఎముకపైబడగా,ఆ తనయొక్క రక్తమునే తాను నాకుతూ (ఆస్వాదిస్తూ)నిజముగా ఎముకనుండియే రక్తము వస్తుంది—అని భ్రమజెంది నపగిది—ఈజీవుల పరిస్థితి ఉంది. అహో! శోచనీయము.

**శ్లో॥సంకల్పితానన్దలవస్తిష్ఠత్యుద్ధరకంధరమ్।**

**అకస్మాత్ప్రచ్యుతమధుబిందుభుక్కరభోయథా॥**(యో.వా.స్థితిప్రకరణము53-30)

ఒకగాడిద అకస్మాత్తుగా గోతిలోపడింది.అది పడుటవలన గోతిలోప్రేలా డబడియున్న చెట్టుకదుపబడి,ఆచెట్టుకుగల తేనెతెట్టె కదిలి దాని నుండి అ-ప్పుడప్పుడు ఒక తేనెబిందువు కారి గోతిలోపడిన గాడిద నోట్లో పడుచుండె ను.ఆ గాడిద తననోట్లోపడిన తేనెబిందువులనాస్వాదిస్తూ,ఆనందిస్తూ ఇంకా చాలా తేనె లభించిన బాగుండునని భావనచేస్తుంది.కాని,నేను గోతిలోపడి ఘోర అపాయములో ఉన్నానుగదా యను తన వర్తమానస్థితినే మరిచి పోయినది.అట్లే జీవుడు సంసారకూపములోపడి తన్నుతానుమరచి హర్షము తో మెడలుచాచి క్షుద్రమైన విషయానంద లవలేశముననుభవించుటకు సం కల్పించుచున్నాడు.గాడిదకు తేనెను ఆస్వాదించుట ఎట్లు దుర్లభమైనదో,అ-ట్లు జీవునకు విషయసుఖముగూడ దుర్లభమైనది.బిందుమాత్ర విషయసు ఖము ననుభవించి,ఇంకా ప్రభూతసుఖమును పొందుటకు భావనచేయుచు న్నాడు.ఈ వైషయికసుఖమే దుర్లభమన్నచో,ఇక మోక్షసుఖముగూర్చి వేరు-గా చెప్పవలెనా?

**శ్లో॥స్వయైవదుఃఖదాయిన్యా చేష్టయాపరిరోదితి।**

**కాష్ఠావష్టబ్ధవృషణః కీలోత్పాటీ కపిర్యథా॥**(యో.వా.స్థితిప్రకరణము 53-29)

కొందరు వడ్రంగివారు(తక్షకులు)అడవిలో ఒక కట్టెమొద్దును అంపముతో నిలువుగా సగమువరకు చీల్చి,చీల్చబడిన కట్టెమొద్దునకు ఒకమేకును (చీలను)బిగించి వెళ్ళిపోయారు.అంతలో ఒకకోతి వచ్చి ఆమొద్దు పైకూర్చొని, దాని వృషణములు(అండకోశములు)కట్టెరంధ్రములోదూరుకుపోయిన సంగతి మరచి,తనచాపల్యముతో చీలను పెరికివేసినది.వెంటనే కట్టెరంధ్రము మూసి కొనిపోగా,అండకోశములు చిట్లి మరణదుఃఖమును పొందినదాయెను.తనకే దుఃఖమును గలిగించు చేష్టచే ఎట్లు వానరము మరణదుఃఖమును పొందినదో, అట్లే జీవుడు క్షణికము,అనిత్యమునగు క్షుద్రవిషయసుఖమునుగోరి తనకే భయంకరమగు జననమరణరూపదుఃఖమును గల్గించు నిషిద్ధకర్మలాచరించి తత్ఫలితముగా అనంతదుఃఖమును కొనితెచ్చుకుంటున్నాడు.కావున,విష యసుఖములు దుఃఖయోనయః=దుఃఖమునకు హేతువులు—అని“శాస్త్రము, యుక్తులు మరియు అనుభవము”చే సిద్ధమగుచున్నది.

**2.ఆద్యన్తవన్తః**=విషయసుఖములు ఉత్పత్తివినాశములుగలవి.ఆది=విషయేం ద్రియసంయోగము;అన్తము=విషయేంద్రియవియోగము.సంయోగ వియోగము లకు పూర్వోత్తరమునందు అసద్రూపమైయున్నందున మధ్యకాలములో(సు ఖసద్భావకాలములో)గూడ స్వప్నమువలె ప్రాతీతికములు,క్షణికములు మరి యు మిథ్యయై యున్నవి.

కారికా:—**ఆదావన్తేచయన్నాస్తి వర్తమానేఽపి తత్తథా।**

**వితథైః సదృశాఃసన్తోఽవితథా ఇవలక్షితాః॥**(మాం.కా.వైతథ్యప్రకరణము-6)

ఏది ఆదియందు మరియు అన్తమునందు లేదో అనగా ఆద్యన్తములందు అసద్రూపమైయుండునో,అది వర్తమానములోగూడ అట్లే అసద్రూపమే ఉంటుంది.అసద్రూపమైయుండియు సద్రూపమువలె గోచరించును.జాగతిక సకలపదార్థములు ఆవిద్యకములేగాన మిథ్యాభూతములే.రజ్జుసర్పము మిథ్యయే,అయినను దుఃఖమునకు కారణమగుచున్నది.అట్లే వైషయికసుఖము గూడ ఆద్యన్తములుగలదై దుఃఖహేతువున్నదను దోషదర్శనముచే సాంసారిక సకల విషయసుఖములనుండి వివేకి యగువాడు విరక్తినొందును.

**—:వైషయికసుఖము ఎవరిధర్మము?:—**

(శ్రీమద్భగవద్గీత-శంకరానంది 18-37 ఆధారంగా)

శంక:—నను బ్రహ్మవిదాం బ్రాహ్మం సుఖం అతిక్లేశసాధ్యం, విషయసుఖం త్వతిసులభం సుఖార్థిభిస్తదేవానుభోక్తవ్యమ్, తథాచోక్తమ్:—

**శ్లో॥అపి వృన్దావనేశూన్యే శృగాలత్వం స ఇచ్ఛతి।**

**నతు నిర్విషయం మోక్షం కదాచిదపి గౌతమ!॥**(రాగిగీతమ్)(పంచపాదికా తృ.వర్ణకమ్)

బ్రహ్మవిదునికి బ్రహ్మసుఖము అతిక్లేశసాధ్యము.విషయసుఖము అతిసుల-భము.కావున సుఖమునిచ్ఛగించుపురుషులు విషయసుఖమునే అనుభవించవలెను. రాగిగీతముగూడ చెప్పుచున్నది.ఏమనగా,వృందావనపు చిట్టడవుల్లో నక్కలమై పుట్టి క్షణికసుఖమైనను సరే ఆ విషయసుఖమునే అనుభవించెదముగాని నిర్విషయక మోక్షసుఖము మాత్రము మాకు వలదు.

ఇట్లు శంక ప్రాప్తముకాగా,శంకాకారుని ఈక్రిందివిధంగా వికల్పించి అడుగవలెను.

I.ఓయీ పూర్వపక్షీ! వైషయిక సుఖమును విషయధర్మమందువా? అది యుక్తముకాదు. ఏలయన?విషయసన్నిధానములో పూర్వక్షణములో కలిగిన సుఖము ఉత్తరక్షణములో కనుపించుట లేదు.సుఖాభివ్యఞ్జక ప్రారబ్ధము లేని చో విషయప్రాప్తియే దుర్లభమగును.విషయసాన్నిధ్యమున్నంతవరకు ప్రారబ్ధ ముండును.కావున,ప్రథమక్షణములోవలెనే ద్వితీయాది క్షణాల్లోగూడ సుఖప్ర తీతి కలుగవలెను.కాని,విషయము అన్నిక్షణాల్లో అందరికి సుఖమునిచ్చుట లేదు.ఒకవ్యక్తికి సుఖమునిచ్చిన విషయము మరొకరికి దుఃఖమునకు కార ణమౌతుంది.ఒకేవ్యక్తికి ఒకకాలంలో సుఖమునిచ్చిన విషయము మరొక కాలం లో దుఃఖమునిస్తుంది.అందువల్ల సుఖము విషయధర్మము కాదు.

II.విషయసుఖము కరణధర్మమందువా?అది సరిగాదు.విషయ వ్యవధానం లోగూడ సుఖానుభవము కలుగవలెను.కాని, కలుగుటలేదు.

III.లేక, కర్మధర్మమందువా?యుక్తముగాదు.సుఖము పుణ్యకర్మయొక్క కార్యమున్నందున కర్మధర్మము కాదు.కర్మానుష్ఠాన కాలంలోగూడ సుఖము భాసించవలెను.కాని,అట్లుగాక కర్మానుష్ఠానసమాప్త్యుత్తరక్షణంలో అపూర్వము ఉత్పన్నమగును.ఆ అపూర్వము కాలాంతరములోగాని,జన్మాంతరములోగాని సుఖాన్నిస్తుంది.

IV.విషయసుఖము భోక్తయొక్క ధర్మమందువా?ఇదియును యుక్తముగా దు.ఎందుకంటె?భోక్తకు ఎప్పుడును విక్షేపము కలుగకుండవలెను.

V.ఒకవేళ దేశధర్మమందువా?అదియును సరిగాదు.అన్నిదేశములందును సుఖము లభింపగల్గుచో,స్వర్గలోకాపేక్షయే లేకుండవలయును.కాని,"**ఇంద్ర**

**లోకే మహద్దుఃఖం ప్రాజాపత్యే మహత్తరమ్**" అని పూర్వమే తెలిసికుంటూ వచ్చాము.

VI.లేక,కాలధర్మమందువా?సంభవించదు.ఏలయన;శీతాకాలము మరియు వేసవికాలములలో ఎల్లవేళలందు సమానముగా సర్వత్ర సర్వులకు సుఖము ప్రాప్తించవలెను.

VII.వైషయికసుఖము అజ్ఞానధర్మమా?కాదు.ఎందుకంటె?వస్తువుయొక్క భోగ్యత్వ పరిజ్ఞానములేకుండా సుఖము కనుపించుటలేదు.

VIII.లేక,విషయ"జ్ఞానము"యొక్క ధర్మమనెదవా?సరిపడదు.ఎందుకనగా? వస్తువుయొక్క రమ్యత్వజ్ఞానము కలిగినను విరక్తునికి సుఖము కలుగుట లేదు.

IX.అథవా,కరణవ్యాపార అభావస్వరూపము సుఖమందువా?అదియును యుక్తముగాదు.ఎందుకు?నిద్రలో సకలకరణముల అభావమున్నందున సుఖానుభవము కలుగకూడదు.మరియు కరణవ్యాపారయుక్త భోజనాదులందు సుఖప్రతీతి కాకూడదు.

X.ఒకవేళ,దుఃఖాభావస్వరూపమే సుఖమన్నచో,దుఃఖాభావయుక్త మృత్పిండమున సుఖప్రతీతి అగుపడుటలేదు.అహో! మృత్పిండము జడమున్నందున సుఖాభివ్యక్తి లేదు—అనియనెదవేమో.అది యుక్తముగాదు.ఎందుకంటె?దుఃఖాభావవతిబుద్ధియొక్క అస్ఫూర్తిలో సుఖము కనుపించుట లేదు.అయినను,జడమతులగు నైయాయికాదులు మూర్ఖత్వముచే దుఃఖాభావమును సుఖమందురు.కాని,సుఖము భావరూపమున్నది.దానియందు అభావత్వము అనుపపన్నము.పశుతుల్యులగు ఈ మూర్ఖులకు సౌషుప్త నిర్విషయ సుఖానుభవము లేదేమో.అందుకే దుఃఖాభావమును సుఖమంటున్నారు.

XI.ఇక,వైషయిక సుఖము ఆత్మధర్మమన్నచో,అది అయుక్తము.ఎందుకన గా?అగ్నికి దాహకత్వము,ప్రకాశకత్వమువలె సుఖము ఆత్మయొక్క స్వరూప మున్నది.దాని ధర్మముగాదు.

**శ్లో॥అర్పకాన్తరరాహిత్యేఽప్యస్త్యేషాం తత్స్వభావతా।**

**మాభూత్తథానుభావ్యత్వం బోధాత్మా తు న హీయతే॥**(వే.పం.3-15)

బెల్లము,మిశ్రి(చక్కెర) మొదలగు పదార్థములకు మాధుర్యాదులను అర్పణముజేయు పదార్థాంతరములు లేకున్నను, వాటియందు మాధర్యాదులు స్వాభావికములుగా నుండును.అట్లే ఆత్మానందము ఆత్మయొక్క స్వరూప ముగాన అనుభావ్యముగాకున్నను అనుభవరూపమున్నదనుటలో సందేహ ము లేదు.“**రసో వై సః**” (తై.2-7); “**ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్**” (తై.3-6)ఇత్యాది శ్రుతి,యుక్తి మరియు అనుభవములచే ఆనందము(సుఖము)ఆత్మయొక్క స్వరూపమేయని సిద్ధమౌతుంది.

ఒకవేళ,సుఖము ఆత్మధర్మమనినయెడల ధర్మము నశించినచో ధర్మియగు ఆత్మనాశప్రసంగమేర్పడును.

నను(శంక)సుఖము ఆత్మస్వరూపమైనను అది క్షణికమున్నందున స్వరూపసుఖనాశనముచే ఆత్మగూడ నష్టమగును?

సమా:—నీ శంక యుక్తము కాదు.ఏలయన?“**ఆకాశవత్సర్వగతశ్చనిత్యః**” అంటూ ఆత్మయొక్క నిత్యత్వము వినబడుచున్నందున తత్స్వరూపసుఖము గూడ నిత్యమని సిద్ధించుచున్నది.

శంక:—ఎట్లు సుఖము ఆత్మయొక్కస్వరూపమో,అట్లే దుఃఖముగూడ ఆత్మస్వరూపమేయగును.ఎందుకంటె?“అహంసుఖీ”“అహం దుఃఖీ” అని యిట్లు సుఖదుఃఖముల ప్రతీతియందు ఏకవిషయత్వము కనబడుచున్నది.

సమా:—నీ శంక సరియైనది కాదు.ఎట్లన?ఒకానొకని పుత్రుడు మరణిస్తే, ఆ పుత్రమరణమును తనయందారోపించుకొని “నేను చచ్చాను” అని అంటాడు. “నేను చచ్చాను”అని అంటున్నవాడు చచ్చాడా?చావలేదుగదా!మరేమిటి? అది కేవలము మోహముయొక్క కార్యము గావున మిథ్యయే.అట్లే “అహం దుఃఖీ” అను ప్రత్యయముగూడ ఆత్మయందు మోహముచే ఆరోపింపబడినదేగాని మరొకటిగాదు.మిథ్యయేయగును.

ఒకవేళ,దుఃఖము ఆత్మస్వరూపమేయగుచో,సుషుప్తియందు అనుభవింప బడిన సుఖమును సుప్తోత్థిత పురుషుడు “సుఖమహమస్వాప్సమ్”[నేను హాయిగా(సుఖంగా)నిద్రించాను]అని యెట్లు పరామర్శించి చెప్పునో,అట్లే“దుఃఖ మహమస్వాప్సమ్”అని చెప్పవలయును.కాని,దుఃఖముయొక్క ఉపలబ్ధి కలుగుటలేదు.కావున,దుఃఖము ఆత్మయొక్క స్వరూపము కాదు.సుఖమే ఆత్మ యొక్క స్వరూపము.“సుఖమహమస్వాప్సమ్”అనునదియే సుఖము ఆత్మ యొక్కస్వరూపమనుటలో ప్రత్యక్షప్రమాణము.

ఆత్మ సుఖరూపమున్నది,సుషుప్తియందు సుఖమాత్రముగా తోచుచు న్నందువలన, సమాధియందువలె—ఈ అనుమాన ప్రమాణమువలన,

**“సచ్చిదానందమాత్రమేకరసమ్”**(నృసింహోత్తరతాపనీయోపనిషత్ 5-7)**“బుద్ధః సుఖ స్వరూపమాత్మా”**(జాబాలదర్శనోపనిషత్ 5-13) **“సద్ఘనోఽయం చిద్ఘన ఆనందఘనః”**

**"సద్ఘనం చిద్ఘనం నిత్యమానందఘనమవ్యయమ్"**(అధ్యాత్మోపనిషత్ 61) ఇత్యాది శ్రుతులవలనను,

"ముముక్షుప్రవృత్త్యన్యథానుపపత్తిప్రసూతార్థాపత్తిరపి చ ప్రమాణమ్"ఒకవేళ, ఆత్మ ఆనందరూపము కానియెడల తత్ప్రాప్తికై ముముక్షువుయొక్క ప్రవృత్తి అనుపపన్నగును.ఈ అర్థాపత్తి ప్రమాణముచేతను ఆత్మ సుఖస్వరూపమని సిద్ధమౌతుంది.

శంక:—అట్లైనచో దుఃఖమెవరి స్వరూపము?

సమా:—అనాత్మస్వరూపమని చెప్పున్నాము.అనాత్మయొక్క స్వరూపము అనృతము(మిథ్య)జడము,దుఃఖాత్మకమని సర్వలోకప్రసిద్ధము.మరియు"**అతోఽన్యదార్తమ్**"(బృ.3-4-2);"**నాఽల్పేసుఖమస్తి**"(ఛాం.7-23-1);"**తదేతజ్జడం మోహాత్మకం అన్త వత్తుచ్ఛమ్**"(నృ.ఉ.తా.9-2)ఇత్యాది శ్రుతిప్రసిద్ధముగూడ.

శంక:—సుఖము ఆత్మస్వరూపమైనచో "విషయసుఖము" అని ఎందుకు చెప్పబడుచున్నది?

సమా:—వినుము.పురుషునియొక్క పుణ్యకర్మ ఫలోన్ముఖమైనపుడు ఇష్ట వస్తువు ప్రాప్తించును.అప్పుడు అంతఃకరణములో సత్త్వప్రధానమగు ప్రియ మోద ప్రమోదమనబడు ఏకాగ్రవృత్తులు గల్గి దానియందు ఆత్మానందము ప్రతిఫలించును.ప్రతిబింబరూప ఆత్మానందముయొక్క స్ఫూర్తియే విషయసాన్నిధ్యమువలన "విషయసుఖము" అని వ్యవహరింపబడుచున్నది.

పుణ్యతారతమ్యముచే సత్త్వతారతమ్యము,సత్త్వతారతమ్యముచే ప్రతిబింబ

ముయొక్క స్ఫూర్తి తారతమ్యము,దానిచే సుఖతారతమ్యము గలుగును.అందుకే"ఏతస్యైవానందస్యాఽన్యానిభూతాని మాత్రాముపజీవన్తి"(బృ.4-3-32)అవిద్యచే విభక్తమైన బ్రహ్మముకంటె పృథగ్రూపముచే పరికల్పితమగు జీవులు అవిద్యావశముచే విషయేంద్రియ సంబన్ధమువలన ఆత్మానందముయొక్క మాత్రమును(అంశమును)అనుభవించి జీవించుచున్నారు.కావున,పూర్ణానంద రసామృతపానముచే మత్తచిత్తులగు బ్రహ్మవిదులు ఈ క్షుద్రమగు ఆభాసరూప విషయానందమును ఇచ్ఛగించరు.

శంక:—ఆత్మ ఆనందస్వరూపము మరియు పరిపూర్ణమైయున్నందున సర్వులకు సర్వదా సర్వత్ర స్వయంగా అప్రయత్నముగానే సుఖానుభూతి కలుగవలెను గదా?

సమా:—కాదు.ఎందుకనగా?ఆత్మస్వరూపముయొక్క ఉపలబ్ధియందు అంతః కరణ(వృత్తి)శుద్ధి అపేక్షితమై ఉంది.పున్నమినాటి వెన్నెల స్పష్టముగా పరిపూర్ణమై వెదజల్లబడుచున్నప్పటికిని దాని దర్శనమునకు చక్షువుయొక్క సౌష్టవము ఎట్లు అపేక్షితమైయున్నదో,అట్లే ఆత్మానందానుభవమునకు బుద్ధిప్రసాదము అపేక్షితమైయున్నది.అందుకే భగవంతుడు శ్రీకృష్ణపరమాత్మ **"ఆత్మబుద్ధిప్రసాదజమ్"**(గీత.18-37) అని చెప్పాడు.

"ఆద్యన్తవన్త కౌన్తేయ న తేషు రమతే బుధః"|(గీత.5-22)విషయేంద్రియ సంయోగముచే గలుగునవియును,ఆదిఅంతములుగలవియును మరియు దుఃఖహేతువులగు విషయభోగములయందు పండితులు రమించరు.ఇతి భోగవిషయక దోషదర్శనమ్.

**2.భోగ్యవిషయకదోషదర్శనము:—**భోగసాధనములగు ఇంద్రియవిషయములు శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు భోగ్యములు.నృత్య,గాన,స్రక్,చందన వనిత,గృహ,ఆరామ క్షేత్ర,విత్త,పుత్రాదులు మొదలగునవన్నియును భోగ్యములేయని తెలియవలెను.వీటియందుగల దోషములను దర్శించుట యేదిగలదో,అది వైరాగ్యముద్వారా జ్ఞానసాధనమగును. భోగ్యవిషయక దోషదర్శనమును సాధకుడు కలిగియుండాలి అని స్వయంగా శ్రీకృష్ణపరమాత్మయే చెప్తున్నాడు.

**శ్లో॥ఇన్ద్రియార్థేషువైరాగ్యమనహంకారఏవచ।**

**జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుధర్శనమ్॥**(గీత.13-8)

శ్రోత్ర,త్వక్,చక్షు,జిహ్వా మరియు ఘ్రాణములనబడు పంచజ్ఞానేంద్రియముల యొక్క అర్థములు=శబ్దాదిపంచవిషయములయందు విరక్తి(లౌ కికపారలౌకిక భోగములందు ఆసక్తిలేకుండుట);దేహాదులందు అహంకార మమకారములు లేకుండుట మరియు జన్మము,మృత్యువు,ముసలితనము,వ్యాధులుమరియు అధ్యాత్మికాది దుఃఖములయందుగల దోషములను పునఃపునఃచూచుచుండుట(ఆలోచించుట)వలన శబ్దాదులయందు,జన్మాదులందు వైరాగ్యభావముదయించి జ్ఞానమునకుకారణమగును.[ఐహికపారలౌకికశబ్దాదిభోగములందు రాగవిరోధినియగు అస్పృహాత్మిక చిత్తవృత్తి“**వైరాగ్యము**”అనబడును].శబ్దాదివిషయములు దుఃఖకారణములు అని భోధిస్తూ,ఒక్కొక్క విషయమునకు దృష్టాంత ప్రదర్శనపూర్వకముగా చిత్తమును సంబోధిస్తూ—వైరాగ్యోపదేశము చేస్తున్నారు-శ్రీవాల్మీకిమహర్షులవారు—

**శ్లో॥ఆగత్యశ్రోత్రతాం మూర్ఖ వ్యర్థోత్థానోపబృంహితమ్।**

**ధియాశబ్దానుసారిణ్యా మృగవన్మా క్షయం వ్రజ॥**

**శ్లో॥త్వక్తామాగత్యదుఃఖాయ స్పర్శోన్ముఖతయా ధియా।**

**మూర్ఖమాబద్ధతామేహి గజీలుబ్ధ గజేంద్రవత్॥**

**శ్లో॥రసనాభావమాగత్య గర్ధేనాన్ధదురంధసామ్।**

**మా నాశమేహి బడిశపిండీలంపట మత్స్యవత్॥**

**శ్లో॥చాక్షుషీం వృత్తిమాశ్రిత్య ప్రభారూపచయోన్ముఖీమ్।**

**మా గచ్ఛ దగ్ధతాం ముగ్ధకాంతిలుబ్ధపతంగవత్॥**

**శ్లో॥ఘ్రాణమార్గముపాశ్రిత్య శరీరాంబోజ కోటరే।**

**గంధోన్ముఖతయా బన్ధం మా త్వం సంశ్రయ భృంగవత్॥**

**శ్లో॥కురంగాలిపతంగేభమీనాస్త్వేకైకశో హతాః।**

**సర్వైర్యుక్తైరనర్థైస్తు వ్యాప్తస్యాజ్ఞ కుతఃసుఖమ్॥**(యో.వా.ఉప.ప్ర.52-16నుండి 21)

ఓ మూర్ఖచిత్తమా!బహిర్ముఖప్రవృత్తిని వ్యర్థముగా దృఢపరచుకొని శ్రోత్రేం ద్రియముతో తాదాత్మ్యాపత్తిరూప శ్రోత్రత్వమునొంది వ్యాధుని(బోయవాని)శ్రావ్య మైనగానముచేతగాని ఘంటాధ్వనిచేతగాని మోహముజెంది పట్టుబడిన హరి ణము (జింక,లేడి)వలె శబ్దానుసారిణివృత్తిచే (శబ్దవిషయమునకువశమై)నాశ మును పొందకుము.

ఓమూర్ఖమనసా!స్పర్శసుఖమునుగోరి కేవలదుఃఖముకొఱకు స్పర్శేంద్రియ ముతో తాదాత్మ్యమునొంది ఆడయేనుగుతో సంబంధముచేయుటకు కామవా సనాపైవశ్యముచేపరుగెత్తివెళ్ళి గోతిలోపడి,మావటివానిచే బంధింపబడిన మగ యేనుగువలె నీవు స్పర్శసుఖమునుగోరి బంధింపబడకుము.

ఓగ్రుడ్డిమనసా!బడిశమునకు(గాలమునకు)గ్రుచ్చబడిన ఆమిషాభిలాషి(ఎ రమాంసాభిలాషి)యగుచేప ప్రాణములను కోల్పోయినపగిది,నీవు రసనేంద్రియముతో తాదాత్మ్యమునొంది రసాస్వాదమున తగుల్కొని మృతిజెందకుసుమా!

ఓమూఢమనసా!నీవు చక్షురింద్రియముతో తాదాత్మ్యాపన్నమై రమణీమణుల ఆపాతరూపలావణ్యమునకు ఆకర్షితమై,ప్రకాశము(మంట)యందు ఫలభ్రాన్తిచే ప్రవృత్తమై పతనమైన పతంగము(కీటము)వలె భస్మము కాకుము.

గంధవిషయమును అనుభవించాలి-అను లాలసచేత ఘ్రాణేంద్రియమునాశ్రయించి యేనుగుచే నలిపివేయబడిన(తామరపుష్పములలోనలిగిపోయిన)భ్రమరమువలె,నీవు శరీరరూప కమలబిలమున జిక్కి(శరీరముతోతాదాత్మ్యాభిమానమునొంది)బంధింపబడకుము.

**శ్లో॥రాత్రిర్గమిష్యతిభవిష్యతిసుప్రభాతమ్,**

**భాస్వానుదేతి హసిష్యతి పఙ్కజశ్రీః।**

**ఇత్థం విచిన్తయతే కోశగతే ద్విరేఫే,**

**హా!హన్త!హన్త!నలినీం గజ ఉజ్జహార॥**(సుభాషితరత్న భాండాగారము)

ఒకానొక భ్రమరము(తుమ్మెద)సరోవరములోని ఒక తామరపుష్పములో జేరి మకరందమును తృప్తిగా సేవించినది.సాయంకాలానికి ఆకమలము రేకులు ముకుళించుకు పోయాయి.భ్రమరము ఆసరోజమునందే బంధింపబడినది. అపుడు కమలకోశములోని తుమ్మెద(ద్విరేఫము)ఈవిధంగా ఆలోచింప సాగెను.ఈరాత్రి గడిచిపోతుంది,తిరిగి సుప్రభాతము=ఉషఃకాలము వస్తుంది,ఆత

ర్వాత సూర్యోదయమౌతుంది,సుశోభితము,సుగంధితమునగు పంకజము(కమలము)ఆహ్లాదముతో మళ్ళీ వికసిస్తుంది,రేపు మళ్ళీ కడుపునిండా మకరందమును సేవించి నా గూటికి వెళ్ళపోదును—అని ఈప్రకారంగా ఆలోచిస్తూ ఆ భృంగము కమలకోశములోనే ఉండిపోయింది,కాని బయటకురాలేక పోయింది. కఠినకాష్ఠమునకైనా రంధ్రముపేయగల తుమ్మెద మకరందముయొక్కమాధుర్యముచే,పుష్పముయొక్క సుగంధముచే మదోన్మత్తయై అత్యంతకోమలమైన కమలపురేకులనుగూడ రంధ్రమువేసి బయటకురాలేక పుష్పములోనే ఉండిపోయింది.ఇంతలో ఒకయేనుగు సరోవరములో దిగి యథేచ్ఛగా జలక్రీడలుగావిస్తూ,లోనమధుపముగలపద్మమును పెరికి నలిపివేసెను.దానిచే నా మధుకరము మృతినొందెను. కావున,

ఓమూఢమనసా!మృగము,ఏనుగు,పతంగము,మీనము మరియు భృంగము—ఒక్కొక్కటిఒక్కొక్కవిషయముచేతనే వినాశమునొందినవి.అలాంటప్పుడు పంచవిషయాలలో ఆసక్తమై తగుల్కొన్న నీకు ఎట్లు సుఖము ప్రాప్తము కాగలదు?పై సమగ్ర విషయమును సంగ్రహించి ఒక్క శ్లోకములో చెప్పారు శ్రీశంకరభగవత్పాదులు.

**శ్లో॥శబ్దాదిభిఃపఞ్చభిరేవపఞ్చ,పఞ్చత్వమాపుఃస్వగుణైర్నిబద్ధాః।**

**కురఙ్గమాతఙ్గపతఙ్గమీన,భృఙ్గాహతఃపఞ్చభిరఞ్చితఃకిమ్॥**(వి.చూ.78)

కురంగము(లేడి,జింక)శబ్దవిషయమునందు,మాతంగము=ఏనుగు స్పర్శవిషయమునందు;పతంగము=కీటము రూపవిషయమునందు;మీనము=చేప రసవిషయమునందు మరియు భృంగము=తుమ్మెద గంధవిషయమునం

దు—ఒక్కొక్క జంతువు,ఒక్కొక్క విషయమునందాసక్తమై క్రమముగా బంధింపబడినపై మరణమును పొందినవి. అట్లుండగా,ఇక ఐదు విషయములలో తగుల్కొన్న మనుష్యునిగూర్చి(నశించునని)చెప్పనేల?(కైముతికన్యాయము)

పైనపేర్కొన్న ఐదు జంతువులు వివేకములేని(తెలివితక్కువ)ప్రాణులు గనుక,ఆయా విషయాలయందాసక్తమై పంచత్వమును(మరణమును)పొందినవనుట సహజము(అతిశయోక్తి యేమియునులేదు).కాని,వివేకముగల మేధావులు,పండితకోవిదులు,అపరిమితబలపరాక్రమములు గల అరివీరభయంకరులనగు దశరథుడు మొదలగువారుగూడ ఒక్కొక్క విషయముచేతనే ఒక్కొక్కరు వినాశమునొందిరి.అట్లగుచో,శబ్దాదిపంచవిషయములందాసక్తమైన అల్పమానవునిగతి,అధోగతిగాక మరేముండును?

● 1.దశరథ మహారాజు తన చివరి ఘడియలలో(తన యౌవనదశలో వివాహము కాకపూర్వము యువరాజుగా ఉన్నపుడు జరిగిన ఒక ఘటనను స్మరించుకుని) కౌసల్యాదేవితో ఇట్లు చెప్పసాగెను.

**శ్లో|| అథాన్ధకారే త్వశ్రౌషం జలే కుంభస్య పూర్యతః|**

**అచక్షుర్విషయే ఘోషం వారణస్యేవ నర్దతః||**(వా.రా.అయోధ్య కాం.63-24)

ఇంతలో ఉషఃకాలపు మందాంధకారమునందు,కంటికి కనబడని ప్రదేశమునందు,నీరు నింపుచున్న కుంభముధ్వని,ఘీంకరించుచున్నఏనుగు ధ్వని వలె వినిపించెను.

**శ్లో||ద్విపోఽయమితి మత్వాయం బాణేనాభిహతో మయా||**(అయోధ్య కాం.64-15)

అటుపిమ్మట,అది యేనుగు అని తలంచి నేను దానిని బాణముచే కొట్టితిని.

[శబ్దభేదివిద్యలో పటుతరనైపుణ్యముగల దశరథమహారాజునీటియందు బుడబుడశబ్దమును విని,ఆశబ్దమువచ్చుచున్న దిశలో సూటిగా బాణమును వదిలెను]

**శ్లో||తత్ర వాగుషసివ్యక్తా ప్రాదురాసీద్వనౌకసః|**

**హాహేతి పతతస్తోయే బాణాభిహతమర్మణః||**(వా.రా.అయోధ్యకాం.63-27)

ప్రాతఃకాలసమయమున అక్కడ,బాణము మర్మస్థలమందు గ్రుచ్చుకొనగా నీటిలో పడిపోయిన ఒక వననివాసి"అయ్యో అయ్యో"అని అరచిన అరపు స్పష్టముగా వినబడెను.

ఆ బాణము నేరుగావెళ్ళి కడవను నీటముంచుచున్న శ్రవణబాలునికి గ్రుచ్చుకొనగా నతడు కేకవేస్తూ నేలగూలెను.అది మనుష్యశబ్దము అని గుర్తెఱిగిన దశరథుడు వేగిరముగ శ్రవణుని చెంతకేగెను.చివరిక్షణములలో తడబడుచున్న శ్రవణబాలుడు,ఈజలమును అంధులగు మా తల్లిదండ్రుల కందజేయుమని దశరథునితో చెప్పి అసువులు వదిలెను.దశరథుడు ఆజలమును చేగొని అంధులు,వృద్ధులునగు శ్రవణుని మాతాపితరుల సన్నిధికేగి జలమును స్వీకరించమనికోరెను.ఆవృద్ధులు దశరథుని గొంతుధ్వనిని గుర్తించి, ఇది మాకుమారుని ధ్వనికాదని శంకించి,మీరెవరని ప్రశ్నించిరి.దశరథుడు వృత్తాంతము నెరిగించెను.దానితో క్రుద్ధుడైన వృద్ధజనకుడు పుత్రవియోగదుఃఖముచే శోకిస్తూ—

**శ్లో||పుత్రవ్యసనజం దుఃఖం యదేతన్మమ సాంప్రతమ్|**

**ఏవం త్వం పుత్రశోకేన రాజన్! కాలం కరిష్యసి||**(వా.రా.అయోధ్య కాం.64-55)

రాజా!ఇపుడు నేను పుత్రశోకముతో బాధపడుచున్నట్లే,నీవుగూడా పుత్రశో

కముతో బాధడుచు మరణించుదువు గాక!అని శపించి పరమ పదవి నొందిరి.

వారి శాపఫలముగా కాలాంతరమున దశరథుడు వనవాసమేగిన శ్రీరామ చంద్రుని వియోగదుఃఖముచే హా రామ!హా రామ! అని విలపిస్తూ స్వర్గస్తు డాయెను. ఇదిశబ్దవిషయమునకు దృష్టాంతము.

● 2.పాండవులు అజ్ఞాతవాసముచేయుకాలములోమారువేషములతో విరాటరాజు ఆశ్రయంలోఉండిరి.ఇట్లు పదిమాసములు గడిచిన మీదట,ఒకసారి విరాటరాజు బావమరిది కీచకుడు తన సహోదరియగు సుదేష్ణాదేవిని దర్శించి,కాసేపు మాట్లాడే నెపముతో వచ్చెను.అప్పుడు అతని దృష్టి సైరంధ్రి (ద్రౌపది)పైపడింది.వెంటనే కామమోహితుడై సైరంధ్రిని ఒంటరిగా కలిసికొను అవసరమునకు(సమయమునకు)ప్రతీక్షించుచుండెను.అతని కుదృష్టిని గమనించిన సైరంధ్రి విరాటమహారాజుకు మరియు సుదేష్టామహారాణికి కీచకుని దురభిప్రాయమును విన్నవించెను.కాని,వారు సైరంధ్రియొక్కఆవేదనను పట్టించుకోలేదు.ఒకరోజు ఈవిషయాన్ని భీమసేనుని కెఱిగించెను.అప్పుడు భీముడు క్రోధాగ్నిచే మండిపడి,ఒక యుక్తినిపన్ని సైరంధ్రితో యిట్లనియె.“**నీవు కీచకున్ని అర్ధరాత్రివేళ నృత్యశాలకు విచ్చేయుమని సందేశము ఇవ్వుము**”అక్కడ నీస్థానములో నేను వెళ్ళి వానిని వధించెదను.సైరంధ్రి భీముని యోజనానుసారము కీచకున్ని రాత్రికి నృత్యశాలకు వచ్చుటకు సంకేతమిడెను.ఆమెయొక్క సంకేతముతో ప్రసన్నుడైన కీచకుడు రాత్రిపూట నృత్యశాలకు విచ్చేసెను.అతడు రాకపూర్వమే భీముడు సైరంధ్రియొక్క కోకను తనశరీరముపై కప్పుకొని ముఖమును దాచుకొని కీచకుని రాకకు ఎదురుచూచుచుండెను. కామముచే అంధుడైన కీచకుడు నిజముగా సైరంధ్రియే నాకోసము వేచియు

న్నదను భ్రమచే భీముని చెంతకు వచ్చి“ఓప్రియతమా!నేను నీకు నాసర్వ స్వము సమర్పించుకున్నాను.లెమ్ము.నాతో క్రీడించుము.నాముచ్చట తీర్చుము.”అనెను.వాని మాటలు విన్న భీముడు దిగ్గునలేచి వానితో నిట్లనియె. **“ఓరీపాపాత్ముడా!సైరంధ్రికాదురా,నీమృత్యువును.చూడరా!పరస్త్రీలను కుదృష్టి చేచూచినచో దానిఫలమేమిటో చవిచూడరా!”**అనంటూ కీచకునిపైదూకి గ్రుద్దులవర్షము గురిపించెను.వారిద్దరికి ఘోరయుద్ధం జరిగిన పిమ్మట,చివరకు వాని మెడలు విరచి మట్టుబెట్టెను.ఇది స్పర్శవిషయమునకు ఉదాహరణము. (విరాటపర్వము.13 నుండి 21 వ అధ్యాయము వరకు)

●3.శ్రీరామచంద్రునియొక్క బాణముచే కొట్టబడిన మారీచుడు హాసీతా! హాలక్ష్మణా!అని కేకలువేస్తూ అసువులు వదిలెను.ఆశబ్దమును విన్న సీతమ్మ నాప్రాణనాథునికి యేదో ఘోరవిపత్తు కలిగినదని కలతజెంది,మీఅన్నయ్య గొప్పఆపదలోనున్నాడు.నీవు వేగిరముగ వెడలుమని లక్ష్మణుని ఆదేశించెను.సరే,అని లక్ష్మణుడు గీతగీసి,“అమ్మా!నీవు ఈగీత దాటివెళ్ళకుము” అని చెప్పి వెడలిపోయెను.సీతమ్మ ఒంటరిగానున్నది.ఇదే నాకు తగిన సమయమని యెంచి కపటభిక్షు(సన్యాసి)వేషమును ధరించి సీతాదేవిని అపహరించుకొనిపోవుటకు లంకాధిపతియగు రావణాసురుడు ప్రకటమయ్యెను.రావణాసురుడు సీతమ్మవారి అందచందాలుచూసి కామమోహితుడై ఈప్రకారంగా దుర్భాషలాడ దొడగెను.ఓసుందరీ!నీవెవరు?ఈవనదేవతవా!లేక లక్ష్మీదేవివా! లేక స్వయంగా కామదేవునిప్రియురాలగు రతీదేవివా!ఇంతటి రూపలావణ్యముగల యువతిని ఈపృథ్విలో నేను యింతవరకుచూడలేదు.అపుడు జానకీదేవి వాడిమాటల తీరునుగమనించి-హేసన్యాసి! నీవెవరు?నీవొక అతిథిగా వచ్చితివి.మా ఆతిథ్యమును స్వీకరించి దయచేయండి.నేను మిథిలానగర

జనకమహారాజు పుత్రికను.అయోధ్యాధిపతియగు దశరథమహారాజుయొక్క జ్యేష్ఠపుత్రుడగు శ్రీరామచంద్రుని ధర్మపత్నిని.తండ్రి ఆజ్ఞను పాలించుటకై భ్రాతృడగు భరతునికి రాజ్యమునొసగి పదునాల్గుసంవత్సరములు వనవాసముకైవచ్చిన పరాక్రమవంతుడు,సత్యపరాయణుడు మాప్రాణనథుడు.వీరుడు,తపస్వీ,తేజస్వియగు మామరది లక్ష్మణుడుగూడ మాతోడునీడగా ఉన్నాడు.నాపేరు సీత.ఈఫలములు,జలమును స్వీకరించండి. ఇంకాసేపట్లో మాపతిదేవులు రాగలరు. అని సీతాదేవి తన పరిచయమిచ్చెను.

అప్పుడు రావణుడు తన పరిచయమిస్తూ ఇలా అంటున్నాడు. హేసీతే! నేను మూడులోకములకు,పదునాల్గుభువనములకు విజేతను.మహా ప్రతాపవంతుడను.లంకాధిపతియగు రావణుడను బిరుదాంకితుడను.నాపేరు వింటేనేఇంద్రాదిదేవతలు,రాక్షసులు,యక్ష,కిన్నర,గంధర్వ,కింపురుషాదులు భయభీతులగుదురు.నేను నీయొక్క లావణ్యమయ సౌందర్యమును చూసి నాయొక్కసుందరమైన రాణులనుగూడ మరచి పోయితిని.నేను నిన్నునాభార్యగా స్వీకరించెదను.సుందరమైన నా రాణులలో నిన్ను పట్టపురాణిని చెసెదను. నావెంటవచ్చుటకు సిద్ధము కమ్ము-అనెను.

అపుడు ఎట్టి దోషములూలేని శరీరముగల సీతాదేవి రావణుని మాటలు విని, కోపించినదై, ఆరాక్షసున్నినిందించుచు ఇట్లుపలికెను.

**శ్లో॥పూర్ణచన్ద్రాననం రామం రాజవత్సం జితేన్ద్రియమ్।**
**పృథుకీర్తిం మహాత్మానమహం రామమనువ్రతా॥**

**శ్లో॥త్వం పునర్జమ్బుకః సింహీం మామిచ్ఛసి సుదుర్లభామ్।**
**నాహం శక్యా త్వయా స్ప్రష్టుమాదిత్యస్య ప్రభాయథా॥**

**శ్లో॥పాదపాన్కాఞ్చనాన్నూనం బహూన్పశ్యసి మన్దభాక్।**

**రాఘవస్య ప్రియాం భార్యాం యస్త్వమిచ్ఛసి రావణ॥**
**శ్లో॥క్షుధితస్య హి సింహస్య మృగశత్రోస్తరస్వినః।**
**ఆశీవిషస్య వదనాద్దంష్ట్రామాదాతు మిచ్ఛసి॥**
**శ్లో॥మన్దరం పర్వతశ్రేష్ఠం పాణినా హర్తుమిచ్ఛసి।**
**కాలకూటవిషంపీత్వా స్వస్తిమాన్గన్తు మిచ్ఛసి॥**

(శ్రీమద్వాల్మీకిరామాయణము-అరణ్యకాండము 47-36 నుండి 40)

రాజుకుమారుడైన రాముడు పూర్ణచంద్రునివంటి ముఖముగలవాడు. ఇంద్రియములను జయించినవాడు.గొప్పకీర్తిగల మహాత్ముడు.అట్టి రాముని యందే నేనువ్రతము గలదానను.నక్కవైన నీవు అశక్యలభ్యయైన ఆడసింహ మైన నన్ను కోరుచున్నావు.సూర్యుని కాంతినివలె నీవు నన్ను స్పృశింప జాలవు.

రావణా! రాముని ప్రియురాలైన భార్యను కోరుచున్న మందమైన ఆయు ర్దాయాదులుగల నీవునిజముగా అనేకములైన బంగారువృక్షములను చూచు చున్నావు.(మరణమాసన్నమైనవారికి బంగారువృక్షములు కనబడునని ప్రసిద్ధి.)

మృగాలకు శత్రువు,చాలాబలముగలది అయిన ఆకలిగొన్న సింహముకో రను మరియు మహాసర్పముకోరను లాగవలెనని కోరుచున్నావు. నీవు, పర్వతములలో శ్రేష్ఠమైన మన్దరపర్వతమును హస్తముతో గ్రహించవలెనని కోరుచున్నావు.కాలకూటవిషము త్రాగి సుఖముగా నుండవలెనని కోరుచున్నావు.

అప్పుడు మహాప్రతాపవంతుడైన దశగ్రీవుడు కామముచే ఒళ్ళు తెలియక తననిజస్వరూపముతో పద్మములవంటి నేత్రములుగల సీతను ఎడమచేతితో కేశపాశమునందు,కుడిచేతితో తొడలక్రింద పట్టుకొని లేవదీసి,విమానము నందు లంకానగరమునకు గొనిపోయి అశోకవాటికలో నుంచెను.ఈప్రకారంగా సీతాదేవియొక్క రూపలావణ్యమునకు ముగ్ధుడై అంత్యమున శ్రీరామచం

ధ్రునిచే"**పరదారాపహరణమునకు ఫలముగా**"హతుడయ్యెను.ఇది రూపవిష యమునకు నిదర్శనముగా తెలియవలెను.

● 4.దేవతలకు రాక్షసులకు మధ్యజరుగు అనేక యుద్ధములలో అంగీరసపుత్రుడు బృహస్పతి దేవతల పక్షమున మరియు శుక్రాచార్యుడు దానవుల పక్షమున పురోహితులుగా యుండిరి. యుద్ధములో దేవతలచే ఎంతమంది రాక్షసులు మరణించినప్పటికి శుక్రాచార్యుడు తన సంజీవని వి ద్యచే మళ్ళీ పునరుజ్జీవులను చేసేవాడు.కాని,రాక్షసులచే చంపబడిన దేవత లను బృహస్పతి తిరిగి బ్రతుకించలేకపోయెను.ఎందుకనగా ఆయనకు సంజీ వని విద్య తెలియదు.అప్పుడు ఖిన్నులైన దేవతలు బృహస్పతిజ్యేష్ఠపు త్రుడగు కచునిచెంతకు వచ్చి"**నీవు శుక్రాచార్యుని ఆరాధించి,పరిచర్యలుచేసి ప్రసన్నునిచేసికొనుము.అట్లే అతని కుమార్తెయగు దేవయానినిగూడ ప్రసన్న ముజేసి,శుక్రాచార్యునివద్దఉన్న సంజీవని విద్యను ప్రాప్తముజేసకొని రమ్ము.**" అని నివేదనము తెలిపిరి.సరే,అని కచుడు వృషపర్వుని నగరములో నున్న శుక్రాచార్యుని వద్దకెళ్ళి శిష్యవృత్తిని స్వీకరించి"**నేను మిమ్ములను గరువుగా స్వీకరిస్తున్నాను.వేయి సంవత్సరములు బ్రహ్మచర్యదీక్షలో ఉండి మీపరిచర్య లు చేయగలను,మీరు అనుమతించి నన్ను మీశిష్యునిగా స్వీకరించం డి"—అనిప్రార్థించెను.**బ్రాహ్మణుడైనశుక్రాచార్యుడు బ్రాహ్మణకుమారుడైన కచుని శిష్యునిగా స్వీకరించెను.నవయువకుడగు కచుడు పరిచర్యలచే గురుదేవు డగు శుక్రాచార్యున్ని సంతృప్తిపరుస్తూ,తన నృత్యగానములచే,విభిన్న ప్రకార ములగు మధురభాషణములచే గురుపుత్రియగు దేవయానినిగూడ ప్రస న్నము చేసికొనెను.ఇట్లు ఐదువందల సంవత్సరములు గడచినపిమ్మట బృహస్పతిపుత్రుడగు యీ కచుడు శుక్రాచార్యునిచెంత సంజీవనివిద్యను

ఏొందు ఉద్దేశ్యముతో వచ్చియన్నాడని దానవులకు తెలిసిపోయింది.

కచునిపై కుపితులైన దానవులు గోవులను మేపుటకు అడవికివెళ్ళిన కచున్నివధించి,అతని శరీరమును ముక్కలుముక్కలుచేసి నక్కలకు కుక్కలకు వేసిరి.కాని,దేవయానియొక్క ఆగ్రహముమేరకు శుక్రాచార్యుడు కచున్ని తనసంజీవని విద్యచే పునర్జీవితుణ్ణి చేసాడు.మరికొన్ని దినములకు కచుడు దేవయానికోసము పూలుతీసికు రావడానికి వనములోకి వెళ్ళెను.సమయము కాచుకొనియున్న దానవులు కచున్ని మళ్ళీచంపి అతని శరీరమును చూర్ణముచేసిసముద్రములోకలిపిరి.ఈసారిగూడ శుక్రాచార్యుడు కచున్ని సజీవున్ని చేసాడు.అట్లే మూడవసారి దానవులు ఒకకపట యుక్తినిపన్ని కచున్ని చంపి అతని శరీరమును భస్మముచేసి,ఆభస్మమును మదిరలో కలిపి శుక్రాచార్యునికి త్రాగించిరి.అపుడు దేవయాని తండ్రితో అంటుంది-పితాశ్రీ! కచుడు పూలకోసమువెళ్ళి తిరిగిరాలేదు.నాకేదో భయంగాఉంది.మరేదైనా కుట్రజేసి దానవులు కచున్నిచంపేసారోయేమో.నా మనస్సు కలవరపెడుతోంది. అతడు లేనిదే నేను జీవించలేను నాన్నగారూ!నేను నిజంగా ఒట్టేసి చెపుతున్నాను-అని రోదించసాగెను.అపుడు శుక్రాచార్యుడంటాడు.అమ్మా పుత్రీ!నేనేమిచేయను.అసురులుమళ్ళీమళ్ళీ కచున్ని చంపుతున్నారు.ఎన్నిసార్లు అతన్ని బ్రతికించను.కాని,దేవయాని పట్టువదలక కచున్ని పునర్జీవితున్ని చేయమని పదేపదే ప్రార్థిస్తూ ఏడవసాగింది.అపుడు దేవయానియొక్క ఆవేదనను అర్థంచేసుకున్న శుక్రాచార్యుడు మళ్ళీ తన సంజీవని విద్యను ప్రయోగించి, కచున్ని పిలిచాడు.అపుడు కచుడు శుక్రాచార్యుని ఉదరమునుండి భయభీతుడై గురుదేవా!నేను మీఉదరమునందే ఉన్నాను,అని నెమ్మదిగా తన వృత్తాంతమునంతయు వివరించెను.శుక్రాచార్యుడంటాడు కుమారా!నీవు సిద్ధ

డవు.నీసేవలచే దేవయాని యెంతో ప్రసన్నమైనది. నీవు ఇంద్రుడవైతే కాదు. ఒకబ్రాహ్మణుడవు.అందువల్ల,ఇదిగో నాసంజీవని విద్యను నీకిస్తున్నాను.నా ఉదరమును చీల్చుకొని బయటకురమ్ము.మరియు సుయోగ్య పుత్రునివలె నన్ను జీవితున్ని జేయుము.అపుడు కచుడు గురుదేవుని వచనానుసారము పొట్టనుచీల్చుకొని బయటకువచ్చి శుక్రాచార్యుని మళ్ళీ పునర్జీవితుణ్ణి చేసి,గురువునకు సాష్టాంగప్రణమిల్లి—

**శ్లో॥ఋతస్యదాతారమనుత్తమస్య, నిధింనిధీనాంచతురన్వయానామ్।**

**యేనాద్రియన్తేగురుమర్చనీయంపాపాన్లోకాంస్తేవ్రజన్త్యప్రతిష్ఠాః॥**(మ.భా.ఆదిప.71-51)

ఎవరైతే పూజ్యులైన గురువులనుండి శ్రేష్ఠమగు విద్యను పొంది,ఉత్కృష్టమైన సత్యోపదేశము చేయునటువంటి,నిధులకు నిధియైనటువంటి మరియు చతుర్వేదములలోని జ్ఞానమును ప్రసాదించు పరమ ఆదరణీయమైన శ్రీగురువును ఆదరించరో,వారు ఈలోకములో అప్రతిష్ఠనొంది,అంత్యమున పాపయుక్తమైన నీచలోకములను పొందుదురు.(నరక గాములగుదురు)-అనిపలికెను.

రసనేంద్రియముతో తాదాత్మ్యమై మదిర(కల్లు,సారాయి ఇత్యాది మాదక పదార్థముల)నుత్రాగు వ్యసనమునకులోనై శుక్రాచార్యుడు మోసపోయాడు. బుద్ధిభ్రష్టమై,మదిరపానముచే ఉన్మత్తుడై సుందరమైన కచున్నిగూడ త్రాగేసాడు.ఇదంతయు గమనించిన ప్రభావశాలియగు శుక్రాచార్యుడు క్రోధోద్యుక్తుడై, సురాపానమువల్ల గల్గు అనర్థమును గుర్తిం చి,బ్రాహ్మణులహితమునుగోరి స్వయముగా ఇట్లు ఆదేశించెను.

**శ్లో॥యోబ్రాహ్మణోఽద్యప్రభృతీహకశ్చిన్మోహాత్సురాంపాస్యతిమన్దబుద్ధిః।**

**అపేతధర్మోబ్రహ్మహాచైవసస్యాదస్మిన్లోకేగర్హితఃస్యాత్పరేచ॥**(మ.భా.ఆదిపర్వము71-54)

ఈరోజునుండి ఏబ్రాహ్మణుడైతే మోహవశమున మదిరను(సురాపానమును) సేవించునో ఆమందబుద్ధిగల బ్రాహ్మణుడు ధర్మభ్రష్టుడగును.మరియు బ్రహ్మ హత్యాదోషమునకు పాత్రుడగును.ఇహపరలోకములందు నిందనీయుడగును. ఇది రసవిషయమునకు తార్కాణముగా యెఱుగవలెను.

●5.పాండవులు అరణ్యవాసముచేస్తున్న సమయంలో—

**శ్లో॥తతః పూర్వోత్తరో వాయుః పవమానో యదృచ్ఛయా।**

**సహస్రపత్రమర్కాభం దివ్యం పద్మముదావహత్॥**(మ.భాఅరణ్య.146-6)

ఒకానొకదినమున ఈశాన్యదిశనుండి యథేచ్ఛగా వీచుచున్న వాయువుచే సూర్యకాంతితో సమానమైన సహస్రదళకమల మొకటి(గాలిలో యెగురుతూ) తీసికురాబడినది.అదియెంతో సుగంధయుక్తమై,సుందరమై, మనోహరమైయుం డెను.దానిని ద్రౌపది తీసికొని,భీమునితో నిట్లనియె.ఈపద్మము చాలాసుగంధ మును వెదజల్లునదై,సుందరముగా నున్నది.

**శ్లో॥యదితేఽహం ప్రియా పార్థ! బహూనీమాన్యుపాహర।**

**తాన్యహం నేతుమిచ్ఛామి కామ్యకం పునరాశ్రమమ్॥**(మ.భా.అరణ్య 146-11)

హేపృథానందన!(భీమసేనా!)ఒకవేళ నీవు నన్ను చాలగా ప్రేమించుచున్న చో,ఇటువంటి సువాసనలు వెదజల్లు అనేక కమలములు తీసికొనివచ్చి నా కివ్వుము.నేను వాటినన్నిటిని మన ఆశ్రమమగు కామ్యక వనమునకు తీసి కెళ్ళుటకు ఇచ్ఛగించుచుంటిని.

ద్రౌపదియొక్క అనురోధానుసారము(అభ్యర్థనానుసారము)భీముడు సుగం ధిపద్మముల అన్వేషణలో బయలుదేరెను.చాలాదూరము పయనించిన పిద

ప ఒక కదళీ(అరటి)వనమునందు ఒకానొక శిలపై పరుండియుండిన వానర మును భీముడు గాంచెను.పింగళవర్ణముగల నేత్రములు,నిర్భయ విశాల శరీరము, మహాబలియునగు వీరవానరశ్రేష్ఠమును సమీపించి,మహాపరాక్రమ బలశాలియగు భీమసేనుడు—"నీవు త్రోవ నుండి తొలగుము"—అని సింహ నాదము జేసెను.

అపుడు ఆకపిశ్రేష్టుడు నెమ్మదిగా కించిన్మాత్రము కళ్ళుతెఱచి అవ జ్ఞ(అవహేళన)చేయుచున్న భీమునిగాంచి,ముసిముసి నవ్వులతో గద్గదకంఠ ముతో ఇట్లనెను.నేను రోగపీడితుడనై సుఖముగా నిదురించుచుంటిని.నీవు నన్నెందులకు లేపితివి?నీవు బుద్ధిమంతుడిలా ఉన్నావు.జంతువులయం దు,తిర్యగ్యోనులందు దయగల్గియుండవలెనని నీకు తెలియదా?నీకు ధర్మ సూక్ష్మములు తెలియనట్లున్నవే! మహాత్ముల(సత్పురుషుల)సేవచేయలేదు కాబోలు.నిజముగా నీవు మందబుద్ధిగల మూర్ఖుడవు.అందుకే ఈవనములో జంతువులను దుఃఖ పెట్టుచు,(వనములో)తిరుగుచుంటివి.అయినా,నీవెవర వు?మానవమాత్రులు సంచరింపరాని ఈఘోరవనములోనికి వచ్చితివి.నీవు ఇచ్చటనుండి ఈపర్వతపరిసరాలను దాటుటకు వీలులేదు.ఇది స్వర్గమార్గ మున్నది.నేను నీయందు దయదలచి ప్రేమపూర్వకముగా అనునయించి చె ప్పుచుంటిని.శాంతచిత్తుడవై తిరిగివెళ్ళుము.ఒకవేళ నామాటలయందు నీకు గౌరవముండిన,ఇదిగో-ఈఫలములు,కందమూలములు ఆరగించి నీ నిజస్థా నమునకు వెడలిపొమ్ము.

బుద్ధిమంతుడగు కపిరాజుయొక్క వచనములను విని శత్రునాశకుడు, మహావీరుడును అగు భీమసేనుడు గంభీరమగు వాణిచే నిట్లుపలికెను.ఓ యీ!వృద్ధవానరమా!నేనెవరినో నీకుతెలియదా?నేను చంద్రవంశమునకు చెం

దిన కౌరవకులములో వాయుదేవుని వరమున కుంతీదేవిగర్భమున జన్మిం చినవాడను,పాండురాజు పుత్రుడను,భీమసేనుడను నామధేయము గలవాడ ను.భీముని మాటలువిన్న వాయుపుత్రుడగు హనుమంతుడు నవ్వుకొని, ద్వితీయవాయుపుత్రుడగు భీమసేనునితో యిట్లు చెప్పదొడగెను. నిన్ను నీ ఇచ్ఛానుసారము ఈమార్గముగుండా వెళ్ళనివ్వను.వెనక్కితిరిగివెళ్ళిపో! లేని చో నీవు ప్రాణసంకటములో చిక్కుకొనెదవు.

భీముడంటున్నాడు:—హే వృద్ధవానరమా!నీబెదిరింపులకు నేను భయపడు వాడను కాదు.ప్రాణసంకటమే రానిమ్ము—ఏమైనాకానిమ్ము. నేను వెనుదిరిగే ప్రసక్తియేలేదు.నీ తుచ్ఛలాంగూలమును(తోకను)దారికి అడ్డుగాచాచి,నన్ను నిరోధింతువా!తొలగుము.దారినుండి తప్పుకో! లేనిచో నీవు నా గదాప్రహార ముచే ప్రాణములు కోల్పోయెదవు.

హనుమంతుడంటున్నాడు:—అటులనా!నేను రోగముచే నత్యంతపీడితుడ ను.నా పుచ్ఛమును(తోకను)లేపుటకు శక్తిహీనుడను.ఒకవేళ నీవు అవ శ్యముగా వెళ్ళదలచినచో,నన్నులంఘించి(దాటి)వెళ్ళిపొమ్ము.

భీముడంటున్నాడు:—

**శ్లో॥నిర్గుణః పరమాత్మేతి దేహం తే వ్యాప్యతిష్ఠతి।**

**తమహం జ్ఞానవిజ్ఞేయం నావమన్యే న లంఘయే॥**(మ.భా.అరణ్య 147-8)

నిర్గుణపరబ్రహ్మజ్ఞానముచే తెలియబడుటకు యోగ్యమైన పరమేశ్వరు డు నీదేహమున వసించియున్నాడు.అతనిని అనాదరించలేను.కావున, నిన్నుదాటివెళ్ళలేను.వేదవిద్యుడగు పరమేశ్వరుడు సకల ప్రాణులలో వ్యాపిం చియున్నాడని తెలుసుకోకుండా ఉండిఉంటే,నాల్గువందల క్రోసుల దూరమున

సముద్రపు ఆవలితీరమునగల లంకానగరమునకు వాయుపుత్రుడు ఆంజనేయుడు ఒక్కసారి కుప్పించి యెగసి గంతువేసి చేరుకున్నచందమున, ఈపర్వతములనన్నింటిని లంఘించి వెళ్ళేవాడిని.

**శ్లో॥స మే భ్రాతా మహావీర్య స్తుల్యోఽహం తస్య తేజసా।**(మ.భా.అరణ్య.147-13)

మహాతేజస్వి వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు మాజ్యేష్ఠభ్రాత(అన్నయ్య). అతనితో సమానమగు తేజస్సు,పరాక్రమము మరియు బలము గలవాడను. అందువల్ల,నీవు నాఆజ్ఞను పాటించి మార్గమునుండితప్పుకో!లేదా,నిన్నిప్పుడే యమపురికి పంపగలను.

హనుమంతుడంటున్నాడు:-ఓహో!నీవు ఆంజనేయుణ్ణి ఎఱుగుదువా? అతడు నీసహోదరుడా?నీవు అతనితో సమానమైన బలపరాక్రమములు గలవాడవా?అనిపల్కి,భీమునిలోని బలపరాక్రమములకు సంబంధించిన అభిమానమును గమనించి తనలోతాను నవ్వుకొని యిట్లనియె.

**శ్లో॥ప్రసీద నాస్తిమే శక్తి రుత్థాతుం జరయానఘ।**

**మమానుకమ్పయాత్వేతత్పుచ్ఛముత్సార్యగమ్యతామ్॥**(మ.భా.అర. 147-16)

ఓపాపరహితుడా!నీవు ప్రసన్నుడవై,రోగకారణమున లేవలేని అసమర్థుడనగు నాపుచ్ఛమును దయచేత ప్రక్కకు తొలగించి వెళ్ళిపొమ్ము.అపుడు భీముడు నవ్వుకొని తిరస్కారపూర్వకముగా,హా!యీ తుచ్ఛ పుచ్ఛమెంతటిది—అని అభిమానసహితముగా ఆంజనేయుని తోకను ఎడమచేయితో లేవనెత్తుటకు ప్రయత్నించెను.కాని,పుచ్ఛమును కించిన్మాత్రముగూడ కదుపలేకపోయెను.ఇంద్రధనుస్సు సమానమగు హనుమంతుని ఉన్నతమగు పుచ్ఛమును రెండుచేతులతో లేపుటకు ప్రయత్నించెను.వెంట్రుకంతగూడ కదల్చలేకపో

యాడు.తనయొక్క సంపూర్ణబలమును ప్రయోగించాడు.కండ్లను,కనుబొమ్మలను,నోటిని వెడల్పుగాజేసి మరీ ప్రయత్నముజేసెను.శరీరమంతా చెమటలు పోసి స్నానము చేసినట్లాయెను.కాని,తోకనులేపుటలో విఫలుడై,సిగ్గుతో తల వంచుకొని, హనుమంతుని చెంతన నిలబడి—

**శ్లో॥ప్రణిపత్య చ కౌన్తేయః ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్।**

**ప్రసీద కపిశార్దూల దురుక్తం క్షమ్యతాం మమ॥**(మ.భా.అరణ్య.147-21)

కుంతీపుత్రుడగు భీమసేనుడు చేతులుజోడించి,హనుమంతునికి ప్రణమిల్లి అంటున్నాడు.ఓ కపిశార్దూల!అజ్ఞానముచే పొరపాటున మిమ్ములను అనరాని మాటలచే దుర్భాషలాడితిని.మీరు ప్రసన్నులై నన్ను క్షమించండి. మీరుసిద్ధపురుషులా?దేవతలా?లేక గంధర్వులా?వానరరూపంలో ఉన్న మీరెవరు? దయచేసి మీనిజరూపమును దర్శింపజేసి నన్ను ధన్యుని జేయుము.

హనుమంతుడంటున్నాడు:—హేశత్రునాశన!పాండునందన!నన్ను తెలిసికొనగోరుచుంటివా?చెబుతానువిను.

**శ్లో॥అహం కేసరిణః క్షేత్రే వాయునా జగదాయుషా।**

**జాతః కమలపత్రాక్ష హనూమాన్నామవానరః॥**(మ.భా.అరణ్య. 147-24)

హే కమలనయన! నేను కేసరి అనబడు వానరస్త్రీగర్భమున జగత్తునకు ప్రాణరూపమగు వాయుదేవునివలన జన్మించినవాడను.హనుమంతుడు అను పేరుగల వానరుడను.ఓకురునందన! ఈమార్గము దేవతలు మాత్రమే పోవుటకు యోగ్యమైనది. మనుష్యమాత్రులకు అగమ్యము.నీమార్గమును నిరోధించినందులకు బాధింపబడకుము.నీవు ఏ కమలపుష్పముల కొఱకు

వచ్చితివో,అదుగో,ఆ సరస్సు చేరువలోనే ఉన్నది.అని ఇట్లు ఆంజనేయుడు తెలుపగా—

ప్రసన్నుడైన భీమసేనుడు జ్యేష్ఠభ్రాతయగు హనుమంతునికి ప్రణమిల్లి, స్నేహపూరితవచనములతో నిట్లనియె—జగత్తులో నాతో సమానమగు ధన్య పురుషుడు మరొకడులేడు.మీయొక్క దర్శనభాగ్యముచే నేను ధన్యుడనైతిని. మీరు నాకు దర్శనమిచ్చి నన్ను పునీతున్ని జేసితిరి.నాకెంతో తృప్తిలభించెను.

ఈప్రకారముగా సుగంధయుక్త కమలపుష్పములయందు మోజుపడిన ద్రౌపదియొక్క ప్రీతికొఱకు కపిపుంగవునిచే భీమసేనుడు భంగపడెను. భీముని గర్వభంగమునకు కారణము గంధవిషయము.

ఇట్లు,శబ్దవిషయముచే దశరథమహారాజు,స్పర్శవిషయముచే కీచకుడు, రూపవిషయముచే రావణాసురుడు,రసవిషయముచే శుక్రాచార్యుడుమరియు గంధవిషయముచే భీమసేనుడు అనర్థమును పొందిరి.అంతటి గొప్పబలపరాక్రమవంతులు,శాస్త్రజ్ఞానసంపన్నులై యుండిగూడ ఒక్కొక్క విషయముచేతనే వినాశమునొందినచో,అల్పజ్ఞులు,అల్పశక్తిమంతులై పంచవియములలో ఆసక్తులై తగుల్కొన్నసామాన్య మానవులు అధఃపతనము కాగలరని వేరుగా చెప్పవలెనా?అందువలన,

**శ్లో॥హే చిత్త వాసనాజాలం బంధాయ భవతోఽహితమ్।**

**స్వాత్మనః సహజః ఫేనస్తతః కుక్రిమిణాయథా॥**(యో.వా.ఉపశమప్రకరణము. 52-22)

ఓచిత్తమా!క్షుద్రమగు పట్టుపురుగు స్వాభావికముగా తననోటినుండి వెలువడు ఫేనరూప జిగటపదార్థము(పట్టుదారము)చే కోశమును(గూడును)నిర్మించుకొని,దానిలో స్వయముగా తానే బంధింపబడినట్లు,నీవు నీయొక్క

కువితర్కముచే శబ్దాదివిషయక వాసనాజాలమును నిర్మించుకొని జననమరణరూప సంసారబంధమును పొందుచున్నావు.

**శ్లో॥విషం విషయవైషమ్యం న విషం విషముచ్యతే।**

**జన్మాన్తరఘ్నా విషయా ఏకదేహహరం విషమ్॥**(మహోపనిషత్ 3-54)(యో.వా.వైరాగ్యప్రకరణము.29-13)

కాలకూటవిషము మొదలగు ప్రసిద్ధవిషము నిజముగా విషముకాదు. కుటిలమగు శబ్దాదివిషయములే విషమనబడును.ఎందుకనగా,

విషము ఒకేదేహమును అనగా ఏదేహముతో సంబంధపడునో,ఆదేహమును మాత్రమే నాశనముజేయును.కాని,విషయమైతే అనేకజన్మలయందు దేహమును(దేహవిశిష్టజీవున్ని)మృత్యుముఖములో పడదోస్తుంది.

ప్రశ్న:—సరే,ఇంతదనుక అజ్ఞపురుషులకు శబ్దాదివిషయములు అనర్థ కారకములు—అనిచెప్తూ వచ్చారు.కాని,తత్త్వజ్ఞపురుషులుగూడ విషయోపభోగముల ననుభవిస్తున్నట్లు కనబడుచున్నదిగదా. అలాంటప్పుడు జ్ఞానులలోగల విశేషమేమిటి?

సమా:—సుఖము,దుఃఖము,బంధువులు,మిత్రులు,పుత్రులు,కళత్రము(భార్య),ధనకనకవస్తువాహనాదులు—అన్నియును బంధహే తువులే.అయినను, జ్ఞానిపురుషుడు వాటికి వశుడుకాడు.వాటితో తాదాత్మ్యాభిమానము పెట్టుకొని తగుల్కొనడు.అందువల్ల,అవి జ్ఞానికి బంధ హేతువులుకావు.కావున, సకలదుఃఖములకు(అనర్థములకు)మూలము అజ్ఞానము.దానికి ఉచ్ఛేదకము(నాశకము)జ్ఞానమొక్కటే.ఆ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమును సంపాదించుకొనుటయే పరమపురుషార్థము.ఆ జ్ఞానమునకు ముఖ్యసాధనము వైరాగ్యము.

**శ్లో॥వైరాగ్యం పుష్కలం న స్యాన్నిష్ఫలం బ్రహ్మదర్శనమ్।**

**తస్మాద్రక్షేత విరతిం బుధో యత్నేన సర్వదా॥**(శ్వేతాశ్వతర ఉప.భాష్యములో 6-21)

ఒకవేళ పూర్ణవైరాగ్యములేనిచో బ్రహ్మజ్ఞానము నిష్ఫలమగును.మోక్ష హేతువుగాజాలదు.కావున, బుద్ధిమంతుడగు(వివేకియగు)పురుషుడు ప్రయత్నపూర్వకంగా వైరాగ్యమును రక్షించుకొనుచుండవలెను.అందుకే దేహము,పుత్ర,మిత్ర,కళత్ర,ధనకనకవస్తువాహనాదులపట్ల పూర్ణ వైరాగ్యము గల్గియుండవలెను.

శ్రీరామఉవాచ:- **నానన్దాయ మమోద్యానం న సుఖాయ మమ స్త్రియః।**

**న హర్షాయ మమార్థాశా శామ్యామి మనసాసహ॥**(యో.వా.వైరాగ్యప్ర.29-6)

ఉద్యానదర్శనము,విహారము నాకు ప్రసన్నతను కలిగించుటలేదు.స్త్రీల యొక్క దర్శన సంభాషణములచే,ధనముచే నాకు సుఖముగాని,హర్షముగాని కలుగుటలేదు.మనస్సుతో సహితముగా ఉపశాంతిని పొందుటకు(నాకు) ప్రబలమైన ఇచ్ఛ కలుగుచున్నది.

**శ్లో॥త్వఙ్మాంసరుధిరస్నాయు మేదోమజ్జాస్థి సంకులమ్।**

**పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలంనింద్యమిదం వపుః॥**(వి.చూ.89)

చర్మము,మాంసము,రక్తము,నరములు,మెదడు,క్రొవ్వు,ఎముకలు వీటితో కూడుకొన్నదియు, మలమూత్రములచే నిండినదియునగు ఈస్థూలశరీరము అత్యంత అసహ్యమైనది.

**శ్లో॥అమేధ్యపూర్ణే కృమిజాలసంకులే**

**స్వభావ దుర్గన్ధమశౌచమధ్రువే।**

**కలేవరే ముత్రపురీషభాజనే**

**రమన్తి మూఢా విరమన్తి పణ్డితాః॥**

అర్థంస్పష్టము.స్థూలశరీరమునందీప్రకారము దోషానుసంధానముచే విరక్తుడు గావలయును.

**శ్లో॥దేహేఽస్థి మాంసం రుధిరేఽభిమతిం త్యజ త్వం,**

**జాయాసుతాదిషు సదామమతాం విముఞ్చ।**

**పశ్యా నిశం జగదిదం క్షణభంగ నిష్ఠం,**

**వైరాగ్యరాగరసికో భవభక్తినిష్ఠః॥**

**శ్లో॥ధర్మం భజస్వ సతతం త్యజలోకధర్మా**

**న్సేవస్వ సాధుపురుషా ఞ్జహి కామతృష్టామ్।**

**అన్యస్య దోషగుణ చిన్తనమాశు ముక్త్వా**

**సేవా కథారస మహో నితరాం పిబత్వమ్॥**

(శ్రీమద్భాగవతమాహాత్మ్యము.4.అధ్యా. 79&80)

ఈశరీరము—ఎముకలు,మాంసము,చర్మము మొదలగు వాటితో నిండినది.రక్తమాంసములతో కూడిన నింద్యమైన దేహమునందు"నేను,నాది"యను అభిమానమును విడిచిపెట్టుము.జాయాసుతాదులందు(భార్యాబిడ్డలయందు) 'నావారు'అను మమకారమును ఎల్లప్పుటికిని వదలిపెట్టుము.ఈదృశ్యమాన దేహాదిక ప్రపంచము క్షణికము.దృష్టనష్ట స్వభావము గలదియని,దానిలోని దోషమును ఎల్లప్పుడు భావనజేయుచుండుము.వైరాగ్యము నందాసక్తిగల్గి

నిశ్చలమైన భగవద్భక్తిని ఆశ్రయింపుము.ఈదేహాదిక సమస్తలోకములను ధరించు(అధిష్ఠాన)పరబ్రహ్మమును హృదయమున ధరించుము.దేహేంద్రియ మనోబుద్ధులయొక్క,వర్ణాశ్రమములయొక్క,చివరకు జీవేశ్వరాదులయొక్క స కలధర్మములను వదిలిపెట్టుము.ప్రాపంచిక సమస్తకామములను(కోరికలను) త్యజించి,కేవలము మోక్షకామనగలవాడవై సత్పురుషుల నాశ్రయించుము. సాధువులను సేవింపుము.అనాత్మగుణదోషములను మరచి,భగవంతుని స్వ ప్రకాశత్వ,అసంగత్వాది గుణగణమును నిత్యనిరంతర ఆదరపూర్వకముగా చింతించు.(కం=బ్రహ్మము;కే=బ్రహ్మమునందు; ష్ఠా=స్థీయతే)“**బ్రహ్మణి స్థీయతే అనేన ఇతి=కథా**”అను వ్యుత్పత్యను సారము“**దేనిచే బ్రహ్మానుభూతిని బడసి బ్రహ్మమునందు స్థిరమై యుండగలమో అది కథా.**”కావున,భగవంతుని కథామృత(బ్రహ్మామృత)రస మును ఎల్లప్పుడూ ఆస్వాదించుచుండుము.

ఇప్పుడు“**సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము**”లో శ్రీపూజ్యపాదులు ఆద్య గురుశంకరాచార్యులవారు ప్రదర్శింపజేసిన“**దోషదర్శనప్రకారము**”ను దృఢవైరా గ్యప్రాదుర్భావము కొఱకు వర్ణింపబడుచున్నది. (శ్లోకము23 నండి 94 వరకు)

**శ్లో॥ఐహికాముష్మికార్థేషుహ్యనిత్యత్వేననిశ్చయాత్।**

**నైస్పృహ్యంతుచ్ఛబుద్ధ్యాయత్తద్వైరాగ్యమితీర్యతే॥**23.

నిత్యానిత్యవస్తువివేకమువలన ఇహపరలోకములందలి భార్యాపుత్రాదిప దార్థములన్నియు అసత్యములని గ్రహించి,వానియందు తుచ్ఛబుద్ధిగల్గి,వాం ఛలేకుండుటయే వైరాగ్యమనబడునని పండితులు చెప్పుచున్నారు.

బ్రహ్మవస్తువొక్కటే నిత్యమని,బ్రహ్మలోకపర్యంతముగల సకలభోగ్యపదార్థ ములన్నియు నసత్యములని బాగుగా విచారణజేయు వివేకిపురుషులకు ప్ర

క్చందనాదిపరిమళద్రవ్యములందు,ధనకనకవస్తువాహనాదులందు,పుత్రమిత్రకళత్రాదులందును వైరాగ్యముదయించును. 24.

కాకిరెట్ట(మలము)నందువలె భార్యాపుత్రాదులందు అసహ్యబుద్ధి కలుగుటయే తీవ్రవైరాగ్యమనబడును.ఎట్లనగా!శబ్దాదివిషయములలోని దోషాలను విచారించినకొలది,వానియందు వైరాగ్యము దృఢపడుచుండును.రమణీయమగు రమణులు మొదలగు విషయములు త్రాచుపాము విషముకంటెగూడ అత్యంతఘాతకములగును.ఎందుకంటే,విషమనునది యెవరికి ప్రయోగింపబడునో,వారిని మాత్రమే నశింపజేయును.కాని,విషమును జూచువానికిగాని,విషమునుగూర్చి విన్నవారికిగాని హానిగలుగజేయదు.ఇక వనితాది విషయములైతే,అనుభవించువారికేగాక,ద్రష్టలకు,శ్రోతలకుగూడ అనర్థములనుగలుగజేయుచున్నవి. అహో! వనితాది విషయగత దోషోత్కర్షము వర్ణనాతీతము. 25.

మానవులు ఏయే విషయములందు సంపూర్ణముగా దోషదర్శనము జేయగల్గుదురో,ఆయా విషయములందు పునః ప్రవృత్తులగుటకు ఇచ్ఛగింపరు.ఉదాహరణకు—వేశ్యాలోలురగు కాముకశిఖామణులుగూడ వేశ్యలలోని ప్రాణఘాతకమగు వ్యాధ్యాదులుగలవని దెలిసినపిదప,వారినిపొందగోరరుగదా!26.

మోక్షమును పొందగోరువారు(ముముక్షువులు)ఐహికపారలౌకిక సమస్త భోగ్యపదార్థముల నిజస్వరూపమును బాగుగా విచారించవలయును.అట్లు పరిశీలించినచో వాటిలోని దోషములు స్పష్టముగా దెలియబడును.దోషములు దెలిసినపిమ్మట విషమిశ్రితాన్నమునువలె త్యజింపగలరు. 27.

జీవుడు,తల్లిగర్భమునందున్నపుడు మలమూత్రముల మధ్యనున్నవాడై, వానియందలి పురుగులచే పీడింపబడును.తల్లియొక్క జఠరాగ్నిచే దహింపబ

డును.అత్యంతమలపూర్ణమగు గర్భాశయము(మావి)చే చుట్టబడిన జీవుని శరీరము కుండలాకారముగ వంచబడియుండును.తల్లిభుజించిన అత్యంత దుఃఖప్రదమగు పులుపు,చేదు,వగరు,ఉప్పు,కారము మరియు వేడివేడిపదార్థములచే సహింపరాని పీడను అనుభవించును.

సంకుచితమగు గర్భాశయములో మలమూత్రరూప మహాపంకమునందు పీడింపబడుచు,తన అవయవములను చాచుటకుగాని, ముడుచుటకుగాని సమర్థుడుకాడు.ఊపిరిపీల్చుకోలేడు.తొమ్మిదవమాసములో పూర్వజన్మల స్మృతిగల్గి తానుజేసిన పుణ్యాపుణ్యకర్మలను గుర్తుతెచ్చుకొని చింతించుచుండును.

**శ్లో|| పూర్వయోనిసహస్రాణి దృష్ట్వా చైవ తతో మయా।**

**ఆహారా వివిధా భుక్తాః పీతా నానా విధాస్తనాః||**

**జాతశ్చైవ మృతశ్చైవ జన్మ చైవ పునః పునః।**

**యన్మయా పరిజనస్యార్థే కృతం కర్మ శుభాశుభమ్||**

**ఏకాకీ తేన దహ్యేఽహం గతాస్తే ఫలభోగినః।**

**అహో దుఃఖోదధౌ మగ్నో న పశ్యామి ప్రతిక్రియామ్||**

**యది యోన్యాః ప్రముచ్యేఽహం తత్ప్రపద్యే మహేశ్వరమ్।**

**అశుభక్షయకర్తారం ఫలముక్తి ప్రదాయకమ్||**

**అథ యోనిద్వారం సంప్రాప్తో యన్త్రేణాపీడ్యమానో మహతా దుఃఖేన జాతమాత్రస్తు వైష్ణవేన వాయునా సంస్పృష్టస్తదా న స్మరతి జన్మమరణాని న చ కర్మ శుభాశుభం విన్దతి।**(గర్భోపనిషత్),అట్లే "రామరామ శతకము "గూడ↓

**కుక్కనక్కలయందునానేబహుపెక్కుజీవులయందునా।**

**అక్కటా! పుట్టిగిట్టిఈజన్మమెత్తిని రామరామ॥**

**ఈజన్మమందైననూనీభజన నేజేయక యుండిన।**

**నిక్కముగ ముందువలెనే బహుజన్మ సమ్భవము రామరామ॥**

ఎనుబదినాలుగు లక్షలయోనులందు జన్మించితిని.ఆయా జన్మోచిత ఆహారమును భుజించితిని.తత్తజ్జన్మోచిత స్తన్యపానమునూ చేసితిని.మళ్ళీమళ్ళీ మరణించితిని.మళ్ళీమళ్ళీ జన్మించితిని.షడ్భావవికారయుక్తమైన శరీరమును ధరించి,అహో!దుఃఖసాగరమున మునకలు వేయుచుంటిని.దీని నివృత్త్యుపాయము నెఱుగకుంటినిగదా!భార్యాపుత్రాది పరిజనముకొఱకు చేయగూడని కర్మలాచరించితిని.తత్ఫలితముగా అనేక కల్పములు స్వర్గనరకములలో సంచరించితిని.కుంభీపాక నరకముతో సమానమగు ఈగర్భకుహరమున దుఃఖము నొందుచుంటిని.ఎవరికోసమై నేను శుభాశుభకర్మలు చేసితినో,వారు వారివారి గతిననుసరించి వెళ్ళిపోయారు.నేనుమాత్రము ఒంటరి వాడనయ్యాను.నాపుణ్యపాపముల నెవరుగూడ పంచుకొనుట లేదుగదా! హేపరమే శ్వరా!నన్ను ఈసంకుచితయోని యంత్రమునుండి బయటకుతీయుమా!ఆపైన నిరంతరము అన్యచింతనమాని,నీ తత్త్వచింతనయే చేయుదును—అనియిట్లు గర్భస్థ జీవుడు శోకిస్తూ నానాయోని సహస్రములను పొంది,నిర్విణ్ణుడై(విరక్తుడై),చివరకు యేజన్మకర్మయో ఫలోన్ముఖమైనపుడు నరకమునుండి పాపాత్ముడు పతనమైనట్లు ఉత్థానపాదుడై(తలక్రిందులుగా)అత్యంత యిరుకైన యోనియంత్రముచేత పరిపీడితుడై మహత్తరమైన దుఃఖముచే మూర్ఛితుడై భూమిపై బడును.పుట్టుటతోడనే వైష్ణవీవాయువుతో స్పృశింపబడినవాడై స్వకృతశుభా

శుభకర్మలు,తన్నిమిత్తక జన్మమరణములయొక్క స్మృతిని విస్మరించును. మరియు గర్భమునందు తానుజేసిన ప్రతిజ్ఞను(సోఽహం)మరిచిపోవును.ఇటువంటి ఘోరభయంకరమగు జన్మదుఃఖమును చక్కగా విచారించిన యే వివేకి విరక్తినొందకుండును? 28.

పుట్టినపిమ్మట కొన్నిదినములవరకు పిల్లలు తమ మలమూత్రాదు లందే పొరలాడుచుందురు.అటునిటు కదలలేక వెల్లకిలాపడుకొని యుందురు.పొత్తిళ్లలోగాని,ఊయలలోగాని పరుండిన శిశువులను నల్లులు,దోమలు,చీమలు మున్నగునవి కుట్టుచుండును.వాటిని నివారించుకొనుటకు అసమర్థులైయుందురు.మఱియు బాలగ్రహములనేకములు పాలుమున్నగునవి త్రాగనీయక వివిధరీతుల బాధించుచుండును.ఇట్టి శైశవావస్థను బాగుగా విచారించినచో యెవరికి విరక్తి కలుగకుండును?.29.

కౌమారావస్థయందు యుక్తాయుక్త వివేచన యుండదు.అప్పుడు చేయు పనులకు ప్రయోజనముండదు.పెద్దలయందుభక్తియుండదు.నోటికివచ్చిన మాటలెల్ల నిశ్శంకముగా మాట్లాడుట,చేతికి దొరికిన వస్తువులనెల్ల దినుట,తిరుగరాని ప్రదేశముల దిరుగుట,తనకు హానిలాభము తెలియని వివేకహీనమగు పనులు చేయుట సంభవించుచుండును.తోటిపిల్లలతో ఆడిఆడి,ఒక్కోసారి వారితో కీచులాడి,వారిని కొట్టిరావడమో లేక దెబ్బలుతిని రావడమో జరుగుతుంది.అట్టియెడ తల్లి,తండ్రి,సోదరులు,ఇరుగుపొరుగువారును దిట్టి కొట్టుచుందురు.ఇట్టి యవస్థను పరికించినచో యెవరు విరక్తి నొందరు? 30.

యౌవనమున మదముచే పూజ్యులగు పెద్దలమాటల నాకర్ణింపక,వారిని తిరస్కరించుచుందురు.స్త్రీలోలురై శాస్త్రమర్యాదల నుల్లంఘించి సంచరించుదు

రు.స్త్రీలవచనములనే విశ్వసించి,వారు చెప్పిందే వేదముగా భావించి,వారుచెప్పిన అకార్యములెల్ల తూ...చ...తప్పకుండా ఆచరించుదురు."**కామాతురాణాంనభయంనలజ్జా**"కామమోహితులకు భయము,సిగ్గుఉండదు.పెద్దల యెదుటనే తన భామతో సరసములాడుచుందురు.చూచువారికి అసహ్యముగా ప్రవర్తించెదరు.ఇటువంటి దోషదూషిత యౌవనదశను బాగుగా విచారించిన వారికెల్లరకును దప్పక విరక్తిగలుగ గలదు. 31.

**శ్లో॥వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తి,**

**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహమ్।**

**ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివామ్భో,**

**లోకస్తథాప్యహిత మాచరతీతి చిత్రమ్॥**(భర్తృహరి వైరాగ్యశతకము)

బెబ్బులివలె(వ్యాఘ్రము,పెద్దపులివలె)వృద్ధత్వము పైబడును.శతృవులవలె రోగములు దేహమును పీడించుచుండును.ఛిద్రము పడిన ఘటమునుండి నీరు స్రవించు చందమున క్షణక్షణము ఆయువు క్షీణించు చున్నది.అయినను,యిది యేమి చిత్రమోగాని,లోకులు తమ హితము కొఱకు ఆచరింపజాలకున్నారు గదా!

**శ్లో॥గాత్రం సంకుచితం గతిర్విగలితా భ్రష్టా చ దన్తావళి**

**ర్దృష్టిర్నశ్యతి వర్ధతే బధిరతా వక్త్రం చ లాలాయతే।**

**వాక్యం నాద్రియతే చ బాన్ధవజనో భార్యా న శుశ్రూషతే,**

**హా! కష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రోఽప్యమిత్రాయతే॥**(భర్తృహరి వైరాగ్యశత.)

అవయములెల్ల ముడతలుపడును.బూడిదగుమ్మడికాయవలె శిరస్సంత యు నెరసిపోవును.ధనుస్సువలె శరీరమువంగినదై,మూడవకాలుగా కర్రను ఊతగా చేబూని,నడచుటకు శక్తిలేక అడుగులు తడబడు చుండును.పండ్లూ డిపోవును.చత్వారమావహించును.బధిరత్వము(చెవుడు)బాధించుచుండును.నో టినుండి జొల్లుకారుచుండును.తాను చెప్పిన మాటలను బంధువులాలకింప రు.జీవితభాగస్వామిని(భార్య)శుశ్రూషలు చేయదు.చేసినా ఈసడించుకుంటుం ది.కన్నకుమారులే పరమ శత్రువులగుదురు.శరీరమంత వికృతరూపమొుం దును.జనులందఱు అవమానించెదరు.విషయాభిలాష వృద్ధియగును.కోరిన వస్తువులు లభింపవు.దొరికినా అనుభవించు యోగ్యత ఉండదు.కక్కుతిపడి తింటే జీర్ణించదు.బుద్ధిసామర్థ్యము క్షీణించును.పైత్యము, జ్వరము,మూలవ్యా ధి,క్షయ,గుండెదడ,శూలవ్యాధి,కఫము ఇత్యాద్యనేక వ్యాధులవలన సహింప నలవిగాని దుఃఖము సంభవిచును.దేహమంతయు దుర్గంధమేర్ప డును.శరీ రమునకెంత మాత్రము స్వస్థతయుండదు.బంధువియోగాదులవలన దుఃఖ ము,నేను బోయిన పిదప నాభార్యాబిడ్డలు యేమగుదురోయను విచారము వలన,నేను యే నరకాదులకుబోదునోయను భయమువలన,చిత్తము పలుర కములుగా పరితపించుచుండును.హా! ముదుసలి కష్టము వర్ణించుటకు ఆదిశేషునికయిన తరమగునా? 32,33.

మరణకాలమందు యమదర్శనమగును.యముని జూచినంతనే విపరీతమ గు భయముగల్గును.శరీరమంతయు వణికిపోవును.యముడు తన పాశము లతో స్థూలశరీరమునుండి సూక్ష్మశరీరమును లాగుచుండగా నవయవసన్ధి భాగములందత్యన్త బాధగల్గును.ప్రాణవాయువు శరీరమునందలి సకల స్థాన ములనుండియు లాగబడి,కంఠమునందు మాత్రము ఊర్ధ్వశ్వాసతో సంచరిం

చుచుండును.అప్పుడు గల్గు దుఃఖము వర్ణనాతీతము.కావున,ఇదంతయు వి చారించినచో యెవరికైనను వైరాగ్యము తప్పకుండా కలుగ గలదు. 34.

దేహపాతానంతరము జీవులు తమ పాపకర్మముల ననుసరించి నరకలో కమునకు బోయెదరు.అప్పుడు వారిని యమభటులు ప్రజ్వలించుచున్న భ యంకరమగు నిప్పునదులలో బడదోయుదురు.సలసలకాగుచున్న నూనెగం గాళములందు వేసి గోలించుచుందురు.కత్తులవలె నున్నయాకులుగల గంభీ రారణ్యములనుండి నడిపించుదురు.కుంభీపాకము,వీచి-తపనము మున్నగు నరకవిశేషస్థానములందు వివిధముగా హింసించెదరు.కాలుచున్న ఇనుపస్థం భములను కౌగిలించుట,సూర్యతాపముచే నత్యంత వేడెక్కిన ఇసుకపై బొర లించుట మున్నగు ఎన్నెన్నో కష్టములను పెట్టుచుందురు.ఇదంతయు విచా రించినచో యెవరికి విరక్తి గలుగకుండును ?35.

భూలోకమున శ్రుతిస్మృతిబోధితములైన పుణ్యకర్మలాచరించిన మానవులు, తమ పుణ్యఫలానుభవమునకై స్వర్గలోకమునకుబోయి,అచ్చటి సుఖమున నుభవించి,తిరిగి పుణ్యము క్షీణించినతోడనే,అచ్చటి అధికారి దేవతలచే బలా త్కారముగా క్రిందకి బడద్రోయబడినవారై వివశశరీరులై,నక్షత్రరూపముల ద్వా రా మళ్ళీభూలోకమున ప్రవేశించుచున్నారు.*(ఛాందోగ్యోపనిషత్తులో పంచమా ధ్యాయములో వైరాగ్యమును బోధించుటకై చెప్పబడిన“**పంచాగ్ని విద్య**”,ఇక్కడ శ్రీశంకరాచార్యులవారికి వివక్షితమై యున్నదని గమనించగలరు).*కావున, **"క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి"** (గీత 9-21)అని చెప్పబడిన ప్రకారం స్వర్గలోక భోగములుసైతము క్షణికములేయనిఆలోచించనచో,వాటిపట్ల యెవరికివాంఛ గలుగగలదు.?36. **భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః। భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మత్యుర్ధావతిపఞ్చమః॥** (కఠ.2-3-3)

ఈపరమేశ్వరునియొక్క భయమువలన అగ్నిహోత్రుడు దహించుచున్నాడు.సూర్యుడు ప్రకాశించుచున్నాడు.ఇంద్రుడు,వాయువు మరియు ఐదవవాడగు మృత్యువుగూడ ఈపరమేశ్వరుని భయమువల్లనే స్వస్వ వ్యాపారనిర్వహణమునందు నియతముగ ప్రవర్తించుచున్నారు.(ఈమంత్రమునకు సాదృశ్యము తైత్తరీయోపనిషత్ 2-8 గూడ ఉంది)ఈప్రమాణముల నాధారముగా గ్రహించి ఆచార్యులు ఉత్తరశ్లోకమును ప్రవృత్తము జేయుచున్నారు.

ఇంద్రుడు,సూర్యుడు,యముడు,అగ్ని మరియు వాయవు మున్నగు దిక్పాలకులుగూడ పరమేశ్వరుని భయముచేతనే తమతమ వ్యాపారములను యథాక్రమముగా(నియమముచే)నాచరించుచున్నారనియు,అప్పుడప్పుడు రాక్షసులచే బాధింపబడుచుందురనియు—శ్రుతులు,పురాణాలు బోధించుచున్నవి. ఈరహస్యమును గుర్తించినవారు లోకాధిపతుల ఆధిపత్యమునుగూడ నభిలషింపరుగదా!37.

తైత్తరీయోపనిషత్తునందు సకలభూమిభోగసంపన్నుడగు మహారాజు మొదలుకొని సగుణబ్రహ్మపర్యన్తము(బ్రహ్మలోకభోగములపర్యన్తము)ఆనందము ఉత్తరోత్తరము ఉత్కృష్టమైనదని చెప్పబడుచున్నది.అట్టి యానందమంతయు వారివారి యన్తఃకరణమునందలి సత్త్వగుణముయొక్క ఆధిక్యము ననుసరించి యభివ్యక్తమగు ప్రతిబింబానందమేగాని, వాస్తవికమైన బింబభూతమైన బ్రహ్మానందము మాత్రముగాకున్నది.ఈతత్త్వమును గుర్తించినవారు,శాశ్వతమైన నిర్గుణ బ్రహ్మానన్దప్రాప్తికే యత్నింతురుగాని,సార్వభౌమాది ఉన్నతపదవులను,తజ్జన్యమగు ఆనందమును కాంక్షింపనేరరు. 38.

సాలోక్యము(విష్ణులోకమునుబొందుట);సామీప్యము(విష్ణుసమీపమునందుం

డుట);సారూప్యము(విష్ణురూపముతో సమానమగు మరియొక రూపమును జెందుట)మొదలగునవన్నియు ముక్తివిశేషములనబడును.ఈముక్తులయందు జీవేశ్వరభేదము దొలగకుండుటచే,సాలోక్యాదిముక్తులను బొందిన జీవులందరును భగవత్పరతన్త్రులై భయముతో గూడుకొనియే యుందురు.మరియు నీముక్తివిశేషములన్నియు శ్రౌతస్మార్తకర్మానుష్ఠానమువలన సిద్ధించుచున్నవి.

"**తద్యథేహకర్మజితోలోకఃక్షీయతే**"(ఛాం.8-1-6),"**యత్కృతకంతదనిత్యం**"ఇత్యాది శ్రుతియుక్తులచే కర్మజన్యములన్నియు అనిత్యములేయగునని నిర్ధారణజేయబడుచున్నది.కావున,బుద్ధిమంతులగు ముముక్షువులు,జననమరణరూప భయరహితమగు,శాశ్వతమునగు సాయజ్యముక్తియను బ్రహ్మకైవల్యమునే కోరుచుందురుగాని,భయగ్రస్తములును,అనిత్యములునగు సాలోక్యాది ముక్తులకొఱకై యత్నముజేయరు. 39.

ఈలోకములో చిన్నపదవులందుండువారలు ఉన్నతపదవులందుండువారలనుజూచి యసూయనొందుటయు,దుఃఖపడుచుండుటయు సర్వజనానుభవసిద్ధమై యున్నది.అట్లే స్వర్గాదిలోకములందుగూడ ఇంద్రాది దేవతాస్థానములన్నియు ఉచ్చావచభావముగల్గియున్నందున దుఃఖమిశ్రితములే యగుచున్నవి.శ్రుతులచేతను,యుక్తులచేతను నిశ్చితమగుచున్నది.కావున,యీరహస్యము నెఱిగిన బుద్ధిమంతులందరు,నిఖిలలోకములందును విరక్తినొందితీరుదురు. 40.

లోకములో మానవులు శరీరాదులందు"**నేనునాది**"యను అభిమానము గలవారై తత్సుఖముకొఱకు,గృహభార్యాపుత్రాది నశ్వరపదార్థములందు ఆసక్తిగల్గి పరమపురుషార్థమగు మోక్షమును పొందకయే వ్యర్థముగా మృతినొం

దుచున్నారు.ఇట్టి మానవులను నిరన్తరము జూచు చున్నబుద్ధిమంతులెవరు ను గృహాద్యనిత్యవిషయములం దాసక్తినొందరుగదా!41.

నిజముగానాలోచించినచో-గృహమునందుగాని,పుత్రకళత్రధనాదులందుగాని యెంతమాత్రమును సుఖములేదు.అయినను, అజ్ఞానావృత వివేకదృష్టిగల మూఢజనులు గృహదారాసుతాదులందు సుఖముగల దనిభ్రమించుచున్నా రు.కాని,సమ్యగ్జ్ఞానముగలవిద్వాంసులు మాత్రము మోహమునొందరు. 42.

“**మేడిపండుజూడమేలిమైయుండును,పొట్టవిప్పిజూడపురుగులుండు**”అని వేమన గారు జెప్పినట్లు పుత్రమిత్రకళత్రాది పదార్థములన్నియు బాహ్యమున బహు సుందరముగా తోచినప్పటికిని,ఆంతరమున మాత్రము మలమాంసాది దోష ములతోగూడుకొని యున్నవి."**రమన్తిమూఢాః నరమన్తి పణ్డితాః**"అందుకే బు ద్ధిహీనులగు నవివేకులు భార్యాపుత్రాది భోగములనభిలషింతురుగాని,వివే కులగు విద్వాంసులకు మాత్రము వాటియందు వాంఛయే గలుగదు. 43.

చెరువులోని నీరు ఎండిపోయినను,తనకు నివాసస్థానమైన భూరన్ధ్రము నందలి యభిమానముచే ఎండ్రకాయ,దానిని వదలలేక తుదకు అందులోనే మరణించుచున్నది.అట్లే గృహస్థులును భార్యాపుత్రాదులందలి యభిమాన ముచే గృహములు విడువలేక యచ్చటనే సమస్తదుఃఖములననుభవించు చున్నవారై అంత్యమున గృహాద్యభిమానముచేతనే మృతినొందుచున్నారు. 44.

పట్టుపురుగు తన శరీరమును రక్షించుకొనదలచి,తననోటినుండి వెలువ డుదారములచే,తన శరీరమును పలుమార్లు దట్టముగా జుట్టుకొని చివరకు దానినుండి బయటకురాలేక,తాను నిర్మించుకున్న కోశమునందే మరణించు

చున్నది.అట్లే,మానవుడు గృహదారాసుతహితాదులందలి స్నేహరూపబంధన ముచే బంధింపబడి,ప్రేమాతిశయములను వ్యాపింపజేసుకొని,వృద్ధాప్యమునందుగూడ,వారికి తనకుగల ప్రేమపాశములను ద్రెంచుకొనలేనివాడై స్వస్వరూపసాక్షాత్కారమునకు సాధనమగు ఈశ్వరప్రసాదరూప అమూల్యమగు మనుష్యజన్మమును వ్యర్థపుచ్చి కాలునికి కబలమగుచున్నాడు. 45,46.

**శ్లో॥మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌస్త్వయా।**

**పారం దుఃఖోదధేర్గన్తుం తర యావన్న భిద్యతే॥**

బహుజన్మార్జిత బహుపుణ్యముచే లభించిన ఈ మానవశరీరరూప నౌక విచ్ఛిన్నము కాకపూర్వమే ప్రత్యగభిన్నపరబ్రహ్మతత్త్వమును తెలిసికొని దుఃఖరూప సంసారసాగరమునుండి తరించవలెను.

చక్కగా విచారించినచో గృహమునకు మరియు చెఱసాలకు భేదమేమియులేదు.చెఱసాలయందుండు ఖైదీ ఇనుపసంకెళ్ళతో బంధింపబడినవాడై విడుదలనొందలేకపోతున్నాడు.అట్లే,గృహస్థుడుభార్యాపుత్రాదులయందలిప్రేమ (మోహ)పాశములచే బద్ధుడై,వారినుండి సుఖమును పొందుటకై యనేక శుభాశుభకర్మలనాచరించుచు సంసారమను చెఱసాలనుండి విముక్తి నొందలేకపోతున్నాడు.గృహాభిమానమను ఇనుపగొలుసు గృహస్థుని కాళ్ళకు కట్టబడి ఎక్కడకు కదలేకపోతున్నాడు.గృహాభిమానముగలవారు,గృహములనువదలి, గంగానదిపుణ్యతీర్థములను,కాశీ మొదలగు పవిత్రక్షేత్రములను,అక్కడ తపస్సుచేస్తూ భగవద్ధ్యానతత్పరులైన మహాత్ములను సందర్శింపజాలకున్నారు. కాంతాసుతాదులందలి ఆశ గృహస్థునకు ఉరిత్రాడై బిగుసుకుపోయినది.ధనముపైని పేరాశ తలపైబడిన ప్రాణాంతకమగు పిడుగులాంటిది.కావున,గృహ

మునకు కారాగారమునకు భేధమేమియును లేదు. 47,48.

సంసారమందలి విషయములందు తగుల్కొన్న విషయాసక్త పురుషులలో, ఈసంసారరూప కారాగారమునుండి యెవడు బయటపడగ లడు?ఎందుక నగా,ఈసంసారరూపకారాగారముయొక్క నలువైపుల సుదృఢమైన మోహరూ ప కోటగోడ కట్టబడియున్నది.మరియు విషయాసక్తపురుషుని కాళ్ళకు ఆశారూప వందలకొలది ఇనుపసంకెళ్ళు వేయబడినవి.అందుచే లేచినిలబడు టకుగూడ అసమర్ధుడగుచున్నాడు.కామ,క్రోధ,మద,లోభములను సైనికులు రాత్రింబవళ్ళు ప్రహరాకాయుచుండిరి.పుత్రుడు,పుత్రికమున్నగువారియందలి కోరిక—పుత్రేషణ.ధనముపైనికోరిక—ధనేషణ.లోకులునన్ను గౌరవించాలి,లోకం లో నేను ప్రతిష్ఠగల్గి యుండాలి యనుకోరిక—లోకేషణ.ఈమూడు ఈషణత్రయ ము అనబడును.ఈఈషణత్రయమునందలి కోరికలు సాంసారికపురుషున్ని వశపరచుకొనియున్నవి.కావున,సాంసారిక విషయాసక్తపురుషుడు సంసార రూప కారాగారమునుండి బయటపడలేకపోతున్నాడు. 49.

“**వివేకోనాస్తిమూర్ఖాణామ్**”మూర్ఖులకువివేకముండదు.కామాంధకారముచే యెవనిదృష్టి(వివేకము)కప్పబడినదో,అటువంటి పురుషుడు మూర్ఖత్వముచే అసద్రూప కాంతదాసుడగుచున్నాడు.సద్రూప,అసద్రూపవస్తువులలో యేది సుఖదాయకము,యేది దుఃఖదాయకమో విచారించే శక్తిలేనివాడగుచున్నాడు.50.

**శ్లో॥శ్లేష్మోద్గారిముఖం స్రవన్మలవతీనాసా శ్రుమల్లోచనం,**

**స్వేదస్రగ్విమలాభిపూర్ణమభితో దుర్గన్ధిదుష్టం వపుః।**

**అన్యద్వక్తుమశక్యమేవ మనసా మన్తుం క్వచిన్నార్హతి,**

**స్త్రీరూపం కథ మీదృశం సుమనసా పాత్రీభవేన్నేత్రయోః॥**

ఎవరియొక్క ముఖమునుండి కఫము,జొల్లు,ఉమ్మి ఎల్లప్పుడు వెలువడు చుండునో,ముక్కునుండిమలము(చీమిడి)కారుచుండునో,నేత్రములనుండి ఊసులు,అశ్రువులు కారుచుండునో,శరీరముయొక్క సకలావయవములనుండి చెమటలుపట్టి దుర్గంధము వ్యాపించుచుండునో,లోనదుర్గంధదూషిత మల మూత్రములు నిండియున్నవో,అహో! ఇంకా ఎన్నెన్నిదోషములుగలవో?వాటిని నోటితో చెప్పుటకుగాని,మనస్సుతో చింతించుటకుగాని అయోగ్యములు, అసహ్యములు.అటువంటి"స్త్రీ"యొక్కస్వరూపము విచారశీలురగు శ్రేష్ఠపురుషులదృష్టిలో ఎట్లు దర్శనీయ మగును?అనగా వివేకిపురుషులు స్త్రీరూపమును హేయముగానెంచి,పరమార్థసాధనలో ప్రతిబంధకముగాభావించి,విరక్తినొంది త్యజించెదరని భావము.*వివేకులగు సాధకస్త్రీలుగూడ పురుషశరీరములోని పైదోషములను దర్శించి,పురుషులపై వ్యామోహమును వదులుకోవలెనని* ***అతిదేశము*** *చేయనైనదని గమనించవలెను.*51.(ఏకత్ర శ్రుతస్యాన్యత్ర సంబన్ధః =అతిదేశః)

[ముఖ్యగమనిక:—**"నహినిందా నింద్యం నిందితుం ప్రక్రమతే,అపితు విధేయంస్తోతుమ్"**(గీత-మధుసూదనీ 12-13)నింద్యవస్తువును నిందించుటలో నిందయొక్క తాత్పర్యముండదు,మరేమనగా స్తుతించుటకు యోగ్యమగు వస్తువును స్తుతించుటకోసమే—అనున్యాయముననుసరించి ఇచ్చటస్త్రీరూపమును నిందించుటలో శాస్త్రమునకు తాత్పర్యములేదు.మరేమనగా కామిపురుషులు స్త్రీసౌందర్యమునకు మోహితులై పరమార్థపథమునుండి పతనమగుచున్నారుగదా! వారికి స్త్రీరూపములోని దోషములను ప్రదర్శింపజేసి,విరక్తినిగలిగించి పరమా

ర్థపథములో ప్రవేశపెట్టి,వారిని రక్షించుటయే శాస్త్రమునకు ముఖ్యతాత్పర్య ముగలదు.కావున, స్త్రీజాతిని నిందించుటలేదు]

**శ్లో॥కార్యేషు మన్త్రీ కరణేషు దాసీ, భోజ్యేషు మాతా శయనేషు రమ్భా। ధర్మానుకూలా క్షమయా ధరిత్రీ,భార్యా చ షాడ్గుణ్యవతీ హదుర్లభా॥**
(షట్కర్మయుక్తా కులధర్మపత్నీ—పాఠాంతరము)(సుభాషితరత్నభాండాగారము)

వ్యవహారకార్యములలోమంత్రి,గృహకార్యములలోదాసి,భోజనమువడ్డించుటలో

తల్లి,రతిప్రసంగములోరంభ;శ్రౌత,స్మార్తరూపధర్మకార్యములలో సానుకూలమగు సహధర్మచారిణి మరియు ఓర్పు(క్షమతా)లో భూదేవి—ఈఆరుగుణములుగల సుయోగ్యమగు జీవితభాగస్వామిని(కులపత్ని)లభించుట సుదుర్లభము—అని చెప్పబడినప్రకారంగా,మానవజన్మ సాఫల్యమునకు,కర్తవ్యసాధనలో స్త్రీపురుషశరీరములకు రెండింటికి(కుడిచేయి,ఎడమచేయివలె)కలిసి ధర్మకర్మలను చేయుటకు అధికారముంది.ఈ అధికామును కామచేష్టలచే నష్టముచేయుట అవివేకమనబడును.దీనినుండి రక్షించుటకే స్త్రీస్వరూపమును శాస్త్రములో నిందనీయముగా వర్ణించుటజరిగినది.కాని,నిందించుటయందు అభిప్రాయములేదు.

ఎర్రగా దహించుచున్న ఇనమును దూరమునుండి చూసిన కీటము(మిడుత,పతంగము)దానిపై వ్రాలి,రక్షించుకొను మార్గములేక మసైపోతుంది.అట్లే, మూఢబుద్ధులు పంచవిషయాలకు నిలయమైన స్త్రీసౌందర్యమునకు ముగ్ధులై, కర్తవ్యవిమూఢులై,ముక్తికాంతను జేరనేరకున్నారు. 52.

**“అనిత్యాశుచిదుఃఖానాత్మసునిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా”**(యో.సూ.2-5)శ్రీపతంజలిభగవాన్ అవిద్యాస్వరూపమును నిరూపిస్తూ యథార్థము కానిదాని యందు యథార్థబుద్ధి అవిద్యాయనబడును—అని చెప్పారు.ఎట్లనగా,1.అని-

త్యములగు స్వర్గాదులయందు నిత్యత్వాభిమానము,2.అశోభనమయిన మాంసరక్త దుర్గంధ మలమూత్రాలతోకూడిన దేహమందు శుచిత్వబుద్ధి,3.“**దుఃఖమేవ సర్వం వివేకినః**”(యో.సూ.2-15)ప్రత్యక్షాది ప్రమాణములచే పరిశీలించి చూడగా సకలసాంసారికభోగములు వివేకిదృష్టిలో దుఃఖరూపములే.ఈదుఃఖకరములగు స్రక్చందనవనితాదులందు సుఖిత్వారోపము.4.అనాత్మపదార్థములగు దేహదులందు ఆత్మత్వబుద్ధి—ఈప్రకారంగా కార్యావిద్య నాల్గుప్రకారములు.

కావున,రక్తమాంసఅస్థిమజ్జామలమూత్రములకునిలయమైన అత్యంత అశుచియైన స్త్రీశరీరమునందు శోభనబుద్ధిపెట్టుకొని కామాసక్తులగు విషయాపురుషులు అమూల్యమైన మానవజీవితమును మిడుతవలె నాశనము చేసుకొనుచున్నారు. 53.

వివేకముగల ముముక్షువులకు విషయవాంఛయే యముడుగాను,స్త్రీయే వైతరణీ నదిగాను,గృహమే యమాలయముగాను భాసించుచుండును.54. గృహమునందు విషయానుభవకాలములోను,సుషుప్తికాలములోను క్షణిక సుఖానుభవము కల్గినంతమాత్రముననే“**అహో ! ఎంతదొడ్డసుఖము!ఏమినాభాగ్యము!**”అని మూఢజనులు భ్రమజెందుచున్నారు.కాని, గృహమునందును, యమలోకమునందును దుఃఖానుభవము సమానమే. 55.

మన్మథుడు చాలామంచివాడని,యముడు చాలాచెడ్డవాడని లోకులఅభిప్రాయము.కాని,విచారించిచూసినచో మన్మథునికంటే యముడే మిక్కిలి హితైషీ అని(మేలుజేయువాడని)చెప్పకతప్పదు.ఎందుకంటే,యముడు లోకులకు నరకబాధల నొసంగుటద్వారా వారిపాపములను నశింపజేయుచున్నాడు.మన్మథుడు మాత్రము విషయభోగములనొనగూర్చి మిత్రునివలె గన్పట్టుచు,పలు

విధములైన పాపాచరణకు హేతుభూతుడై అనేక దుఃఖములనే కలుగ జేయుచున్నాడు.56.

యమధర్మరాజు పాపములుజేయువారలను మాత్రమే బాధించును.పుణ్యాత్ములను సుఖపెట్టుటయే అతని కృత్యము.కాని,కాముడైతే పండితప్రకాండులనుగూడ భార్యాపుత్రాది విషయభోగములందు భ్రమింపజేయును.ఇక పామరజనుల పరిస్థితి అవర్ణనీయముగాక మరేమైయుండును?.57.

శబ్దస్పర్శరూపరసగన్ధాదులయందలి కోరికయే కామము అనబడు ను.ఇట్టి కోరికగలవారుకాముకులు.పరమేశ్వరుడు ప్రపంచమును విశేషముగా వ్యాపింపజేయదలచి కాముకజనులను సృష్టించెను.వీరు తమ కోరికలుపూరించుట కోసం భార్యాపుత్రగృహారామక్షేత్రాదులను సంపాదించుకొని వారియభివృద్ధికొఱకై పలువిధములకర్మల నాచరించుదురు.వారివలన లోకము విస్తరింపబడి, వర్ధల్లుచుండును .58.

**శ్లో|| ఉన్మాదనస్తాపనశ్చ శోషణస్థమ్భనస్తథా|**

**సమ్మోహనశ్చ కామస్య పఞ్చ బాణాః ప్రకీర్తితాః||**(అమరకోశము 1-1-26)

ఉన్మాదనము,తాపనము,శోషణము,స్థంభనము మరియు సమ్మోహనము— అని కామదేవునికి ఐదు బాణములు చెప్పబడినవి.కాముడను మహాబలవంతుడు సర్వమానవుల హృదయములలో ప్రవేశించి మోహింపజేసి,బ్రహ్మజ్ఞానము కలుగకుండ జేయుచున్నాడు.స్త్రీపురుషులకు పరస్పరానురాగము గలిగించి విషయవాంఛలనే వృద్ధిజేయుచు,వారివలన ప్రపంచమును వృద్ధిజేయుచున్నాడు.అందుకే,ప్రపంచమున మానవులు బహిర్ముఖులై భార్యాపు

త్రాది విషయసుఖములనే కోరుచున్నారుగాని,అంతర్ముఖులై ఆత్మజ్ఞానము కొఱకు ప్రయత్నింపజాలకున్నారు."**పరాఞ్చిఖానివ్యతృణత్స్వయాభూః,తస్మాత్పరాన్పశ్యతి నాన్తరాత్మన్**" (కఠ.2-1-1)అందుకే, ప్రతిప్రాణియు పూర్వానుభూత భోగవాసనాపైవశ్యముచే కామప్రేరితులై పరులుబోధించకుండానే విషయముల యందు స్వాభావికముగా ప్రవర్తించుచున్నారు. ఇదిసర్వానుభవసిద్ధముగదా!

**శ్లో॥పూర్వజన్మానుభూతార్థ స్మరణాన్మృగశావకః।**

**జననీస్తన్యపానాయ స్వయమేవ ప్రవర్తతే॥**(మానసోల్లాసము 7-6)

ఇష్టసాధనతాబుద్ధిపూర్వకముగా ప్రతిప్రాణియొక్క ప్రవృత్తి జరుగుతుంది. పూర్వజన్మమునందు స్తన్యపానము ఇష్టమైయుండెను.అట్లే,ఈ జన్మయందు గూడ స్తన్యపానము ఇష్టమున్నందున,పూర్వజన్మలోని స్తన్యపానానుభవజన్యసంస్కారముచే,అప్పుడే జన్మించిన జింకపిల్ల(శిశువు),యెవరి ప్రేరణ(సహాయము)లేకుండానే స్వయముగానే తల్లియొక్క స్తన్యపానముచేయుటకు ప్రవృత్తమగును.కావున,ఉపలక్షణముచే సకలజీవులు వాసనాపైవశ్యముచే కామప్రేరితులై శబ్దాదివిషయములందు (యెవరిచేబోధింపబడకున్ననూ)స్వాభావికముగానే ప్రవృత్తులగుచున్నారనుట-నిశ్చయము. 59,60.

మనస్సునందలి కామునియొక్క ప్రేరణచేతనే సర్వజనులకు విషయభోగములందు తీవ్రవాంఛ కలుగుచున్నది.కనుకనే, "**తృష్ణానజీర్ణావయమేవజీర్ణాః**"

**శ్లో॥వలీభిర్ముఖమాక్రాన్తంపలితైరఙ్కితంశిరః।**

**గాత్రాణిశిథిలాయన్తేతృష్ణైకాతరుణాయతే॥**(భర్తృహరి వైరాగ్యశతకము)

మాశరీరము(జీర్ణించినను)ముదుసలియైనను మాఆశ(కోరిక)మాత్రము నశించినదికాదు.ముఖమంతయు ముడతలుపడినది.శిరస్సంతయు బూడిదగుమ్మడికాయవలె(తెల్లగా)నెరసినది.అవయవపటుత్వము దప్పినది.కాని,దురాశ(భోగేచ్ఛ)నశింపక నవయౌవనముగనే యున్నది.ఏమానవుడు గురుశాస్త్రలను ఆశ్రయించి యుక్తాయక్తవివేకము గలవాడై విషయములందలి దోషములను చక్కగా పరిశీలించి వాటిని పొందుట కిచ్ఛగింపడో,అతడుమోక్షమును సులభముగా పొందగలడు.61,62.

ముముక్షువులగు సత్పురుషులకు సులభమగు కామజయోపాయమును చెప్పుచున్నాను.మనస్సునయే విషయమును సంకల్పింప కుండుటను అలవరుచుకొన్నచో కాముడు సులభముగా జయింపబడును.

**శ్లో॥కామజానామి తే మూలం సంకల్పాత్కిలజాయసే।**

**నత్వాం సంకల్పయిష్యామి సమూలో న భవిష్యసి॥**(మ.భా.శాం.ప. 177-25)

ఓకాముడా!నేను నీమూలమును తెలిసికొంటినిలే!నిశ్చయముగా నీవు సంకల్పమునుండియే పుట్టుచున్నావు.కావున,ఇప్పుడు నేను సంకల్పమే చేయకుందును.దానితో నీవు సమూలముగా నాశనమై పోపుదువు.

శాస్త్రములలో వినబడుచున్న స్వర్గాదిలోకములలోని భోగములందుగాని,ప్రత్యక్షగోచరములగు ఇహలోకభోగములందుగాని ప్రియబుద్ధిని(ఇవి బాగున్నవి,అనుభవింపదగినవి అనుభావన)సంపూర్ణముగా వదులుకున్నచో,ఇక వానియందు యెవరికిని,యెప్పుడును కోరికజనించదు.కావున సంకల్పము నుండి పుట్టిన విషయాభిలాష,సంకల్పము నశించిన నశించును.విత్తనము

నశించిన అంకురము ఎలా ఉదయించగలదు? 63,64,65.

**"ఇదిమంచిది"**యను శోభనబుద్ధిచేతనే ప్రతిమానవుడు భోగ్యపదార్థముల నుగోరి ప్రవృత్తుడగుచున్నాడు.మంచిదికాదను భావనగల్గినచో ఆభోగ్యవస్తువు లను గోరనేరడు.కావున కామవిజిగీషులు(కామమును జయింపనిచ్ఛగించు వారు)విషయములందు"**మంచిది**"అనుభావమును, మరియు"**సుఖకరము**"అ నుబుద్ధిని(ఈరెంటిని)తప్పకపరిత్యజింపవలెను.66,67.

విషయములయొక్క నిజస్వరూపమును, వానివలన సంభవించెడి యన ర్థపరంపరలను చక్కగా నాలోచించినచో వస్తువిషయక సంకల్పము గల్గుటకు ఇంచుకంతయు నవకాశములేదు.రత్నమునుజూచినపుడు,ఇదిరాయి(శిల) యనుబుద్ధిగలిగినగాని లేక ఇది యనర్థకారకము అను భయబుద్ధి గలిగిన గాని,దానియందింకెప్పుడుగూడ శోభన(మంచి దియను)బుద్ధిగాని,సుఖభ్రా న్తిచే గ్రహణబుద్ధిగాని గలుగనేరదు.దానిచే రాజభయముగాని, చోరభయము గాని,గలుగజాలదు. 68,69,70.

ధనము భయమును గలిగించును.దుఃఖముల నభివృద్ధిపరచును.పరు లకుపీడను గలిగించు పరుషవాక్యములను పలికించును.బంధువుల నెక్కు వగా సమకూర్చి వారివలన రాగద్వేషముల నభివృద్ధిజేయును. సద్గుణము లను పాడుచేయును.లోభబుద్ధిని పెంపొందించును.మరియు మోక్షమునకు, చిత్తశుద్ధికి ప్రతిబంధక(విఘ్న)మగును. 71.

ధనమున్నచో ప్రభువులవలనను,దొంగలవలనను,అసావధానముచే గలుగు పొరపాట్లవలనను,బంధువులవల్లనూ భయము తప్పదు.సంపాదించునపుడు దుఃఖము,కాపాడుటయందు దుఃఖము, ఇతరులకు దానముచేయునపుడు

మరియు భోగములకై ఖర్చుపెట్టునపుడు దుఃఖమును గలుగజేయును.కావున,ధనమిన్నివిధముల భయము,దుఃఖము,అనర్థములకు మూలకారణ మున్నందున వివేకులదృష్టిలో ఈధన మెప్పుడును సుఖదాయకముగా సిద్ధించదు. 72,73.

పండితులకుసహితము ధనకనకవస్తువాహనాదులు,గృహారామక్షేత్రములు లభించినంతనే వానియందు ఆశ మిక్కుటమగుచుండును.ఎంత లభించినను తృప్తియుండదు.ఇట్టి ధనాశవలన నిరన్తరము దానికొఱకే ప్రయత్నింతురు. కాని,యుక్తాయక్త కార్యములను గుర్తెఱుగరు.దానిచే ఇహపరలోక సుఖసాధ నములగు వైదికకర్మల నాచరింపక వ్యర్థముగా జెడిపోవుచుందురు. ధనము లేనిచో దారిద్ర్యము బాధించును.ధనమున్నచో ధనాశ పీడించును.కనుక, ధనమున్నను లేకున్ననుదుఃఖమే.ధనాధిక్యతవలన భోగముల ననుభవించు చున్నచో మదమెక్కుచుండును.ఒకవేళ దానముచేయుచున్నచో తత్ఫలాను భవమునకై తిరిగి జన్మము ప్రాప్తించును.కనుక యేవిధముగజూ చినను ధన ము దుఃఖాన్తమే యగుచున్నది.ఇట్టి ధనమెట్లుసుఖదాయకమగును?దుఃఖ ముదప్ప వేరొండు మార్గమే లేదుగదా! 74,75,76.

ధనమువలన మనుష్యునకు అభిమానము(మదము)గల్గును.అనగా కార్యాకార్య విచక్షణ లోపించును.దీనినే పర్యాయముగా మోహమందురు. ఇట్టి మోహవశమున సద్గురువు మరియు సచ్ఛాస్త్రములచే నుపదేశింపబడి న మంచివిషయము లెవ్వియును స్మృతికిరాకుండును.స్మృతిదప్పిన కొంత కాలమునకు బుద్ధిలోగల మంచిచెడ్డలను వివేచనజేయు యోగ్యతగూడ నష్ట మగును.బుద్ధినశించినపిమ్మట పురుషుడు స్వయముగా నష్టమై జీవచ్ఛవ

ముగా జడుడై పడియుండును.పరమార్ధమార్గమునుండి భ్రష్టుడగునని తాత్పర్యము. 77.

**శ్లో॥సమ్మోహాత్స్మృతివిభ్రమః।స్మృతిభ్రంశాద్బుద్ధినాశో,బుద్ధినాశాత్ప్రనశ్యతి॥**

(గీత.2-63)

లోకంలో మూఢజనులు,ధనమే మమ్ములను సుఖపెట్టునను భ్రాన్తిచే,దానియందే ప్రాణములుపెట్టుకొని,నిరన్తరము దానినేచూస్తూ,దాని సమీపముననే నివసించుచుందురు.ఈధనాశారూప పిశాచి మూఢపురుషులను పెనవేసుకొని,వశపరచుకొని జడునివలెజేయును.దానిచే ధనము వ్యయమగునను భీతిచే ధర్మకార్యములనుగూడ జేయకుందురు.కొంతకాలమునకు ఆధనము వారిప్రాణములనుగూడ నపహరించుకొని, తానుగూడనిష్క్రమించును.

**శ్లో॥ చలా లక్ష్మీ శ్చలా ప్రాణాశ్చలో దేహోఽపి యౌవనమ్।**

**చలాచలశ్చ సంసారః కీర్తి ధర్మశ్చ నిశ్చలః॥**(మహాసుభాషిత సంగ్రహము 14153)

లక్ష్మీ=ధనము,చలము=అస్థిరము,ప్రాణములు అస్థిరములు,దేహము అనిత్యము,యౌవనము క్షణభంగురము,ఈసంసారం చలము=అనిత్యము,స్వరూపముచే నసత్యము.అనాది ప్రవాహరూపముచే పరిణామినిత్యము(మోక్షపర్యన్తస్థాయి),శాశ్వతంమాత్రం కాదు.కాని తనయొక్క కీర్తి(మంచితనము)మరియు ధర్మము(పుణ్యము)నిశ్చలము=శాశ్వతము.78.

లోకములో గ్రుడ్డివాడు నేత్రములు లేనందున పదార్థములను జూడలేడు. అట్లే,ఐశ్వర్యవంతుడు ధనాభిమానమను మహాదోషముచే నశించిన వివేకదృష్టిగలవాడై "**ధనము,దానిననుభవించుట,దానినిదాచుకొనుట**" అనునవి దప్ప

మరియొక విషయమునేమియు విచారింపజాలడు.అనగా ఇహలోకమున పరులకు సంబంధించినదిగాని,పరలోకమున తనకు సంబంధించినదిగాని విచారింపడు.ఇట్టివాడు దుష్టులదుర్బోధల నాచరించుచు శాస్త్రీయములైన శిష్టాచారములను పరిత్యజించుచున్నాడు.అందుచే యనర్థపరంపరలకు లోన-గుచున్నాడు.ఇట్టి దోషమునకంతకును వివేకజ్ఞానములేకుండుట యను గ్రుడ్డి తనమే కారణము.గ్రుడ్డివానియొక్కనేత్రదోషమును అంజనము(కాటుక)యను ఔషధము పోగొట్టును.అట్లే,దారిద్ర్యమను కాటుక ధనవంతుని ధనాభిమాన మును నశింపజేసి,ధర్మమునాచరింపజేయుచుక్రమముగాకృతార్థునిజేయును. ధనప్రాప్తివలన లోభము,క్రోధము,దంభము,మదము,మత్సరము మున్నగున వి వృద్ధినొందును.లోభమనగా,ఎంతధనములభించినను తృప్తిలేక ఇంకా మి-గుల ధనసంగ్రహము చేయగోరుట.ధనముగాని, యితరభోగములుగాని“**నాకు ఎల్లపుడుఉండాలి**”అను తృష్ణావిశేషమునకు“**కామము**”అందురు.ఆకామము నకు ఏకారణముచేనైనను ప్రతిఘాతము(ప్రతిబంధకము)కలిగినచో ఆప్రతిఘా త(వస్తువు,వ్యక్తి)విషయక అభిజ్వలనాత్మక (క్రోధాకార) అంతఃకరణవృత్తివిశేష ము ఉత్పన్నమగును.దానికే“**క్రోధము**”అందురు.ఇతరులనునమ్మించుటకు,నే ను చాలాఉత్తముడను అని తన మహత్వమును ఖ్యాపనము(ప్రకటము)జే యుటకొఱకు వేషభాషాక్రియాచాతుర్యాదులచే ధర్మాద్యాచరణము-“**దంభము**” అనబడును.స్వసమాన పరఉత్కర్ష(ఔన్నత్యము)నుజూచి సహింపజాలక,తన యొక్క ఉత్కర్షనుగోరుట—“**మత్సరము**”అనబడును.విద్యా,ధనము మొదలగు సంపత్తి నిమిత్తక“**నాతోసమానమైనవాడుయెవడున్నాడు**”అను గర్వవిశేషము నకు“**మదము**”అంటారు.ఇలాంటి అనేక దోషములకు కారణమైన ధనమువ లన చిత్తమెన్నటికిని పరిశుద్ధము గానేరదు.చిత్తములో యేవిధమైన కాలు

ష్యము(పైన పేర్కొనబడిన దోషములు)లేకుండుటయే చిత్తశుద్ధి,అనగా ప్రాపంచిక విషయవాసనారాహిత్యము.కావున,ధనమువలన దుష్టవృత్తు లభివృద్ధి జెందునేగాని,చిత్తవిలయమెన్నటికిని గానేరదు.79, 80.

లోకములో పండితులకుగూడ ధనములేనప్పుడు గలుగు దుఃఖముకంటె ప్రాప్తమగుధనము వ్యయమగునపుడు గలుగు దుఃఖాతిశయము వర్ణనాతీతము.ధర్మకార్యములకొఱకు ధనము వ్యయమగునపుడు తాత్కాలికముగా కించిన్మాత్రము దుఃఖముగల్గినను పండితులగుటచే పరలోకసుఖాశచే దానిని సహింతురు.కాని,దుర్వ్యయమైనపుడుమాత్రము వారి పరితాపము అగణ్యము. 81.

ఇంటిలో పాముగలయజమానికి మనఃశాంతియుండదు.నిద్రపట్టదు.ఎప్పుడెవరిని కాటువేయునోయను భయముగల్గుచుండును.అట్లే,ధనవంతునికిగూడ చిత్తశాంతియుండదు.మరియు రాజులవలనను,దొంగలవలనను ధనమునకు ఎప్పుడు యే అపాయముగలుగునోయను భయము,విచారమేదప్ప ధనమువలన యిసుమంతయును సుఖము లేదు.ధనములేనివాడు మహారణ్యమునందైనను,మరియే యితర ప్రదేశమునందైనను యేవిధమగు చింత లేక సుఖముగా నివసించగలడు.అతనికి చోరభయము రాజభయము మరియే యితరమైన భయముగూడ ఉండబోదు.జనులందరు రాగద్వేషరహితులై అతనిని ప్రేమభావముతో నాదరించుచుందురు.ఇక ధనికుడన్ననో,అడవియందున్నచో దొంగలవలన,గ్రామమందున్న యాచకులవలన,గృహమందున్న పుత్రులు,బాంధవులవలన నిరన్తరము భయమునే జెందుచుండును.అతని చిత్తమునందు శాన్తియుండక నిరన్తరము విక్షేపమును పొందుచుండు ను. 82,83.

ఇంతవరకు ధనమునకు సంబంధించి చెప్పబడిన వివిధదోషములచే ధనము అనర్థకారణమని ధృవీకరించనైనది. ధనమువలన మోక్షమను పరమ పురుషార్థము సిద్ధింపదు.కనుకనే మహానుభావులగువారు ధనాభిమానమును వదలి వనప్రదేశములందు హాయిగా తమతమ సాధనలుచేస్తూ నివసించుచున్నారు. 84.

“**కవిఃక్రాన్తదర్శీసర్వదృక్**”అని ఈశావాస్యోపనిషత్ ఎనిమిదవమంత్ర భాష్యంలో శ్రీభాష్యకారులగు శంకరులు చెప్పినట్లు,మరియు“**జ్ఞానీత్వాత్మైవమేమతమ్**” (గీత 7-18)లో గీతాచార్యులు చెప్పినవిధముగా“**కవిః**”అనగా ఈశ్వరాభిన్న జ్ఞాని మహాత్ముడు.అటువంటి త్రికాలదర్శులగు ఆత్మజ్ఞానసంపన్నులు వేదప్రమాణములచేతను,అనుమానాదియుక్తులచేతను బాగుగావిచారించి ప్రపంచమంతయు అనిత్యమని గ్రహించి—పతియేసర్వస్వము,దైవముఅనిభావించు గుణవతియు,శ్రద్ధాభక్తులు గలదియునగు భార్యను,అధికమగు నైశ్వర్యమును,బహుజన్మార్జిత పుణ్యబలముచే ప్రాప్తమైన నానాప్రకారముల భోగవిలాస సామగ్రులను,రమ్యమగు గృహమందిరమును,తనను అనుసరించి నడుచుకొను విద్యావంతులగు సుయోగ్యపుత్రులను(సకలసాంసారికవిషయములను)పరిత్యజించి(సన్యసించి)ఆత్మానన్దము ననుభవించుచున్నారు.

“**యదహరేవవిరజేత్తదహరేవప్రవ్రజేత్**”(నా.ప.3-77);“**నకర్మణానప్రజయా ధనేన త్యాగేనైకేఅమృతత్వమానుశుః**”(కైవల్యో.3);“**అమృతత్వస్యతునాశాస్తివిత్తేనేతి**”(బృ.2-4-2);“**పుత్రైషణాయాశ్చవిత్తైషణాయాశ్చలోకైషణాయాశ్చవ్యుత్థాయాథభిక్షాచర్యం చరన్తి**”(బృ.3-5-1)ఇత్యాది వేదప్రమాణములును మరియు“**యద్యద్కార్యం తదనిత్యమ్**”ఇత్యాది యుక్తులును ఇచ్చుట(సర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహములోని 85 వ

శ్లోకమునకు)అన్వయించును

పై శ్రుతులకర్థములు:—ఏరోజున తీవ్రవైరాగ్యముదయించునో, అదేరోజున(తత్క్షణమే)సన్యసించవలెను(నా.ప),యజ్ఞయాగాదికర్మలచేగాని,సంతానముచేగాని,ధనముచేగాని మోక్షరూపఅమృతత్వము పొందబడదు.ఒక్కత్యాగముచేతనే పొందగలరు.(కైవల్యోపనిషత్తు);ధనముచే అమృతత్వముయొక్క ఆశలేదు అనగా ధనముచే మోక్షముప్రాప్తించదు.(బృ); ఎవడుఆకలి,దప్పిక,శోకము,కామము, మోహము (అజ్ఞానము),జర(ముసలితనము),మరణము అనునవి లేనివాడో, అతడే ఆత్మ;సర్వాంతర్యామి.ఆయాత్మను బ్రాహ్మణులు(పరోక్షబ్రహ్మజ్ఞానులు) తెలిసికొని పరలోకసాధనమగు పుత్రులయొక్క ఇచ్ఛ(పుత్రేషణము),యాగాది కర్మలకై ధనాశ(విత్తేషణ),మరియు తత్ఫలమగు స్వర్గాదిలోకాభిలాష(లోకేషణము)అను వీనిని వదలి,భిక్షాన్నమును భుజించుచు అపరోక్షబ్రహ్మానుభూతిని పొందుప్రయత్నముతో పోవుచున్నారు(బృ).

ఇక మూఢులగు అజ్ఞజనులు మాత్రము మోహాంధకారమునబడి,నాశవంతమైన,చివరకు వియోగమహాదుఃఖమునిచ్చు ధనపుత్రకళత్రాది పదార్థములే గొప్పసుఖసాధనములని భ్రాన్తిచే భావించి,నిరన్తరము జన్మ మరణరూప మహాదుఃఖసాగరమున మునకలువేస్తూ(పుట్టుచూ,మరణిస్తూ)ఉక్కిరిబిక్కిరైపోతున్నారు.అహో!వారి కష్టమును కీర్తించుటకు నలవిగాదుగదా! 85.

మలమునందలి పురుగులు మలనివాసమును, మలభ్రమణమును సుఖముగా భావించి అందులోనే ప్రియబుద్ధిగలిగి తిరుగుచుండును.అట్లే,మూఢజనులు భార్యాపుత్రాదులందలి వ్యామోహముచే పలుదోషములుగల సంసారమునందే సుఖమున్నదని భ్రమజెంది పరిభ్రమించుచుందరు.వీరికి జననమర

ణరూప సంసారముదప్ప,మోక్షముయొక్క ప్రాప్తి అసంభవమేగాక,ఆశగూడలే దు.స్వర్గాదిలోకములలో భోగముల ననుభవించు దేవతలకుసైతము ముక్తి దుర్లభమన్నచో,భూలోకమున తమవర్ణాశ్రమధర్మముల నాచరింపక భార్యాపుత్రాదులతోడనే క్రీడించు మానవులకు ముక్తిలభించుననుట హాస్యాస్పదము గాదా!తల్లిగర్భముననను,నరకలోకముననను నిరన్తరము(జన్మించుట మరణించుటయును)దుఃఖమే గలుగుచుండునని భావము.86.

ఎవరికి భార్యాపుత్రాదుల యందుగల ఆసక్తి,అభిమానమునశించునో,వారికి మోక్షము సులభము.యితరులకు మిక్కిలి దుర్లభము.ఎవరు నిష్కామభావనచే శ్రౌతస్మార్త కర్మలనాచరించుటద్వారా జ్ఞానమునకు ప్రతిబంధకములగు ఈజన్మలో జేయబడినవిగాని,గతజన్మలలోనివిగాని సకలపాపములు నశించి, రాగద్వేషాది దోషములు క్షీణించి చిత్తమును నిర్మలము జేసికోనిరో,నిత్యము వేదాన్తశ్రవణమునే జేయుచుందురో,ప్రాణాయామాది యోగక్రియలచే మనస్సును వశపరచుకొనిరో,వేదసమ్మతములగు యుక్తులసహాయముచే ప్రపంచమనిత్యమనియు,ఆత్మయొక్కటియే నిత్యము సత్యము అని భావించుచుందురో, మరియు మోక్షేచ్ఛదప్ప మరియొక కోరికలేనివారో—అటువంటి భాగ్యశాలి పురుషులు కృతార్థులగుదురు.అట్టివారు తీవ్రవైరాగ్యము అనుఖడ్గముతో ఆత్మభిన్నములగు దేహేన్ద్రియసంఘాతమునందుగల“నేను”అను అహంభావము(అభిమానము),భార్యాపుత్రాదులందుగల“నాది,నావి”అను మమాభిమానమను మహాలతను సులభముగా త్రెంచివైతురు.అనగా,సర్వ సంగపరిత్యాగముజేసి ఆత్మానన్దమును అనుభవించుచు జీవన్ముక్తులగుదురనిభావము. 87,88.

జన్మమరణరూప సంసారమనెడి బలవంతమైన మృత్యువు ప్రవేశించుటకు

లోకంలో మూడుగొప్పద్వారములు గలవు."**కాంత,కనకము,జిహ్వ**".(స్త్రీ,బం-గారము మరియు నాలుక)-అను నీమూడింటిని యెవరు నిర్జించగల్గుదురో, వారికిక మృత్యుభయముండదు.89.

మోక్షలక్ష్మియొక్క నగరమునకు ప్రథమ సింహద్వారమొకటిగలదు.దానికి ధనము,కాంత(భార్య)యను రెండుతలుపులును,కామము అనునొక అడ్డగడియయు గలవు. ఈమూడింటిచే నాద్వారము మూయబడి యుండును. ఈమూడింటిని యెవరు భేదించగలరో వారు ముక్తికాంతను చేపట్టగలరు. అనగా గడియనూడదీసినచో తలుపులు తెరచుట సులభము.అట్లే,విషయ వాంఛయను కామమునొకదానిని జయించినచో సకలవిషయములు జయింపబడును.అపుడు రాగరహితమగు చిత్తమున స్వస్వరూపానన్ద మభివ్యక్తమగును. మోక్షమనగా యిదియేగదా!90.

సర్వదుఃఖములను సహించుటయను కవచమును ధరించి,ఇహపర లోకభోగములందు విరక్తియను ఖడ్గమును చేబూని,నిత్యానిత్యవస్తు వివేకమను గుఱ్ఱమునెక్కి శాస్త్రవిహితమార్గములందు సంచరించు మానవునకు శత్రువను వాడు ఉండబోడు. 91.

తత్త్వవిదులగు సత్పురుషులు,తాము కృతార్థులై—నిత్యానిత్యవస్తు విచారమువలన కలుగు దృఢవైరాగ్యమే మోక్షమునకు మూలకారణమని చెప్పుచున్నారు.కావున,మోక్షేచ్ఛగలవారు మొమ్మొదట విషయవిరక్తిని సంపాదించుకొనవలెను.అనిత్యవస్తువులందు విరక్తినొందని పురుషుడు దేహాభిమానమను బంధమును త్రెంచుకోలేడు.విషయవిరతియే బన్ధనాశమునకు ముఖ్యమైన ఉపాయము.కావున, ఎప్పటికైనను వైరాగ్యముచేగాక మరిదేనిచేతను

బన్ధము తొలగదు.ఎన్ని శాస్త్రములను చదువుకొన్నను,వైరాగ్యముగనుక లేని చో ప్రయోజనమేమియు లేదు. దేహాదులందభిమానము తొలగదు.అందుకే పండితులుగూడ తాపత్రయగ్రస్తులగుచున్నారు. 92,93,94.

**“సర్వంవస్తు భయాన్వితం భువిన్నృణాం వైరాగ్యమేవాభయమ్”** ప్రపంచంలోని సకలవస్తువులు మానవులకు భయ(సంసార)హేతువులేయగును.ఒక్క వై రాగ్యమే అభయ(మోక్ష)కారణము—అని భర్తృహరిచెప్పారు.ఈప్రకారంగా“**భోగ్య విషయకదోషదర్శనము**”నుగూర్చి విస్తారముగా తెలిసికున్నాము.వైరాగ్యము నుగురించి ఇంకా అధికముగాతెలిసి కొనగోరువారు భర్తృహరి వైరాగ్యశతక మును మరియు శ్రీయోగవాసిష్ఠము-వైరాగ్యప్రకరణమును సంపూర్ణముగా నవలోకించదగును.

**3.భోక్తృవిషయక దోషదర్శనము:—**భోక్త అనగా జీవుడు.దేహాదిసంఘాతము తో తాదాత్మ్యాభిమానము గలవాడు.ఇతనికి విజ్ఞానమయుడు,ప్రమాతా,చిదా భాసుడు-అనిగూడ పర్యాయములు గలవు.

**శ్లో॥ఏవం వివేచితేతత్త్వే విజ్ఞానమయశబ్దితః।**

**చిదాభానో వికారీ యో భోక్తృత్వం తస్య శిష్యతే॥** (పే.పం.7-216)

విజ్ఞానమయశబ్దముచే యే చిదాభాసుడు(జీవుడు)చెప్పబడుచున్నాడో, అతడు వికారిగావున,అతడే భోక్తగా మిగులుచున్నాడు.సుఖదుఃఖములను అనుభవించువాడును మరియు అహంసుఖీ,అహందఃఖీ—అని వాటిని అభి మానించువాడునుగూడ.

**“కామఃసఙ్కల్పోవిచికిత్సాశ్రద్ధాఽశ్రద్ధాధృతిరధృతిర్హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వంమనఏవ”**(

బృ.1-5-3 ).కామము,సంకల్పము,సంశయము,శ్రద్ధ,అశ్రద్ధ,ధైర్యము,అధైర్యము, లజ్జ,బుద్ధి మరియు భయము ఇవన్నియు మనోరూపము లు—అని ఉపని షన్మాత నిర్దేశించినది.అట్లే,

**శ్లో॥శోక మోహ భయ క్రోధ లోభ హర్ష స్పృహాదయః।**

**అహంకారస్య దృశ్యన్తే జన్మమృత్యుశ్చ నాత్మనః॥**(శ్రీమద్భాగ. 7-13-33)

అర్థం స్పష్టము.

ఈప్రకారము కామాది సకలవృత్తులు మనోధర్మములే.అయిననూ,అంతః కరణముతో తాదాత్మ్యపన్నుడైన జీవుడు అంతఃకరణ,తద్ధర్మములనన్నిటిని తనయందారోపించుకున్నాడు.కామహతుడైన జీవునికి యెన్ని విషయాలను అనుభవించినప్పటికి విషయాలయందలికోరిక(కామము)మాత్రము ఉడుగుట లేదు.ఒక కోరికను పూర్తిజేసుకొనగానే,మరొక కోరిక గలుగుచుండును.దానిని పూర్తిజేసుకోగా మరియొకటి,ఇట్లు కామనల(కోరికల)ప్రవాహమునకు అంతు (సమాప్తి)లేదు.“**సముద్ర ఇవ హి కామః।నైవ హి కామస్యాన్తోఽస్తి,న సము ద్రస్య**” **॥** (తై .బ్రా.2-2-5-6)

కామము సముద్రమువంటిది.సముద్రమునకెట్లు అంతులేదో,అట్లే కామ మునకుగూడ సమాప్తిలేదు.

**శ్లో॥మనోరథానాంనసమాప్తిరస్తి,వర్షాయుతేనాపితథాబ్దలక్షైః।**

**పూర్ణేషుపూర్ణేషుమనోరథానాముత్పత్తయస్సన్తిపునర్నవానామ్॥** (విష్ణుపురాణము 4-2-116)

సౌభరిఋషి తనలోతాను ఈవిధముగా పరితాపమును జెందుచున్నాడు. ఎన్నివేల—లక్షలసంవత్సరములకైనను ఈమనోరథములకు(కోరికలకు)సమాప్తిగలుగదు(లేదు).కోరికలలో కొన్నిపూరింపబడినప్పటికి,వాటిస్థానంలో మరల క్రొత్తకోరికలు వచ్చిచేరుతాయి.(ఉత్పన్నమవుతాయి).నాపుత్రులు బాల్యమునందు తప్పటడులువేస్తూ,పడుచూ లేస్తూ,నడవడముచూచితిని.వారు యౌనావస్థకు చేరుకోగా వివాహము చేసితిని.మరియు వారికి సంతానముగూడ కలిగినది.అదియును చూచితిని.కాని,ఆ నా మనుమలకుగూడ పుత్రులు జన్మించుట నాకళ్ళతో చూడాలని నాచిత్తంలో కోరిక కలుగుచున్నది.ఒకవేళ వారి జన్మనుగూడ చూడగల్గిననూ,మరొక కోరిక ఉత్పన్నము కాగలదు.ఒకవేళ ఆకోర్కెయు తీరినప్పటికి మరొక కోరిక జనించుటను యెవరు ఆపగలరు? మృత్యుపర్యన్తముగూడ ఈమనోరథములకు అంతముండదు—అని నేనిప్పుడు ఈమనోరథముల స్వభావమును యథార్థముగా తెలిసికున్నాను. ఏచిత్తమున కామాసక్తియుండునో,అది పరమార్థసాధనలో సంలగ్నమగుటకవకాశముండదు.జలములో చక్కగా సమాధిని శీలించుచున్న నాకు మత్స్యము(చేప)లయొక్క సంగదోషఫలితముగా నాసమాధి భంగమాయెనుగదా! మత్స్యములసంగము(సహవాసము)వలన నేను విచలితమనస్కుడనై స్త్రీధనాదులను పరిగ్రహించితిని.ఆ పరిగ్రహదోషముచే నాలోని తృష్ణ మరింత ఉధృతమయ్యెను.ఒక్క శరీరమును గ్రహించుటయే మహా దుఃఖము.అట్లుండగా,ఈ రాజకన్యలను పరిగ్రహించుట కొఱకు నేను ఏబది శరీరములను ధరించితిని.అనేకమంది పుత్రులు గలుగుటచే నాలోని తృష్ణ ఇంకను అధికమాయెను.ఇంకా మున్ముందు పుత్రులకుపుత్రులు,వారికి పుత్రులు,మళ్ళీ వారికి పుత్రులు మరియు వారికి వివాహసంబంధాలు—ఇలా మనోరథములకు(ఆశ

లకు)అంతు కనుపించుటలేదు.కావున,మమకారమువల్ల కోరికలు,కోరికలవల్ల దుఃఖముల నిరన్తర ప్రవాహము కొనసాగుతూనే ఉంటుంది.జలాశయములో నేను యే తపస్సు చేసియుంటినో,దానియొక్క ఫలస్వరూపముగా,ఆతపస్సు కు ప్రతిబంధకము(విఘ్నము)గా ఈ ధనము,భార్యలు,పుత్రులు మున్నగు సంపత్తి ప్రాప్తించినది.మత్స్యముల సంగము(సహవాసము)వలన నాచిత్తమం దు యే పుత్రాదులయొక్కరాగము(ఆసక్తి)ఉద్భవించినదో,అదియే నన్ను మో సపుచ్చినిది.

**శ్లో॥నిస్సఙ్గతా ముక్తిపదం యతీనాం, సఙ్గాదశేషాః ప్రభవన్తి దోషాః।**

**ఆరూఢయోగోఽపినిపాత్యతేఽధస్సఙ్గేనయోగీ కిముతాల్పసిద్ధిః॥** (వి.పు.4-2-124)

నిస్సంగత్వమే ప్రయత్నశీలురగు యతులకు ముక్తిదాయకముగ నున్నది. సంగమువలన సకలదోషములుత్పన్నమగును.యోగములో(సాధనలో)పూర్ణ త్వము నొందిన యతి(సన్యాసి)గూడ సంగదోషమువలన పతనమై పోవుచు న్నాడు.ఇక అల్పసిద్ధిని పొందిన సామాన్యసాధకునిగూర్చి వేరుగచెప్పవలెనా?

**శ్లో॥విశ్వామిత్రపరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనా,**

**స్తేపి స్త్రీముఖపఙ్కజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః।**

**శాల్యన్నం సఘృతం పయోదధియుతం భుఞ్జన్తి యే మానవా,**

**స్తేషామింన్ద్రియనిగ్రహోయదిభవే ద్విన్ధ్యః ప్లవేత్సాగరే॥** (భర్తృహరి.శృం.శత-80)

పరమార్థసాధనలో తత్పరులై శరీరరక్షణకై నీటిని,ఎండిన ఆకులను మరి యు గాలిని మాత్రము ఉపయోగించి కఠోరతపస్సు చేయుచున్న పరాశరుడు,

విశ్వామిత్రుడు మున్నగువారు సత్యవతి,మేనక మొదలగు సుందరాంగుల ను జూచి మోహితులైరిగదా!ఇక నెయ్యిపాలతోగూడిన స్వాదిష్టమగు పరమా న్నమును భుజించు మానవులు యింద్రియ నిగ్రహము గల్గియుందురనినచో, వింధ్యపర్వతముగూడ ఒకచిన్నతెప్పవలె తేలియాడుచు సముద్రమును దా టగలదని చెప్పవలసివచ్చును.

కావున,కామము—ధనమునకు,వనితకు లేక పుత్రులకు మరియే యి తర విషయములకు సంబంధిచినదైనప్పటికిని—అది పరమార్థసాధనలో ప్రతి బంధక(విఘ్న)మేయగును.ఇది మహాపాపిష్టమైనది మరియు సకల ప్రాణుల కు పరమశత్రువు.

**"అథో ఖల్వాహుః కామమయ ఏవాయం పురుషః"**(బృ. 4-4-5)**"సోఽకామయత జాయా మేస్యాదథప్రజాయేయాథ విత్తంమేస్యాదథ కర్మ కుర్వీయ"**(బృ.1-4-17)

ఈపురుషుడు=జీవాత్మ,కామమయుడనిచెప్పబడును.అనగా,ఇది నాకు ప్రాప్తించినది మరియు యిదినాకు ప్రాప్తవ్యమున్నది(పొందదగియున్నది)—అని ఈప్రకారంగా విపరీత జ్ఞానయుక్తుడై కామమయుడు(అభిలాషగలవాడు) అగుచున్నాడు.సః=ఆజీవాత్మ దేహేన్ద్రియాది సంఘాతముతో తాదాత్మ్యాభి మానమునొంది స్త్రీమున్నగువాని సంబంధమునకు పూర్వముకర్తా,కర్మ,క్రియ మొదలగు అధ్యారోపరూప స్వాభావిక అవిద్యాజనిత వాసనాయుక్తుడై,నాకు కర్మాధికారమునకు హేతుభూత స్త్రీకావలెను.ప్రజారూపముచే నేను ఉత్పన్న మగుదును.నాకు కర్మసాధనరూప గోవులు,ధనము ఇత్యాదులు కావలెను. ఆపైన అభ్యుదయ, నిఃశ్రేయసమునకు సాధనరూప కర్మచేయుదును-అని యిట్లు కామన జేసెను.(కోరెను).

విషయాభిముఖ్యేన ఉదేతీత్యభ్యుదయో విషయాధీనం సుఖం స్వర్గాదికమ్ ; నిత్యం నిరపేక్షం శ్రేయో నిఃశ్రేయసం-మోక్షః.(రత్నప్రభ)

పైశ్రుత్యర్థమును విశదీకరిస్తున్న శ్రీగీతాచార్యుల వచనములు—

**శ్లో॥అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।**

**అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥**(గీత 3-36)

హేకృష్ణా! ఏప్రధానకారణముచే ప్రేరేపింపబడినవాడై ఈపురుషుడు తనకు ఇచ్ఛలేకపోయినను రాజుచేతనాజ్ఞాపించబడిన సైనికునివలె,బలవంతముగా ఆజ్ఞాపించబడినట్లుగా పాపకార్యములు జేయుటకు వివశుడగుచున్నాడు? అను అర్జునుని ప్రశ్నకు సమాధానముగా—

**శ్లో॥కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।**

**మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహవైరిణమ్॥**(గీత.3-37)

పురుషున్ని బలాత్కారముగా పాపకార్యములందు ప్రవృత్తున్ని జేయు బలవత్తరమగు గొప్పశత్రువు"**కామము**".దీని మూలముగానే ప్రాణులకు సకలానర్థములు ప్రాప్తమగుచున్నవి.యద్యపి,శత్రుమారణాది అనర్థమగు అభిచారకర్మలలో క్రోధముగూడ ప్రవర్తకమగుచున్నదిగదా?అని యనెదవేమో వినుము.క్రోధఏష ఇతి—హేఅర్జునా! విషయాభిలాషరూప యేకామముగలదో అది క్రోధముకంటె వేరుగాదు.ఒకానొక పురుషుడు ధనార్థియై ఒకధనవంతుని వద్దకు వెళ్ళినపుడు,మరొక దుర్మార్గుడు ఆధనికునికి ఏవోచాడీలుచెప్పి,ఆ ధనార్థిపురుషునికి ధనములభించకుండా జేసినచో,అపుడు ఆపురుషుని

ధనాభిలాషరూపకామము(కోరిక),ఆదుష్టపురుషునియందు క్రోధముగా పరిణతి నొందును.ఇది సర్వులకు అనుభవసిద్ధమేగదా!కావున,కామమే క్రోధముగామారును.ఆ కామరూప మహాశత్రువు నివృత్తమైనపుడే పురుషునకు సకలపురుషార్థములు సిద్ధించును.అయితే కామము సర్వథా త్యాజ్యముగాదు. మరేమనగా పరమపురుషార్థరూప మోక్షకామన,తదుపయోగి సాధనవిషయక కామన కలిగియుండుట దోషముగాదు.మోక్షమునకు ప్రతిబంధకమగు సాంసారిక విషయకామన ఉండరాదు.ఈ మహాశత్రువగు కామముయొక్క నివృత్త్యర్థము దాని మూలమును చెప్పుచున్నాడు—"**రజోగుణసముద్భవః**" కామము రజోగుణమునుండి ఉత్పన్నమగుచున్నది.కారణమగు తంతువుల (పోగుల)లోగల రంగు కార్యమగు వస్త్రములలోకి వచ్చినట్లు—దుఃఖ,ప్రవృత్తి, బలరూపరూప రజోగుణమువలె,కామము రజోగుణకార్యముగాన,ఈకామము గూడ దుఃఖప్రవృత్తిరూపమేయగును.ఎట్లు రజోగుణము కామమునకు కారణమో,అట్లే తమోగుణముగూడ కారణమున్నది. అయినను—దుఃఖమునందు,ప్రవృత్తియందు రజోగుణమునకే ప్రాధాన్యతగలదు,తమోగుణమునకు కాదు.అందుకే"రజోగుణసముద్భవః"అనిభగవంతుడుచెప్పెను.దీనిచే భగవంతుని అభిప్రాయము ఈవిధముగా నున్నదని స్పష్టమగుచున్నది.ఎట్లు?"**మూలేనాస్తికుతఃశాఖాః**"చెట్టుయొక్కవేర్లతోసహితముగా పెరికివేసినచో,ఇకకొమ్మలు మున్నగునవియు తీసివేయబడినట్లేగదా!అట్లే,కారణమగు రజోగుణము నివర్తింపబడినచో కార్యమగు కామము నివృత్తమగును.కావున,ప్రచురసాత్వికవృత్తియే రజోగుణ నివృత్తిద్వారా కామముయొక్క నివృత్తికి ఉపాయము.

కొంచెము వెనక్కి తిరిగి విచారించినచో—కామమే రజోగుణమునకు కారణము అనిగూడ భగవంతుని అభిప్రాయముగా తెలియబడుచున్నది.హేభగ

వన్!కామము ఏవిధముగా అనర్థరూప పాపప్రవృత్తికి హేతువగుచున్నది? అని అర్జునుడు అడిగన ప్రశ్నకు భగవంతుడు“**రజోగుణసముద్భవః**”అని స మాధానమిచ్చియున్నాడు.దుఃఖప్రవృత్తిరూప రజోగుణమునకు ఉత్పత్తిస్థాన ము యేదో,అది“ఏషకామః”కామము.తాత్పర్య మేమనగా,విషయాభిలాషరూప యే కామముగలదో,అది ప్రకటమై,పురుషునిలో విక్షేపము(చాంచల్యము)ను కలుగజేసి రజోగుణముద్వారా దుఃఖరూప కర్మలయందు ప్రవృత్తున్ని జేయు చున్నది.అందుచే అధికారి పురుషుడు ఈకామరూప మహాశత్రువును అవ

శ్యముగా నాశనము జేయవలెనని అభిప్రాయము.

శంక:—**శ్లో॥సామ దానం చ భేదశ్చ దణ్డశ్చేతి చతుష్టయమ్।**

**మాయోపేక్షేన్ద్రజాలం చ సప్తోపాయాః ప్రకీర్తితాః॥**(కామందకీయ నీతిసారము 18–3)

సామాదిచతుష్టయము అందరు ఆచార్యులకు అభీష్టమైయున్నది.మరికొం దరు మాయ,ఉపేక్ష మరియు ఇంద్రజాలము—అను మూడు ఉపాయముల నుగూడ చెప్పారు.ఇట్లు శత్రువును వశపరచుకొనుటకు ఏడు ఉపాయాలు చెప్పబడినవి.

హేభగవన్!ఈలోకంలో శత్రువును వశపరచుకొనుటకు సామ,దాన,భేద, దండోపాయములు శాస్త్రములో చెప్పబడినవి.మొదటి మూడు ఉపాయముల తో శత్రువు వశముగాకున్నచో,చివరకు దండోపాయమును ప్రయోగించవలెన ని విధానము జేయబడినది.కాని,మీరు కామరూప శత్రువును నాశనము చేయవలెనని,మొదటి మూడు ఉపాయములను స్వీకరించకుండానే అకస్మా త్తుగా దండోపాయమును గ్రహించవలెనని యాదేశించుట ఉచితముగా తోచుటలేదు?

అర్జునుని యీప్రశ్నకు జగద్గురువు సమాధానముచెప్తూ—కామరూప మహా శత్రువును జయించుటకు సామ,దాన,భేదోపాయములు సంభవించక పోవుట వల్లనే దండోపాయమును పరిగ్రహించవలసి వచ్చినదని కామమునకు"**మహా శనోమహాపాప్మా**"అను రెండు విశేషణములిచ్చి చెప్పియున్నాడు.మహాన్అశనః=గొప్పభోజనము-ఆహారముగలది-మహాభోగియనిఅర్థము.అనగా,ఎన్నిప్రకారముల గొప్పగొప్పభోగములు ప్రాప్తించినను ఎప్పుడుగూడ తృప్తిజెందనిదని భావము.

ఈవిషయంలో యయాతి మహారాజు తన అనుభవమును చెప్పుచూ,లోకమునకు ఇట్లు సందేశమును అందజేయుచున్నాడు.

**శ్లో॥నజాతు కామః కామానాముపభోగేన శామ్యతి।**

**హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్థతే॥**

**శ్లో॥యత్పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః।**

**ఏకస్యాపి నపర్యాప్తం తస్మాత్తృష్ణాం పరిత్యజేత్॥** (వి.పు. 4-10-23,24)

భోగవిషయక తృష్ణ(కామము)భోగములను అనుభవించుటచే ఉపశమించదు.తిరుగా ఘృత,కాష్ఠములసంబంధముచే(అగ్నిలోఆజ్యము=నెయ్యిపోసినచో) అగ్నిజ్వాలలు వృద్ధినొందినట్లు,భోగముల ననుభవించు కొలది మరింత రెట్టింపుగా కామము అధికమగుచుండును.

ఈపృథివిలో ఎంతధాన్యము,యవలు గలవో,సువర్ణము,పశువులు మరియు స్త్రీలుమున్నగు భోగములుగలవో,ఇవన్నియును ఒక్కపురుషున్నిగూడ తృప్తి

(సంతోష)పరచజాలవు.ఇక అల్పభోగములచే కామము శమించగలదా? కావున,వైషయికతృష్ణ=సాంసారికశబ్దాది విషయములకు సంబంధించిన కామము(కోరిక)ను సర్వదా,సర్వథా పరిత్యజించవలెను.

**శ్లో॥జీర్యన్తి జీర్యతః కేశా దన్తా జీర్యన్తి జీర్యతః।**

**ధనాశా జీవితాశా చ జీర్యతోఽపి నజీర్యతః॥**(వి.పు.4-10-27)

శరీరము జీర్ణించుచుండగా వెంట్రుకలు,దంతములు జీర్ణించుచుండును. కాని జీవితముపైని ఆశ మరియు ధనముపైని ఆశ మాత్రము శరీరము జీర్ణించినను(మరణమాసన్నమైనను) తరుణావస్థలోనే ఉండును.

**"తృష్ణా న జీర్ణా వయమేవ జీర్ణా""తృష్ణికా తరుణాయతే"**అని భర్తృహరిగూడ చెప్పాడు మరియు లోకంలో చూస్తున్నాముగూడ—అందువల్ల,

**శ్లో॥తస్మాదేతామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసమ్।**

**నిర్ద్వన్ద్వో నిర్మమో భూత్వా చరిష్యామి మృగైస్సహ॥**(వి.పు.4-10-29)

నేను యీ ఆశను(కామమును)వదలిపెట్టి,నాచిత్తమును భగవంతునియందు స్థిరపరచి—శీతము,ఉష్ణము,సుఖము,దుఃఖము,మానము,అవమానము ఇత్యాది ద్వంద్వధర్మములను మరియు నేను,నాది(నావి)యను అహంకార మమకారములను వదలి,వనములో మృగ,పక్షులతోపాటు సంచరిస్తూ,కందమూలములు భుజిస్తూ జీవితమును గడిపెదను.ఇది యయాతి మహారాజు యొక్క సందేశము.

అందువలన,బ్రహ్మలోకపర్యన్తముగల భోగములన్నియు ప్రాప్తించినను తృప్తి

జెందని మహాశనయు,మహాశత్రువునగు ఈకామము(తృష్ణ)సామ,దాన,భేదోపాయములచే వశముగాదుగాన మహాపాపిష్టమైన దీనిని ప్రయత్నపూర్వకంగా నాశనము చేయవలెను.మహాపాపియగు కామముచే ప్రేరితుడై పురుషుడు మహాఅనర్థ(దుఃఖ)రూప ఫలహేతువులని తెలిసిగూడ బలాత్కారముగా పాపకర్మలయందు ప్రవృత్తుడగుచున్నాడు.ఒకవేళ పురుషుడు పుణ్యకర్మలు చేసిననూ కామప్రేరితుడయ్యే చేయును.పుణ్యఫలరూప స్వర్గాది భోగములు గూడ క్షయశీలములేగాన పునర్జన్మకు హేతువులేయగుచున్నవి.

**శ్లో॥అకామస్య క్రియాకాచిద్దృశ్యతే నేహ కర్హచిత్।**

**యద్యద్ధి కురుతే(**జన్తుః**)కించిత్తత్తత్కామస్య చేష్టితమ్॥** (మ.స్మృ.2-4)

సంసారములో యెవరుగూడ కామన(ఇచ్ఛ)లేకుండా యే క్రియనుగూడ చేయుట అగుపడుటలేదు.ప్రాణులు యేయే క్రియలు జేయుచున్నారో, ఆయా క్రియలు కామచేష్టితములే.కావున,పురుషునికి కర్మలయందు వివశునిజేసి ప్రవృత్తున్నిజేయు ప్రవర్తకుడు కామముకంటె వేరొకడులేడు.అందుకే దీనిని మహాశత్రువుగా నెఱుగుము.ఈప్రకారంగా కామహతుడగు అంతఃకరణ విశిష్ట జీవుని(భోక్త)యందు కామమూలకమగు దోషమును దర్శించి వైరాగ్యము నొందవలయును.

ఉపరోక్తరీతిగా1.భోగవిషయకదోషదర్శనము,2.భోగ్యవిషయకదోషదర్శనము మరియు3.భోక్తృవిషయకదోషదర్శనము—ఈదోషదర్శనత్రయ పూర్వకముగా ఉత్పన్నమైన దృఢవైరాగ్యము శమాద్యుత్తర సాధనలను కలుగజేసి,వాటిద్వారా బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమునకు కారణమగును.

అట్లే, ఒకసారి యోగదర్శనమువైపుగూడ దృష్టిని సారించినచో సాధకుల కు చాలాఉపయుక్తముగా ఉంటుంది.వైరాగ్యము రెండు విధములుగా నున్న ది.1.అపరవైరాగ్యము,2.పరవైరాగ్యము. పరవైరాగ్యమునుగూర్చి ముందుసూ త్రము (1-16)ద్వారా చెప్పబడును.ఇప్పుడు అపరవైరాగ్యముచెప్పబడుతోంది. **"దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్యవశీకార సజ్ఞా వైరాగ్యమ్"**(యో.సూ.1-15)దృష్టము =స్త్రీ,అన్న,పాన,ఐశ్వర్యము(ఆధిపత్యము లేక సంపత్తి)మున్నగు ఐహిక(భో గ్య)విషయములందు;ఆను శ్రవికములు=శ్రూయత ఇతి అనుశ్రవోవేదః।వేద బోధితములగు స్వర్గాదివిషయములందు;వితృష్ణ=విరక్తి,నిఃస్పృహ లేదా చిత్త ముయొక్క ఉదాసీనస్థితికి వశీకారసంజ్ఞా అనబడు "అపరవైరాగ్యము" అందురు.

ఈ వశీకారవైరాగ్యము అకస్మాత్తుగా కాకుండా క్రమముగా కలుగును. ఎట్లనగా,1.యతమానము,2.వ్యతిరేకము,3.ఏకేంద్రియము.ఈ మూడు అవస్థ లు దాటితే వశీకారవైరాగ్యము సిద్ధించును.1."శబ్దాదివిషయము లందు శ్రోత్రా ది ఇంద్రియములను ప్రవృత్తము కానివ్వను"అను సంకల్పముతో ఇంద్రియ ములను అరికట్టే ప్రయత్నము చేయుట**"యతమాన"** మనబడును.ఈయత మాన వైరాగ్యము కొంతమేరకు సిద్ధించిన మీదట కొన్నికొన్ని విషయముల నుండి రాగము(ఆసక్తి)నివర్తించును.మరికొన్ని విషయములనుండి రాగము నివర్తించుచుండును(క్షీణించుచుండును).

2.నకులవేలి అనుమూలికను ఆశ్రయించి సర్పముతో యుద్ధము చేయు నకులము(ముంగిస)వలె,సాధకుడు సత్సంగము నాశ్రయించి దుర్గుణముల ను త్యాగము చేయుటయందు,సద్గుణములను సంపాదించుటయందు ఉత్సా హమును చూపుట**"వ్యతిరేక"**మనబడును.అనగా,తన మనోగత దోషములలో

నభ్యాసవివేకముచేత యెన్ని పరిపక్వమైనవి,ఇకయెన్ని మిగిలియున్న వి—అని పునఃపునః విచారించుట "వ్యతిరేక" వైరాగ్యమందురు.

3.అభ్యాసవశముచే నీవ్యతిరేకమును సాధించినపిమ్మట సకలేంద్రియములు సమస్త బాహ్యావిషయములనుండి సమ్యక్ప్రకారముగా నివృత్తమై,మనస్సు లో మాత్రము విషయాలకు సంబంధించిన ఉత్సాహము(అనురాగము)అవశిష్టమైయుండుటను"**ఏకేంద్రియము**"అంటారు.అనగా కేవలము మనోరూప ఒకే ఇంద్రియమునందు నిలిచిఉంటాడు,కావున,ఏకేంద్రియ మనబడును.ఇట్లు,పై మూడు వైరాగ్యములు పరిపక్వమైన మీదట వశీకారసంజ్ఞావైరాగ్యము సిద్ధించును.దీనికి ఉదాహరణము—

**"వికారహేతౌసతివిక్రియన్తేయేషాంనచేతాంసి,తఏవధీరాః"।**

మహాకవికాళిదాసుగారు"కుమారసంభవము"లో (1-59)తపోనిష్ఠాగరిష్ఠుడగు పరమశివుని శుశ్రూషలు(సేవలు)జేయుటకు పార్వతీదేవి వచ్చి ప్రార్థించినది. స్త్రీలయొక్క సాన్నిధ్యము—పూజ,పఠనము,తపస్సు మరియు సమాధి ఇత్యాది పరమార్థసాధనలలో అవశ్యముగా ఎంతోకొంత విఘ్నములనే కలిగించును. కాని,ఇది సాధారణ జనుల విషయము.శివునికి వర్తించదు.స్త్రీలసాహచర్యము విఘ్నమని తెలిసిగూడ,పరమశివుడు పార్వతీదేవియొక్క ప్రార్థనను స్వీకరించెను.సేవజేయుటకు ఆజ్ఞాపించెను.వాస్తవమేమనగా"**మనస్సులో వికారమును కలిగించు మనోహరమైన,ఆకర్షణీయమగు బలవత్తరవిషయములు తనయెదుట ఉపస్థితమైనప్పటికిని యేమహాత్ముల చిత్తము చలించదో,వారే నిజముగా ధీరపురుషులనబడుదురు**".అందుకే,పరమశివుడు అత్యంత రూపలావణ్యముచే అపురూపసౌందర్యవతియగు పార్వతీదేవిని కాదనక,సేవజేయుటకు అనుమతించెను.

యతమానము,వ్యతిరేకము మరియుఏకేంద్రియము—ఈమూడింటియందు ఇహలోక,పరలోకవిషయక కామన ప్రవిష్టమై(అంతర్గతమై)ఉండును.కావున, అవి జ్ఞానమునకు ప్రతిబంధకములని తెలియవలెను.వశీకారవైరాగ్యమునం దు ఐహికపారలౌకిక కామనరూప ప్రతిబంధకముయొక్క అభావముండును. అందువలన,అది జ్ఞానసాధనమగుటచే జిజ్ఞాసువుచే నవశ్యముగా సంపాద నీయమున్నది.

**శ్లో॥దోషదృష్టిర్జిహాసా చ పునర్భోగేష్వదీనతా।**

**అసాధారణహేత్వాద్యా వైరాగ్యస్య త్రయోఽప్యమీ॥**(వే.పం.6-278)

1.జన్మమరణములచే,జరావ్యాధులచేగలుగు దుఃఖమును పునఃపునః పరా మర్శించుట,శాస్త్రమును మరియు అనుభవమును ఆధారముగా జేసుకొని శబ్దాదివిషయములలోని దోషమును పదేపదే దర్శించుట “దోషదృష్టి”అనబడు ను.ఈదోషదృష్టిచే పుణ్యశీలుడగు వివేకిపురుషునికి తీవ్రవైరాగ్యము మరియు మోక్షేచ్ఛగలిగి,వాటిని సాధించుటకు ప్రవృత్తు డగును.ఈప్రకారంగా“దోషదృష్టి” వైరాగ్యమునకు హేతువ(కారణమ)గుచున్నది.

2.జిహాసా=త్యాగేచ్ఛ లేక విషయాలయందు ఇచ్ఛ(కోరిక)లేకుండుట—ఇది వైరాగ్యముయొక్క స్వరూపము.

3.స్వప్రయత్నములేకుండా,ప్రారబ్ధవశమున ప్రాప్తించిన ధనాదివిషయము లను బుద్ధిపూర్వకంగా గ్రహించకుండుట—అదీనత యనబడును.

ఇదియే వైరాగ్యముయొక్క ఫలము(అవధి).

ఈవిధముగా,విషయాలయందలి దోషదృష్టి,వాటియొక్క త్యాగేచ్ఛ మరియు భోగములపట్ల అదీనత—ఈమూడు క్రమముగా వైరాగ్యముయొక్క అసాధార

ణకారణము,స్వరూపము మరియు ఫలము(అవధి)అనితెలియవలెను. అలమితి విస్తృత వైరాగ్యవిచారేణ.

సాధనచతుష్టయములో వైరాగ్యము తరువాత శమాదిషట్కమునుగూర్చి యథామతిగా తెలుసికొందము.శమముఆదిగాగల షట్కము=ఆరింటియొక్క సముదాయము.1.శమము,2.దమము,3.ఉపరతి,4.తితీక్షా,5.శ్రద్ధ మరియు6. సమాధానము. వీటికి శమాదిషట్కము అంటారు. అందులో మొదటిది—

**—:34.శమము:—**

**శ్లో॥ఏకవృత్త్యైవ మనసః స్వలక్ష్యే నియతస్థితిః ।**

**శమ ఇత్యుచ్యతే సద్భిః శమలక్షణవేదిభిః ॥** (స.వే.సి.సా.సం. 96)

శబ్దాది విషయములు ఆది అంతములు గలవి,బహువిత్తవ్యయ-ఆ యాస సాధ్యములు,పరిణామశీలములు మరియు సారహీనములు-అని విష యాలలోని దోషములను పునః పునః దర్శించు పురుషునికి నియమముచే వైరాగ్యము కలుగును.అనగా,దోషదర్శనము వైరాగ్యమునకు హేతువు(కారణ ము).ఇట్లు వైరాగ్యము సిద్ధించిన మీదట మనస్సును(అంతరింద్రియమును) స్వలక్ష్యమగు సగుణబ్రహ్మమునందుగాని,నిర్గుణబ్రహ్మమునందుగాని నిశ్చల ముగా,నిర్వికారముగా నియమముచే ప్రతిష్ఠింపజేయుట **శమము**-అని శమ లక్షణము నెఱింగిన విద్వత్పురుషులచే చెప్పబడుచున్నది.

“**శ్రవణాదివ్యతిరిక్త విషయేభ్యో మనసో నిగ్రహః-శమః**”(వేదాన్త సారము)

శ్రవణ,మనన,నిధిధ్యాసలు తప్ప మిగతా సమస్త విషయములనుండి మన స్సును(అంతఃకరణమును)మరలింపజేయుటయే-**శమము**అనబడును.విషయ

ములనుండి మనస్సును నిగ్రహించుట అనగా బలాత్కారముగా ఆకర్షించుట యే శమమన్నచో,శ్రవణాది విషయములనుండిగూడ నిగ్రహించుట ప్రాప్తించు ను.అపుడు,జ్ఞానము కలుగుట సంభవింపక పోవుటవలన అనిర్మోక్షప్రసంగ మేర్పడును.మరియు అనుభవవిరోధము,శ్రుతివిరోధముగూడ సంప్రాప్తించును.

**“శ్రోతవ్యో,మన్తవ్యో,నిధిధ్యా సితవ్యః”**(బృ.2-4-5)

**శ్లో॥శ్రవణం తు గురోఃపూర్వం, మననం తదనన్తరమ్।**

**నిధిధ్యాసనమిత్యేతత్పూర్ణ బోధస్య కారణమ్॥**(శుకరహస్యోపనిషత్)

**శ్లో॥శ్రోతవ్యో శుతివాక్యేభ్యః మన్తవ్యశ్చోపపత్తిభిః।**

**మత్వా చ సతతం ధ్యేయః ఏతే దర్శన హేతవః॥**(వివరణప్రమేయ సంగ్రహః ప్రథమవర్ణకమ్)

వేదాన్తవాక్యములను శ్రుతిషడ్లింగ సహితముగా శ్రీగురుదేవుని ముఖార విందముద్వారా శ్రవణముచేసి,తరువాత భేదబాధకఅభేదసాధక యుక్తులచే అద్వితీయ బ్రహ్మముయొక్క చింతనరూప మననముచేసి,ఆపైన అనాత్మాకా రవృత్తులయొక్క నిరాకరణపూర్వకముగా వ్యవధానరహిత బ్రహ్మాకారవృత్తుల ప్రవాహరూపస్థితియగు నిదిధ్యాసనము గావించినచో పూర్ణబోధ(అప్రతిబద్ధదృ ఢ అపరోక్ష బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము) ప్రాప్తించును.తద్వారా నిత్యప్రాప్తకైవల్య ముక్తి లభించును.అనగా,శ్రవణాదులు జ్ఞానోత్పత్తిద్వారా మోక్షమునకు హేతు వులగుచున్నవి.అందుకే,శ్రుతిమాత ముముక్షువునకు శ్రవణాదులను కర్తవ్య ముగా బోధించినది.ఈకారణమువల్లనే శ్రీసదానన్దయోగీన్ద్రులవారు **శ్రవణాదివ్య తిరిక్త విషయములనుండి మనస్సును మరలించుటకు“శమము”అని చెప్పా రు.** అభిప్రాయమేమనగా—

తీవ్రముగా ఆకలి గలిగినపుడు భోజనముకంటె అన్యమగు వ్యాపారములు ఏమియును రుచింపవు మరియు భోజనమునందు విలంబము(ఆలస్యము -జాగు)గూడ సహింపబడదు.అట్లే,ఎప్పుడైతే స్రక్చందనవనితాది విషయము లందు అత్యంత అరుచి(హేయబుద్ధి)మరియు తత్త్వజ్ఞానసాధనములగు శ్రవ ణాదులందు అత్యంత రుచి(ఆసక్తి)పూర్వక[పూర్వవాసనాబలముచే శ్రవణా ది సాధనములను వదలేసి స్రక్చందనాది విషయములందు పరుగిడుచున్న యే మనస్సు గలదో,అది]యే అంతఃకరణవృత్తివిశేషముచే ప్రయత్నపూర్వక ముగానిగ్రహింపబడునో,ఆ వృత్తివిశేషమునకు"శమము"అంటారు.(వే.సా.సుబోధినీ టీక)

పూజ్యపాదులు జగద్గురు ఆద్యశంకరాచార్యులవారు,సర్వవేదాన్త సిద్ధాన్తసా రసంగ్రహములో (96 నుండి 128 వరకు)శమ నిరూపణావసరమున ఈక్రిందివిధ ముగా సెలవిచ్చారు.ఉత్తమ,మధ్యమ,అధమ భేదముచే శమము మూడువిధ ములుగా నుండునని,శమలక్షణము నెఱింగిన పండితులచే చెప్పబడినది.మ నస్సు,ప్రాపంచికవిషయములకు సంబంధించిన సంకల్పవికల్పాది వృత్తులను వదలి బ్రహ్మాకారవృత్తితోగూడుకొని యుండుటయే ఉత్తమశాన్తి(శమము)అన బడును. ఇట్టి అవస్థలో జీవబ్రహ్మల భేదము స్ఫురించదు.

మనస్సులోని రజోగుణ,తమోగుణములు నశించినపిమ్మట బ్రహ్మాకారమ నోవృత్తిని నిరన్తరమనుసంధానముజేయుట మధ్యమ శాన్తియనబడును.

మనస్సును విషయాలయందు పరుగిడనీయక,సద్గురువుల సాన్నిధ్యము లో వేదాన్తార్థములను విచారించుచుండుట అధమ శాన్తియనబ డును.ఇట్టిస్థి తిలో చిత్తము రజస్తమోగుణములచే కదాచిత్ సంబంధము గల్గియుండును.

శమము సిద్ధించుటకు పూర్వోత్తరాంగములు సంపూర్ణముగానుండవల యును.శమమునకు,దృఢవైరాగ్యము పూర్వాంగము.దమము,ఉపరతి,తితీక్ష, శ్రద్ధ,సమాధానము అనునవి ఉత్తరాంగములు.

ఎవనిచే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు-అను నీ యరిషడ్వర్గము జయింపబడదో,వానికి శాన్తి(శమము)సిద్ధించదు.మోక్షము ను గోరు యే సన్యాసి,శబ్దాది విషయములను విషమువలె తలంచి,వాటి నుండి తన మనస్సును మరల్చుకొనడో,అట్టివానికి శాన్తి దుర్లభము.ఎవడు పరమేశ్వరుని త్రికరణశుద్ధితో పూజింపడో,గురుశుశ్రూషచే వారియనుగ్రహము నకు పాత్రుడుకాడో,తన మనస్సును స్వాధీన పరచుకొనడో,అట్టివానికి శాన్తి లభింపనేరదు.ఇప్పుడు,ఏసాధనముల నవలంబించినచో మనస్సు శుద్ధిపడు నో,ఆసాధనములను చెప్తున్నాము.పండితులు సావధానముగా వినవలయును.

**శ్లో॥బ్రహ్మ చర్య మహింసా చ దయా భూతేష్వవక్రతా ।**

**విషయేష్వతి వైతృష్ణ్యం శౌచం దంభ విసర్జనమ్ ॥**

**శ్లో॥సత్యం నిర్మమతా స్థైర్యం అభిమానం విసర్జనమ్ ।**

**ఈశ్వరధ్యానపరతా బ్రహ్మ విద్భిస్సహస్థితిః ॥**

**శ్లో॥జ్ఞానశాస్త్రైకపరతా సమతా సుఖదుఃఖయోః ।**

**మానాఽనాసక్తి రేకాన్తశీలతా చ ముముక్షుతా ॥**

**శ్లో॥యస్త్యైతద్విద్యతే సర్వం తస్యచిత్తం ప్రసీదతి ।**

**నత్వేతద్ధర్మశూన్యస్య ప్రకారాన్తరకోటిభిః॥** (106 నుండి 109)

1.బ్రహ్మచర్యము,2.ప్రాణులను హింసింపకుండుట,3.సకల భూతములందు (ప్రాణులందు)దయ గల్గియుండుట,4.కపటము లేకుండుట,5.విషయములందు వైరాగ్యము,6.మనోదేహముల పరిశుద్ధి,7.డంభము(బడాయి)లేకుండుట, 8.సత్యముపలుకుట,9.మమకారము లేకుండుట,10.స్థైర్యం,11.అభిమానము లేకుండుట,12.ఈశ్వరధ్యానము,13.బ్రహ్మవేత్తలతో సహవాసము,14.మోక్షశాస్త్రమునందే ఆసక్తి గల్గియుండుట,15.సుఖదుఃఖములందు వికారమునొందకుండుట,16.ఇతరులనుండి గౌరవమును గోరకుండుట,17.ఏకాన్త ప్రదేశముననివసించుట,18.నిత్యము నిత్యమగు మోక్షమును గోరుచుండుట-అను నీ ధర్మములను యెవడు గల్గియుండునో,అట్టివాని చిత్తము అత్యన్త నిర్మలముగా నుండును.పై పదునెనిమిదితత్త్వములు ఈదిగువ క్రమముగా స్పష్టము చేయబడుచున్నవి.

**శ్లో॥దర్శనం స్పర్శనం కేలిః కీర్తనం గుహ్యాభాషణమ్।**

**సఙ్కల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తిరేవచ॥**

**ఏతన్మైథునమష్టాఙ్గం ప్రవదన్తి మనీషిణః।**

**విపరీతం బ్రహ్మ చర్యమనుష్ఠేయం ముముక్షుభిః॥**(కఠరుద్రోపనిషత్.6&7)

1.మైథునమనగా స్త్రీపురుషసంబన్ధము.ఇది యెనిమిది విధములు.స్త్రీలను వికారభావముతోచూచుట,తాకుట,వారితో క్రీడించుట,వారి గుణకర్మలను కీర్తించుట,చాటుగా(ఒంటరిగా)మాటాడుట,వారితో రమించవలయునని సంకల్పము జేయుట,నిశ్చయించుకొనుట మరియు వారితో సంగము జేయుట-ఇవి అష్టవిధ మైథునములని మనస్సును జయించిన(జితేన్ద్రియులగు)పండితులు చె

ప్పుచున్నారు.ఇట్టి మైథునము లేకుండుటయే బ్రహ్మచర్యము.దీనిచే చిత్తము పరిశుద్ధమగును.

2.మనోవాక్కాయముల మూడింటిచేతను,ఏ ప్రాణిని బాధింపకుండుటయే అహింస యనబడును

**శ్లో॥ శ్రూతాం ధర్మ సర్వస్వం శ్రుత్వా చైవావధార్యతామ్।**

**ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్॥**(పద్మపురాణము సృష్టిఖండము 19-357&358)

ధర్మముయొక్క స్వరూపమేమిటో వినండి.మరియు విని,దానిని హృదయములో దించుకొని నిత్యజీవితంలో ఆచరించండి.ఏమనగా,నీ కు(ఆత్మకు=మనస్సుకు)యేది ప్రతికూలము(దుఃఖదాయకము)గా దోచునో,దానిని యితరులపట్ల ఆచరించకుము.

3.తన శరీరమువలె సర్వప్రాణులను త్రికరణములచే కృపతో జూచుటయే దయ యనబడును.

**"దుఃఖితేష్వనుకమ్పా దయా"**దీనులు,దుఃఖితులయందు రక్షాభిముఖీ బుద్ధి లేదా అనుగ్రహమును జూపుట(కరుణ గల్గియుండుట)దయ యనబడు ను.ఈ విషయంలో మాచే రచింపబడిన "శ్రీభక్తతుకారాం అభంగవాణి"అను గ్రంథమున 219 వ పృష్ఠము నుండి గనందగును.

4.మనస్సునందు,వాక్కునందు,శరీరమునందును ఒకే విధముగా నుండుట అవక్రత(కపటరాహిత్యము)యగును.అనగా,మనస్సుచే నాలోచింపబడిన విషయమునే వాక్కుచే పలుకుతూ శరీరముచే నాచరిం పవలయునని

భావము.

**శ్లో ॥ బ్రహ్మాది స్థావరాన్తేషు వైరాగ్యం విషయేష్వను ।**

**యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్॥**

(స.వే.సి.సా.సం.114)(అపరోక్షానుభూతి-4)

5.కాకిరెట్టను(మలమును)జూచి అసహ్యపడునట్లుగా,బ్రహ్మలోకపర్యన్తముగల సకలలోకవిషయములందునువిరక్తినొందుటయే—తీవ్ర వైరాగ్యమనబడును.

6.శౌచము:—**శ్లో॥బాహ్యమాభ్యన్తరం చేతి ద్వివిధం శౌచముచ్యతే।**

**మృజ్జలాభ్యాం కృతం శౌచం బాహ్యం శారీరకం స్మృతమ్॥**

**శ్లో॥అజ్ఞాన దూరీకరణం మానసం శౌచమాన్తరమ్।**

**అన్తః శౌచే కృతే సమ్యక్ బాహ్యం నావశ్యకం నృణామ్॥**

బాహ్యము,ఆభ్యన్తరము అని శౌచము రెండు విధములు.అందు మృత్తికచేతను,జలముచేతను స్థూలశరీరమును పరిశుభ్రముగా నుంచుట బాహ్యాశౌచము.మనస్సునందలి దుష్టసంకల్పములను వదిలి,అజ్ఞానకార్యములగు దేహేంద్రియాదులందుగల యభిమానమును పరిత్యజించి,మనస్సును నిర్మలముగా నుంచుకొనుట ఆభ్యన్తరశౌచము.ఈ రెంటిలో ఆభ్యన్తరశౌచము ముఖ్యము.

7.లోకములో కొందరు ప్రతిష్టాప్రాప్తికై పరమార్థ చింతన లేకయే, ఇతరులు చూచునపుడుమాత్రము సంధ్యావందనము,దేవతార్చనము మున్నగు సత్కార్యముల నాచరించుచుందురు.ఇట్టివారు దంభాచారులనబడుచున్నారు.

వీరికి భిన్నులు అదాంభికులు.అనగా,దైవభక్తితో యథాశక్తిగా తమ వర్ణాశ్ర

మ విహితధర్మములను నిరాడంబరముగా నాచరించువారు.దీనికి దంభ విసర్జనము అంటారు.

8.తాను కంటితో దేనిని చక్కగాచూచునో,చెవులతో ఆప్తవాక్యములవలన దేనిని జాగ్రత్తగా వినునో,దానినే యితరులకు చెప్పుటయు, మరియు బ్రహ్మ మొక్కటే సత్యమని పరులకు బోధించుటను సత్యమందురు.సత్యమునుగూర్చి విశేషముగా తెలియగోరువారు "శ్రీభక్తతుకారాం అభంగవాణి" పృష్ఠము 194 నుండి చూడగలరు.

9.దేహేంద్రియాదులందును,భార్యాపుత్రాదులందును మమకారమును పరిత్యజించుటయే నిర్మమతయగును.దీనిచే మోక్షము అనాయాస సాధ్యమగును.

**"మమేతి బధ్యతేజన్తుః నిర్మమేతివిముచ్యతే"**(మహో.4-72)

10.గురు,వేదాన్తవాక్యములచే గ్రంథమున పూర్వోత్తరసమన్వయ పూర్వకముగా నిర్ణయింపబడిన విషయమునందుమనస్సును నిశ్చలముగా నిలుపుటయే స్థైర్యము.కాని,శరీరమును కదలింపకుండుట స్థైర్యము గాదు.

11.పాండిత్యము,ధనము,సౌన్దర్యము మున్నగు వానిచేగలుగు గర్వమును పరిత్యజించుట-అభిమాన విసర్జన మనబడును.

**శ్లో॥అభిమానం సురాపానం, గౌరవం రౌరవస్తథా।**

**ప్రతిష్ఠా శూకరీ విష్టా త్రీణి త్యక్త్వా సుఖీ భవేత్॥**(లోకోక్తి)

అభిమానముజెందుట మదిరాపానముతో సమానము.నన్ను ఇతరులు గౌరవించాలి-అని కోరుట నరకతుల్యము.తన ప్రతిష్ఠనపేక్షించుట పందిమల

మును సంగ్రహించుటతో సమానమగును.కావున,ఈమూడింటిని పరిత్యజించి సుఖముగా నుండవలెను.

12.మనోవాక్కాయములచే సమస్తలౌకికకర్మలను పరిత్యాగముజేసి నిరన్త రము స్వస్వరూపమును విచారించుచుండుటను ఈశ్వరధ్యానమందురు.

**శ్లో॥మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ।**

**స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే॥**(వి.చూ. 32)

స్వస్వరూపానుసంధానమనగా నిదిధ్యాసనము.ఇదియే సాక్షాత్కారమునకు ప్రత్యక్షసాధనము.“**స ఆత్మాతత్త్వమసి**”(ఛాం.6-8-7)“**నీస్వరూపము బ్రహ్మమే, నీవు ఆ బ్రహ్మమే**”అను శ్రుతివాక్యముచేతను,ఆచార్యోపదేశముచేతను శ్రవణ ము చేసిన విషయమునే అనుసంధానము చేసికోవాలి.విజాతీయ ప్రత్యయ ములచే తిరస్కరింపబడని(ఇతర అనాత్మాకార ఆలోచనలచే అడ్డుకొనబడని) సజాతీయ ప్రత్యయప్రవాహము(తైలధారవలె స్వరూపాకార అవిచ్ఛిన్న జ్ఞాన రూప వృత్తులు కలుగుట)ఇదియే అనుసంధానమనబడును.ఇది సాక్షాత్కార మునకు అసాధారణ కారణము.శమాదులైతే—శ్రవణాదులద్వారా జ్ఞానమును కలిగించి మోక్షమునకు కారణములగును.కావున,మోక్షమును కలిగించు జ్ఞా నసాధనములలో స్వస్వరూపానుసంధానరూప భక్తి చాలా శ్రేష్ఠమైనది.

13.నీడవలె బ్రహ్మవిదుల నెడబాయకుండుటయే బ్రహ్మవిత్సహవా సమగును.

14.ఏపురుషుడు,ఉపనిషత్తులలోచెప్పబడిన పరబ్రహ్మతత్త్వమునకు సంబం ధించిన శ్రవణమననాదులనే నిరన్తరమభ్యసించుచు,భేద దృష్టిచేనాచరింపబడు కర్మలందు ప్రవర్తింపకున్నాడో,అతడే జ్ఞాననిష్ఠగల వాడగుచున్నాడు.

15.ధనము,స్త్రీ మరియు వ్యాధి మున్నగునవి ప్రాప్తించినపుడు,అంతఃకరణమునందు ఏవిధమైన హర్షశోకరూపవికారములు కలుగకుండుటయే సుఖదుఃఖసమత్వమనబడును.

16.లోకంలోజనులు తన్ను అనేకప్రకారములుగా గొప్పవానినిగా దలచి గౌరవించుదురుగాక-యను నాసక్తిలేకుండుట మానాఽనాసక్తి యనబడును.

17.జనసంఘములో అనాత్మ సంబధమైన లోకవిషయములే గోచరించుచుండునుగాన ఆత్మచింతనకు ప్రతిబంధకము కలుగుచుండును.కావున, జనసంగమునువదలి ఒంటరిగానుండుటయే యేకాన్తశీలతయగును.

18.**శ్లో॥సంసారబంధ నిర్ముక్తిః కదా ఝటితి మే భవేత్ ।**

**ఇతి యా సుదృఢా బుద్ధిరీరితా సా ముముక్షుతా॥**128.

కాలుచున్న గృహమునుండి తన ప్రాణములను రక్షించుకొనవలెనను తీవ్రతపనచే యెంతవేగిరముగ బయటకుదుముకునో,అట్లు,పలుదుఃఖసంకులమగు సంసారమునుండి యే నిమిషమున బయటపడుదునాయను ఆవేదనగలవాడు ముముక్షువు.వాని ప్రవృత్తి ముముక్షుత యగును.ఈ ప్రకారముగా శమము సిద్ధించుటకు పూర్వోత్తరాంగములు సంపూర్ణముగా నుండవలయునని శ్రీపూజ్యపాదులగు ఆద్య శంకరాచార్యులవారు చెప్పియున్నారు.

సంసారబంధనమునుండి విముక్తినిగోరు ముముక్షువునకు సాంసారికవిషయములనుండి,సకలానర్ధములకు మూలమగు తన మనస్సును నిగ్రహించుట అవశ్యకర్తవ్యమై యున్నది."**తచ్చాత్మన ఉపాధిభూత మన్తఃకరణం మనో బుద్ధిర్విజ్ఞానం చిత్తమితి చానేకధా తత్ర తత్రాభిలప్యతే**"(బ్రహ్మసూత్ర భాష్యము

2-3-32).ఆత్మకు ఉపాధిభూతమగు అంతఃకరణము భిన్నభిన్న స్థలములలో మనస్సు,బుద్ధి,విజ్ఞానము మరియు చిత్తము-అని అనేక ప్రకారములుగా చెప్పబడుచున్నది.

**శ్లో॥ మనోబుద్ధిరహఙ్కారశ్చిత్తం కర్మాథ కల్పనా।**

**సంస్మృతిర్వాసనా విద్యా ప్రయత్నః స్మృతిరేవ చ॥**

**ఇన్ద్రియం ప్రకృతిర్మాయా క్రియా చేతీతరా అపి।**(యో.వా.ఉత్పత్తి ప్ర. 96-13&14)

మనస్సు,బుద్ధి,అహంకారము,చిత్తము,కర్మ,కల్పనా,సంస్మృతి,వాసన,విద్య, ప్రయత్నము,స్మృతి,ఇంద్రియము,ప్రకృతి,మాయ,క్రియ—యింకా అనేకపర్యాయ శబ్దములచే మనస్సే పిలువబడుచున్నది. మరియు,ఈ చిత్తమే(మనస్సే)సంసార బంధమునకు మరియు సంసారము నుండి విముక్తికిని కారణమగుచున్నది.

**శ్లో॥మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః।**

**బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్॥**(వే.పం.11-117)

(మైత్రాయణ్యుపనిషత్ 4-11)

మనుష్యులకు తమ మనస్సే బంధమునకును,మోక్షమునకును కారణమగుచున్నది.ఎప్పుడు మనస్సు విషయములందాసక్తమగునో,అప్పుడది బంధమునకు కారణమవుతుంది.ఎప్పుడు విషయములనుండి విముఖమై నిర్విషయమగునో,అప్పుడు అదే మనస్సు ముక్తికి హేతువగుచున్నది.

**శ్లో॥ మనో హి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధమేవ చ।**

**అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితమ్॥**(వే.పం.11-116) (మైత్రా.4-6)

అశుద్ధము మరియు శుద్ధము అని మనస్సు రెండు విధములు.కోరికల ను సంకల్పించునది అశుద్ధమనబడును.కామనలను పరిత్యజించి సంకల్పర హితమైన మనస్సు శుద్ధమనబడును.

**“చిత్తనదీ నామ ఉభయతో వాహినీ,వహితి కల్యాణాయ,వహతి పాపాయ చ”**(యోగసూత్రభాష్యము 1-12).చిత్తము అను పేరుగల నది ఇరువైపుల ప్రవహి స్తుంది.1.పూర్వ జన్మలలో సాంసారిక విషయభోగముల కొఱకు చేయబడిన కర్మల సంస్కారము చిత్తములో స్థిరపడి ఉంటుంది.ఆ సంస్కారము వర్తమా నజన్మలో సాదృశ్యము, సంబంధము, చింతన అను నిమిత్తములచేగాని లేక స్వాభావికముగాగాని ఉద్భూతమై,చిత్తములో  పునః వైషయికవృత్తుల ప్రవా హము బయలుదేరి పురుషున్ని బలాత్కారముగా సంసారసాగరములో ముంచుతుంది.2.ఎవరైతే పూర్వజన్మలలో కైవల్యార్థము సాధనలుచేసియు న్నారో,వారికి యీజన్మలో పూర్వసంస్కారముల కారణముచే చిత్తవృత్తుల ప్ర వాహము వివేకమార్గముగుండా ప్రవహించి పురుషున్ని కల్యాణ(కైవల్య)సాగ రములో కలుపుతుంది.కావున,సంసారసాగరము వైపుకు వెల్లుచున్న వృత్తు ల ప్రవాహమును నిరోధించుటకు అభ్యాస,వైరాగ్యములు సాధనములుగా చెప్పబడినవి.అందుకే పరమకారుణికీ సర్వలోకహితైషిణీయగు ఉపనిషన్మాత ఇట్లుపదేశించుచున్నది.

**శ్లో॥చిత్తమేవ హి సంసారస్తత్ప్రయత్నేన శోధయేత్।**

**యచ్చిత్తస్తన్మయో భవతిగుహ్యమేతత్సనాతనమ్॥**(వే.పం.11-113)(మైత్రాయణ్యు. 4-3)

ఎంతవరకు అజ్ఞానముచే జ్ఞానమావరింపబడియుండునో,అంతవరకు చిత్త ము అనన్త సృష్టిపరంపరారూప ప్రవాహమును కొనసాగించుచుండును.అం

దువలన చిత్తమే సంసారము.వ్యుత్థాన(విక్షేప)అవస్థయందు బహిర్ముఖచిత్తము యేయే విషయాకారమునొందునో,పురుషుడుగూడ తత్తదాకారమునొందును.వృత్తిసారూప్యమితరత్ర(యో.సూ.1-4).కావున,వేదాన్త శ్రవణాదులచే మహత్ప్రయత్నముతో బ్రహ్మవ్యతిరిక్త చిత్తమనునది అత్యంతాభావమున్నది—అని శోధించవలెను.అనగా నిశ్చయముగా నిర్మూలించవలెను.ఎప్పుడు చిత్తము సమూలముగా నశించునో,అప్పుడు పురుషుడు తన్మయుడు(బ్రహ్మరూపుడు) అగును. ఇదియే అతి గోప్యమగు సనాతన పరమసిద్ధాన్తము. .

**శ్లో॥పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి।**

**అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్॥**

**అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్ ।**

**జన్తోశ్చిత్తం తు శిశువత్తస్మాత్తచ్చాలయేద్బలాత్ ॥**

**సమతా సాంత్వనేనాశు న ద్రాగితి శనైః శనైః।**

**పౌరుషేణ ప్రయత్నేన లాలయే (పాలయే)చ్చిత్తబాలకమ్ ॥**

(ముక్తికోపనిషత్ 2-6,7)(యో.వా.ముముక్షు.ప్ర.9-30 నుండి 33)

1.సన్మార్గము మరియు ఉన్మార్గము(అసన్మార్గము)లగుండా ప్రవహించు వాసనామయచిత్తనదిని,పురుష ప్రయత్నముచే అశుభమార్గమునుండి మరలించి శుభమార్గములో ప్రవేశపెట్టాలి.అశుభకర్మలనుండి(పాపమార్గమునుండి)నివారింపబడిన మనుష్యుని చిత్తము పసిబాలకునివలె పుణ్యమార్గమును అనుసరించును.కావున,ఈ చిత్తబాలకుణ్ణి రాగాదిదోషములనుండి విశ్లేషణము(వియుక్తము)జేసి నిరోధరూప పురుషప్రయత్నముచే స్వాభావికసమత్వ

మునందు స్థాపించి,దోషరహితముగావించి(పాపమార్గమునుండి తొలగించి),హ ఠముచేగాకుండా మెల్లమెల్లగా(పిల్లవాడిని బుజ్జగించిమంచిదారిలోపెట్టునట్లు), అభ్యాసక్రమముచే ఆత్మస్వరూపమునందు నెలకొల్పవలెను.

**శ్లో॥అహో ను చఞ్చలమిదం ప్రత్యాహృతమపి స్ఫుటమ్।**

**ఘటాత్పటముపాయాతి పటా చ్ఛకటముత్కటమ్।**

**చిత్తమర్థేషు చరతి పాదపేష్వివమర్కటః॥**(అ.పూ.3-6) (యో.వా.ఉపశమ. ప్ర. 82-15)

ఎట్లు మర్కటము(కోతి)ఒక వృక్షమునుండి మరొక వృక్షముపైకి,మరి యు ఆ వృక్షమునుండి ఇంకొక వృక్షముపైకి,ఇట్లు ఒకదాని నుండి మరొక దానిపైకి దుముకుతూ వెళ్తుంది.ఒకచోట స్థిరముగానుం డదు.అట్లే,చిత్తమర్క టముగూడ ఘటము(కుండ)నుండి పటము(వస్త్రము)పైకి,వస్త్రమునుండిఉత్క టశకటము(బండి)పైకి,ఇట్లు అనేక అర్థము(విషయము)లపైకి పరుగులుతీ స్తూ ఉంటుంది.స్థిరముగానుండదు.అహో!ఈచిత్తముయొక్క చాంచల్యమేమని వర్ణించను.జలతరంగములచే కొనిపోబడు పర్ణము(ఆకు)నకు ఎట్లు స్థిరత ఉండదో,అట్లు ఈచిత్తము(మనస్సు)క్షణకాలమైనను ఒక నిశ్చితవిషయము నందు నిలిపినను నిలకడ గల్గియుండదు గదా,యేమిటి యీ ఆశ్చర్యము?

**శ్లో॥మర్కటస్యసురాపానం తతో వృశ్చికదంశనమ్।**

**తన్మధ్యే భూతసంచారో యద్వా తద్వా భవిష్యతి॥**(చలోక్తి)

**శ్లో॥కపిరపి చ కాపిశాయన మదమత్తో వృశ్చికేన సందష్టః।**

**అపి చ పిశాచగ్రస్తః కిం బ్రూమస్తస్య వైచిత్ర్యమ్॥**(వ్యాసాశ్రమము వారి శ్రీ మద్భగవద్గీత 6-34 వ్యాఖ్యలో)

(రెండు శ్లోకములకు ఏకాన్వయము)ఒకానొక కోతి కల్లు ద్రాగినది.అంతలో నే దానిని ఒక తేలు కుట్టినది.ఆపై దానికి ఒక భూతము (పిశాచి,దయ్యము) ఆవహించింది.ఇట్టి పరిస్థితిలో ఆకోతిచే యే అరిష్టము జరుగదు? ఏమియును మిగలదు.అట్లే చిత్తముయొక్క పరిస్థితియని తెలియవలెను.అనగా,మదమనెడి మద్యముచేతను,అసూయయనెడి తేలుకాటుచేతను,అహంకారమనెడి దయ్యముచేతనుగూడిన యీమనస్సుకు బ్రహ్మముయొక్క చింతన,ధ్యానము కుదురదు. విషతుల్యములగు శబ్దాది విషయాలలో అటునిటు గంతులుపేయుచు, శాన్తిని బడయక సంసారరూప మహా అనర్థమును కొనితెచ్చుకొనును.

**శ్లో॥ దృశ్యాత్యన్తాసంభవేన ఋతే నాన్యేన హేతునా।**

**మనః పిశాచః ప్రశమం యాతి కల్పశతైరపి॥**(యో.వా.స్థితి ప్ర.4-7)

దృశ్యముయొక్క అత్యంత అసంభవము(మిథ్యాత్వనిశ్చయము)కలుగకుండా,వేరే యేఉపాయముచేగూడ,ఒక కల్పమునకు కాదుగదా వందల కల్పములకైనను మనోరూప పిశాచముయొక్క వినాశము కాజాలదు.

**శ్లో ॥ అహో చిత్తం కథం భ్రాన్తః ప్రధావసి పిశాచవత్ ।**

**అభిన్నం పశ్య చాత్మానం రాగత్యాగాత్సుఖీ భవ॥**(అవధూత గీత-18)

అహో=ఎంత విషాదకరమైన విషయము;ఏమే,ఓ చిత్తమా!ఎప్పుడైతే నీవు వ్యాపకమగు ప్రత్యగభిన్నబ్రహ్మాకారమును పొందెదవో,అప్పుడు నీవు బ్రహ్మమున విలీనమగుదువు.ఎప్పుడైతే నీవు ఆ అవస్థనువదలి,చంచలమై బహిర్ముఖముగా ప్రవృత్తమగుదువో,అప్పుడు ఆత్మను నీకంటె భిన్నముగాతలంచి వనములలో,పర్వతములలో ఆత్మదేవుని వెదుకుతూ తిరుగుతూ ఉంటా

వు. మరియు తీర్థక్షేత్రములలో ఇక్కడఅక్కడ వ్యర్థముగా సమయము వ్యతీతము చేయుచుందువు.ఈప్రకారంగా మార్గమునువదలి వనములలో,పర్వతములలో,తీర్థములలో,ఎదురైన రాళ్ళకురప్పలకు తలబాదుకుంటూ పిశాచమువలె వ్యర్థముగా భ్రమజెంది యెందుకు పరిభ్రమించెదవు?ఆత్మ సర్వజ్ఞుడు,సర్వవ్యాపకుడు గదా !

**శ్లో॥సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్।**

**ఏతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః॥**(మనుస్మృతి 4-160)

ఎంతవరకు పరాధీనముగా బహిర్ముఖమై విషయాలలో సంచరించెదవో, అంతవరకూ దుఃఖమేగాని సుఖమించకయును లేదు.కాని,యెప్పుడు బాహ్యవిషయాలు మరియు వాటికి సంబంధించిన కోరికలనుగూడ వదిలేసి,అంతర్ముఖమై ఆత్మ(స్వరూపము)యందు స్థిరపడెదవో,అప్పుడే నిరతిశయ సుఖానుభూతి నొందెదవు.ఇదియే సంక్షేపముగా సుఖదుఃఖముల లక్షణమని యెఱుంగుము.

కావున,ఓ చిత్తమా!విషయకామనచే బహిర్ముఖమై శబ్దాదివిషయాలయందుగాని,ఆత్మదేవుని వోందగోరి దారిదప్పి ఆత్మవిముఖమై నది,పర్వత,వన, క్షేత్రాలలోగాని పిశాచమువలె పరిభ్రమించక,రాగమునువదలి,భ్రూమధ్యమున కేంద్రితమై కూటస్థబ్రహ్మమునందు నిశ్చలముగా స్థిరపడి స్థితప్రజ్ఞావస్థను వొందుము.అనంతసుఖమునొందెదవు.(అని వెనకటి అవధూతగీత శ్లోకముతో అన్వయించుకోవాలి).

**శ్లో॥ఇతశ్చేతశ్చ సువ్యగ్రం వ్యర్థమేవాభిధావతి।**

**మనో దూరతరం యాతి గ్రామే కౌలేయకో యథా॥**(మహోపనిషత్ 3-18)

(యో.వా.వైరాగ్య ప్ర.16-2)

ఏవిధంగా,గ్రామకౌలేయకము(ఊరకుక్క)ఉదరపూర్తికోసం వ్యగ్రచిత్తముతో గ్రామములో దూరదూరప్రదేశాలలో తిరుగుతుంది.అట్లే,విషయవాసనలతో దూషిత చిత్తముగల వ్యక్తి అత్యన్త వ్యాకులముతో యుక్తాయక్త విచారములేక,అభీష్టపూర్తికై ఇక్కడఅక్కడ వ్యర్థముగా పరిభ్రమించి,అభిలషిత వస్తువును పొందలేక దీనుడును,హీనుడును అగుచున్నాడు.

**శ్లో॥చిత్త చారణ ! చార్వాక ! చతుర్దిక్కుక్షిభిక్షుక !**

**శ్వేవ వ్యర్థమనర్థాయ మైవం విహర హే జగత్॥**(యో.వా.5-82-26)

శ్రీవాల్మీకిమహర్షులవారు చిత్తమును గద్దించి మేల్కొలుపుచున్నారు.ఇంద్రియములయొక్క బహిర్ముఖ ప్రచారమునకు కారణమగు నో(చిత్త)చారణ! దేహమునందాత్మాభిమానమును గలుగజేయునో(చిత్త)చార్వాక!ఉదరభరణముకోసం నలుదెసలందు భిక్షమడుగుకొనే ఓ (చిత్త)బిచ్చగాడా!అనర్థముకొఱకు ఈజగత్తులో కుక్క వలె వ్యర్థముగా సంచరింపకుము.

**శ్లో॥అహఙ్కారః ప్రభుః సభ్యా విషయా నర్తకీ మతిః।**

**తాళాదిధారీణ్యక్షాణి దీపః సాక్ష్యవభాసకః॥**(వేదాన్తపఞ్చదశి 10-14)

శ్రీవిద్యారణ్యగురుదేవులు శ్రోతాపురుషుని బుద్ధియందు సుకరముగా ఆత్మావబోధగలుగుటకొఱకు నాటకదృష్టాన్తముచే రూపకమును ప్రదర్శించుచున్నారు.విషయోపభోగ సాకల్యవైకల్య(సఫలతా విఫలతా)అభిమానప్రయుక్త హర్షవిషాదములు గలవాడైనందున,నృత్యాభిమాని ప్రభువుస్థానంలో అహంకారమును

(జీవుణ్ణి)తెలిసికోవాలి.సమీపంలో వున్నప్పటికిని ప్రభువునకువలె అభిమాన ములేనందున శబ్దాదివిషయాలను సభ్యపురుషులస్థానంలోను,శృంగారాది నవ రసములలో నృత్యముచేస్తూ అనేక వికారాలనుబొందు నర్తకిస్థానంలో బుద్ధిని, నర్తకియొక్క నృత్యమునకనుకూలముగా మృదంగాది మేళతాళాలను వాయిం చు వాద్యకులస్థానంలో యింద్రియములను తెలిసికోవాలి.మరియు ఈసమస్త మును నిర్వికారమై ప్రకాశించు దీపస్థానంలో సాక్షిని తెలిసికోవాలి. ఇట్లు బుద్ధిని నర్తకిగా రూపకముచే చెప్పడమైనది.

**శ్లో॥అప్యబ్ధిపానాన్మహతః సుమేరూన్మూలనాదపి।**

**అపి వహ్న్యశనాద్బ్రహ్మన్విషమశ్చిత్తనిగ్రహః॥**

**చిత్తం కారణమర్థానాం తస్మిన్సతి జగత్త్రయమ్।**

**తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః ॥**

(మహోపనిషత్ 3-20,21)(యో.వా.వైరాగ్య ప్ర. 16-24,25)(వే.పం. 7-121)

హే బ్రహ్మన్!విశాలమైన సముద్రపానము చేయవచ్చును.అగస్త్యఋషి సప్తసముద్రములను పానము చేయగలిగెను.సుమేరు పర్వతమును సమూ లంగా పెకలించవచ్చును.ఆంజనేయుడు సంజీవని గుటికను పర్వతముతో సహా పెల్లగించుకొని తెచ్చాడు.అలవిగాని అనలమును(అగ్నిని)భక్షించవచ్చు ను.శ్రీకృష్ణుడుఅగ్నిని(దావానలమును)భక్షించెను.అనగా,సముద్రమును త్రాగు ట,పర్వతమును పెకలించుట,అగ్నినిభక్షించుట మున్నగు దుస్సాధ్యములగు కార్యములనుగూడ ప్రయత్నముచే సాధించవచ్చునేమోగాని,చిత్తమును నిగ్ర హించుట వాటికంటెను కష్టతరము.సంపూర్ణ పదార్థములన్నిటికి చిత్తమే కార ణము.చిత్తముయొక్క అస్తిత్వములోనే మూడులోకములకు అస్తిత్వము సి

ద్ధించుచున్నది.చిత్తముక్షీణించినచో ముల్లోకములునశించును.కావున హేము ని!చికిత్సచేత రోగమును ఎట్లు త్యజింతురో,అట్లు జ్ఞానౌషదముచే చిత్తమును అవశ్యముగా పరిత్యజించవలెను.

**శ్లో॥న హి చంచలతా హీనం మనః క్వచన దృశ్యతే।**

**చంచలత్వం మనోధర్మో వహ్నేర్ధర్మో యథోష్టతా॥**(మహోపనిషత్ 4-99)

చాంచల్యములేని మనస్సు ఎవరియందును కనుపించదు.ఎందు కనగా, వాయువునకు చలనము,అగ్నికి ఉష్ణత ఎట్లు స్వాభావికధర్మమో,అట్లే మన స్సునకు చంచలత్వము స్వాభావికధర్మము.

**శ్లో॥చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాథి బలవదృఢమ్।**

**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥**(గీత.6-34)

హే కృష్ణ!ఈమనస్సు అత్యంత చలనస్వభావముగలది.ఒక్క క్షణకాలము గూడ స్థిరముగనుండదు.ఇది సర్వలోకప్రసిద్ధము.హే భగవాన్!ఈమనస్సు కే వలము చంచలమేకాదు.ప్రమాథియును అయియున్నది.శరీరము,ఇంద్రియ ములను క్షోభించు(విచలితముజేయు)నదైయున్నది.అందుకే శరీరేంద్రియము లు వివశమై బాహ్యవిషయములందు ప్రవృత్తములగుచున్నవి.హేకృష్ణ!ఈ మనస్సు కేవలము చంచలము మరియు ప్రమాథియే గాక బలవంతమైనది గూడ ఉంది.ఎందుకనగా!తనకభిలషిత విషయమునుండి యే ఉపాయముచే తను నివర్తింప జేయుటకు అశక్యమైనది.లోకంలో యేపురుషుడైనా తనకభీ ప్సిత కార్యమునందు ప్రవృత్తుడైనపుడు,అతనిని ఎవరుగూడ ఆకార్యము నుండి నివర్తించుటకు సమర్థులుకారు.మరియు అనేకజన్మలలోని దృఢవా

సనా వైవశ్యముచే విషయాలలో ప్రవృత్తమైన మనస్సును భేదించుటకు అశ క్యమైయున్నది.అందుకే యీమనస్సు చాలాదృఢమైనది.ఇచ్చట అర్జునులవారు మనస్సునకు చంచలము,ప్రమాథి,బలవంతమైనది ధృఢమైనదని నాలుగు విశేషణములిచ్చాడు.పూర్వపూర్వ విశేషణములకు ఉత్తరోత్తర విశేషణములుహేతువులు(కారణములు)గానున్నవనితెలిసికోవాలి.ఎట్లనగా,యీమనస్సు అత్యంత దృఢమైనదిగావున బలవంతమైనది,బలవంతమైనదిగావున ప్రమాథియును,ప్రమాథియైనందున అత్యంత చంచలమైయున్నది.అందుకే,ఓకృష్ణ!ఈ మనస్సును నిగ్రహించుటకు అనగా,సర్వవృత్తిరహితమొనర్చుటకు,సర్వప్రకారములచే నిరోధించుటకు వాయువుకంటెను దుష్కరముగా తలంచుచున్నాను.ఎట్లు ఆకాశమునసంచరించు వాయువును నిశ్చలముగా నిలుపుట అశక్యమో,అట్లే మనస్సుయొక్క నైశ్చల్యమును సాధించుట అనగా దానిని నిరోధించుట అత్యంతకష్టము.ఈవిషయంలో-"**అప్యబ్ధిపానాన్మహతః**"అను శాస్త్రప్రమాణమునుగూడ ఇప్పుడే(ఇంతకుపూర్వము)తెలికుంటూవచ్చాము.(తిరిగిచూడగలరు).ఈభగవద్గీత శ్లోకములో"**కృష్ణ**"అని సంభోధించుటలో అభిప్రాయము ఇలా ఉంది—"**దోషాన్ కృషతి నివారయతీతి కృష్ణః।అథవా పురుషార్థానాకర్షతి ప్రాపయతీతి కృష్ణః॥**కృష్=విలేఖనే,అనగా కృష్ ధాతువుయొక్క అర్థము విలేఖనము అనగా నివారించుట లేక ఆకర్షించుట.భక్తులయొక్క పాపాదిదోషాలను నివర్తింపజేయును,నిరోధించును,దూరముజేయును లేదా నాశనముజేయును.అందువల్ల భగవంతున్ని కృష్ణుడుఅంటారు.లేక,భక్తజనులకు దుష్ప్రాపములగు పురుషార్థములను ప్రాప్తముజేయును.ఇందువలనగూడ భగవంతున్నికృష్ణుడు అంటారు.కావున,నిగ్రహించుటకు శక్యముగాని,అతిచంచల మనస్సును నిగ్రహింపజేసి,నాకు సమాధిసుఖమును ప్రాప్తము జేయువాడ

వు—అని అర్జునుడు“కృష్ణ”అని సంభోధించుటలో అభిప్రాయము గలదు. (మధుసూదని)

**శ్లో॥మనోనామ మహావ్యాఘ్రో విషయారణ్యభూమిషు।**

**చరత్యత్ర న గచ్ఛన్తు సాధవో యే ముముక్షవః॥**(వి.చూ.178)

**“విషయాంస్తేషు గోచరాన్”**(కఠ.3-3)శబ్దాదివిషయములు—ఇంద్రియములు సంచరించు మార్గములు-అని శ్రుతిచే చెప్పబడినందున విషయములే అరణ్యభూములు.వాటియందు మనస్సు అనుపేరుగల గొప్ప వ్యాఘ్రము(పెద్దపులి)సంచరించుచున్నది.**“పరాఞ్చిఖాని”**(కఠ.4-1)ఇంద్రియములను బహిర్ముఖములుగ సృజించెను-అను శ్రుతిననుసరించి,జలము స్వభావముచే పల్లము వైపుకు ప్రవహించునట్లు,మనస్సునకు విషయములపై ఆసక్తి స్వాభావికము. అందువల్ల“**బంధాయవిషయాసక్తమ్**”(మైత్రా.4-11)అను శ్రుతిననుసరించి జీవునకు మనోమూలమున గొప్ప అనర్థము గలుగును. ఈ విషయము—

**శ్లో॥సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే।**

**క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతి విభ్రమః॥**

**స్మృతిభ్రంశాద్బుద్ధినాశః బుద్ధినాశా త్ప్రణశ్యతి॥**(గీత. 2-62,63)

అని శ్రీమద్భగవద్గీతలో చెప్పబడినది గదా!ఆ కారణము వలన,యే సత్పురుషులు మోక్షేచ్ఛగలవారున్నారో,వారు ఈ విషయారణ్యభూములందు వెళ్ళకుందురుగాక.మోక్షముకొఱకై,విషయములనుండి మనస్సును మరల్చుకొందురుగాక-అనిఅభిప్రాయము.“**కశ్చిద్ధీరఃప్రత్యగాత్మానమైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్**”(కఠ.4-1)మోక్షమునుగోరు ఒకానొక ధీరుడు—వెనుకకు మరల్చబడిన

దృష్టిగలవాడై ప్రత్యగాత్మను చూచెను—అని శ్రుతి చెప్పుచున్నదిగదా.

**శ్లో|| ఏషా హ్యవిద్యా కథితా మాయైషా సా నిగద్యతే|**

**పరమేతత్తదజ్ఞానం సంసారాది విషప్రదమ్||**(యో.వా ఉపశమ ప్ర.13-89)

ఓరామచంద్రా!ఈమనస్సే కార్యావిద్యయనియు,మాయాశక్తి యనియు మరియు సంసారరూపవిషమును ప్రదానముజేయు అజ్ఞానమనిగూడ వ్యవహరింపబడుచున్నది.అట్లే వివేకచూడామణి 171 శ్లోకంలో

**శ్లో॥నహ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా,మనో హ్యవిద్యా భవబన్ధహేతుః ।**

**తస్మిన్వినష్టే సకలం వినష్టం, విజృమ్భితేఽస్మిన్సకలం విజృమ్భతే॥**

మనస్సుకంటె వేరుగా అవిద్యయనునది లేదుగదా(ఇది నిశ్చితము).ఎందుకనగా,సంసారబంధమునకు హేతువగు అవిద్య మనస్సే.

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః|**(మైత్రా.4-11)

జగత్తునకుపాదానకారణము మనస్సు కాకపోయినను,జగత్తుయొక్క భోగ్యభోగత్వములకుమనస్సే(చిత్తమే)కారణము.ఎట్లన,సుషుప్త్యాదులందు చిత్తము విలయముకాగా నచట భోగము కనుపించుటలేదు.జాగ్రదాదులందు చిత్తము విలయము కాకపోవుటచే నచట భోగము కనబడుచుచున్నది.ఈవిషయంలో సర్వజనానుభవమే ప్రమాణము.కావున,మనస్సునష్టమైనదగుచుండగా సమస్తము(జగత్తు)వినష్టమగుచున్నది.మనస్సు విజృమ్భించగా సకలం విజృమ్భించుచున్నది.సుషుప్తిలో కారణావిద్య ఉన్నను బంధము లేదు.జాగ్రదాదులలో కారణావిద్యయొక్క కార్యమగుమనస్సు వున్నది.కావున,దేహాద్యభిమానరూపబంధమున్నది.ఈఅన్వయవ్యతిరేకములచే మనస్సే అవిద్యయని చెప్పు

టలో యిచ్చట తాత్పర్యమున్నది.

ఇంతకు పూర్వము మనము తెలిసికుంటూ వచ్చిన ప్రకారముగా,శాస్త్రములో మనస్సును(చిత్తమును)చిత్తనదియని,చిత్తబాలకుడని,చిత్తమర్కటమని(కోతియని),చిత్తపిశాచమని,గ్రామకౌలేయకమని(కుక్కయని)బిచ్చగాడని,నర్తకియనియు మరియు మనోవ్యాఘ్రమని(పెద్దపులియని)మనస్సేఅవిద్యయనియు ఇంకను యెన్నోవిధములుగ వర్ణించనైనది.మనస్సు అత్యంత చంచలము,దేహాదిక బంధమును ప్రాప్తముజేయునది,సకలానర్థములకు హేతువు, దుర్నిగ్రహము అని బోధించుటయే శాస్త్రముయొక్క ముఖ్యతాత్పర్యముగా తెలియవలెను.అయ్యయ్యో!శాస్త్రము ఇన్నితీరుల నిందించిననూ యీమనస్సునకు యించుకైనను సిగ్గురాకున్నది గదా!చూచితిరా యీ మనస్సుయొక్క దౌష్ట్యము(దుష్టత్వము)ను?అందువల్ల,సకలానర్థహేతువగు నీ మనస్సును ప్రయత్నపూర్వకముగానిగ్రహించుట ముముక్షువునకు పరమావశ్యకమైయున్నది.ఇది సరేగాని,అత్యంత చంచలము, దుర్నిగ్రహమునగు నీ మనస్సును ఎలా నిరోధించేది? అని దిగులు జెందవలదు. దానికి ఉపాయమును శాస్త్రమే నిర్దేశించుచున్నది.అదెట్లనగా, చూడండి—యోగేశ్వరుడైన శ్రీకృష్ణపరమాత్మయే సకలముముక్షుజనోద్ధారణార్థము మనోజయోపాయములనుపదేశించెను.

**శ్లో॥అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।**

**అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥**(గీత.6-35)

**శ్లో॥అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।**

**వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః॥**(గీత 6-36)

ఓశ్రీకృష్ణమూర్తీ!మనస్సు మిక్కిలి చపలస్వభావముగలది.దేహేన్ద్రియము లను అధికముగా క్షోభపెట్టునది.మరియు యెవనిచేతను నిరోధింప సాధ్యము గానిది.కావున,అట్టిమనస్సును నిగ్రహించుట వాయువును నిరోధించుట యెట్లు శక్యముగాదో,అలాగున శక్యముగాదని నేను తలంచుచున్నాను.(గీత.6-34లో) అర్జునుడు చేసిన యీప్రశ్నకు సమాధానముగా భగవంతుడు చెప్తున్నాడు—

హే మహాబాహో!ఈమనస్సు దుర్నిగ్రహము మరియు చంచలమున్నదను విషయంలో సందేహము లేదు.అయినను,ఓ కౌన్తేయ! దానిని అభ్యాసవైరా గ్యములచే నిగ్రహించవచ్చును.మనోనిగ్రహములేని వానిచే యీయోగము పొం దబడజాలదు.మఱేమనగా,మాటిమాటికి యెడతెగక ప్రయత్నించుచు అభ్యా సవైరాగ్యములతో గూడిన మనోనిగ్రహమనునట్టి యుపాయమువలన యోగ ము పొందనగునని నా యభిప్రాయము.

హే మహాబాహో! నీయొక్క మనఃస్థితిని నేను చక్కగా యెఱిగితిని.నీవు నీ మనస్సును నిగ్రహించుటకు సమర్థుడవున్నావు.**"మహాన్తౌ సాక్షాన్మహాదేవే నాపి సహకృతప్రహరణౌబాహూ యస్య స,తత్సమ్బుద్ధౌ హే మహాబాహో!"**అ నగా,మహాన్=సాక్షాత్ మహాదేవునితోగూడ యుద్ధముచేయగల బాహువులు (చేతులు)యెవరికి గలవో,అతడు మహాబా హుడు(అర్జునుడు).అర్జునుని యొక్క నిరతియ ఉత్కర్షను సూచించుటకొఱకే భగవంతుడు"**మహాబాహో**"అని సంబోధించుటలో నభిప్రాయమున్నది.

మహర్షివేదవ్యాసులవారి పరామర్శ(సలహా)ప్రకారము,మహాదేవుని(శివుని) ద్వారా పాశుపతాస్త్రమును సంపాదించుటకొఱకు అర్జునుడు ఇంద్రనీలపర్వ తముపై కఠోరతపస్సుచేసెను.దేవకన్యలుగూడ అతని తపస్సును భంగముచే

యజాలకపోయిరి.చివరకు కిరాతవేషధారియగు మహాదేవునితో యుద్ధముజేసి, అర్జునుడు తన బాహబలమును మరియు సాహసమును ప్రదర్శింపగా, శివుడు ప్రసన్నుడై"**పాశుపతము**" అనుపేరుగల దివ్యాస్త్రమును ప్రసాదించెను. అప్పటినుండి అర్జునుడు "**మహాబాహుడు**" అని పిలువబడెను.

అసంయతాత్మ=అనియంత్రితాత్మ,అనగా ఇంద్రియములను జయింప జాలని పురుషునికి,ప్రారబ్ధకర్మ ప్రబలమున్నందున—ఈమనస్సు దుర్నిగ్రహము.అన గా,దుఃఖము(కష్టము)చేతగూడ నిగ్రహించుటకు అశక్యమున్నది."**ప్రమాథిబల వద్దృఢమ్**"ప్రమాథి,బలవాన్ మరియు దృఢము అనునీ మూడు విశేషణము లను ఏకముజేసి దుర్నిగ్రహము అని చెప్పబడినది.అనగా,యీమూడు విశే షణములు"**దుర్నిగ్రహము**"లో అంతర్భూతములైయున్నవి.చలము=మనస్సు స్వభావముచే చంచలమున్నదని చెప్పుటలో సందేహము లేదు.కావున నీవు సత్యమునే పలుకుచుంటివి. అయినప్పటికిని,

సంయతాత్మ=జితేన్ద్రియుడగు సమాధిమాత్రము ఉపాయముగల యోగి ద్వారా అభ్యాసవైరాగ్యములచే యీమనస్సు నిగ్రహింపబడును.అనగా వృత్తి శూన్యముజేయబడును.అసంయతాత్మ=అజితేన్ద్రియునికంటె,సంయతాత్మ=జి తేన్ద్రియ పురుషునియొక్క విశిష్టతను తెలుపుటకొఱకు"**తు**"శబ్దము ప్రయో గింపబడినది.మనోనిగ్రహమునందు అభ్యాసము మరియు వైరాగ్యము—యీ రెంటియొక్క సముచ్చయమును(సముదాయమును లేక సహఅనుష్ఠానము ను)శ్లోకములోని"చ"కారముచే సూచించడమైనది.భగవంతుడు అర్జునుని "**హే కౌన్తేయ**"అని సంబోధిస్తూ"**పితృశ్వసృపుత్రస్త్వమ్**"నీవు మా మేనత్త కొడుకువు గావున, అవశ్యముగా నేను నీకు సుఖమును చేకూర్చవలెను—అని యిట్లు

స్నేహసంబంధమును సూచిస్తూ,అర్జునునికి ఆశ్వాసనమునిచ్చుచున్నాడు. లేక,

దుర్వాసముని అత్యంత వైరాగ్యసంపన్నుడు మరియు క్రోధియును ఉండెను.అతనిని యెవరునుగూడ పరిచర్యలచే ప్రసన్నుని జేసుకొని వశపర చుకొనజాలకుండిరి.ఎంతగొప్ప చక్రవర్తులుగూడ దుర్వాసమునిని తమ అంతః పురములోనికి ఆహ్వానించి సేవజేయలేక పోయిరి.అటువంటి క్రోధియైన మునీశ్వరునిగూడ,మీతల్లి(మాకుమేనత్త)యగు కున్తీదేవి నిష్కపటభావము చే,శ్రద్ధాభక్తులచే పరిచర్యలు(సేవలు)చేసి ప్రసన్నునిజేసుకొనెను.నీవు, అంతటి కౌశల్యముగల కున్తీపుత్రుడవు.కావున,మీతల్లివలెనే నీవుగూడ దృఢప్రయత్న ముచే,నేను చెప్పబోవు ఉపాయముద్వారా దుర్నిగ్రహమగు మనస్సును,అవ శ్యముగా వశపరచుకొనగలవు—అను విషయమును అర్జునునికి స్మరింపజే యుటకొఱకే,శ్రీకృష్ణుడు "**కౌన్తేయ**" అని సంబోధించెను.

శ్లోకముయొక్క పూర్వార్థముచే,చిత్తము హఠపూర్వముగా నిగ్రహింప బడ జాలదనియు,ఉత్తరార్ధముచే క్రమపూర్వకముగా నిగ్రహింపబడగలదనియు వ్య క్తీకరింపబడుచున్నది.మనోనిగ్రహము హఠముచే మరియు క్రమముచే రెండు విధములుగా గలుగుతుంది.అందులో,శ్రోత్రాది జ్ఞానేంద్రియములు మరియు వాగాదికర్మేంద్రియములు వాటివాటి గోళకములను(అభివ్యఞ్జకస్థానములను) నిరోధించినచో నవి హఠపూర్వకముగా వశమగునట్లు,మనస్సునుగూడ(అట్లే) హఠపూర్వకముగా వశపరచుకొనెదము—అనియిట్లు మూఢపురుషులకు భ్రా న్తి గలుగుతుంది.కాని,మనోనిగ్రహము అట్లుకాజాలదు.ఎందుకనగా,మనస్సు యొక్క గోళకమగు హృదయకమలమును నిరోధించుట అశక్యము.కావున, మనస్సును క్రమపూర్వకముగానే నిగ్రహించుట సముచితము.

ఈ విషయమునే శ్రీవసిష్ఠ భగవానులుగూడ చెప్పియుండిరి.

**శ్లో॥ఉపవిశ్యోపవిశ్యైక చిత్తజ్ఞేన ముహుర్ముహుః।**

**న శక్యతే మనోజేతుం వినా యుక్తిమనిన్దితామ్॥**

**శ్లో॥అఙ్కుశేన వినామత్తో యథా దుష్టమతఙ్గజః।**

**అధ్యాత్మవిద్యాధిగమః సాధుసఙ్గమ ఏవ చ॥**

**శ్లో॥వాసనా సంపరిత్యాగః ప్రాణస్పన్దనిరోధనమ్।**

**ఏతాస్తా యుక్తయః పుష్టాః సన్తి చిత్తజయే కిల॥**

**శ్లో॥సతీషు యుక్తిష్వేతాసు హఠాన్నియమయన్తి యే।**

**చేతస్తే దీపముత్సృజ్య వినిఘ్నన్తి తమోఽఞ్జనైః॥**

(యో.వా.ఉపశమ. ప్ర. 92-33 నుండి 38)(మక్తికోపనిషత్ 2-41నుండి 46)

మహాదుష్టమైన మత్తగజమును(మదించిన యేనుగును)అంకుశములేకుండా వశపరచుకొనుటకు ఎట్లు అశక్యమో,అట్లు—చిత్తముయొక్క స్వభావమునెఱిగిన పురుషులు ఉత్తమయుక్తులను వదలి కేవలము ఆసనముపై మళ్ళీమళ్ళీకూర్చొని మనస్సును జయింపజాల రు.ఆఉత్తమయుక్తులు—1.అధ్యాత్మవిద్యాప్రాప్తి,2.సత్పురుషుల సహవాసము,3.చిత్తగత వాసనాపరిత్యాగము మరియు4.ప్రాణస్పంద నిరోధము.ఈనాల్గుయుక్తులే చిత్తమును జయించుటకుపాయములు.అనిందితమైన యీనాల్గు యుక్తులు విద్యమానమైయుండగా,యే పురుషులు చిత్తమును హఠముచే నిగ్రహించుటకు ప్రయత్నించెదరో,వారు నిజముగా తమోనివర్తకమగుఉత్తమతేజముగల దీపమును

వదలి,అంజనములతో(కాటుకమసితో)చీకటిని దూరము చేయువారలగుదురు. ఇదే విషయము స్పష్టము జేయబడుచున్నది—

చిత్తమును జయించుటకు పైనచెప్పబడిన నాల్గు క్రమోపాయములలో మొదటిది—1.అధ్యాత్మవిద్యాప్రాప్తి.ఇది దృశ్యప్రపంచముయొక్కమిథ్యాత్వము ను బోధిస్తుంది.మరియు ద్రష్టా,సాక్షియగు ఆత్మయొక్క పరమార్థసత్స్వరూప మును,పరమానందస్వప్రకాశత్వమును బోధిస్తుంది.

**శ్లో॥దృశ్యం నాస్తీతి బోధేన మనసోదృశ్యమార్జనమ్।**

**సంపన్నం చేత్తదుత్పన్నా పరా నిర్వాణ నిర్వృతిః॥**(యో.వా.వైరాగ్య.ప్ర. 3-6)

(పే.పం.4-64)(మహో.1-38)

ఇంటిలోని పాచి(దుమ్ము ధూళి చెత్తా మొదలగు మాలిన్యము)చీ పురుతో యెట్లు శుభ్రము జేయబడునో,అట్లు యీ పరిదృశ్యమాన జగత్తు వాస్తవముగా లేనేలేదు,మరేమనగా మిథ్యయే అయివున్నది—అను జ్ఞానముచే,మనస్సులో ని దృశ్యమార్జనము(దృశ్యఅపాకరణము)చేయబడినచో,అప్పుడు ఉత్కృష్టమైన నిర్వాణనిర్వృతి=మోక్షసుఖము నిష్పన్నమగును.**"నేహనానాఽస్తికిఞ్చన"** (బృ. 4-4-19)(కఠో.4-11)ఇత్యాది శ్రుతులచే జగత్తును నిరసించగా అవశిష్టమగు(నిషే ధావధిభూతమగు) పరబ్రహ్మానందమే అనుభూతమగును.

ఇట్లు అధ్యాత్మవిద్యచే బోధింపబడిన పిమ్మట మనస్సు తనకు విషయీ భూతమగు దృశ్యపదార్థములందు మిథ్యాత్వహేతువుచే,ప్రయోజనాభావము ను నిశ్చయించుకొని,ప్రయోజనముగల పరమార్థసత్యపరమానందరూపదృగ్వ స్తువునందు స్వప్రకాశత్వహేతువుచే,తనకు విషయమేలేదని(దృశ్యముయొ క్క అత్యంతాభావమును)తెలిసికొని ఇంధనశూన్య(కట్టెలుకాలిన పిమ్మట)

అగ్నివలె స్వయముగా శాంతించును.

**శ్లో॥యథా నిరింధనో వహ్నిః స్వయోనావుపశామ్యతి।**

**తథా వృత్తిక్షయాచ్చిత్తం స్వయోనావుపశామ్యతి॥**(మైత్రాయణ్యుపనిషత్ 4-1)

(వే.పం.11-11)

ఇంధనరహిత అగ్ని యెట్లు జ్వాలాదిరూప విశేషాకారమును వదిలి తేజో మాత్ర సామాన్యరూపమునందు ఉపశమించి(విలీనమై)యుండునో,అట్లే అంతః కరణము(మనస్సు లేదా చిత్తము)సమస్తవైషయికవృత్తులు ఉపక్షీణముకాగా (రాజస,తామసవృత్తులు నశించగా)తనకు కారణమగు కేవలసత్త్వగుణము నందు ఉపశమించును,అనగా సత్త్వగుణమాత్రముగా అవశేషమైయుండును.

అందువలన,అధ్యాత్మవిద్యాప్రాప్తి—మనోనిగ్రహమునకుపాయమున్నది.

2.సాధుసమాగమము:—ఉపదేశింపబడిన తత్త్వమును యే పురుషుడు సమ్యక్ప్రకారముచే తెలుసుకొనజాలకున్నాడో,లేక యే పురుషుడు బోధింపబ డిన తత్త్వమును విస్మరించునో(మరచిపోవునో)—యీ యిరుతెఱంగుల పురు షులకు,మనోనిగ్రహముకొఱకు సాధుసమాగమమే ఉపాయమున్నది.ఎందుక నగా,తత్త్వజ్ఞులగు మహాత్ములు,యీ అధికారి పురుషునికి పునఃపునః తత్త్వ మును బోధిస్తూ ఉంటారు.అట్లే,మళ్ళీమళ్ళీ తత్త్వమును జ్ఞాపకము చేయిస్తూ ఉంటారు."తత్త్వమసి, తత్త్వమసి"అని తొమ్మిదిసార్లు ఉపదేశించిన ఉద్దాలక శ్వేతకేతుల ఉదంతము ఉదాహరణగా ఉంది.ఇది మహాత్ముల స్వభావగుణ మని శ్రీ శంకరులవారంటున్నారు.

**శ్లో॥శాన్తా మహాన్తో నివసన్తి సన్తో వసన్తవల్లోకహితం చరన్తః।**

**తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనానహేతునాన్యానపి తారయన్తః॥**

**శ్లో॥అయం స్వభావః స్వత ఏవ యత్పరశ్రమాపనోద ప్రవణం మహాత్మనామ్।**

**సుధాంశురేష స్వయమర్క కర్కశ ప్రభాభితప్తా మవతి క్షితిం కిల॥**

(వివేకచూడామణి 39&40)

వర్షాకాలంలో వర్షపుబాధ;వేసవిలోవేడి;శరదృతువులో ఆరంభంలో కించత్ సుఖముగా నున్నను పూర్తిగా రెండుసెలలు ఉండదు.కార్తిక మాసాంతము యమదంష్ట్ర(యమునికోరలు)అని అంటారుగదా!హేమంత శిశిరములలోచలి; కానీ,సుగంధిపుష్పములకు నిధియగు వసంతము పూర్తిగా లోకమునకు సుఖమును గలిగించును.కావున,వసన్త వత్=వసంతమువలె అని చెప్పబ డినది.వసంతంలోవర్షముగాని,తాపముగాని,చలిగాని,రోగములుగాని ఉండవు గదా!ఆ వసంతఋతువు యెట్లు సుఖమునుమాత్రమే గలిగించునో,అట్లే మహా త్ములు లోకమునకు సుఖమునేజేయుచు,శాన్తాః=నిర్వికారమగు మనస్సు గలవారును,అందుకే మహాన్తః=దేశకాలవస్తు పరిచ్ఛేదరహితబ్రహ్మమును సాక్షా త్కరించుకొన్నవారును,కావుననే,శ్రుతి-**"బ్రహ్మవేదబ్రహ్మైవభవతి"** (ముం.3-2-9) బ్రహ్మమునెఱిగినవాడు బ్రహ్మమేయగుచున్నాడు—అని చెప్పబడిన విధము గా;సన్తః=అట్టి అపరిచ్ఛిన్నబ్రహ్మముతోనభిన్నులై,భవసాగరమునుండి స్వయం గా తరింపబడినవారై,ప్రారబ్ధక్షయపర్యన్తము జీవన్ముక్తులై చరించువారును; కోరికలన్నియు తీరిన ఆప్తకాములగుటచే స్వప్రయోజనమునపేక్షింపకయే అ హైతుకకరుణాసముద్రులుగాన—దీనులై,దుఃఖితులై సంసారసముద్రంలో మున కలువేయుచున్న అజ్ఞాని జీవులనుగూడ తరింపజేయుచున్నారు.

శంక:—**యద్యద్ధి కురుతే కిఞ్చిత్ (జన్తుః) తత్తత్కామస్య చేష్టితమ్।**

**అకామస్య క్రియా కాచిద్దృశ్యతే నేహ కర్హిచిత్॥** (మనుస్మృతి 2-4)

జీవునిచే యేయేకర్మలుచేయబడినను,అవి కోరికచేతనే చేయబడుచున్నవి. ప్రయోజనము నపేక్షింపకుండా యే పనియుచేయరు."**ప్రయోజనమనుద్దిశ్య న మన్దోఽపి ప్రవర్తతే**"(స.వే.సి.సా.సం.12)ప్రయోజనాన్ని కోరక యెంతటి మందబద్ధిగూడ ప్రవృత్తుడు కాడు గదా?

సమాధానం చెప్పబడుతోంది"అయంస్వభావః"ఇత్యాది వాక్యముచే—స్వభావమునకు కారణమేమని అన్వేషించుట యుక్తముగాదు.పంచదారలోని మాధుర్యమునకు కారణమేమిటి? అని ప్రశ్నించుటలో అర్థం లేదుగదా!అది దానికి స్వభావమైయున్నది.పరశ్రమాపనోద ప్రవణం=పరులయొక్క శ్రమను నివారించుటలోగల అత్యన్తఆసక్తి; 'ప్రవణ'శబ్దము భావప్రధానము.అనగా,'ప్రవణత్వము'అను నర్థమున ప్రయోగింపబడినది.ఇది మహాత్ములకు స్వాభావికమేగాన ఈవిషయమున పరప్రేరణయొక్కగాని,స్వప్రయోజనాపేక్షగాని లేదనిభావము. ఇందులకు'సుధాంశుః'ఇత్యాదికము దృష్టాన్తము.అర్కకర్కశ ప్రభాభితప్తాం=అర్కః అనగా సూర్యుడు,అతనియొక్క యే కర్కశ అనగా తీక్ష్ణమైన,ప్రభ అనగా ప్రకాశము దానిచే,అభితఃతప్తాం అనగా పూర్తిగా వేడెక్కిన,క్షితిం అనగా భూమిని, సుధాంశుః అనగా అమృత కిరణములుగల సమీపవర్తియగు ప్రసిద్ధచంద్రుడు.అతడు యెవరిచే ప్రేరితుడు కానివాడై,యేవిధమైన స్వప్రయోజనాపేక్షలేకుండా,తన చల్లని అమృత కిరణములు ప్రసరింపజేసి పృథివియొక్క తాపమును వో గొట్టి,భూమిపైనున్న సమస్తప్రాణికోట్లను సూర్యతాపమునుండి పరిరక్షిస్తూ,ఆ హ్లాదమును కలుగజేయుచున్నాడు.కిల=ప్రసిద్ధి ద్యోతకము. మహాత్ములుగూడ అట్లేయని తెలియవలెను. మరియు,

మహాత్ముల సహవాసము(సత్సంగము)యొక్క మాహాత్మ్యమును వర్ణిస్తూ శ్రీ భర్తృహరి—వారి నీతిశతకంలో,

**శ్లో॥ జాడ్యం ధియో హరతి సించతి వాచి సత్యం,**

**మానోన్నతిం దిశతి పాపమపాకరోతి।**

**చేతః ప్రసాదయత దిక్షు తనోతి కీర్తిం,**

**సత్సంగతిః కథయ కిం న కరోతి పుంసామ్॥**

సజ్జనుల సహవాసము సకలార్థసాధనము.ఎట్లనగా,సత్యసంభాషణ గలిగించుచున్నది.బుద్ధిమాంద్యమును బారద్రోలుచున్నది.గౌరవమును దెచ్చుచున్నది.చెడుబుద్ధులను నిర్మూలింపజేయుచున్నది.యశశ్చంద్రికలను దిగంతములవరకు చాటుచున్నది.మనస్సును రంజింపజే యుచున్నది.సాధుసంగము మనుష్యులకుజేయని మేలొక్కటియును లేదు.

3.యే పురుషుడు విద్యామదము మున్నగు దుర్వాసనలచే పీడితుడై, సత్పురుషుల సహవాసముచేయడో,అతనికి వివేకపూర్వక వాసనా పరిత్యాగమే మనోనిగ్రహమునకు ఉపాయమున్నది. వాసనయనగా—

**శ్లో॥దృఢభావనయా త్యక్తపూర్వాపరవిచారణమ్ ।**

**యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా॥**(యో.వా.ఉపశ.ప్ర.91-29)

(ముక్తికోపనిషత్ 2-57)

గత అనేక జన్మలలోని దృఢభావనచే దేహాదిక జడపదార్థములపట్ల“నేను, నాది”అను యే దృఢసంస్కారము అంతఃకరణమునందు స్థిరపడి యున్నదో, ఆసంస్కారవశముచే పూర్వాపర గుణదోషములను విచారణజేయకయే మళ్ళీ

పదార్థములను ఆదానము(గ్రహణము)చే యుట—“**వాసన**”యనబడును.ఆవాసనలను వివేకపూర్వక దోషదర్శనముచే పరిత్యాగము జేసినచో మనస్సు నిగ్రహింపబడును.

4.ఆవాసనలు అతిప్రబలమున్నందున యేపురుషుడు వాటిని త్యాగము జేయుటకు అసమర్థుడగునో,అతనికి ప్రాణస్పందనిరోధము మనోనిగ్రహమునకు ఉపాయమున్నది.ఎందుకనగా,ప్రాణస్పందనము మరియు వాసన—యీ రెండే చిత్తమునకు ప్రేరకములున్నవి.ఈరెంటిని నిరోధించినచో చిత్తము అవశ్యముగా శాంతించును.ఈవిషయమును శ్రీవసిష్ఠ భగవానులే చెప్పియున్నారు.

**శ్లో॥ద్వేబీజే చిత్తవృక్షస్య ప్రాణస్పన్దనవాసనే।**

**ఏకస్మింశ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వేఅపి నశ్యతః॥**(యో.వా.ఉపశమ. ప్ర.91-48)

(ముక్తికోపనిషత్ 2-27)

**శ్లో॥ప్రాణాయామ దృఢాభ్యాసైర్యుక్త్యా చ గురుదత్తయా।**

**ఆసనాశనయోగేన ప్రాణస్పన్దో నిరుధ్యతే॥** (యో.వా.ఉపశమ.ప్ర.92-27)

(అన్నపూర్ణోపనిషత్ 4-87)

**శ్లో॥అసఙ్గ(నిఃసఙ్గ)వ్యవహారిత్వాద్భవభావనవర్జనాత్ ।**

**శరీరనాశదర్శిత్వాద్వాసనా న ప్రవర్తతే॥**(యో.వా.ఉపశమ.ప్ర.92-29) (అన్నపూర్ణోపనిషత్ 4-88)(ముక్తి.2-28)

**శ్లో॥వాసనాసంపరిత్యాగాచ్చిత్తం గచ్ఛత్యచిత్తతామ్।**

**ప్రాణస్పన్దనిరోధాచ్చ యథేచ్ఛసి తథాకురు॥** (యో.వా.ఉపశమ. ప్ర. 92-26) (అ.పూ. 4-86)(ముక్తి. 2-28)

**శ్లో॥ఏతావన్మాత్రకం మన్యే రూపం చిత్తస్య రాఘవ।**

**యద్భావనం వస్తునోఽన్తర్వస్తుత్వేన రసేన చ॥**(యో.వా.ఉపశమ.ప్ర.91-40)

**శ్లో॥యదా న భావ్యతే కించిద్ధేయోపాయరూపి యత్।**

**స్థీయతే సకలం త్యక్త్వా తదా చిత్తం నజాయతే॥**(యో.వా.ఉపశమ. ప్ర. 91-36) (అ.పూ.4-47)

**శ్లో॥అవాసనత్వాత్సతతం యదా న మనుతే మనః।**

**అమనస్తా తదోదేతి పరమాత్మపదప్రదా॥**(యో.వా.ఉపశమ. ప్ర. 91-37) (అ.పూ. 4-48)(ముక్తి. 2-29)

ఓ రామచంద్రా!ఈచిత్తరూపవృక్షమునకు ప్రాణస్పందనము,వాసనయను రెండుబీజములుగలవు.ఆరెంటిలో యేఒక్కటి నశించనా,రెండును నశించును. వాటిలో,ప్రాణాయామదృఢాభ్యాసముచేతను,గురూపదిష్ట యుక్తులచేతను మరి యు ఆసన,భోజనాది నియమములచేతను ప్రాణస్పందన నిరోధింపబడును. దేహాదిక ప్రపంచముతో ఎలాంటి సంబంధములేని అసంగవ్యవహారముచేత ను,అనాత్మచింతన పరిత్యాగముచేతను మరియు శరీరనాశమును పునఃపు నః పరామర్శించుటచేతను—ఈఅధికారిపురుషునికి వాసనలు ప్రవృత్తము కాజాలవు.ఇట్లు వాసనా పరిత్యాగముచే మరియు ప్రాణస్పందనిరోధముచే చి త్తము అచిత్తభావమును పొందును.అనగా,సత్త్వగుణముమాత్రము అవశిష్టమై యుండును.ఆపై నీకు యెట్లు ఉచితముగ దోచునో,అట్లాచరింపుము.హే రా ఘువ!బాహ్యమగు అనాత్మపదార్థములను సత్యముగా తలంచుట,ఆంతరము న వాటినిగూర్చి రాగముచే(ఆసక్తిచే)చింతించుట—ఇదియే చిత్తముయొక్క స్వరూపమని నాయభిమతము.ఎప్పుడు పురుషుడు హేయ ములు(త్యాజ్య

ములు-విడుచుటకుయోగ్యములు)మరియు ఉపాదేయములు(గ్రహించుటకు యోగ్యములు)అగు వస్తువులనుగూర్చి కించిన్మాత్రముగూడ చింతనజేయడో, సర్వమును పరిత్యజించి తనయందు తాను స్థిరమైయుండునో,అప్పుడు చిత్తము ఉత్పన్నము కానేరదు.ఎప్పుడు యీమనస్సు సమస్తవాసనారహితమై,ఏమాత్రముగూడ అనాత్మ వస్తువులనుగూర్చి మననముచేయకుండునో, అప్పుడు పరమాత్మ పదవిని ప్రాప్తముజేయగల అమనస్కస్థితి(అవస్థ)ఉదయించును.

వసిష్ఠమునీంద్రులవారి ఉపరోక్త ఉపదేశముచే యీరెండు ఉపాయములు సిద్ధించినవి.1.ప్రాణస్పందనిరోధముకొఱకు అభ్యాసరూప ఉపాయము.2.వాసనాపరిత్యాగముకొఱకు వైరాగ్యరూప ఉపాయము.ఇక మిగతా రెండు అధ్యాత్మవిద్యాప్రాప్తి మరియు సాధుసమాగమము—అభ్యాస వైరాగ్యములకు ఉపోద్బలకములైనందున(ఉపపాదకములైనందున)అన్యథా సిద్ధములు,అనగా స్వతఃప్రాప్తములైయున్నవి.వాటిని(అధ్యాత్మవిద్యాప్రాప్తి,సాధుసమాగమమును)అభ్యాసవైరాగ్యములలోనే అంతర్భూతముగావింపనైనది.అందుకే శ్రీకృష్ణపరమాత్మ (గీత.6-35) అభ్యాస వైరాగ్యములను—రెండు ఉపాయములనే చెప్పియుండిరి.

అందుకే,భగవాన్ శ్రీపతఞ్జలిమహర్షిగూడ"**అభ్యాస వైరాగ్యాభ్యాంతన్నిరోధః**" (యోగసూత్రము 1-12)అని సూత్రీకరించారు.అభ్యాస వైరాగ్యములచే చిత్తము నిరోధింపబడును.పూర్వము(యో.సూ.1-6)లో చెప్పబడిన ప్రమాణ,విపర్యయ,వికల్ప, నిద్రా మరియు స్మృతి—అను పంచప్రకారవృత్తులు అసురత్వరూపముచే క్లిష్టములని మరియు దేవత్వరూపముచే అక్లిష్టములని చెప్పబడుచున్నవి. ఈ సర్వవృత్తులు,కట్టెలుకాలిన పిమ్మట అగ్ని,క్రమేణ ఎట్లు ఉపశమరూప పరిణామవిశేషమును పొందునో,అట్లు అభ్యాసవైరాగ్యములు—అను రెండుఉపాయములచే నిరోధింపబడగలవు.ఈవిషయమునే భగవాన్ శ్రీవ్యాసమహర్షులవారు

భాష్యములో ఇలా చెప్పారు—శ్రీభాగీరథీ,యమున మున్నగు ప్రసిద్ధనదులు నిమ్నభూమిలో ప్రవహిస్తూ సముద్రములో పర్యవసన్నమగుచున్నవి.(చేరు చున్నవి).అట్లే చిత్తరూప నది వివేకరూప నిమ్నమార్గముగుండా ప్రవహించి కైవల్యరూప ఫలమునందు పర్యవసన్నమైనచోనది కల్యాణవాహిని అనబడు తుంది.మరియు ఆ చిత్తరూప నది అవివేకరూప నిమ్నభూమిగుండా ప్రవ హించి సాంసారిక భోగములందు పర్యవసన్నమైనచోఅది దుఃఖజనకమగుటచే పాపవాహినియనబడును.ఈ ప్రకారముగా చిత్తరూప నది యిరువైపుల ప్రవ హించును.అందులో,పునఃపునః విషయాలలోని దోషదర్శనముచే జనించు వైరాగ్యము—విషయోన్ముఖమగు చిత్తముయొక్క పాపవాహిని ప్రవాహమును నిరోధించును.మరియు వివేకదర్శనరూప అభ్యాసము,ఆచిత్తనదిని ప్రత్యగా త్మవైపుకు ప్రవహింపజేయును.ఈవిధముగా,చిత్తవృత్తులయొక్క నిరోధము, వైరాగ్య—అభ్యాసముల(రెండింటి)అధీనమైయున్నది.కేవల వైరాగ్యముచేతగాని, కేవలఅభ్యాసముచేతగానిచిత్తమునిరోధింపబడదు.తాత్పర్యమేమనగా—తీవ్రవేగ ముగల నదీప్రవాహమును,కాష్టశిలామృత్తికాదులచేసేతువు(ఆనకట్ట)నునిర్మిం చి ఆపుతారు.తరువాత కాలువలద్వారా నీటి ప్రవాహమును మళ్ళించి సేద్య ముకొఱకు పంటభూముల్లోకి తీసికెళ్తారు.అట్లే,విషయాభిముఖముగా తీవ్ర వేగముచే(ఆసక్తిచే)ప్రవహించు చిత్తనదిని దోషదర్శనజన్య వైరాగ్యముచే నిలి పి(ఆపి)సమాధి యభ్యాసముచే ప్రత్యగాత్మవైపుకు మళ్ళించి,పునఃపునః ఉ త్సాహరూపప్రయత్నముచే నిరన్తర(వ్యవధానరహిత)ఆత్మాకారవృత్తుల సంతా నము(ప్రవాహము)ను ఆవృత్తిచేయుచుండినచో చిత్తము నిరోధింపబడును. ఇట్లు,వైరాగ్యము మరియు అభ్యాసము రెండునూచిత్తనిరోధమునందు భిన్న భిన్నద్వారములు(సాధనములు లేక ఉపాయములు)ఉన్నందున రెండింటి

యొక్క సముచ్చయము అపేక్షితమైయున్నది.అనగా,వైరాగ్యముచే చిత్తనది యొక్క విషయప్రవాహము నివారింపబడి,అభ్యాసముచే ఆత్మాకార ప్రశాన్తవాహినియగును.ఒకవేళ రెండింటిలో యేఒక్క ఉపాయముచేతగూడ చిత్తము నిరోధింపబడు సంభవము గనుక ఉన్నట్లయితే,వ్రీహి,యవలవలె వికల్పముగా చెప్పబడియుండెడిది.వ్రీహి=వడ్లు,ధాన్యము;యవలు=బార్లీయనబడుధాన్య విశేషము;పురోడాశము=యజ్ఞార్థమైన అపూపము.**"వ్రీహిభిర్యజేత"**(ఆపస్తంబశ్రౌత సూత్రము)**"యవైర్యజేత"**ఈరెండు వాక్యములను(వ్రీహి,యవలను)పురోడాశము ద్వారా యాగసాధకములుగా విధానముచేయడమైనది.ఈరెంటిలో వికల్పమున్నది.అనగా,వ్రీహిచేగాని,యవలచేగాని—ఒకదానిచేతనే యాగముసంపన్నమగును.రెండింటిచే కాదు.అట్లే,ప్రకృతమునందుగూడ(వర్తమాన విషయములోగూడ) అభ్యాసము మరియు వైరాగ్యము—వీటిలో వికల్పమున్నట్లయితే భగవంతుడు"**చ**"కారముచే సముచ్చయమును చెప్పియుండెడివాడుకాదు.అందువల్ల ఇక్కడ ద్వారభేదముచే రెంటియొక్క సముచ్చయమున్నది.

శంక:—మంత్రము,జపము,దేవతాధ్యానము ఇత్యాది క్రియారూపసాధనములలో పునఃపునః ఆవృత్తిరూప అభ్యాసము సంభవిస్తుంది.కాని,సర్వవ్యాపారముల నివృత్తిరూప సమాధిలో అభ్యాసమెట్లు సంభవించును?నిరోధము క్రియయొక్క అభావరూపమున్నది.కృతిసాధ్యము కాదు.

ఈశంకను నివారించుటకొఱకు పతఞ్జలిమహర్షులవారు అభ్యాస లక్షణమును ఇట్లు సూత్రీకరించారు"**తత్రస్థితౌయత్నో ఽభ్యాసః**"(యో.సూ.1-13)ద్రష్టయగు శుద్ధచిదాత్మయందు,స్వాభావిక బాహ్యప్రవాహమును నిరోధించి,సర్వవృత్తిరహిత చిత్తముయొక్క ప్రశాన్తవాహితారూప నిశ్చలస్థితికోసము చేయబడు మానసికఉత్సాహరూప పునఃపునః ఆవృత్యాత్మక ప్రయత్నమునకు అభ్యా

సమందురు.మరొక సూత్రము—"**స తు దీర్ఘకాల నైరన్తర్యసత్కారాసేవితోదృఢ భూమిః**"(యో.సూ.1-14)పూర్వోక్త అభ్యాసము ఉద్వేగరహితముగా దీర్ఘకాలపర్య న్తము,వ్యవధానరహితముగా(ఎడతెగకుండా)నిరన్తరము, శ్రద్ధాతిశయరూప స త్కారముచే(ఆదరపూర్వకముగా)సేవించినచో దృఢమైనభూమి(స్థితి)గలదియ గును.వైషయికసుఖ వాసనారూప వ్యుత్థానసంస్కారములు మనుష్యుణ్ణి బ హిర్ముఖముగాజేయును.సమాధ్యభ్యాసము అంతర్ముఖముజేయును.ఆ అ భ్యాసము దృఢపడవలెననిన దీర్ఘకాలము(చాలాకాలము)వరకు సేవించుచుం డవలెను.మధ్యమధ్య ఆపిఆపి చేసినచో,అనతికాలములోనే చేసిన అభ్యా సము లుప్తమగును.చిత్తముయొక్క విక్షేపము(చాంచల్యము)నివర్తింపదు. కావున,నిరన్తరము(వ్యవధానరహితముగ)సేవించవలెను.అనేక సంవత్సరము ల పర్యన్తము లేక జన్మలపర్యన్తము దీర్ఘకాలము యోగమును సేవింపవల యును."**అనేకజన్మసంసిద్ధస్తతోయాతి పరాం గతిమ్**"(గీత.6-45)అనేక జన్మము లకు సంసిద్ధుడై పరమగతిని పొందుచున్నాడు.మరియు ఆదరముతో సేవించ వలెను.ఆదరములేకుండిన యోగవిఘ్నములగు లయ,విక్షేప,కషాయ,రసా స్వాదనములు సంభవించును.అందువల్ల,సత్కారపూర్వకముగా సేవించాలి.అ నగా,సుఖత్యాగరూప తపస్సుచేతను,అష్టమైథునవర్జనరూప బ్రహ్మచర్యము చేతను,విద్య(తత్త్వజ్ఞానము)చేతను మరియు శ్రద్ధాతిశయముచే సంపాదితస త్కారముచే అభ్యాసము దృఢభూమిగలదగును."**యదేవవిద్యయా కరోతి శ్రద్ధ యోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి**"(ఛాం.1-1-10)యే కార్యము(అభ్యాసము) యుక్తియుక్తజ్ఞానముచేత,శ్రద్ధచేత మరియు సారయుక్త శాస్త్ర(ఉపనిషత్)జ్ఞా నముచేతచేయబడునో,అది అధికతర వీర్యవంతమ గును.అనగా,నిర్విఘ్న ముగా ఫలవంతమగును.దృఢభూమియనగా పెద్దపెద్ద కొండలవంటి దుఃఖ

ములు వచ్చిపడినను చలింపకుండుట.**"యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే"**(గీత.6-22)గొప్పదుఃఖములచేతగూడ ఆ యోగమందుండి చలింపబడడు.ఈప్రకారము దీర్ఘకాలము,నిరన్తరము మరియు సత్కారపూర్వకముగా సేవించినచో అభ్యాసము దృఢభూమి(స్థితి)గలదియగును.అపుడే,చిత్తములో దాగియున్న బాహ్యవిషయప్రవృత్తిరూప వ్యుత్థానసంస్కారము దానిని బాధింపజాలదు.ఇట్లు అభ్యాసస్వరూపమునుగూర్చిచెప్పి,ఇపుడు వైరాగ్యము యొక్క స్వరూపకథనము చేయుచున్నాడు.

వైరాగ్యము-అపరవైరాగ్యము మరియు పరవైరాగ్యము అని రెండు విధములు.అందులో,యతమానము,వ్యతిరేకము,ఏకేంద్రియము మరియు వశీకారము అనుభేదముచే అపరవైరాగ్యము నాల్గు ప్రకారములు.వాటినిగూర్చి పూర్వము వైరాగ్యనిరూపణావసరమున మనము తెలిసి కొని వచ్చాము.పూర్వభూమికా జయముచే ఉత్తరభూమిక ప్రాప్తించును.ఈవివక్షచేతనే భగవాన్ పతఞ్జలిమహర్షులవారు నాలుగవదగు వశీకారసంజ్ఞావైరాగ్యమును సూత్రము ద్వారా చెప్పారు.**"దృష్టానుశ్రవికవిషయవితృష్ణస్య వశీకారసంజ్ఞావైరాగ్యమ్"**(యో.సూ.1-15)స్త్రీ,అన్నము,పానము,మైథునము,ఐశ్వర్యము మున్నగు విషయములు సర్వలోక ప్రత్యక్షమున్నందున దృష్టవిషయములనబడును.మరియు స్వర్గము,విదేహత్వము,ప్రకృతిలయము మొదలగు విషయములు కేవలము శాస్త్రప్రమాణగమ్యములున్నందున ఆనుశ్రవికవిషయములనబడును.ఈ రెండు విధముల విషయాలనుండి ఇంద్రియములను,మనస్సును సంపూర్ణముగా నిరోధించి,ఔత్సుక్యమాత్రముచేగూడ మనస్సునందు వాటికి సంబంధించిన తృష్ణ లేకుండుట,అనగా,జ్ఞానప్రసాదరూప తృష్ణావిరోధిని చిత్తవృత్తికి వశీకారసంజ్ఞావైరాగ్యమందురు.ఈవశీకార సంజ్ఞావైరాగ్యము సంప్రజ్ఞాతసమాధికి అంత

రంగసాధనమగును.మరియు అసంప్రజ్ఞాత సమాధికి బహిరంగ సాధనమగును.అసంప్రజ్ఞాత సమాధికి పరవైరాగ్యమే అంతరంగ సాధనమౌతుంది.

శ్రీపతఞ్జలిభగవాన్ పరవైరాగ్యముయొక్క స్వరూపమును సూత్రీకరిస్తూ- **"తత్పరంపురుషఖ్యాతేర్గుణవైతృష్ణ్యమ్"**(యో.సూ.1-16)సత్త్వపురుషాన్యథాఖ్యాతి(ప్రకృతిపురుషుల వివేకజ్ఞానము)ద్వారా త్రిగుణములపట్ల తృష్ణారహితమైయుండుట పరవైరాగ్యమనబడును.అనగా సంప్రజ్ఞాతసమాధి దార్ఢ్యతచేత(పరిపాకముచేత)త్రిగుణాత్మక ప్రదానముకంటె భిన్న ముగా(వివేకముజేయబడిన)పురుషుని సాక్షాత్కారము కలుగుతుంది.తదనన్తరము త్రిగుణములయొక్క సంపూర్ణవ్యవహారమునందు వైతృష్ణ్యము(విరక్తి)గలుగుతుంది.దానికే పరవైరాగ్యము అంటారు.ఇదియే సర్వశ్రేష్ఠమైన ఫలభూతవైరాగ్యమగును.ఈవైరాగ్యపరిపాక నిమిత్తముచే చిత్తోపశమపరిపాకము గలిగి,అతిశీఘ్రముగా కైవల్యము ప్రాప్తించును.ఈసమగ్ర అభిప్రాయము**"అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే"**(గీత.6-35)అను భగవద్వచనమునందు నిహితమైయున్నది.(మధుసూదని)

**శ్లో॥చిత్తమాత్రమవిద్యేతి కురు తేనైవ తత్క్షయమ్।**

**చిత్తే శాన్తే శామ్యతీయం సంసారమృగతృష్ణికా॥**(యో.వా.నిర్వాణ.ప్ర.పూర్వార్ధము 69-55&56)

ఓ రామచంద్రా!కేవలము చిత్తమే అవిద్యా రూపమున్నది.దానిని దానిచే తనే అనగా,బ్రహ్మాకార చిత్తవృత్తిచేతనే నాశనము చేయుము.చిత్తము శాన్తించినచో మృగజలతుల్యమగు నీ సంసారము(సమస్తద్వైతప్రపంచము)ఉపశమించును.

**శ్లో॥విషం విషేణ వ్యథతే వజ్రం వజ్రేణ భిద్యతే।**

**గజేన్ద్రో దృష్టసారేణ గజేన్ద్రేణైవ బధ్యతే॥**(కమందకీయ నీతిసారము 8-69)

విషము విషముచే హరించును.వజ్రము వజ్రముచే భేదించబడును.ఏనుగును పట్టుకొనుటకు(బంధించుటకు)మావటివాడు యేనుగునే ప్రయోగించును.అట్లే,మనస్సును మనస్సుచేతనే జయించవలెను.

**శ్లో।। శామ్యతి హ్యస్త్రమస్త్రేణ మలేన క్షాల్యతే మలమ్।**

**శమం విషం విషేణైతి రిపునా హన్యతే రిపుః।।**(యో.వా.స్థితి ప్ర.41-14) (మహోపనిషత్ 5-110&111)

అస్త్రము అస్త్రముచేతనే శాంతించును.నీటిలోని మలము(మురికి)నిర్మలీ (కతక)చూర్ణమను మలముచేతనే శుభ్రముజేయబడును.విషము విషము చేతనే శాంతించును.మరియు శత్రువు శత్రువుచేతనే చంపబడును.అట్లే మనస్సు మనస్సు చేతనే నశించును. ఎట్లనగా,

**శ్లో॥ఏష సర్వేషు భూతేషు గూఢాత్మా న ప్రకాశతే।**

**దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥**(కఠ.1-3-12)

ఏషః=ఈపురుషుడు(ఆత్మ),చతుర్ముఖబ్రహ్మము మొదలుకొని స్తంబము(అత్యల్పమగుగడ్డిపరక)పర్యన్తము సకలభూతములందు(ఉపాధులనాశ్రయించుకొని)దర్శన,శ్రవణాదికర్మలుచేయుచు అవిద్యారూప మాయచే నాచ్ఛాదితమైయున్నది.అందువలన,సకలభూతములయొక్క స్వరూపమై(అంతరాత్మయై) యుండియు,**"ప్రత్యగభిన్న పరమాత్మయే నేనైయున్నాను"**.అను నీ ప్రకారముగా అందరిచే ప్రకాశింప(తెలియ) బడుటలేదు.అహో!ఈమాయఅతిగంభీరము,దురవగాహ్యము మరియు విచిత్రమైయున్నదిగదా!యెంత ఆశ్చర్యము!సకలజీవులు వాస్తవముగా పరమార్థస్వరూపులైయుండియు,శాస్త్రము మరియు ఆచార్యులద్వారా యథార్థముగా(పరమార్థస్వరూపులని)బోధింపబడి

నను"**నేను పరమాత్మను**"అను తత్త్వమును గ్రహించలేకపోతున్నారు. దానికి విపరీతముగా,ఘటాదులవలె ఆత్మకు దృశ్యములగు దేహేంద్రియాదులను, యెవరి ఉపదేశములేకయే,ఆత్మగాతలంచి,నిస్సందేహంగా మాయచే భ్రాన్తిలో పడి వంచితులగుచున్నారు."**నాహంప్రకాశఃసర్వస్యయోగ మాయాసమావృతః**" (గీత.7-25)త్రిగుణాత్మకమాయచే నాచ్ఛాదితమైన(కప్పబడిన)నేను సర్వలోకులచే ప్రకాశింపబడుటలేదు.అనగా,జ్ఞానమునకు విషయమగుట(తెలియబడుట)లేదు.

శంక:—"**మత్వా ధీరో న శోచతి**"(కఠ.1-2-22)ఆత్మతత్త్వమునెఱిగిన ధీర పురుషుడు శోకించడు."**గూఢాత్మా న ప్రకాశతే**"గూఢమగు ఆత్మ తెలియబడదు.ఈవిధముగా చెప్పుట,పూర్వోత్తర విరోధరూప వ్యాఘాతము గదా?

సమాధానము:—ఇట్లు శంకించుట తగదు.ఎందుకనగా,అసంస్కృత(మలిన) బుద్ధిగల పురుషులచే అవిజ్ఞేయమున్నందున"**న ప్రకాశతే**"తెలియబడుటలేదు—అని చెప్పబడినది.మరియు సంస్కృత(సంస్కరింపబడినశుద్ధ)బుద్ధిచేతెలియబడుటకు యోగ్యమున్నందున"**దృశ్యతే**"తెలియబడుతుంది—అని చెప్పబడినది.సూక్ష్మవస్తువగు ఆత్మ తత్పరమైన,ఏకాగ్రతతోయుక్తమగు బుద్ధిచేతనే గ్రహింపబడుటకు సంభవమున్నది.ఇటువంటి సూక్ష్మదర్శులగు పండితులచేతనే ఆత్మ తెలియబడును (సాక్షాత్కరింపబడును). కావున,

**శ్లో॥మనసైవ మనశ్ఛిత్వా కుఠారేణేవ పాదపమ్।**

**పదం పావనమాసాద్య సద్య ఏవ స్థిరో భవ॥**(యో.వా.ఉపశమ ప్ర.13-35)

(మహోపనిషత్ 6-33)

**మనసో విజయాన్నాన్యా గతిరస్తి భవార్ణవే॥**(మహోపనిషత్. 5-76)

కుఠారమునందు(గొడ్డలియందు)వృక్షముయొక్క అవయవమగు కాష్ఠము జేరి వృక్షమును నరుకునట్లు,శుద్ధమనస్సుచే—బంధహేతువు,సమస్తదోషరూప అంకురములకు ఉత్పత్తిస్థానమగు అశుద్ధమనస్సును ఛేదించి,పరమపవిత్ర విశ్రాన్తిస్థానమగు స్వస్వరూపమునందు శీఘ్రముగా స్థిరము నొందుము.ఈ జనన-మరణరూప సంసారసాగరమునుండి తరింపబడుటకు,మనస్సును జయించుటకంటె వేఱొండు ఉపాయములేదు.అదెట్లనగా,

**శ్లో॥శనైః శనైరుపరమేద్బుద్ధ్యా ధృతి గృహీతయా।**

**ఆత్మసంస్థం మనఃకృత్వా న కిఞ్చిదపి చిన్తయేత్॥**(గీత.6-25)

శనైఃశనైః అనగా తొందరపడక మెల్లమెల్లగా అనగా క్రమక్రమముగా ఉపరతిని అనగా ప్రాపంచిక విషయవాసనలు మనోబుద్ధులయందు లేనటువంటి స్థితిని పొందవలయును.దేనిద్వారా అట్టిస్థితిని పొందవలయును?అన్నచో—బుద్ధిద్వారా పొందాలి.ఎటువంటి బుద్ధిద్వారా పొందవలయును?అన్నచో—ధైర్యముతోకూడియున్న బుద్ధిద్వారా పొందాలి.మరియు మనస్సును,ఆత్మయందు లగ్నముగావించి అనగా,ఈ"జగత్తుగా దోచునదంతయు ఆత్మతత్త్వమే;యిచ్చట అదితప్ప మరొక పదార్థమెద్దియునులేదు"అని యీవిధంగా మనస్సును సమాధానపరచుకొని,ఆత్మతత్త్వమునందేస్థిరపరచి,ఆత్మవ్యతిరిక్త మిథ్యా పదార్థములనుగూర్చి ఆలోచించుట మానివేయవలయును.ఇది యోగియగు (సాధక)పురుషుని పరమశ్రేష్ఠమైన ధర్మము(కర్తవ్యము).

**శ్లో॥అనాత్మచింతనం త్యక్త్వా కష్మలం దుఃఖకారణమ్।**

**చింతయాత్మానమానందరూపం యన్ముక్తికారణమ్॥**(వి.చూ.380)

**శ్లో॥స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥**( గీత.6-23)

అపవిత్రమైన విషయములకు సంబంధించినదగుటచే అపవిత్రమైనది యు,దుఃఖమునకు కారణమైనదగు అనాత్మలకు సంబంధించిన చింతనమును మాని,ఏది ఆత్యన్తిక దుఃఖనివృత్తికి కారణమో,అట్టి ఆనందరూప ఆత్మనుగూర్చి చింతించుము=ధ్యానించుము.

ఫలదాయకమగు నా యోగమును సాధకుడు విసుగు విరామము యెఱు గని చిత్తముతో నిశ్చయపూర్వకముగా చేయవలయును.నిశ్చయము= "గురు,శాస్త్రవచనములకు తాత్పర్యవిషయమగు యోగము సత్యమేఉన్న ది"—అను అధ్యవసాయపూర్వక(నిశ్చయపూర్వక)ప్రయ త్నము(అభ్యాసము ను చేయవలెను.అట్లే,అనిర్విణ్ణచిత్తముచే="నేను ఇంతకాలము అత్యధికకఠిన సాధనచేసినప్పటికిని,నాకు యోగము సిద్ధించకపోయెనుగదా,ఇంతకంటె అధిక కష్టము ఇంకేముంటుంది?—అనునటువంటి అనుతాపమునకు నిర్వేదమంటా రు.ఇటువంటి నిర్వేదములేని చిత్తముతో,అనగా—"ఈజన్మమునందుగాని లేక మరుజన్మమునందుగాని నాకు యోగము తప్పకుండా సిద్ధిస్తుంది,తొందరప డితే లాభమేమి?"అను ధైర్యముతో కూడియున్న మనస్సుతో అభ్యాసము చేయుచుండవలయును.కావున,ఆవేగరహితమైన(తొందరపాటులేని), విసుగు లేని,నిశ్చయపూర్వకచిత్తముతో సాధకుడు(మనోజయరూప)యోగమును అ భ్యాసము చేయుచుండవలయును.ఈవిషయంలో పరమపూజ్యులగు శ్రీగౌడ పాదాచార్యుల వచనము ప్రమాణముగానున్నది.

కారిక:— **ఉత్సేక ఉదధేర్యద్వత్కుశాగ్రేణైకబిన్దునా।**

**మనసో నిగ్రహస్తద్వద్భవేదపరిఖేదతః॥** (మాం.కా.3-41)(వే.పం.11-109)

దర్భాగ్రముచే(గడ్డిపరకయొక్క సూక్ష్మమగు చివరికొనచే)ఒక్కొక్క బిందువుగా సముద్రజలమును వెలుపలికిజిమ్ముటకు(శోషింపజేయుటకు)ఎంతటి పట్టుదల,విసుగులేని నిర్విరామమైన ప్రయత్నము ఆవ శ్యకమో,అట్టి–ఖేదములేని ప్రయత్నమువలన మనోనిగ్రహము సాధ్యమగును.

**టిట్టిభోపాఖ్యానము=**టిట్టిభమను పక్షియొక్క(లకుముకిపిట్ట,కాటుక పిట్ట, ఉయ్యాలపిట్ట-అని కోశము)కథ యేమనగా:—టిట్టిభమనునొకపక్షి సముద్రతీరమున గ్రుడ్లను బెట్టగానవి కెరటములచే సముద్రములోనికి కొట్టుకొనిపోబడెను.అపుడా పక్షి,సముద్రుడు తన గ్రుడ్లనపహరించెనను కోపముతో,“**సముద్రము నింకింపజేసెద**”నని ప్రతినబూని యొక గరికపుడకను ముక్కునగఱచికొని,దానిని సముద్రములో ముంచి,స్వల్పమైన నీటిబొట్టును గట్టున వదలుచుండెను.దానినిగాంచి కులాభిమానముచే పక్షులన్నియు దాని సాహాయ్యమునకై యట్లే చేయనారంభించెను.ఇంతలో నారదుడు యీదృశ్యమునుజూచి, వైకుంఠమందుశ్రీమహావిష్ణువునకీ సమాచారము నెఱింగించెను.ఆయన సన్నిధియందుండు పక్షీంద్రుడగు గరుత్మంతుడు“**మా జాతియందు సముద్రున కింత యనాదరణమా**”యని కోపించి,తన ఱెక్కలతో సముద్రుని చెల్లాచెదురుగా చేయనెంచగా,సముద్రుడు భీతిల్లి యాతనిని శరణుజొచ్చి, టిట్టిభపక్షియొక్క గ్రుడ్లను దానికిచ్చి,ఇకముందు నేనెవ్వరి పదార్థముల నపహరింపనని ప్రతిజ్ఞజేసెను.అట్లే,ఖేద(నిర్వేద)రహితుడై(విసుగు లేక)యెడతెగని ప్రయత్నముచే మనోనిరోధరూప పరమ ధర్మమునందు ప్రవృత్తుడైన యోగికి(సాధకునికి) ఈశ్వరానుగ్రహము(ఈశ్వరసాహాయ్యము)అవశ్యముగా లభించి,ఆ పక్షివలె తన యభిమత(మనోరథ)సిద్ధినొందునని భావము.

ఇట్లు-శ్రవణ,మనన,నిదిధ్యాసనములకంటె భిన్నమైన సాంసారిక(శబ్దాది)

విషయములనుండి మనస్సును నిగ్రహించిన(జయించిన,నిరోధించిన)సాధకు ని మోక్షద్వారము తెఱువబడును.ఇతి శమనిరూపణమ్.

**—:35.దమము:—**

**బాహ్యేన్ద్రియాణాం శ్రవణాది వ్యతిరిక్త విషయేభ్యో నివర్తనమ్**(వేదాన్తసారము). బాహ్యేంద్రియములను అనగా పంచజ్ఞానేంద్రియములను మరియు పంచక ర్మేంద్రియములను శ్రవణాదులకంటె భిన్నమైన విషయములనుండి నివర్తిం చుట(విముఖముచేయుట)“**దమము**” అనబడును.

సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహములోని **దమనిరూపణ** విషయంలో శ్రీపూ జ్యపాదుల అభిప్రాయమును (129నుండి136వరకు) తెలిసికొందము.

**శ్లో॥బ్రహ్మచర్యాదిభిర్ధర్మైః బుద్ధేర్దోష నివృత్తయే।**

**దన్డనం దమ ఇత్యాహుః దమ శబ్దార్థ కోవిదాః॥**

**శ్లో॥తత్తద్వృత్తి నిరోధేన బాహ్యేన్ద్రియ వినిగ్రహః।**

**యోగినో దమ ఇత్యాహుః మనసః శాన్తి సాధనమ్॥**

బుద్ధిగత దోషములగు కామక్రోధాదులను నాశనము జేయుటకు,బ్రహ్మ చర్యాదిధర్మములద్వారా మనస్సును దండించుటను అనగా విష యములం దు మనస్సుయొక్కప్రవృత్తిని(వేగమును)నిరోధించి,వశపరచుకొనుటను పండి తజనులు“**దమము**”అంటారు.మరియు,బాహ్యేంద్రియములయొక్క వాటివాటి విషయప్రవృత్తిని నిరోధించి,సమ్యక్ప్రకారముచే నిగ్రహించుట“దమము”అని చెప్పబడుతుంది.ఇదియే చిత్తశాంతికి సులభోపాయమని యోగిజనుల యభిప్రాయము.

ఇంద్రియములు ఆయా విషయములందు ప్రవర్తించుచుండగా అగ్ని గాలిన-

నుసరించునటుల,మనస్సు ఆయింద్రియములననుసరించి పరుగిడుచుండు ను.ఇంద్రియములను నిగ్రహించినచో మనస్సు నిశ్చలమగును.శాన్తి లభించు ను,పిమ్మట ముక్తి సులభమగును.నేత్రాది జ్ఞానేంద్రియములను,వాగాదిక-ర్మేంద్రియములను విషయములందు ప్రవర్తింప నీయకుండుటయే మనశ్శు ద్ధికి మూలసాధనము.బహిరింద్రియములను నిరోధించినచో వెంటనే మనస్సు నకు,విషయములకును సంబంధము తెగిపోవును.అనగా చిత్తమున విషయ వాంఛలు గలుగవని భావము.

ఇంద్రియ నిరోధముచే నంతఃకరణము తన దుష్టస్వభావమును వదలి క్రమ ముగా మెల్లమెల్లగా శాంతించును.చిత్తమును బాహ్యపదార్థములనుండి నివ ర్తింపజేయుటయేమోక్షమునకుద్వారమని(ఉపాయమని),మోక్షలక్షణము నెఱి గిన ఆచార్యులు శాస్త్రము,యుక్తి మరియు అనుభవములద్వారా ధృవపరచు చున్నారు.ముముక్షు పురుషునకు చిత్తస్వాస్థ్యమావశ్యకము.దాని కొఱకు బహిరింద్రియ నిరోధము దప్ప వేరొక సులభోపాయములేదు.అయితే,కొందరు దిగ్దేశకాలాది నియమములననుసరించి,పూరక కుంభక రేచకాత్మకమగు ప్రా ణాయామము నాచరించి,బాహ్యేంద్రియముల నాయా విషయములనుండి నివర్తింపజేసి,చిత్తశాన్తిని సంపాదించెదరు.కాని,కేవలము హఠముచే ప్రాణాయా మబలమువలననే బహిరింద్రియములను నిరోధించినచో,ప్రాణాయామ విరమ ణకాలమునందు ఇంద్రియవిక్షేపము గలుగుట కవకాశముగలదు.కావున, బుద్ధిమంతుడగు ముముక్షువు చిత్తశాన్తి సంపాదనమునకై వివేకయుక్త ఆత్మజ్ఞానపూర్వకముగా బాహ్యేంద్రియములను నిరోధింపవలయును.

**శ్లో॥సర్వేన్ద్రియాణాం గతినిగ్రహేణ,భోగ్యేషు దోషాద్యవమర్శనేన ।**

**ఈశప్రసాదాచ్చ గురోఃప్రసాదాత్, శాన్తిం సమాయాత్యచిరేణ చిత్తమ్ ॥**

జ్ఞాన,కర్మేంద్రియములయొక్క వాటివాటి విషయములందుగల ఇచ్ఛానుసార ప్రవృత్తిని నిగ్రహించుట,భార్యాపుత్రాది భోగ్యపదార్థములందుగల దోషములను పునఃపునః దర్శించుట,తమతమ యభీష్టదేవతల నారాధించుట వలనను,సద్గురువుల పరిచర్యాదులవలనను—వారి యనుగ్రహమునకుపాత్రులగుట—అనునీ సహాయసంపదలచే చిత్తము అతిశీఘ్రముగా శాన్తిని బొందగలదు.(సర్వవేదాన్త సిద్ధాన్త సారసంగ్రహము. 136)

**శ్లో॥యతతో హ్యాపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః।**

**ఇన్ద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః॥**

**శ్లో॥తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।**

**వశే హి యస్యేన్ద్రియాణి తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా॥**(గీత.2-60&61)

యథార్థజ్ఞానరూపమైన బుద్ధియొక్క స్థిరత్వమును పొందగోరు సాధకుడు ముందుగా యింద్రియములను తన వశమునందుంచుకొనవలయును.ఒకవేళ,తన వశమునందుంచుకొననియెడల కలుగు దోషములను భగవంతుడు ఈక్రింది విధముగా చెప్పుచున్నాడు.ఓ కున్తీపుత్రా! గురుశాస్త్రములచే నుపదేశమునుపొంది,పునఃపునః విషయాలలోని దోషములను దర్శిస్తూ,మోక్షార్థియై తీవ్రతరప్రయత్నముచేయు అత్యంత వివేకిపురుషునియొక్క మనస్సును గూడ,క్షణమాత్రము నిర్వికారస్థితి కల్గినప్పటికిని,యింద్రియములు(ఆమనస్సును)హరించును.అనగా వికారమును కలుగజేయును.

ప్రశ్న:—హేభగవాన్[9]!మనోవికారమునకు విరోధియగు వివేకముండగా,వివేకిపురుషునియొక్క మనస్సునుగూడ యింద్రియములు ఎట్లు వికృతము చేయగలవు?ఈశంకకు సమాధానముగా శ్రీభగవంతుడు యింద్రియముల యొక్క ప్రభావమునుచెప్పుచున్నాడు—ప్రమాథీని ఇతి. "**ప్రమథ్నాతి ఏవం శీలం యేషాం తాని ప్రమాథీని**" ప్ర-ఉపసర్గపూర్వక '**మథేర్హింసాయామ్**'హింసార్థమునందు('మథ్'ధాతువునకు తాచ్ఛీల్యార్థమునందు'ణిని'ప్రత్యయముతగిలి) యింద్రియములకు ప్రమథన శీలములు అని చెప్పబడినది.శ్రోత్రాది సకలేంద్రియములు అత్యంత బలవంతములైనందున వివేకమును మథనము(ఉపమర్దనము-హింస)చేయు సమర్థములు.అందువలన ఎటువంటివారినిగూడ పథభ్రష్టులను చేయగల యింద్రియములు స్వామియగు వివేకి చూస్తుండగా,వివేకరూప రక్షకభటుడు యెదుటనుండగా,వివేకజన్య ప్రజ్ఞ(నిర్వికారస్థితి)లో ప్రవేశించిన మనస్సునుగూడ హఠపూర్వకముగా బలాత్కారముగా అక్కడనుండి చ్యుతుని(పతనము)జేసి,వాటివాటివిషయములగు శబ్దాదులందు తగల్కొనజేసి హరించును.శ్లోకములోని'హి'శబ్దము ప్రసిద్ధి ద్యోతకము.అనగా,ఈవిషయము లోకంలో సుప్రసిద్ధమైనది.ఎట్లనగా—మహాక్రూర స్వభావముగల సాయుధులగు గజదొంగలు ధనవంతున్ని,ధనరక్షకులను కొట్టి,హింసించి వారు చూస్తూండగా ధనమునపహరించి(నిలువుదోపిడిచేసి)పారిపోదురు.అట్లే,యింద్రియములు మనస్సును బలాత్కారముగా విషయాలసమీపమునకు లాక్కొ

[9] శ్లో॥ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః।వైరాగ్యస్యాథ మోక్షస్య షణ్ణాం భగ ఇతీరణా॥ఉత్పత్తింప్రలయఞ్చైవ భూతానామాగతింగతిమ్।వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి॥(వి.పు.6-5-74&78; గీతాభాష్యం 3-36)

ళ్తాయి.అట్లైనచో,

హేభగవాన్!వాటిని ప్రతిఘటించుట(ప్రతీకారము-నిరోధము)మాకెట్లు సంభవము?అను జిజ్ఞాస నుపశమింపజేయుటకుపాయమును జెప్పుచున్నాడు—"**తానిసర్వాణి**"అనంటూ—జ్ఞానసాధనములగు శ్రోత్రాదిపంచ జ్ఞానేంద్రియములను మరియు కర్మసాధనములగు వాగాదిపంచకర్మేంద్రియములను వాటివాటివిషయములనుండి సంయమనముచేసి అనగా వశపరచుకొని,యుక్తుడై అనగా సమాహిత(నిగృహీత)మనస్సుగలవాడై అనగా బాహ్యాన్తరవ్యాపారములులేనివాడై,ఆసీత=స్థిరబుద్ధిగలవాడై(స్థితమై)యుండవలెను.

సరేగాని,ఓవాసుదేవా!ప్రమథనశీలములగు యింద్రియములను వశపరచుకొనుటెట్లు శక్యమౌతుంది?అను శంకానివారణార్థము భగవంతుడు సమాధానము చెప్తున్నాడు."**మత్పరః**"అనంటూ—నాయొక్కఅనన్యభక్తుడవై యింద్రియములను స్వాధీనము చేసికొనవచ్చును."**నేను**"=**సర్వాత్మయగు వాసుదేవుడే, పరము=ఉత్కృష్టఉపాయముగా గలవాడు యెవడో**,అతడు"**మత్పరుడు**"అనగా నాయొక్క యేకాంతభక్తుడు,అనగా నిశ్చలమైన అనన్యభక్తుడు.

"**నవాసుదేవ భక్తానామశుభం విద్యతే క్వచిత్**"(విష్ణుసహస్రనామము) వాసుదేవుని భక్తునకు ఎప్పుడు,ఎక్కడ,యెవరిచే(దేనిచే)గూడ యే కార్యమందును అశుభమనునది కలుగనేరదు."**సర్వత్రాసౌ వసత్యాత్మ రూపేణ విశ్వమ్భరత్వాదితి వాసుదేవః**" జగదధిష్ఠానమై అందరియొక్క ఆత్మరూపముచే సర్వత్ర వసించి(నివసించి)యుండువాడు వాసుదేవుడు.

**శ్లో॥సర్వాణి తత్ర భూతాని వసన్తి పరమాత్మని।**

**భూతేష్వపి చ సర్వాత్మా వాసుదేవస్తతః స్మృతః॥**(విష్ణు.పు.6-5-80)

సమస్తభూతములు పరమాత్మయందు వసించియున్నవి,మరియు పరమాత్మగూడ సర్వుల ఆత్మరూపముచే సకలభూతములందు విరాజమానమైయున్నాడు.అందువల్ల,పరమాత్మ "**వాసుదేవుడు**" అని చెప్పబడెను.

కావున,నాయొక్క అనన్యభక్తుడే తన యింద్రియములను వశపరచుకొనసమర్థుడగును,అన్యులు కాజాలరు.ఎట్లనగా,బలవంతుడైన రాజును ఆశ్రయించిన పురుషునికి శత్రువులవలనగాని,చోరులవలనగాని యేవిధమైన భయముండదు.ఇతనికి రాజయొక్క అండ(రక్షణ)ఉన్నదని తెలిసికొని,స్వయంగా వారే రాజాశ్రిత పురుషుని ఆధీనులగుదురు.అట్లే,ఈఅధికారి పురుషుడు సర్వాంతర్యామియగు వాసుదేవుని(ఈశ్వరుని)శరణబొందినచో,నపుడు"**యీపురుషుడు ఈశ్వరుని శరణువెళ్ళినాడు,ఇక మావ్యాపారములు ఇతనిముందు చెల్లవు**"అని భావించి యింద్రియములు ఆ అధికారిపురుషునికి వశమవుతాయి.అతనికి ఎట్టిఅపాయముచేయుటకు సాహసించవు.ఈలోకప్రసిద్ధ ఉదంతమును దృష్టిలో బెట్టుకొని భగవంతుడు శ్లోకములో"హి"శబ్దమును ప్రసిద్ధిద్యోతకముగా ప్రయోగించెను.

ఇపుడు,యింద్రియములను వశపరచుకొనుటవలన గలుగు ఫలమును చెప్పున్నాడు.ఓఅర్జునా!యే వివేకిపురుషుడు శ్రోత్రాది యింద్రియములను తన వశముజేసుకొనునో,అతనియొక్క శాస్త్రజన్యప్రజ్ఞ స్థిరత్వమునొందును.కావున, వివేకియగు సాధకుడు ఈశ్వరునిపట్ల అనన్యభక్తియను ఉపాయముచే యింద్రియములను జయించును.(మదుసూదనీ).

**శ్లో॥మాత్రాస్వస్రా దుహిత్రావా న వివిక్తాసనో భవేత్।**

**బలవానిన్ద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి॥**(భాగవతము 9-19-17) (మ.స్మృ.2-215)

తల్లి,చెల్లి,పిల్ల(బిడ్డ)తో యేకాంతములోగాని లేక ఒకే ఆసనమునందు గాని కూర్చొనరాదు.ఎందుకనగా,యింద్రియములు చాలా బలవంతములు న్నందున,విద్వానుల మనస్సునుగూడ ఆకర్షిస్తాయి.ఆత్మ విముఖులనుజేసి, విషయాలయందుతగుల్కొనజేసి,అధ్యాత్మమార్గమునుండి పథభ్రష్టులను గావి స్తాయి.

పైశ్లోకమును పురస్కరించుకొని లోకంలో ఒక కింవదన్తి(జనప్రవాద ము—జనశ్రుతి)ప్రచారంలో ఉంది—శ్రీమద్భాగవత రచనాకాలంలో శ్రీవేదవ్యాస భగవానులు తమ శిష్యుడగు జైమినిని,శ్లోకాలను పరీక్షించుటకు ఆదేశిం చేవాడు.ఒకనాడు నవమస్కంధములోని పైశ్లోకాన్నిచూసి ఆలోచింపసాగాడు. ఏమిటి?ఇంద్రియములు విద్వానులనుగూడ విచలితులనుజేయునా?కాదు కాదు.అలా జరుగుటకు సంభవములేదు.ఇంద్రియములు విద్వత్పురుషుల మనస్సును వికృతముచేయజాలవు—అనియిట్లు తనలోతాను అభిప్రాయపడి, శ్రీగురుదేవులతో తన నివేదనమును యిలాతెలిపాడు.ఓ గురుపరమాత్మ! ఈశ్లోకంలో"**విద్వాంసమపికర్షతి**"—దీనిస్థానంలో"**విద్వాంసంనాపకర్షతి**"—అని వ్రా యవలెను.అప్పుడు వ్యాసులవారంటారు—నాయనా!నేనుబాగుగా విచారించి యోగ్యముగానే వ్రాసితిని అందులో పొరపాటేమియును లేదు.ఇట్లుండగా,

ఒకరోజు సంధ్యాసమయమున జైమినులవారు తనకుటీరము ముందు అల్లంతదూరాన ఒకవృక్షముక్రింద వర్షములో తడుస్తూ నిలుచున్న ఒక సుందరమైన యువతినిచూసి,ద్రవీభూతుడై ఇలా అన్నాడు.ఈ కుటీరము మీదే అనుకోండి.లోనికి రండి.ఆశ్రమంలో విశ్రాంతి తీసికోండి.అప్పుడా యువ తి అంటుంది—పురుషులు చాలా మోసగాళ్ళుంటారు.మీపై నేనెట్లు విశ్వాస- ముంచి లోనికిరావాలి.జైమిని:—నేను పూర్వమీమాంసా ఆచార్యులగు జైమిని ఋషిని ఉన్నాను.ఏమి?నన్ను విశ్వసించలేవా?నాలాంటి తపస్విలపైగూడ

నమ్మకములేనిచో,యింకెవరిని విశ్వసించెదవు?కావున,నీవు నిశ్చింతురాలవై ఆశ్రమంలో విశ్రమించుము.జైమినులవారి మాటలు విని,ఆ సుందరి లోనికి వచ్చెను.మార్చు కొనుటకు వస్త్రములిచ్చాడు.అప్సరసవంటి రూపలావణ్య ముగల ఆనవయౌన సుందరినిచూసిన ఋషియొక్క మనస్సు చలించి,ఆమె పొందు కోసము ఉవ్విళ్ళూరసాగింది.కామపీడిత మనస్సుయొక్క ఆతురతను ఆపుకోలేక,ఇంద్రియమనంబులను నిగ్రహించుకొనలేక,ఆమెతో వివాహము గూర్చి ప్రస్తావించెను. అప్పుడు,

సుందరి:—మాతండ్రిగారు యిలా ప్రతిజ్ఞచేసారు.ఏ పురుషుడైతే మా కుమార్తెకు గుఱ్ఱమై(వంగుని తనవీపుపైకూర్చుండబెట్టుకొని)అమ్మవారి గుడి లో దేవిదర్శనము చేయించుకొనివస్తాడో,అతనికి నా కూతురునిచ్చి వివాహ ము చేయుదును—అని. నేనుగూడ మాతండ్రిగారి వాగ్దానముతో యేకీభవిం చితిని.మాజనకుని శపథమునకు మీరు కట్టుబడుతానంటే..........

అపుడు,కామవాసనచే హతవివేకియగు జైమిని,ఆమెను పొందుటకు యేమైనా చేయుటకు సిద్ధపడ్డాడు. ఆ సుందరిని వీపుపై నెక్కించుకొని దేవి మందిరమువద్దకు వచ్చెను.అక్కడ శ్రీగురుదేవులగు వేదవ్యాసమహర్షుల వారు ఆసీనులైయుండుట గాంచెను.వెంటనే తనపై పిడుగు పడినట్లాయెను. చెమటలచే నిలువునా తడిసిపోయాడు.మంత్రముచే పాము విషము దిగిపో యినట్లు,తన కామవాసనాజనిత మైకము(మతిభ్రమ)సంపూర్ణముగా దిగిపోయినది.

జైమినియొక్క సర్వవృత్తాంతమునెఱిగిన శ్రీగురుదేవులు—శ్లోకములో యేశబ్దముంటే బాగుంటుంది నాయనా! "**కర్షతి**" లేక "**నాపకర్షతి**" ? చెప్పు నాయనా!అనియడిగెను.అపుడు జైమినులవారు సచేతుడై—హే గురుదేవా!

మీరు చెప్పినదే ముమ్మాటికి నిజము.అత్యుత్తమము అని ఇట్లు గద్గద స్వరముతో శ్రీగురుదేవుల చరణములపై వ్రాలి క్షమించమని పదేపదే వేడుకొనెను.

*గమనిక:—దృష్టాంతము సత్యమా?అసత్యమా?అని సందేహించక,దానిద్వా రా లోకులకు ఉపదేశించదలచిన తథ్యము(తాత్పర్యవిషయము)ను మాత్ర ము గ్రహించవలెను.*ఈప్రకారముగా శ్రీవేదవ్యాసులవారు ఇంద్రియమనంబుల ప్రాబల్యమును,దౌష్ట్యమును పైశ్లోకముద్వారా లోకమునకుపదేశించిరి.

శబ్దాది విషయాలయందలి ఆసక్తి అనర్థహేతువని ఒక్కొక్క విషయము నకు దృష్టాంతప్రదర్శనపూర్వకముగా మనము లోగడ వైరాగ్యనిరూపణావసర మున శ్రీయోగవాసిష్ఠము ఆధారముగా చింతనజేస్తూ వచ్చాము.ప్రస్తుతము ఇంద్రియనిగ్రహరూప"**దమము**"యొక్కప్రసంగము గావున,వైరాగ్యదార్ఢ్యతకొఱకు, శాస్త్రాన్తరముల ఆధారముగా పునః ప్రకారాన్తరముచే సంక్షేపముగా ఇంద్రి య దోషములనుగూర్చి విచారించెదము.

**1.శ్లో॥శుచిః శష్పాఙ్కురాహారో విదూరక్రమణక్షమః।**
**లుబ్ధకాద్గీతలోభేన మృగో మృగయతే వధమ్॥** (కమందకీయనీతిసారము 1-43)

శుభ్రమైన,కోమలమైన తృణములను(గడ్డిని)ఆహారముగా గ్రహించునటు వంటి,అతివేగముగా దూరదూరప్రదేశములకు పరుగెత్తు సామర్థ్యముగల హరి ణము(జింక),ఒకానొక లుబ్ధకుని(వ్యాధుడు,కిరాతుడు,బో యవాడు)శ్రావ్యమైన గీతమునకు ముగ్ధురాలై(మోహింపబడి),తన మృత్యువును తానే కోరి తెచ్చు కొనుచున్నది.

**శ్లో॥గ్రామ్యగీతం న శృణుయాద్యతిర్వనచరఃక్వచిత్।**

**శిక్షేత హరిణాద్బద్ధాన్మృగయోర్గీత మోహితాత్॥**

**శ్లో॥నృత్యవాదిత్రగీతాని జుషన్ గ్రామ్యాణి యోషితామ్।**

**ఆసాం క్రీడనకో వశ్య ఋష్యశృఙ్గో మృగీసుతః॥**(భాగ.11-8-17&18)

బ్రహ్మవేత్తయగు శ్రీదత్తాత్రేయులవారు యదుమహారాజునుద్దేశించి బోధి స్తున్నాడు.నేను హరిణముద్వారా చక్కటి ఉపదేశమును పొందితిని. వ్యాధుని శ్రావ్యమైనగీతముచే మోహింపబడి జింక(లేడి)బంధింపబడి మృత్యువాతబడి నది.కావున,వనములో(సంసారారణ్యములో)సంచరించు యతి(సన్యాసి,సాధ కుడు)గ్రామ్యగీతములను(విషయసంబంధిగీతములను)అనగా మనోవికారము ను కలిగించు గీతములను వినగూడదు.హరిణగర్భమున జన్మించిన ఋష్యశృంగుడు వేశ్యలయొక్క వైషయిక నృత్య-గీతములను చూసి-విని, వారికి వశగతమై,వారి చేతిలో కీలుబొమ్మ అయ్యెను.

కశ్యపుని పుత్రుడు విభండకుడు.అతని కుమారుడు ఋష్యశృంగుడు. కొమ్ములాంటి అవయవము శిరమునగల్గి జన్మించినందున ఋష్యశృంగుడ ని పిలువబడెను.ఒకనాడు విభండకుడు నదీస్నానము చేయుచుండగా ఊర్వశిని గాంచెను.ఆమెయొక్క అందచందాలను చూసిన విభండకఋషికి మనస్సు చలించి,వీర్యము పతనమై జలమునందు పడెను.ఒకానొక హరిణ ము నీరుత్రాగుచుండగా,వీర్యము దాని గర్భములో ప్రవేశించెను.ఆజింకగర్భ మున ఋష్యశృంగుడు జన్మించెను.అతడు అడవిలో పుట్టి,పెరిగినందున లోకజ్ఞానము బొత్తిగా లేకుండెను.

**శ్లో॥ఋష్యశృఙ్గో వనచరస్తపః స్వాధ్యాయనే రతః।**

**అనభిజ్ఞః స నారీణాం విషయాణాం సుఖస్య చ॥**

**శ్లో॥న తేన జన్మప్రభృతి దృష్టపూర్వం తపస్వినా।**

**స్త్రీ వా పుమాన్వా యచ్చాన్యత్సత్త్వం నగరరాష్ట్రజమ్॥**(వాల్మీకి రామా.1-8-3&9)

వనమునందుండు ఋష్యశృంగుడు ఎల్లపుడు తపస్సు,స్వాధ్యాయము నందు నిరతుడై యుండెను.అతడు ఎప్పుడును స్త్రీలముఖము చూసినవాడు కాదు.విషయసుఖముయొక్క భానములేదు.అతడు జన్మించినది మొదలు యిప్పటివరకు యే స్త్రీనిగాని,పురుషుణ్ణిగాని, నగరవాసులనుగాని,రాజ్యములోని యేయితరజీవులనుగాని యెప్పుడును చూసి యెఱుగడు.

ఇట్లుండగా,ఒకసారి అంగదేశమున మహాభయంకరమైన కరువు,కాటకాలు యేర్పడినవి.బాధ్యతనెఱిగిన రాజు రోమపాదుడు,మంత్రులను బ్రాహ్మణులను పిలిపించి,కరువు నివారణోపాయమునుగూర్చి ప్రస్తావించెను.అప్పుడు వారు—ఏఉపాయముచేనైనను ఋష్యశృంగుడను తపస్విని మన రాజ్యములోకి రప్పించినచో,అతడు పాదముమోపిన తత్క్షణమే వర్షముకురిసి కరువు తీరునని—చెప్పిరి. అందులకుపాయమేమనగా!

**శ్లో॥గణికాస్తత్ర గచ్ఛన్తు రూపవత్యః స్వలఙ్కృతాః।**

**ప్రలోభ్య వివిధోపాయైరానేష్యన్తీహ సత్కృతాః॥** (వాల్మీకి రామాయణము.1-8-5)

పరపురుషునిచెంతకు కులకాంతలు పోగూడదను సంస్కృతి—ఆచారము గావున,ఆ ఋషీశ్వరుని రప్పించుటకు వారకాంతలే(గణికాస్త్రీలు, వేశ్యలు)పోదగినవారు.వంచనజేయుటకు పుట్టినిండ్లగుటచే ఎట్టి మగవారినైనను వారు వశపరచుకొనగలరు.కావున,చక్కటి రూపవతులును, అలంకారయుక్తులును

నగు వేశ్యలను సాదరముగ పంపించండి.వారు వారినేర్పుతో(నైపుణ్యముతో) రకరకాల ప్రలోభములనుజూపి,యెట్లైనను అతనిని దోడుకొని రాగలరు—అని చెప్పిరి.

దానికి రోమపాదుడు సమ్మతించి,మీయభిప్రాయము ప్రకారమే కానిం డు—అని ఆజ్ఞాపించెను.రాజుయొక్క ఆజ్ఞానుసారము మంత్రులు నగరము లోని ముఖ్యమైన,అతిసుందరమైన కొందరువేశ్యలను ఋష్యశృంగుని తోడ్కొని తెచ్చుటకు వనమునకు పంపిరి.విభండకుడు లేనిసమయమున వారు వారి యొక్క నేర్పుతో చిత్రవిచిత్రమైన నృత్యగానములచే ఆకర్షించి మోహింపజేసి (కీలుబొమ్మనుజేసి)అంగరాజ్యమునకు తీసికొచ్చిరి.అతని రాకచే రాజ్యములో వర్షములు కురిసి దేశము సుభిక్షమాయెను.దానిచే రోమపాదుడు చాలాసం తసించి కృతజ్ఞతలు చెల్లించుటకొఱకును మరియు విభండకుని కోపమును చల్లార్చుట కొఱకును తన దత్తపుత్రికయగు“శాంత”ను ఋష్యశృంగునకిచ్చి వివాహము చేసెను. ఈ ప్రకారముగా—

**శ్లో॥ఏవం స న్యవసత్తత్ర సర్వకామైః సుపూజితః।**

**ఋష్యశృఙ్గో మహాతేజాః శాన్తయా సహ భార్యయా॥**(వా.రా.1-10-32)

ఋష్యశృంగుడు,భార్యయగు శాంతతోపాటు అనేక రాజభోగములననుభవి స్తూ రోమపాదుని రాజధానియందే ఉంటుండెను.అస్తు.సారాంశమేమనగా, యతియైనవాడు(సాధకుడు)విషయసంబంధి గ్రామ్యగీతములను వినగూడ దు—అని దత్తాత్రేయుల వారు చెప్పిరి. మరియు,

**2.శ్లో॥గిరీన్ద్రసదృశాకారో లీలయోన్మూలితద్రుమః।**

**కరిణీస్పర్శసమ్మోహాదాలానం యాతి వారణః॥**(కమండకీయ నీతిసారము 1-44)

పర్వతములాంటి యాకారముగలదియు,వృక్షమునుగూడ అవలీలగా పెరికి వేయగల సామర్థ్యముగలదియునగు యేనుగు, కామమోహితమై,కాగితపు యేనుగును లేదా చెక్కయేనుగును నిజమైన యేనుగు అని భ్రమజెంది, దానితో స్పర్శసుఖమునుగోరి గోతిలోపడి మావటివానిచే బంధింపబడి యనర్థమును కొనితెచ్చుకొనును.

**శ్లో॥పదాపి యువతీం భిక్షుర్నస్పృశేద్దారవీ మపి।**

**స్పృశన్ కరీవ బధ్యేత కరిణ్యా అఙ్గసఙ్గతః॥**(భాగ.11-8-13)

భిక్షువు=సన్యాసి, స్త్రీని పాదముచేనైనను స్పృశింపగూడదు.కొయ్యతో జేయబడిన తరుణి ప్రతిమనుసైతము తాకరాదు.ఏనుగులను పట్టువారు ఒక పెద్దగోతిని త్రవ్వి,దానిపై గడ్డిగాదములను గప్పి,దాని సమీపమున ఒక కాగితము లేదా కొయ్యతో జేసిన యేనుగును లేదా ఒక నిజమైన ఆడయేనుగునుగాని నిల్పుదురు.అపుడా మగయేనుగు ఆ ఆడయేనుగును స్పృశించుటకువచ్చి,తటాలున గోతిలోపడి బంధింపబడును.అట్లే,సన్యాసి(సాధకుడు) స్త్రీని స్పృశించునేని సంసార బంధమునకు లోనగునని గజమువలన నేర్చితిని—అని దత్తాత్రేయులవారు చెప్పిరి.

**3.శ్లో॥స్నిగ్ధదీపశిఖాలోక విలోభిత విలోచనః।**

**మృత్యుమృచ్ఛత్యసందేహాత్పతఙ్గః సహసా పతన్॥**(క.నీ.1-45)

చమురుచే దేదీప్యమగు దీపశిఖాలోకము(ప్రకాశము)ను ఫలమని భ్రమించి శీఘ్రముగా వెళ్ళి,దానితో సంబంధమగుటతోడనే పతంగము(మిడుత) మసై మడయును(నశించును).

**శ్లో॥దృష్ట్వాస్త్రియం దేవమాయాం తద్భావైరజితేన్ద్రియః।**

**ప్రలోభితః పతత్యన్ధే తమస్యగ్నౌ పతఙ్గవత్॥**

**శ్లో॥యోషిద్ధిరణ్యాభరణామ్బరాది ద్రవ్యేషు మాయారచితేషు మూఢః।**

**ప్రలోభితాత్మాహ్యుపభోగబుద్ధ్యాపతఙ్గవన్నశ్యతి నష్టదృష్టిః॥**(భాగ.11-8-7&8)

మిడుత యెట్లు ధగధగ ప్రకాశించుచు జ్వలించుచున్న అగ్నిజ్వాలను గాంచి,అదియేదో అపూర్వభక్ష్యమని ఆశించి,దానిలోబడి మడయునట్లు,పురుషుడు దేవమాయయగు స్త్రీనిగాంచి,ఆ భామ ప్రేమకటాక్ష వీక్షణంబులకు లొంగిన ఇంద్రియములుగలవాడై,ఆ కాంతయందత్యంతాసక్తుడై అంధతమోరూపమైన సంసారమున పడుచున్నాడు.

మిడుత అగ్నిప్రకాశమునుజూచి,తనచూపు భ్రమించి,దాని యందాశగొని కూలునట్లు పురుషుడు—కంటి చూపును వంచింప నిర్మింపబడిన స్త్రీయొక్క సుకుమారమైన అంగభంగిమలు,ఒంటిపైన కన్నుకుట్టు పట్టువస్త్రములు,ఆ పైన శృంగారపు ఆభరణాలనలంకరించుకొని కన్పట్టుటచే,ఆమె తనకిష్టభోగప్ర-దాయినియని మూఢుడై,ఆ కామిని యందత్యంతాసక్తుడై భ్రమసి నశించుచున్నాడు.రూపమునుగూర్చి యిట్లు మిడుతవలన నేర్చితిని—అని దత్తాత్రేయులవారు చెప్పిరి.

**4.శ్లో॥దూరేఽపి హి భవన్ దృష్టేరగాధే సలిలే ఛరన్।**

**మీనస్తు సామిషం లోహమాస్వాదయతి మృత్యవే॥** (క.నీ.1-46)

మానవమాత్రుల కసాధ్యమగు జలాంతర్గత అతిదూరదృష్టి గలదియు,అగా-ధజలములో,అత్యంతవేగముగల ప్రవాహములోగూడ అతివేగముగా ప్రవాహ

మునకెదురుగా పయనించగల మీనము(చేప),రస వైవశ్యముచే గాలమున కు గ్రుచ్చబడిన ఆమిషము=మాంసముముక్క(ఎర)ను ఆస్వాదించనెంచి, గాలమున జిక్కుకొని మృతినొందును.

**శ్లో॥జిహ్వయాతి ప్రమాథిన్యా జనో రసవిమోహిత।**

**మృత్యుమృచ్ఛత్యసద్బుద్ధిర్మీనస్తు బడిశైర్యథా॥**

**శ్లో॥తావజ్జితేన్ద్రియో నస్యాద్విజితాన్యేన్ద్రియః పుమాన్।**

**న జయేద్రసనం యావజ్జితం సర్వం జితే రసే॥**(భాగ.11-8-19&21)

రుచులకై మిగులనాతురపడు జిహ్వచే రసవంతములైన పదార్థములందు తగుల్కొనిన జనులు,తాత్కాలిక రుచినిగల్గించు స్వాదిష్టపదార్థ ములందిష్ట ముగలవారై,ఎరలు గ్రుచ్చబడిన గాలముల,పై-మాంసమును తినగోరి ఆ గాల ములను నోటబట్టిన మీనము పగిది నాశనము నొందెదరు.

వివేకిపురుషుడు భోజనమును త్యజించి(మినహాయించి) అన్యములగు శ్రోత్రాదీంద్రియములపై నతిశీఘ్రముగ విజయము పొందగలడు.కాని,రసనేంద్రి యము మాత్రము వశముగాక మరింత వర్ధిల్లును(ప్రబలమగును).రుచికర మగు అన్నాదికమును భుజించినయెడల మఱల రుచియందాసక్తిచే సర్వేంద్రి యములు క్షోభించును(చంచలము గావించబడును).కావున,రుచియందాస క్తిని పరిత్యజించి,ఔషధమువలె అన్నాదికమును భుజించవలెను.అనగా జీ వించుటకు మాత్రము భుజించి సంతోషించవలెను.

రసనేంద్రియము(నాలుక)అతిదుర్జయమను విషయమును శ్రీశుకమునీం ద్రులు చెప్పున్నారు.ఇతరములగు శ్రోత్రాదీంద్రియములనన్నింటిని గెల్చినను

పురుషుడెంతవరకు జిహ్వను జయించడో,అంతవరకు జితేంద్రియుడు కాజా లడు.ఆ రసనేంద్రియమును(నాలుకను)యెపుడు జయించునో,అపుడు అన్ని యింద్రియములను జయించినవాడగును.

రసనేన్ద్రియజయస్తు భగవదుచ్చనామకీర్తన రసాస్వాదనాద్భవేత్।తదుక్తం— **"రసవర్జంరసోఽప్యస్యపరందృష్ట్వానివర్తతే"**(గీత.2-59)(భాగ.వంశీధరి).రసనేంద్రియమైతే,ఉచ్ఛస్వరముతో భగవంతునినామసంకీర్తన రసామృతమును ఆస్వాదించుటవలననే జయింపబడును.శ్రీమద్భగవద్గీతలోభగవంతుడుగూడ యిలాచెప్పియుండెను.నిత్యానిత్యవస్తువివేకములేని అజ్ఞానిపురుషుడు,విషయములను గ్రహించక అతికఠోరమైన తపస్సుచేసియు దేహాభిమానమును వదలజాలనివాడు,శబ్దాది విషయములను గ్రహించకయుండిననూ విషయభోగములందలి యాసక్తిని విడువజాలడు.కఠోరతపమొనరించి తుదకు మేనకయను యప్సరసయందాసక్తుడై శకుంతలకుజన్మనిచ్చిన విశ్వామిత్రుడే ఇందులకు మంచి తార్కాణము.కాని,యీరాగాత్మక సూక్ష్మ"**ఆసక్తి**"గూడ పైవిధమగు సాధకునికి భగవన్నామ సంకీర్తనాది బహిరంగ సాధనలద్వారా చిత్తము పరిపక్వమై(అంతఃకరణశుద్ధిగలిగి)గురుశాస్త్రములనాశ్రయించి శ్రవణాదులొనరించగా పరమార్థ తత్త్వస్వరూపమైన బ్రహ్మసాక్షాత్కారము గలిగినప్పుడు తనంతట తానుగా తొలగిపోవును.

**శ్లో॥పృథివ్యాం యాని భూతాని జిహ్వోపస్థ నిమిత్తకమ్।**

**జిహ్వోపస్థ పరిత్యాగే పృథివ్యాం కిమ్ప్రయోజనమ్॥**(ఉత్తరగీత. 3-6)

భూమియందు యేభూతములు(ప్రాణులు)గలవో,ఆ భూతముల సముదాయము జిహ్వోపస్థలు నిమిత్తములుగాగలవి,అనగా జిహ్వేంద్రియమునకు

విషయమగు రసమునందు,ఉపస్థేంద్రియమునకు విషయమగు స్త్రీపురుషసం బంధజనిత క్షుద్రానందమునందాసక్తమై యున్నవి.ఒకవేళ,జిహ్వోపస్థలను పరిత్యజించినచో,అతనికి పృథివిలో పొందదగిన ప్రయోజనమేమియును మిగలియుండదు.

స్వాధీనమైన యింద్రియములుగలవానికి వైరాగ్యము స్వయముగానే గలు గునని పైశ్లోకము తెలుపుచున్నది.పృథివియందలి ప్రాణులు రసనేంద్రియము నకు వశీభూతులై కామోద్రేకమును గలిగించు పదార్థములను సేవించి,దా నిచే కామప్రేరితులై ఉపస్థేంద్రియమును నిగ్రహించలేక సంసర్గానందముకొఱ కు వివశులై ప్రవృత్తులగుచున్నారు.సమస్తములైన విషయభోగములకు జిహ్వోపస్థలే కారణమైయున్నవి.కావున,పరమార్థమును సాధించగోరు సాధకు డు"***<u>జితం సర్వం జితేరసే</u>***"అని చెప్పబడినట్లుగా,ప్రప్రథమముగా జిహ్వేంద్రియ మును పిదప గుహ్యేంద్రియమును జయించాలి.ఈరెంటిని జయించినచో యిక ప్రపంచములో సాధించదగిన ప్రయోజనము మిగిలియుండదు. జిహ్వేం ద్రియమును జయించుట యనగా,

జీవనవిధానములను బట్టియు,అవసరాలను బట్టియు,దేశకాలములనను సరించి, వర్ణాశ్రమ ధర్మములననుసరించి అన్నపానాదులను స్వీకరించాలి.ఆ అన్నపానాదులు సత్య,న్యాయమార్గములద్వారా సమకూర్చుకొనబడినవియు, శాస్త్రానుకూలములైనవియు,ఆరోగ్యమునకు హానికలిగించునవిగాకుండా హిత ముగా,మితముగా దైవార్పితములుగానుండవలెను.మరియు రజస్తమోగుణ ములను కలిగించునవి గాకుండా సాత్వికములును అయియుండవలెను.

**శ్లో॥ఆయుః సత్త్వబలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః।**

**రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యాఆహారాః సాత్వికప్రియాః॥**(గీత.17-8)

ఆయువు=చిరకాలజీవనము;సత్త్వము=ప్రబలదుఃఖములు ప్రాప్తించినను నిర్వికారముగా నుండగలుగు చిత్తముయొక్క ధైర్యము; బలము=స్వఉచిత కార్యములందు శ్రమాఽభావమునకు హేతువగు శరీర సామర్థ్యము;ఆరోగ్య ము=జ్వరశూలాద్యభావము;సుఖము=భోజనానంతరము ఆంతర్యములోగలు గు ఆహ్లాదము,తృప్తి;ప్రీతి=భోజనసమయమున భోజనవిషయక అరుచిగలుగ క దానియందు ఉత్కట ఇచ్ఛగలుగుట;వివర్ధనాః=వీటినన్నిటిని విశేషముగా వృద్ధి చేయగల;రస్యములు=ఆస్వాద్యములు అనగా మధురరసప్రధానములు; స్నిగ్ధములు=స్వాభావికము మరియు ఆగంతుకమునగు స్నేహయుక్తములు. **"చూర్ణాదిపిండీభావహేతుర్గుణః=స్నేహః"**(తర్కసంగ్రహము)వరిపిండినిగాని, గోధుమ పిండినిగాని ముద్దగాజేయగల గుణమునకు స్నేహమందురు.ఇదికేవలము జలమునందే స్వాభావికముగానుండును.ఘృత(నేయి),తైలాదులందు ఆగం తుకరూపములోనుండును,స్థిరములు=శరీరమునందు రసాద్యంశము చిరకా లము ఉండగలుగునవి,హృద్యములు=దుర్గంధరూప దృష్టదోషముగాని,అశు చిత్వరూప అదృష్టదోషముగాని లేనివియునగు భక్ష్య(చర్వ్య),భోజ్య,లేహ్య,చో ష్యములు అను చతుర్విధాహారములు సాత్విక పురుషులకు ప్రీతికరములు. (మధుసూదని)

**శ్లో॥నాత్యశ్నతస్తుయోగోఽస్తి నచైకాన్తమనశ్నతః।**(గీత6-16)

**శ్లో॥యుక్తాహార విహా రస్య।**(గీత.6-17)

అధికముగా భుజించువానికిని,ఏమాత్రము భుజింపనివానికిని యోగము సిద్ధించదు.అతిగా భుజించినచో మత్తువచ్చును.సోమరితనము వచ్చును.భు

క్తాయాసముగలుగును.జీర్ణశక్తి పట్టించుకొనక వివిధరోగములు ఉత్పన్నమగును.ఆహారమును పూర్తిగాత్యజించి కటిక ఉపవాసములుచేసినచో వాని యింద్రియములు,ప్రాణములు,మనస్సు శక్తిహీనములగును.పరమేశ్వరునియందు మనస్సును లగ్నముచేయజాలక,సాధనలో విఘ్నమేర్పడును.కావున,సాధకుడు అవసరమునకు మించి భుజింపరాదు.మరియు కటికఉపవాసములు చేయరాదు.పరమార్థసాధనజేయుటకుపయుక్తమగు,జీవననిర్వహణకు సరిపడు ఆహారమును మాత్రము స్వీకరించాలి.

**శ్లో॥అత్రాహారార్థం కర్మకుర్యాదనింద్యం,**

**కుర్యాదాహారం ప్రాణసంధారణార్థమ్।**

**ప్రాణాః సంధార్యాస్తత్త్వజిజ్ఞాసనార్థం,**

**తత్త్వం జిజ్ఞాస్యం యేన భూయో న దుఃఖమ్॥**

(యో.వా.నిర్వాణప్రకరణము, ఉత్తరార్ధమ్ 21-10)

హితము,మితము,మేధ్యము(పవిత్రము)నగు ఆహారముకొఱకు,ముముక్షుపురుషుడు-శ్రుతి,స్మృతి మరియు శిష్టపురుషులచే ననుమోదితము, అనింద్యమునగు కర్మలాచరించవలెను.ఆ ఆహారమునుగూడ ప్రాణధారణకు (జీవించుటకు)మాత్రము భుజించవలెను.ఆ ప్రాణసంధారణముగూడ తత్త్వజిజ్ఞాస (జీవబ్రహ్మైక్యమును తెలిసికోవాలను యిచ్ఛ) కొఱకై యుండాలి.దేనిచే మళ్ళీ జన్మమరణరూప సంసారదుఃఖము ప్రాప్తము కాదో,అటువంటి తత్త్వజిజ్ఞాసచేయాలి.అట్లే,మితాహారము(ఆహార పరిమాణము)గూర్చి భాష్యకారులు చెప్పున్నారు—

**శ్లో॥అర్ధమశనస్య సవ్యజనస్య తృతీయముదకస్యతు।**

**వాయోః సఞ్చారణార్థం తు చతుర్థమవశేషయేత్॥**(గీతాభాష్యమ్ 6-16)

పొట్టయందలి సగభాగమును శాకాహారము మొదలగు కూరగాయలతోకూడిన భోజనమును,మూడవభాగమును జలముతో పూరించవలయును. నాల్గవభాగమును వాయువుయొక్క రాకపోకలకొఱకు ఖాళీగా వుంచవలెను.

పరమవాత్సల్యభావముతో శ్రుతిమాతగూడ బోధిస్తున్నది.“**ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః,సత్త్వశుద్ధౌధ్రువాస్మృతిః,స్మృతిలమ్భేసర్వగ్రన్థీనాం విప్రమోక్షః**”(ఛాం.7-26-2).దర్పణము స్వచ్ఛముగావుంటేనే ముఖము స్పష్టముగా గోచరించును. అట్లే,అంతఃకరణము శుద్ధముగా నున్నపుడే“**హస్తామలకము**”చేతిలోని ఉసిరికాయవలె స్వస్వరూపసాక్షాత్కారము గలుగును.దానికోసము శ్రుతిమాత ప్రాథమికమౌలికసాధన“శుద్ధిని”గూర్చి బోధిస్తుంది—ఆహారశుద్ధౌ-అనంటూ.“**ఆహ్రియతే ఇత్యాహారః**”భోక్తయొక్క భోగముకొఱకు శబ్దాదివిషయవిజ్ఞానము ఆహరణముచేయబడుతుంది.ఆహారశబ్దముచే నుపలక్షిత శబ్దాది పఞ్చవిషయాలను గ్రహించాలి.విషయోపలబ్ధిరూప విజ్ఞానముయొక్క శుద్ధియే“**ఆహారశుద్ధి**” అనబడును.శుద్ధమగుఆహారమును భుజింపవలెను.పవిత్రమగు వస్తువులనే (వికారమునుకలిగించనివాటినే)చూడాలి.పుణ్యశ్రవణమునే చేయాలి,శుద్ధమునే తాకవలయును.అనగా,రాగద్వేషమోహాది దోషములచే అసంస్పృష్ట(అసంబద్ధ) విషయవిజ్ఞానము“**ఆహారశుద్ధి**”యనబడును.ఈవిధమగు ఆహారశుద్ధిగల్గినపుడే అంతఃకరణముయొక్క సత్త్వము(నిర్మలత్వము)సంపాదింపబడును. సత్త్వబుద్ధి గల్గినపుడే భూమాతత్త్వము(వ్యాపకబహ్మతత్త్వము)నందు నిరంతర దృఢస్మృతి గలుగును.దానిచే,అనాద్యజ్ఞానకృత సమస్త అనర్థరూప పాశములు

మరియు అనేక జన్మాంతరములలోని అనుభవజన్య సంస్కారములచే సుదృఢమైన హృదయగ్రంథులు సంపూర్ణముగా వినాశమునొందును.ఎందుకనగా, సకలహృదయగ్రంథులు విచ్ఛిన్నమగుటకు ప్రథమమౌలిక సాధనము"**ఆహారశుద్ధి**"యే —అని పిండితార్థము.

అన్యత్ర"**యదు హ వా ఆత్మసమ్మితమన్నంతదవతితన్నహినస్తి, యద్భూయో హినస్తి తద్యత్కనీయో న తదవతి**"(శతపథ బ్రాహ్మణము 7-2-2-17&7-5-1-14). తన శరీరముయొక్క శక్త్యనుసారము తినబడిన అన్నము ఆశరీరమును రక్షించును.శరీరమునకు కష్టమును గలుగజేయదు.అనగా దేహమును పాడుచెయ్యదు.శక్తికిమించి గ్రహించబడిన యాహారము ఆదేహమును కష్టపెట్టును. అనగా అనారోగ్యమునకు కారణమగును. అట్లే తన శరీరపోషణకు తగినంత ఆహారమును గ్రహించనియెడల దేహము కృశించి చివరకు నశించును.

ఇంతదనుక శాస్త్రోక్తరీతిగా ఆహారసంబంధమగు సామాన్యనియమములను గూర్చి తెలిసికున్నాము.ఇంకా విస్తారముగా తెలియగోరువారు మాచే రచింపబడిన"**శ్రీభక్త తుకారాం అభంగవాణి**"అను గ్రంథములో నూటడెబ్బది నాలుగవ పుష్ఠమునుండి గనందగును.ఇపుడు [10]ప్రాసంగికముగా యతికి(సన్యాసికి) ఆహారవిషయంలో శాస్త్రము విధించిన విశేషనియమాలనుగూర్చి తెలిసికొందము.

**" యథాలబ్ధోపజీవీస్యాత్ హస్తప్రాప్తంచ భక్షయేత్ ।**

**ప్రాణయాత్రా నిమిత్తం చ వ్యఙ్గారే భుక్తవజ్జనే ।**

**కాలే ప్రశస్తవర్ణానాం భిక్షార్థం పర్యటేద్గృహాన్ ।**

[10] స్మృతస్య ఉపేక్షా అనర్హత్వమ్ ప్రసంగః।

**పాణిపాత్రంచరస్ యోగీనాసకృద్భైక్ష్యమాచరేత్"**॥(నా.పరివ్రాజకోపనిషత్ పంచమోపదేశః)

పరమహంసాది సన్యాసులు ప్రారబ్ధానుసారము ప్రాప్తమైన దానితో జీవించాలి.భిక్షను గ్రహించుటకు తనచేతులనే పాత్రగాజేసికొని,దోసిలి ప్రమాణమగు అన్నమునుమాత్రమే భుజించాలి.గ్రామము బయట వృక్షమూలమున విశ్రమించాలి.ఆకలిగానున్నపుడు ప్రాణయాత్రానిమిత్తము గ్రామములో ప్రవేశించి, మ్లేచ్ఛాది గృహములువిడిచి ప్రశస్తమగు వర్ణాశ్రమములకు జెందినవారి యిండ్లలో భిక్షాటనము చేయాలి.అనేక మార్లు భిక్షాటన చేయగూడదు.

**భైక్షేణ వర్తయేన్నిత్యం నైకాన్నాశీ భవేత్ క్వచిత్।**

**పఞ్చసప్తగృహాణాం తు భిక్షామిచ్ఛేత్క్రియావతామ్॥**

ప్రతినిత్యం ఒకే గృహమునుండి భిక్షను స్వీకరించగూడదు. ఐదు లేక ఏడు యిండ్లలో భిక్షాటనము చేయాలి. (సన్యాసోపనిషత్)

**ఏక రాత్రం వసేద్గ్రామే పత్తనే తు దినత్రయమ్।**

**పురే దినద్వయం భిక్షుర్నగరే పఞ్చరాత్రకమ్॥**

**వర్షాస్వేకత్ర తిష్ఠేత స్థానే పుణ్యజలావృతే**॥(నా. ప)

యతి(సన్యాసి)గ్రామములో ఒకరాత్రిమాత్రము గడపాలి."**ద్విరాత్రం న వసేద్గ్రామే**"గ్రామములో రెండురాత్రులు నివసించగూడదు.పుర ములోరెండురాత్రులు,పట్టణములో మూడురాత్రులు మరియు నగరంలో ఐదురాత్రులు నివసించాలి.వర్షాకాలములో పవిత్రభాగీరథీమొదలగు నదీతటములలోగాని,పుష్కరాది పుణ్యజలస్థానములలోగాని,పుణ్యక్షేత్రములలోగాని ఒకేచోట నివసించాలి.

గృహస్థులు నాలుగు విధములుగానుందురు.1.కుసూలధాన్యులు=గరిసెలు నిండుగా ధాన్యమునుంచి జీవించువారు.2.కుంభీధాన్యులు=కడవలనిండుగా ధాన్యముపోసికొని జీవించువారు.3.త్ర్యహికులు=మూడుదినములకు సరిపడు ధాన్యముంచుకొనువారు.4.అశ్వస్తులు=రేపటికించుకయు లేనివారు.వీరిలో జాతిపతితులను,మ్లేచ్ఛులను(నిందితులను)విడచి,వీరియింట లాభముండునని ముందే యుద్ధేశించబడనివారగు నాల్గువిధములగు గృహస్థులయిండ్లల్లో,ఏడు గృహములకు మాత్రమే భిక్షకుపోవలెను.యతి ఆగృహములందువచ్చిన దానితో తృప్తినొందవలెను.భిక్షాటనలో ప్రాప్తించినయన్నమును(మాధుకరిని)గ్రామమునకు వెలుపలగల జలాశయమునకు గొనిపోయి,జలాశయములో కాళ్ళు చేతులుకడుగుకొని,ప్రోక్షణాదులచేపవిత్రమొనర్చి,బ్రహ్మ,విష్ణు మరియు సూర్యునకు,అట్లే యితరపిపీలికాది భూతములకు సమర్పించిన మీదట,యెవ్వడేని ఆకలితో యాచించినచో అతనికిచ్చి మిగిలినదానిని మౌనియై భగవత్ప్రసాదముగా యేమియును మిగిల్చకుండాతినవలెను.దీనివలన అధికముగా భిక్షాన్నమును యాచించుట నిషేధింపబడినది.ఒక్కొక్కప్పుడు సమయానికి మాధుకరి(భిక్షాన్నము)లభించనిచో దుఃఖింపరాదు.లభించినచో సంతోషింపరాదు.లభించుట,లభించకపోవుటయనునవి దైవాధీనములని తలంపవలెను. ప్రాణధారణకుమాత్రము వలయునంత ఆహారమును కోరదగును.ప్రాణదారణ చేతనేగదా ఆత్మతత్త్వవిచారణ చేయబడును!ఆత్మవిచారణచే ఆత్మనెఱింగి బంధవిముక్తుడగును!తన ప్రయత్నములేకయే(అయాచితముగా)లభించిన మృష్టాన్నమైనను,సామాన్యమైనను దానిని భుజించవలెను.అట్లే నివాసము, వస్త్రము,పడక,లభించినచో ఇవిమంచివి,ఇవి మంచివి కావు—అని తలంపక వాటిని గ్రహించవలెను.ఈశ్వరావతారవిశేషమగుశ్రీరాముడు,శ్రీకృష్ణుడు మున్న

గువారు యెట్లు లీలగా శాస్త్రోక్త శౌచ,స్నానాది నియమములను పాటించిరో, అట్లు యతిగూడ పాణిపాదప్రక్షాళనాది శౌచము,ఆచమనము,స్నానము, యితరములగు నియమములను లీలగా ఆచరింపవలెను.కాని,కర్తవ్యముగా భావించి విధికింకరుడై ఆచరింపరాదు.ఎందుకనగా,జ్ఞాననిష్టగల పురుషునికి భేదప్రతీతి కలుగదు.పూర్వము యే భేదప్రతీతి కలుగుచుండెనో,అది బ్రహ్మాత్మైకత్వ సాక్షాత్కారముచే నష్టమైనది.మరణపర్యన్తము అప్పుడప్పుడు బాధిత భేద ప్రతీతి కలుగుచున్ననూ,దేహపాతానన్తరము(విదేహకైవల్యమునందు)బ్రహ్మముతో సంపత్తి(ఐక్యము)నొందును.(శ్రీమద్భాగవతము పదకొండవ స్కంధము పదునెనిమిదవ అధ్యాయము నుండి).

ఇట్లు,ఉపరోక్త ప్రకారముగా ఆహారనియమములను పాటించినచో జిహ్వేంద్రియము జయింపబడుటయేగాక,అంతఃకరణ శుద్ధిద్వారా ఆత్మజ్ఞానమునకు సాధనమగును.ఇపుడు ఉపస్థేంద్రియమును జయించుటకుపాయభూతమగు దోషదర్శనమును మాతృవాత్సల్యముచే శ్రుతిమాత ఉపస్థస్వరూప స్వభావాలను వివరిస్తుంది.

**శ్లో॥స్త్రీణామవాచ్య దేశస్య క్లిన్న నాడీవ్రణస్య చ।**

**అభేదేఽపి మనోభేదాజ్జనః ప్రాయేణ వఞ్చ్యతే॥**

**శ్లో॥చర్మఖణ్డం ద్విధాభిన్నమపానో ద్గారదూషితమ్।**

**యేరమన్తి నమస్తేభ్యః సాహసం కిమతః పరమ్॥**(నారద పరివ్రాజ. 4-29&30)

స్త్రీలయొక్క గుహ్యప్రదేశమునకు,తడిసిన నాడులతోగూడిన వ్రణమునకు భేదములేకున్నను మోహవశమున జనులు మనోభేదముచే తరచుగా మో

సవిపొఉచున్నారు.అపానవాయువుచే దూషితమైనది,రెండుగా చీలినదియైన చర్మఖండముమాత్రమేగాని,ఇందుసౌందర్యమెంతమాత్రములేదు.ఇటువంటి హేయ(అసహ్య)ప్రదేశమున మూర్ఖులై రమించుటకంటె సాహసము యింకేమై యుండును.అట్టి వారలకు నమస్కారములు.తాత్పర్యమేమనగా, సమస్తములైన విషయభోగములకు కారణమైన జిహ్వోపస్థలయందు యెవనికి హేయ భావముగల్గునో,వాడు చపలత్వంలేని దేహాభిమానరహితుడగును.అట్టివానికి వైరాగ్యము స్వయముగనే సిద్ధించుచున్నది,యిక అతనికి ప్రపంచముతో పనిలేదు.ఈ పృథివిలో నతనికి సాధించదగినదేమియును లేదు.

**"కలౌయుగే జనాఃసర్వే శిశ్నోదరపరాయణాః"**(వేంకటాచల మహాత్మ్యమ్)

కలియుగములో సకలజనులు శిశ్నేంద్రియమును మరియు పొట్టను తృప్తి పరచుకొనుటయందే తత్పరులై యుందురు.కాని,శ్రుతిమాత సకలజీవులపై అత్యంతజాలిజూపి,దయార్ద్రహృదయముతో ఉచ్ఛస్వరముతో నుద్ఘోషించుచున్నది—ఇదిగో,

**శ్లో॥యస్యైతాని సుగుప్తాని జిహ్వోపస్థోదరం కరః।**

**సన్యసేదకృతోద్వాహో బ్రాహ్మణో బ్రహ్మచర్యవాన్॥**

**శ్లో॥సంసారమేవ నిఃసారం దృష్ట్వాసారదిదృక్షయా।**

**ప్రవ్రజన్త్యకృతో ద్వాహాః పరం వైరాగ్యమాశ్రితాః॥**(నారద.ప.2-13&14)

ఎవరియొక్క జిహ్వేంద్రియము,ఉపస్థేంద్రియము,ఉదరము మరియు హస్త పాదాది సకలేంద్రియములు చక్కగా రక్షింపబడుచున్నవో అనగా తన వశమందున్నవో,ఆ అవివాహిత బ్రహ్మచారి బ్రాహ్మణుడు సన్యసించుటకు అధికా

రియగును.ఉపలక్షణముగా గృహస్థుడుగాని,వానప్రస్థుడుగాని అనగా యెవరికి జిహ్వోపస్థాది సకలేంద్రియములు తన అధీనములైయుండునో,మరియు యీసంసారములో సారమేమియును లేదను నిశ్చయముగల్గి,సారభూతమగు పరబ్రహ్మతత్త్వమును దెలిసికొను జిజ్ఞాసతో పరమవైరాగ్యము నాశ్రయించినవారు(పుత్ర,విత్త,లోక)ఈషణత్రయమునువదలి,ప్రవ్రజన్తి=సన్యసించుచున్నా రు.

కావున,సకలసాంసారిక విషయోపభోగములకు కారణమగు జిహ్వోపస్థలను జయించిన వానికే పరమార్థసాధన సుకరమగునను విషయమును ఉత్తరగీత(3-6) ***“పృథివ్యాంయానిభూతానిజిహ్వోపస్థనిమిత్తకమ్”***(పృష్ఠము301)అను శ్లోకమునకు వ్యాఖ్యానమును యింతదనక తెలిసుకుంటూ వచ్చాము. సరే, ఇపుడు **గంధ**విషయమును గూర్చి తెలిసికొందము.

**5.శ్లో॥గన్ధలుబ్ధో మధుకరో దానాసవపిపాసయా।**

**అభ్యేత్యసుఖ సఞ్చారాన్ గజకర్ణఝలజ్ఝలాన్॥**(కమందకీయ నీతిసార.1-47)

గంధమునందాసక్తమైన తుమ్మెద తామరపుష్పములోజేరి మకరంద పానముచే మత్తిల్లి బయటకురాజాలకుండగా,సాయంసమయాన కొలనులో స్నానమాచరించు యేనుగులచే తామరపుష్పము నలిపివేయబడగా భ్రమరముగూడ నశించును.అసుఖసఞ్చారాన్=ఎచ్చట సంచరించినచో వినాశము నిశ్చితమో,అటువంటి ప్రదేశములు—అనియర్థము.

**శ్లో॥స్తోకం స్తోకం గ్రసేద్ గ్రాసం దేహోవర్తేత యావతా।**

**గృహానహింసన్నాతిష్ఠేద్ వృత్తిం మధుకరీం మునిః॥** (భాగ. 11-8-9)

ముని—ఒకచోటనుండక,గృహస్థులను పీడింపక,ఎంతమాత్రముచే దేహయాత్ర కొనసాగునో అంతమాత్రము గృహస్థులనుండి కొంచెము కొంచెము స్వీకరించి, భుజించుచు,మధుకరమెట్లు పుష్పములలోని మకరందమును కొంచెము కొంచెము గ్రహించునో అట్లు"**మధకరవృత్తి**"నవలంబించి జీవించవలెను.లేనిచో, ఒకే కమలముయొక్క గంధమునందాసక్తమైన భ్రమరము సాయంసమయ మున పద్మము ముకుళించుకొనగా,దానియందే బంధింపబడి యెట్లు నాశన మగుచున్నదో,అట్లే,"**రాగాదయఃప్రసజ్యేరంస్తేనాసౌనారకీభవేత్"।**(నా.ప.416)స్వాది ష్టాన్నమునందాసక్తమై యతిగూడ ఒకే గృహముయొక్క అన్నమును భుజిం చుచుండినచో,ఆ గృహస్థుల సాంసర్గికమోహజాలమున జిక్కుకొని, ఇతడుగూ డ పతనమగును.

తుమ్మెద పుష్పములనుండి మధువును స్వయంగా సేవిస్తుంది. కాని సంగ్రహము చేయదు.తేనెటీగమాత్రము మధువును తాను సేవించియు,పై గా సంగ్రహముకూడా చేస్తుంది.సంగ్రహము చేయుటవలన కలుగు అనర్థము ను ఈతేనెటీగ దృష్టాంతముచే,అక్కడే శ్రీమద్భాగవతములో వ్యాసులవారు స్పష్టముచేసారు.జిజ్ఞాసగలవారు అక్కడ చూడగలరు.

ఇంద్రియములకు వాటివాటి విషయాలనుండి యెంత ఆనందము ప్రాప్తం చునో,అంతకంటె అధికానందము మరెచ్చటనుండైనాప్రాప్తించుయెడల,సామా న్యానందమును వదలి విశేషానందముపైపుకుమ్రొగ్గగలవు—ఇది ఇంద్రియము లయొక్కస్వభావము.అలాంటప్పుడు,ఇంద్రియములను పరబ్రహ్మధ్యానరూప భక్తిమార్గములో ప్రవేశపెట్టినచోనవి వాటి విషయాలను తమంతటతామే వదలి,నిరతిశయానందరూప భగవద్భజనలో సంలగ్నముకాగలవు."**ఇంద్రియా ణి ప్రమాథీని**"(గీ.2-60)ఈ గీతావచనము ప్రకారము యింద్రియములు దుర్జ

యములే,అయినను భగవంతుడు"**మత్పరః**"(గీ.2-61) అని ఆదేశించినందున, భగవద్భక్తిచే యింద్రియములు అనాయాసముగా జయించబడగలవని ద్యోతితమగుచున్నది. భగవద్భక్తిలోని యానందము విలక్షణము, అత్యద్భుతము, నిరతిశయము.

"**యత్సౌఖ్యామ్బుధిలేశలేశతఇమేశక్రాదయోనిర్వృతాః**"(మనీషాపంచకమ్)

బ్రహ్మానందసాగరములోని బిందుమాత్రసుఖమును బొంది ఇంద్రుడు,బ్రహ్మ, బృహస్పతి మొదలగువారందరు ఆనందితులగుచున్నారు.అంతటి బ్రహ్మానంద రసామృతమును ఒకసారి చవిచూచినచో,యిక క్షుద్రమైనవిష యానందముకొఱకు యింద్రియములు ప్రవర్తింపగలవా?పరమాత్మయే పరాయణముగా భావించి సకలేంద్రియములను భగవత్సంబంధమైన శబ్దాది విషయములందు ప్రవర్తింపజేసినచో జన్మధన్యమగునుగదా!శ్రీకులశేఖరులవారు యింద్రియములను అనునయించి యెంత చక్కగా సంబోధిస్తున్నాడో చూడండి:—

**శ్లో॥జిహ్వేకీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం,**

**పాణిద్వన్ద్వ సమర్చయాచ్యుత కథా శ్రోత్రద్వయం త్వం శృణు ।**

**కృష్ణం లోకయ లోచనద్వయ హరే ర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం,**

**జిఘ్ర ఘ్రాణ ముకుందపాదతులసీం మూర్ధన్నమాధోక్షజమ్॥**(ముకుందమాల.16)

ఓనాలుకా!నీవు భగవంతుని=మురవైరియగు కేశవుని పవిత్ర నామమును,అతని గుణగణమును కీర్తించుము(పాడుము,స్తుతించుము).ఓమనసా! మురాసురుని శత్రువైనవిష్ణువునుభజింపుము(సేవింపుము).ఓచేతుల జంటా (రెండుచేతులారా!)లక్ష్మీదేవిని ఱొమ్మున ధరించినవానిని చక్కగాపూజసేయు

ము.ఓచెవుల జంటా!నీవు పావనమైన విష్ణుకథలను వినుము.ఓకన్నుల జంటా!మోహనరూపుడగు శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహమును సందర్శించుము.ఓకాళ్ళ జంటా!ప్రశాన్తనిలయమగు విష్ణువుయొక్క ఆలయమునకు నడచివెళ్ళుము.ఓ నాసికా!బ్రహ్మాదులచే నిత్యము పూజింపబడు ముకుందుని పాదపద్మములందు సమర్పింపబడిన తులసీదళముయొక్క వాసన చూడుము.ఓశిరమా!నీవు అధోక్షజుని(విష్ణువును)వంగి నమస్కరింపుము. అధోక్షజుడనగా,

1.అక్షాణి = శ్రోతాదీంద్రియాణి;జః = తేభ్యోజాతమ్ = అక్షజం = ఐంద్రియకం జ్ఞానం; తదధకృతం = తిరస్కృతం యేన సః = అదోక్షజః।శ్రోత్రాది యింద్రియములచేకలుగు యే శబ్దాది విషయక జ్ఞానమున్నదో,అది యెవరిచే తిరస్కరింపబడెనో,అతడు అధోక్షజుడు.అనగా,ఇంద్రియములకుగాని,తజ్జన్యజ్ఞానమునకుగాని విషయముకానివాడు(గోచరింపనివాడు,తెలియబడనివాడు)అధోక్షజుడు(విష్ణువు, వ్యాపకపరబ్రహ్మము)అనిఅర్థము.

2.లేక,అధోక్షైః = జితేన్ద్రియైః;జాయతే = జ్ఞాయతే = ప్రత్యక్షీక్రియతే యః సః = అధోక్షజః।జితేంద్రియులగు జ్ఞానిపురుషులచే(అభిన్నముగా)తమ స్వరూపముగా సాక్షాత్కరింపబడువాడు యెవడో,అతడు అధోక్షజుడు(పరమాత్మ).

3."అధో న క్షీయతే జాతు యస్మాత్తస్మాదధోక్షజః"(ఉద్యోగ.ప.68-10)శ్రీకృష్ణుడు యెప్పుడును క్రిందకు దిగజారి క్షీణించడు,అనగా తన స్వరూపస్థితినుండి యెప్పుడును పతనముకాడు.సగుణముగా గోచరించినను నిర్గుణస్వరూపమునకు హానిలేదు—అందువలన అధోక్షజుడనబడుచున్నాడు.(విశిష్టః శుద్ధాన్నాతిరిచ్యతే; కల్పితస్యస్వరూపమధిష్ఠానమేవ—ఇతి నియమాత్)

మానవశరీరంలోని మనస్సు,శిరస్సు,కాళ్ళు,చేతులు,నేత్రములు,చెవులు,నా

లుక,బుద్ధి—ఒకటేమిటి?సమస్త అవయవములు ఆ హరిధ్యానంలో పరవశమై పోవలసిదే.లేనిచో,అతడు భగవంతుని విషయంలోకృతఘ్నుడే కాగలడు.భగవంతుడు మనకు యీఅమూల్యమైన శరీరమును భగవత్తత్త్వమును దెలుసుకొనుటకు మాత్రమే ప్రసాదరూపంగా ప్రసాదించినాడు.ఈ శరీరనిర్వహణకోసం వనస్పతులను,ఓషధులనుయిచ్చాడు.ఉండుటకు నేలను,పీల్చుటకు గాలిని,అట్లే జలమును,అగ్నిని—ఇది అది యని చెప్పనేల?సర్వమును ప్రసాదించాడు.ఇట్లుండగా,భగవంతుని భజనజేయక,అతనిని విస్మరించినచో చేసినమేలు మఱచేవాడు(కృతఘ్నుడు)గాక మరేమగును?కావున,ప్రతిదినమూ, ప్రతిక్షణమూ,ప్రతి పనిలో, ప్రతిచదువులో హరిస్మరణమే కావాలి.ప్రతిగురువూ ప్రతితండ్రీ హరిబోధలే చేయాలి—అని పరమ భాగవతోత్తముడగు ప్రహ్లాదుడు యెల్ల జీవులకు యిచ్చిన సందేశమిదిగో—చూడండి,

**సీ॥కమలాక్షునర్చించు కరములు కరములు,**

**శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ।**

**సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు,**

**శేషశాయికి మ్రొక్కు శిరము శిరము।**

**విష్ణునాకర్ణించు వీనులు వీనులు,**

**మధువైరి దవిలిన మనము మనము।**

**భగవంతు వలగొను పదములు పదములు,**

**పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి।**

**తే॥దేవ దేవుని జింతించు దినము దినము,**

**చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు।**

**కుంభినీధవుజెప్పెడి గురువు గురువు,**

**తండ్రి! హరిజేరుమనియెడి తండ్రి తండ్రి॥**(శ్రీ పోతన భాగ. 7-169)

శ్రీహరిని పూజించే హస్తమే హస్తము.ఆ చిన్మయుని పూజించనిచో చేతికి సార్థకతలేదు.శ్రీమన్నారాయణుని దివ్యనామమును,గుణగణమును కీర్తించు నాలుకే నాలుక.లేనిచో,ఆ నాలుకకు చరితార్థత లేదు.శ్రీపతిని చూసే చూపులే చూపులు,మిగిలిన చూపులకు విలువేముంది?శేషశాయి పాదపద్మములకుమ్రొక్కే శిరస్సేశిరస్సు.చక్రధారి కథలు విసే చెవులే చెవులు.మధుసూదనుని తలచే మనస్సే మనస్సు.పరంధామునికి ప్రదక్షిణం చేసే పాదాలే పాదాలు.పద్మనాభుని భావించే బుద్ధే బుద్ధి.లేకపోతే అది సమృద్ధి గాదు.అంబుజాక్షునిగూర్చి ఆలోచించే దినమే సుదినం.లేకపోతే ఆదినందుర్దినం.చక్రధారిని గూర్చివిశదపరచే చదువే చదువు.గోవిందునిగూర్చి బోధించే గురువేగురువు. విష్ణువును సేవించుమని చెప్పే తండ్రియే తండ్రి.ఇట్లు,సకలేంద్రియ మనంబులను అన్నివేళలందు అన్నివిధముల భగవంతునిసేవకే అంకితము చేయవలెనని అన్వయముఖముగాచెప్పి,ఇపుడు వ్యతిరేకముఖముగా చెప్పుచున్నాడు.

**సీ॥కంజాక్షనకు గాని కాయంబుకాయమే,**

**పవనగుంఫిత చర్మ భస్త్రిగాక !**

**వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే,**

**ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక !**

**హరి పూజనము లేని హస్తంబు హస్తమే,**

**తరుశాఖ నిర్మత దర్విగాక !**

**కమలేశు జూడని కన్నులు కన్నులే,**

**తనుకుడ్యజాల రంధ్రములు గాక !**

**ఆ॥చక్రి చింతలేని జన్మంబు జన్మమే,**

**తరళ సలిలబుద్బుదంబు గాక !**

**విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుడే,**

**పాదయుగము తోడి పశువు గాక!** (శ్రీ పోతన భాగవతము 7-170)

శ్రీపతిని సేవించని శరీరం శరీరం కాదు.అది కేవలము గాలి నిండిన కొలిమి తిత్తి.వైకుంఠుని స్తుతించని నోరు నోరుగాదు.అది ఢమఢమ మ్రోగే వట్టి ఢక్క మాత్రమే.హరిని పూజించని చేయి చేయి గాదు.అది కొయ్యతో జేసిన తెడ్డుతో సమానము.కేశవుని జూడని కన్నులు కన్నులు గావు.అవి శరీరమనే గోడకుండబడిన కన్నాలు.ఆ జగన్నాయకుని గూర్చి ఆలోచనలేని జన్మము జన్మముగాదు.అది కేవలము క్షణిక మైన నీటిబుడగ. విష్ణుభక్తి లేని పండితుడు పండితుడు కాడు. అతడు ద్విపాద పశువు. అందువలన, పరమార్థసాధనలో ప్రతిబంధకము కలుగనటువంటి మరియు మనస్సు వికారమును పొందనటువంటి—ఆయా యింద్రియ విషయములను భగవదర్పితము గావించి,వాటివాటి విషయములను గ్రహించుటకై యింద్రియములకు అవకాశముయివ్వాలి.ఘ్రాణేంద్రియము గంధమును గ్రహించుటకు ఒకవేళ అత్యాశ(లాలస)పడినట్లైతే,మనకోసము నానా సుగంధిత పుష్పమాలాదుల

ను సుసజ్జితము జేసికొనక,భగవంతుణ్ణి ఉద్దేశించి చందనాగరు పుష్పమాలాదులను సమర్పించి, ఘ్రాణేంద్రియమునకు దాని విషయమగు గంధమును గ్రహించుటకు అవసరమివ్వాలి.షడ్రసోపేతమైన మిష్టాన్నములను(భోజన పదార్థములను)తినుటకు రసనేంద్రియము లాలాయితమైనచో,మనయొక్క ఇచ్ఛాపూర్తికొఱకు పదార్థములను తయారు జేసికొనకుండా,నానా ఉత్సవ సందర్భములలో భగవంతుని కొఱకని తయారుజేసి,భగగవంతునికి నైవేద్యముగా సమర్పించి,భగవంతుని ప్రసాదరూపములో రసనేంద్రియమునకు దాని విషయమును చవిచూచుటకు అందించాలి.అట్లే, చక్షురింద్రియమునకు భగవంతుని దివ్యమంగళ విగ్రహమును చూచుటయందు,త్వగింద్రియమునకు భగవంతుని దివ్యపాదారవిందములను స్పర్శించుటయందును,శ్రోత్రేంద్రియమునకు భగవంతుని సత్కథాశ్రవణమునందును సంలగ్నముచేయాలి.ఇట్లు సర్వేంద్రియములను భగవదర్పితము గావించి,భక్తిరసామృతపానముచేయించినచోనవి తిరిగి సాంసారిక విషయములవైపుకు మొగ్గవు.స్వయంగా భగవంతుడే ఈ విషయం చెప్పాడు.

**శ్లో॥న మయ్యావిశితధియాం కామః కామాయ కల్పతే।**

**భర్జితా క్వథితా ధానా ప్రాయో బీజాయ నేష్యతే॥**(భాగ.10-22-26)

యెవరు తన బుద్ధిని పరమాత్మయగు నాయందే ఆవేశము(సమర్పణము)చేసియున్నాడో,అతనియొక్క కామనలు అతనిని సాంసారిక భోగముల వైపుకు తీసికెళ్ళుటకు సమర్థములు కాజాలవు.ఎట్లునగా,ధాన్యము(బీజములు)అనుకూల వాతావరణము ఏర్పడినపుడు అంకురించి(మొలకెత్తి)మొక్కలు,వృక్షములుగా పరిణతిజెందుతాయి.ఇది వాటి స్వభావము.కాని,వాటిని వే

యించినగాని,ఉడకబెట్టినగాని అవి బీజశక్తిని కోల్పోయినందున నూతనమొక్కలను ఉత్పన్నముజేయుటకు సమర్థములు కాజాలవు.అట్లే,భగవద్భావముచే వేయించినపిదప కామనలు(కోరికలు,వాసనలు)మళ్ళీ క్రొత్తక్రొత్త కామనలను,వాసనలను తద్వారా సంసారమును ప్రాప్తముజేయుటకు సమర్థములుకావు. వాటిలోని శక్తి నష్టమగును.

ఘాతక=ప్రాణమునకు హానికలిగించు వస్తువులనుగూడప్రాణప్రదములుగామార్చి జీవనదానముజేయువాడు నిజమైనవైద్యుడు అనబడతాడు.ప్రాణఘాతకమైన పాషాణమును(మహావిషమును)గూడ సద్వైద్యుడు పుటముబెట్టి శుద్ధీకరణముజేసి,దానిచే అతికఠినమైన వ్యాధులనుగూడా పోగొట్టి రోగులకు ప్రాణదానము జేయును.అట్లే,మనుష్యునికి జననమరణరూప సంసారమునకు హేతువులగు శబ్దాదివిషయములనుగూడా భగవద్భక్తియను పుటముబెట్టి శోధించినచో జీవుడు ఉద్ధరింపబడుతాడు.కావున,కఠినమైన యోగసాధనములచేగూడ అణచబడని యింద్రియములు భక్తిమార్గముద్వారా విశేషపరిశ్రమలేకుండానే జయింపబడతాయి.ఇట్లు,వివేకపూర్వకముగా యింద్రియములలోని మరియు యింద్రియార్థములగు విషయాలలోని దోషములను దర్శించి హఠముచేగాకుండా భక్తిభావముచే మెల్లమెల్లగా యింద్రియములను వశపరచుకోవాలి. సరే,

ఇంతదనుక"శ్రవణాదివ్యతిరిక్త విషయములనుండి మనస్సును(అంతరింద్రియమును)నిగ్రహించుట **శమము**నియు,తద్వ్యతిరిక్త విషయములనుండి శ్రోత్రాదిబాహ్యేంద్రియ నివర్తనము **దమము**నియు—శమదమముల లక్షణములను, అంతరింద్రియ బహిరింద్రియములలోని దోషములను,వాటివలన కలుగు అనర్థములను మరియు వాటిని నిరోధించు(జయించు)టకు అనేక ఉపాయములను తెలుసుకుంటూ వచ్చాము.అయితే,యిచ్చట శమము మరియు దమముల

యొక్క లక్షణ విషయంలో కించిద్విచారించదగి యున్నది. ఏమనగా,

పూజ్యపాదులు శ్రీఆద్యగురు శంకరాచార్యులవారు వారియొక్క "తత్వబోధ, అపరోక్షానుభూతి,వివేకచూడామణి,సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము మరియు గీత భాష్యము (10-4)"ఇత్యాది గ్రంథములలో—అంతరింద్రియ నిగ్రహము శమ మనియు బహిరింద్రియ నిగ్రహము దమమనియు చెప్తూవచ్చారు.సాధారణ ముగా సర్వత్ర ఇట్లే వ్యాఖ్యానము చేయబడినది.ఇది సకలవేదాన్తాచార్యులకు సమ్మతమైనది.కాని,కొన్నిచోట్ల—అనగా,ఉద్యోగపర్వాన్తర్గత సనత్సుజాతీయ భాష్యము (1-43)లో దమ లక్షణమును—**"దమఃఅన్తఃకరణోపరతిః।బహిఃకరణోప రతిరితికేచిత్"**అని చెప్పారు.అక్కడే 2-19లో**"శమః అన్తఃకరోపరతిః,బహిఃకరణోప రతిరితికేచిత్"।** అని శమ లక్షణమును చెప్పారు.

అన్యత్ర,బృహదారణ్యకోపనిషద్భాష్యము (4-4-23)లో**"శాన్తోదాన్త ఉపరతిస్తితి క్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాఽఽత్మానం పశ్యతి"**అను శ్రుతిలోని శాన్తదాన్త(శమదమ)శబ్దములను నిర్వచిస్తూ—**"శాన్తో బాహ్యేన్ద్రియ వ్యాపారత ఉపశాన్తః,తథా దాన్తోఽన్తఃకరణతృష్ణాతోనివృత్తః"**అని వ్యాఖ్యానించారు.అనగా బా హ్యేంద్రియముల సకలవ్యాపారములనుండి ఉపశమనము(విరతి)నొందినవా డు శాన్తుడు(శమముగలవాడు)మరియు అన్తఃకరణముయొక్కవైషయికతృష్ణ (విషయాలకు సంబంధించిన ఆశ,కోరిక)నుండి నివృత్తమైనవాడు దాన్తుడు(ద మముగలవాడు) అని చెప్పారు.

ఇచ్చట,అంతరింద్రియనిగ్రహము మరియు బహిరింద్రియనిగ్రహము—ఈ రెంటిలో,శమముయొక్క లక్షణమేది?దమముయొక్క లక్షణమేది?అనిముము క్షువులు నిర్ధారణచేసుకోలేక సందిగ్ధములో పడేందుకవకాశముంది.పూజ్యపా

దులైతే ముముక్షువులకు సందేహము కలుగునట్లుగాగాని,విపరీతభావన కలుగునట్లుగాగాని బోధించరు.సంశయ విపరీత భావనలను తొలగించి,సకలజీవులకు సమ్యగ్ జ్ఞానమును బోధించి,జననమరణరూప సంసార సాగరమునుండితరింపజేయుటయే వారియవతారలక్ష్యము.సకలలోక హితైషియగు భగవాన్ శంకరులే శంకరాచార్యులుగా అవతరించారు.

**శ్లో॥కల్యబ్దే ద్విసహస్రాన్తే లోకానుగ్రహకామ్యయా।**

**చతుర్భిః సహ శిష్యైస్తు శఙ్కరోఽవతరిష్యతి॥**(వాయు పురాణము)

కలియుగంలో రెండువేలసంవత్సరములు గడిచినపిమ్మట లోకకల్యాణము కొఱకు సాక్షాత్పరమశివుడు నలుగురుశిష్యులతో సహితముగా అవతరించగలడు.

**శ్లో॥వ్యాకుర్వన్ వ్యాససూత్రాణి శ్రుతేరర్థం యథోచితమ్।**

**శ్రుతేర్న్యాయ్యః స ఏవార్థః శఙ్కరః సవితాననః॥**(సవితా నః సః)

( శైవపురాణము) (సౌరపురాణము)

శ్రీవేదవ్యాస భగవానులు యే శ్రుత్యర్థములను తన హృదయమందు ఉద్దేశ్యముగా పెట్టుకొని బ్రహ్మసూత్రములను రచించియుండిరో,ఆ సూత్రములకు యథాయోగ్యము,శృతిసమ్మతమునగు భావమును ప్రసన్నమగు పదావళిచే నతిగంభీర చింతనాత్మక భాష్యముద్వారా లోకాలచీకట్లను పోగొట్టునటువంటి అద్వైతప్రవర్తకుడు,చైతన్యసూర్యుడు శ్రీశంకరులవారు—సాక్షాత్ శివునియొక్క నవావతారము—అని శ్రీగౌడబ్రహ్మనందులవారు మరియు శ్రీనారాయణతీర్థుల వారు“**సిద్ధాన్తబిందు**”వ్యాఖ్యానంలో తెలిపియున్నారు.కావున,సర్వజ్ఞులగు శ్రీశంకరాచార్యులవారి యభిప్రాయము మందమతులకు దోచుటకష్టము.ఇటువంటి

సందిగ్ధాత్మక సందర్భములలో వృద్ధులే శరణ్యులు(ఆశ్రయనీయులు).ఇపుడు మనము పరమపూజ్యులగు శ్రీసురేశ్వరాచార్యులు మరియు తదనుయాయులను శరణువెళ్ళెదము.“**శాన్తోదాన్తః**”అను బృహదారణ్యక(4-4-23)శ్రుతి భాష్యమును వ్యాఖ్యానిస్తూ శ్రీసురేశ్వరాచార్యులవారు వార్తికములో ఈ క్రిందివిధంగా ధ్రువీకరించారు.

**శ్లో॥దాన్తోభూత్వా తతః శాన్తస్తతశ్చోపరతో భవేత్।**

**అర్థక్రమో బలీయాన్స్యాద్యతః పాఠక్రమాదిహ॥**(1203)

**బహిష్కరణ చేష్టాయా నివృత్తౌ దాన్త ఉచ్యతే।**

**దాన్తోఽశ్వో గౌర్గజో వాఽపి ప్రయోగస్తత్ర వీక్ష్యతే॥**(1205)

**అన్తకరణచేష్టాయా నివృత్తౌ శాన్త ఉచ్యతే ।**

**శాన్తో భిక్షుస్తపస్వీతి తత్ప్రయోగ సమీక్షణాత్॥**(1206)

పైబృహదారణ్యక శ్రుతి,తదనుసారి భాష్యముయొక్క పాఠక్రమమును భంగముచేసి అర్థక్రమమును చెప్పుచున్నాడు శ్రీసురేశ్వరులు. అనగా,శ్రుతిలో మొదట శాన్తః, తరువాత దాన్తః—అని ప్రయోగమున్నది.శంకరులుగూడా శ్రుత్యనుసారమే భాష్యము చెప్పారు.కానీ,సురేశ్వరాచార్యుల వారంటున్నారు—మొదట బాహ్యేంద్రియనిగ్రహరూప“**దమము**”లేకుండా(బాహ్యకరణముల విషయాభినివేషము నివృత్తముగాకుండా)అంతఃకరణముయొక్క విషయాసక్తి నివర్తించదు. కావున,మొదట దాన్తుడై(దమముగలవాడై)పిదప శాన్తుడు(శమముగలవాడు) కావాలి,ఆతరువాత ఉపరతుడు కావాలి—అని చెప్తూ యీవిషయములో ఒక న్యాయమును ప్రవేశపెట్టాడు.

"పాఠక్రమాదర్థక్రమో బలీయసీ" పాఠక్రమముకంటె అర్థక్రమము బలవంత మైనది.అనగా,పాఠక్రమమును బాధించి అర్థక్రమము కార్యమును(ప్రయోజన మును)సాధించుటకు సమర్థమగును.పాఠక్రమనగా,"పదార్థబోధకవాక్యానాం యః క్రమః స పాఠక్రమః"అనుష్ఠేయ(విధేయ)పదార్థములను బోధించువాక్యము లయొక్క క్రమమును తెలుపునది పాఠక్రమము అనబడును.అర్థక్రమమనగా, "యత్రప్రయోజనవశేన క్రమనిర్ణయః సోఽర్థక్రమః"అర్థము అనగా ఒక ప్రయోజ నమునుద్దేశించి(దృష్టియందుంచుకొని)యెక్కడ క్రమము నిశ్చయింపబడునో, అది అర్థక్రమము అనబడును.(అర్థసంగ్రహము).

పూర్వమీమాంసలో అగ్నిహోత్ర ప్రకరణమునందు యీవిధంగా పాఠక్రమము లభిస్తుంది.ఏమనగా,**"అగ్నిహోత్రం జుహోతి"**మరియు"**యవాగూం పచతి"**(తై.బ్రా. 2-1-5-6) మొదలు హోమముచేసి తరువాత యవలను పాకము చేయాలి—అని పాఠక్రమమున్నది.

యవలు(బార్లీ)అను దాన్యమును శుద్ధిజేసి(పైఊకను తొలగించి), దానిని వండి(కాచి)అగ్నిహోత్ర హోమముచేయాలి—అను శాస్త్రవిధానముగలదు."యవా గూ" పాకముయొక్క ప్రయోజనము అగ్నిహోత్రహోమ సంపాదనమునకై యు న్నది.అందువలన హోమరూప ప్రయోజన సిద్ధికొఅకు,హోమముచేయుటకు పూర్వమే యవాగూ పాకము చేయాలి.పాకనిష్పత్త్యనన్తరము(యవలనువం డి తయారుచేసిన తీపిపదార్థము లప్సీతో)అగ్నిహోత్రహోమముచేయాలి.అపుడే యవాగూ పాకమునకు నిశ్చితహోమరూప ప్రయోజనము అర్థక్రమముచే సిద్ధిస్తుంది.

ఈ అర్థక్రమము,పాఠక్రమముకంటె ప్రబలమైనది.ఎందుకనగా,ఒకవేళ పాఠ

క్రమానుసారము అనగా మొదట యవాగూ పాక ద్రవ్యముకంటె భిన్నమైన యేవో ద్రవ్యములచే అగ్నిహోత్రహోమమును సంపన్నముగావించి,ఆతరువాత యవపాకము చేసినచో,యవాగూపాక ద్రవ్యముయొక్క నిశ్చితహోమరూప ప్రయోజనము సిద్ధించక పోగా బాధ కలుగును.ఎందుకంటే,అగ్నిహోత్రహోమము నిష్పన్నమైనపిదప తయారుచేయబడు **యవాగూ** పాకద్రవ్యము నిష్ఫలమగును.

ఈ"**పాఠక్రమాదర్థక్రమోబలీయసీ**"యను న్యాయానుసారము"**శాన్తోదాన్తః**"అను బృహదారణ్యకశ్రుతియందు—బాహ్యేంద్రియనిరోధరూప **దమము** సిద్ధించనిచో, అంతరింద్రియమగు మనస్సుయొక్క విషయాసక్తి నివర్తించదు.అనగా,దమన మునకు శమము ప్రయోజనము గావున దమము శమముకొఱకై యున్నది. అందువలన మొదట దాన్తుడైనచో పిమ్మటఅర్థక్రమముచేదానికి(దమమునకు) నిశ్చితప్రయోజనమగు శమము సిద్ధించును.అట్లుగాక,ఒకవేళ శ్రుతిలోచెప్ప బడిన పాఠక్రమముచే అనగా,మొదట శాన్తుడై(శమముగలవాడై)తదుపరి దా న్తుడైనచో,దమముయొక్క నిశ్చితప్రయోజనమగు శమము మొదలే సిద్ధిం చుటచే,దమము ప్రయోజన శూన్యమగును(నిష్ఫలమగును).ఈ అభిప్రాయ ముచేతనే శ్రీసురేశ్వరాచార్యులవారు పైన్యాయమును స్వీకరించి "**దాన్తోభూత్వా తతః శాన్తస్తతశ్చోపరతో భవేత్**" (1203) అని చెప్పారు.

ఇప్పుడు అర్థక్రమముచే దాన్తశాన్త పదములను వ్యాఖ్యానించుచున్నాడు. బహిష్కరణములగు శ్రోత్రాదిపంచజ్ఞానేంద్రియములయొక్క మరియు వాగాది పంచకర్మేంద్రియములయొక్క సకలవ్యాపారములు నివృత్తమైనప్పుడు దాన్తు డనబడతాడు.అనగా బాహ్యేంద్రియ నిగ్రహమునకు దమము అంటారు. ఈ విషయంలో వృద్ధప్రయోగమును ప్రమాణముగా ఇస్తున్నాడు."**అశ్వము దమ నముచేయబడినది**".అనగా గుఱ్ఱముస్వారిచేయుటకు(విహారముచేయుటకు)

యోగ్యమైనది.**"యెద్దుదమనముచేయబడినది"**.అనగా యెద్దు బండిలాగుటకు గాని,నాగలి లాగుటకుగాని యోగ్యమైనది.**"ఏనుగు దమనము చేయబడినది"**. అనగా,దానిపై భగవంతుని ఉత్సవమూర్తులను ఊరేగించుటకు యోగ్యమైనది. ఇత్యాది ప్రయోగములు మనపెద్దలు బాహ్యేంద్రి నిగ్రహమునందు చేస్తూంటారు.

అంతఃకరణముయొక్క సకలవ్యాపారములు నివృత్తమైనపుడు శాన్తుడు అనబడుతాడు.అనగా,అంతరింద్రియనిగ్రహమునకు **శమము** అంటారు.ఈఅంతః కరణ చేష్టానివృత్తిగల పురుషునియందు **శాన్త** శబ్దము ప్రయోగింపబడుతుంది. అనిఅంటూ వృద్ధసమ్మతిని చూపెడుతున్నాడు—"**భిక్షువు(**ముని,సన్యాసి**)శాన్తుడైనాడు"**.ఇట్లు, శ్రీసురేశ్వరాచార్యుల వారు పాఠక్రమమును భంగముజేసి అర్థక్రమముచే వ్యాఖ్యానము చేసినాడు.వీరి వార్తికములకు యథాతథముగా శ్రీఆనందగిరిస్వాముల వారు టీకనుగూడ వ్రాశారు. తరువాత,

ఈసందర్భములో శ్రీఆనందగిరిస్వాములవారు స్వాభిప్రాయమును వ్యక్తీకరిస్తూ శ్రుతి మరియు తదనుసారము పూజ్యపాదులవారి భాష్యోక్త పాఠక్రమముగూడ ఆదరించదగినదే అంటాడు.ఎందుకనగా,బహిష్కరణములయొక్క విషయాభినివేశ నివృత్తి కలుగకుండా అంతఃకరణముయొక్క విషయాసక్తి నివర్తించదు—అని అర్థక్రమ ప్రాబల్య న్యాయముచే మొదలు దమము కలిగియుండాలి, అటుపైన శమము సిద్ధిస్తుంది—అని యేదైతే వ్యాఖ్యానము చేయబడిందో,యిది అబాధిత నియమము మాత్రముకాదు.ఈనియమము వ్యభిచారగ్రస్తమగుచున్నది.ఎందుకంటే,బాహ్యేంద్రియములను నిగ్రహించిననూ నియమముచే అంతరింద్రియము నిగ్రహింపడుట లేదుగదా. "**కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్**"(గీత3-6)కర్మేంద్రియములను సంయమనము(నిరోధము)చేసిననూ,మనస్సున విషయాలను స్మరిస్తుంటాడు.కావున,వృద్ధప్రయోగమును అనా

దరించి శాన్తదాన్త శబ్దములకు పాఠక్రమముచే భాష్యోక్త అర్థమును గ్రహించవచ్చు ను.శ్రీశంకరాచార్యులవారు మరియు యితర వేదాన్తాచార్యులు సర్వత్ర శమము నకే ప్రాథమిక స్థానమునిచ్చి,తరువాత దమమును వ్యాఖ్యానించారు.

కావున,సాధకుడు—"మొదట దమమునుసాధించి,తదుపరి శమమును సాధించాలా?లేక మొదట శమమునుసాధించి,తరువాత దమమునుసాధిం చాలా?"అను సందేహమునువదిలి,రెంటిని సమకాలమునందేసాధించాలి.ఎం దుకంటే,శమదమాదులులేక వేదాన్తశ్రవణమునకు అధికారియేకాజాలడు.ఇంతే గాక,శమాది షట్సంపత్తిలోని ఆఱింటికి ఆఱు ఒకదానికి మఱియొకటి పరస్పర (పూరకములు)ఆపేక్షికములున్నవను విషయమును **షట్సంపత్తి** నిరూపణాం తమున సవిస్తరముగా మనము పృష్ఠము 419 నుండి చింతనజేయగలము.

ఇంత గ్రంథసందర్భముచే వృద్ధ *(శ్రీసురేశ్వరాచార్యుల మరియు శ్రీఆనంద గిరిస్వాములవారి)*వచనాలను అనుసంధానము చేయగా ఇట్లు తెలియబడుచు న్నది.ఏమనగా?వారు శమదమముల విషయంలో యేది ముందు యేది తరు వాత యను క్రమసంబంధి విచారణ విస్తారంగా చేశారు.కాని,శమదమముల లక్షణములను మాత్రము సాధారణంగానే చెప్తూ వచ్చారు.అనగా,అంతరింద్రియ నిగ్రహము శమమనియు మరియు బాహ్యేంద్రియనిగ్రహము దమమనియు (అంటే)శంకరాచార్యులవారు వివేకచూడామణి,అపరోక్షానుభూతి ఇత్యాది గ్రంథ ములలో సాధారణముగా యెట్లు శమదమముల లక్షణములను చేసియుండిరో, ఆ లక్షణములనే వీరు చెప్పారు. శ్రీవిద్యారణ్య గురుదేవులుకూడా అట్లే చెప్పారు.

**శ్లో॥శాన్తిః క్రోధ పరిత్యాగో దాన్తిర్బాహ్యాక్షనిగ్రహః।**

**శాన్తో మునిర్బలీవర్దో దాన్త ఇత్యుక్తిదర్శనాత్॥** (బృ.వార్తికసారము.458)

క్రోధోపలక్షిత అంతఃకరణములోని సకలదోషములను పరిత్యాగము జేయుట ను శమము(శాన్తి)అంటారు.బాహ్యేంద్రియ నిగ్రహమునకు దమము(దాన్తి) అంటారు.**ముని శాంతించాడు**—అనియు,**బలీవర్దము(యెద్దు)దమనము చేయబ డినది**,హలవహన(నాగలిలాగుటకు)యోగ్యమైనది—అనియు లోకప్రసిద్ధప్రయో గములు కనబడుచున్నవి.

*(బృహదారణ్యకోపనిషత్తునకుశ్రీశంకరులవారు రచించిన విస్తృతభాష్యముపై మరీ విస్తారంగా శ్రీసురేశ్వరాచార్యులవారు వార్తికములు వ్రాశారు.వాటికి శ్రీఆనం దగిరిస్వాములవారు టీకనువ్రాశారు.మరియు శ్రీసురేశ్వరుల వార్తికములకు సారరూపంలో శ్రీవిద్యారణ్యగురుదేవులు బృహదారణ్యక వార్తికసారమును రచించారు).*

భాష్యకారుల అనుయాయులు, పూజ్యులు, వృద్ధులునునగు వీరెవరుగూ డ—శాన్తోదాన్తః(బృ.4-4-23)అనుశ్రుతిభాష్యములో పూజ్యపాదులు,"**శాన్తోబాహ్యేం ద్రియవ్యాపారతఃఉపశాన్తః;తథా దాన్తోఽన్తఃకరణతృష్ణాతోనివృత్తః**"అని శాన్తదాన్త (శమదమ)శబ్దములకు,సాధారణ లక్షణములకంటె విపరీతముగాచెప్పారు— అని ఉల్లేఖించలేదు.భాష్యకారులు ఇట్లు చెప్పుటలో అభిప్రాయమేమై యుండ వచ్చుననిగూడ విచారించలేదు.పైభాష్యపంక్తులను వదిలేసి శమదమములకు సాధారణ లక్షణములు చెప్తూ ఉదాసీనంగా ముందుకెళ్ళిపోయారు.

"**కవిఃక్రాన్తదర్శి సర్వదృక్**" "**కవయో నిరఙ్కుశాః**"కవి త్రికాలజ్ఞుడు,సర్వ జ్ఞుడు,మరియు నిరంకుశుడు అని ప్రసిద్ధి.ఏవిధమైన అంకుశమునకు వశీభూ తుడై(అధీనుడై)యుండడు.అతడు యేమి బోధించినను లోకహితార్థమై,యుక్తి

యుక్తమై,వేదసమ్మతమై,అనుభవానుసారముగానుండును.“**రవి దూరని చోట కవిదూరును**”అను సామెతగూడ ప్రసిద్ధి.శమదమ శబ్దములుమాత్రము తారు మారయ్యాయి.భావములో మార్పులేదు. ధాతువులకు అనేకార్థములుంటాయి గదా!కనుక,**శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్** (గీత4-39).వృద్ధులు,పూజ్యులు,సర్వలోక హితార్థమై యవతరించిన భగవత్స్వరూపులునగు శ్రీశఙ్కరాచార్యగురుదేవుల పట్ల శ్రద్ధగలిగి యున్నచో నిశ్చయముగా మన కళ్యాణమగును.

**“ఆచార్యః శంకరాచార్యః సన్తు మే జన్మ జన్మని”**

అస్తు,శమదమములను పురస్కరించుకుని ప్రాసంగికముగా అనేక అవాంతర రహస్యములను చింతనజేస్తూ వచ్చాము.సారమేమనగా **ప్రశాన్తాత్మా=ప్రకర్షేణ శాన్త ఆత్మా=అంతఃకరణం యస్య సః అయంప్రశాన్తాత్మా** (గీతాభాష్యమ్6-14) **దమః చ బాహ్యకరణానాముపశమః; అంతఃకరణస్య ఉపశమం శాన్తింవ్యక్ష్యతి॥** (గీతభాష్యమ్16-1)**శాన్తోమునిః,మునిర్దాన్తోజితేన్ద్రియః** (నా.ప.5-14)అని చెప్పబడినట్లుగా సాధకులు—అంతరింద్రియనిగ్రహము శమమనియు,బహిరింద్రియనిగ్రహము దమమనియు—శమదమములయొక్క నిర్దుష్టలక్షణములని నిస్సందేహంగా నిర్ధారణ జేసుకొని,ఆరెంటిని సమకాలంలోనేసాధిస్తూ ఉత్తరసాధనములందు ప్రవేశించాలి. ఇతి దమ నిరూపణమ్.

## —:36.ఉపరతి:—

**“నివర్తితానా మేతేషాం తద్వ్యతిరిక్తవిషయేభ్య ఉపరమణముపరతిః,అథవా విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః”।**(వేదాన్తసారము)

నిగ్రహింపబడిన బాహ్యేంద్రియములను,అంతరింద్రియమును శ్రవణాదుల కంటె అన్యమగు శబ్దాదివిషయములందు మళ్లీ ఏ ప్రకారముచేగూడ ప్రవృత్త

ము కానీయక స్థిరపచు వృత్తి విశేషమునకు '**ఉపరతి**' అని అంటారు.

శంక:—బహిష్ప్రవృత్తిరూప బాహ్యాన్తరేన్ద్రియములయొక్క వ్యాపార నిరోధాత్మక శమదమముల లక్షణములోనే ఉపరతి యొక్క లక్షణముగూడ అంతర్భూతమై అర్థతః సిద్ధించుచుండగా,అనగా శమదమముల లక్షణము మరియు ఉపరతి యొక్క లక్షణము తుల్యముగా నున్నవి గావున పృథక్ గా ఉపరతిని చెప్పుటలో ప్రయోజనమేమి? అని యిట్లు శంక ప్రాప్తించగా నపరితుష్టుడగు శ్రీ సదానన్దయతీన్ద్రులవారు—

సమాధానము:—ఉపరతి యొక్క లక్షణాంతరమును చెప్తున్నాడు-**అథవా విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః**"అనంటూ—శాస్త్రముచే విహితములగు (విధానముచేయబడిన)సకలకర్మలను విధిపూర్వకముగా త్యాగముచేయుట— "**ఉపరతి**" యనబడును.

"**శాన్తోదాన్త ఉపరతస్తితిక్షుః**"(బృ.4-4-23).ఇచ్చట"**ఉపరత**" శబ్దమునకు"**ఉపరతః సర్వైషణా వినిర్ముక్తః సన్యాసీ**"అని శ్రీభాష్యకారులు సెలవిచ్చారు.ఈభాష్య పంక్తికి వ్యాఖ్యానముజేస్తూ శ్రీసురేశ్వరాచార్యులవారు మరియు తదనుయాయులగు శ్రీఆనందగిరిస్వాములవారుగూడ పైశంకకు సమాధానము ఈ క్రింది విధముగా చెప్పియున్నారు.

"**శమదమాది విధేరన్తర్బహిశ్చేష్టామాత్ర నివృత్తివిషయస్య సామాన్యవిషయత్వేనోత్సర్గత్వాద్ యావజ్జీవశ్రుతేరగ్నిహోత్రాది విషయత్వేనాపవాదత్వాత్ తదపవాదార్థముపరత శ్రుతిరితి యుక్తమితి**"(శ్రీ కైలాసాశ్రమ గ్రంథము పృష్ఠము 1310 ఒకటవ టిప్పణము)శాన్తోదాన్త అను శమదమాది విధిచే అంతర్బహిర్(అంతరింద్రియ,బహిరింద్రియముల)వ్యాపారనివృత్తి మాత్రము విధానము చేయబడినది,

గావున అది ఉత్సర్గము అనగా సామాన్యవిషయకమున్నది.మరియు"**యావ జ్జీమగ్నిహోత్రం జుహుయాత్**"జీవించియున్నంతవరకు అగ్నిహోత్రాది నిత్య కర్మలను చేయుచుండవలెను—అను విశేషశ్రుతి అపవాదవిషయకమున్నది. "**ఉత్సర్గస్యాపవాదేన బాధఃకస్య నసమ్మతః**"అపవాదముచే నుత్సర్గము బాధిం పబడుతుంది—ఈవిషయమును యెవరు సమ్మతించరు? అందరికి స్వీకార్యమే అయియున్నది. ఉదాహరణకు- "**మా హింస్యాత్సర్వాభూతాని**"(లోపశ్రుతి)

**శ్లో॥నహింస్యాత్ సర్వభూతాని మైత్రాయణగతశ్చరేత్।**(మ.భా.శాంతిపర్వము 278-5)

సమస్త ప్రాణులలో యే ప్రాణిని గూడ హింసించగూడదు. ఎవరికి పీడను (కష్టమును) కలిగించగూడదు. సకల ప్రాణి కోట్లతో మిత్ర భావముతో మెలగాలి. ఇది సామాన్యశాస్త్రము.దీనికి ఉత్సర్గము అందురు.కాని,యీసామాన్య శాస్త్ర మునకు అపవాదముగూడ ఉంది."**అహింసన్సర్వభూతాన్యన్యత్ర తీర్థేభ్యః**"(ఛాం. 8-15-1).శాస్త్రము హింసను విధానము చేసిన స్థలమును(విషయమును) వదలి, అన్యత్ర యేప్రాణినిగూడ హింసించగూడదు.శాస్త్రముచే ఆజ్ఞాపించబడిన విష యమునకు"**తీర్థము**"అంటారు—యీవివక్షలో యిచ్చట తీర్థ శబ్దమునకర్థము న్నది."**అగ్నిషోమీయం పశుమాలభేత**"(ఐతరేయ బ్రాహ్మణము 6-3) అగ్నీషోమీయ యాగములో పశువును హింసించవలెను—అని శాస్త్రము విధానము చేసినది. ఈ విశేషశ్రుతి అపవాదమున్నది.అనగా"**అగ్నీషోమీయం**"అను అపవాద శ్రుతిచే "**మా హింస్యాత్**"అను ఉత్సర్గము (సామాన్యశ్రుతి) బాధింపబడును.అనగా శా స్త్రముచే విధానము చేయబడిన "అగ్నిషోమీయ పశుహింసను" వదలి అన్యత్ర సర్వత్ర యే ప్రాణిని హింసించగూడదు. ఈ ప్రకారము ఉత్సర్గము అపవాదముచే బాధింపబడుతుంది. ఇది సర్వులకు సమ్మతమై యున్నది.

అట్లే,"**శాన్తోదాన్తః**"అను ఉత్సర్గము(సామాన్య శ్రుతి) "**యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్**" అను విశేష(అపవాద)శ్రుతిచే బాధింపబడుతుంది.అనగా"**అగ్ని హోత్రం జుహుయాత్**"ఇత్యాది శ్రుతిచే విధానము చేయబడిన నిత్యాది కర్మలను పురుషుడు జీవించియున్నంతవరకు ఆచరిస్తూ,అంతరింద్రియ,బాహ్యేంద్రియ ముల సర్వవ్యాపారములనుండి నివృత్తము కావాలి—అని ఉభయ శ్రుతుల యొక్క సమన్వయార్థము నిష్పన్నమైనది.

**"యత్ర కర్తుః స్వాతన్త్ర్యం తేషాం కర్మణాం నివృత్తిః శమాదిపదైరుక్తా"** (ఆనందగిరి)యే వ్యావహారిక వ్యాపారములందు(కర్మలయందు)కర్తయగు పురుషునికి స్వాతంత్ర్యము గలదో,ఆ అంతర్బాహ్యేంద్రియముల సకల వ్యాపారముల నుండి నివృత్తము కావాలి—అని శమదమ(**శాన్తో దాన్తః**) పదములచే చెప్పబడినది. కాని,శాస్త్రవిహిత(అగ్నిహోత్రాది)నిత్యాదికర్మలనుండి నివృత్తి యేది గలదో, అది శమాదులకు విషయమగుట లేదు.అందువలన,యీ"**ఉత్సర్గాపవాద**" న్యాయమును నిరాకరించుటకు ఉపనిషత్తు "**ఉపరతః**"అని అగ్రిమసాధనమును విధానము చేసినది. దీనినే "**విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః=ఉపరతిః**" అని శ్రీసదానన్దయతీన్ద్రులవారు పదాన్తరములచే ఉపరతియొక్క లక్షణాన్తర మును చేసినారు.అనగా శాస్త్రవిహిత కర్మలనుగూడ ముముక్షువైనవాడు విధిపూర్వకముగా పరిత్యజించుట(సంన్యసించుట)ఉపరతి యనబడును.

ముముక్షువు విహితకర్మలను యెందుకు సన్యసించాలి?ఈప్రశ్నకు సమాధానము శ్రీశంకరాచార్యులవారు ఇప్పుడే(త్వరలోనే) చెప్పబోతున్నాడు.కొంచెము ధైర్యము వహించగలరు.అయితే శ్రీసదానందులవారు ఉపరతి లక్షణములో కేవలము పరిత్యజించుట అని చెప్పక"**విధినా పరిత్యాగః**" విధిపూర్వకముగా పరిత్యజించవలెనన్నారు.ఎందుకనగా,ఆయా వర్ణాశ్రమముల వారికి శాస్త్రముచే

విధానముచేయబడిన(విహిత)కర్మలను పురుషులు ఆలస్యము(సోమరితనము)చేగూడ త్యాగము చేయవచ్చును.కాని,అట్లు త్యాగము చేయుటను శాస్త్రము నిషేధించినది.ఆలస్యాది కారణముచే శాస్త్రవిహితకర్మలను త్యజించినచో ప్రత్యవాయ దోషముచే పురుషుడు పాపమునంటుకొనును.తన్నివారణార్థము శాస్త్రము అతనికి మళ్లీ ప్రాయశ్చిత్తమును విధించినది.

**శ్లో॥అకుర్వన్ విహితం కర్మ నిన్దితం చ సమాచరన్।**

**ప్రసక్తశ్చేన్ద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః॥** (మనుస్మృతి 11-44)

ఏ మనుష్యుడు శాస్త్రోక్త కర్మలను వదిలి, నిందిత(నిషిద్ధ)కర్మలు చేయునో, మరియు ఇంద్రియార్థములగు శబ్దాదివిషయాలయందాసక్తుడగునో,అతడు ప్రాయశ్చిత్తమున కర్హుడగును.

కావున,నిత్యమగు మోక్షమునుగోరు బ్రహ్మతత్త్వజిజ్ఞాసువు(ముముక్షువు) పునర్జన్మకు హేతువులు,చిత్తవిక్షేపమునకు కారణములు,అనిత్యఫలకములు నగు విహితకర్మలను(శాస్త్రోక్తకర్మలను)విధిపూర్వకముగా(శాస్త్రోక్తరీతిచేతనే)సంన్యసించవలెను—అని శ్రీసదానన్దయతీన్ద్రులవారి యభిప్రాయము.

**“అత్రోపరమశబ్దేన సంన్యాసోఽభిధీయతే,తథా చ సంన్యాసినామేవ శ్రవణాధికార ఇతి కేచిత్**”శ్రీవేదాన్తపరిభాషాకారులు శ్రీధర్మరాజాధ్వరీంద్రులవారంటున్నారు—శమాదిషట్కసంపత్తిలోని“**ఉపరతి**”శబ్దముచే“**సంన్యాసము**”చెప్పబడుచున్నది.“**సన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః**”(ముం.3-2-6)వేదాన్తరూపప్రమాణముచే గల్గిన విజ్ఞానముచే జ్ఞేయమగు పరమాత్మస్వరూపము యెవరికి నిశ్చయింపబడినదో, ఆ బ్రహ్మనిష్ఠారూప సంన్యాసయోగముచే యుక్తమగు విశుద్ధసత్త్వముగల పురుషుడు(సర్వకర్మసంన్యాసముద్వారా యెవరి యంతఃకరణ

ము అత్యంతనిర్మలమైనదో—అతడు)జీవన్ముక్తిదశలో మరియు విదేహముక్త్య వస్థలోనూ బ్రహ్మలోకములో (బ్రహ్మైవ లోకః బ్రహ్మలోకః) అనగా అమరణధర్మ బ్రహ్మభావమును బొందును.సాధకభేదముచే(యతయః)బహువచన ప్రయోగ ము జేయబడినది.

పై శ్రుతిప్రమాణముచే"**ఉపరమ**"శబ్దముచే సర్వకర్మసంన్యాసమే వివక్షితమై యున్నది.వేదాన్తశ్రవణాదులందు గృహస్థులకు అధికారము లేదు—అని కొంద రు భిక్షువులంటున్నారు. కాని, యీ మతము(అభిప్రాయము)నందు అరుచి గల్గినందున శ్రీధర్మరాజాధ్వరేంద్రుల వారు చెప్తున్నారు—

**"అపరే తు ఉపరమ శబ్దస్య సంన్యాసవాచకత్వాభావాద్విక్షేపాభావమాత్రస్య గృహస్థేష్వపి సంభవాత్,జనకాదేరపి బ్రహ్మవిచారస్య శ్రూయమానత్వాత్సర్వా శ్రమ సాధారణం శ్రవణాది విధానమిత్యాహుః"।**(వాచస్పతిమిశ్రులు)

**"సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"**(ముం.1-2-12)ఇత్యాది శ్రుత్యనుసారము జానశ్రుతి, జనక, రైక్వ, వశిష్ఠుడు మున్నగువారు బ్రహ్మవిచారము చేసినట్లు అనేక ఆఖ్యాయికలు;"**గృహస్థోఽపి విముచ్యతే**"ఇత్యాది శ్రుతిస్మృతీతిహాసపురా ణములలో వినబడుచున్నవి.కావున,ఉపరమశబ్దము సంన్యాస వాచకముగా దు,మరేమనగా"**విక్షేపాభావ**"వాచకమున్నది.ఇది సత్-గృహస్థులలోగూడ సంభ వముంది.సన్యాసము శ్రవణాదులకు ఆవశ్యక అంగముగాదు. వివేకాది సాధన సంపన్నులగు సకలాశ్రమములవారికి సమానముగా శ్రవణాదులందధికారము శ్రుతిచే విధానముచేయబడినదని అవశ్యముగా స్వీకరించాలి.(ఈ సందర్భము లో శిఖామణి-టీకచూడగలరు).కావున,శ్రీవాచస్పతిమిశ్రులవారి యభిప్రాయ ము ప్రకారము ఉపరమ శబ్దమునకు అర్థము"**విక్షేపాభావము**"అని చెప్పబడి

నది. సర్వకర్మసంన్యాసము కాదు.

ఇప్పుడు,శ్రీజగద్గురు ఆద్యశంకరాచార్యులవారు వారియొక్క "**సర్వ వేదాన్త సిద్ధాన్త సార సంగ్రహము**" అను గ్రంథమున "**ఉపరతి**" విషయంలో ప్రదర్శించిన ప్రకారమును 151వ శ్లోకము నుండి 209వ శ్లోకము వరకు అవలోకించెదము.

**శ్లో॥సాధనత్వేన దృష్టానాం సర్వేషామపి కర్మణామ్।**

**విధినా యః పరిత్యాగః స సంన్యాసః సతాం మతః॥**(151)

ఏ కర్మలు శాస్త్రమునందు స్వర్గాది సాధనరూపముచే వర్ణింపబడినవో,ఆ సమస్త(నిత్య,నైమిత్తిక,కామ్య)కర్మలను,శాస్త్రమున చెప్పబడినరీతిగా పరిత్యజించుటయే సంన్యాసమనబడునని పండితుల యాశయము."**ఉపరమయతి కర్మాణీత్యుపరతిః**"సర్వకర్మలనుపరమింపజేయునది(త్యాగముజేయునది)గావున సంన్యాసమే **ఉపరతి** శబ్దముచే చెప్పబడుచున్నది.**సంన్యాసమ**నగా వేదోక్తములగు వివిధకర్మలను పరిత్యజించుటయని శాస్త్రమునందును, లోకమునందును వ్యవహరింపబడుచున్నది. (151, 152)

**తద్యథేహ కర్మజితో లోకః క్షీయతే, ఏవమేవాముత్ర పుణ్యజితో లోకః క్షీయతే** (ఛాం.8-1-6)ఎట్లు యీలోకంలో కృషివాణిజ్యాది కర్మలచే పొందబడు ధాన్యము,ధనము మొదలగునవి క్షయశీలములో,అట్లే అగ్నిహోత్రాదికర్మలచే గలుగు పుణ్యముచే పొందబడు స్వర్గాది భోగ్యసామగ్రులు పరాధీనోపభోగములైనందున క్షయశీలములేయగును.శాశ్వతములు మాత్రముకావు.ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములలో మోక్షమొక్కటియే నిత్యము.తద్వ్యతిరిక్త పురుషార్థత్రయము అనిత్యము."**యత్కృతకం తదనిత్యమ్**"అను సామాన్యతో దృష్టానుమానముచేననుగృహీత"**తద్యథేహ**"యను శ్రుత్యనుసారము ధర్మార్థ

కామములను మూడు పురుషార్థములు ప్రత్యక్షాదిసిద్ధ కార్యలింగముచే అనిత్యములని సిద్ధమగుచున్నది. ఇక్కడ యీ వివేకమున్నది—అర్థ కామములు ప్రత్యక్షానుమానాగమములచే మరియు ధర్మము శ్రుతిచే అనిత్యములనియవగతమగుచున్నది. అట్లే,

**"ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున"।**(గీత.8-16)

**"క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి"**(గీత.9-21)

**"ఆ భూత సంప్లవం స్థానమమృతత్వం విభావ్యతే"**(వి.పు.2-8-97)

ఇత్యాది స్మృతులు గూడ పై ఛాందోగ్య శ్రుతికి ఉపోద్బలకములుగా తెలియాలి.

పై శ్రుతిస్మృతులచే కర్మలవలన గలుగు ఫలములన్నియు ననిత్యములని చెప్పబడినది.కాన నిత్యమగు బ్రహ్మ-కైవల్యరూప మోక్షమును గోరు ముముక్షు జనులకు కర్మల వలన ప్రయోజనము లేదు.153.

లోకంలో కర్మల వలన గల్గు ఫలము నాల్గు విధములుగా గన్పట్టుచున్నది.

**శ్లో॥ఉత్పాద్యమాప్యం సంస్కార్యం వికార్యం పరిగణ్యతే।**

**చతుర్విధం కర్మసాధ్యం ఫలం నాన్యదితః పరమ్॥**(స.వే.సి.సా.సం.154)

**ఉత్పత్తిరాప్తిః సంస్కారో వికారశ్చ విధేః ఫలమ్।**

**ముక్తిర్విలక్షణైతేభ్యస్తేనేహానర్థకో విధిః॥**(బృ.వా.సంబన్ధ భాష్యవార్తికము 236)

**1.ఉత్పాద్యము=**ఉత్పన్నము జేయుటకు యోగ్యమైనది.ఉపాదాన కారణములో యే వికారము కలుగకుండా,దానియందొక నూతన వస్తువు ఉత్పన్నమగుటను ఉత్పాద్యరూపక్రియాఫలమందురు.ఉదా:—వస్త్రము.వస్త్రమునకు ఉపాదాన

కారణమగు తంతువులు(నూలుపోగులు)వినాశమునుగాని,వికారమునుగాని చెందకుండా,వాటియందొక నూతనవస్తువు"వస్త్రము"ఉత్పన్నమగును.ఆ వస్త్ర ము(పటము)ఉత్పాద్యమగును.వైదిక ఉదా:—మేక్షణమను కాష్ఠపాత్రలో పిండి ని జలముచే మంత్రపూర్వకముగా సంయవనము(మిశ్రణము)అనగా పిసికి పిండమును(ముద్దగా) తయారుచేసి,దాన్ని తాబేలు ఆకారములో చేస్తారు. దానిని పురోడాశ అంటారు. ఈపురోడాశ కర్మచే (క్రియచే)నుత్పన్నమైనందున ఉత్పాద్యమగును.

**2.ప్రాప్యము** (పొందుటకు యోగ్యము):—పూర్వము అప్రాప్తమైన దానిని క్రియచే పొందినచో నది ప్రాప్యము అనబడును.ఉదా:—గమనరూప క్రియచే గ్రా మము పొందబడును,గావున గ్రామము ప్రాప్యమగును.వైదిక ఉదా:-దోహనవిధి కి ఫలము దుగ్ధము. యజ్ఞమునకుపయోగించు దధి(పెరుగు)కోసము ఆవు నుండి పాలు పితుకుటను దోహనవిధి అంటారు. ఆవు స్తనములను పితుకుట ద్వారా(దోహనవిధికి ఫలముగా)దుగ్ధము అనగా పాలు ప్రాప్తమగును. ఆ పాలు ప్రాప్యము అనబడును.

**3.సంస్కార్యము**(సంస్కరింపబడుటకు యోగ్యము):—సంస్కారము రెండు విధములు.1.దోషాపనయనము(మలనివృత్తి రూపము).2.గుణాధానము.మల శోధక ద్రవ్యములతో ఘర్షణరూప క్రియచే సంస్కరింపబడిన(శుభ్రము జేయబడిన)దర్పణము తన భాస్వరత్వ ధర్మముచే అభివ్యక్తమగును. వస్త్రము యొక్క మాలిన్యమును ప్రక్షాళనాది క్రియచే సంస్కారము(శుభ్రము)చేస్తారు. కావున అద్దము,వస్త్రము(మలవృత్తిరూప)సంస్కార్యమగును.అట్లే, యజ్ఞమున కుపయుక్తమగు సామగ్రులను సమ్మార్జనము(శుభ్రము)చేస్తారు."**వేదింసంమా**

**ర్ష్టి, స్రువం చ స్రుచశ్చ సంమార్ష్టి,మేక్షణ స్రువం చ సంమార్ష్టి.**(శ్రౌతసూత్రములు) ఇత్యాది.

మనవాళ్ళు కొన్ని పండుగలను పురస్కరించుకొని పండుగకు ముందు రోజు ల్లో ఇండ్లను శుభ్రముజేసి రకరకాల రంగులతో సుసజ్జితము చేస్తారు. దీనికి గుణాధానమంటారు.“**వ్రీహీన్ ప్రోక్షతి**”వ్రీహి(ధాన్యము)ను జలముచే ప్రోక్షణము జేసి సంస్కరింప జేస్తారు.ఆ సంస్కరింపబడిన ధాన్యముచే యాగము చేసినచో అదృష్టము(పుణ్యము)ఉత్పన్నమవుతుంది.సంస్కరింపబడని ధాన్యముచే అ దృష్టం ఉత్పన్నము గాదు.కావున,ప్రోక్షణరూప క్రియచే ధాన్యము సంస్కరిం పబడుతుంది. అపుడు ధాన్యము గుణాధానరూప సంస్కార్యమగును.

**4.వికార్యము:**—క్రియచే ఒకానొక ద్రవ్యము నష్టమై దాని స్థానంలో రెండవ వస్తువు(ద్రవ్యము)ఉత్పన్నమైనచో, ఆ క్రియా ఫలము వికార్యము అనబడును. ఉదా:—పాలు నష్టమై పెరుగుగా మారుతాయి. ఆ పెరుగు వికార్యమగను. వైదిక ఉదా:—“**వ్రీహీనవహన్తి**”ధాన్యమును దంచి బియ్యముచేయవలెను.ధాన్యము పై పొట్టు(ఊక)ను అనేక విధములుగా తొలగించవచ్చును. కాని, సంస్కరింపబడిన కుదురు(కుందియన)యందు దంచి ఊకను వేరుజేసి బియ్యమును నిష్ప న్నము చేయవలెనని శాస్త్రము విధానము జేసినది.కావున,బియ్యము వికార్య మనబడును.అట్లే,అన్యవైదిక ఉదా:—(సోమయాగప్రకరణములో)సోమలతనుండి సోమరసము తీయబడుతుంది. సోమరసము వికార్యమగును. ఇట్లు క్రియా ఫలములు నాల్గు విధములు మాత్రమే గలవు.154.

పై చతుర్విధ కర్మ ఫలములలో యే వొక్కదానియందుగూడ బ్రహ్మము లేదా బ్రహ్మభావరూప మోక్షము చేరనేరదు. ఎందుకనగా,1. స్వతస్సిద్ధమగుట

చే ఘటాదులవలె నుత్పన్నము చేయదగినదిగాదు.“**అజో నిత్యః**”(కఠ.2-18; గీత. 2-20). 2.పొందువాని(ముముక్షువుయొక్క)స్వరూపమే యగుటచే నిరన్తరము పొందబడియే(నిత్యప్రాప్తమై)యున్నదిగాన గ్రామాదులవలె నూతనముగా పొంద దగినది గాదు.“**బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి**”(ముం.3-2-9);“**బ్రహ్మవిదాప్నోతి పరమ్**” (తై.2-1-1);“**నిత్యశుద్ధవిముక్తైకమఖణ్డానన్దమద్వయమ్।సత్యంజ్ఞానమనన్తంయత్ప రం బ్రహ్మాహమేవ తత్॥**”(వరాహోప.3-2). 3.మాయా సంబన్ధరహితమై ఆకాశమువ లె నిర్మలమైనది గావున మలినములగు దర్పణాదులవలె సంస్కరింప దగిన ది గాదు.“**శుద్ధమపాపవిద్ధ మ్**”(ఈశావా.8) 4. సర్వక్రియా రహితమగుటచే పాలు పెరుగుగా మారినట్లు వికార్యము గానేరదు.“**నిష్కలం నిష్క్రియం**”(శ్వే.6-19);“**ని ర్వికారం నిరాశ్రయమ్**” (బ్ర.బిం.21; యో.శి.3-21);“**అవికార్యోఽయముచ్యతే**”(గీత.2-25).

శ్రీశంకరులవారు పైవిషయమునే యింకా స్పష్టము జేయుచున్నారు. 1.బ్ర హ్మము ఉత్పాద్యము కాదు:—బ్రహ్మమునకు పుట్టుక లేదనియు,పుట్టించు వాడును లేడనియు శ్రుతులయందు పెక్కు స్థలములలో ప్రతిపాదింపబడినది. “**నచాస్య కశ్చిజ్జనితా**”, “**నతస్య కార్యం కరణం చ విద్యతే**”(శ్వే.6-8&9), “**అపూ ర్వమనపరమనన్తరమబాహ్యం**”(బృ.2-5-19)అపూర్వం=కారణరహితము;అనపరం =కార్యరహితము(బ్రహ్మ).అట్లే,బ్రహ్మము అనాది=ఉత్పత్తిరహితము,కారణరహి తము అనంటూ—“**అనాద్యనన్తమ్**”(కఠ.3-15),"**అజోనిత్యః**"(కఠ.1-2-18&గీత2-20) “**అనాదిత్వాన్నిర్గుణత్వాత్**”(గీత.13-32)ఇత్యాద్యనేక శ్రుతిస్మృతులు సాక్షాత్తుగా బ్ర హ్మముయొక్క ఉత్పత్తిరాహిత్యమును ఉద్ఘోషించుచున్నవి.మరియు,“**యద్యద్ కార్యంతత్తదనిత్యమ్**”యేది కార్యమో(ఉత్పన్నమగునో)అది అనిత్యము-నష్టమ గును)అను ఉపపత్తిగూడ లోకంలో ప్రసిద్ధమున్నది.ప్రపంచమందలి మతప్రవ క్తలందరును జగత్కారణమగు వస్తువు నిత్యమనుటలో ఐకమత్యము గల్గి

యున్నారు.శ్రుతి స్మృతులన్నియును  నీ యాధ్యాసిక జగత్తుకు కారణము (అధిష్ఠానం)నిత్యమగు  సచ్చిదానన్దరూప పరబ్రహ్మమేయని యేకకంఠంతో నొక్కివక్కాణించుచున్నవి.కావున,బ్రహ్మముగాని,బ్రహ్మభావరూప  మోక్షముగాని ఉత్పాద్యముగాదు. 156.

2.బ్రహ్మము ఆప్యము (ప్రాప్తముజేసుకొనుటకు యోగ్యము)కాదు:—ఎందుకనగా,పొందబడు వస్తువు పొందువాని కంటే భిన్నముగా నుండవలయును.బ్రహ్మము,పొందువానిస్వరూపముచే అభిన్నమా?లేక,భిన్నమా?ఒకవేళ అభిన్నమన్నచో"**స్వాత్మరూపత్వేసతి  అనాప్యత్వాత్**"బ్రహ్మము పొందువాని స్వరూపమే యగుటచే ఆప్యముగాదు.ఒకవేళ భిన్నమన్ననూ  ఆప్యముగాదు."**వ్యతిరిక్తత్వేఽపి బ్రహ్మణో నాప్యత్వమ్, సర్వగతత్వేన నిత్యాప్తస్వరూపత్వాత్సర్వేణ బ్రహ్మణః,ఆకాశస్యేవ".**(బ్ర.సూ.భాష్యము 1-1-4) బ్రహ్మము ఆత్మకంటె భిన్నం అని అన్నా గూడ,అది ఆకాశంవలె సర్వవ్యాప్తముగాన ప్రతివాడూ,ఎల్లపుడూ దానిని పొందియే ఉన్నాడు గదా!కావున,రెండువిధములా బ్రహ్మము ఆప్యము గాదు. 157.

3.ఇంతకు ముందు మనము తెలుసుకుంటూ వచ్చిన ప్రకారముగా బ్రహ్మము,లేదా మోక్షము,రెండు విధములచే సంస్కార్యంగూడా కాదు.1.మల నివృత్తి రూప సంస్కారము:—దోషాలను తొలగించడంద్వారా బ్రహ్మమును(మోక్షాన్ని) సంస్కరించ వచ్చును—అనడం కుదరదు.ఎందువల్లననగా మోక్షము ఆకాశమువలె నిరన్తరస్వచ్ఛమగు నిత్యశుద్ధబ్రహ్మస్వరూపమై యున్నది."**శుద్ధమపాపవిద్ధమ్")**(ఈశావా.8)"**నిర్దోషం హి సమం బ్రహ్మ**"(గీత.5-14)దానిలో దోష ప్రసక్తియే (సంభావనయే) లేదు.

శంక:—మలశోధక ద్రవ్యములచే అద్దాన్ని గట్టిగా తుడిస్తే దానిలోనే ఉన్న భాస్వరత్వము(మెరుపు)అనే ధర్మము బయటపడినట్లు,బ్రహ్మరూప మోక్షం స్వాత్మధర్మమే అయినా అనాద్యవిద్యారూప మలముచేనది మరుగుబడి పోయి నది,ఉపాసనాది క్రియలచే ఆత్మను సంస్కరించగా పునః స్వాత్మరూపముచే అభివ్యక్తమగును గదా?

సమాధానము:—అట్లు శంకించుట తగదు. ఎందువల్లననగా ఆత్మ ఎలాంటి క్రియకుకూడ ఆశ్రయం కాజాలదు."**యదాశ్రయా క్రియా తమవికుర్వతీ నైవాత్మానం లభతే**" క్రియ దేనిని ఆశ్రయించుకొని ఉంటుందో (దేని మీద క్రియ జరుగుతుందో)దానిలో కొంత వికారమును కలిగించకుండా తన ఉనికిని పొంద జాలదు(పుట్ట జాలదు).అనగా,క్రియ దేనిమీద జరుగుతుందో,దానిమీద తప్ప కుండా కొంతమార్పును కలిగించితీరుతుంది—అని భావము.అలాంటి క్రియచేత ఆత్మయందు యేదైనా వికారం కల్గితే,అపుడు ఆ ఆత్మ అనిత్యమై పోవును. మరియు,"**నిష్కలంనిష్క్రియం శాన్తం**"(శ్వే.6-19)"**అవికార్యోఽయముచ్యతే**"(గీత.2-25)ఈఆత్మమీద ఎలాంటి వికారములు పుట్టింపబడజాలవు—ఇత్యాది వాక్యము లుబాధింపబడుతాయి.అది ఇష్టమైనది(అంగీకార్యం)కాదు.అందుచేత ఆత్మయం దు యేదైన క్రియ జరుగుతుంది(ఆత్మక్రియాశ్రయము)అని చెప్పుట కుదరదు.

ఇక్కడ శంకాకారుణ్ణి యిట్లు వికల్పముజేసి యడుగవలెను. ఏమి, అవిద్యా రూప మలము కల్పితమా?లేక సత్యమా?ఒకవేళ కల్పితమన్నచోనది యధి ష్ఠాన జ్ఞానముచే నివర్తింపబడును.క్రియచే గాదు.ఎట్లు కల్పిత సర్పముయొక్క నివృత్తి అధిష్ఠానమగు రజ్జువు(త్రాడు)జ్ఞానముచే గల్గును,కాని,యే అన్యసాధ నములచే (క్రియలచే) కలుగదు.

**శ్లో॥భ్రాన్త్యాప్రతీతః సంసారో వివేకాన్న తు కర్మభిః।**

**నహి రజ్జురగారోపో ఘంటాఘోషాన్నివర్తతే॥**(తత్వానుసంధానము తృతీయ పరిచ్ఛేదాంతమున శమాదిసాధననిరూపణావసరే)

అదిష్ఠానమగు ఆత్మయందు భ్రాన్తిచే(అధ్యాసముచే)ప్రతీతమగు నీసంసారమువివేకముచే(అధిష్ఠానజ్ఞానముచే)నివర్తించునుగాని యేకర్మఉపాసనాదులచే గాదు.రజ్జ్వజ్ఞానమువలన భ్రాన్తిచేగన్పట్టు సర్పము అదిష్ఠానమగు రజ్జుజ్ఞానముచే నివర్తించును.కాని,నాయనా? ఘంటను మ్రోగించినచో(వాయించినచో)పాము పారి పోతుందా?ఉపలక్షణముగా యే కర్మరూప ఉపాయములచేగూడ నివర్తించదు అని భావము.కావున,కల్పిత అవిద్య అధిష్ఠాన బ్రహ్మాత్మైకత్వజ్ఞానముచే తప్ప,యితర ఉపాసనాది క్రియలచేత నివర్తించదు.

ఒకవేళ ఆవిద్యారూప మలము సత్యమన్నచో నది తత్వజ్ఞానముచే నివృత్తి కాకుండును.మరెట్లనగా పూర్వపక్షి మతానుసారము ఉపాసనారూప క్రియచే నివర్తించును.ఎట్లు సత్యమగు సర్పమును దండము(కర్ర)చే కొట్టిన మరణించునో, అట్లు ఉపాసనాది క్రియలచే సత్యమగు నవిద్య నష్టముగును.

ఇక్కడ శంకాకారుణ్ణి మళ్ళీ వికల్పముజేసి యిట్లు అడుగవలెను. ఏమి, ఈ ఉపాసనారూప క్రియ ఆత్మయందు ఉంటుందా? లేక, ఆత్మకంటె భిన్న వస్తువు నందుంటుందా? మొదటి పక్షము యుక్తము గాదు. ఎందుకనగా, నిష్క్రియాత్మ యందు క్రియ సంభవించదు.“**అవిక్రియమవ్యపదేశ్యం**”(నృసింహోత్తర.తా.ఉ.9-9),“**నిష్కలం నిష్క్రియం**”(శ్వే.6-19) ఇత్యాది శ్రుతులు ప్రమాణములు.రెండవ పక్షము గూడ యుక్తముగాదు.ఏలయన,అన్య పదార్థముయొక్క ధర్మము(క్రియ)చే అన్యపదార్థమునందు(ఆత్మయందు)అవిద్యారూప మలనివృత్తియను కార్యము

(సంస్కారము) జరుగును—అని అన్నచో ఆ రెండు(అనాత్మ మరియు ఆత్మ) వస్తువులలో యేదో సంబన్ధము లేకుండా కార్యము జరుగదు.కాని,ఆత్మకు వాస్తవముగా దేనితో సంబంధము లేదు. **"అసఙ్గో న హి సజ్జతే"**(బృ.3-9-26), **"అసఙ్గోహ్యయం పురుషః"**(బృ.4-3-15&16)ఇత్యాది శ్రుతులు ఆత్మయందు సంబన్ధ-క్రియాదులను నిషేధము చేయుచున్నవి.అందువల్ల,బ్రహ్మము లేదా మోక్షము సంస్కార్యము గాదు.

శంక:—అన్యాశ్రిత క్రియచేతగూడ అన్యముయొక్క సంస్కారము సంభవిస్తుంది.ఎట్లనగా,దేహాశ్రిత స్నానము, ఆచమనము, యజ్ఞోపవీత ధారణాది క్రియలచే జీవాత్మ సంస్కరింపబడినట్లు కనబడుచున్నది గదా?

సమాధానము:—ఇట్లు శంకించుట యుక్తము గాదు.ఎందుకనగా దేహాది సంఘాతయుక్త అవిద్యాప్రతిబింబిత జీవాత్మ సంస్కరింబడుతుంది.కాని నిరుపాధిక శుద్ధాత్మ(సాక్షి,బ్రహ్మము)సంస్కరింపబడదు.స్నానాచమనాది క్రియలకు దేహముతో సంబన్ధము ప్రత్యక్షమే ఉన్నది గదా!ఎవరు దేహాది సంఘాతమునందు తాదాత్మ్యాధ్యాసముచే ఆత్మబుద్ధి గలవాడగునో అతడు దేహాశ్రిత క్రియలచే సంస్కరింపబడుట యుక్తమే.దేహమునకు గావింపబడిన చికిత్సవల్ల గల్గిన ధాతుసామ్యం(స్వాస్థ్యం-ఆరోగ్యం)చేత,ఆ దేహమునందు(నేను,నాదియను)అభిమానముగల జీవాత్మకు"**నేను రోగం లేనివాడనయ్యాను**"అను బుద్ధి కల్గుతుంది.అతనికే ఆరోగ్యఫలము చెందుతుంది.అట్లే,స్నానాచమన యజ్ఞోపవీతాదులచేత"**నేను ఇప్పుడు పరిశుద్ధుడనయ్యాను,సంస్కరింపబడ్డాను**"అను బుద్ధి యెవరికి గల్గునో,అతడు దేహాభిమానము(దేహముతోసంబన్ధము)గల్గియున్నాడు,గావున అతనికే దేహాశ్రిత క్రియలయొక్క ఫలం(సంస్కారము)చెందుతుంది—అని చెప్పుట యుక్తము.ఇచ్చట అనాత్మయగు దేహాది సంఘాతముతో

ఆత్మకు యే సంబన్ధము చెప్పబడినదో, అది యవిద్యచే యేర్పడిన ఆధ్యాసిక (కల్పిత) సంబన్ధమే గాని వాస్తవము గాదు.దేహాశ్రిత క్రియలచేగల్గు ఫలము జీవాత్మకే చెందునుగాని శుద్ధాత్మ(బ్రహ్మ)కుకాదు—అనుటలో శ్రుతి ప్రమాణములు—

**"తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి"**(శ్వే.4-6; ముం. 3-1-1)

శరీరమను వృక్షమునందు జీవపక్షి మరియు ఈశ్వరపక్షియను రెండు పక్షులు కలిసి నివసించుచున్నవి. ఆ రెంటిలో ఒకటి (జీవాత్మ) కర్మఫలాలను చక్కగా తింటుంది(అనుభవిస్తుంది).రెండవది(ఈశ్వరపక్షి)తినకుండా కేవలము (ప్రకాశిస్తుంది)చూస్తుంది.

**"ఆత్మేన్ద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః"**(కఠ.3-4)

దేహేన్ద్రియ మనస్సులతో కూడిన జీవాత్మయే భోక్తయని బుద్ధిమంతులు చెప్పుచున్నారు.

ఈప్రకారముగా బ్రహ్మభావరూప మోక్షమునందు దోషాపనయనరూప సంస్కార క్రియ సంభవింపదని ఋజువైనది. మరియు,

2.గుణాధానరూప సంస్కారము:—గుణములనుచేర్చుట,కల్పించుటద్వారా సంస్కారం చేయబడుతుంది—అనేది కుదరదు. ఎందువల్లననగా మోక్షం అనేది ఎలాంటి అతిశయాన్ని చేర్చడానికి శక్యంకాని బ్రహ్మమే.అనగా విశేష గుణము ను కల్పించుటకు వీలుకానిది.నూనెను పరిమళ(ద్రవ్యములతో) పుష్పములతో గలిపి వంట వండినచో పూర్వము లేని మంచి గంధము కల్పించబడును.కాని, బ్రహ్మము(మోక్షము)నిర్గుణమని శ్రుతులు వాక్రుచ్చుచున్నవి,గాన బ్రహ్మము నకు సంస్కార క్రియ వలన గుణాధానము గలుగనేరదు.

మన్త్రము:—**ఏకో దేవః సర్వభూతేషు గూఢః,సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా।**

**కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః,సాక్షీచేతాః కేవలో నిర్గుణశ్చ॥**(శ్వే. 6-11)

సమస్త ప్రాణులలో ఉన్న దేవుడు ఒక్కడే(స్వప్రకాశము);అవిద్యా తత్కార్య ముచే తిరోహితమైనందున మేఘముచే సూర్యుడు ఆచ్ఛాదింపబడినట్లు, పరమాత్మ సకల ప్రాణి కోట్లకు ఇన్ద్రియమనంబులచే(ప్రత్యక్షాదులచే) అవేద్యము గాన గూఢము(పైకి కనబడనివాడు),అంతటా వ్యాపించినవాడు,సమస్త భూత ములకు అంతరాత్మ,సకలకర్మలకు అధ్యక్షుడు;సకల భూతాలకు నివాసస్థాన మైనవాడు;సాక్షి-చైతన్యస్వరూపుడు;నిరవయవమున్నందున అవిక్రియ స్వరూ పుడు.కేవలడు=మాయామలరహితుడు;మరియు నిర్గుణుడు.ఈ మత్రార్థము ను సవిస్తరముగా తెలియగోరువారు శ్రీమద్భగవద్గీత-శంకరానన్ది టీకా 9-11 లో దర్శించగలరు.లేదా మాచే రచింపబడిన **"శ్రీ భక్త తుకారాం అభంగవాణి"** అను గ్రంథమున 506 వ పృష్ఠమున గనందగును.

మన్త్రము:—“**స పర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరగమ్ శుద్ధమపాపవి ద్ధమ్**” (ఈశా.8)ఆ ఆత్మ సర్వవ్యాపకము;దీప్తివంతముగాన శుక్రము=శుద్ధము; అకాయమ్=అశరీరమ్=సూక్ష్మశరీరరహితము; అవ్రణము=అక్షతము=గాయ ములు లేనిది;అస్నావిరమ్=సిరలు=నాడులు లేనిది;అవ్రణము,అస్నావిరం అను రెండు విశేషములచే ఆత్మ స్థూలశరీరములేనిదని చెప్పబడినది; శుద్ధమ్=నిర్మలమ్=అవిద్యామల రహితమ్ అనగా కారణ శరీరవర్జితము అని యర్థము; అపాపవిద్ధమ్=ధర్మాధర్మములు(పుణ్య పాపములు)లేనిది.

పైరెండు మన్త్రములచే బ్రహ్మభావరూప మోక్షము నూతనముగా అతిశ యము చేర్చడానికి శక్యము కానిదనీ,అది నిత్యశుద్ధమనీ చెప్పబడినది. కావు

న,మోక్షము(బ్రహ్మము)నందు దోషాపనయనరూప క్రియగాని, గుణాధానరూప క్రియగాని ప్రవేశించదుగాన సంస్కార్యముగాదు—అని నిర్ణయింపబడినది. (బ్ర.సూ.భాష్యం;రత్నప్రభ).

4.వికార్యము:—బ్రహ్మము పరిణామము=మార్పుజెందు స్వభావముగలది కాదు.లోకంలో అవయవములుగల పదార్థములన్నియు మార్పుజెందు స్వభావము గలవగుచున్నవి.అందుకే,పాలు మున్నగు వస్తువులు మజ్జిగ మొదలగు పదార్థ సంబన్ధముచే(తోడుపేసినపుడు)పెరుగు మున్నగు స్వరూపముగా వికారము నొందుచున్నవి.ఏది వికారమునొందునో,దానికి ఉత్పాద్య వస్తువునకువలె అనిత్యత్వము ధ్రువము(నిశ్చితము).**"న హి దధ్యాది వికార్యం ఉత్పాద్యం వా ఘటాది నిత్యం దృష్టం లోకే"**(బ్ర.సూ.భాష్యము 1-1-4)వికార్యమైన పెరుగు మొదలైనవి గాని, క్రొత్తగా పుట్టించబడిన ఘటాదికంగాని నిత్యమైనట్లు లోకంలో యెక్కడా చూడబడలేదు గదా?కాని,బ్రహ్మమన్ననో నిరవయవము,నిష్క్రియముగాన యది వికార్యమగుట అనుపపన్నము.

**"నిష్కళం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్"**(శ్వే. 6-19) బ్రహ్మము, అవయవములు లేనిదనియు, క్రియలు లేనిదనియు, మార్పునొందనిదనియు, రాగద్వేషాది దోషములు లేనిదనియు,మాయాసంబన్ధముగాని పుణ్యాపాప సంబన్ధముగాని లేనిదనియు శ్రుతులచేతను యుక్తులచేతను చక్కగా నిర్ణయింపబడినది.

**"బ్రహ్మభావశ్చమోక్షః"**బ్రహ్మభావమంటేనే మోక్షము. బ్రహ్మము మరియు మోక్షము వేరుగాదు, మరేమనగా ఒక్కటే. అందువలన,మోక్షం విషయంలో క్రియ ప్రవేశించడానికి పైన చెప్పబడిన ఉత్పత్తి, ఆప్తి, సంస్కారము మరియు వికారము—యీ నాల్గు తప్ప మరొక (ఐదవ) ద్వారం యేది లేదు. ఎవరుగూడ చెప్పజాలరు.ఇంతదనుక బ్రహ్మసూత్ర భాష్యము (1- 1- 4) ఆధారముగా చింతన

జేయనైనది.ఈసమగ్ర భావము శ్రీశంకరాచార్యులవారి స.వే.సి.సా.సం. శ్లోకము 158 నుండి 162 వరకు శ్లోకములలో నిహితమై యున్నది.

**శ్లో॥తస్మాన్న కర్మ సాధ్యత్వం బ్రహ్మణోఽస్తి కుతశ్చన।**

**కర్మసాధ్యం త్వనిత్యం హి బ్రహ్మ నిత్యం సనాతనమ్॥**163.

కావున,పూర్వోక్త హేతువులచే యేప్రకారముచేగూడ బ్రహ్మము కర్మ సాధ్యము గానేరదు.కర్మలచే పొందబడునవన్నియును అనిత్యములే. బ్రహ్మమొక్కటి మాత్రము నిత్యము.

పుణ్యపాప మిశ్రితములగు కర్మలచే ప్రాప్తమైన మనుష్యాది శరీరములు నశించుచుండుటను మన మెఱుగుదుము.అట్లే,కేవల పుణ్యకర్మ ఫలములగు దేవాది శరీరములుగూడ నశ్వరములనుటలో సందేహములేదు. "**క్రియాసాధ్యములగునవన్నియును అనిత్యములు**"అను శాస్త్రసంప్రదాయ యుక్తిననుసరించి పుట్టినది గిట్టక(నశించక)మానదు—అనుట నిర్వివాదాంశము.ఈ విషయంలో"**తద్యథేహకర్మజితో**"అను ఛాందోగ్య శ్రుతిని మరియు"**యత్కృతకం తదనిత్యమ్**"అను న్యాయమును పూర్వం చింతనజేస్తూ వచ్చాము. కాన, పుణ్యకర్మ విశేషమువలన సంభవించునవగుటచే ననిత్యములగు స్వర్గాదిలోక సుఖములందు పండితులు భ్రమజెందరు.164&165.

జగత్కారణమగు వస్తువు నిత్యమనుటలో ప్రపంచమందలి మత ప్రవక్తలందరు ఐకమత్యము గలిగియున్నారు.తార్కికులు,జగత్కారణములగు పరమాణువులు నిత్యమందురు.సాంఖ్యులు,ప్రధానమే జగత్కారణమనియు,అది శాశ్వతమనియు చెప్పుచున్నారు.శ్రుతులుమాత్రము సచ్చిదానన్దరూపమగు పరబ్రహ్మమే సర్వజగత్కారణమని నొక్కి వక్కాణించుచున్నవి. 166.

**యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి యత్ప్రయ న్త్యభిసంవిశన్తి, తద్విజిజ్ఞాసస్వ।తద్బ్రహ్మేతి।**(తై. 3-1)

యతః=యస్మాద్వా=ఆబ్రహ్మస్తంబపర్యన్తము సంపూర్ణ ప్రాణులు దేని నుం డి ఉత్పన్నమగుచున్నవో,జన్మించిన పిమ్మట దేనినాశ్రయించుకొని ప్రాణము లను ధరించుచున్నవో(జీవించుచున్నవో)అనగా వృద్ధినిపొందుచున్నవో,మరి యు వినాశకాలము ఉపస్థితమైనప్పుడు దేనియందు ప్రవేశించుచున్నవో అన గా దేనితో తాదాత్మ్యభావమును(అభేదమును)పొందుచున్నవో,దానిని నీవు విశేషరూపముచే తెలిసికొనుటకు ఇచ్ఛజేయుము. తాత్పర్యమేమనగా, ఉత్పత్తి స్థితి ప్రలయములలో ప్రాణులు దేనియొక్క స్వరూపమును విడుచుటలేదో, అదియే బ్రహ్మముయొక్క లక్షణమైయున్నది.“**సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ**”(తై. 2-1-1)అని తైత్తరీయోపనిషత్తులో పూర్వప్రకణమున బ్రహ్మముయొక్క యే [12]స్వరూపలక్షణము చెప్పబడెనో,ఆ సచ్చిదానన్దపరబ్రహ్మమే జగత్తునకు ఉత్పత్తి స్థితి లయ కారణముగా తటస్థ లక్షణముచే చెప్పబడినది.

“**ఐతదాత్మ్యమిదం సర్వం,తత్సత్యం స ఆత్మా**”(ఛాందో.6-8-7 ఇత్యాది........)

[12] లక్షణం ద్వివిధం భవతి।స్వరూపలక్షణం తటస్థలక్షణం చేతి। 1.స్వరూపంసద్వ్యావర్తకమ్-స్వరూపలక్షణమ్।యథా పృథివ్యాః పృథివీత్వమ్ ।యథావా లౌహిత్యం ఉష్ణతా ప్రకాశశ్చ దీపకస్య లక్షణమ్।సత్యజ్ఞానానన్దాదయః బ్రహ్మణః స్వరూపలక్ష ణమ్।2.యావల్లక్ష్యకాలమ నవస్థితత్వేసతి యద్వ్యావర్తకమ్ తదేవ తటస్థలక్షణమ్। యథా గన్ధవత్వం పృథివీలక్షణమ్ ।మహాప్రలయే పరమాణుషు ఉత్పత్తికాలే ఘటాదిషు చ గన్ధాభావాత్।తథా సృష్టిస్థితిలయ కారణత్వమ్ బ్రహ్మణః తటస్థలక్షణమ్।కారణత్వం కర్తృత్వమతోఽ విద్యాదౌ నాతివ్యాప్తిః।

జగత్తునకు మూలము(అధిష్టానము)గా అణుభావరూప **సత్ అను పేరుగల**యే ఆత్మ చెప్పబడినదో,కుండకు మట్టియే,ఆభరణములకు సువర్ణమే స్వరూపమగునట్లుగా,ప్రతీయమానమగు నీ సర్వప్రపంచమునకును ఆ ఆత్మయే(బ్రహ్మమే)యథార్థ స్వరూపమనియు,అట్టి ఆత్మ నిత్యమనియు శ్రుతి నుడువుచున్నది 167.

**"న కర్మణా న ప్రజయాధనేన।త్యాగేనైకే అమృతత్వమానశుః"।**(మహానారాయణోపనిషత్ 8-14; కైవల్యోపనిషత్ 1-3)పైన పేర్కొనిన-సర్వాధిష్టానము(సర్వకారణము),సర్వజ్ఞము,సర్వాత్మయునగు సద్రూపబ్రహ్మముయొక్క ప్రాప్తిరూప మోక్షము(అమృతత్వము)కర్మణా=అగ్నిహోత్రాదికర్మానుష్ఠానముచేతగాని,ప్రజయా=సంతానముచేతగాని,ధనేన=ధనముచేతగాని—యింకా ఐహిక పారలౌకికమైనయే ఉపాయములచేతగూడ పొందబడదు.అమృతత్వం=మోక్షమును ఏకే=కొందరు, త్యాగేన= త్యాగము చేతనే ,ఆనశుః=పొందిరి.కావున,కర్మలు నేరుగా ముక్తి సాధనములు కావు. అందుకే జ్ఞాననిష్ఠులగు సంన్యాసులే సర్వకర్మలను విధిపూర్వకముగా పరిత్యజించి(సర్వకర్మలనుండి ఉపరమించి)ముక్తినొందుచున్నారని శ్రుతులు ఢంకా మ్రోగించి చాటుచున్నవి.168.

ముముక్షు జనులకు,జీవాత్మ పరమాత్మల స్వరూపమును విచారించుట వలనగల్గు జీవబ్రహ్మైక్యజ్ఞానము వలననే ముక్తి లభించునుగాని, స్నానములు, జపములు, వ్రతములు, యజ్ఞములు, మన్త్రములు మున్నగువానిచే ముక్తి లభింపదు.169.

**శ్లో॥జ్ఞానాదేవ తు కైవల్య మితిశ్రుత్యా నిగద్యతే।**

**జ్ఞానస్య ముక్తి హేతుత్వ మన్యవ్యావృత్తి పూర్వకమ్॥**170.

**"జ్ఞానాదేవ తు కైవల్యమ్"; "ఋతే జ్ఞానాన్నముక్తిః"**(లోపశ్రుతులు)

జ్ఞానము వలననే ముక్తి గలుగును గాని సాధనాన్తరములచే గలుగనేరదు— అను శ్రుత్యర్థములచే జ్ఞానమే మోక్షమునకు ముఖ్యమగు సన్నిహిత సాధన మని నిర్ణయింపబడినది.

**"జ్ఞాత్వా తం మృత్యుమత్యేతి నాన్యః పన్థా విముక్తయే"** (కైవల్యో. 9)

ఆ పరమాత్మను తనచే నభిన్నముగా(అహంబ్రహ్మాస్మి)తెలుసికొని జ్ఞాని పురుషుడు మృత్యువును అతిక్రమించుచున్నాడు.అజ్ఞానకల్పిత దేహబంధము లు, సంసారపాశములు తొలగుటకు వేరు మార్గము లేదు.

**"అజ్ఞానాదేవ సంసారో జ్ఞానాదేవ విముచ్యతే"।**(యోగతత్త్వోపనిషత్- 16)

**అవిద్యాస్తమయో మోక్షః సా సంసార ఉదాహృతః।**(బ్రహ్మసిద్ధిః పృష్ఠము 119)

అజ్ఞానము వలన గలిగిన సంసారము నుండి జ్ఞానము చేతనే విడుదలను పొందుచున్నాడు.అవిద్యయే సంసారము,తన్నాశనమే మోక్షము.

**"తమేవ విదిత్వాతి మృత్యుమేతి నాన్యః పన్థావిద్యతేఽయనాయ"।**(శ్వే. 3-8)

అయనాయ=పరమపదప్రాప్తయే=పరమపదము(మోక్షము)నొందుటకు వేరు మార్గము లేదు.శేషం స్పష్టమ్.170.

ఎవరు,బ్రహ్మమే నిత్యమనియు తద్వ్యతిరిక్తమనిత్యమనియు నిత్యానిత్య వస్తు స్వభావమును చక్కగానెఱింగెనో,మరియు సాంసారిక విషయోపభోగము లపట్ల తీవ్రవైరాగ్యమునొందెనో,అట్లే బ్రహ్మభావమును పొందవలెనను ఉత్కట జిజ్ఞాస గల్గియున్నాడో,అట్టి పురుషుడు అనిత్యములు,దుఃఖహేతువులునగు స్త్రీమున్నగు ఐహిక భోగములందుగాని, స్వర్గాది పరలోక భోగములందుగాని మరియు తత్సాధనములగు కర్మలందుగాని యెట్లు ప్రవృత్తుడగును? కాజా

లడని భావము.171.

వేదములలో"**నిత్యకర్మలు,నైమిత్తికకర్మలు,కామ్యకర్మలు**"అనునవి అనిత్య ములగు స్వర్గాది పుణ్యలోక ప్రాప్తికొఱకు సాధనములుగా విధింపబడినవి.కావుననవి నిత్యమగు మోక్షమునకు సాధనములుగానేరవు.అందుచే ముక్తిని గోరువారు సర్వకర్మ పరిత్యాగము విధిపూర్వకముగా జేయవలెను.172.

"**విధినా సర్వకర్మణాం పరిత్యాగః ఉపరతిః**"అను ఉపరతియొక్క లక్షణము విశదీకరింపబడుచున్నదను విషయమును ముముక్షువులు జ్ఞప్తియందుంచుకోవాలి.ఇంకా అదే విషయాన్ని శంకా-సమాధానరూపంలో శ్రీశంకరులవారు కొనసాగిస్తున్నారు.ఇంతకు పూర్వము జ్ఞానముచేతనే మోక్షము గలుగునుగాన ముముక్షుజనులు విధిపూర్వకముగా సర్వకర్మలను పరిత్యజించవలయునని చెప్పబడినది. దానిపై కొందరిట్లు శంకించుచున్నారు.

శంక:—పురుషుడు రెండు చేతులతో తన కార్యమును సాధించునటుల, పక్షి రెండు పక్షము(రెక్క)లతో ఆకాశమున యెగురగలుగునటుల ముముక్షువులుగూడ నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానము మరియు వేదాన్తవాక్యముల శ్రవణము—అను కర్మజ్ఞానములు రెంటితో ముక్తిని సాధించుననుట యుక్తియుక్తము.మరియు లోకంలో వత్తిని బాగుజేయుటచే దీపము మిక్కిలి ప్రకాశించునటుల నిత్యకర్మానుష్ఠానముచే పురుషుని జ్ఞానము బాగుగా వృద్ధినొందును.గావున కర్మసహకృతమగు జ్ఞానముగాని,కర్మజ్ఞాన (సముచ్చయము)రెండునుగాని మోక్ష సాధనమనుట సమంజసము.ఇట్టియెడ ముముక్షువు సర్వవిహితకర్మ పరిత్యాగము జేయవలయుననుట యెట్లు పొసగును? 173 నుండి 176.

సమాధానము:—శ్రేష్ఠులగు పండితజనులు యిట్లు మూర్ఖపురుషులవలె శంకించుట యుక్తియుక్తముగాదు.ఏలయన,అగ్నిహోత్రాది శాస్త్రవిహిత కర్మలకు అనిత్యమగు స్వర్గాది ఫలములు కాగా,శ్రవణాదులచే కలుగు జ్ఞానమునకు ఫలము నిత్యమగు మోక్షము.ఇట్లు భిన్నఫలములున్నందున కర్మ జ్ఞాన సముచ్చయమెన్నటికిని గలుగనేరదు.177.

ఫలభేదమే కాకుండా అధికారిభేదము మరియు సాధన(సామాగ్రి)భేద మున్నందువలనగూడ కర్మ జ్ఞాన సముచ్చయము కుదరదు.ఎట్లన,విషయ సుఖములనుగోరు కామిపురుషుడు కర్మలయందధికారియగును.విషయవాం ఛలులేని విరక్తపురుషుడు(శ్రవణాదులందు)జ్ఞానమునందధికారియగును.ధన సంపన్నుడు,శరీరదార్ఢ్యముగలవాడు,మధ్యవయస్కుడును(సుమారు ముప్పది సంవత్సరములు),విద్యావంతుడును,పుత్రవంతుడునగు పురుషుడు కర్మలను జేయనర్హుడగును.“**జాతపుత్రః కృష్ణకేశోఽగ్నీనాదధీత**”పుత్రవంతుడు,నల్లని వెం ట్రుకలుగలవాడు అనగా మధ్యవయస్సుగలవాడు అగ్న్యాదానము జేయవలె ను. మరియు,

**“పరీక్ష్యలోకాన్కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన”** (ముం.1-2-12)సాధ్యసాధనరూప ఈసంపూర్ణ సంసారమునుండి విరక్తుడైన పురు షునికే బ్రహ్మవిద్యయందధికారము గలదని శ్రుతిమాత నుడువుచున్నది.అవి- ద్య, కామ, కర్మరూప దోషయుక్త పురుషునిచే అనుష్ఠేయములుగా శాస్త్రమున విధానము జేయబడిన కర్మలకు ఫలస్వరూపముగా దక్షిణోత్తర మార్గముల ద్వారా స్వర్గాదిలోకములు ప్రాప్తించును.అట్లే,విహిత కర్మలను చేయకపోవుట వలన నిషిద్ధ కర్మలనాచరించుటవలన పురుషునికి నరక తిర్యక్ ప్రేతాది యోనులు(జన్మలు)ప్రాప్తించును.వీటినన్నింటిని పరీక్షించి అనగా,ప్రత్యక్ష,అను-

మాన,ఉపమాన మరియు ఆగమ ప్రమాణములచే చక్కగా విచారించి,బ్రాహ్మ ణుడు=బ్రహ్మజిజ్ఞాసువు,విరక్తినొందవలెను.ఎందుకనగా,అవ్యక్తము మొదలుకొ ని స్థావరపర్యన్తము వ్యాకృత అవ్యాకృతములగు గత్యాత్మక యేయే లోకము లుగలవో,అవియన్నియును ఒకదానికొకటి పరస్పరము బీజాంకురములవలె ఉత్పత్తికి కారణములున్నవి.జన్మ,జరా,వ్యాధ్యాద్యనేక అనర్ధములచే వ్యాప్తము లై,అరటి స్తంభములవలె నిస్సారములై యున్నవి.గారడి వానిచే సృష్టింపబడు ఐంద్రజాలిక పదార్థములవలె,ఎండమావులవలె,గంధర్వనగరమువలె,జలబు ద్బుదముల(నీటిబుడగల)వలె,స్వాప్నికపదార్థములవలె ప్రతిక్షణము దృష్టనష్ట స్వభావము గలవైయున్నవి.అవిద్య, కామ, కర్మరూప దోషములచే ప్రయుక్తమై చేయబడు కర్మలచే ప్రాప్తములగు(లోకములు)పుణ్యపాపములచే నిష్పాదిత ములై యున్నవి.ఈప్రకారముగా,బ్రహ్మజిజ్ఞాసువు,కర్మసాధ్యములగు సర్వలోక ముల యధార్థ స్వరూపమును బాగుగా విచారించి,నిశ్చయముగా వాటన్నిటి నుండి వెనుదిరిగి(అనాదరించి),విరక్తుడై,ఈషణత్రయమును పరిత్యజించి,నిత్య సత్యమగు తత్త్వాన్వేషణలో వెళ్లిపోవలెను.ఇట్లు,కర్మసాధ్యములగు లోకపరలోక ములన్నియును అనిత్యములని విచారించి,విరక్తుడై యథాశాస్త్రముగ గురుశు శ్రూషజేయువాడు శ్రవణాదులద్వారా మోక్షమునకర్హుడగుచున్నాడు.పైముండక శ్రుతిలోని“**బ్రాహ్మణ**”శబ్దమునకు ఆచార్య శంకరుల విచారానుసారము జాతి బ్రాహ్మణుడని,శ్రీసురేశ్వరాచార్యుల విచారానుసారము ద్విజాతులకు జెందిన బ్రహ్మజిజ్ఞాసువని శ్రీకైలాసాశ్రమము-హృషీకేశమువారు(పై ముండక శ్రుతికి టిప్పణములో)చెప్పియున్నారు. కావున,

**శ్లో॥మోక్షాధికీరీ సంన్యాసీ గృహస్థః కిల కర్మణి।**

**కర్మణః సాధనం భార్యాస్రుక్స్రువాదిపరిగ్రహః॥**180.

**శ్లో॥నైవాన్యసాధనాపేక్షా శుశ్రూషేస్తు గురుం వినా।**

**ఉపర్యుపర్యహంకారో వర్ధతే కర్మణా భృశమ్॥**181.

సంన్యాసియగువాడు మోక్షమునకు అధికారి,గృహస్థుడు కర్మానుష్ఠానము నకు అధికారియగును.మరియు,కర్మసాధనములు—భార్య,స్రుక్కు,స్రువము మున్నగునవి గలవు.జ్ఞానమునకేమో—గురువునకు శరణువెళ్ళి,శుశ్రూషలొ నరించుచు వేదాన్తవాక్యములను శ్రవణము చేయుట తప్ప మరొక సాధనము లేదు.కర్మలనాచరించుట వలన అభిమానము వృద్ధి నొందును.

*అభిమానం సురాపానం గౌరవం రౌరవం సమమ్।*

*ప్రతిష్ఠా సూకరీవిష్ఠా త్రయం త్యక్త్వా సుఖీ భవేత్॥(అర్థము స్పష్టము)*

జ్ఞానాభ్యాసమువలన అభిమానము నశించును.కర్మశాస్త్రము కర్మలయం దు ప్రవర్తింపజేయును.వేదాన్త శాస్త్రము కర్మలనుండి నివర్తింపజేయును.ఇవ్వి ధమున కర్మానుష్ఠానమునకును మరియు శ్రవణాదులకు(జ్ఞానమునకు) అత్యన్త భేదముగలదు.

అందువలన,జ్ఞాన కర్మములకు,వాని సాధనములకు,వాని యధికారులకు పరస్పరాపేక్ష యెంతమాత్రము సంభవించదు.జ్ఞానమువలన నిత్యానన్దరూప మగు మోక్షము గలుగును.కర్మలవలన సంతతదుఃఖాస్పదమగు సంసారము ప్రాప్తించును.కావున,వహ్ని తృణములకును, తేజస్తిమిరములకునువలె జ్ఞాన కర్మములకు పరస్పర సాధ్యసాధన భావముగాని,సముచ్చయముగాని గలుగ నేరదు.177 నుండి 185 వరకు.

లోకమున సర్వక్రియలును“**నేనుకర్తను,దీని ఫలమును నేననుభవింతును.**”

అను అభిమానముగల పురుషునకు సంబన్ధించియున్నవి.జ్ఞానముగల్గిన వెంటనే కర్తృత్వాద్యభిమానమంతయు నశించుచున్నది.కనుక,కర్మములు జ్ఞానమునకుపకరించుననుట సమంజసముగానేరదు.186.

అగ్నిహోత్రము ఎన్ని కట్టెలగుట్టలచే ప్రజ్వలింపజేయబడినను సూర్యప్రకాశమున కించుకేనియు నుపకరింపబడకుండటయేగాక సూర్యకాంతి యెదుట తానే తిరోహితమగుచున్నది.అట్లే,శ్రౌతస్మార్తాది కర్మజాలమంతయు నాత్మజ్ఞానమునకెంత మాత్రమును సహాయము కాజాలదు.ఇంతేగాక జ్ఞానోదయమగుటతోడనే కర్మసమూహమంతయు స్వయముగా విలయము నొందుచన్నది(కాలిపోవుచున్నది).187.

పురుషునకు రెండుచేతులు గలసి కార్యసాధకములగునట్లుగా ముముక్షువునకు జ్ఞాన కర్మములు రెండునుచేరి మోక్షమును సాధింపగలవని పూర్వము చెప్పబడిన దృష్టాన్తము ఎంతమాత్రము కుదనేరదు.ఎట్లన,రెండు చేతులును ఒకేకర్తకు సంబన్ధించినవగుటచేతను,రెండును కర్మలజేయ సమర్థములగుటచేతను వానికి సహయోగము సంభవించుచున్నది.జ్ఞాన కర్మలకు మాత్రము—కర్త,కర్మ(విషయము),ఫలము,సాధనము మున్నగునవన్నియు నత్యన్తభిన్నములగుటచే కలయిక కుదరనేరదు.187,188.

**శ్లో॥కర్తా కర్తు మకర్తుం వాఽప్యన్యథా కర్మ శక్యతే।**

**న తథా వస్తునో జ్ఞానం కర్తృ తన్త్రం కదాచన॥**189.

**శ్లో॥యథా వస్తు తథా జ్ఞానం ప్రమాణేన హి జాయతే।**

**నాఽపేక్షతే చ యత్కించిత్ కర్మ వా యుక్తి కౌశలమ్॥**190.

కర్మయనునది కర్తయగు పురుషునకధీనమై యున్నది.అందుచే నది కర్తచే చేయుటకుగాని,చేయకుండుటకుగాని,లేదా మరొకవిధంగామార్చిచేయు టకుగాని వీలగుచున్నది.జ్ఞానము మాత్రము వస్తువునకు సంబన్ధించినదగుట చే కర్త ఆధీనములో నుండదు.189.

“**అన్తఃకరణవృత్తౌ జ్ఞానత్వోపచారాత్**”(వివరణములో)అంతఃకరణవృత్తికి ఉపచార ముగా జ్ఞానము—అని పేరు.ఇట్టి జ్ఞానము దోషరహిత ప్రత్యక్షాది ప్రమాణముల చే ఘటాది విషయములెట్లున్నవో,అట్లే కలుగును.అందుచే, జ్ఞానములన్నియు వస్తువులకధీనమై యున్నవి.కర్త అధీనములుగావు. కనుకనే యే విధమైన కర్మలుగాని,పురుషుని తెలివితేటలుగాని యపేక్షింపవు.190.

భాద్రపద శుద్ధ చవితినాటి చంద్రుణ్ణి చూడగూడదను శాస్త్రము గలదు.పురు షునికిగూడ చూడగూడదను ఇచ్ఛయును గలదు.కాని,అప్రయత్నముగా అక స్మాత్తుగా నేత్రవృత్తి చంద్రునిపై పడినది.వెంటనే చంద్రుని జ్ఞానము గలిగినది. కావున, జ్ఞానము ప్రమాణ ప్రమేయ ఆధీనమైయున్నది.కర్మ ఆధీనముగాదు.

శంక:—పూర్వ శ్లోకమున చెప్పబడిన రీతిగా జ్ఞానము వస్తువునకధీనమై యుండునేని, త్రాడు మొదలగు పదార్థములందు “**ఇది త్రాడా ? లేక పామా?**” అను సంశయముగాని,“**ఇది పామే**”యను విపరీత జ్ఞానముగాని కలుగుటకు వీలులేదు.అందుచే జ్ఞానము వస్తుతన్త్రము(వస్తువునకు అధీనము)అనుట యుక్తముగానేరదు—అని యిట్లు పండితులు శంకింపదగదు. ఏలయన? 191.

సంశయజ్ఞానముగాని, విపరీతజ్ఞానముగాని చక్షురాది ప్రమాణములందు గల తిమిరాది దోషములచే గలుగుచున్నవిగాన వస్తు అధీనములుగావు మరేమనగా దోషఅధీనములు.ఇక ప్రకృతమున వస్తువనగా బ్రహ్మము.ప్రత్య

క్షాది ప్రమాణములకగోచరమైనది.ఇది నిత్యము,సత్యము,నిర్వికారము,సర్వ వ్యాపకమునైయున్నది. ఇట్టి బ్రహ్మము యొక్క జ్ఞానము కర్మలనపేక్షింపనిదై గురూపదిష్ట తత్త్వమస్యాది మహావాక్యాల శ్రవణాదులవల్ల గలుగుచున్నది. దోషరహిత చక్షురాధి ప్రమాణములచే ఘటాదులయొక్క రూపాదిజ్ఞానము గల్గునట్లు,బ్రహ్మజ్ఞానముగూడ అసంభావనాది దోషరహిత అంతఃకరణమునందు శ్రుతి శిరస్సులగు ఉపనిషద్రూప వేదప్రమాణములచే (వృత్తివ్యాప్తిచే)గల్గుచున్న ది. దానిచే నజ్ఞాన నాశముద్వారా మోక్షము సిద్ధించును.192నుండి194.

రూపజ్ఞానమునకు చక్షువు యే విధమైన కర్మలనపేక్షింపనటుల శ్రవణ మనన నిదిధ్యాసనమువలన గలుగు బ్రహ్మజ్ఞానము కర్మాపేక్షలేకయే బ్రహ్మమును ప్రకాశింపజేయుచున్నది.అనగా,నిర్దుష్ట నేత్రముచే రూపముయొక్క యథార్థ జ్ఞానమెట్లు గల్గునో,అట్లే వేదరూప స్వతఃసిద్ధ నిర్దోషప్రమాణముచే బ్రహ్మము యొక్కయథార్థజ్ఞానముగల్గును.కర్మ(క్రియ)కర్తృతన్త్రము(కర్తఅధీనమై)యుండు ను.శుభాశుభఫలములు కర్మాధీనములు.ఆత్మతత్త్వజ్ఞానము ప్రమాణాధీనము. ఈ పరిదృశ్యమాన జగత్తు,పరమేశ్వరునియొక్క అనిర్వచనీయ మాయాశక్తి పరతన్త్రమై యున్నది.195,196.

**మన్త్రము:—విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ!**

**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృతమశ్నుతే॥**(ఈశా. 11)

ఎవరైతే విద్య(దేవతోపాసన)మరియు అవిద్య(శాస్త్రవిహితకర్మ)యీ రెండును ఒకే సమయములో ఒకే పురుషునిచే ననుష్ఠేయమలుగా తెలుసుకొని,అదే విధముగా అనుష్టించినచో కర్మరూపఅవిద్యచే స్వాభావిక ప్రవృత్తిరూప మృత్యు వును దాటి,దేవతోపాసనరూప విద్యచే దేవాత్మభావరూప సాపేక్షిక అమృతత్వ

మును పొందుతాడు.

పైశ్రుతి విషయంలో కొందరు—విద్యయనగా జ్ఞానమనియు, అవిద్యయనగా కర్మమనియు స్వీకరించి,జ్ఞానకర్మసముచ్చయము శ్రుతియందు చెప్పబడిన దని పొరబడుచున్నారు.కాని,జ్ఞానకర్మలకు రెంటికి పలువిధములైన విరోధము గలదని పూర్వము నిరూపింపబడుటచే నట్లు భావింపదగదు.పండితులు మాత్ర ము ఈశ్రుతియందుగల విద్యాశబ్దము ఉపాసనను బోధించునదని,అవిద్యా శబ్ద ము కర్మను బోధించునదని గ్రహించి,కర్మోపాసనా సముచ్చయమే శ్రుతి విహిత మని గ్రహింపనగును.ఎందుకనగా,ఆత్మతత్త్వజ్ఞానము మరియు విహితకర్మ లకు సముచ్చయమును శ్రుతిలో యెక్కడ గూడ చెప్పబడలేదు.

ఇక్కడ కొంచెము విచారించెదము. సముచ్చయమనగా సహానుష్ఠానము. ఈ సముచ్చయము రెండు విధములు.1.క్రమసముచ్చయము.2.సహసము-చ్చయము. వీటిని మళ్లీ (ఒక్కొక్కదానిని) రెండు విధములుగా చెప్పవచ్చును. క్రమసముచ్చయములో—1.జీవితంలో కొంతకాలం అగ్నిహోత్రాది కర్మానుష్ఠాన ము గావించి,తదనంతరము దేవతోపాసనయందుగాని జ్ఞానానుష్ఠానమునందు గాని సంలగ్నుడైనచో,దీనికి క్రమసముచ్చయము అని చెప్పవచ్చును. 2.లేక, ప్రతిదినమున కొంతసమయమువరకు అగ్నిహోత్రాదికర్మలు గావించి,కొంతసే పు దైవోపాసన గావించి,ఆపైన జ్ఞానప్రాప్తి సాధనములుగు వేదాన్త శ్రవణాదులలో ప్రవృత్తుడైనాగూడా—దీనికి క్రమసముచ్చయమని చెప్పవచ్చును.ఇక సహ (సమ)సముచ్చయములో—1.ఒకే పురుషుడు ఒకే సమయంలో అగ్నిహోత్రాది కర్మలు,దేవతోపాసన లేక బ్రహ్మజ్ఞానానుష్ఠానమును నిర్వర్తించినచో,దీనికి సహ సముచ్చయము అంటారు.లేక 2.ఒకే సమయంలో భిన్నభిన్న పురుషులచే కర్మ, ఉపాసన మరియు జ్ఞానానుష్ఠానము గావింపబడినచో గూడ—కథంచిత్

(ఎట్లో ఒకట్లు)సహసముచ్చయము చెప్పవచ్చును.ఈప్రకారముగా క్రమసము చ్చయము మరియు సమసముచ్చయము రెండు రెండు భేదములచే ఉండును.

వీటిలో,భిన్న భిన్న పురుషులచే ఏక కాలమునందు కర్మాద్యనుష్ఠానరూప సహసముచ్చయములో ఏమి విరోధము లేదు.అనగా,ఒక పురుషుడు అగ్ని హోత్రాదికర్మానుష్ఠానమునందు సంలగ్నుడైతే,మరొకడు దైవోపాసనలో,మూడవ వాడు జ్ఞానసాధనములలో ప్రవృత్తుడైనాడు.ఈ విధమగు సముచ్చయములో యెవరికి యే విధమగు విరోధముండదు.కాని"**విద్యాంచా విద్యాంచ**"అను శ్రుతికి ఏకకాలంలో భిన్నభిన్న పురుషులచేచేయబడు సహసముచ్చయము అభిమ తముగా లేదు.ఎందుకనగా,శ్రుతిలో"**తీర్త్వా**"అను పదములో"క్త్వా"ప్రత్యయము ప్రయోగించబడినది.ఒకేకర్త విషయంలో పూర్వకాలిక క్రియావాచక ధాతువున కు"క్త్వా"ప్రత్యయము తగులును. ఈ విషయము "**సమాన కర్తృకయోః పూర్వకా లే**"(అష్టాధ్యాయి 3-4-21) అను పాణినీయ సూత్రములో చెప్పబడినది.

"**అవిద్యయా మృత్యం తీర్త్వా విద్యయామృతమశ్నుతే**"(ఈశా. 11) అవిద్యారూప కర్మానుష్ఠానముచే స్వాభావిక ప్రవృత్తిరూప మృత్యువును దాటి, దేవతోపాసనా రూప విద్యచే అపేక్షిక దేవాత్మభావరూప అమృతత్వమును పొందుచున్నాడు. ఈరీతిగా మృత్యుసంతరణముజేయువాడు(దాటువాడు)మరియు అమృతత్వ మును పొందువాడు ఒకే వ్యక్తియని శ్రుతిచే చెప్పబడినది.ఒకడే విద్యను మరియు అవిద్యను రెంటిని అనుష్టించినాడు.కావున,విద్యను మరియు అవిద్యనుఅనుష్ఠించిన కర్తలు భిన్నభిన్నవ్యక్తులు—అని చెప్పుట శ్రుతిమాతకు ఇష్టము లేదు. మరేమనగా, ఒకే వ్యక్తియని చెప్పుటయే ఇష్టమై యన్నది.

క్రమసముచ్చయములో చెప్పబడిన మొదటి పక్షములో యెవరికి యే విధ మగు విరోధము లేదు.కాని,"**యస్తద్వేదోభయం సహ**"విద్య మరియు అవిద్య

రెండును ఒకే పురుషునిచే ఒకే కాలములోనే యనుష్ఠేయములని తెలిసికొని, అట్లే సముచ్చయముగా యెవరు ఆచరించెదరో—అను యీ శ్రుతి వాక్యముచే క్రమసముచ్చయమును ప్రతిపాదించుట శ్రుతిమాతకు ఇష్టములేదని తెలియుచున్నది.అట్లు కానిచో,"**ఉభయం సహ**" అని చెప్పే ఆవశ్యకతయే లేకుండెను. ఇక,

క్రమసముచ్చయములో రెండవ పక్షము యేదైతే చెప్పబడినదో, అనగా ప్రతి దినమున కొంతసమయమువరకు అగ్నిహోత్రాదికర్మానుష్ఠానము,తరువాత కొంతసేపు దైవోపాసన,ఆపైన జ్ఞానసాధనములగు వేదాన్త శ్రవణాద్యనుష్ఠానము చేయవలెను.కాని,కొంచెము విచారించినచో ఈపక్షముగూడ అసంగతమేయగును.ఎందుకనగా,సర్వాత్మభావనారూప చింతనలో సంలగ్నుడైన వ్యక్తిచే క్రియా కారక ఫలభేదములుగల కర్మానుష్ఠానమెట్లు సంభవించును.వేదాన్త విచారణ యందు తత్పరుడైన వానికి క్షణకాలముగూడ అనాత్మ చింతనజేయుట నిషేధింపబడినది.

**శ్లో॥అనాత్మ చిన్తనం త్యక్త్వా కశ్మలం దుఃఖకారణమ్।**

**చిన్తయాత్మానమానన్దరూపం యన్ముక్తి కారణమ్॥**(వి.చూ.380)

కశ్మలం=అపవిత్ర విషయాలకు సంబంధించిన దగుటచే నపవిత్రమైనదియు, సర్వదుఃఖములకు కారణమైన అనాత్మలనుగూర్చిన చింతనమునువదలి, యేది ముక్తికి కారణమైనదో, అట్టి ఆనందరూపమైన ఆత్మనుగూర్చి నిరన్తరము చింతించుము(ధ్యానించుము,అనుసంధానము చేయుము).

**శ్లో॥ఆసుప్తేరామృతే కాలం నయేద్వేదాన్తచిన్తయా।**

**దద్యాన్నావసరం కిఞ్చిత్కామాదీనాం మనాగపి॥**(వి.చూ.17 శ్లోకభాష్యే)

నిద్రలేచినది మొదలు నిద్రించువరకును,సద్గురువు సచ్ఛాస్త్రము ప్రాప్తించినది మొదలు మరణించువరకుగూడ వేదాన్తచిన్తనతో కాలమును గడుపుతూ, కామాదులకు ఏమాత్రముగూడ అవకాశమీయరాదు—అని ఆత్మతత్త్వజిజ్ఞాసువునకు తైలధారవత్ అవిచ్ఛిన్న బ్రహ్మాత్మైకత్వ విచారముయొక్క అవశ్యకర్తవ్యమును శాస్త్రము ఆదేశించుచున్నది.

ఇట్లుండగా,దీనికి విపరీతముగా క్రియా కారక ఫలభేదముగల కర్మలయందు తత్పరుడైన వ్యక్తి,అద్వైతాత్మచింతన యెలా చేయగలడు?అందువలన,క్రమసముచ్ఛయములోని ద్వితీయపక్షము శ్రుతి,యుక్తి,అనుభవములకు విరోధమున్నందున అగ్రాహ్యమున్నది.పరిశేషముగా,ఏకకాలావచ్ఛేదముచే ఒకేవ్యక్తి విద్యఅనగా దేవతోపాసనను మరియు అవిద్యయనగా కర్మానుష్ఠానమును సహానుష్ఠానరూప సమసముచ్ఛయముగా ఆచరించవలెనని చెప్పుటయే శ్రుతికి ఇష్టమైయున్నది.కాని,ఆత్మతత్త్వజ్ఞానము మరియు కర్మలకు సముచ్ఛయము శ్రుతిలో యెక్కడగూడ చెప్పబడలేదు.అస్తు, ప్రకృతమునననుసరించెదము.

నిత్యానిత్య వస్తువివేకము లేనివాడును,ఇహపరలోక సంబన్ధమగు స్రక్చన్దన వనితాది భోగములందు ఆసక్తిగల వాడును,యెవని హృదయమున ఇంకను వైరాగ్యముదయించలేదో—అటువంటి అజ్ఞాని పురుషుని కొఱకు శ్రుతిచే కర్మలు విధింపబడినవి.కాని,నశ్వరములగు సర్వలోక సుఖములందు విరక్తినొంది బ్రహ్మానన్దకాముడై,ముక్తి నభిలషించు మనుజునకు మాత్రము కర్మలు విధింపబడుటలేదు.198.

ఏవేదముచే కర్మకాండయందు భోగకాములగు మానవులకు కర్మలు విధింపబడినవో,ఆవేదముచేతనే జ్ఞానకాండయందు మోక్షకాములగు వారలకు—

**బ్రహ్మచర్యం పరిసమాప్య గృహీ భవేత్,గృహీ భూత్వా వనీ భవేత్,వనీ భూత్వా ప్రవ్రజేత్।యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్,గృహాద్వా,వనాద్వా।అథవా యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్॥**(జాబాలోపనిషత్.4; నారద పరివ్రాజకోప.3-77)

మొదట బ్రహ్మచర్య వ్రతమును పాలించాలి. దానిని పరిసమాప్తము గావించి, గృహస్థాశ్రమమును స్వీకరించాలి.తరువాత వానప్రస్థమును గ్రహించాలి.వానప్ర స్థమునుండి సంన్యసించాలి.ఒకవేళ విషయాలయందు విరక్తిగల్గినచో బ్రహ్మచ ర్యమునుండిగాని,గృహస్థమునుండిగాని లేక వానప్రస్థాశ్రమమునుండిగాని సం న్యసించవచ్చును.లేదా యేనిమిషమున సకలవైషయికసుఖములందు విరక్తి గల్గునో,ఆనిమిషముననే యేయవస్థలోనున్నను సర్వకర్మపరిత్యాగము జేయవ లెను.అనగా సంన్యసింపవలెను—అని శాస్త్రముచే విధింపబడినది.కావున,కర్మ సంన్యాసమనునది శ్రుతిప్రసిద్ధముగాన నీ విషయంలో పండితులెంత మాత్ర ము సంశయింపదగదు.199.

శ్రీమద్భగవద్గీతయందు శ్రీకృష్ణభగవానుడు అర్జుననకు తన విశ్వరూపము ను జూపిన పిమ్మట—

**శ్లో॥నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।**(గీత. 11-53)

**శ్లో॥న వేదయజ్ఞాధ్యయనైర్న దానైర్నచ క్రియాభిర్న తపోభిరుగ్రైః॥**(గీత.11-48)

ఓ అర్జునా! ఋగాది చతుర్వేదములను అధ్యయనము చేయుటవలనగాని, కృచ్ఛ్రచాంద్రాయణాది తపములుజేయుటవలనగాని,తులాపురుష,కన్య,గోవు, సువర్ణము,అన్నము మొదలగు మహాదానములచేతగాని,అగ్నిహోత్రాది శ్రౌత స్మార్త కర్మలననుష్ఠించుట వలనగాని నేను తెలియబడువాడను కాను.

ఆత్మసాక్షాత్కారమునకు వేదములు మున్నుగునవి సాధనములు గానేరవని నిరూపించియున్నాడు.ఇట్టియెడ వేదోక్తకర్మలు మోక్షమునకు సాక్షాత్సాధనములు గానేరవనుటలో సందియమెంత మాత్రమును లేదు.200.

**శ్లో॥ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ ద్వేఏవ శ్రుతి గోచరే।**

**ప్రవృత్యా బద్ధ్యతే జన్తుః నివృత్యా తు విముచ్యతే॥**201.

వేదములందు కర్మాచరణరూప ప్రవృత్తి మార్గమును,కర్మత్యాగరూప నివృత్తి మార్గమును,రెండు చెప్పబడియున్నవి.ఈరెంటిలో కర్మాచరణముచే జీవునికి సంసారప్రాప్తియు,కర్మత్యాగముచే మోక్షమును గలుగుచున్నవి.201.

**శ్లో ॥ ద్వావిమావథ పన్థానౌ యత్ర వేదాః ప్రతిష్ఠితాః ।**

**ప్రవృత్తి లక్షణో ధర్మో నివృత్తౌ చ సుభాషితః॥**(శాన్తి పర్వము 241-6)

ఏధర్మమునందు వేదములు ప్రతిష్టితములై యున్నవో,ఆ ధర్మమార్గములు రెండువిధములుగా చెప్పబడినవి.ఒకటి ప్రవృత్తిరూపము,రెండవది నివృత్తిరూపము.

**"ద్వివిధో హి వేదోక్తో ధర్మః;ప్రవృత్తి లక్షణో నివృత్తి లక్షణశ్చ".**అని శ్రీ భాష్యకారులుగూడ శ్రీమద్భగవద్గీతా ఉపోద్ఘాతబాష్యంలో చెప్పారు.

**శ్లో॥ప్రవృత్తి లక్షణం కర్మ జ్ఞానం సంన్యాసలక్షణమ్।**

**తస్మాద్ జ్ఞానం పురస్కృత్య సంన్యసేదిహ బుద్ధిమాన్॥**(నా.ప.3-15&16)

కర్మ ప్రవృత్తిరూపమైతే,జ్ఞానము సంన్యాసముయొక్క ముఖ్యలక్షణమై యున్నది.కావున,బుద్ధిమంతుడగు పురుషుడు జ్ఞానమును లక్ష్యముగా పెట్టుకొని సంన్యాసాశ్రమములో ప్రవేశింపవలయును.ఎందుకనగా?

**శ్లో॥కర్మణా బధ్యతే జన్తుర్విద్యయా తు ప్రముచ్యతే।**

**తస్మాత్కర్మ న కుర్వన్తి యతయః పారదర్శినః॥**(సంన్యాసోప.98 & శాం.ప.241-7)

సకామకర్మచే మనుష్యుడు సంసారరూప బంధమును బడయును.జ్ఞానముచే బంధవిముక్తుడగును.కావున,దూరదర్శులగు యతులు కర్మలయందు ప్రవృత్తులు కారు.

లోకంలో యెంతమూఢుడైనను తాను బన్ధింపబడుట కిష్టపడడుగదా!స్వేచ్ఛాసంచారమునే కోరుకుంటాడు.కావున,ముక్తిని గోరువారు సాంసారికబంధహే-తువులగు కర్మలను తప్పక పరిత్యజించి సంన్యసించవలెను.202.

జ్ఞాన కర్మలకు సముచ్చయము సంభవింపదని పూర్వము విపులముగా వివరింపబడినది.అందుచే,ముముక్షువులు సర్వకర్మపరిత్యాగము శ్రుతిసిద్ధమున్నందున నిస్సంశయముగా సర్వకర్మలను పరిత్యజింపదగి యున్నది. 203.

ఒకానొక వస్తువును తన కిష్టసాధనమని తలంచి స్వీకరించిన కొంతకాలమునకు దానివలన ప్రయోజనము లేదని తెలిసిన పిమ్మట వదిలివేయును గాని యెవ్వరును గ్రహింపరు గదా!అట్లే,సుఖబుద్ధితో పూర్వము కర్మలనాచరించి నప్పటికిని,వానివలన శాశ్వతసుఖము లేదని నిశ్చయము గల్గిన మీదట కర్మలను పరిత్యజించుటయే యుక్తమని భావము.204.

శంక:—"**యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి**"జీవించియున్నంత కాలము అగ్నిహోత్రముచేయవలెను."**యావజ్జీవం దర్శపూర్ణమాసాభ్యాం యజేత**"జీవించియున్నంతవరకు దర్శపూర్ణమాస యాగములు చేయవలెను."**అహరహః సంధ్యాముపాసీత**"ప్రతిదినము సంధ్యోపాసనచేయాలి."**కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛ**

**తగమ్ సమాః**"(ఈశా.2)కర్మలు చేయుచునే నూరుసంవత్సరములపాటు జీవనము గడుపుటకై అభిలషించవలెను—ఇత్యాది శ్రుతులు జీవించియున్నంత కాలము కర్మలు చేయుచునే యండవలెనని బోధించుచున్నవి గదా?సర్వకర్మ సంన్యాసము చేసినచో శ్రుతిని ఉల్లంఘించిన వారగుదురు గదా?

సమాధానము:—అట్లుకాదు.ఎందుకనగా,ఆశ్రుతులన్నియు చిత్తశుద్ధిలేని వారినుద్దేశించి చెప్పినవి.అందుచేతనే"**ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే**"(ఈశా.2)నరే=నరమాత్రాభిమానముగల;త్వయి=నీ యందు;ఇతః=కర్మాచరణముకంటె;అన్యథా=వేరే మార్గం—దేనివలన కర్మలోపముచేగల్గు పాపముండదో(ప్రత్యవాయదోషముండదో)అట్టి మార్గము;నాస్తి=లేదు—అని చెప్పబడినది. అనగా"**నేను మనుష్యుడను**"అను అభిమానమున్నంతవరకును కర్మ చేయుచునే యండవలెను—అని భావము."**నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః**"(కై.1-3)కర్మచేతగాని,సంతానముచేతగాని,ధనము చేతగాని మోక్షము లభించదు.ఆ అమృతత్వమును(ముక్తిని కొందరు కర్మ త్యాగముచేతనే పొందిరి."**సంన్యాస యోగాద్యతయ శుద్ధ సత్త్వాః**"(ముం.3-2-6) యతులు సర్వ కర్మ సంన్యాస యోగముచే అత్యన్త నిర్మలాన్తఃకరణము గలవారై అమరణధర్మరూప బ్రహ్మభావమును పొందుచున్నారు."**ఏతచ్ఛ్రేయో యేఽభినన్దన్తి మూఢాః జరామృత్యుం తే పునరేవాపియన్తి**"(ముం.1-2-7)ఏ మూఢాత్ములు ఈకర్మనే శ్రేయస్సుగా అభినందింతురో వారు మరలమరల జరామృత్యువుల పాలగుచుందురు."**కిమర్థావయమధ్యేష్యామహే,కిమర్థావయం యక్ష్యామహే**" (బ్ర.సూ.భాష్యమ్3-4-9&ఐతరేయ ఆరణ్యకము 3-2-6)మనము ఎందులకు ఈ అధ్యయనము చేయుట?ఎందులకీ యజ్ఞములాచరించుట?ఇత్యాది శ్రుతులు కర్మసంన్యాసమును విధించి,కర్మను నిందించుచున్నవి."**తమేతం వేదానువచనేన బ్రాహ్మ**

**ణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసానాశకేన**"(బృ.4-4-22)బ్రాహ్మణులు వేదాధ్యయనముచేతను,యజ్ఞముచేతను,దానముచేతను,అనశ్వరమగు తపస్సుచేతను ఈ ఆత్మను తెలిసికొన నిచ్ఛగించుచున్నారు."**యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే**"(గీత.5-11)యోగీశ్వరులు ఫలాభిసన్ధి రహితముగా అంతఃకరణశుద్ధికొఱకై కర్మలను ఆచరించుచుందురు.ఇత్యాది శ్రుతిస్మృతులను పర్యాలోచించగా,ఆకర్మలను నిష్కామముచే నాచరించినచో చిత్తశుద్ధి ద్వారా వివిదషకు(జ్ఞానేచ్ఛకు)సాధనములుగనుండునని మాత్రమే నిర్ణయింపబడుచున్నది.కాని,వీటినెల్లప్పుడు చేయుచునేయుండవలెనని తాత్పర్యంకాదు.అట్లైనచో,"**యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్**"(జాబాలోప.4)ఏరోజున వైరాగ్యము గల్గునో,ఆరోజునే సంన్యాసమును స్వీకరింపవలెను—అను సంన్యాసవిధాయక వాక్యములకు భాధ గలుగును.కర్మనిందగూడ అనుపపన్నమగును.

"**అత ఏవ చాగ్నీన్ధనాద్యనపేక్షా**"(బ్ర.సూ.3-4-25);"**సర్వాపేక్షా చ యజ్ఞాదిశుతేరశ్వవత్**"(బ్ర.సూ.3-4-26)విద్యయే(జ్ఞానమే)పరమపురుషార్థహేతువగుటచే అగ్నీన్ధనాదులు—గృహస్థాద్యాశ్రమకర్మలగు యజ్ఞాదులు మోక్షవిషయమున అపేక్షితములు కావు."**తమేతం వేదానువచనేన**"ఇత్యాది శ్రుతులచే ఆశ్రమకర్మలన్నియు జ్ఞానసాధనములుగా మాత్రము ఉపకరించును.కాని,మోక్షరూప ఫలము నిచ్చునది మాత్రము విద్యయే.అశ్వాదులను బండిలాగుటకు మాత్రమే ఉపయోగింతురు,కాని దుక్కిదున్నుటకు ఉపయోగింపరుగదా!కొన్ని వస్తువులు కొన్నింటిని సాధించుటకు మాత్రమే ఉపయోగపడును.అట్లే,ఈయజ్ఞాది క-ర్మలు ఫలాభిసన్ధిరహితముగా నాచరించినచో,అంతఃకరణము శుద్ధిపడి,జ్ఞానముద్వారా మోక్షమునకుపయోగపడును.అనగా మోక్షమునకు బహిరంగ సాధనములుగా నుపకరించునుగాని,సాక్షాత్సాధనములు గానేరవు.మోక్షమునకు

సాక్షాత్సాధనము విద్యయే(జ్ఞానమే)—అని బ్రహ్మసూత్రములు బోధించుచున్నవి. ఈసమగ్ర విషయమును దృష్టియందిడుకొని శ్రీఆద్యగురు శంకరాచార్యులవారు **"వివేక చూడామణి"** పదినొకండవ శ్లోకము ద్వారా సెలవిచ్చియున్నారు.

**శ్లో॥చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే।**

**వస్తుసిద్ధిర్విచారేణ న కిఞ్చిత్కర్మ కోటిభిః॥**

చిత్తశుద్ధికొఱకే కర్మ ఉపయోగించునుగాని,వస్తు(బ్రహ్మభావరూప మోక్ష) ప్రాప్తికి ఉపయోగించదు.వస్తువుయొక్క జ్ఞానము శ్రవణాది విచారణచేతనే కలుగును.కోటికర్మలు జేసినను ఏమియు ప్రయోజనము లేదు. భ్రాన్తిచే ప్రతీతమైన సర్పము దీపప్రకాశముచే నివృత్తమైనట్లు,భ్రాన్తిచే ప్రతీయమానమగు నీ బన్ధము (సంసారము) జ్ఞానముచేతనే నివర్తించును, గాని కర్మలచే గాదు.

మొదట యే వస్తువులయందు సుఖసాధనత్వబుద్ధిచే వాటిని పొందుటకు పురుషుడు ప్రవృత్తుడయ్యెనో,ఆసకలప్రవృత్తులనుండి నివృత్తమగుటయే"**ఉపరతి**"శబ్దార్థము.అది ముఖ్యమనియు మరియు గౌణమనియు రెండు విధ ములు.205.

**వృత్తేర్దృశ్యపరిత్యాగో ముఖ్యార్థ ఇతి కథ్యతే।**

**గౌణార్థః కర్మసంన్యాసః శ్రుతేరఙ్గతయా మతః॥**

**పుంసః ప్రధానసిద్ధ్యర్థం అఙ్గస్యాశ్రయణం ధృవమ్।**

**కర్తవ్యమఙ్గహీనం చేత్ప్రధానం నైవ సిద్ధ్యతి॥**206;207.

1.మనస్సునందుగల బాహ్యవిషయాకారవృత్తులను విడనాడుటయే"**ఉపరతి=సంన్యాస**"శబ్దమునకు ముఖ్యార్థము.2.దేహము మొదలగు వానియందు

అభిమానముగల్గి కర్మలనాచరించుచుండు మానవునకు బాహ్యవిషయముల ను పరిత్యజించుట అసంభవము.చిత్తము నిరన్తరమాత్మస్వరూపమునే చిన్తిం చుచుండునేని,అప్పుడు బాహ్యవిషయములు స్ఫురింపజాలవు.కావున,నిరన్త రమాత్మ చిన్తనముకొఱకై సర్వకర్మలను విడువవలయును.దీనికే కర్మసంన్యా సమందురు.ఇట్లు"**శాస్త్రవిహిత సర్వకర్మలను విధిపూర్వకముగా పరిత్యజించు ట**"—వైషయిక చిత్తవృత్తియొక్క పరిత్యాగమునకు అంగము(సాధనము)అగు టచే సంన్యాస(ఉపరతి)శబ్దమునకు గౌణార్థమగును.అనగా"**ఉపరతి**"శబ్దముచే 'లక్షణా'యను శబ్దవ్యాపారము వలన చెప్పబడుచున్నది.205, 206.

ప్రధానములగు దర్శపూర్ణమసాది కర్మలు ఫలవంతములు కావలయునని న తదంగములగు ప్రయాజలు,అనుయాజలు మొదలగు కర్మలు తప్పక అను ష్ఠింపవలయును.అట్లే,వేదాన్తశ్రవణము సఫలము గావలయుననిన తదంగమ గు శాస్త్రవిహిత సర్వకర్మసంన్యాసమును తప్పక స్వీకరించవలయును.కావున, ముముక్షుజనులు నశ్వరములగు సర్వలోక విషయసుఖమునందు విరక్తి నొంది సర్వకర్మలను సంన్యసింపవలయును.విరక్తిలేనివారి సంన్యాసము,అధి కారములేనివారు చేసిన యజ్ఞమువలె నిష్ఫలమగును.సంన్యసించిన యతీశ్వ రులు పూర్వాశ్రమములో అనుభవించిన విషయములను మరల స్మరించగూడ దు.ఒకవేళ స్మరించినచో వర్తమాన అవస్థయందు రోత=అరుచి=అసహ్యము పుట్టి,సంన్యాసాశ్రమమునుండి(ఆరూఢ)పతితులగుదురు—అని శాస్త్రము ను- డువుచున్నది.మరియు లోకులుగూడ నిన్దింతురనుట సుప్రసిద్ధము. 207-209.

**శ్లో॥నామగోత్రాదివరణం దేశం కాలం శ్రుతం కులమ్।**

**వయో వృత్తం వ్రతం శీలం ఖ్యాపయేన్నైవ సద్యతిః॥**

**శ్లో॥జాయాభ్రాతృసుతాదీనాం బన్ధూనాం చ శుభాశుభమ్।**

**శ్రుత్వా దృష్ట్వా న కమ్పేత శోకహర్షౌ త్యజేద్యతిః॥**

**శ్లో॥అహఙ్కారో మమత్వం చ చికిత్సా ధర్మసాహసమ్॥**

**ప్రాయశ్చిత్తం ప్రవాసశ్చ మన్త్రౌషధగరాశిషః॥**

**శ్లో॥న సంభాషేత్ స్త్రియం కాఞ్చిత్పూర్వదృష్టాం చ న స్మరేత్।**

**కథాం చ వర్జయేత్తాసాం న పశ్యేల్లిఖితామపి।**

**శ్లో॥ఏతచ్చతుష్టయం మోహాత్ స్త్రీణామాచరతో యతేః।**

**చిత్తం విక్రియతేఽవశ్యం తద్వికారాత్ప్రణశ్యతి॥** (నారదపరి-చతర్థోపదేశము)

సంన్యసించిన యతీశ్వరునికి శాస్త్రముచే యీక్రింది వ్యవహారములు నిషేధింపబడినవి.తనయొక్క పూర్వాశ్రమములోని నామమును,గోత్రమును కులమును,అవస్థను,ప్రదేశము,కాలము,విద్య అర్హతలను ఆచారములను,వ్రతఉపవాసాది నియమములను శీలమును ఎప్పుడుగూడ ప్రకటము చేయరాదు.పూర్వాశ్రమములోని స్త్రీ-పురుష,అన్నలు,తమ్ములు,ఇతరఆత్మీయులగూర్చిచెప్పకోగూడదు.వారియొక్క శుభాశుభ సమాచారమును వినిగాని ప్రత్యక్షముగా చూసిగాని హర్షశోకములను పొంది,తన లక్ష్యమునుండి విచలితము కాగూడదు. అహంకార మమకారములు వదులుకోవాలి.పరగృహనివాసము,ఔషధ వితరణాది చికిత్సావ్యవసాయము చేయరాదు.ధర్మసంబంధమైన సాహసకార్యములు, మంత్ర ప్రయోగము,విషప్రయోగము,ఇతరులకు ఆశీర్వాదమిచ్చుట ఇత్యాది కార్యములు వర్జితములు.ఎట్టి స్త్రీలతో(బాలిక, యువతి, వృద్ధురాలు—ఎవరితో) గూడ వార్తాలాపము చేయగూడదు. పూర్వ పరిచిత స్త్రీలనుగూర్చి మనస్సులో

గూడ స్మరించగూడదు.స్త్రీలతో ఎప్పుడుగూడ చర్చించరాదు.స్త్రీలయొక్క చిత్రపటమునుగూడ చూడరాదు.స్త్రీలతోసంభాషణము,చర్చ,వారి స్మరణము, చిత్రపట దర్శనము-అను నీ నాల్గు విషయములను యే మనుష్యుడు(యతి)మోహవశమున ఆచరించునో, నిశ్చయముగా నతని చిత్తము వికారము నొందును.దానిచే నవశ్యముగా యతిధర్మము నష్టమై,పథభ్రష్టుడగును.లోకనిందకు పాత్రుడగును.

ఇంతదనుక శ్రీఆద్యగురు శంకరాచార్యులవారి ***"సర్వవేదాన్త సిద్ధాన్త సార సంగ్రహము"*** అను గ్రంథమునుండి**"సాధనత్వేన దృష్టానాం"**(151)నుండి**"సంన్యస్యతు యతిః కుర్యాన్న పూర్వవిషయస్మృతిమ్"**(209)శ్లోకపర్యన్తము **"ఉపరతి"** అనగా**"సర్వ విహిత కర్మల సంన్యాసము"**నుగూర్చి ఆచార్యుల అభిప్రాయమును విస్తారంగా తెలుసికుంటూ వచ్చాము. నిష్కర్షయేమనగా,**"సంన్యస్య శ్రవణం కుర్యాత్"**.అను శాస్త్ర నియమానుసారము మరియు **"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః మన్తవ్యః నిదిధ్యాసితవ్యః"**(బృ.2-4-5)అను శ్రుత్యానుసారము విధిపూర్వకముగా శాస్త్రవిహిత సర్వకర్మలనుండి ఉపరతిని పొందిన సంన్యాసికే వేదాన్త శ్రవణము నందధికారము గలదని సూచితమైనది.

శంక:—పైన చెప్పబడిన రీతిగా సర్వవిహిత కర్మలనుండి ఉపరతినొందిన సంన్యాసికే వేదాన్తవిచారమునందు(శ్రవణాదులందు)అధికారముంది.కాని,గృహస్థులకు లేదు.ఎందుకనగా?శాస్త్రమునందు సకలకర్మలు గృహస్థులకే విధానము చేయబడినది.ఐహికపారలౌకిక భోగకామనచే కర్మలయందు బహిర్ముఖప్రవృత్తి గలుగుటచే గృహస్థులకు చిత్తము విక్షేపయుక్తమై యుండును.విషయకామన గలవారికి బ్రహ్మజ్ఞానమునందు(తద్వారా మోక్షమునందు)కామన గల్గుట అసంభవము.పైగా బ్రహ్మజ్ఞానము విషయీ పురుషులకు ఉద్వేగమునకు కారణమగును.

**శ్లో॥అపి వృన్దావనే శూన్యే శృగాలత్వం స ఇచ్ఛతి।**

**నతు నిర్విషయం మోక్షం కదాచిదపి గౌతమ!॥**(రాగిగీతము)

ఓగౌతమ!రాగి(విలాసీ)పురుషుని అభిప్రాయమును వినుము. శూన్యమగు వృందావనములో శృగాలము(నక్క)గా జన్మించి క్షణికమైన విషయ సుఖము నైన ఇచ్ఛగించునుగాని శాశ్వతమగు నిర్విషయక మోక్షసుఖమును మాత్రము ఎప్పుడుగూడ కోరడు.

వివేకాది సాధనచతుష్టయసంపత్తి గల్గిన పురుషునికే బ్రహ్మమును తెలుసి కోవాలను ఇచ్ఛ(బ్రహ్మజిజ్ఞాస)కలుగుతుంది.గృహస్థులకు సాధన చతుష్టయ ము గల్గుట అసంభవముగాన వారికి వేదాన్తశ్రవణాదులందు అధికారములేదు. అందుకని,వారికి మోక్షముయొక్క ఆశ అత్యంత దూరనిరస్తము.

సమాధానము:—నాయనా! నీవన్నట్లు అత్యంత బహిర్ముఖ గృహస్థులకు సాధనచతుష్టయసంపత్తి ప్రాప్తించుట సంభవముగాదు,గాన వారికి బ్రహ్మజిజ్ఞాస గలుగదనుట స్వాభావికము.అయినను,యే భాగ్యశాలిగృహస్థుడు,పరమేశ్వరు నియొక్క అనుగ్రహమునకు పాత్రుడగునో,మరియు ఫలాభిసంధిరహితముగా (నిష్కామముచే)నిత్యనైమిత్తికాదికర్మలు ఈశ్వరార్పణ బుద్ధిచే చేయునో,దానిచే హృదయమందలి కషాయము(రాగద్వేషాదిమాలిన్యము)నివర్తింపబడి(అంతఃక రణము శుద్ధిపడి),శ్రీగురుదేవులయొక్క మరియు భగవంతునియొక్క చరణా రవిందములందు అకుంఠితమగు పరిపూర్ణ శ్రద్ధగల్గి,వారి అనుగ్రహమునకు పా-త్రుడగునో,అటువంటి భాగ్యవంతుడగు గృహస్థుని పవిత్రాంతఃకరణములో వివే కాది సాధనచతుష్టయసంపత్తి గలుగుటచే నతనికి నిశ్చయముగా బ్రహ్మజిజ్ఞాస గలుగుట సంభవిస్తుంది.

**"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి,యజ్ఞేన దానేన తపసాఽ నాశకేన"**(బృ.4-4-22)ఇచ్చట'బ్రాహ్మణ'శబ్దముత్రైవర్ణికులకు ఉపలక్షణము.అనగా బ్రాహ్మణులు,క్షత్రియులు మరియు వైశ్యులు నిత్యస్వాధ్యాయరూపమన్త్ర బ్రాహ్మణముల అధ్యయనముచేత, యజ్ఞముచేతను, దానముచేతను,కృచ్ఛ్రచాంద్రాయణాది కఠోరతపస్సుచేతను ఉపనిషద్వేద్య పురుషుణ్ణి(ఆత్మను)తెలుసికొన దలచుచున్నారు.అనాశక శబ్దము తపస్సునకు విశేషణము.రాగద్వేష రహితముగా ఇంద్రియముల ద్వారా పరమార్థసాధనకుపయుక్తమైన విషయములను సేవించుట అనశనమగును.కాని,భోజన నివృత్తి కాదు. భోజనమును విడిచినచో మనుష్యుడు మరణించును.దానిచే ఆత్మజ్ఞానము కలుగక వంచితుడగును. ఇచ్చట,వేదానువచనము,యజ్ఞము,దానము మరియు తపశ్శబ్దములచే నుపలక్షణముగా సంపూర్ణ కర్మలు గ్రహింపబడుచున్నవి.కామ్యవర్జిత సకలకర్మలు (నిత్య,నైమిత్తిక,ప్రాయశ్చిత్తాదులు)అంతఃకరణమును శుద్ధిపరచి,ఆత్మజ్ఞానోత్పత్తిద్వారా మోక్షమునకు సాధనములగుచున్నవి.**"కర్మణాం విశుద్ధిహేతుత్వాత్"** (భాష్యము).

**"ధర్మేణ పాపమపనుదతి"**(మహానారాయణోపనిషత్-17-6)స్వవర్ణాశ్రమోచిత కర్మాద్యనుష్ఠానరూపధర్మము సమస్తప్రపంచమునకాధారమగుచున్నది.లోకంలో మిక్కిలి ధర్మమునందుండు వానిని ప్రజలు ఆశ్రయించెదరు గదా!ధర్మముచేత పాపమునుపోగొట్టుకొనుచున్నారు.ధర్మమునందు సమస్తము ప్రతిష్ఠింపబడియున్నది.అందువలన ధర్మంశ్రేష్ఠమైన మోక్షసాధనమని చెప్పుచున్నారు.**"తపసా కిల్బిషం హన్తి విద్యయాఽమృతమశ్నుతే"**।(మ.స్మృ. 12-104

తపస్సుచేస్తే పాపాలన్నీ తొలగిపోతాయి.బ్రహ్మజ్ఞానంచే మోక్షం కలుగుతుంది. తపస్సుచే నంతఃకరణములోని రాగద్వేషాది కాలుష్యము(పాపము)నశించి,చి

త్తము శుద్ధిపడును.వివేకాదులు పట్టుబడి వేదాన్తశ్రవణాదులందు ప్రవృత్తి కలుగును.వేదాన్తవిచారముచే జ్ఞానముగల్గి తద్వారా అమృతత్వమును (ముక్తిని) పొందును.

**శ్లో॥కషాయపక్తిః కర్మాణి జ్ఞానం తు పరమాగతిః।**

**కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే॥** (బ్ర .సూ.భాష్యము 3-4-26; శాంతి పర్వము 270-38)

కర్మలు—రాగద్వేషాది పాపమును నివర్తింపచేయును. జ్ఞానము పరమగతి రూప మోక్షమునకు సాధనమగును.కర్మలచే పాపము నశించినపిమ్మట జ్ఞానము ప్రవర్తించును.

**శ్లో॥జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః।**

**యథాఽఽదర్శతల ప్రఖ్యే పశ్యత్యాత్మానమాత్మని॥**(శాం.ప.204-8)

పాపకర్మలు నశించగా మనుష్యుని అంతఃకరణములో జ్ఞానముత్పన్నమగును.ఉదాహరణకు:—స్వచ్ఛమైన దర్పణము (అద్దము)నందు ప్రతిబింబము స్పష్టముగా కనుపించును.అట్లే,శుద్ధాంతఃకరణమున "**అహం బ్రహ్మాస్మి**"యను జ్ఞానముగల్గి స్వస్వరూప సాక్షాత్కారము కలుగును.

**శ్లో॥యుక్తః కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్।**

**అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥** (గీత.5-12)

"కర్మలు ఈశ్వరునికొఱకేగాని నా ఫలం కొఱకు కాదు" అని యుక్తుడై, అనగా సమాహిత చిత్తంగలవాడై,కర్మఫలాన్ని పరిత్యజించి మోక్షమనే శాన్తిని పొందుతాడు.అనగా,ఇట్లు సమాహితుడై కర్మలుచేయువాడు ముందు అంతఃకరణశుద్ధిని,

తరువాత జ్ఞానాన్ని,అటుపై సర్వకర్మసంన్యాసాన్ని,తరువాత జ్ఞాననిష్టను పొంది, ఆ నిష్ఠవల్లగలిగే శాన్తిని(మోక్షాన్ని)పొందుతాడు—అని భావము.కాని,యెవడైతే అసమాహిత చిత్తుడై"ఈ కర్మఫలం నాకు లభించడంకో సంచేస్తున్నాను"అని కామప్రేరితుడై,ఫలమునందు ఆసక్తుడై కర్మలు చేయునో,అతడుబంధింపబడు తాడు.యుక్తుడు శాన్తినిపొందుతాడు.అయుక్తుడు బంధమును పొందుతాడు.కావున,నీవు యుక్తుడవుగానే అగుము అని అర్థము .

**శ్లో॥సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥**(గీత. 4-30)

**"దైవమేవాపరే యజ్ఞం యోగినః"**(గీత.4-25)మొదలుకొని**"ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి"**(గీత.4-30)వరకు చెప్పబడిన యజ్ఞములు తెలిసిన వీరంద రుగూడ యజ్ఞాలచేత తొలగింపబడిన(నశింపబడిన)పాపాలు గలవారు.

**శ్లో॥యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్।**(గీత.18-5)

యజ్ఞము,దానము,తపస్సు—అను మూడువిధాలైనకర్మ విడువదగినది గాదు.అది చేయదగినదే.ఎందుకనగా,యజ్ఞ,దాన,తపస్సులు ఫలాభిసంధిరహిత బుద్ధిమంతులకు విశుద్ధికి కారణములు.

**శ్లో॥స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః।**
**స్వకర్మ నిరతః సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు॥**
**శ్లో॥యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।**
**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః॥**
**శ్లో॥శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్।**
**స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥**

**శ్లో॥సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్।**

**సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥**

**శ్లో॥అసక్తబుద్ధిః సర్వత్ర జితాత్మా విగత స్పృహః।**

**నైష్కర్మ్యసిద్ధిం పరమాం సంన్యాసేనాధిగచ్ఛతి॥**(గీత.18-45 నుండి 18-49)

మనుష్యుడు తనతన జాతికి సంబంధించిన కర్మయందు శ్రద్ధావంతుడై ఆచరించినచో సంసిద్ధిని=శరీరేంద్రియాల అశుద్ధి తొలగిపోయి జ్ఞాననిష్ఠా యోగ్య తారూప అంతఃకరణశుద్ధిని పొందుచున్నాడు.శాస్త్రము తనకు విధానముచేసిన (ఏర్పరచిన)కర్మయందు ప్రవర్తించువాడు యేప్రకారముగా సిద్ధిని(అంతఃకరణ శుద్ధిని పొందుచున్నాడో,చెప్పెద నాకర్ణింపుము.ఈ జన్మలో యే వర్ణాశ్రమాలకు జెందినవాడై యున్నాడో,ఆ వర్ణాశ్రమాలకు విధించిన కర్మలనాచరించినందు వలన,ఈజన్మమునుండి విముక్తినొంది మరల(పై)విశిష్ట జన్మలోనికి ప్రవేశిం చును.ఇదియే యిచ్చట“సిద్ధి”యను దానికి అర్థము(అని—శ్రీ వ్యాసాశ్రమము వారి భగవద్గీతలో శ్రీ సద్గురు మలయాళ స్వాముల వారు చెప్పారు).45.

ఏ అంతర్యామియగు యీశ్వరునిద్వారా సమస్త ప్రాణులయొక్క ఉత్పత్తి లేక చేష్టలు కలుగుచున్నవో మరియు యే యీశ్వరునిచే యీ జగత్తంతయూ వ్యాపించి యున్నదో,ఆ యీశ్వరునిచేత ప్రతివర్ణము వారికి విధించబడిన తన కర్మలద్వారా(ఆ ఈశ్వరుని)పూజించి,ఆయనను ఆరాధించిన మనుష్యుడు మాత్రమే జ్ఞాననిష్ఠయను యోగ్యతారూప సిద్ధిని పొందగలడు.46.

అలా కలుగుటకు కారణమేమనగా!తన వర్ణముననుసరించి యీశ్వరునిచే విధించబడిన కర్మ గుణరహితమైనను అనగా హీనమైనకర్మ అయినప్పటికి, బాగుగా అనుష్ఠించబడిన యితరుల ధర్మముకంటె యెంతో శ్రేష్టమైనది.ఏ విధ

ముగా విషమునందు లేక అగ్నియందు పుట్టిన ప్రాణికి ఆ విషము లేక అగ్ని యెట్లు అపకారిగాదో,అట్లే తన స్వభావమునననుసరించి విధించబడిన కర్మలను శ్రద్ధతో ననుష్ఠించు మనుష్యునకు యెటువంటి పాపము అంటదు.మరియు పరధర్మము(యితర వర్ణములవారికి విధించబడిన కర్మలు)భయహేతువులై యుండును.ఎటువంటి అజ్ఞానిగూడ కర్మలు చేయకుండా ఒక్క క్షణముగూడ వుండజాలడు గదా!47.

అందువలన,ఓ కౌన్తేయ!జన్మతో లభించిన యే కర్మయున్నదో,నది త్రిగుణములతో కూడియున్నందున దోషయుక్తమే,అయినను అది సహజమైనదిగాన దానిని విడువరాదు.ఏలయనగా,సమస్తకర్మలును నిప్పు పొగచే నావరింపడియున్నట్లు దోషముచే నావరింపబడియున్నవి.వారివారికి విధించబడిన కర్మలెంత ప్రయాసముగానుండిననూ,వానిలో కొన్ని దోషములు గనిపించినను—అవి యనివార్యములుగాన ననుష్ఠించియే తీరవలయును.

ఈసందర్భములో శ్రీమలయాళసద్గురుదేవులు (గీత.18-48)యీక్రింది విధముగా ఆనతిచ్చియున్నారు.గృహస్థులకు అనివార్యముగా ప్రాప్తించు దోషములు, తన్నివారణోపాయములు యీక్రింది విధముగా నున్నవి.

1.ధాన్యమును ఉత్పత్తిచేయునపుడు,ధాన్యమును దంచునపుడు ప్రాణిహింస జరుగును.2.సమ్మార్జనము(చీపురుతోఊకునపుడు)నడుచునపుడు.3.చెట్లు నరుకునపుడు,కట్టెలచే వండునపుడు,కూరగాయలను తరుగునపుడు,4.జలమును కాచునపుడు,5.స్థలమును,పాత్రలను శుభ్రపరచునపుడు—ఇత్యాద్యనేకస్థలములలో(క్రిమికీటకాది)ప్రాణులు మరణించుట సంభవించుచుండును.ఈ

ఐదు దోషములు అనివార్యములు. ఈఐదు దోషముల నివృత్తి యీ క్రింది రీతిచే గలుగును.

1.ధాన్యాదులచే నేర్పడిన యన్నాదులను బ్రహ్మనిష్ఠులు,అతిథులు,రోగులు, బ్రహ్మచారులు మొదలైనవారికి పెట్టుటచేతను,దేవతానైవేద్యములచేతను మొదటి దోషము వోవును.2.వేదాధ్యయనము,ప్రణవాది దివ్యమంత్రజపము చేయుటచే రెండవ దోషము వోవును.3.ధర్మశాలలు,దేవాలయములు కట్టించుటచే మూడవ పాపము నశించును.4.అతిథులకు అన్నపానాదులొసగుటచే,మాతాపితరులకు సేవచేయుటచే,పితృదేవతలకు నొసంగెడు తర్పణాది క్రియలచే నాల్గవ పాపము నశించును.5.ధాన్యము నుడక బెట్టుటచే,స్థలమును శుభ్రము చేయుటచే గలిగెడు ఐదవ పాపము—బ్రహ్మవిచారమను ధ్యానయోగముచేతను,కుక్క,పిల్లి,కాకి మొదలగువానికి అన్నముపెట్టుటచేతను నశించును.ఇట్టి విధులనాచరిం చనిచో దోషమావహించును.

మనము ప్రభుత్వము వారికి కట్టవలసిన పన్ను చెల్లించినచో, మన భూమి మనకెల్లప్పుడుండును.అట్లుచేయనిచో మన ఆస్తులను ప్రభుత్వమువారు స్వాధీనము చేసికొందురు.అట్లే,పై శాస్త్రోక్తవిధులనా చరించనిచో, పై పంచపాపములు నివర్తింపకవోగా,మన పుణ్యముగూడ నశించును. కొందఱు త్యాగులు పైజెప్పిన యీకర్మలలో దోషముగలదని,వాటిని వదిలి భిక్షాన్నముతో జీవించెడువారు గూడగలరు.అయితే తమకు దొరుకు పట్టెడు అన్నము యెట్లు ఉత్పన్నమైనదో, గృహస్థులు దానిని మనకెందు కొఱకు పెట్టుచున్నారో అని యోచించువారరుదు.ఇది వైరాగ్యమని వారు తలంచెదరేగాని గృహస్థులు పైన చెప్పబడిన ఐదు విధముల దోషముల నివృత్తికొఱకే వీరిచ్చుచున్నారని యోచింపక వోయినచో,వీరియొక్క పుణ్యముగూడ క్షీణించును.48.

ఈఐదు విధముల దోషనివృత్తికై శాస్త్రములో(మనుస్మృతి.3-65నుండి3-71) పంచ విధ యజ్ఞములు విధింపబడినవి.అవి దేవ,ఋషి,పితృ,అతిథి,భూత యజ్ఞము లనబడును.

**శ్లో॥అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్।**

**హోమోదైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్॥**(మనుస్మృతి. 3-70)

వేదాన్ని అధ్యయనం చేయుట,చేయించుట అనేది బ్రహ్మయజ్ఞమనబడు ను.పితృదేవతలకిచ్చు తర్పణముపితృయజ్ఞం;యజ్ఞయాగాది కార్యం దైవయ జ్ఞం;ప్రాణులకు(భూతములకు)అన్నమును పెట్టుట భూతయజ్ఞం; ఇంటికివచ్చు అతిథులనుగౌరవించుట అనునది మనుష్యయజ్ఞమనబడును.ఈపంచవిధ య జ్ఞములను యథాశక్తిగా నాచరించు గృహస్థుడు పైనపేర్కొనిన పంచపాతకముల నుండి విముక్తుడగును.

సకల శాస్త్రములలో జ్ఞానము మరియు కర్మలకు సాధ్యసాధనభావము ప్రసి ద్ధమున్నందన,అన్యసాధనలచేచిత్తశుద్ధిగలిగే అవకాశము లేనందున,మోక్ష మును అధిరోహించుటకు ఇచ్ఛగల ఆరురుక్షు పురుషుడు తనకు శాస్త్రముచే విధింపబడిన కర్తవ్యకర్మలు దోషయుక్తములైనను,అవశ్యముగా చేయవల యును.ఎందుకనగా?శ్రుతిస్మృతి విహిత సాత్విక కర్మలనుఅనేకజన్మలనుండి చక్కగా ఆరాధిస్తూ(అనుష్ఠానముగావిస్తూ)రాగా,ఈశ్వరప్రసాదము(అనుగ్రహ ము)చే చిత్తములోని పాపము(రాగద్వేషాదికాలుష్యము)అశేషముగా నశించి, అంతఃకరణశుద్ధి గలుగును.ఇట్లు,కేవల సాత్వికబుద్ధిచే సాత్వికకర్మలనాచరిం చుటవలన ఈశ్వర ప్రసాదముచే చిత్తశుద్ధిగల్గి,సాధనసంపన్నుడైన జిజ్ఞాసు వునకు,ఈశ్వరానుగ్రహముచే సద్గురువు సచ్ఛాస్త్రము ప్రాప్తించును.పిమ్మట

సద్గురుదేవులు"**తత్త్వమసి**"యను మహావాక్యమును ఒక్కసారి ఉపదేశించి నంత మాత్రముచే బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముత్పన్నమగును.అటువంటి ఆరూఢ పురుషునికి సంన్యాసయోగముచే బ్రహ్మప్రాప్తి గల్గునని శ్రీకృష్ణ భగవంతుడు "**ఆసక్త బుద్ధిః సర్వత్ర**" అని చెప్పుచున్నాడు.

ఓఅర్జునా!ఆసక్తికి నిమిత్తరూప స్త్రీ,పుత్ర,ధన,గృహారామక్షేత్రముల యందు యేపురుషుడు"**నేను యీ స్త్రీ పుత్రాదులకు సంబంధించిన వాడను, అవినావి**" యనుఅభిష్వంగరహిత(ఆసక్తిరహిత)బుద్ధిగలవాడై,తన యంతఃకరణమును స ర్వవిషయములనుండి నివర్తించి,తన వశమునందుంచు కొనునో,సకలదృశ్యప దార్థములపట్ల దోషదర్శనముచే మిథ్యాత్వ నిశ్చయము చేసికొని,దేహజీవన భోగములందు కించిన్మాత్రముగూడ ఇచ్ఛ లేనివాడై(విరక్తుడై),పరమానందబోధ రూపమోక్షమునందు మాత్రము తీవ్రేచ్ఛగల శుద్ధాంతఃకరణముగల పురుషుడు, "**స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః**"(గీ.18-46)అను వచనముచే ప్రతిపాదించబడిన జ్ఞానసాధనమగు వేదాన్తవాక్యవిచారమునందు అధికారరూప జ్ఞాననిష్ఠా యోగ్యతను పొందినవాడు,సంన్యాసముచే=స్వవర్ణాశ్రమోచిత విహిత సర్వ కర్మలను—శిఖాయజ్ఞోపవీతాది సహితముగా పరిత్యజించి"**నైష్కర్మ్యసిద్ధి**" ని పొందును."**నిష్కలంనిష్క్రియంశాన్తం**"(శ్వే.6-19)నిర్గతాని కర్మాణి యస్మాత్ తన్నిష్క్రియమ్=బ్రహ్మ.దానికి సంబంధించిన విచారజనితజ్ఞానము నైష్కర్మ్య ము.ఈపరమసిద్ధిరూప నైష్కర్మ్యము,నిష్కామకర్మజన్య అపర మసిద్ధిరూప జ్ఞాననిష్ఠాయోగ్యతయను సాధనము పరిపక్వమైనపుడు, దానికి ఫలముగా (నైష్కర్మ్యసిద్ధి) ప్రాప్తించును.49.

కావున,పూర్వోక్త శ్రుతిస్మృతి వచనానుసారము గృహస్థులకుగూడ జ్ఞాన సాధనములగు శ్రవణాదులందధికారము గలదని ధ్రువపడినది.లేనిచో,జనక,

యాజ్ఞవల్క్యాదులు జ్ఞానులు—అనిచెప్పు శాస్త్రములు నిరర్థకములగును గదా! గృహస్థులకు జ్ఞానముగల్గుట కష్టసాధ్యము.అంతేగాని అసాధ్యము మాత్రముకాదు.అందుకని,విధిపూర్వకముగా సర్వకర్మలనుండి ఉపరతి నొందిన సంన్యాసికే శ్రవణాదులందధికారము గలదనుటలో శ్రీశంకరాచార్యులవారి యభిప్రాయమిదియేగాని,అన్యముగాదు.అట్లుగానిచో,వేదవ్యాస భగవానుని సూత్రములకు విరోధమేర్పడగలదు.మరియు సూత్రానుసారియగు భాష్యమువ్రాసిన శ్రీశంకరులకుగూడ స్వవచన విరోధరూప వ్యాఘాతదోషము ప్రాప్తించును.

వ్యాససూత్రము:—**"అతఏవచాగ్నీన్ధనాద్యనపేక్షా"**(బ్ర.సూ.3-4-25)సందేహము:—ఆత్మజ్ఞానము తనయొక్క ఫలమగు మోక్షోత్పత్తియందు కర్మలను అపేక్షిస్తుందా? లేదా?

పూర్వపక్షము:—కర్మలను అపేక్షిస్తుంది.ఎందుకనగా,అంగి తన అంగములను నియమముచే అపేక్షిస్తుంది. ఉదా:—ప్రయాజాదుల వలె.

సిద్ధాంతము:—అంధకారమును తొలగించుటకు దీపమునకెట్లు దేనియొక్క అపేక్ష ఉండదో,అట్లే జ్ఞానము అజ్ఞానమును నాశనము చేయుటలో దేనిని అపేక్షించదు.అందువల్ల,ఫలోత్పత్తి(మోక్షోత్పత్తి)యందు విద్య కర్మలను అపేక్షించదు.

పూర్వపక్ష అభిప్రాయమిది:—విమతో బ్రహ్మతత్త్వావబోధః, స్వఫలప్రదానే స్వాఙ్గభూత కర్మాపేక్షః,అఙ్గిత్వాత్,ప్రయాజాపేక్షదర్శపూర్ణమాసవత్ ।

బ్రహ్మతత్త్వావబోధము(బ్రహ్మజ్ఞానము)తన ఫలమగు మోక్షమును కలుగజేయుటలో దానియొక్క అంగభూతకర్మలను అపేక్షించును(ఇదిప్రతిజ్ఞా),విద్య అంగి(ప్రధానము)గావున(హేతువు),ఏదిఅంగియగునో నది నియమముచే దాని యంగములనపేక్షించును(ఇదివ్యాప్తి);ఉదా:—దర్శపూర్ణమాసయాగము నియమ

ముచే దానియంగములగు ప్రయాజాదులనపేక్షించునట్లు.యద్యపి మూడవ అధ్యాయము నాల్గవపాదము మొదటి అధికరణములో విద్యయొక్క స్వతంత్ర పురుషార్థత్వము ప్రతిపాదింపబడినది.అక్కడ కర్మకు జ్ఞానముయొక్క అంగత్వ నిరాకరణచేయబడినది.కాని,యిక్కడ జ్ఞానమునకు కర్మయొక్క అంగత్వనిరా కరణచేయబడుచున్నది.కావున,అనుమాన ప్రయోగములోని"**అంగిత్వాత్**"అను హేతువు అసిద్ధి దోషగ్రస్తముకాదు.అందువలన,ఆత్మతత్త్వజ్ఞానము తనయొక్క ఫలప్ర దానమున ఆశ్రమకర్మలను(అగ్నిన్ధనాదులను)అపేక్షిస్తుంది.(ఇది పూర్వపక్షము).

ఇట్లు పూర్వపక్షము ప్రాప్తము కాగా సిద్ధాంతము చెప్పబడుచున్నది.

విమతం బ్రహ్మజ్ఞానం స్వవిరోధి నివర్త్య నివర్తనేఽన్యాపేక్షం న భవతి (ఇతిప్రతిజ్ఞా),ప్రకాశకత్వాత్ (హేతువు),దీపవత్,ఘటజ్ఞానవచ్ఛ।(ఉదాహరణము).

విప్రతిపన్న బ్రహ్మజ్ఞానము స్వవిరోధిపదార్థమగు అజ్ఞానమును నాశనము చేయుటకు అన్యమగు దేనిని అపేక్షించదు (ప్రతిజ్ఞా)ప్రకాశస్వరూపమున్నందున (హేతువు)ఏది ప్రకాశస్వరూపముంటుందో,అది తాను ప్రకాశించుటయందు యితర మగు దేనిని అపేక్షించదు.(ఇది వ్యాప్తి),ఉదా:—దీపమువలె లేదా ఘటజ్ఞానము వలె.

జ్ఞానముయొక్క అంగిత్వప్రయుక్త శంక యేదిచేయబడినదో,దానిపై యీ విధంగా ప్రశ్నించవలెను—కర్మకు యేవిధమైన అంగత్వమువివక్షితమై యున్న ది?ఏమి,ప్రయాజాదులవలె ఫలోపకారిత్వరూప అంగత్వము అభీష్టమైయున్న దా?లేక,అవఘాతాదులవలె స్వరూపోపకారిత్వరూప అంగత్వము అభీష్టమై యున్నదా?ప్రథమపక్షము యుక్తముగాదు.ఎందుకనగా,మోక్షము కర్మజన్య మగుటచే అనిత్యమగును.రెండవపక్షము దృష్టాంతాసిద్ధి దోషముచే దుష్టమగు చున్నది—అవఘాతాదులందు ప్రయాజాదుకులకు స్వరూపోపకారి అంగత్వము

లేదు.కావున విద్యకు(ఆత్మతత్త్వావబోధమునకు)స్వకీయ ఫలోత్పాదనమునందు కర్మలయొక్క అపేక్ష లేదు.(వైయాసికన్యాయమాల)

వ్యాససూత్రములు:—**"సర్వాపేక్షాచయజ్ఞాదిశ్రుతేరశ్వవత్","శమదమా ద్యుపేతః స్యాత్తథాపి తు తద్విధేస్తదఙ్గతయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్"**(బ్ర.సూ. 3-4-26&27)

సందేహము:—బ్రహ్మతత్త్వావబోధము తనయొక్కఉత్పత్తియందు కర్మలను అపేక్షిస్తుందా? లేదా?

పూర్వపక్షము:—బ్రహ్మవిద్య తన ఫలోత్పాదనమునందు యెట్లు కర్మలనపేక్షించదో, అట్లే స్వోత్పత్తియందుగూడ కర్మలను అపేక్షించదు.

అభిప్రాయమిది:—బ్రహ్మవిద్య,తన ఫలోత్పాదనమునందు యెట్లు కర్మలను అపేక్షించదో,అట్లే తన ఉత్పత్తియందుగూడ కర్మలనపేక్షించదు.ఒకవేళ అట్లు స్వీకరించనిచో ఒకచోట(తనఉత్పత్తికి)కర్మలనుఅపేక్షిస్తుంది.ఒకచోట(తన ఫలోత్పత్తికి)అపేక్షించదు—అను యీవిధమగు"అర్ధజరతీయ"న్యాయము ప్రాప్తమగును.

ఇట్లు పూర్వపక్షము ప్రాప్తించగా,సిద్ధాన్తము చెప్పబడుచున్నది."**తమేతం వేదానువచనేన"**(బృ.4-4-22)మరియు"**తస్మాదేవంవిచ్ఛాన్తోదాన్తః"**(బృ.4-4-23)ఈ రెండు శ్రుతిప్రమాణములచేత యజ్ఞాదులు మరియు శాన్త్యాదులచేతనే జ్ఞానము ఉత్పన్నమగును.ఉదా:—హలమును(నాగలిని)లాగుటకు అనపేక్షితమైన అశ్వము(గుఱ్ఱము)రథమునులాగుటకు అపేక్షితమున్నది.అర్ధజరతీయ న్యాయము ప్రాపించదు.ఎందుకనగా,యోగ్యతానుసారము ఒకేవస్తువు కార్యభేదముచే అపేక్షితము మరియు అనపేక్షితము(రెండువిధములుగ)కావచ్చును.ఎట్లు లాంగలమును(నాగలిని)లాగుటకు అశ్వముయొక్క ఉపయోగము(అపేక్ష)లేనప్పటి

కిని,రథమును లాగుటకు అపేక్షితమైయున్నది.అట్లే,విద్యయు తన ఫలమగు మోక్షోత్పత్తికికర్మలనపేక్షింపకున్నను,తనయొక్కఉత్పత్తికిఅపేక్షించును."**తమే తంవేదానువచనేన**"వేదాధ్యయనముచేతను,యజ్ఞముచేతను,దానాదులచేతను బ్రాహ్మణుడు(జిజ్ఞాసువు)ఆత్మతత్త్వమును తెలిసికొనుటకి చ్ఛగించును—ఇత్యాది శ్రుతిచే ప్రవృత్తిరూప వేదానువచనాదులు వివిదిషోత్పాదనముద్వారా బహిరంగసాధనములుగాతెలియబడుచున్నవి.మరియు,"**తస్మాదేవంవిచ్ఛాన్తోదాన్తః**" ఇత్యాదులచే నివృత్తిరూప శమాదులు విద్యోత్పత్తి కాలములో అనువర్తమానమైయున్నందున అంతరంగసాధనములుగా తెలియబడుచున్నవి.దీనిచే విద్య (ఆత్మతత్త్వావబోధము)తనయొక్క ఉత్పత్తియందు యజ్ఞాదులను మరియు శమాదులను అపే క్షించుచున్నది.(వైయాసిక న్యాయమాల).

ఇట్లు,ఆశ్రమ కర్మాదులు శ్రుతిస్మృతిసూత్రములచే జ్ఞానాంగములుగా నిర్ధారణచేయబడినందున,వాటియందు గృహస్థాదులకు అధికారము గలదు గావున,వారుగూడ ఫలాభిసంధిరహితముగా యీశ్వరార్పణబుద్ధిచే కర్మాదులను చక్కగా అనుష్ఠించి,చిత్తశుద్ధినిగల్గి,ఈశ్వరానుగ్రహమునకు పాత్రులై,వివేకాదులనుబొంది,శ్రీగురుదేవులయొక్క ముఖారవిందము ద్వారా"**తత్త్వమస్యా**"ది వేదాన్తవాక్యశ్రవణాదివిచారమునకు అర్హులగుదు రు. ఇత్యుపరతి నిరూపణమ్.

—:37.**తితిక్షా**:—

**శీతోష్ణాది ద్వంద్వసహిష్ణుతా**(వే.సా).శీతము(చలి),ఉష్ణము(వేడి);మానము, అవమానము;లాభము,నష్టము;జయము,అపజయము;సుఖము,దుఃఖము; ఆకలి,దప్పిక మొదలగు ద్వంద్వము(జంట)లను సహించుట"**తితిక్షా**"అంటారు. శీతోష్ణాది ధర్మములు స్థూలశరీరరూప ఉపాధికి సంబంధించినవి.సుఖముదుఃఖ

ము మున్నగునవి సూక్ష్మశరీరరూప ఉపాధికి సంబంధించినవి కావున,శరీర మున్నంతవరకు వాటిని త్యాగముజేయుట అశక్యము.కాని,అవి స్వప్రకాశచి ద్రూపస్వాత్మయందు అత్యంతాభావమున్నవి—అను వివేక దీపముచే మిథ్యా భూతములగు శీతోష్ణాది ద్వంద్వములను సహించుట—తితిక్షాయనబడును.

**శ్లో॥సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వకమ్।**

**చిన్తావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే॥**(వి.చూ.25)

ఉన్నిబట్టలు,వింజామరలు మొదలగు వాటితో శైత్యము,ఉష్ణము మొదలగువాటివల్లగల్గు దుఃఖములకు ప్రతిక్రియ చేసికొనుట లోకప్రసిద్ధము. అట్టి సామగ్రిసదుపాయములులేనిచో—"**అయ్యో!దీనులమగు మనమిపుడేమి చేయవలెను**"అను చింతయు,ఏడ్పునుగూడ ప్రసిద్ధమే.ఇట్లు శీతోష్ణాదులకు సంబంధించిన ప్రతీకారభావనగాని,చింతగాని,విలాపముగాని ఉన్నట్లయితే బ్రహ్మవిచారసాధనమగు తితిక్ష కాజాలదని శ్రీశంకరాచార్యులవారు చెప్పుచున్నారు. "**అప్రతీకార పూర్వకం,చిన్తావిలాపరహితం యత్సహనం సా తితిక్షేతి**".దుఃఖానాం అనగా దుఃఖహేతువులగు శీతోష్ణాదులు అని అర్థము.

ఇప్పుడు,శ్రీజగద్గురు శంకరాచార్యులవారు వారియొక్క"**సర్వ వేదాన్త సిద్ధాన్త సారసంగ్రహము**"అనుగ్రంథమున 137నుండి150 శ్లోకముల వరకు"**తితిక్షా**" విషయంలో ఉపదేశించిన ప్రకారముననుసరించెదము.

**శ్లో॥ఆధ్యాత్మికాది యద్దుఃఖం ప్రాప్తం ప్రారబ్ధవేగతః।**

**అచిన్తయా యత్సహనం తితిక్షేతి ప్రచక్షతే॥**(137)

ప్రారబ్ధకర్మ ప్రాబల్యముచే సంభవించు ఆధ్యాత్మిక,ఆధిదైవిక మరియు

అధిభౌతికములగు సర్వదుఃఖములను విచారములేకుండగను,విలాప ము చేయకుండగను మరియు ప్రతిక్రియలను చేయకుండగను సహించుచుండుట యే **తితిక్ష** యని పెద్దలు చెప్పుచున్నారు.

ముముక్షుజనులకు"**సర్వదుఃఖసహనమను**"తితిక్షతో సమానమైన శత్రునాశకరమగు సాధనము వేరొకటిలేదు.కనుకనే,మహానుభావులగు బుద్ధిమంతులు,సంసారమను మహాసంగ్రామమున తితిక్షారూప కవచధారులై కామక్రోధాది ప్రబలపరిపన్థులను(దారిదొంగలను—పరమార్థమార్గప్రతిబంధకములను)పరాభవించి మాయారూప రాక్షసిని పరిమార్చ(నాశ నముచేయ) గల్గుచున్నారు.138.

ఓర్పుగలవారలకు,యమనియమాద్యష్టాంగయుక్త సమాధియు,స్వర్గ సుఖప్రాప్తియు,తుదకు సగుణబ్రహ్మభావముగూడ సులభముగా సిద్ధిం చును.ఓర్పులేనివారలకు ప్రతిక్షణమును చిత్తవిక్షేపములు గల్గుచుండును.ఇట్టివారు గాలిచే కదిలించబడిన ఆకులు చెట్టునుండి రాలిపోవునట్లుగా ముక్తిమార్గ విభ్రష్టులై సంసారముననే పొర్లాడుచుందురు. 139.

మనుజులు తితిక్షాయుక్తులగుదురేని,తపము,దానము,యజ్ఞము,పుణ్యక్షేత్రము,వ్రతము,పాండిత్యము,ఐశ్వర్యము,స్వర్గము,మోక్షము మున్నగువానిని తమతమ యభీష్టమును బట్టి పొందగల్గుదురు. 140.

బ్రహ్మచర్యము,శరీరవాఙ్మనంబులచే నితరులనెవ్వరిని బాధింపకుండుట, సాధుపురుషులను సేవించుట,పరుల పరిహాసాదులను సహించుట మున్నగు సద్గుణ సంపదంతయు ఓర్పుగల మానవునకే సిద్ధించును. 141.

**శ్లో॥సాధనేష్వపి సర్వేషు తితిక్షోత్తమ సాధనమ్।**

**యత్ర విఘ్నాః పలాయన్తే దైవికా అపి భౌతికాః॥**

మోక్షసాధనములన్నిటిలో తితిక్ష ఉత్తమసాధనము.ఇట్టి తితిక్షయున్నచో దైవికములగు అతివృష్టి,అనావృష్టి మున్నగువానివలనను,భౌతికములగు సర్పవ్యాఘ్ర చోరాదులవలనను చిత్తవిక్షేపము గలుగనేరదు. సర్వప్రకారముల విఘ్నములు పలాయనమగును.142.

తితిక్షగలవాడై దైవిక,భౌతికవిఘ్నములకు లోబడని మానవునకు దూరశ్ర వణము,దూరదర్శనము,పరకాయప్రవేశము మున్నగు యోగసిద్ధులును,అణి మాద్యష్టైశ్వర్యములును సులభముగా ప్రాప్తించును.143.

పూర్వోక్తహేతువులచే తితిక్షయనునది సర్వోత్కృష్టసాధనమని నిశ్చితమ గుచున్నది.కావున,ముముక్షుజనులు తితిక్షను తప్పక సంపాదించుకొనవలె ను.ఈ తితిక్ష దృఢమగుటకొఱకు రెండు సహాయకారణములు గలవు.ఒకటి తీ వ్రమగు మోక్షేచ్ఛ,రెండవది లోకవ్యవహారములందు సంబన్ధము నెంతమాత్రము కలిగించుకొనకుండుట.144.

సర్వసంగ పరిత్యాగులగు సంన్యాసులకు తితిక్ష అత్యన్తమావశ్యకము. సంన్యసించిన పిమ్మటగూడ దేహధర్మములగు జ్వరాది వ్యాధులు ప్రారబ్ధకర్మ ప్రాబల్యమున సంభవించుచునేయుండును.అట్టియెడ తురీయాశ్రమస్థులగు సంన్యాసులు,తితిక్షావంతులై వ్యాధులను దేహధర్మములుగా భావించి,దేహత ద్ధర్మములను ప్రారబ్ధమునకువదిలేసి,వాటితో తాదాత్మ్యాభిమానమును విడనా డి,తమ ఆశ్రమధర్మములగు శ్రవణమనననిదిధ్యాసములనే నిరన్తరమభ్యసిం చుచుండవలయును.అట్లుగాక,వ్యాధిబాధను సహింపజాలక వ్యాధినివారణము నకై ఔషధములను సేకరించుటయందు ప్రవృత్తమై,ఓషధులనుగూర్చియే ఎల్ల

ప్పుడు చింతనజేయుచు,“**అయ్యో!ఈ వ్యాధి యెట్లు నయమగునో**”యని చింతించుచూ వైద్యుల నాశ్రయించుచుందురేని,ఆ విక్షేపములతోడనే కాలము గడచిపోవుచుండును.ఇంతలో ప్రారబ్ధముచే ప్రాప్తములగు రోగములు దూరముకాకపోగా,అనియమితమగు మృత్యువాతబడి పరలోకగతులగుదురు.ఇట్టివారలు కర్మలను విడుచుటచే కర్మఫలమగు స్వర్గాదులనుగాని,శ్రవణాదులనాచరింపకుండుటచే జ్ఞానఫలమగు మోక్షమునుగాని పొందలేక పురుషార్థ భ్రష్టులగుచున్నారు.కావున,ముముక్షుజనులకు సర్వోత్కృష్టమగు తితీక్ష అవశ్యమభ్యసనీయము. 145.

శ్రవణమననాది వర్జితుడగు సంన్యాసి ఉభయభ్రష్టుడగునని ఇంతకు ముందు పైశ్లోకమున చెప్పబడిన విషయముపై ప్రాజ్ఞులకు ఒక ఆశంక గలుగుటకవకాశమున్నది.ఏమనగా:—శ్రీమద్భగవద్గీత 6-41&42లో యోగభ్రష్టుడగు సంన్యాసి పుణ్యలోకములకేగి అచట ఫలమునను‌భవించి పిమ్మట తిరిగి భూలోకమున భాగ్యవంతుల ఇండ్లలో జన్మించునని, లేక జ్ఞానవంతులైన యోగులయొక్క వంశమందు జన్మించునని శ్రీకృష్ణభగవానుడు చెప్పియున్నాడు గనుక సంన్యాసి ఉభయభ్రష్టుడగుననుట ఉచితము గాదు—అని.

సమాధానము:—శ్రీమద్భగవద్గీతలో పూర్వోత్తరగ్రన్థసందర్భములను చక్కగా పరిశీలించినచో పైప్రశ్నకు తావులేదు.ఎట్లనగా:—సంన్యాసి తితిక్షాయుక్తుడై శ్రవణమననపూర్వకముగా ధ్యానయోగమునభ్యసించుచు దైవయోగము(ప్రారబ్ధము)చే ధ్యానయోగఫలము సిద్ధింపకపూర్వమే కాల కర్మము(మృతి)నొందినచో, అట్టివాని గతి యేమగునని అర్జునుడడుగగా, శ్రీకృష్ణుడు—అట్టియోగికి(సాధకునికి)పుణ్యలోక గతి గలుగునని చెప్పెను.కావున,తితిక్షాసహితులై శ్రవణాదులనాచరించుచు,యోగభ్రష్టులగు వారలకే పుణ్యలోక ప్రాప్తిగాని తితిక్షారహితులై

శ్రవణాదివర్జితులగువారు ఉభయభ్రష్టులగుదురనుటలో విరోధమెంతమాత్రము ను లేదు. 146.

కేవలము సంన్యాసాశ్రమమును స్వీకరించి,యేవిధమైన యోగసాధనలు చేయకుండానే శరీరమును వదిలిన సంన్యాసికి,కేవలము ఉత్తమాశ్రమమును గ్రహించినంతమాత్రముననే అతనికి పుణ్యలోకప్రాప్తి గలుగునని శ్రీమద్భగవద్గీత లో శ్రీకృష్ణభగవానుడుపదేశించలేదు.ఇంతేగాక,"**నచసంన్యసనాదేవ సిద్ధింసమ ధిగచ్ఛతి**"(గీత.3-4)జ్ఞానరహితమగు కేవల కర్మత్యాగమాత్రమువలన జ్ఞాననిష్ఠా రూపమగు నైష్కర్మ్యసిద్ధి కలుగనేరదని గూడ నిరూపించియున్నాడు.147&148.

**శ్లో॥తస్మాత్తితిక్షయా సోఢ్వా తత్తద్దుఃఖముపాగతమ్।**

**కుర్యాచ్ఛక్త్యనుసారేణ శ్రవణాది శనై శ్శనైః॥**

అందువలన మోక్షమును గోరువారలు పూర్వజన్మ కర్మవశమున ప్రాప్తిం చు దుఃఖవిశేషములన్నింటిని తితిక్షచే సహించుచు,తమ శక్తిననుసరించి సమ యానుసారము క్రమేణ శ్రవణమనననిదిధ్యాసనముల నాచరించుచుండవలెను. సంభవించిన దుఃఖములను సహింపకున్నచో,ప్రయత్నముతో సంపాదించుకొ నిన తితిక్షకు యిసుమంతయు ప్రయోజనము లేకుండాపోతుంది.149&150. ఇతి తితిక్షా నిరూపణమ్.

**—:38.శ్రద్ధ:—**

**గురువేదాన్తాదివాక్యేషు విశ్వాసః శ్రద్ధా**"(వే.సా.)శ్రీగురుదేవులయొక్క మరియు వేదాన్తముల(ఉపనిషత్తుల)లో ఉపదేశింబడిన తత్త్వావబోధక తత్త్వమస్యాదివా క్యములందు అంకురిత పరమ విశ్వాసము గల్గియుండుట ***శ్రద్ధ*** యనబడును.

'ఆది'పదముచే స్మృతీతిహాసపురాణాలను గ్రహించాలి.విశ్వాసమనగా,శ్రీగురు దేవులు బోధించిన వాక్యములు మరియు వేదాన్తవాక్యములు ముమ్మాటికిని సత్యములు.వాటికి తిరుగులేదు.వాటివల్ల నాకు తప్పకుండా మోక్షముసిద్ధిస్తుం ది— అను నిశ్చయాత్మిక బుద్ధి. దీనికే ***శ్రద్ధ*** అంటారు.

**శ్లో॥శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యావధారణా।**

**సా శ్రద్ధా కథితా సద్భిః యయా వస్తూపలభ్యతే॥**(వి.చూ.26)

దేనిచేత వస్తువు అనగా మోక్షస్వరూపమగు బ్రహ్మము పొందబడునో, అట్టి శాస్త్రముయొక్కయు మరియు గురువచనముయొక్కయు(శాస్త్ర-గురు) వాక్యములను సత్యమనెడు బుద్ధితో నిశ్చయించుకొనుట యేదిగలదో,అది "**శ్రద్ధ**"యని సత్పురుషులచే చెప్పబడినది.

లోకంలోగూడ మనము చూస్తున్నాము.ఏమనగా,ఆప్తవాక్యమును విశ్వసిం పనిపురుషుడు,తదనుసారముగా విచారాదులందు ప్రవర్తింపడు. అలాంటప్పు డు,అతీంద్రియమగు శాస్త్రార్థవిషయమున వేరుగ చెప్పవలెనా?అందువలన శ్రద్ధ అత్యుత్తమ సాధనము.

**శ్లో॥శ్రద్ధావాంల్లభతే జ్ఞానం తత్పరస్సం యతేన్ద్రియః।**

**జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధి గచ్ఛతి॥**(గీత.4-39)

**శ్లో॥అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరన్తప।**

**అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసార వర్త్మని॥**(గీత. 9-3)

గురూపదిష్ట వేదాన్తవాక్యార్థములయందు నమ్మకము గలవాడును,ఆవాక్యా

ర్థమును తెలిసికొని యనుష్ఠించుట యందాసక్తిగలవాడను,జయిం పబడిన యింద్రియములుగలవాడగు పురుషుడు బ్రహ్మజ్ఞానమును పొందుచున్నాడు. అట్టి జ్ఞానమును పొందినపిమ్మట సర్వోత్తమమైన శాన్తిని పొందుచున్నాడు. (అన్వయము)

శత్రుసంహారకుడవగు నో యర్జునా!ఈ ఆత్మజ్ఞానమనెడు ధర్మముయొక్క స్వరూపమునందు నమ్మకముగల్గి శ్రద్ధతో నాచరింపని విశ్వాసరహితులైన మానవులు నన్ను బొందజాలక మృత్యువుతోగూడుకొనిన (మృత్యురూపమగు)సంసారమార్గమునందే నిశ్చయముగా తిరుగుచున్నారు. (వ్యతిరేకము).

శ్రీకృష్ణభగవానునియొక్క పైఅన్వయవ్యతిరేక భోధచే"**శ్రద్ధ**"ఆత్మసాక్షాత్కారమునకు అతిముఖ్య సాధనముగా తెలియబడుచున్నది.శమ,దమ,ఉపరతి మరియు తితిక్షలుగలవానికే"**ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ**" "**తత్సత్యంసఆత్మా తత్త్వమసి,నాసిత్వంసంసారి**" "**బ్రహ్మసత్యంజగన్మిథ్యా,జీవోబ్రహ్మైవనాపరః**"సజాతీయ,స్వగత,విజాతీయభేద రహితమైనది బ్రహ్మము.అదియే సత్యము(అబాధితము).అదియే నీ స్వరూపము.కావున,నీవే ఆ బ్రహ్మము కాని సంసారివి(జీవుడవు)కాదు.బ్రహ్మమొక్కటియే సత్యము,ఈపరిదృశ్యమానజగత్తు మిథ్యా(అనిర్వచనీయము),జీవుడు బ్రహ్మమే కాని వేరుకాదు—అని వేదాన్తతాత్పర్యమును శ్రీగురుదేవులు బోధించినచో—అది అట్లేయను(ముమ్మాటికి సత్యమేయను)అవధారణపూర్వక నమ్మకము(శ్రద్ధ)గల్గును.శమదమాదులు లేనివాడు నమ్మజాలడు.అందుకే,గురువేదాన్తవాక్యముల విషయమున"**శ్రద్ధ**"యేది గలదో, అది శమాది సాధనముల పిమ్మట పేర్కొనబడినది.

గురుశాస్త్రాదివాక్యములయందు యే శ్రద్ధ చెప్పబడినదో,అది ఈశ్వరునియందు మరియు గురువు మొదలగువారియందు భక్తిలేకుండా కలుగదు.కాని,

యెవరి చిత్తమున మొదలు ఈశ్వరునియందు మరియు ఋషులు,మునులు, బ్రహ్మనిష్టులగు గురువులయందును పూజ్యబుద్ధిచే ప్రీతిపూర్వక భక్తియుం డునో,వారికే వేదాదిశాస్త్రములయొక్క మరియు గురువు మున్నగు పూజ్యుల యొక్క వాక్యములందు,వారివారి భక్త్యనుసారము శ్రద్ధ కలుగును.

ఈసందర్భములో శ్రోత్రియబ్రహ్మనిష్టులగు సద్గురు శ్రీపండితపీతాంబరజీ వారు,వారి స్వరచిత"**శ్రీవేదాన్త బాలబోధము**"అను గ్రంథములో చక్కటి రూపక మును ప్రదర్శించారు.

1.వృక్షము=మోక్ష సాధనముల సంపత్తి.

2.ఆలవాలము(చెట్టుకు నీరు యిచ్చునపుడు,ఆ నీరు స్థిరముగ నిలచి,ఆ చెట్టునకే చెందుటకొఱకు,ఆ చెట్టుచుట్టు మట్టితో కట్టవేస్తారు.దానికే అలవాల ము లేక చెలియలికట్ట లేక పాదుఅంటారు)దానిస్థానంలో నిష్కామకర్మ మొద లగు ప్రయత్నములచే జేయబడిన శుద్ధమగు చిత్తము అని తెలియవలెను.

3.విత్తనము=ఈశ్వరుడు,గురువు మొదలగు వారి యందుగల భక్తి.

4.అంకురము(మొలక)=మంద వివేకము.

5.కాండము=దృఢ వివేకము .

6.శాఖలు=వివిధమగు వైరాగ్యము.

7.పుష్పగుచ్ఛములు=శమ,దమ,ఉపరతి,తితిక్ష మరియు సమాధానమ ను ఐదు సాధనములు.

8.మగపుష్ప సంయోగము=గురువాక్య శ్రవణము.

నిష్ఫలవృక్షమును మగవృక్షమని,సఫలవృక్షమును ఆడువృక్షమని అంటారు.

బొప్పాయి,కర్జూర,త్రాటి మొదలగు కొన్ని ఆడువృక్షముల మీద ఎప్పుడు మగ వృక్షముల, లేక దాని పుష్పముల సంయోగము కలుగునో, అప్పుడు అవి ఫలించును.ఇది లోక ప్రసిద్ధము.

9.ఫలసంబన్ధమగు అన్యప్రయత్నములు=శ్రవణమను జలమును విడుచుట,మననముచే సంశయముమొదలగు కలుపుతీయుట;నిదిధ్యాసనమను కావలి;దానిచే భేదవాది పామరపురుషులు,కామము మొదలగు పశుపక్షుల నుండి కాపాడుట; తత్త్వంపదార్థ శోధనచే ఎండినశాఖలు మున్నగు అనావశ్యక చెత్తనుతొలగించుట—ఈ మొదలగునవి ఊహించదగును.

10.ఫలములు=శ్రద్ధయగును.

11.పండ్ల పరిపాక అవస్థ=ముముక్షుత్వము.

12.ఆ పండ్లలోని మధురమైన రసము=బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము .

13.ఆపండులోని నిష్ప్రయోజనమగుటెంకు లేదా పిక్క=భక్తి యగును.

రసస్థానీయ జ్ఞానమేదిగలదో,అది పండుస్థానీయమగు శ్రద్ధయొక్క అధీనమైయుండును.ఎందుకనగా,పూర్వోక్త శ్రద్ధయనుపండు ఎండిపోయినచో,జ్ఞానమను రసముగూడ ఎండిపోవును,గాన జ్ఞానమనురసము శ్రద్ధయనుపండుయొక్కయాధీనమగును.

ఆ పండును భుజించుటవలన,దాని రసము కడుపున స్థిరపడును. ఇక్కడ ఈ రహస్యమున్నది:—

1.సకలవేదాన్తముల(ఉపనిషత్తుల)యొక్క తాత్పర్యము ఆది మధ్య అవసానములందు జీవబ్రహ్మల ఏకత్వమునందే ఉన్నదని ఉపక్రమాది షడ్లింగ

ములచే నిశ్చయించుకొనుట '**శ్రవణ**' మనబడును.

**శ్లో॥వేదాన్తానామశేషానామాదిమధ్యావసానతః।**

**బ్రహ్మాత్మన్యేవ తాత్పర్యమితి ధీః శ్రవణం భవేత్॥**(వే.పం.7-101)

షడ్లింగములు:—1.ఉపక్రమ,ఉపసంహారములు,2.అభ్యాసము,3.అపూర్వత,4.ఫలము,5.అర్థవాదము, మరియు 6.ఉపపత్తి.

**శ్లో॥ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలమ్।**

**అర్థవాదోపపత్తీ చ లిఙ్గం తాత్పర్యనిర్ణయే॥**(ఆనన్దగిరి కృత తత్త్వాలోకము)

2.జీవబ్రహ్మల అభేదసాధకములు మరియు భేదబాధకములునగు అనుమానాది యుక్తులచే అద్వితీయబ్రహ్మముయొక్క చింతనము జేయుట—"**మననము**"నబడును .

3.విజాతీయమగు అనాత్మాకారవృత్తులను సంపూర్ణముగా త్యాగముచేసి, వ్యవధానరహిత(నిరన్తర)బ్రహ్మాకారవృత్తి సంతానము(ప్రవాహము)యొక్క స్థితికి— "**నిదిధ్యాసనము**"అంటారు.

పై శ్రవణాదిత్రయ విషయంలో సంక్షేపశారీరకకారులగు శ్రీసర్వజ్ఞత్వమునీంద్రు లవారి అభిప్రాయమును తెలిసికొందము—

**అజ్ఞానసంశయవిపర్యయరూపకాణి,బ్రహ్మాత్మబుద్ధిజననప్రతిబంధకాని।**

**తత్త్వంపదార్థవిషయాణి నివర్తయన్తి,హ్యావృత్తిమన్తి మననశ్రవణాదికాని॥**

**శబ్దశక్తివిషయం నిరూపణం,యుక్తితః శ్రవణముచ్యతే బుధైః।**

**వస్తువృత్తవిషయం నిరూపణం,యుక్తితో మననమిత్యుదీర్యతే॥**

**చేతసస్తుచితిమాత్రశేషతా,ధ్యానమిత్యభివదన్తి వైదికాః।**

**అన్తరఙ్గమిదమిత్థమీరితం,తత్కురుష్వ పరమాత్మబుద్ధయే॥**

(సంక్షేపశారీరకము 3-343 నుండి 345 వరకు)

పునఃపునః అనుష్ఠింపబడిన శ్రవణమననాది అంతరంగసాధనములు ఆత్మ జ్ఞానోత్పత్తియందు తత్త్వంపదార్థవిషయక అజ్ఞాన-సంశయ-విపర్య యరూప యే ప్రతిబంధకములుగలవో,వాటిని నివర్తించును.బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచే స్వరూ పావరక[13]మూలాజ్ఞానము నివర్తించును.ప్రమాణగత అసంభావన(సంశయము) శ్రవణముచేత నివర్తించును.మననముచే ప్రమేయగతఅసంభావన నశించును. నిదిధ్యాసనముచే విపరీతభావన నష్టమగును.

విద్వత్పురుషులు—తాత్పర్యనిర్ణాయక ఉపక్రమాది షడ్విధలింగములచే(యు క్తులచే)బ్రహ్మాత్మల ఏకత్వమునందు సకలవేదాంతముల తాత్పర్యముగలదను అవధారణమునకు శ్రవణమని,మతాంతరధీప్రయుక్త భేదబాధక మరియు వేదాం తానుసారమగు అభేదసాధక యుక్తులద్వారా అద్వితీయబ్రహ్మతత్త్వనిర్ణయ మును(నిరూపణమును)మననమని చెప్పుదురు.

చైతన్యైకరసత్వ వృత్తిస్థైర్యమును ధ్యానమని(నిదిధ్యాసనమని)—అనగా అనా త్మాకారవృత్తులను త్యజించి తైలధారవలె నిరంతర ఆత్మాకారవృత్తుల ప్రవా

---

[13] తతః సవిలాస ***మూలావిద్యా*** సర్వకార్యోపాధిసమన్వితా ***సదసద్విలక్షణానిర్వాచ్యా*** లక్షణశూన్యా ఆవిర్భావతిరోభావాత్మికా *అనాది* అఖిలకారణకారణాన్త ***మహామాయా*** విశే షణవిశేషితా పరమసూక్ష్మమూలకారణమవ్యక్తం విశతి।(త్రిపాద్విభూతి మహానా 3 అధ్యాయము)

ముయొక్క అభ్యాసము చేయగాచేయగా ఎప్పుడు ఆత్మాకారవృత్తి స్థిరపడునో, ఆ వృత్తిస్థైర్యమునకు వైదికపురుషులు నిదిధ్యాసనమని చెప్పుదురు.ఈప్రకారముగా అంతరంగసాధనవర్గము చెప్పబడినది.కావున,ఓ శిష్యా!దానిని పరమాత్మతత్త్వావబోధముకొఱకు అనుష్ఠించుము.

1.ఏకస్మిన్ ధర్మిణి విరుద్ధ నానాకోట్యవగాహి జ్ఞానం **సంశయః।**

ఒకే ధర్మి(వస్తువు)యందు వికల్పముగా భాసించు అనేక ప్రకారముల విరుద్ధజ్ఞానమునకు **సంశయ**మందురు.ఉదా:—"స్థాణుర్వాపురుషోవా"।ఎదురుగా నిలబడినట్లుకనబడుచెట్టుమొండెము(మొద్దు,మోడు)నుచూసి,"ఇదిచెట్టు మొండెమా?లేకపురుషుడా(చోరుడా)?అనియిట్లు వికల్పముగా భాసించు జ్ఞానము—సంశయజ్ఞానము.

సంశయమునకు అసంభావన అనిగూడ అంటారు.పునః సంశయము రెండువిధములు.1.ప్రమాణగత సంశయము.2.ప్రమేయగత సంశయము.

1.వేదాన్తవాక్యరూప ప్రమాణములు జీవబ్రహ్మల భేదమును ప్రతిపాదించుచున్నవా?లేక,అభేదమునుప్రతిపాదించుచున్నవా?అనుసందేహము ప్రమాణగత సంశయమనబడును. ఇది శ్రవణముచే నివర్తించును.

2.వేదాన్తములకు విషయము జీవబ్రహ్మైక్యము.దానిపట్ల సందేహము.అనగా,జీవబ్రహ్మలయొక్క భేదము సత్యమా?లేక,అభేదము సత్యమా?ఇది విషయగత అనగా ప్రమేయగత సంశయమనబడును.ఇది మననముచే నష్టమగును.

2.విపర్యయమునకు విపరీతభావన అంటారు.జీవబ్రహ్మలయొక్క భేదము సత్యమున్నది మరియు దేహాదికప్రపంచము సత్యమున్నది.ఇటువంటి విపరీతనిశ్చయమునకు విపరీతభావన లేక విపర్యయము,అధ్యాసము,భ్రా

న్తి,భ్రమ—అని అనేక పర్యాయ శబ్దములచే చెప్పుదురు.ఇది నిదిధ్యాసనము చే దూరమగును.

ప్రమాణగత సంశయము మరియు ప్రమేయగత సంశయము అనేక ప్రకారములుగానున్నవి.గ్రంథవిస్తారభయముచే ఇక్కడ వ్రాయుటలేదు.విశేషజిజ్ఞాసగలవారు శ్రీపండిత పీతాంబరజీకృత శ్రీవేదాన్త బాలబోధమునందు మరియు వారియొక్క శ్రీవేదాన్త పఞ్చదశి భాషాటీకలో గనందగును.

ఉపరోక్త శ్రవణ,మనన,నిదిధ్యాసనమను మూడింటియొక్క సముదాయమునకు"**విచారము**"అంటారు.శ్రద్ధలేనివానికి వేదాన్తవాక్య శ్రవణాదులందు ఇచ్ఛగలుగదు.కావున,అతడు వేదాన్తవిచారము చేయుటకు ప్రవృత్తుడుకాడు.ఎవరు శ్రద్ధాపూర్వకముగా వేదాన్తవాక్య(తత్త్వమస్యాదివాక్య) శ్రవణాదిరూప విచారము చేసి,తాత్పర్యనిశ్చయము గల్గియుందురో,వారికి శాస్త్ర,గురువాక్యములచే నిశ్చయింపబడిన అర్థము(పరమార్థమగు అద్వైతతత్త్వము)నందు నిష్ఠ యేర్పడును. కావున,జీవించియున్నంతవరకు ఆ విద్వాంసునికి శాస్త్రగురువాక్యములచే చిత్తమందు నిశ్చయింపడిన యర్థమునందు స్వాభావిక శ్రద్ధయుండును.మరియు జీవితపర్యన్తము జ్ఞాననిష్ఠగూడ ఉండును.

ఏ విషయమునందు యెవరికి ఇచ్ఛలేదో,అతనికి ఆ విషయమునందు శ్రద్ధగూడ గలుగదు.ఉపేక్షాబుద్ధిఉండును.గావునఅతనికి దానియొక్కరుచి లభించదు.ఇది లోకప్రసిద్ధము.అట్లే,శ్రద్ధయనుపండును అనభిజ్ఞుడు(అజ్ఞాని పురుషుడు)భక్తియను రుచిగల బీజమును ఉపేక్షించి భుజించినచో,వానికి అధికరుచి కలుగనేరదు.అభిజ్ఞుడు(జ్ఞానిపురుషుడు)భక్తియనుటెంకు(పిక్క)తోను,జ్ఞానమనురసముతోను ఆపండును భుజించును,గాన వానిచే దాని అధికరుచి అను

భవింపబడును.ఉదా:—కొందరు మామిడిపండును కత్తితోకోసి టెంకును పడవేసి దానికండను(గుజ్జును)మాత్రము తింటారు.మరికొందరు మామిడిపండును కోయకుండా దాని తొడిమచోటును నోట్లోపెట్టుకొని చీకి-రసమును(పీల్చి)సేవించి, అట్లే దాని టెంకునుగూడ చీకి బొత్తిగా దాని రసమును ఆస్వాదించి ఆపైన మిగిలిన తొక్కను మరియు టెంకును పడవేస్తారు.ఈ రెండువిధముల అనుభవంలో దేనిలో అధిక ఆనందం లభించునో మీకు తెలియును గదా!

ఈ విధముగా ముందు చెప్పబడిన శ్రద్ధయను ఫలమునకు జీవన్ముక్తి—రుచియగును. విదేహముక్తి—శ్రద్ధచే కలిగిన ఆకలి నివర్తించుట—అను నిరంకుశ తృప్తియగును.

అన్యరూపకము:—పూర్వకాలంలో పెరుగును చిలికి(దధిమంథనము చేసి)వెన్నను వెలికి తీయుటకు అనేక సామగ్రులను ఉపయోగించేవారు.పెరుగును ఒక పాత్రలోవేసి,ఆ పాత్ర దొరలిపోకుండా దానిక్రింద ఒక చుట్టను ఉంచేవారు. ఆపాత్రను ఒక కొయ్యస్థంభము దగ్గరపెట్టి,ఆపాత్రలో కవ్వమునువేసి,ఆకవ్వము మరియు స్థంభమును రెంటినిచుట్టివేస్తూ,కవ్వమునకుపైభాగమున ఒకటి, క్రిందిభాగమున(పాత్రయొక్క ముఖభాగముదగ్గర)మరొకటియును త్రాళ్లనుకట్టేవారు.పాత్రయొక్క అంచులకు తగులకుండా మధ్యలోనే కవ్వము తిరుగుతున్నట్లు,కవ్వమును స్థంభమునకు కట్టేవారు.మరియు కవ్వముయొక్క మధ్యభాగములో,కవ్వమునకు రెండుమూడు చుట్లువేసి ఒకపొడుగాటి త్రాడును చుట్టి,ఆత్రాటి రెండుచివరలను,ఆ పెరుగును చిలుకు స్త్రీ తన రెండుచేతులతో (ఒక చేతిలో ఒక చివరను,రెండవ చేతితో మరొకచివరను)పట్టుకొని సవ్యాపసవ్యముగా(ఎడమ వైపుకు మరియు కుడివైపుకు)పర్యాయముగా లాగుతూ ఉండెడిది. పెరుగునకు సరిపడునట్లు పాత్రలో నీరుగూడా పోసి లాగగా లాగగా

కొంత సేపటికి పెరుగు మజ్జిగగా మారి,ఆ మజ్జిగపై వెన్న తేలియాడును.ఆ వె-న్నను మజ్జిగనుండి వేరుచేసి ఒకచిన్న పాత్రలో భద్రపరచేవారు.ఇట్లు కొన్ని రోజులు సేకరించిన వెన్నను మరిగించి నెయ్యిగామార్చి,దానిని యజ్ఞములందు గాని,మరియు భోజనాదులందుగాని ఉపయోగించేవారు.ఇది దధిమంథన ప్రక్రియ.



పై ప్రక్రియలోని సమగ్ర సామగ్రులలో పాత్రము అనునది చాలా ముఖ్యమైన సాధనము.ఆపాత్రము భంగమైనచో సర్వసాధనములకు వ్యర్థతగలుగును.ఫల రూప వెన్నయును ప్రాప్తించదు.అట్లే, జ్ఞానహేతువులైన సకల సాధనములలో భక్తిరూపమగు శ్రద్ధయనునది ముఖ్యసాధనముగనున్నది. దానిని దుస్సంగాది నాశకపదార్థములనుండి కాపాడుకొనుట ముముక్షువునకు కర్తవ్యమున్నది. శ్రద్ధ భంగమైనచో,దాని ఫలరూపమగు జ్ఞానముగాని,దాని పరిపాకావస్థయగు మోక్షముగాని దుర్లభమగును."**శ్రద్ధావాన్ లభతే జ్ఞానం, జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి**"(గీత.4-39)అను భగవద్వచనమును తెలిసికొనివచ్చాము గదా! అందువలన శ్రద్ధయనునది ప్రధాన సాధనముగా నెఱుగవలెను.

శ్రద్ధ విషయంలో శ్రీవ్యాసభగవానులుగూడ ఎంత చక్కగా బోధిస్తున్నారో చూడండి."**శ్రద్ధా చేతసః సంప్రసాదః।సాహి జననీవ కల్యాణీ యోగినం పాతి**"॥ (యోగ సూత్ర భాష్యము 1- 20)

ఆగమ అనుమాన ఆచార్యుల ఉపదేశమువలన చక్కగా తెలుసికొన్న తత్త్వ మునందు చిత్తముయొక్క అభిరుచి=ఇచ్ఛయే **శ్రద్ధ** యనబడును.ఇది వివేక

ఖ్యాతిరూపమగు యోగమును సాధించుటకు ఉపాయ క్రమములో మొదటిది మరియు ప్రధానమైనది.ఎందుకనగా,ఆ శ్రద్ధ కళ్యాణకారియగు సమర్థవంతమైన తల్లివలె,కుమార్గమున పడద్రోయు అనర్థములనుండి(వేలకొలది ప్రతిబంధక ములనుండి)సాధకున్ని కాపాడి భోగాసక్తి కలుగకుండ చేయును.శ్రద్ధగల వివే కార్థియగు సాధకునికి ఉత్సాహము గల్గును.దానిచే స్మృతి అనగా ధ్యానము గల్గును.స్మృతివలన చిత్తము విక్షేపరహితమై,యమనియమాదియుక్త సంప్ర జ్ఞాత సమాధి సిద్ధించును.సమాహిత చిత్తమున ఆత్మసాక్షాత్కారమునకు ఉపయుక్తమగు సత్త్వపురుష అన్యథాఖ్యాతిరూప వివేకజ్ఞానముదయించును.ఆ వివేక జ్ఞానముయొక్క పునఃపునః అభ్యాసముచే తత్తద్విషయములలో దోషదృ ష్టిగల్గి,సమస్త విషయములలో వైరాగ్యము,తద్వారా అసంప్రజ్ఞాత సమాధి ప్రా ప్తించును.ఇట్లు,కైవల్యమునకు హేతువైన సత్త్వపురుషాన్యథాఖ్యాతి పూర్వక ముగా నిరుద్ధమైన చిత్తము కృతకృత్యమగును.అనగా సంసారమునకు హేతు భూత కార్యక్షమత(అధికారము)ఉపక్షీణమగును.ప్రప్రథమమున శ్రద్ధయేలేనిచో సమస్తఉపాయ(సాధన)క్రమము నిరర్థకమగును.కావున,సకల జ్ఞానసాధన ములలో శ్రద్ధ అతిముఖ్యసాధనమని ముముక్షువులుగ్రహించి ఈశ్వరునియం దు,ఈశ్వరనిఃశ్వాసరూప వేదమునందు తదుపలక్షిత స్మృతీతిహాసపురాణాదు లందును,తదుపదేష్టయగు దేశికుడు(ఆచార్యు)నియందును,అట్లే మాతాపితరు లు,ఋషులు మున్నగు పూజ్యులయందత్యధికవిశ్వాసరూపశ్రద్ధను గల్గియుండ వలెను. సరే,

ఇప్పుడు శ్రీపూజ్యపాదులగు శంకరాచార్యులవారి“**సర్వ వేదాన్త సిద్ధాన్త సార సంగ్రహము**”అను గ్రంథములో **శ్రద్ధ** విషయంలో వారి ఉపదేశ ప్రదర్శన ప్రకార మును తిలకించెదము.

**శ్లో॥గురువేదాన్త వాక్యేషు బుద్ధిర్యా నిశ్చయాత్మికా ।**

**సత్యమిత్యేవ సా శ్రద్ధా నిదానం ముక్తిసిద్ధయే॥**

గురువాక్యములు,వేదాన్త వాక్యములును యథార్థములే యని వాటియందు దృఢవిశ్వాసముగల్గి యండుటయే **శ్రద్ధ** యనబడుచున్నది.ఇట్టి శ్రద్ధ యున్నచో ముక్తి సులభముగా సిద్ధించును. 209.

ఏ విషయమైనను శ్రద్ధ గలవారికి బోధించినపుడే సార్థకమగును.శ్రద్ధలేని వారలకు ఎంతగొప్ప విషయమును సులభముగా చెప్పినను నిరర్థకమగును. అందుకే ఉద్దాలకఋషి తన కుమారుడగు శ్వేతకేతువునకు పరమాత్మతత్త్వమును భోధించుచు“**శ్రద్ధస్వ సౌమ్యేతి**”(ఛాం.6-12-3)నాయనా! నీవీ విషయమున శ్రద్ధను వహింపవలయును సుమా! అని చెప్పెను. 210.

శ్రద్ధలేనివారు సన్మార్గమున ప్రవర్తింపనివారై శ్రేయస్సును పొందజాలకున్నారు.సామాన్యముగా జనులందరును పెద్దలవాక్యములందును,వేదాన్త వాక్యములందును విశ్వాసము లేనివారగుటచేతనే ముక్తిని పొందలేక,యెల్లప్పుడును సంసారసముద్రముననే మునిగితేలుచున్నారు. 211.

**శ్లో।।నద్యాం కీటా ఇవావర్తాదావర్తాన్తరమాశు తే।**

**వ్రజన్తో జన్మనో జన్మ లభన్తే నైవ నిర్వృతిమ్।।**(వే.పం.1-30)

తే=ఆ అశ్రద్ధాపరులగు అజ్ఞానిజీవులు,నదియందుబడిన పురుగులు ఒక సుడినుండి మరొకసుడినబడి ప్రవాహవేగములో అతిశీఘ్రముగా కొట్టుకుపోయిన చందమున అనేకజన్మపరంపరలరూప సుడిగుండంలోబడి సంసారప్రవాహంలో కొట్టుకుపోతున్నారు.

మనుష్యులకు దైవమునందును,వేదమునందును,గురువునందును,మన్త్ర మునందును,గంగాది పుణ్యస్థలములందును,మహాత్ములందును,ఓషధులందును,యెట్లెట్లు నమ్మకముండునో,అట్లట్లే కార్యసిద్ధియు కలుగుచుండును.కావున,శ్రద్ధయే కార్యసిద్ధికి ముఖ్యకారణము. 212.

శ్రుతి:—**అస్తీత్యేవోపలబ్ధవ్యస్తత్త్వభావేన చోభయోః।**

**అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి॥**(కఠ.2-3-13)

బుద్ధ్యాద్యుపాధి విశిష్టమైన ఆత్మ కార్యరూపమైన జగత్తునందు సద్రూపముతో ననుగతమై"**ఉన్నది**"యను అస్తిత్వభావముచేతను మరియు "**వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యం**"(ఛాం.6-1-4)అను శ్రుతిచే వికారము(కార్యము)వాగ్విలాసముమాత్రమే,ఘటశరావాది నామధేయముగూడ అంతియే. కారణభూతమగు మృత్తికమాత్రమే సత్యము.అను శ్రుత్యనుసారము నిర్వికారమై,అసంగమై,నిరూపాధికమైయున్న ఆత్మ(బ్రహ్మ)ఒక్కటియే సత్యము,తద్భిన్నమంతయు మిథ్య—అను యథార్థ జ్ఞానముచేతను ఆత్మ పొందదగియున్నది.ఈ సోపాధికాత్మాస్తిత్వభావము,నిరుపాధిక తత్త్వభావము(ఆత్మయాథాత్మ్య జ్ఞానము)ఈరెంటిలో సోపాధికాత్మ"**ఉన్నది**"అని ఆత్మోపలబ్ధినొందినవానికి,నిరుపాధికాద్వితీయాత్మస్వరూపము అభిముఖమగును.(ప్రత్యక్షమగును).తేటతెల్ల మగునని భావము.తొలుత సోపాధికాత్మజ్ఞానము గల్గినచో,పిదప అట్టివానికి నిరుపాధిక బ్రహ్మస్వరూపము విస్పష్టమగునని తెలియవలెను.(టీక-శ్రీ వ్యాసాశ్రమము వారిది).

పై కారక శ్రుతియు మరియు తదితర శ్రుతులు స్మృతులన్నియుగూడ బ్రహ్మపదార్థము"**ఉన్నది**"అని ప్రతిపాదించుచున్నవి.కావున,ఉత్తమస్థితిని పొందగో

రువారు శాస్త్రాచార్యవాక్యములందు **శ్రద్ధ** వహించి శ్రుతి,యుక్తి,అనుభవసిద్ధమైన బ్రహ్మము"**అస్తి=ఉన్నది**"నియే నిశ్చయించుకొనవలయును. 213.

మోక్షకామియైననూశ్రద్ధాయుక్తుడైనప్పుడే మానవుడు మోక్షమును పొందును. కావున,ముముక్షుజనులు శ్రీగురుదేవునివాక్యములందును,వేదాన్తవాక్యము లందును"**ఇదిఇంతియే,ముమ్మాటికి సత్యమే**"యను అవధారణపూర్వక దృఢవి శ్వాసము గల్గియుండాలి.214.

లోకంలో నిజము పలుకువాని మాటయందు ప్రతివానికి నమ్మకము గల్గు చుండును.అట్లే,"**అస్యమహతోభూతస్యనిశ్వసితమేతద్ఋగ్వేదో .......**(బృ.2-4-10) ఇత్యాది శ్రుతివాక్యములను పరిశీలించినచో,వేదములు పరమేశ్వరుని నిశ్వాస రూపములగుటచే నవి సత్యములనుటలో సంశయము లేదు.అట్లే,బ్రహ్మజ్ఞా నులగుసద్గురువుల**(గురుస్సాక్షాత్పరబ్రహ్మ)**పరమేశ్వరస్వరూపులగుటచే వారు బోధించు వాక్యములుగూడ యథార్థములే యగును.కావున,బుద్ధిమంతులగు వారు గురువేదాన్తవాక్యములందు తప్పక విశ్వాసము గల్గియుండవలెను. 215 & 216.

ఇపుడు శ్రద్ధకు సంబంధించి అన్యత్ర చెప్పబడిన విషయాలను అవలో కించెదము."**శ్రద్దధదేవ మనుతే,శ్రద్ధాత్వేవ విజిజ్ఞాసితవ్యేతి**"(ఛాం. 7-19-1) ఎప్పుడు మనుష్యుడు శ్రద్ధగల్గియుండునో,అప్పుడే అతడు మననము చేయగలడు.శ్రద్ధ లేకుండా మననముచేయలేడు.అందువలన విశేషముగా శ్రద్ధనే జిజ్ఞాస చేయ వలెను.

ఈశ్రద్ధ యనునది భక్తిరూప భావవిశేషము."**హృదయే హ్యేవ శ్రద్ధా ప్రతిష్ఠితా భవతి**"(బృ.3-9-21) ఇది హృదయమందే ప్రతిష్టితమై ఉన్నది.

**శ్లో॥న దేవో విద్యతే కాష్ఠే న పాషాణే న మృన్మయే।**

**భావేషువిద్యతే దైవస్తస్మాద్భావోహి కారణమ్॥**(చాణక్యనీతి దర్పణము 8-12)

దేవుడు కాష్ఠము(కట్టె)యందుగాని,పాషాణము(బండరాయి)యందుగాని, మృత్తికా=మట్టియందుగాని;అనగా కాష్ఠనిర్మితములు,పాషాణ నిర్మితములు లేక మట్టితోతయారుజేయబడిన విగ్రహాలలోలేడు.మరెక్కడున్నాడు?నిశ్చయముగాభావమునందే ఉన్నాడు.కావున,భావనయే(విశ్వాసమే)సమస్తమునకు హేతువగుచున్నది.

**శ్లో॥శ్రద్ధయా భజతః పుంసః శిలాపి ఫలదాయినీ।**

**మూర్ఖోఽపిపూజితో భక్త్యాగురుర్భవతిసిద్ధిదః॥**(స్కం.పురా.బ్రహ్మోత్తరఖం.17-4)

సకలజనులకు శ్రద్ధయే తల్లివలె హితం చేకూరుస్తుంది.నరులకు శ్రద్ధ ఉంటే భూలోకస్వర్గలోకాల్లో సిద్ధికలుగుతుంది.శ్రద్ధగా సేవిస్తున్న పురుషునికి రాయి గూడ ఫలమిస్తుంది.గురు ద్రోణాచార్యుని మృన్మయమూర్తియందు శ్రద్ధతో గురుభావమును పెట్టుకొని **ఏకలవ్యుడు ధనుర్విద్యలో నిపుణుడయ్యాడు.**అట్లే,భక్తితోపూజింపబడిన మూర్ఖుడుగూడ సిద్ధినిచ్చే గురువవుతాడు.బాగా శ్రద్ధతోపఠింపబడినమంత్రము శాస్త్రోక్తముకాకపోయినను ఫలమిస్తుంది.శ్రద్ధతో పూజింపబడిన దేవుడు నీచుడికిగూడా ఫలమిస్తాడు.దుష్టులైన ఎంతోమంది రాక్షసులు గూడ శ్రద్ధతో కఠోర తపస్సులుజేసి శివుడు, బ్రహ్మదేవుడు మున్నగువారిని ప్రసన్నులను జేసికొని వరములను పొందిరి.

**శ్లో॥మన్త్రే తీర్థే ద్విజే దైవే దైవజ్ఞే భేషజే గురౌ।**

**యాదృశీభావనాయత్రసిద్ధిర్భవతితాదృశీ॥**(స్కం.పు.బ్రహ్మోత్తరఖం.17-8)

మంత్రము,పుణ్యతీర్థము,బ్రాహ్మణుడు,దేవుడు,జ్యోతిష్కుడు,వైద్యుడు,గురువు—వీరిపట్ల యెట్లెట్లు నమ్మకంగల్గిఉంటే,అట్లట్లే కార్యసిద్ధి గల్గును.

**శ్లో॥అశ్రద్ధా పరమం పాపం శ్రద్ధా పాప విమోచినీ॥**(మ.భా.శాం.264-15)

అశ్రద్ధ అన్నిటికంటె గొప్ప పాపము.శ్రద్ధ పాపము నుండి పురుషుణ్ణి విడుదల చేయును. "**శ్రద్ధయా దేయం, అశ్రద్ధయాఽదేయం**"(తై.ఉ.1-11-3)

**శ్లో॥అశ్రద్ధయా కృతా పూజా దానం యజ్ఞస్తపో వ్రతమ్।**

**సర్వం నిష్ఫలతాంయాతి పుష్పం వన్ధ్యతరోరివ॥**(స్కం.పు.బ్రహ్మో. ఖం.17-6)

**శ్లో॥అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్।**

**అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ॥**(గీత.17-28)

**శ్లో॥శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥**(17-13)

**శ్లో॥అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।**(గీత.4-40)

దేవతలకు,బ్రాహ్మణులకు,అతిథులకు,గురువులకు ఏదేని సమర్పించుకొన దలచినచో(ఇవ్వదలచినచో)శ్రద్ధతో సమర్పించుకోవాలి.కాని అశ్రద్ధతోగాదు.అశ్రద్ధగాచేసిన పూజ,దానం,యజ్ఞం,తపస్సు,వ్రతం,హోమం—ఏదేది చేయబడునో,అది నిష్ఫలవృక్షము(గొడ్డుచెట్టు)పూసిన పుష్పములవలె వ్యర్థమగును.అసత్కార్యములగును.అట్టి అసద్వాచ్యములగు కర్మలకు శరీరత్యాగానంతరము ప్రయోజనములేదు.ఈలోకమునందును ప్రయోజనములేదు.యజ్ఞములు(ఉపలక్షణముగా సకలసత్కార్యములు)శ్రద్ధలేకుండా చేసినచోనవి తామసయజ్ఞములనబడును.కళాయిలేని రాగిపాత్రలోవండిన పులుసువలె,ఉషరభూమిలో

(ఎడారిలో)నాటిన బీజములవలె వ్యర్థములైపోవును.గురూపదిష్ట వాక్యార్థము ను తెలిసికొననివాడును,గురువుచెప్పెడు వాక్యములను శ్రద్ధతో వినినివాడును, గురువుచెప్పెడువాక్యార్థమునందు సందేహముతోగూడినమనస్సు గలవాడును నశించుచున్నాడు.

అట్లే,నారదీయ పురాణము, పూర్వభాగము, నాల్గవ అధ్యాయములో సనక ఋషి నారదులవారికి ఉపదేశిస్తూ—హేనారద!శ్రద్ధాపూర్వకముగా నాచరించబ డు సకలధర్మములు మనోవాంఛిత ఫలములనొసంగును.శ్రద్ధచేతనే సర్వకార్య సిద్ధి గల్గును.శ్రద్ధచేతనే భగవంతుడు సంతుష్టినొందును.శ్రద్ధాళుపురుషునికే ఐ హికసంపదలు చేకూరును.పారలౌకిక భోగములు ప్రాప్తించును.అలౌకిక మోక్ష ముగూడ సిద్ధించును.గో,భూ,హిరణ్యదానములచేతగాని,ఉగ్రమైన తపస్సుచేత గాని,అశ్వమేధాది యాగములచేతగాని,బహుదక్షిణలచేతగాని—భగవంతుడు సంతృప్తినొందడు.శ్రద్ధారూప భక్తిచేతనే శ్రీహరి సంతుష్టుడగును.భక్తిలేని తపోయ జ్ఞ దానాదులచే కేవలము శరీరశోషణరూప శ్రమమాత్రము మిగులును.కోరిన కోర్కెలనీడేర్చునదియు,సాక్షాన్మోక్షప్రదమునునగు కామధేనువువంటి,అమృత మువంటి హరిభక్తియుండగా,ఈ అజ్ఞజనులు సంసారమను గరళము(విషము) ను తాగుచున్నారు గదా! అహో! ఏమి-వీరి దౌర్భాగ్యము.

**"శ్రద్ధా ధనం శ్రేష్ఠతమం ధనేభ్యః"**(అశ్వఘోష-సౌందరానంద.5-24)

సకల ధనసంపత్తులలో శ్రద్ధారూప ధనమే శ్రేష్ఠతమమైనది. దానికంటె గొప్ప ధనమేదియును లేదు.

**శ్లో॥సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।**

**శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః॥** (మ.భా.శాన్తిపర్వము. 164-17)(గీత.17-3)

ప్రాణులకు పూర్వజన్మసంస్కారజనితమగు శ్రద్ధ సాత్వికము,రాజసికము మరియు తామసము అని మూడువిధములుగానున్నది.ఈ శ్రద్ధ వారి యన్తః కరణానురూపముగనే కలుగుచుండును.జీవుడు శ్రద్ధా స్వరూపుడగుచు,యెవ్వ డే గుణోత్కర్షతోనున్నాడో,ఆయాగుణానురూపమగు శ్రద్ధ గలవాడగుచున్నాడు. అనగా సాత్వికగుణోత్కర్షగలవాడగుచో సాత్విక శ్రద్ధస్వరూపుడగుచున్నాడు. రాజసిక(రజో)గుణాధిక్యతగలవాడగుచో రాజస శ్రద్ధామయుడగుచున్నాడు.తా మసికగుణముచే గరిష్ఠుడగుచో తామసికగుణానుగుణమగు శ్రద్ధగలవాడగు చున్నాడు. ఒకడు తినెడు ఆహారమును,చెప్పేమాటను,చేయుపనిని చూచినచో, అతడు సాత్వికుడా?రాజసుడా?లేక తామసుడా?యని తెలుసికొనవచ్చును. వాని యన్తఃకరణమున యేయేగుణములు గల్గియుండునో,వాడాలాగుననే ప్రవ ర్తించును.కాని,వేయి చెప్పినను మరొక విధంగా ప్రవర్తించడు. మరియు,

శ్రద్ధగలవాడు భగవంతునికి ప్రీతిపాత్రుడుగుచున్నాడు.ఈ విషయమును స్వయముగా వాసుదేవుడే చెప్పియున్నాడు.

**శ్లో॥యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా।**

**శ్రద్ధా వాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః॥**(గీత. 6-47)

ఓఅర్జునా!ఏపురుషుడు పుణ్యకర్మలయొక్క పరిపాకవిశేషముచేత ఉత్పన్న మైన ప్రీతివశముచే ప్రాప్తమైన పవిత్రాన్తఃకరణమును భగవాన్ వాసుదేవుడనగు నాయందే సమర్పించినవాడై,పూర్వ సంస్కారవశముచేతను,సత్పురుషుల సాంగత్యముచేతను నాయొక్క భజన(చింతన)యందే అత్యంత శ్రద్ధాయుక్తుడై,

ఈశ్వరులకుగూడ ఈశ్వరుడనైన సగుణ నిర్గుణస్వరూప నారాయణుడనగు నా యొక్క నిరన్తరచిన్తనజేయునో, అనగా"**శ్రీకృష్ణుడు ఒక మనుష్యుడు,ఇంద్రుడు సూర్యుడు యముడు మున్నగు ఈశ్వరులతో సమానమైనవాడు**"అను యీప్ర కారమగు భ్రమను పరిత్యజించి నిరన్తరము నాయొక్క చిన్తనయే చేయుచుండు నో,అట్టి వాడు,వసు రుద్ర ఆదిత్యాది అన్యదేవతలను భజించు సకలయోగుల కంటెను యుక్తతముడని—పరమేశ్వరుడనగు నాయొక్క అభిమతము.నాయం దు భక్తిలేని యోగిపురుషులకంటె నాభక్తుడు అత్యన్త శ్రేష్టుడు,అతిశయ యు క్తుడు.అతడు నాకు ఇష్టుడు,నాచే అంగీకరింపబడినవాడు—అని తాత్పర్యము.

**శ్లో॥యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।**

**శద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥**(గీత. 12-20)

"**ధర్మాదనపేతంధర్మ్యం చ తదమృతం చ తత్**"ధర్మము నుండి తొలగనిది ధర్మ్యం.అమృతత్వానికి హేతువుగాన అమృతం,ధర్మ్యము అమృతమూ అయి నది."**అద్వేష్టా సర్వభూతానాం**"(గీత.12-13)నుండి "**భక్తి మాన్మే ప్రియో నరః**"(గీత. 12-19)వరకు చెప్పబడినది అయిన దీనిని,ఏసన్యాసి ముముక్షువులు శ్రద్ధగల వారై,వెనుక చెప్పబడిన అక్షర స్వరూ పుడనైన,నేనే—నిరతిశయమైన(చాలా గొప్పదైన)గతిగాగలవారై ఆచరిస్తారో,మద్భక్తులైన అనగా పరమార్థ జ్ఞానరూప మైన ఉత్తమమైన భక్తిని ఆశ్రయించినవారు నాకు అత్యంతప్రియులు.మత్ప రాయణులై నిత్యము నిరన్తతరము నిరుపాధికబ్రహ్మస్వరూపుడనగు నాయొక్క చింతనజేయు వారు"**ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః**"(గీత. 7-17)నాకు అత్యంతప్రియులు వారికి(జ్ఞానులకు)నేను అత్యంత ప్రియుడను. ఎందుకనగా?శ్రద్ధాపూర్వకముగా అనుష్ఠింపబడు"**అద్వేష్టుత్వాది**"దర్మ్యామృత

ము పరమేశ్వరుడగు భగవాన్ విష్ణువునకు అత్యంత ప్రియమున్నది.ఇది జ్ఞానులకు స్వభావసిద్ధ లక్షణమే అయినప్పటికి,విష్ణువుయొక్క పరమ పదమును పొందగోరు ఆత్మతత్త్వజిజ్ఞాసువులచే,ఆత్మజ్ఞానమునకు ఉపాయరూపమైన యీ ధర్మ్యామృతము ప్రయత్నపూర్వకముగా అనుష్ఠేయమై యున్నది.

సోపాధిక బ్రహ్మధ్యానము పరిపక్వమై నిరుపాధికబ్రహ్మానుసంధానముచే యునటువంటి,అద్వేష్టృత్వాది ధర్మములచే యుక్తుడై,శ్రవణ మనన నిధిధ్యాసనములను అభ్యసించు ముఖ్యాధికారికి,వేదాన్తవాక్యార్థరూప తత్త్వసాక్షాత్కారము కలిగే సంభమున్నది.కావున,దానిచే వారికి ముక్తి ఉపపన్నమగు(సిద్ధించు) చున్నది.అందువలన శ్రద్ధాయుక్తుడై ధర్మ్యామృతమును అనుష్ఠించు ముముక్షువు భగవంతునికి ప్రీతిపాత్రుడై,కృపాపాత్రుడై క్రమేణ పునరావృత్తిరహిత మోక్షధామమును చేరుకొనుచున్నాడు. కనుక,భగవద్భక్తిరూప"శ్రద్ధ"ను—మోక్షమునుగోరువారు అవశ్యముగా సంపాదించుకోవాలి.

**తస్మాత్సర్వేషామధికారిణామనధికారిణాం భక్తియోగ ఏవ ప్రశస్యతే। భక్తియోగో నిరుపద్రవః।భక్తియోగాన్ముక్తిః।బుద్ధిమతామనాయాసేనాచిరా దేవ తత్త్వజ్ఞానం భవతి।తత్కథమితి।భక్తవత్సలః స్వయమేవ సర్వేభ్యో మోక్షవిఘ్నేభ్యో భక్తినిష్ఠాన్సర్వాన్పరిపాలయతి।సర్వాభీష్టాన్ప్రయచ్ఛతి।మోక్షం దాపయతి।చతుర్ముఖాదీనాం సర్వేషామపి వినా విష్ణుభక్త్యా కల్పకోటిభిర్మోక్షో న విద్యతే।కారణేన వినా కార్యం నోదేతి।భక్త్యా వినా బ్రహ్మజ్ఞానం కదాపి న జాయతే।తస్మాత్త్వమపి సర్వోపాయాన్పరిత్యజ్య భక్తిమా శ్రయ।భక్తినిష్ఠో భవ।భక్తినిష్ఠో భవ।భక్త్యా సర్వసిద్ధయః సిధ్యన్తి।భక్త్యాఽసాధ్యంనకిఞ్చిదస్తి।**(త్రిపాద్విభూతిమహానారాయణోపనిషత్ అష్టమోఽధ్యాయః)

అందువలన,సకలఅధికారులకు మరియు అనధికారులకు భక్తియోగమే ప్రశస్యమైనది.భక్తియోగము నిరుపద్రవము.భక్తియోగముచేతనే ముక్తి గలుగును. బుద్ధిమంతులకు అనాయాసముగా అతిశీఘ్రముగా తత్త్వజ్ఞానము కలుగును. అదెట్లనగా?భక్తినిష్ఠులగు భక్తులను భక్తవత్సలుడగు పరమేశ్వరుడు స్వయముగా సమస్తమోక్షవిఘ్నములనుండి కాపాడు ను.సర్వాభీష్టములనొసంగును. మోక్షమును ప్రసాదించును.విష్ణుభక్తిలేకుండా బ్రహ్మాదులకైనను కోటికల్పములకుగూడ ముక్తి లభించదు.కారణం లేకుండా కార్యోత్పత్తిగాదు.అట్లే భక్తిలేకుండా బ్రహ్మజ్ఞానం ఎప్పుడుగూడ ఉదయించదు.అందువలన,నీవు సకలఉపాయములనువదలి భక్తి నాశ్రయించుము.భక్తిచే సర్వసిద్ధులు ప్రాప్తించును.భక్తిచేత అసాధ్యమేమియును లేదు.కావున, భక్తినిష్ఠుడవు కమ్ము.భక్తినిష్ఠుడవు కమ్ము. *ఇతి శ్రద్ధా నిరూపణమ్.*

—:39.**సమాధానమ్:**—

**"నిగృహీతస్యమనసఃశ్రవణాదౌ తదనుగుణవిషయేచ సమాధిఃసమాధానమ్"** (వే.సా.)శబ్దాదివిషయములనుండి నిగ్రహింపబడిన అంతఃకరణమును వేదాన్తవాక్య శ్రవణము,మననము మరియు నిదిధ్యాసనమునందు ప్రవేశపెట్టి, నిరన్తరము మహావాక్యార్థ చింతనముచేయుట,తదుపకారకములగు అమానిత్వాది జ్ఞానసాధనములందు,గురుశుశ్రూష,గ్రంథసంచయము మరియు వాటినిరక్షించుట మున్నగు శ్రవణాద్యనుగుణ విషయములందును మనస్సను సంలగ్నము(ఏకాగ్రము)చేయుటను **"సమాధానము"** అంటారు

**"దణ్డమాచ్ఛాదనంచైవ కౌపీనంచ పరిగ్రహేత్,శేషంవిసృజేత్"**ఆరుణికోపనిషత్తుచెప్పినట్లుగావివిదిషాసంన్యాసి దండము,ఆచ్ఛాదనము(వస్త్రము),కౌపీన

ము—వీటికంటె వ్యతిరిక్తము సర్వమును సంన్యాస కాలములోనే పరిత్యజించి నందువలన,పైనపేర్కొనినరీతిగా శ్రవణాదులకుపకరించు గ్రంథసేకరణతప్ప,సుఖసాధనములని భావించి భ్రమచే రుచికరమగు అన్నపానాదులను,వాతానుకూల ఆరామములు,మఠములు మున్నగునవి సంగ్రహించరాదు.

అయితే,ఈఆశ్రమములు,మఠములు మొదలగునవి విద్వత్సంన్యాసులకు అవసరమేమోయని శంకించవలదు.వారికిగూడ శాస్త్రముచే నిషేధింపబడినవి. కాని,సాధకులకు(ముముక్షువులకు)ఆధ్యాత్మవిద్యోపదేశమునకు,గ్రంథరచనాది లోకోద్ధరణకార్యములనుద్దేశించిమాత్రము గురుస్థానమునలంకరించిన జ్ఞానిమహాత్ములు ఆశ్రమాలను నిర్వహించవచ్చును.అన్యోద్దేశముతో కాదు.వసిష్ఠ,వాల్మీక్యాదులు ఆశ్రమాలను నిర్వహించినట్లుగా ఇతిహాస పురాణాదులు ప్రమాణములుగా ఉన్నాయిగదా!ఈ కలియుగంలోగూడ శ్రీఆద్యగురు శంకరాచార్యులవారు గూడ దేశము నలుమూలలందు ఆశ్రమాలను నెలకొల్పిన విషయము సుప్రసిద్ధము.

ఇపుడు '**సమాధాన**' విషయంలో శ్రీ శంకరుల వారేమి బోధించారో శ్రద్ధతో వీక్షించెదము.

**శ్లో॥సమ్యగాస్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా।**

**తత్సమాధానమిత్యుక్తం న తు చిత్తస్య లాలనమ్॥**(వి.చూ.27)

శ్రద్ధగలవానికే సమాధానము బాగుగా కుదురుతుంది,గావున దాని తరువాత సమాధానమును విశదీకరించుచున్నారు.స్వలక్ష్యమునందు మనస్సును స్థిరముగనుంచుట శమము అని శమలక్షణ నిరూపణావసరమున తెలుసికొని వచ్చాము.ఇక్కడ సమాధానమునుచెప్తూ—"**నిరుపాధిక నిర్గుణ శుద్ధ బ్రహ్మమునందు ఎల్లప్పుడు బుద్ధిని చక్కగా నిలుపుట**"అని వ్యాఖ్యానించారు.శమ లక్షణ

మునకు సమాధాన లక్షణమునకు ఎక్కువగా భేదమున్నట్లు కనబడుట లేదు. అయినను—"**మాటిమాటికిని దోషములను చూచుచు విషయములనుండి విరక్త మైన మనస్సు తన లక్ష్యమునందు స్థిరముగనుండుట**"యనునది శమము. దీనిని సంపాదించుటకు అనగా సంకల్పవికల్పాత్మకమగు మనస్సును స్థిరము గనుంచు కొనుటకు—

**శ్లో॥యతోయతో నిశ్చరతి మనశ్చఞ్చలమ స్థిరమ్।**

**తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్॥**(గీత.6-26)

చపలము,అస్థిరమునగు మనస్సు యేయేమార్గములద్వారా బయటకు పోవుటకు ప్రయత్నించుచుండునో,ఆయామార్గములనుండి అడ్డుపెట్టి దానిని ఆ-త్మయందే(తనస్వరూపమునందే)వశమగునట్లు చేయవలెను—అని శ్రీమద్భ గవద్గీతలో చెప్పబడినరీతిగా ప్రయత్నవిశేషము అపేక్షి తమైయున్నది.కావున నే,ఇచ్చట(సమాధానమున)"**నిశ్చయాత్మకమగు బుద్ధిని ఎల్లప్పుడూ శుద్ధబ్ర హ్మమునందు స్థిరముగా నిలుపవలెను**"అని చెప్పుటచే,ప్రకృతమున అంతఃకర ణము సంకల్పవికల్పరహితము కావలెనని చెప్పుట జరిగినది.అందుకే సంక ల్పవికల్పాత్మకమగు అంతఃకరణవృత్తి విశేషమగు మనఃశబ్దమును ప్రయోగింప క, "**బుద్ధేః శుద్ధే బ్రహ్మణి**"అని నిశ్చయాత్మక అంతఃకరణవృత్తి విశేషమగు బుద్ధి శబ్దము ప్రయోగింపబడినది.మరియు ఇచ్చట"**శుద్ధే బ్రహ్మణి**"అని సర్వోపాధి వినిర్ముక్తమగు నిర్గుణబ్రహ్మమునందు నిలుపవలెనని చెప్పబడినది.శమము నుగూర్చి చెప్పునపుడు"**స్వలక్ష్యేనియతావస్థా**"అనుటచే సగుణవస్తువుపై స్థిర ముగనున్నను మనస్సు శాంతించినదని చెప్పుటకవకాశమున్నది.శమము సాధనమైతే సమాధానము దానిఫలము.అనగా శమముయొక్క పరిపక్వావ

స్థయే సమాధానమగును.లోకంలో పిల్లలు ఏదైనా వస్తువునుకోరి మారాము చేస్తూ ఎక్కువగా యేడ్చినపుడు వారికికావలసిన వస్తువునిచ్చి ఊరడింతురు. ఆవిధముగ మనస్సునకు యథేష్టముగా విషయమార్గమున ప్రవర్తించు అవకాశమిచ్చినచో అది సమాధానము కాజాలదని బోధించుటకై“**న తు చిత్తస్య లాలనమ్**”అని చెప్పారు. లేక,

విక్షేపదోషనివృత్తికై చిత్తైకాగ్ర్యర్థము ఉపానము ఏదైతే చెప్పబడినదో,అది సగుణబ్రహ్మము లేదా తత్ప్రతీకాది సూచకముగా తెలిసికోవాలి.ఇక్కడ ఏదైతే చిత్తైకాగ్రత చెప్పబడుచున్నదో ఇది నిర్గుణబ్రహ్మమునందు చిత్తముయొక్క తత్పరత విషయమని—ఇంత భేదమును తెలియాలి.

**శ్లో॥శుభా శుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనా సరిత్।**

**పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి॥**

**శ్లో॥అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయ।**

**సర్వం మనః పురుషార్థేన బలేన బలినాం వర॥**

**శ్లో॥అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్।**

**జన్తోశ్చిత్తం తు శిశువత్తస్మాత్తచ్చాలయేద్బలాత్॥**

**శ్లో॥సమతా సాన్త్వనేనాశు న ద్రాగితి శనైః శనైః।**

**పౌరుషేణైవ యత్నేన పా(లా)లయేచ్చిత్త బాలకమ్॥**(శ్రీయోగవాసిష్ఠము ముముక్షు వ్యవహార ప్రకరణము9-30నుండి33)(ముక్తికోపనిషత్.2-5 నుండి 2-7)

సన్మార్గము మరియు అసన్మార్గములద్వారా ప్రవహించుచున్న వాసనారూ

ప నదిని తన పురుషప్రయత్నముచేఅశుభమార్గమునుండి తొలగించి శుభమార్గమునందు ప్రవేశపెట్టవలెను.బలవంతులలో శ్రేష్ఠుడవగు నో శ్రీరామచంద్రా!భ్రమచే అసన్మార్గమున తిరుగాడుచున్న మనస్సును నీ పురుషప్రయత్నముచేత బలపూర్వకముగా శుభమార్గమున ప్రవర్తింపజేయుము.30 & 31.

చిత్తరూప నది యిరువైపుల అనగా పాపము వైపుకు మరియు పుణ్యము వైపుకు ప్రవహించును.ఈ రెండు ప్రవాహములలో పాపము వైపుకు ప్రవహించు స్రోతస్సును నిరోధించినచో,ఆ చిత్తనది-రెండవదగు పుణ్య స్రోతస్సులో ద్విగుణీకృతమై ప్రవహించును. యోగశాస్త్రము (1-12) లో చెప్పబడిన రీతిగా—

అశుభకర్మలనుండి(పాపమార్గమునుండి)నివారింపబడిన చిత్తబాలకుడు శుభకర్మలందు(పుణ్యమార్గమునందు)వెళ్ళును.పుణ్యమార్గమునుండి నివారించినచో,పాపమార్గమున వెళ్ళును.కావున,పురుష ప్రయత్నముచే చిత్తమును పాపమార్గమునుండి తొలగించవలెను.ఈప్రకారముగా పూర్వోక్తక్రమముచే చిత్తబాలకున్నిరాగాదిదోషములనుండి శీఘ్రముగాదూరముజేసి,స్వాభావిక సమత్వమునందు స్థాపించి,దోషరహితమొనర్చి మెల్లమెల్లగా లాలించి నిరోధరూప పురుషప్రయత్నముచే ఆత్మస్వరూపమునందు స్థిరపరచవలెను. 32,33.

ఇట్లు(వాసిష్ఠోక్తప్రకారమున)చాలనము లేదా లాలనము శమాదిసాధనముగ ప్రారంభమున అపేక్షితమైయున్నది.కాని,ఫలరూపమగు సమాధానావస్థలో దాని ఆవశ్యకతలేదు.శమాదులను సంపాదించుకొనెడు సమయమునచేసిన ప్రయత్నముచేతనే మనస్సులోని బాహ్యావాసనలన్నియు క్షీణించినవిగాన ఇపుడు ఆలాలనము(అభ్యాసప్రయత్నములు)లేకున్నను మనస్సును సగుణమునుండి తప్పించి నిర్గుణస్వరూపమునందు నిలుపుట అనునది ఒక్కటియే

**అపేక్షితమై యున్నది.**(వి.చూ. 27 శ్లోకము-టీక,శ్రీ చంద్రశేఖర భారతి స్వాములవారు-శృంగేరి)

**శ్లో॥శ్రుత్యుక్తార్థావగాహాయ విదుషా జ్ఞేయవస్తుని।**

**చిత్తస్యసమ్యగాధానం సమాధాన మితీర్యతే॥**(సర్వవేదాన్త సిద్ధాన్త సారసంగ్రహము.217)

సాధకుడగు పండితుడు శ్రుతులందు చెప్పబడిన బ్రహ్మసాక్షాత్కారము కొఱకు చిత్తమును అనాత్మాకారవృత్తిరహితముగ ఆత్మస్వరూపమున నిలుపుటయే సమాధానమని చెప్పబడుచున్నది.

ఏదేని ఒక కార్యమును సాధించవలెనన్న చిత్తమును దానియందే సంలగ్నమొనర్చవలయును.అట్లుకానిచో కార్యము సిద్ధించదు.ప్రయత్నము వృథాయగును.శ్రమమాత్రమే మిగులును.కావున,ప్రకృతమున మోక్షమను పురుషార్ధముసిద్ధించుటకు చిత్తమును బ్రహ్మమునందేసంలగ్నము(ఏకాగ్రము)చేయాలి. ఆచిత్తైకాగ్రతయే మోక్షరూప పురుషార్థసిద్ధికి నియమిత కారణమగును.ఇంకొక మార్గములేదు.సమ్యగ్ప్రకారముగా ఏకాగ్రత కుదిరినప్పటికి,ఒకవేళ చిత్తమునందు లేశమాత్రమైనను కాలుష్యమున్నచో మోక్షమును పొందుటకుచేయు ప్రయత్నమంతయును వ్యర్థమగును. 218.

లక్ష్యమును భేదించుటకై పురుషుడు తన చిత్తమును,దృష్టిని మరియు హస్తములను లక్ష్యమువైపుకు ఏకాగ్రము చేయవలెను.లక్ష్యమును భేదించుటలో ఏమాత్రము ఏమఱుపాటు(అజాగ్రత్త)కలిగినా,బాణమునిష్ఫలమగును.ప్రయత్నము వ్యర్థమగును.అట్లే,బ్రహ్మరూపలక్ష్యమునందు చిత్తమును ఏకాగ్రపరచుటలో ఏమాత్రము అసావధానత ఏర్పడినను ప్రయత్నమంతయు వృథాయగును. 219. **అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్।**(ముం.2-2-4)

కార్యసిద్ధికి చిత్తస్థైర్యము ముఖ్యకారణముగాన ముముక్షుజనులు మోక్షప్రాప్తికై చిత్తైకాగ్ర్యమును తప్పకసంపాదించుకొని దానినేనిరన్తరము అనుష్ఠింపవలయును.అందుకు రెండు కారణములున్నవి.ఒకటి-అశాశ్వతములగు విషయభోగములందు తీవ్రమగువిరక్తియు,రెండవది-శాశ్వత సుఖరూపమగు మోక్షమునందు దృఢవాంఛయు ఉన్నచో చిత్తమాత్మయందు స్థిరపడును. 220, 221.

**“జిజ్ఞాసాఅనన్తరమప్యపేక్షితత్వంసాధనస్యఅన్తరఙ్గత్వమ్,జిజ్ఞాసాఉత్పత్తిమాత్ర అపేక్షితత్వంబహిరఙ్గత్వమ్”**(సంక్షేపశారీరకము-నృసింహాశ్రమ్.3-329)బ్రహ్మజిజ్ఞాస కలిగిన తరువాతగూడ అపేక్షితమగు సాధనము అంతరంగ సాధనమగును.జిజ్ఞాసను కలిగించుటకు(ఉత్పత్తికి)మాత్రము అపేక్షితమగు సాధనము బహిరంగ సాధనమగును.

**“తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసానాశకేన”**(బృ.4-4-22)అను వాక్యముచే వివిదిషాఉత్పత్తికొఱకు యే యజ్ఞాదిసాధనములు వినబడుచున్నవో,అవన్నియు వివిదిషకు పూర్వభావిసాధనములున్నందున,జ్ఞానసాధన సమకాలములోలేనందున జ్ఞానమునకుబహిరంగ సాధనములుగా తెలియవలెను.మరియు,**“తస్మాదేవంవిచ్ఛాన్తో దాన్త ఉపరతిస్తితిక్షుఃసమాహితోభూత్వాత్మన్యేవాత్మానం పశ్యేత్”**(బృ.4-4-23); **“ఆత్మా వాఽరేద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః”**(బృ.2-4-5;4-5-6); **“తస్మాద్బ్రాహ్మణఃపాణ్డిత్యంనిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్,బాల్యం చ పాణ్డిత్యం చ నిర్విద్యాథ మునిః”**(బృ.3-5-1)పాణ్డిత్యం = శ్రవణం,బాల్యం = మననం;మౌనం = నిదిధ్యాసనము. ఇత్యాది శ్రుతివాక్యములు బ్రహ్మాత్మజ్ఞాన హేతువులుగా వినబడుచున్నవి.ఇవి జ్ఞానోదయ పర్యన్తము అపేక్షితములై,జ్ఞానోత్పత్తికి సాక్షాత్(దగ్గర)సాధనములున్నందున శమదమాదులు అంతరంగసాధనములుగాతెలియవలెను.యజ్ఞాదు

లు బహిరంగములు.ఉపరోక్త శ్రుతిప్రమాణములచే అంతరంగ, బహిరంగములని రెండువిధములగు సాధనములు నిర్ణయింపబడినవి.అనగా స్వయముగా(సాక్షాత్)కార్యమును సాధించుకారణములు(సాధనములు)అంతరంగములనియు, పరంపరగా అనగా మరియొకదానిని పుట్టించుట(కలిగించుట)ద్వారా కార్యసాధకములగునవి బహిరంగసాధనములనియు వ్యవహరింపబడుచున్నవి.

కావున,ప్రకృతమందు **శమదమాదులు బ్రహ్మాకారవృత్తి** కలుగుటకు సాక్షాత్సాధనములగుటచే నంతరంగములనియు,చిత్తశుద్ధిని కలిగించుటద్వారా **బ్రహ్మచర్యాదులు,యజ్ఞదానాదులు బ్రహ్మాకారవృత్తిని(**అహంబ్రహ్మాస్మియను జ్ఞానమును)కలిగించుటకు సాధనములగుటచే బహిరంగసాధనములనియు చెప్పబడుచున్నవి.బహిరంగ సాధనములకంటె అన్తరంగసాధనములు ముఖ్యమైనవిగాన ముముక్షుజనులు శమదమాదులనే నిరన్తరమభ్యసించుచుండవలెను.యుద్ధమున జయమునొందుటకు ధైర్యమన్తరంగసాధనము.బాణము మున్నగునవి బహిరంగ సాధనములు.ధైర్యములేని యుద్ధభటుని శస్త్రాస్త్రసంపద వ్యర్థమగునట్లు,శమాది షట్కములేని ముముక్షువుయొక్క శ్రవణాదులునూ వ్యర్థములే యగుచున్నవి.(222 నుండి 224 వరకు)ఈఅన్తరంగ బహిరంగ సాధనముల విషయమై ఇంకా విస్తారముగా తెలియగోరువారు శ్రీవిచారసాగరము ప్రథమ తరంగమున గనందగును. *ఇతి సమాధాన నిరూపణమ్.*

ఎట్లు అనేకమణులు గ్రుచ్చబడిన బంగారుమాలను ఒకేఆభరణముగా పిలుస్తారో,అట్లే పరస్పరసహకారములగు శమదమాది ఆరుసాధనములయొక్క సముదాయరూపమగు షట్ సంపత్తినిగూడ శాస్త్రకారులు ఒకేసాధనముగా పరిగణించెదరు.శమాది షట్(ఆరు)సాధనములయొక్క పరస్పర సహకారిత్వము యీక్రింది విధముగా నున్నది.

1.(a)మనోనిరోధరూప శమములేకుండా ఇంద్రియముల నిరోధరూప దమము కలుగజాలదు.అందువలన,దమమునకు శమముయొక్క అపేక్ష ఉన్నది.

(b)మనోనిరోధములేనిదే స్త్రీపుత్రాదులందాసక్తమైన బహిర్ముఖ మనస్సున వేదాన్తశాస్త్రము మరియు సద్గురువచనములందు పరిపూర్ణ విశ్వాసరూప శ్రద్ధ కలుగదు.కావున, శ్రద్ధకుగూడ శమముయొక్క అపేక్ష ఉంది.

(c)మనస్సు నిరోధింపబడనిదే బ్రహ్మమునందు చిత్తము సంలగ్నము(ఏకాగ్రము)కాదు.అందుచేత సమాధానమునకుగూడ శమముయొక్క ఆపేక్ష ఉంది.

(d)ఎట్లు,పాలు పెరుగు మొదలగు ఉత్తమ ఆహారముచే పెంచ(సాక)బడిన అబద్ధ(స్వేచ్ఛగా వదలబడిన)పిల్లి,ఎలుక కనిపించినతోడనే గంతువేసి దానిపై దూకుతుంది.అట్లే,ఉపరతినొందిన మనస్సుగూడ నిరోధరూప త్రాటితో కట్టివేయకుండా స్వేచ్ఛగావదిలినచో ప్రాప్తవిషయములపై దూకును,గాన ఉపరతికిగూడ శమముయొక్క ఆపేక్ష ఉంది.

(e)అంతర్ముఖ మనస్సుచే శీతోష్ణాదిద్వంద్వసహనము సంభవించును.బహిర్ముఖ మనస్సుచే సంభవించదు.కావున,తితీక్షకుగూడ శమముయొక్క ఆపేక్ష ఉంది.ఈరీతిగా దమాదులకు శమముయొక్క సహాయము(సహకారితా) గలదు.

2.(a)దర్పణమునకు వెనుకవైపు పూతవేయనిచో నేత్రవృత్తి నిరాటంకముగా అద్దముగుండాబయటకు వెళ్లిపోవును.అట్లే,మనస్సు బాహ్యవిషయములపైకి వెళ్ళుటకు ద్వారభూతములగుఇంద్రియములనుదమనము(నిరోధము)

చేయనిచో మనస్సు స్వేచ్ఛగాబయటకు వెళ్ళును.కావున,శమమునకు దమ ముయొక్క అపేక్ష ఉంది.

(b)రూపాది విషయములందు తత్పరుడైన(ఇంద్రియనిగ్రహము లేని) పురుషునికి సచ్ఛాస్త్రమునందుగాని,సద్గురువులయందుగాని శ్రద్ధ కలుగజాలదు. అందుచేత శ్రద్ధకుగూడ దమముయొక్క అపేక్ష ఉన్నది.

(c)ఇంద్రియనిరోధములేనిదే చంచల స్వభావముగల మనస్సునందు ఏకాగ్రత కుదురదు.కనుక, సమాధానమునకుగూడ దమముయొక్క అపేక్ష ఉంది.

(d)ఇంద్రియనిరోధరూప దమనములేకుండా ప్రత్యక్షముగా అనుభవించిన అనుకూల విషయములందురాగ(ఆసక్తి)విషయక సంస్కారములు ఉద్భూతమగుటచే త్యక్తవిషయములు పునః ప్రాప్తించినచో వాటియందు మళ్లీ ఇచ్ఛగలుగును, గాన ఉపరతికిగూడ దమముయొక్క అపేక్షయున్నది.

(e)ఇంద్రియనిరోధములేకుండా శబ్దాదివిషయదర్శనముచే విక్షిప్తమనస్సుచేత శీతోష్ణాది ద్వంద్వధర్మములను సహించుట సంభవించదు.కావున, తితీక్షకుగూడ దమముయొక్క అపేక్ష ఉంది.ఇట్లు శమాదులకు దమముయొక్క సహకారము గలదు.

3.పతి సమీపమునకు వెళ్ళుటకు ఉపయుక్తమగు శృంగారాదులు సుహాసిని స్త్రీకి శోభించును.గాని,విధవ స్త్రీకి కాదు.ఒకవేళ విధవ స్త్రీ ధరించినచో నవి వ్యర్థములేయగును.అట్లే,సద్గురు మరియు సచ్ఛాస్త్రవచనములందు విశ్వాసరూపశ్రద్ధగలపురుషునికే శ్రవణమునందు ప్రవృత్తమగుటకు ఇచ్ఛగలుగును.శ్రద్ధలేనిచో ఇచ్ఛయే గలుగదు.కావున,శ్రవణమునకుపయుక్తములగు శమదమాదిసాధనములు శ్రద్ధగలవానియందే ఫలవంతములగును.కాని,శ్రద్ధలేని

వానిలో యీ శమాదులుండినను,విధవ స్త్రీ ధరించిన శృంగారాదులవలె వ్యర్థ ములగును.ఈరీతిగా శమాది సకల సాధనములకు శ్రద్ధయొక్క ఆపేక్షయు న్నందున,వాటికి శ్రద్ధయొక్క సహకారము స్పష్టము.

4.అట్లే,శబ్దాది విషయములనుండి చిత్తము ఉపరతినొందకుండా శమాది సాధనములేవియును సిద్ధింపవు.కావున,శమాదులకు ఉపరతియొక్క ఆపేక్ష ఉంది. ఇట్లు, శమాదులకు ఉపరతియొక్క సహకారము గలదు.

5.అట్లే,శీతోష్ణములు,ఆకలిదప్పులు,హానిలాభములు మున్నగు అనేక వ్యా వహారిక ఉపద్రవములను సహించకుండా మనోనిరోధము,ఇంద్రియనిరోధము, గురుశాస్త్ర వచనములందు ఆస్తిక్యబుద్ధి,చిత్తైకాగ్రత మరియు యాదృచ్ఛికముగా ప్రాప్తములగు ధనాదివిషయములందు ఉపరతియును సిద్ధించదు.అందువలన, శమాదులకు తితిక్షారూప తపస్సుయొక్క అపేక్ష ఉన్నందున శమాదులకు తితిక్షయొక్క సహకారము గలదు. మరియు,

6.చిత్తముయొక్క ఏకాగ్రతలేనిదే శమాదిసాధనములు సిద్ధించవు.కావున, శమాదులకు సమాధానముయొక్క అపేక్ష ఉన్నది.ఇట్లు సమాధానముయొ క్క సహకారితా శమాదులకు గలదు.(శ్రీవిచారసాగరము-హిందీ 19 వ టిప్పణము నుండి గ్రహించబడినది)

ఈప్రకారముగా శమాదులకు పరస్పర సహకారమున్నందున యీశమాది ఆరుసాధనములయొక్క సముదాయమునకు“**షట్ సంపత్తి**”యను ఏకసాధన త్వము చెప్పబడినది.ఈశమాది ఆరుసాధనములను గ్రంథకర్తలు ముందువె నుకలుగా(వ్యతిక్రమముచే)గూడ చెప్పియున్నారు.శంకింపపనిలేదు.తాత్పర్య మును గ్రహించాలి.

1.శమాదిషట్కము శ్రుతిప్రతిపాదితము.ఈవిషయంలోప్రమాణములు:— **"శాన్తోదాన్త ఉపరతి తితిక్షుఃసమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యతి"**(బృ. 4-4-23)ఇట్లు కాన్వశాఖీయులుపఠించెదరు.**"సమాహిత"**స్థానంలో మాధ్యందిన శాఖీయులు"**శ్రద్ధావిత్తో**"అనిపఠించెదరు.గుణోపసంహార న్యాయముచే ఉభయశాఖలలోని పాఠానుసారముగా శమాదులు ఆరు సాధనములని నిర్ధారణ చేయడమైనది.

శమాదులను విద్యాహేతువులుగా శ్రీకృష్ణభగవానుడుగూడ చెప్పియున్నాడు—

1.శమము:—**"యోగారూఢస్యతస్యైవశమఃకారణముచ్యతే"**(గీత.6-3)యోగారూఢుడైన వానికి(ధ్యానయోగంలోనిలవడానిని సమర్థుడైనవానికి)శమము కారణమగును.లేక,యోగము=అంతఃకరణశుద్ధిరూప వైరాగ్యమును పొందినవానికి (యోగారూఢపురుషునికి)పూర్వము కర్మానుష్ఠానము చేసినవాడైనప్పటికి,ఇపుడు జ్ఞాననిష్ఠాపరిపాకసాధనమగు సర్వకర్మసంన్యాసము=శమము అను-ష్ఠేయముగా చెప్పబడుచున్నది.కర్మానుష్ఠాన సమయంలో వృత్తి బహిర్ముఖమగును.కావున,అంతర్ముఖ వృత్తిని కలిగి యుండాలి—అని అర్థము.

**"అశాన్తస్యకుతఃసుఖమ్"**(గీత.2-66)మనఃప్రసాదమువల్లనే దుఃఖములు సంపూర్ణముగా నివర్తించును అను విషయమును వ్యతిరేక ముఖముగా చెప్పున్నాడు భగవంతుడు.చిత్తమును జయించని పురుషునికి ఆత్మవిషయక బుద్ధి కలుగదు.అదిలేనిచో నిదిధ్యాసనరూప భావనయు కలుగదు.అటువంటి భావనలేనివానికి శాంతి లభించదు.అశాంతునికి సుఖమెట్లు కలుగును?

2.దమము:—**శ్లో॥యథా సంహరతే చాఽయంకూర్మోఽఙ్గానీవ సర్వశః।**
**ఇన్ద్రియాణీంద్రియర్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥**(గీత.2-58)

ఏదైనా అపాయమున్నదని తెలియగానే తాబేలు ఎట్లు తన అంగములను

లోనికి ముడుచుకొనునో,అట్లు సమాధినుండి ఉత్థానమైన ముని గూడ తన సమస్తఇంద్రియములను శబ్దాదివిషయములనుండి ఉపసంహరించుకొనును. అతని ప్రజ్ఞా=ఆత్మ విషయక బుద్ధి ప్రతిష్ఠితమగును.

3.ఉపరతి:—"**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ**"(గీత.18-66)విధి పూర్వకముగా సమస్తవర్ణాశ్రమోచిత(విహిత)ధర్మములను,దేహ,జీవ,ఈశ్వర ధర్మములను సహితము పరిత్యజించి నన్నొక్కడినే(ఆత్మను)శరణుజొచ్చుము.

4.తితిక్షా:—**శ్లో॥మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణసుఖదుఃఖదాః।**

**ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితిక్షస్వ భారత॥**(గీత. 2-14)

**మీయన్తేఆభిర్విషయా ఇతి మాత్రా ఇన్ద్రియాణి**—వీటిచే విషయములయొక్క జ్ఞానము కలుగుచున్నందున ఇంద్రియములకు మాత్రలు అంటారు.వాటియొక్క స్పర్శము అనగా విషయముతో సంబన్ధము లేదా తత్తద్విషయాకార అంతఃకరణ పరిణామవిశేషములు(అంతఃకరణముయొక్క విషయకారవృత్తులు),ఆగమాపాయములు=ఉత్పత్తివినాశశీలములు.మరియు శీతముఉష్ణము మొదలగువాటిద్వారా అంతఃకరణమునకు సంయోగముద్వారా సుఖదుఃఖములను ఇచ్చునవి.కాని,నిత్యము,విభు(వ్యాపకము)అయిన ఆత్మకు సుఖదుఃఖములనిచ్చునవి కావు.ఎందుకనగా!నిర్గుణము,నిరాకారము,అసంగము మరియు నిత్యవస్తువునగు ఆత్మ అనిత్యధర్మములకు ఆశ్రయము కాజాలదు. ఎందుకంటే, ధర్మము మరియు ధర్మికి ఆభేదముంటుంది.ఉష్ణతరూపధర్మము అగ్నిరూప ధర్మి చేనభిన్నమైయుండును.కావున,సుఖదుఃఖములకు,ఆత్మకు ఏవిధమైన సంబన్ధము సంభవించదు.అట్లే,సాక్ష్యములు సాక్షియొక్క ధర్మములు కానేరవు. శ్రీసురేశ్వరాచార్యులు చెప్తున్నారు. ↓

**శ్లో॥నర్తే స్యాద్విక్రియాం దుఃఖీ సాక్షితా కా వికారిణః।**

**ధీవిక్రియా సహస్రాణాం సాక్ష్యతోఽహమవిక్రియః"॥**(బృ.వార్తికము.1-4-561)

వికారము కలుగకుండా ఆత్మ దుఃఖి కాజాలదు.ఒకవేళ ఆత్మ వికారి యని స్వీకరిస్తే,సాక్షియెట్లగును?వికారియేదో అది సాక్ష్యకోటి(వర్గము)లో ఉంటుంది. సాక్షి కోటిలో రాదు.ఆత్మనగు నేను బుద్ధియొక్క వేలకొలది వికారములకు సాక్షి నైయున్నాను.అందువల్ల,నేను అవికారిని,కాని వికారిని కాదు.సుఖదుఃఖాదులకు ఆశ్రయీభూతమగు అంతఃకరణ భేదముచే అన్నిప్రకారముల వ్యవస్థలు ఉపపన్నములగుచున్నందున,నిర్వికారము సర్వజగద్భాసకమగు ఆత్మభేదమునందు ప్రమాణమేమియును లేదు.ఇంతేగాకుండా,

**"కామసఙ్కల్పోవిచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధాధృతిరధృతిర్హ్రీర్ధీ**

**ర్భీరిత్యేతత్సర్వంమనఏవ"**(బృ.1-5-3).

**శ్లో॥శోకహర్షభయక్రోధలోభమోహస్పృహాదయః।**

**అహంకారస్య దృశ్యన్తే జన్మమృత్యుశ్చ నాత్మనః॥**(భాగ.11-28-15)

కామము,సంకల్పంము,సంశయము,శ్రద్ధ,అశ్రద్ధ,ధైర్యము,అధైర్యము,లజ్జ, బుద్ధి మరియు భయము—ఇవన్నియును మనస్సే.ఇట్లు కామాది సకలవికారములు మనస్సుచే నభిన్నములని,సకలవికారములకు మనస్సే ఉపాదానమని చెప్పి,ఆత్మను స్వప్రకాశ జ్ఞానానన్దస్వరూపముగా శ్రుతిమాత ఉపదేశించుచున్నది.అందువల్ల,ఆత్మ కామాదులకు ఆశ్రయము కానేరదు.అయితే వైశేషికాదులు ఆత్మభేదమును మరియు ఆత్మయందు వికారిత్వమును ఇత్యాది ఏవైతే

స్వీకరించారో—అది కేవలము భ్రాన్తిమూలకము.శ్రుతి,యుక్తి మరియు అనుభవవిరుద్ధము అని ముముక్షువులు గమనించదగినది.

అంతఃకరణము ఆగమాపాయి(ఉత్పత్తి-వినాశశాలి)మరియు దృశ్యమున్నందున త్వంపదార్థ(లక్ష్యచైతన్య)మగు నిత్యము,దృగ్రూపమునగు సాక్షికి దృశ్యము(తెలియబడుచు)న్నందున సాక్షికంటె భిన్నమైయున్నది.అందువలన సుఖాది జనకములగు యేమాత్రాస్పర్శలు(విషయేంద్రియ సంయోగములు)గలవో,అవి అనిత్యములు-అనియతస్వరూపములు.ఎందుకనగా!శీతోష్ణాదులు ఒక కాలములో సుఖజనకములైతే,భిన్న కాలములో దుఃఖజనకములగుచున్నవి. అట్లే,ఒకప్పుడు దుఃఖజనకములైతే,మరొకప్పుడు సుఖహేతువులగుచున్నవి. శ్లోకంలో శీతోష్ణములు ఏవైతే చెప్పబడినవో,అవి ఆధ్యాత్మిక,ఆధిభౌతిక మరియు ఆదిదైవిక(మూడువిధముల)సుఖదుఃఖములకు ఉపలక్షణములుగా తెలియవలెను.శీతోష్ణములు పరస్పరము విపర్యయములు కాగలుగుతాయి.అనగా ఒకసారి శీతోష్ణములు సుఖమునిచ్చునవైతే,మరోసారి దుఃఖమునిచ్చునవి యగును.కాని,సుఖదుఃఖములు ఎప్పుడుగూడ విపర్యయములు కావు. సుఖము దుఃఖముగాను,దుఃఖము సుఖముగాను కాజాలవు.సుఖము ఎల్లపుడు సుఖంగానే ఉంటుంది. దుఃఖము దుఃఖముగానే ఉంటుంది.

“**సర్వేషామనుకూలవేదనీయంసుఖమ్**”లేక“**ఇష్టసాధనతాజ్ఞానానధీనేచ్ఛావిషయత్వంసుఖస్యలక్షణమ్**”.మరియు“**సర్వేషాంప్రతికూలవేదనీయందుఃఖమ్**”లేక “**ఇతరద్వేషానధీనద్వేషవిషయతాశాలిత్వందుఃఖస్యలక్షణమ్**”. (తర్కసంగ్రహము).

ఓఅర్జునా!నిర్వికారమగు ఆత్మకంటె(నీకంటె)భిన్నము,దృశ్యమునగు అంతఃకరణమునకు సుఖదుఃఖముల నిచ్చునటువంటి,అత్యన్త అస్థిరములైన భీష్మ

ద్రోణాది శరీరములతో యేసంయోగవియోగరూప మాత్రాస్పర్శలు ఉన్నవో వాటిని నీవు సహించుము.అనగా,"వీరు ఆత్మనగు నన్నేమియును చేయజాలరు" అను యీప్రకారమగు వివేకముచే వాటిని ఉపే క్షించుము.సుఖదుఃఖాత్మకమగు చిత్తముతో ఆత్మయొక్క తాదాత్మ్యా ధ్యాసము(అభేదాధ్యాసము)చేసినిన్ను నీవు దుఃఖితునిగా భావించకుము.శ్లోకంలో అర్జునుని సంబోధిస్తూ"కౌన్తేయ,భారత"అను పదములను ప్రయోగించి శ్రీకృష్ణభగవానుడు అర్జునునియొక్క మాతృకులమును,పితృకులమును గుర్తుచేసి,ఆరెండు కులములయొక్క పవిత్రతను(శుద్ధతను)ద్యోతితము చేశాడు.అటువంటి నీకుయీఅజ్ఞానము(మోహము) ఉండుట అత్యన్త అనుచితము. (గీత.2-14 మధుసూదనీ).

5.శ్రద్ధ:—**"శ్రద్ధావాంల్లభతే జ్ఞానం తత్పరః సంయతేన్ద్రియః"**(గీత. 4-39);

**"అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి"**(గీత.4-40).

ఈ శ్లోకభాగముల అర్థమును లోగడ శ్రద్ధ నిరూపణావసరమున తెలిసి కొని వచ్చాము.

6.సమాధానము:-**"సమాధావచలాబుద్ధి"**(గీత.2-53)**"మయ్యేవమన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ"**(గీత.12-8)

పలువిధముల ఫలములను వర్ణించు శ్రుతులను శ్రవణము చేయుటవలన, వాటియొక్క తాత్పర్యము తెలియక సంశయ విపరీత భావనలచే యుక్తమైపూర్వము విక్షిప్తమైయున్న నీబుద్ధి,ఎప్పుడు నిష్కామ కర్మజన్య చిత్తశుద్ధిచే కలిగిన వివేకముతో దోషదర్శనముద్వారా ఆ విక్షేపమును త్యాగముచేసి,సమాధి=పరమాత్మయందు,నిశ్చలము=జాగ్రత మరియు స్వప్నదర్శనరూప విక్షేప రహితమగునో మరయు అచలము= సుషుప్తి,మూర్ఛ,స్తబ్ధీభావాది లయలక్షణ

చలనములేనిదై స్థిరపడునో,అనగా లయ,విక్షేపరూప దోషములను త్యాగముజేసి,పరమాత్మయందు సమాహితమగునో,అప్పుడు నీవు సమస్త యోగములకు ఫలభూతమగు తత్త్వమస్యాది వాక్యజన్య జీవపరమాత్మల ఐక్యవిషయక అఖండ సాక్షాత్కారమును పొందగలవు .

అన్వయోజన:—నిశ్చలా=అహంభావనా,విపరీత భావనారహితమై; అచలా= **"స తు దీర్ఘకాలనైరన్తర్యేణ సత్కారాసేవితో దృఢభూమిః"**(యో.సూ.1-14)లో చెప్పబడినట్లుగా ఆత్మచింతనమును దీర్ఘకాలము,వ్యవధానములేకుండా,ఆదరపూర్వకముగా సేవిస్తూ విజాతీయ(అనాత్మ)ప్రత్యయములచే దూషితము కానిదై; వాయురహిత ప్రదేశమందలి దీపశిఖవలె నీ చిత్తము ఆత్మయందు యెప్పుడు స్థిరపడునో,అప్పుడు నీవు సకలయోగములకు ఫలరూపమగు మహావాక్యజన్య బ్రహ్మాత్మైకత్వ అఖండ సాక్షాత్కారమును పొందగలవు.(గీత.2-53 మధుసూదని)

సగుణ బ్రహ్మముయొక్క యేరూపమునందైనను మనస్సును మరియు బుద్ధిని సమాహితమొనర్చినచో నిర్వికల్పకసమాధియే ప్రాప్తించును.మనస్సున యేప్రకారమైన వికల్పములులేనిచో కల్పనాత్మక సగుణబ్రహ్మ స్వరూపము గూడ అంతర్ధానమగును.అనగా,అచట దృశ్యరూపమగు ఏపదార్థముగూడ ఉండుటకు సంభవములేదు.అందువల్ల,ద్రష్టా,సాక్షియగు ఆత్మ=శుద్ధచైతన్యస్వరూప అద్వితీయబ్రహ్మమే అచట ప్రకటమగును.మరియు జల,దర్పణాది ఉపాధులను తొలగించినచో ప్రతిబింబము బింబముతో ఐక్యమగునట్లు,అంతఃకరణ రూపోపాధి విలయముకాగా తద్గత ప్రతిబింబస్థానీయజీవుడు బింబస్థానీయ బ్రహ్మముతోఏకీభూతుడౌతాడు.కావున,బ్రహ్మవేత్తలు సగుణబ్రహ్మోపాసనలచే ఈ-శ్వరప్రసాదముద్వారా నిర్గుణబ్రహ్మవిద్యాఫలమగు మోక్షమును పొందుచున్నారు.

**శ్లో॥నిర్విశేషం పరంబ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః।**

**యే మన్దాస్తేఽనుకమ్ప్యన్తే సవిశేషనిరూపణైః॥**

**శ్లో॥వశీకృతే మనస్యేషాం సగుణబ్రహ్మశీలనాత్।**

**తదేవాఽవిర్భవేత్సాక్షాదపేతోపాధికల్పనమ్॥**(బ్ర.సూ.1-1-20 కల్పతరువు)

[గూఢార్థదీపిక-మధుసూదనీ.12-13 & శ్రీ శివగీత,బాలానన్దినీ వ్యాఖ్య.14-5]

నిర్విశేష పరబ్రహ్మసాక్షాత్కారము చేసుకొనుటకు అసమర్థులైన యే మందాధికారులు గలరో,వారు సవిశేషబ్రహ్మ(సగుణబ్రహ్మ)ఉపాసనచే అనుగృహీతులు కాగలరు.సగుణబ్రహ్మముయొక్క నిత్యనిరన్తర సత్కారపూర్వక అను శీలనము (అనుచింతనము)చేయుటచే,వారి మనస్సు స్వవశమగును.ఇట్లు వశీభూతమైన మనస్సు(ఉపాధి)సకల కల్పనారహితముకాగా నిర్గుణబ్రహ్మసాక్షాత్కారము(ఆవిర్భావము) కలుగును.

పై సమగ్ర అభిప్రాయమును దృష్టియందుంచుకొని భగవంతుడు "**మయ్యేమనఆధత్స్వ**"(12=8)అంటూ ఉపదేశించాడు.ఓ అర్జునా! నీవు నాయందే(సగుణ బ్రహ్మమునందే)సంకల్పవికల్పాత్మక మనస్సును స్థిరపరచుము.సమస్త మనోవృత్తులను నన్నే విషయముచేయునట్లుగా చేయుము.అట్లే,అధ్యవసాయాత్మక (నిశ్చయాత్మక)బుద్ధినిగూడ,అనగా సకలబుద్ధివృత్తులను విషయాన్తరము(అనాత్మాకారము)కానీయక,నన్నే విషయముచేయులాగున(చింతనచేయులాగున )చేయుము.నాయందే నివేశము=సంహితము=సమర్పితము చేయుము.

అట్లు చేయుటవలన ప్రయోజనమేమిటి కేశవా?నాయందు(నిర్గుణబ్రహ్మమునందు)బుద్ధిని సమ్యగ్ ప్రకారముచే సమాధానము=సమాహితము చేయుటవలన ఫలమేమిటో వినుము."**అతఊర్ధ్వంమయ్యేవనివసిష్యసి,నసంశయః**"**ఊర్ధ్వమ్=ఏతద్దేహాన్తే**.ఈదేహావసానమున మత్స్వరూపమున=శుద్ధబ్రహ్మమునం

దే నివసించెదవు.అనగా,"**బ్రహ్మవేదబ్రహ్మైవ భవతి**"(ముం.3-2-9)బ్రహ్మమునెఱిగి నవాడు బ్రహ్మమేయగును—ఇందులోఎలాంటి సందేహములేదు.ఎట్టి ప్రతిబంధ కమునూ ఉండదని భావము.

**శ్లో॥ఇహ వా మరణేవాఽస్య బ్రహ్మలోకేఽథవా భవేత్।**

**బ్రహ్మసాక్షాత్కృతిః సమ్యగుపాసీనస్య నిర్గుణమ్॥**(వే.పం.9-150)

సమ్యక్ప్రకారముచే నిర్గుణబ్రహ్మోపాసనముచేయువాడు ఈదేహమునందేగాని, మరణ కాలమందుగాని,లేక బ్రహ్మలోకమునందుగాని బ్రహ్మసాక్షాత్కారమును పొందగలడు.

కావున,"**సమ్యగాస్థాపనంబుద్ధేఃశుద్ధే బ్రహ్మణి సర్వదా**"।(వి.చూ.27) పరిశుద్ధ మగు బ్రహ్మముయందు ఎల్లప్పుడును బుద్ధిని చక్కగానిలుపుటను సమాధాన మనిచెప్పబడినది—అనిశ్రీశంకరాచార్యులు,అట్లే శ్రుతులుస్మృతులు ఆదేశించు చున్నందున,సాధకులు'**సమాధానము**'ను సాధనమును అవశ్యముగా సంపా దించు కొనవలయునని నిశ్చయింపబడినది. *ఇతి శమాదిషట్క నిరూపణమ్.*

**—:40.ముముక్షుత్వము:—**

ఉక్తప్రకారముగా శమాదిషట్కమును సాధించిన వానికే ముముక్షుత్వము లభించునుగాని యితరులకు లభించదు.కావున,శమాదిషట్క నిరూపణానంతర ము దానికార్యభూతమగు ముముక్షుత్వమను చరమసాధనము చెప్పబడుచు న్నది.మోక్షమునందు ఇచ్ఛ యేదిగలుగునో దానిని ముముక్షుత్వమని అంటా రు.ఆకలితో తీవ్రముగా బాధపడుచున్న వానికి భోజనముయొక్క ఇచ్ఛ తప్ప

మరి యేకోరికయును కలుగదు. అట్లు మోక్షమునందు ఇచ్ఛ గల్గినచో దానికి ముముక్షుత్వము (మోక్షేచ్ఛ) అంటారు.

శంక:—మంత్రము:—**యదాసర్వేప్రముచ్యన్తే కామాయేఽస్యహృది స్థితాః।**

**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మసమశ్నుతే ॥**(బృ.4-4-7)

హృదయమందలి సమస్తకోరికలు ఎప్పుడు సమూలముగా నష్టమగునో, అప్పుడు ఈమరణధర్మముగల పురుషుడు అమరుడవుతాడు.ఈవర్తమాన శరీరమునందే బ్రహ్మమును పొందుతాడు.

**శ్లో॥ప్రజహాతి యదా కామాన్సర్వాన్పార్థమనోగతాన్।**

**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥**(గీత. 2-55)

ఓ పృథానందన!విద్వాన్ పురుషుడు యెప్పుడు తన సకలమనోవృత్తులను(కామసంకల్పాదులను)సంపూర్ణముగా పరిత్యజించునో,మరియు పరమానందస్వరూప ఆత్మయందు స్వప్రకాశచిద్రూపముచే సంతుష్టుడైయుండునో, అప్పుడతడు స్థితప్రజ్ఞుడనబడుతాడు.

ఇత్యాది శ్రుతిస్మృతులచే సర్వకామనా(ఇచ్ఛా)వినిర్ముక్తునకే మోక్షమునందధికారము గలదని చెప్పబడుచున్నందున అధికారి పురుషునికి ఇచ్ఛా విశేషణము(ఇచ్ఛగల్గియుండవలెనని)చెప్పుట యుక్తము కాదు గదా?

సమాధానము:—కామము(ఇచ్ఛా)గల్గియుండుట దోషముగాదు.శ్రుతివిరోధమును లేదు.అనాత్మ విషయక ఇచ్ఛయే కామము—అని శ్రుతియొక్క అభిప్రాయము అధికారిపురుషుడు తన హృదయమందలి సకల అనాత్మవిషయక కామనలను(కోరికలను)సమూలముగా యెప్పుడు నష్టముజేయునో,అప్పు

డు అమృతుడవుతాడు—అని శ్రుతిస్మృతులయొక్క అభిప్రాయము.కాని, మోక్షేచ్ఛగూడ ఉండగూడదని తాత్పర్యము లేదు.

శంక:—వేదాన్తమతములో మోక్షమనునది నిత్య శుద్ధ బుద్ధ ముక్త పరిపూర్ణానన్ద ఆత్మాఽబిన్న బ్రహ్మప్రాప్తి మరియు సర్వదుఃఖముల(అజ్ఞానతత్కార్యము)యొక్క అత్యన్తనివృత్తి అని చెప్పబడినది.అందు ప్రథమాంశ విషయంలో "**బ్రహ్మవేదబ్రహ్మైవభవతి**"(ముం.3-2-9);"**బ్రహ్మవిదా ప్నోతి పరమ్**"( తై.2-1)"**బ్రహ్మ సంస్థోఽమృతత్వ మేతి**"(ఛాం.2-23-1) ఇత్యాది శ్రుతులు మరియు ద్వితీయాంశ విషయంలో"**తరతి శోకమాత్మవిత్**"(ఛాం.7-1-3)"**తమేవవిదిత్వాఽతిమృత్యుమేతి**" (శ్వే.6-15) ఇత్యాది శ్రుతులు ప్రమాణముగా స్వీకరించబడినవి గదా.అత్యన్తనివృత్తి అనగా నిత్యనివృత్తి; బ్రహ్మము నిత్యముగావున బ్రహ్మప్రాప్తి అనగా నిత్య ప్రాప్తి.అలాంటప్పుడు మోక్షము నిత్యమనియే స్వీకరించబడినది గదా—అట్టి నిత్యసిద్ధ(నిత్యప్రాప్త)మైన మోక్షము అధికారిపురుషునియొక్క స్వరూపముగా తత్త్వమస్యాది మహావాక్యములు(నీవేబ్రహ్మమైయున్నావు)అని బోధించుచున్నవి.కాని,ఏదైన వస్తువు తనకంటె భిన్నమై,అప్రాప్తమైయున్నచో,అది తనకు అనుకూలమని భావించినచో అప్పుడు దానిని పొందవలెనని ఇచ్ఛజేసి,ప్రయత్నముచే పురుషుడు ప్రవృత్తుడగుట లోకప్రసిద్ధము.కావున,నిత్యప్రాప్తము మరియు అధికారిపురుషునికంటె భిన్నముకానిది(స్వరూపమేయైనది)అగు మోక్షవిషయక ఇచ్ఛ ఎలా కలుగగలదు?ఇంతే గాక,

మోక్షము అనిత్యమా(జన్యమా)?లేక,నిత్యమా(అజన్యమా)?ఒకవేళ సాదియన్నచో కృతకము(కర్మసాధ్యము)అగటచే"**యత్కృతకం తదనిత్యమ్**"అను న్యాయము ప్రసక్తమగును.మోక్షము అనిత్యమన్నచో తద్విషయక ఇచ్ఛ యెవరికిని కలుగజాలదు.మరియు"**నచపునరావర్తతే**(ఛాం.8-15-1);"**నస పునరావర్తతే**

**తత్కైవల్యమ్**"(నా.ప.9-22);"**నసభూయోఽభిజాయతే**"(గీత.13-23);"**మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే**"(గీత.8-16&15)ఇత్యాది శ్రుతి స్మృతులకుగూడ విరోధము వాటిల్లును.లేక,నిత్యమన్నచో మోక్షము నిత్యసిద్ధముగావున తత్సాధనములగు శ్రవణాదులందు ప్రవృత్తికలుగగూడదు.కాని,"**శ్రోతవ్యోమన్తవ్యోనిదిధ్యాసితవ్యః**"(బృ.2-4-5&4-5-6)ఇత్యాదిశ్రుతలచే శ్రవణాదులు కర్తవ్యములుగా బోధించబడినవి. అని యిట్లు శంక ప్రాప్తమైనప్పుడు,

సమాధానము చెప్పబడుచున్నది.మోక్షము స్వాభిన్నము,నిత్యప్రాప్తము మరియు అనాదియును ఐనప్పటికిని,మోక్షముయొక్కఅసిద్ధత్వ(అప్రాప్తిరూప)భ్రమచే దానిని పొందుటకు ఇచ్ఛేజేయుటయు,తత్సాధనములగు శ్రవణాదులందు ప్రవృత్తియును సంభవించును. ఎట్లనగా,

"**అనృతేన హి ప్రత్యూఢాః**"(ఛాం.8-3-2)భూమిలో పాతిపెట్టబడిన ధనము, ఆ స్థానమునందే యున్నదని తెలియని(అనభిజ్ఞ)పురుషుడు,ఆ ధనము పైనే సంచరించుచున్నను దానిని అప్రాప్తమువలె భావించి,పొందుటకు ప్రయత్నించు విధమున—అని తెలియాలి.

**శ్లో॥ఆత్మా తు సతతం ప్రాప్తోఽప్రాప్తవదవిద్యయా।**

**తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకణ్ఠాభరణం యథా॥**(ఆత్మబోధ. 44.)

ఆత్మ సర్వత్ర సర్వదా పరిపూర్ణ అద్వయానంద స్వరూపముచే వ్యాప్తమై, ప్రాప్తమైయ్యే ఉంది.కాని అవిద్యావశమున భ్రాన్తిచే అప్రాప్తమువలె తోచుచున్నది.తత్త్వమస్యాదివాక్యశ్రవణానంతరముకలిగిన అప్రతిబద్ధ దృఢాపరోక్ష బ్రహ్మజ్ఞానము(బ్రహ్మైవాహమస్మి)చే ఆవరణాత్మక అవిద్యా ధ్వంసముకాగా ప్రాప్తించినట్లుగా భాసించుచున్నది.ఉదా:-కంఠచామీకరన్యాయము.ఒకానొక పురుషుడు

ఏదో విశేషకారణముచేత తన మెడలో హారము ఉండగానే,భ్రమచే ఎక్కడో పోయి నదని దుఃఖించుచుండెను.అంతలో ఒక ఆప్తపురుషుని సహాయముతో తన ప్రతిబింబమును అద్దములో చూచెను.దర్పణములో తన మెడలోని హారము కనిపించగా"నాహారము దొరికినది"అని భావించెను.కాని,వాస్తవముగా హారము ఎక్కడ పడిపోలేదు,ఇప్పుడు దొరకలేదు.ఉన్నది ఉన్నట్టుగానే ఉంది.అట్లే,అ జ్ఞానమువలన కలిగిన భ్రాన్తిచే ఆత్మనుఅప్రాప్తమువలెభావించి,తత్ప్రాప్తికై ఇచ్ఛ జేయుట మరియు శ్రవణాదులందు ప్రయత్నముచే ప్రవృత్తుడగుట సంభవిస్తుంది.

శంక:—సమూల సర్వానర్థ అత్యన్తనివృత్తి మరియు పరమానందరూప బ్రహ్మప్రాప్తి=మోక్షము అని చెప్తూవచ్చారు.అందులో పరమానందరూప బ్రహ్మ ము నిత్యసిద్ధము.అయినను అజ్ఞానవశమున అసిద్ధత్వ భ్రాన్తిచే తద్విషయక ఇచ్ఛ మరియు ప్రవృత్తి సంభవిస్తుంది.ఎందుకనగా,బ్రహ్మము నిత్యసిద్ధము భా వరూపమైయున్నందువలన.కాని, సర్వానర్థముయొక్క అత్యన్తనివృత్తి(మోక్ష ములోని ద్వితీయాంశము)యేదిగలదో,అది ఆభావరూపమున్నది.మరియు త త్త్వజ్ఞానము కలుగుటకుపూర్వము అసిద్ధమైయున్నది.కావున మోక్షము నిత్య సిద్ధమని చెప్పుట ఎట్లు సంభవించును?ఇంతేగాక,అభావము భావవ్యతిరిక్తము గాన**"సర్వానర్థనివృత్తి"**బ్రహ్మస్వరూపముకంటెభిన్నము అని చెప్పవలసివస్తుం ది.ఒకవేళ భిన్నమని స్వీకరించినయెడల**"ఏకమేవాఽద్వితీయమ్"**(ఛాం.6-2-1) అను అద్వైత శ్రుతికి విరోధమేర్పడును గదా?

సమాధానము:—అజ్ఞానతత్కార్యరూపఅనర్థము సర్వము సదసద్వి లక్షణమై (అనిర్వచనీయమై)అధిష్ఠానరూప బ్రహ్మమునందు అధ్యస్తమునై యున్నది. అధిష్ఠాన సాక్షాత్కారానంతరము కల్పితఅనర్థము నివృత్తము(ధ్వంసము,నాశ నము,బాధము)అగుచున్నది.కల్పితవస్తువుయొక్క నివృత్తి(నాశనము)అధిష్ఠా

నముకంటె భిన్నముగాదు.మరేమనగా,అధిష్టానరూపమే ఉండును.

**శ్లో॥అధిష్ఠానావశేషో హి నాశః కల్పితవస్తువః।** (సూతసం.యజ్ఞవైభవఖం 2-8)

మాయాతత్కార్యరూపప్రపంచము(అనర్థము)చిన్మాత్రబ్రహ్మమునందు అధ్యస్తమై(కల్పితమై)యున్నందున,అధిష్టానబ్రహ్మసాక్షాత్కారముగల్గినమీదట కల్పిత అనర్థనివృత్తి(నాశము)అధిష్టానబ్రహ్మవ్యతిరిక్తముండదు.అందువల్ల అద్వైత శ్రుతికి విరోధముగూడలేదు.శుక్తి(ముత్యెపుచిప్ప)సాక్షాత్కారానంతరము కల్పితరజతము(వెండి)యొక్క నివృత్తి శుక్తికంటె వేరుగగోచరించదు గదా.కావున, కల్పితఅనర్థనివృత్తి బ్రహ్మరూపమగుటచే బ్రహ్మస్వరూపమోక్షము నిత్యసిద్ధము.

**శ్లో॥నివృత్తిరాత్మా మోహస్య జ్ఞాతత్వేనోపలక్షితః।**( చిత్సుఖీ 4-8)

లోకంలో సమూలరజతభ్రమ నివృత్తియనునది జ్ఞాతశుక్తిరూపముగానే తెలియబడుచున్నది.అట్లే,కార్యసహిత అజ్ఞానరూప అనర్థనివృత్తియనునది అనృత, జడ,దుఃఖ,అనాత్మరూప ద్వైతమునకు విరోధియగు వేదాన్తవాక్యజనిత బ్రహ్మాకార అంతఃకరణపరిణామరూప దర్పణమునందు ప్రతిబింబిత సత్య,జ్ఞాన,ఆనంద, అనన్త మరియు అహంరూప బ్రహ్మముగానే తెలియబడుచున్నది.కావున,జ్ఞాతత్వోపలక్షిత ఆత్మయే మోహనివృత్తిరూపముగాచెప్పబడుచున్నది—అని అభియుక్తుల వచనము. విస్తృత విచారణ అన్యత్ర ఆకర గ్రంథములలో గనందగును.

నిత్యసిద్ధమైన మోక్షము సకలప్రాణులయొక్క స్వరూపమగుటచే మోక్షము సమస్తజీవులచే స్వాభావికముగానే కోరబడుచున్నదను విషయమును "**నైష్కర్మ్యసిద్ధి**"యను గ్రంథారంభమున వృద్ధులు,పరమపూజ్యులునగు శ్రీసురేశ్వరాచార్యులవారు ప్రతిపాదించియున్నారు.

**"ఆబ్రహ్మస్తంబపర్యన్తైః సర్వప్రాణిభిః సర్వప్రకారస్యాపి దుఃఖస్యస్వరసత ఏవ జిహాసితత్వా త్తన్నివృత్యర్థా ప్రవృత్తిరస్తి స్వరసత ఏవ"**

బ్రహ్మమొదలు పిపీలికవరకుగల సకలజంతువులచే సర్వవిధములగు దుఃఖమువిడువవలసినదని స్వభావముగనే కోరబడుచున్నందున,ఆ దుఃఖనివృత్తి కొఱకు స్వభావముగనే ప్రవృత్తి కలుగుచున్నది.

**విశేషము:**—లోకంలో దుఃఖమనునది లేదా?ఉంటే లోకులచే తెలియబడుట లేదా?తెలియబడిననూ దుఃఖము నిత్యము మరియు పరిహరించుటకు అశక్యమని భావించి దానిని తొలగించుకొనగోరుట లేదా?తొలగించుకొనగోరిననూ సరియైనఉపాయములు(సాధనములు)లేవా?ఉన్ననూ తెలియబడుట లేవా? ఒకవేళ శాస్త్రములచే దుఃఖనివృత్త్యుపాయములు తెలియబడిననూ,వాటికంటే ఏవైనా లౌకిక సులభోపాయములున్నందున లోకులు శాస్త్రీయ ఉపాయములను ఉపేక్షించుచున్నారా?ఇట్లు దుఃఖ విషయంలో అనేక ప్రకారముల జిజ్ఞాస కలుగుటకవకాశముంది. కాని,

జగత్తులో దుఃఖమనునది లేదు—అని చెప్పుటకు వీలులేదు.అంతఃకరణముయొక్క రజోగుణపరిణాత్మక,ప్రతికూలవేదనీయమగు అనగా ప్రతిప్రాణియొక్క బుద్ధికి అనిష్టముగా అనుభూతమగు దుఃఖమును ఎవరునూ ఎప్పుడునూ ప్రత్యాఖ్యానము(నిరాకరణము)చేయుటకు వీలుపడదు.వేదాన్తములచే(ఉపనిషత్తులచే)**"నేహనానాస్తికిఞ్చన"**(కఠ.2-1-11,బృ.4-4-19)**"అతోఽన్యదార్తమ్"**(బృ.3-4-2;3-5-1;3-7-23)అని బ్రహ్మభిన్న దుఃఖరూప ద్వైతప్రపంచము నిషేధింపబడినందున,దుఃఖమునిత్యముగాదు మరేమనగా మిథ్యయేయని ధృవీకరించనైనది. మరియు ఆబ్రహ్మస్తంబపర్యంతము సకలప్రాణులకు ప్రతికూల వేదనీయముగా

(అనిష్ట అనుభవరూపముచే)తెలియబడుచున్నందున,దుఃఖమును పరిహార్య ముగా భావించి, తొలగించు కొనుటకు ఇచ్ఛజేయుచున్నారు. ఎందుకనగా ,

**"కామసఙ్కల్పో"**(బృ.1-5-3) మరియు

**శ్లో ॥శోకహర్షభయక్రోధలోభమోహస్పృహాదయః॥**

**అహఙ్కారస్య దృశ్యన్తే జన్మ మృత్యుశ్చ నాత్మనః॥**(భాగ.11-28-15)

అహంకారమున్నపుడు శోకము(దుఃఖము)మున్నగు ధర్మములు ప్రతీతమ గుచున్నవి—అన్వయము.అహంకారములేనిచో ప్రతీతియగుటలేవు—వ్యతిరేకము.జా గ్రత్స్వప్నములలో అన్వయము,సుషుప్తిలో అహంకార అభావమున్నందున శో కాదులయొక్క వ్యతిరేకము(అభావము) అనుభవములో ఉంది.స్థూలసూక్ష్మ దేహములతో తాదాత్మ్యాభిమానము పొందిన విశేషచైతన్యము—జీవుడు-అ హంకారమనబడును.అంతఃకరణము దానిధర్మములతో,స్థూలదేహము దానిధ ర్మములతో చైతన్యము మిథ్యాఅభిమానమును పొందినపుడు అహంసుఖీ, అహందుఃఖీ,స్థూలోఽహం,కృశోఽహమ్-ఇత్యాదిరూపముచే(జీవుడు)వ్యవహరిం చును.కాని,చైతన్యంసుఖీ,చైతన్యందుఃఖీయను అనుభవమెచ్చటను కానరాదు. కావున,పైఅన్వయవ్యతిరేక యుక్తిచేతను మరియు దేహద్వయము తద్ధర్మ ములు దృశ్యములై సాక్షి—సామాన్య(శుద్ధ)చైతన్యముచే తెలియబడుచున్నం దువలనగూడ శోకాదులు అహంకారమునకేగాని ఆత్మ(శుద్ధచైతన్యమున)కు లేవని,పైశ్రుతిస్మృతులచే నిర్ధారణ చేయబడినందువల్ల సకలప్రాణులు సర్వప్ర కారముల దుఃఖమును పరిహరింపగోరుచున్నారు.

దుఃఖము నాకుకావాలి(కలుగాలి)అని యేప్రాణియును కోరదు.అనగా,దుఃఖ ము సర్వులకు ద్వేష్యమున్నది,అనగా ద్వేషమునకు విషయమగుచున్నది.

సర్ప,చోర,వ్యాఘ్రాదులుగూడ ద్వేష్యములున్నవి.వాటివలనగూడ దుఃఖము కలుగుతుంది.కాని,సర్పాదులుస్వరూపముచే దుఃఖములుకావు.అట్లైనచో పాములవానికిగూడ దుఃఖమునివ్వాలి గదా.వానికి సుఖహేతువులగుచున్నవి.కావున స్వరూపముచే దుఃఖములుకావు.ద్వేష్యములుకావు.అందరికి,అన్నికాలములలో,అన్నిదేశములలో దుఃఖమునిచ్చుట లేదు.కాని,ఎప్పుడు ద్వేష్యమగు దుఃఖమునకు సాధనములున్నవను జ్ఞానముకలుగునో(ప్రతికూలజ్ఞానము కలుగునో)అప్పుడవి ద్వేష్యములగును.ప్రతికూలజ్ఞానము చిన్నపిల్లవానికి లేదు.అందువల్ల వానికి ద్వేష్యము(దుఃఖహేతువు)కాదు.చిన్నపిల్లవాడు సర్పమునుగూడ నవ్వుతూ పట్టుకుంటాడు.కావున,సర్పాదులు ద్వేష్యమగు ప్రధాన దుఃఖమునకు సాధనములున్నందున దుఃఖరూపములని గౌణముగా(ఔపచారికముగా)వ్యవహరింపబడుచున్నవి,కాని స్వరూపముచే దుఃఖరూపములు కావు.ఔపచారికముగా,అనగా!జీవనమునకు(ప్రాణమునకు)ఆధారము అన్నము(ధాన్యము).కాని,ధాన్యమును పండించుటకు సాధనమగు"నాగలి"గూడ"జీవనం"అని"**లాంగలం జీవనమ్"**అని గౌణముగా వ్యవహరించబడును.అందుచే, సర్పాదులు ప్రధానదుఃఖమునపేక్షించి,దానికిఅధీనమై దుఃఖరూపములుగా వ్యవహరింపబడుతున్నవి.కాని,స్వరూపముచే కావు.కాని,ప్రధానదుఃఖము అట్లు కాదు.మరేమనగా,స్వరూపముచే ద్వేష్యమగుచున్నది.అందుకే దుఃఖమును ఎవ్వరునూ,ఎప్పుడునూ ఇచ్ఛగించరుగదా!ఈవిషయమునంతటిని జ్ఞప్తియందుంచుకొనినైయాయికులు"**ఇతరద్వేషఅనధీనద్వేషవిషయత్వమ్-దుఃఖిత్వమ్**" అని దుఃఖముయొక్క లక్షణమును చెప్పారు.

ఈదుఃఖము స్వరూపముచే నేకమైనను ఔపాధికభేదముచే ననేకములుగా చెప్పబడుచున్నది.1.ఆధ్యాత్మికదుఃఖములు,2.ఆధిభౌతిక దుఃఖములు,3.ఆది

దైవిక దుఃఖములు—అని .

1.శరీరము,మనస్సు అను ఉపాధులచే(సాధనములచే)గలుగు దుఃఖములు ఆధ్యాత్మికములనబడును.దేహము మరియు మనస్సు అజ్ఞానదశలో"**ఆత్మ**" అని ఆధ్యాసికముగా వ్యవహరింపబడుచున్నందున,వాటివల్లకలుగు దుఃఖము లకు ఆధ్యాత్మికదుఃఖములు అంటారు.శరీరములోని వాత,పిత్త, కఫములు—అను ధాతువైషమ్యమువలన జ్వరాతిసారాదులు స్థూలశరీరములో గలుగున వి '**వ్యాధులు**'అనబడుతాయి.

కామ,క్రోధ,లోభ,మోహ,భయ,ఈర్ష్య,విషాదాదులచేగాని,అభీష్టవిషయము యొక్క అప్రాప్తిచేగాని,కలుగు మానసికదుఃఖములు'**ఆధులు**'అనబడుతాయి. ఈవ్యాధి,ఆధియను రెండువిధముల దుఃఖములను ఆధ్యాత్మిక దుఃఖములు అంటారు.బాహ్యదుఃఖసాధనములగు చోరవ్యాఘ్రాదుల అపేక్షచేత శరీరమనం బులు అను అంతరసాధనములచే కలుగుటచే నీ ఆధ్యాత్మిక దుఃఖములను "**అభ్యన్తరదుఃఖముల**"ని కూడ అంటారు.

2.స్వసంఘాతము(శరీరాదుల)కంటె భిన్నములై,చక్షురాది ఇంద్రియము లకు విషయములగు సర్ప,చోర,శత్రు,వృక్ష,వ్యాఘ్రాది ఉపాధులచేనుత్పన్నమ గు దుఃఖములు ఆధిభౌతిక దుఃఖములనబడును.ఇతర ప్రాణులయొక్క ఇంద్రి యవ్యాపారములచే(క్రియలచే)గలుగు దుఃఖములనియర్థము.ఉదాహరణకు:— ఎవరైనా కఠోరముగామాట్లాడిననూ,కోపముగా చూచిననూ,కొట్టిననూ దుఃఖము కలుగుతుంది.లేదా,పశుపక్ష్యాదులు పైబడి కరచుట,ఆఘాతము చేయుటవలన గలుగు దుఃఖములు—ఇత్యాదులు ఆధిభౌతిక దుఃఖములనబడతాయి.

3.స్వసంఘాతముకంటె భిన్నములై,చక్షురాద్రీంద్రియములకు అగోచరము లగు యక్ష,రాక్షస,వినాయక,గ్రహ,పిశాచాదుల ఆవేశమువల్లగలుగు దుఃఖము

లను ఆధిదైవిక దుఃఖములని అంటారు.ఈయక్షరాక్షసాదులు సాక్షాత్తుగా దుఃఖ కారణములు కారు.పంచభూతాత్మక విషయములలో ప్రకోపమును సృష్టించి, వాటిద్వారా దుఃఖమును కలుగజేస్తారు.ఉదా:—అతివృష్టిద్వారా భూమండల మును జలమయముచేసి,ఆజలాభిమానిదేవత ప్రాణులకు దుఃఖమును కలుగ జేయును.పిడుగులు పడి మనుష్యులు,జంతువులు మరణించుట,వడగండ్ల వర్షము కురిసి పంటలు పాడగుటద్వారా జలాధిష్టానదేవత జీవులకు దుఃఖము ను కలిగించును. భూకంపముద్వారా భూమిఅధిష్టానదేవత; పెనుతుఫానులు భయంకరమైన గాలులు వీచుటద్వారా వాయుఅభిమానిదేవత; బడబానలము, దావానలము ఇత్యాదులచే ఆగ్న్యభిమానిదేవత ప్రాణులకు దుఃఖమును కలుగ జేయుదురు.గ్రహపిశాచాదులు శరీరములోఆవహించి,శరీరముద్వారా ఆవహిం పబడినవ్యక్తిని మరియు ఇతరులనుగూడ దుఃఖపెట్టును.ఈ ప్రకారముగాయథా యోగ్యము ఊహించనగును.ఆదిభౌతిక ఆధిదైవిక దుఃఖములు బాహ్యమగు ఉపాధులచే(సాధనములచే)నుత్పన్నమగుటచే బాహ్యదుఃఖములుగా పరిగ ణింపబడతాయి.

ఈదుఃఖత్రయము ఒక్కొక్కటి పునః త్రివిధము.1.అతీతము,2.అనాగతము, 3.వర్తమానము.గతించిపోయిన దుఃఖమతీతము.రాబోవు దుఃఖమనాగతము మరియు యీవర్తమాన శరీరముద్వారా అనుభవింపబడు దుఃఖము వర్తమా నము అనబడును.వీనిలో నతీతదుఃఖము పూర్వముననే గతించిపోయినందుచే దాని నివృత్తికొఱకు యత్నము చేయనక్కఱలేదు.“**ప్రారబ్ధంభోగతోనశ్యేత్**”వర్త మాన దుఃఖము అనుభవించనిది నివృత్తికానందున దాని నివృత్తికొఱకును యత్నము చేయనక్కఱలేదు.అనాగత దుఃఖముమాత్రము భయహేతువుగాన నా దుఃఖమురాకుండుటకు ప్రయత్నమవశ్యముగ జేయదగును.కావున,ఆ

ధ్యాత్మికాది అనాగత దుఃఖత్రయ నివృత్తికొఱకే లోకమున అందఱూ ప్రయత్న ము జేయుచుందురు.

"**తరతిశోకమాత్మవిత్**"(ఛాం.7-1-3)ఆత్మజ్ఞాని శోకమును దాటుతాడు.శోక ము=అజ్ఞానసహితబంధము(అనర్థము;సమస్తదుఃఖములు)ఆత్మజ్ఞానముచేత తరింపబడును.తరించుట అనగా"**తరతిబ్రహ్మహత్యాంయోఽశ్వమేధేనయజతి**" (తైత్తరీయసంహిత.5-3-12-2)ఎవరు అశ్వమేధయాగముచేయుదురో,వారియొక్క(బ్ర హ్మహత్యవలనకలిగిన)మహాపాపము నివృత్తమగును—అని చెప్పబడినట్లు,ఇ క్కడ(శోకంతరతి)శోకోపలక్షిత అజ్ఞానతత్కార్యరూపబంధము నివృత్తమగును (బాధింపబడును)అని అర్థము.కాని,సేతువును దాటినట్లు"**దాటుట**"అని అర్థ ముచేయగూడదు.ఎందుకనగా,శోకమనునది ఒక మూర్తపదార్థముగాదు.సరే.ఇ క్కడ ఆత్మజ్ఞానము సర్వదుఃఖముల అత్యంతనివృత్తికి ఉపాయము(సాధనము) అని వేదాన్త(ఉపనిషత్)శాస్త్రము బోధించుచున్నది. కాని,

**శ్లో॥అర్కే చేన్మధు విన్దేత కిమర్థం పర్వతం వ్రజేత్।**

**ఇష్టస్యార్థస్య సంసిద్ధౌ కో విద్వాన్యత్నమాచరేత్॥**(లోకోక్తి)

పూర్వమీమాంసాభాష్యము (1-2-4)లో శ్రీశాబరస్వాములవారు ఇలా చెప్పారు. దారిప్రక్కనే జిల్లేడుచెట్టుకు తేనెతెట్టె ఉంది.అయత్నలభ్యమధు (అనాయాసము గ మంచితేనె)లభించుచుండగా,దానికోసం పర్వతమునకు వెళ్ళునా?ఎందుక నగా,తనకభీష్టమైన వస్తువు లేదా ప్రయోజనము సులభోపాయముచే ప్రాప్తమ గుచుండగా,యేబుద్ధిమంతుడు(వివేకి)బహుళప్రయాసము చేయగోరును?

అట్లే,త్రివిధదుఃఖముల నివృత్తికై సరళమైన,సులభమైన లౌకికఉపాయము లు ప్రాప్తమైయుండగా,అనేక జన్మలనుండిచేయు బహుళ అభ్యాస పరంపరలచే

దుష్కర(ఆయాససాధ్య)మగు తత్త్వజ్ఞానమును యెవరు పొందగోరుదురు? అందువలన,

**“మనుష్యాణాం సహస్రేషు......కశ్చిన్మాం వేత్తి తత్త్వతః”॥**(గీత. 7-3)

అని శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లు నూటికో కోటికో యేఒక్కడో దప్ప అందఱునూ పైనజెప్పబడినలౌకికన్యాయమునే అనుసరించుచున్నారు.స్థూల శరీరమునకు సంక్రమించు వ్యాధులవలన ఉత్పన్నదుఃఖములను ప్రతిఘటిం చుటకొఱకు చెప్పబడిన చికిత్సాశాస్త్రములోని వందలకొలది ఉపాయములన వలంబించి వైద్యులచేనొసంగబడు ఔషధోపచారములద్వారా లోకులు స్వస్థతను పొందుచున్నారు.మానసికదుఃఖముల ప్రతీకారముకొఱకు మనస్సుకునచ్చిన (స్వప్రియ)యువతి సంభోగము,చల్లని పానీయములు,మద్యపానము,మృష్టా న్న భోజనము,స్రక్ చందనము,సుగంధ తైలలేపనము,మనోఽనుకూల వస్త్ర ములు,అలంకారములు మున్నగు స్వల్పఆయాససాధ్యమగు(సుకర)ఉపాయ ములను అవలంబించుచున్నారు. అట్లే,

**శ్లో॥శకటం పఞ్చహస్తేషు దశహస్తేషు వాజినమ్ ।**

**గజం హస్త సహస్రేషు దుర్జనం దూరతస్త్యజేత్॥**

**“దంష్ట్రిణః శృఙ్గిణో దూరతః పరివర్జ్యాః”। “నాఽదణ్డోబహిర్గచ్ఛేత్”॥**

శకటము(బండి)పోవునపుడు దానికి ఐదుమూరల దూరంలో ఉండాలి.గు- ఱ్ఱమునకు పదిమూరలదూరంలో,గజము(ఏనుగు)నకు వేయిమూరల దూరం లో ఉండాలి.దుష్టునకు కనబడనంతదూరంలో ఉండాలి.చేతిలో దండము(కఱ్ఱ) లేకుండా బయటకువెళ్ళకూడదు.కోరలుగల పాము మున్నగు తిర్యక్ప్రాణులు;

భయంకర దంతములుగల జంతువులు(కుక్క,పిల్లి,పులి,సింహము)మరియు కొమ్ములుగల జంతువులు(ఎద్దులు,యెనుబోతులు,దుప్పి,జింక,ఖడ్గమృగము) ఇత్యాదులు త్యాజ్యములు.అనగా వీటితో చనువుగా ఉండరాదు.విశ్వసించరాదు. హానికారకములు గావున చాలా దూరంగా జాగ్రత్తగా ఉండాలి—అని నీతిశాస్త్రము చెప్తుంది.ఇంతేగాక,సాంసారిక సమస్తవ్యవహారచాతుర్యమును బోధించే బృహస్ప తి,ఉషనస్,కామందక మున్నగువారు రచించిన నీతిశాస్త్రాలను అవలోకించి వ్యవహారనైపుణ్యమునుపొంది;మరియు ఏవిధమగు ఉపద్రవములు(అపాయ ములు)లేని చోటున నివసించుట మున్నగు ఉపాయములచేత ఆధిభౌతిక దుఃఖములను లోకులు దూరము చేసుకుంటున్నారు. మరియు,

ఆధిదైవిక దుఃఖనివృత్తికొఱకుగూడ మణిధారణము,మంత్రానుష్ఠానము,ఔష ధసేవనాది సులభోపాయముల నవలంబించుచున్నారు.అలాంటప్పుడు శాస్త్ర బోధిత అనేకజన్మఅభ్యాసపరంపర ఆయాససాధ్య దుష్కర తత్త్వజ్ఞానమును పొందుటకు యెవరు ఇచ్ఛచేయుదురు?

ఇచ్చట,సశాస్త్రీయముగా సమాధానము చెప్పబడుచున్నది.యద్యపి యథో క్తరీతిగా సుకరమగు లౌకిక దృష్టోపాయములచే,అనగా వైద్యశాస్త్రోక్త రసాయనాది "**రోగనాశకఔషధోపచారములను**"విధిపూర్వకముగాసేవించినను,కామినీసంభోగా దులొనర్చినను;నీతిశాస్త్రాభ్యాసము మరియు మంత్రానుష్టానాది ఉపాయముల నవలంబించినను—ఆధ్యాత్మికాది ఆయా దుఃఖములయొక్కఐకాన్తికముగా(అ వశ్యముగా—నిశ్చయముగా)మరియు అత్యన్తికముగా(నివృత్తదుఃఖములు మ ళ్ళీఉత్పన్నముకాకుండా)నివృత్తి కలుగుటలేదు.ఎందుకనగా,"**నివృత్తస్యాపి పు నరుత్పత్తిదర్శనాత్**"దుఃఖములు ఆయా దృష్టోపాయములచే నివృత్తమయినప్ప టికిని మళ్ళీమళ్ళీ ఉత్పన్నమగుట అనుభవసిద్ధమున్నది.

**శ్లో॥సుఖస్యానన్తరం దుఃఖం దుఃఖస్యానన్తరం సుఖమ్।**

**సుఖం దుఃఖం మనుష్యాణాం చక్రవత్పరివర్తతే॥**(గరుడ.పు.113-61)

**న నిత్యం లభతే దుఃఖం న నిత్యం లభతే సుఖమ్**

॥(శాం.ప.25-23)(భవసంతరణోపనిషత్. 1-10)

**శ్లో॥కస్యాత్యన్తం సుఖముపనతం దుఃఖమేకాన్తతో వా।**

**నీచైర్గచ్ఛత్యుపరి చ దశా చక్రనేమిక్రమేణ॥**

(శ్రీకాళిదాసకృత-ఉత్తరమేఘదూతము-46)

రథచక్రముయొక్క నేమి(చుట్టుకమ్మి)వలె మనుష్యులకు సుఖదుఃఖములు ఒకదాని తరువాత మరొకటి వస్తూపోతూ ఉంటాయి.సుఖము ఎల్లపుడూ ఉండునది కాదు.దుఃఖముకూడ ఎల్లపుడూ ఉండునది కాదు.జగత్తులో కేవలము సుఖమునుగాని,దుఃఖమునుగాని ఎల్లపుడూ నిశ్చయముగా యెవరనుభవించుచున్నారు?

కావున పైనచెప్పబడిన లౌకికఉపాయములచే యేదుఃఖనివృత్తి చెప్పబడినదో,అది అనైకాన్తికము(అనిశ్చితము),అనాత్యన్తికము(పునరుత్పత్తి)గలదగుటచే ఐకాన్తిక,అత్యన్తిక సర్వదుఃఖములయొక్క నివృత్తికొఱకు ఆత్మతత్త్వవిజ్ఞానమును జిజ్ఞాసచేయుట నితాంత ఆవశ్యకమున్నది. ఎందుకనగా?

**"జ్ఞానాదేవతుకైవల్యమ్"**(లోపశ్రుతి);**"అజ్ఞానాదేవసంసారోజ్ఞానాదేవవిముచ్యతే"** (యోగతత్త్వోపనిషత్-16).**"తరతిశోకమాత్మవిత్**(ఛాం.7-1-3),**"బ్రహ్మవేదబ్రహ్మైవభవతి"**(ముం.3-2-9);**"జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః"**(శ్వే. 1-8;2-15) **"జ్ఞానంలబ్ధ్వాపరాం శాన్తిమచిరేణాధిగచ్ఛతి"**(గీత.4-39);**"ముక్తిస్తుబ్రహ్మతత్త్వస్యజ్ఞానాదేవనచాన్యథా।**

**స్వప్నబోధంవినానైవస్వస్వప్నో హీయతేయథా"॥**(వే.పం.6-210).స్వప్నమునుండి తాను స్వయంగా మేల్కొననిచో తాను నిద్రాదోషముచే చూస్తున్న కల్పితస్వప్న మెట్లు నివృత్తముకాదో,అట్లే తనస్వస్వరూపమగు బ్రహ్మతత్త్వమును తెలిసి కొనకుండా స్వప్నతుల్యమగు నీయజ్ఞానతత్కార్యమగు బంధము నివృత్తము (బాధ)కాదు."**సర్వదుఃఖ అత్యన్త నివృత్తి, పరమానన్ద బ్రహ్మప్రాప్తిరూప**"మోక్షము బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముచేతప్ప అన్యమగు యేఉపాయముచేతగూడ ప్రాప్తముకాదు—అని పైశ్రుతులు స్మృతులు నొక్కివక్కాణించుచున్నవి.కనుక,తత్త్వజ్ఞానముచే అజ్ఞాననివృత్తిద్వారా కలుగు మోక్షము సకల పురుషులయొక్క ఇచ్ఛకు విషయమగుచున్నందున,మోక్షముయొక్క ఇచ్ఛ=ముముక్షుత్వము సర్వప్రాణులచే స్వభావముగనే కలుగుచున్నది.సరే,ప్రకృతము ననుసరించెదము.

ఈముముక్షుత్వమును వ్యాఖ్యానిస్తూ శ్రీఆద్యగురు శంకరాచార్యుల వారు—

**శ్లో॥అహఙ్కారాది దేహాన్తాన్ బన్ధాజ్ఞాన కల్పితాన్।**

**స్వస్వరూపావబోధేన మోక్తుమిచ్ఛా ముముక్షుతా॥**(వి.చూ.28)

చక్షురాదీంద్రియములందును,శరీరమునందును"**అహం**"(నేను)అను అభిమానముతో,అంతఃకరణము చైతన్యముయొక్క ఆభాసతేజస్సుతో ప్రవర్తించును. అదియే అహంకారముగా తెలియదగినది—అని(వి.చూ.105) చెప్పిన విధముగా చిత్ప్రతిబింబముతోగూడిన అంతఃకరణమే అహంకారము, ఆనందమయకోశము అను పేరుగల భోక్తయగు జీవుడు అహంకారము.

మరియు,ఆనందమయ కోశమను పేరుగల యేఅహంకారము సుషుప్తియందు గలుగు సుఖలేశముచే"**నేను సుఖముగలవాడను**"అని బావించుచుండునో, అది ఆత్మయెట్లగును?(స్వాత్మనిరూపణము-13).ఇచ్చట ఆనందమయకోశమే అహం

కారమని చెప్పబడినది.అదిగూడ అజ్ఞానకల్పిత మనియు,మనోరూప ఉపాధి నిబట్టి గౌణమగు వికారమనియు చెప్పాలి.కావున,ఆత్మసాక్షాత్కారమునకు పూర్వము ఆత్మగా భావింపబడుచున్న ఆనందమయకోశము మొదలుకొని అన్నమయకోశ పర్యన్తముగల పంచకోశములు యేవిగలవో—ఇవియే బంధమ నబడును.ఈబంధమునుసమూలముగా(మరలవాటియందుఎన్నడును అహం బద్ధి కలుగకుండువిధముగా)నశింపజేయుటకు(బాధించుటకు)గలుగు తీవ్ర ఇ చ్ఛయే ముముక్షుత్వమనబడును.స్వస్వరూపజ్ఞానముకలుగుటతోడనే"**యత్ర త్వస్యసర్వమాత్మైవాభూత్తత్కేనకంపశ్యత్**"(బృ.4-5-15)అను శ్రుతిచేస్వభిన్నమ గుయేవస్తువుగూడ బాసింపదుగాన కోశపంచాత్మకమగు బంధము పూర్తిగా నివర్తించును అని భావము.

అట్లే,సర్వవేదాన్త సిద్ధాన్త సారసంగ్రహములో ఆచార్యులు ఈ విధముగా చెప్పున్నారు.

**శ్లో॥సాధనానాం తు సర్వేషాం ముముక్షా మూలకారణమ్।**

**అనిచ్ఛోరప్రవృత్తస్య క్వ శ్రుతిః క్వను తత్ఫలమ్॥**226.

మోక్షమును పొందవలయునను కోరికయే—ముక్తిసాధనములన్నింటికిని మూలకారణము.మోక్షవాంఛయేలేనివానికి మోక్షసాధనములలో ప్రవృత్తియే కలుగదు.అట్టి పురుషునికి వేదముగూడ యేమిచేయగలదు?వేదబోధిత ఫల ముగూడ యెట్లు ప్రాప్తించును?

తీవ్ర మధ్యమ మంద అతిమంద అను భేదముచే ముముక్షా నాల్గు విధములు—అని పండితులచే చెప్పబడుచున్నది.శ్రద్ధతో వినుము.ఏమానవు డు ప్రతిదినము ఆధ్యాత్మికాది దుఃఖత్రయముచే పరితపింపబడుచుండుటచే

క్షణకాలముగూడ మనశ్శాన్తిలేనివాడై తుదకు సంసారమంతయు అనర్థ రూపమేయని తలంచి భార్యాపుత్రాదులనందఱను పరిత్యజించి పరమేశ్వరునే శరణాగతినొందునో అట్టివాని ముముక్షా తీవ్రముముక్షా యనబడుచున్నది.227& 228.

లోకంలో కొంతమంది పండితులు"**సంసారములో నున్నంతవరకు తాపత్రయదుఃఖములు తప్పవని,పరమాత్మ స్వరూపసాక్షాత్కారమువల్లనే శాశ్వత సుఖము గల్గుననియు**"అనుభవమువలనను,శాస్త్రమువలనను గ్రహించియుగూడ భార్యాపుత్రాదులను విడువలేనివారై,సంసారమున ఉందుమా?లేక సంన్యసింతుమా?అని మీన మేశాది నక్షత్ర తిథి వారములను లెక్కించుచుందురు. అట్టివారి ముముక్షా మధ్యమ ముముక్షా యగుచున్నది. 229.

మోక్షమును బొందుటకు ముందు చాలాకాలముందిలే!ఇప్పటినుండియే తొందరపడనేల?మానుషభోగములనన్నియు అనుభవించి మునిమనుమని పాణిగ్రహణమహోత్సవమునుగూడ కండ్లజూచి,పిమ్మట ముక్తి విషయమునాలోచింపవచ్చునులే!అని యనుకొనుచుండువాని ముముక్షా మందముముక్షా యని చెప్పబడుచున్నది. 230.

మార్గమున పయనించుచున్న మనుష్యునకు మణిలభించు నటుల సంసారభోగములననుభవించుచున్న నాకు ప్రయత్నమేమియును లేకయే అకస్మాత్తుగా మోక్షము లభించినచో నేను కృతార్థుడనగుదును—అనునీవిధమగు మూఢుల యభిప్రాయమునే అతిమంద ముముక్షా అందురు. 231.

ఏద్విజుడు అనేకజన్మములందు తన వర్ణాశ్రమవిహిత ధర్మానుష్ఠానమువలన పరమేశ్వరుని పూజించుటచేత,పోగొట్టబడిన సమస్త పాపములుగలవాడై వేదాన్తశాస్త్రమును బాగుగావిచారించి గుణదోషములను గుర్తెఱింగి,విషయ వాం

ఛలను   పూర్తిగావిడనాడి,నిత్యానిత్యవస్తువివేకముగలవాడై,మోక్షమునుతప్ప యితరమును వాంఛింపక,శాస్త్రనియమములను  అవలంభించియుండునో,అట్టి వాడు అగ్నిచేగృహము దహింపడుచున్నపుడు గృహవస్తువులన్నింటిని విడిచి, ప్రాణముదక్కిన చాలునని బయటపడునట్లుగా,భార్యాపుత్రాదులను పరిత్యజించి,సద్గురు కృపాకటాక్ష వీక్షణముచే బన్ధవిముక్తుడగుచున్నాడు. 232 నుండి 235.

తీవ్రముముక్షువు ఈజన్మమున జీవించియుండగనే,మధ్యమ ముముక్షువు మరొకజన్మమునను,మందముముక్షువు యుగాంతరమునను ముక్తినొందుచున్నారు.ఇక అతిమందముముక్షువునకు యెన్నిజన్మలకైనను ముక్తియొక్క ఆశగూడ లేదు. 236.

**శ్లో॥జన్తూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా।**

**తస్మాద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్॥**

**ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః।**

**ముక్తిర్నో శతకోటి జన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే॥**(వి.చూ.2)

జన్మించు స్వభావముగల ప్రాణులకు మనుష్యజన్మ దుర్లభమైనది. స్థూల శరీరముతో సూక్ష్మశరీరమునకుగలగు 'సంబంధమే' ***జన్మ*** అనబడును.అనగా సూక్ష్మశరీరమునకు అనగా తదభిమానియగు జీవునకు అనేక జన్మములను పొందే అవకాశముంది.అప్పుడే"**నరజన్మదుర్లభమ్**"అని చెప్పుట పొసగును.అంటే,శరీరముకంటె ఆత్మభిన్నము అనునది స్పష్టమగుచున్నది.ఈవిషయమును నమ్ము ఆస్తికునకే మోక్షశాస్త్రమునందు అధికారముగలదు.మానవుడు ప్రాణులన్నింటికంటె వివేకబుద్ధిగలవాడు గనుక శ్రేష్ఠుడని చెప్పబడినది.మనుష్య

లలో పురుషుడు సర్వప్రకారములుగా స్వతంత్రుడుగావున,పురుషుడుగా జన్మించుట దుర్లభమని చెప్పబడినది.అందులో ద్విజుడుగా జన్మించుట మరీ దుర్లభము.

**శ్లో॥బ్రాహ్మణస్యతు దేహోఽయం నైవైహిక ఫలప్రియః।**

**కృచ్ఛ్రాయ తపసే చేహ ప్రేత్యానన్త సుఖాయ చ॥**(స్కం.పు.మహే. ఖం- కౌమారిక ఖం. 7-66)

ఈబ్రాహ్మణదేహము ఐహికసుఖోపభోగముల ననుభవించుటకొఱకు కాదు. ఈలోకంలో ఎన్నియో కఠోరమైన తపస్సులుచేసి కష్టములననుభవించి మరణానన్తరము సుఖానుభవముకొఱకు ప్రాప్తమైనది—అను స్మృత్యనుసారము ద్విజుడుగా పుట్టిననూ వేదవిహిత ప్రవృత్తినివృత్తి ధర్మములననుష్ఠించు యోగ్యతగల బ్రాహ్మణుడుగా జన్మించుట ఇంకా దుర్లభము.ఆత్మసాక్షాత్కారమునొందుటకు కేవలముబ్రాహ్మణుడైనంత మాత్రమున చాలదు.విహిత ధర్మాచరణము అత్యంతావశ్యకమున్నది.**"ధర్మోవిశ్వస్య జగతః ప్రతిష్ఠా"**(మహానారాయణోపనిషత్.79-7)సమస్త ప్రపంచమునకు ధర్మము ఆశ్రయభూతము.దానికంటె విద్వత్త్వము=శాస్త్రీయపరోక్షజ్ఞానము,దానికంటెను ఆత్మానాత్మవివేకము గల్గియుండుట చాలా దుర్లభము.ఆపైన పరవైరాగ్యమునొంది శుభేచ్ఛ(శాస్త్రసజ్జనసంపర్కాభిలాష) గలవాడై,సదాచార ప్రవృత్తిగల్గి,విషయాభిలాషను క్షీణింపజేసికొని,శ్రవణ మనన నిదిధ్యాసనములనొనర్చి సత్త్వాపత్తి(సత్త్వగుణాభివృద్ధి)నొంది తద్వారా స్వస్వరూపసాక్షాత్కారమునొంది,ఉత్తరోత్తరభూమికల నధిరోహించి బ్రహ్మాత్మ(అద్వైత) రూపముచే స్థితిగల్గియుండుట అత్యన్తదుర్లభము.అట్టి**"బ్రహ్మాత్మనా సంస్థితి"** యేదిగలదో అదియే ముక్తి.అది శతకోటి జన్మకృతములగు పుణ్యములు లేకున్నచో లభింపదు.

**శ్లో॥దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకమ్।**

**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః॥**(వి.చూ.3)

మనుష్యత్వము,మోక్షముయొక్క ఇచ్ఛ మరియు మహాపురుషుల ఆశ్రయము—అను నీ మూడును దైవానుగ్రహముచేతనే గలుగును.

దుర్లభమైన మనుష్యజన్మను ఎట్లో పొందియు,అందులో పురుషత్వమును మరియు శాస్త్రజ్ఞానము(పరోక్షజ్ఞానము)నొందియుగూడ యే మూఢబుద్ధి గలవాడు స్వాత్మ(తనయొక్క)ముక్తికై ప్రయత్నించడో,అతడు అసద్వస్తువులను గ్రహించు చెడ్డపట్టుదలవలన తన్నుతాను చంపుకొను ఆత్మఘాతకుడగుచున్నాడు.

**"అసన్నేవ స భవతి, అసద్బ్రహ్మేతి చేద్వేద"**(తై.2-6)

**"యోవాఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి సకృపణః"**(బృ.3-8-10)

**శ్లో॥యోఽన్యథా సన్తమాత్మానమన్యథా ప్రతిపద్యతే।**

**కిం తేన న కృతం పాపం చౌరేణాత్మాపహారిణా॥**(సనత్సుజాతీయము.1-33)

బ్రహ్మమును అసద్రూపంగా యెవరు తెలుసికొందురో,అతడు స్వయంగా అసద్రూపుడగున్నాడు.ఎందుకనగా,అసత్పదార్థము పురుషార్థసంబన్ధియై ఉండదు గదా!ఉదా:—వంధ్యాపుత్రునిచే ఏవిధమైన ప్రయోజనము సిద్ధింపదు గదా!

ఓగార్గి!ఎవడు యీఅక్షరమును(బ్రహ్మమును)తెలిసికోకుండానే ఈలోకంనుండిప్రయాణముచేయునో(మరణించునో),అతడు దీనుడు మరియు కృపణుడు అనబడును.అనగా,అతడు మరణించి తిరిగి సంసారముననే(జన్మించుట

మరణించుటయను సుడిగుండముననే) చిక్కుకొనును.

ఎవరు,శ్రుతిప్రతిపాదిత పరబ్రహ్మస్వరూపమును అజ్ఞానముచే విపరీతము గా తెలిసికొందురో,అనగా అలింగము,అచలము,శుద్ధము,సర్వ ద్వంద్వవివర్జి తము,సత్,చిత్,ఆనందబ్రహ్మరూపముగానున్నతనను,అన్యథా అనగా దేహ ద్వయ తద్ధర్మరూపముచే అనగా నేను కర్తను,భోక్త ను,సుఖిని,దుఃఖిని,బక్క చిక్కినవాడను;దొడ్డ(లావు)గాఉన్నాను;అముక(ఒకానొక)వ్యక్తి పుత్రుడను,అ ముకవ్యక్తి మనుమడిని,నేను బ్రాహ్మణుడను ఇత్యాదిరూపముచే విపరీతముగా తెలిసికొనునో,అట్టి అనాత్మవిదుడగు మూర్ఖునిచే,ఆత్మాపహారియగు చోరునిచే ఏపాపము చేయబడలేదు.అనగా,బ్రహ్మహత్యాది సకలమహాపాతకములుగూడ చేసినవాడగుచున్నాడు."**అసుర్యా నామ తే లోకా**"(ఈశా.3)ఇత్యాది శృతులు స్మృ తులు ఆత్మతత్త్వమును తెలుసుకొని ముక్తినొందని మూఢున్ని నిందించుచున్నవి.

ఎవడు కడుదుర్లభమగు మనుష్యజన్మమును,పురుషదేహమును,మంచి చెడుల నెఱుంగు తెలివితేటలు గల్గియుండిగూడ,కేవలము విషయ భోగములనే అనుభవింప గోరుచుండునో,అట్టివాని జన్మము అంధునకు లభించిన మహామ ణివలె నిరర్థకమగుచున్నది.

**శ్లో॥ఖాదతే మోదతే నిత్యం శునకం సూకరః ఖరః।**

**తేషామేషాం విశేషః కః వృత్తిర్యేషాం తు త్రైస్పహ॥**(స.వే.సి.సా.సం.240)

కుక్క,పంది,గాడిద మున్నగు జంతువులు తమతమ ఆహారమును భుజిం చుచు భార్యాపుత్రాదులవలన సుఖముననుభవించుచుండుటను మనమంద-అము యెఱుంగుదుము.ఇట్టియెడ,మనుష్యులై,పురుషులై,బుద్ధిమంతులైన

వారుగూడ శునకాదులవలెనే వ్యవహరించుచుండినచో, లోకంలో పశువులకు పండితులకు భేదము నిరూపింప శక్యముగాదు గదా!(పారాశర శిక్షా. 151)↓

**శ్లో॥ఆహారనిద్రాభయమైథునాని, సామాన్యమేతత్పశుభిర్నరాణామ్।**

**జ్ఞానం నరాణామధికో విశేషః, జ్ఞానేనహీనః పశుభిస్సమానః ॥**(హితోపదేశము.0-25)

పూర్వార్ధం స్పష్టం.పశువులకు మనుష్యులకు భేదమును సూచించు తత్త్వము కేవలం ఒకేఒక్క జ్ఞానం.ఆ జ్ఞానమేలేనిచో పండిత పశువులకు తేడా లేదు.

ముసలితనమున వ్యాధులు మిక్కుటముగా బాధించుచుండును.శరీరేన్ద్రియ సామర్థ్యము ఉడిగిపోవును.చిత్తము పలువిధముల చలించుచుండును.అలాంటపుడు మోక్షముకొఱకు ప్రయత్నముచేయుట కడుదుర్లభమగును.కావున,మానవుడు తాను సమర్థుడైయున్నపుడే,వ్యర్థములగు విషయభోగములకొఱకే తన తెలివితేటలు వినియోగింపక,మనుష్య శరీరప్రాప్తికి పరమ ప్రయోజనమగు నాత్మజ్ఞానమునే సంపాదింప యత్నింపవలయును.లోకంలో బ్రహ్మచర్యము ననుష్టించి ఋషిఋణమునుండి,యజ్ఞాదులననుష్ఠించి దేవఋణమునుండి,సంతానమును గని పితృఋణమునుండి,అప్పులనుతీర్చి మనుష్యఋణమునుండియును బయటపడినవారు పెక్కుమంది గలరు.సంసారమను మహాబన్ధమునుండి విముక్తుడైనవాడు మాత్రము బ్రహ్మవిదుడొక్కడే యగుచున్నాడు.

దేహధర్మములగు జన్మమరణాదులను,ప్రాణధర్మములగు ఆకలి దప్పులను,మనోధర్మములగు శోకమోహములను అజ్ఞానముచే నాత్మయందారోపించుకొనుటయే సంసారబన్ధమనబడుచున్నది.ఇట్టి యనాది మహాబన్ధమున్నంతకాలము,బాహ్యములగు దేవఋణాది బన్ధములెన్ని తొలగినను ప్రయో

జనమెంత మాత్రమునులేదు.కావున,బుద్ధిమంతులగువారు సంసారబన్ధమునే తొలగించుకొనుటకు ప్రయత్నించవలెను.

ఏకోరికచే పురుషుడు ఐహికపారలౌకిక సకలభోగవాంఛలను పరిత్యజించి శ్రవణమననాదులనే నిరన్తరము ఆచరించుచుండునో,అట్టి వాంఛయే తీవ్రము ముక్ష యనబడును.ప్రయత్నములేని మోక్షవాంఛ మాత్రము ఉషరభూమిలో నాటిన బీజములవలె ఫలశూన్యమగుచున్నది.పతివ్రతయగు భార్య,పరలోక మందుగూడ తన భర్తయొక్క సౌఖ్యము నభిలషించినదై తన భర్త మరణించి నపుడు అతనితో సహగమనమునకై, గృహము పుత్రులు ధనము మున్నగు వాటినన్నింటిని అనాయాసముగా అనాదరించి అగ్నిప్రవేశమునకెంత తొందరప డునో,అట్టి తొందరగల ముముక్షువే అతిశీఘ్రముగా ముక్తి నొందగల్గుచున్నాడు.

బ్రహ్మమొక్కటే నిత్యము,తద్భిన్నమంతయును అనిత్యము—అను వివే కమును,దేహము క్షణికమను నిశ్చయబుద్ధియు,ఎప్పుడు మరణింతునోయ ను భయమును,పెక్కుదుఃఖములుగల సంసారము ననుభవించుటెట్లు అని పరితపించుచుండుటయను యిట్టి విచారమువలన తీవ్రమగు మోక్ష వాంఛ గలుగును.

**శ్లో॥అనిత్యం యౌవనం రూపం జీవితం ద్రవ్యసఞ్చయః।**

**ఆరోగ్యం ప్రియసంవాదో గృధ్యేత్తత్ర న పణ్డితః॥**(మ.భా.శాన్తిపర్వము. 205-4)

**శ్లో॥అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః।**

**నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః॥**(పఞ్చతన్త్రమ్.3-96)

యౌవనము,రూపము,జీవితము,ధనసంచయము,ఆరోగ్యము,ప్రియజనస మాగమము—ఇవన్నియు అనిత్యములు.వివేకశీలురగు పురుషులకు వీటి

యందు ఆసక్తియుండుట తగదు.శరీరములు అనిత్యములు.వైభవములు అశా శ్వతములు.మృత్యువు(కాలుడు)క్షణక్షణము వెన్నంటి ఆయువును గ్రసించు చున్నాడు.కావున,క్షణకాలముగూడ జాగుచేయక సర్వధర్మములను పరిత్య జించి స్వధర్మమగుఆత్మతత్త్వావగతిని పొందుటయే పరమకర్తవ్యముగా మిగిలి యున్నది.అంచేత,ఆత్మజ్ఞాన సంపాదనమునకే తీవ్రప్రయత్నము చేయవలయును.

నిత్యానిత్యా వస్తువివేకమనునది శిరస్సు.తీవ్రవైరాగ్యమనునది శరీరము. శమదమాదులు హృదయము మున్నగు ప్రధానావయవములు.మోక్షవాంఛ (ముముక్షుత్వము)ముఖ్యప్రాణము.ఇట్టిశాస్త్రీయాంగములతో కూడుకొనిన ము ముక్షువు అతిశీఘ్రముగా మృత్యువును జయించు చున్నాడు.బ్రహ్మజ్ఞానమ ను ఖడ్గముచే దేహాభిమానము నశించునుగాన"**మమేతిబధ్యతే జన్తుర్నిర్మమేతి విముచ్యతే**"(మహో.4-72)అని చెప్పబడినట్లుగా దేహధర్మమగు మరణ మాతనికి సంభవింపనేరదు."**నచపునరావర్తతే**"(ఛాం.8-15-1)అతడు మళ్ళీ యీసంసార మునకు తిరిగిరాడు. ముక్తుడగునని భావము. *ఇతి ముముక్షుత్వ నిరూపణమ్.*

ఇంతటితో అనుబంధ చతుష్టయములోని"**అధికారి**"వర్ణనము ముగిసినది. ఇపుడు"**సంబంధము**"అను అనుబంధము సంక్షేపముగా నిరూపిం పబడుచున్నది.

## —:41.సంబంధ వర్ణనము:—

సకలవేదాన్తములకు(ఉపనిషత్తులకు)ప్రతిపాద్య విషయము అద్వితీయ బ్రహ్మతత్త్వము.దానిని ప్రతిపాదించు వేదాన్తగ్రంథము ప్రతిపాదకమగును.జీవ బ్రహ్మల ఐక్యము గ్రంథముచే ప్రతిపాద్యమగును.కావున,గ్రంథమునకు విషయ మునకు *"ప్రతిపాద్య ప్రతిపాదకభావ"* సంబంధము గలదు.

అధికారిపురుషుడు మోక్షరూపఫలమును లేదా గ్రంథాధ్యయనముద్వారా

మోక్షసాధనమగు బ్రహ్మాత్మైక్య దృఢాపరోక్షజ్ఞానమును పొందును. కావున,అధికారి ప్రాపకుడనబడును.మోక్షము లేదా జ్ఞానము ప్రాప్యము అనబడును.అందువలన అధికారికి మరియు ఫలమునకు *"ప్రాప్యప్రాపక భావ"* సంబంధము గలదు.

**"శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః"**(బృ.2-4-5&4-5-6)అనంటూ శ్రుతిమాత ఆత్మతత్త్వ విచారమును అధికారికి కర్తవ్యముగా బోధించినది.కావున,విచారము కర్తవ్యము(చేయదగినది).అధికారిపురుషుడు ఆచార్యులవారి ముఖారవిందముద్వారా వేదాన్తశాస్త్రప్రతిపాద్యమగు జీవబ్రహ్మైక్యమును బోధించు తత్త్వమస్యాది మహావాక్యములను శ్రవణముచేసి,పిమ్మట మననము నిదిధ్యాసనము చేయు(విచారముచేయు)కర్తయగును.కావున,విచారమునకు మరియు అధికారికి *"కర్తృకర్తవ్యభావ"* సంబంధము గలదు.

విచారముద్వారా గ్రంథము జ్ఞానమునకు జనకమగును.జ్ఞానము జన్యమగును.అందువలన గ్రంథమునకు మరియు జ్ఞానమునకు *"జన్యజనకభావ"* సంబంధము గలదు.

జ్ఞానముద్వారా అజ్ఞానము నివర్త్యము(నాశ్యము,భాధ్యము)న్నది.జ్ఞానము నివర్తకము(నాశకము,బాధకము)న్నది.కనుక,జ్ఞానమునకు మరియు అజ్ఞానమునకు *"నివర్త్యనివర్తకభావ"* సంబంధము గలదు.

మహావాక్యోపదేశమునుజేయు శ్రీగురుదేవులు బోధకుడగును.అధికారి(శిష్యుడు)భోధ్యుడగును.వీరిద్దరికి *"బోధ్యబోధకభావ"* సంబంధము గలదు.

శ్రవణాదులు జ్ఞానమునకు సాధనములు.జ్ఞానము మోక్షమునకు సాధనమగును.అందుచేత,శ్రవణాదులకు మరియు జ్ఞానమునకు,అట్లే, జ్ఞానమునకు

మరియు మోక్షమునకు "సాధ్యసాధనభావ" సంబంధము గలదు.ఇట్లే, యథాయోగ్యముగా సంబంధములు ఊహించుకొనవలెను.

సంబంధరూప అనుబంధ కల్పనచేయుటలో ఈప్రయోజనము గలదు.ఏ వస్తువునకు దేనితో సంబంధముండునో,ఆవస్తువుయొక్క ఉపయోగము దానికి ఉంటుంది.ఉదా:—కులాలునికి(కుమ్మరివానికి)ఘటము(కుండ)తో సంబంధ మున్నది.కావున,అతనియొక్క ఉపయోగము ఘటమునకున్నది.ఏవస్తు వుయొక్క సంబంధము దేనితో ఉండదో,ఆవస్తువు యొక్క ఉపయోగము దానికి ఉండదు.ఉదా:—చక్షువుయొక్క సంబంధము వాయువుతోగాని,ఆకా శముతోగాని లేదు.రూపముగల వస్తువులచేతనే నేత్రముయొక్క సంబంధ ముంటుంది.వాయువులో మరియు ఆకాశములో రూపములేదు.కావున,వా టితో నయన సంబంధము కుదురదు.కనుక,లోచనముయొక్క ఉపయోగము వాయువునందుగాని,ఆకాశమునందుగాని లేదు.అట్లే,గ్రంథమునకు మరియు బ్రాహ్మమునకు పరస్పర సంబంధములేనిచో గ్రంథమునకు బ్రహ్మమునందుగా ని,బ్రహ్మమునకు గ్రంథమునందుగాని ఉపయోగమేమియును సిద్ధించదు.అట్లే అన్యసంబంధముల విషయములోగూడ తెలిసికోవాలి.ఇట్లు,పరస్పర ఉపయోగ మునకు యోగ్యతగల రెండుపదార్థములకే సంబంధము సిద్ధించును.కాని, నిరుపయోగ పదార్థములకు సంబంధము కుదురనేరదు.అందువలన, యోగ్యత లేకుండా సంబంధముయొక్క అసంభవజ్ఞానరూప అర్థాపత్తి ప్రమాణముచేత, ఆయా పదార్థములయొక్క యోగ్యతను కల్పనచేయుటయను అర్థాపత్తిప్రమ కలుగుచున్నది.ఈకారణమువల్లనే పరస్పరమునకు పరస్పరమునందు ఉప యోగనిశ్చయముకొఱకే ఆయా పదార్థములకు సంబంధమును కల్పనజేసి శాస్త్రములందు చెప్పబడినది.కాని,వేరు ప్రయోజనము లేదు.

## —:42.గ్రంథ ప్రతిపాద్య విషయము:—

గ్రంథ ప్రతిపాద్య "***విషయము***"నకే "***అభిధేయమని***"గూడఅంటారు. "**శాస్త్రజ ప్రమా నివర్త్యాఽజ్ఞానగోచరోఽభిదేయః**".ఏ శాస్త్రజన్య ప్రమాజ్ఞానముచేత నివృత్తియగుటకు యోగ్యమగుఅజ్ఞానమునకు యే పదార్థము విషయమగునో,ఆపదార్థముఆశాస్త్రమునకు"అభిధేయము" (విషయము) అనబడును.వేదాన్తశాస్త్రమును విచారము(శ్రవణాదులు)చేయగా కలుగు చరమవృత్యాత్మక అప్రతిబద్ధ(అహంబ్రహ్మాస్మియను)దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానముచేత నివర్త్యమగు ఆవరణవిక్షేపశక్తులుగల అనాద్యనిర్వచనీయభావరూప(మూల)అజ్ఞానమునకు విషయమగు "**జీవబ్రహ్మైక్యము**"(వేదాన్తశాస్త్రమునకు) *అభిధేయము* లేదా *విషయమ*గును.

**శ్లో॥విషయః శుద్ధచైతన్యం జీవబ్రహ్మైక్యలక్షణమ్।**

**యత్రైవ దృశ్యతే సర్వవేదాన్తానాం సమన్వయః॥**

(సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము-శ్లో.9)

"**విషయో జీవబ్రహ్మైక్యం శుద్ధంచైతన్యం ప్రమేయమ్.తత్రైవ వేదాన్తానాం తాత్పర్యాత్**".(వేదాన్తసారము)

అర్థము:—ఏ జీవబ్రహ్మైక్యరూప శుద్ధచైతన్యము(పరబ్రహ్మము)సకల వేదాన్తములకు(ఉపనిషత్తులకు)సమన్వయముగా(తాత్పర్యముగా)తెలియబడుచున్నదో,ఆ "**జీవబ్రహ్మైక్యమే**" వేదాన్తశాస్త్రమునకు(బ్రహ్మసూత్రములకు)**అభిధేయము,ప్రమేయము**,లేక **విషయము** అనబడును.అది-యే సకలవేదాంత ప్రకరణగ్రంథములకుగూడ ప్రతిపాద్యవిషయమగును.

**అజ్ఞాత బ్రహ్మ విషయం జ్ఞాతం బ్రహ్మ ప్రయోజనమ్।**

అజ్ఞాతబ్రహ్మము వేదాంతములకు ప్రతిపాద్యవిషయము అనగా విచారమునకు విషయము మరియు జ్ఞాతబ్రహ్మము ప్రయోజనమగును.

శంక:—శుద్ధచైతన్యము సకలజీవులయొక్క స్వరూపమై యున్నందున విచారమునకు పూర్వమే నిత్యప్రాప్తమై,స్వతస్సిద్ధమై,నిత్య అపరోక్షమై, స్వప్రకాశరూపముచే అనుభవసిద్ధమైయున్నందున,ఎవరికిగూడ ఆత్మవిషయంలో సంశయముగాని,విపరీతభావనగాని లేదు.“**నహ్యాత్మన్యహమ నహం వేతి కశ్చిత్సందిగ్ధే,నైవాహమితి వా విపర్యస్యతి**”।కావున,ఆత్మ విచారమునకు విషయమే కానందున,కాకదంతపరీక్షవలె ఆత్మవిచారణ వ్యర్థము(నిష్ప్రయోజనము)గదా?ఎందుకనగా!సందిగ్ధము,సప్రయోజనమగు వస్తువే విచారమునకు విషయమగును.

**శ్లో॥కాకస్య కతి వా దన్తాః,మేషస్యాండం కియత్ఫలమ్।**

**గర్ధభస్య కతి వా కేశాః ఏషా మూర్ఖ విచారణా॥**

అర్థం స్పష్టము.

సమాధానము:—స్వరూపేణావభాసమానత్వేఽపిపరిపూర్ణసచ్చిదానంద ప్రత్యక్స్వరూపతయా అజ్ఞాయమానత్వాత్విషయత్వోపపత్తిః।

సామాన్యస్వరూపముచే ఆత్మయొక్క అవభాసమున్నప్పటికిని పరిపూర్ణసచ్చిదానంద బ్రహ్మము ప్రత్యక్స్వరూపముచే అజ్ఞాతమున్నందున విచారమునకు విషయమగుట సంభవిస్తుంది.లేక,

పరోక్షరూపముచే ప్రసిద్ధ బ్రహ్మాత్మవస్తువునుద్దేశించి దాని అపరోక్షము(సాక్షారము)కొఱకు విచారప్రవృత్తి ఉపపన్నమగును.“**ఆత్మా వా అరే**

**ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః**”(బృ.2-4-5;4-5-6) ఇత్యాది శ్రుతులచే ప్రత్యగభిన్నపరమాత్మ శ్రవణాది విచారమునకు విషయముగా తెలియబడుచున్నది.

—:43.**ప్రయోజన వర్ణనము**:—

“**యమర్థమధికృత్య ప్రవర్తతే తత్ప్రయోజనమ్**”.ఏ పదార్థముయొక్క ప్రాప్తినుద్దేశించి సాధకుడు తత్ప్రాప్తిసాధన సంపాదనమునందు ప్రవృత్తుడగునో,అతనికి అది ప్రయోజనమనబడును.

**శ్లో॥బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సన్తః ప్రాహుః ప్రయోజనమ్।**

**యేన నిఃశేష సంసార బంధాత్సద్యః ప్రముచ్యతే॥**( స.వే.సి.సా.సం. శ్లో. 11)

“**ప్రయోజనంతు తదైక్యప్రమేయగతాఽజ్ఞాననివృత్తిః,స్వరూపానందావాప్తిశ్చ."తరతిశోకమాత్మవిత్"**(ఛాం.7-1-3),"**బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి**"(ముం. 3-2-9)**ఇత్యాదిశ్రుతేశ్చ”.**(వేదాన్తసారము ).

దేనిద్వారా జీవుడు తత్కాలము(శీఘ్రముగా)జీవబ్రహ్మైక్యరూప ప్రమేయగత అజ్ఞాననివృత్తిద్వారా సర్వప్రకారముల సంసారబంధనములనుండి విడివడి స్వస్వరూప ఆనందమును పొందగలడో,అటువంటి “**జీవబ్రహ్మైకత్వవిజ్ఞానానుభవము**”నకే సత్పురుషులు (విజ్ఞులు)వేదాన్తశాస్త్రవిచారమునకు “**ప్రయోజన**”మని చెప్పుచున్నారు.ఈవిషయంలో "**తరతిశోకమాత్మవిత్","బ్రహ్మవేదబ్రహ్మైవభవతి**"ఇత్యాద్యనేకశ్రుతులు ప్రమాణములు.ఈదిగువ చెప్పబోవువిషయమును చాలా సావధానముగా చింతనజేయండి.

**విశేషము:**—పరమపూజ్యులు పరమకారుణికులునగు శ్రీపండితపీతాంబరజీగారు"శ్రీవేదాన్తబాలబోధము"ప్రథమోపదేశము చివరలో ఈక్రింది విధముగా అనుగ్రహించారు.

హిందుస్థానీదోహా:-- **సర్వ అనర్థ నివృత్తి అతి।ప్రాప్తి పరమానంద॥**

**సోయీ ప్రయోజన పరమ తిహి।సాధన బోధ అమంద॥**

అర్థము:—అవిద్యాతత్కార్యరూప స్థూలసూక్ష్మప్రపంచము మరియు దాని ధర్మములగు జన్మమరణములు,కర్తృత్వభోక్తృత్వములు,ఆకలిదప్పికలు మొదలగు సంసారము సర్వదుఃఖములకు కారణమున్నందున "**అనర్థము**"నబడుచున్నది.దీనియొక్క అత్యంతనివృత్తి మరియు పరమానందరూప బ్రహ్మప్రాప్తి—అను"మోక్షమే"ఈగ్రంథమునకు పరమఫలము అనగా ముఖ్యప్రయోజనమున్నది.

**"అన్యేచ్ఛానధీనేచ్ఛా విషయత్వమ్- ముఖ్యప్రయోజనత్వమ్ ".**

ఇతర ఇచ్ఛకు ఆధీనముగాని(అపేక్షించని)ఇచ్ఛకు యేది విషయమగునో అది ముఖ్యప్రయోజనమనబడును.

పరమప్రయోజనమునకు సాక్షాత్సాధనమగు అమంద=దృఢ; భోధ=జ్ఞానము(దృఢాపరోక్షబ్రహ్మజ్ఞానము)యేదిగలదో అది ఈగ్రంథమునకు "**అవాంతర ప్రయోజనము**"(**గౌణప్రయోజన**)**మున్నది.**

**"అన్యేచ్ఛాధీనేచ్ఛావిషయత్వమ్ – గౌణప్రయోజనత్వమ్".**

ఇతరేచ్ఛా అధీనమగు(ఇతర ఇచ్ఛను అపేక్షించు)ఇచ్ఛకు యేదివిషయమగునో అది గౌణప్రయోజనము.(అవాంతరప్రయోజనము) అనబడును.

1.పురుషునికి యేఫలమును పొందాలను యిచ్ఛకలుగునో అది పరమ ప్రయోజనమునబడును.(మోక్షము)

**“నిరతిశయత్వేసతి క్షయశూన్యత్వమ్ పరమత్వమ్”**

2.పరమప్రయోజనమునకు యేది సాధనమో అది అవాంతర ప్రయోజనమనబడును.(దృఢాపరోక్షబ్రహ్మ జ్ఞానము).

**ప్రయోజనవిషయే శంకాసమాధానమ్**

ఇచ్చట ఈ శంక కలుగుచున్నది:—సర్వఅనర్థముయొక్క అత్యంత నివృత్తి మరియు పరమానందముయొక్క ప్రాప్తిరూప మోక్షము యేది గలదో—అది జ్ఞానముచేత జన్యమా(ఉత్పన్నమగునా)?లేక అజన్యమా?

ఒకవేళ మోక్షము జ్ఞానముచేత జన్యమన్నచో (ఏదిపుట్టునో అది గిట్టును కావున)అనిత్యత్వాపత్తికలుగును.లేక,అజన్యమన్నచో జ్ఞానము కలుగకయే సకలపురుషులు ముక్తులుకావలెను.అలాంటప్పుడు సాధనసహిత జ్ఞానసముపార్జన వ్యర్థమగునుగదా!

**సమాధానము**:—వ్యావహారిక రజ్జువునందు(త్రాటియందు)మందాంధకారాది దోషములచేత ప్రాతిభాసిక సర్పము(పాము)ప్రతీతియగును.పారమార్థిక సత్తచేతగాని,వ్యావహారికసత్తచేతగాని ఆసర్పము దానికధిష్ఠానమగు రజ్జువునందు త్రైకాలిక(భూత,వర్తమాన,భవిష్యత్కాలములలో) అత్యంతాభావమున్నది.(అభావమనగాలేనిదనియర్థము)ఆ“అభావము” సర్పముయొక్క“నిత్య నివృత్తి”యగును.దీనికే“విషయరూపనివృత్తి” అనిగూడ అంటారు.ఉక్త నిత్యనివృత్తి గలది(అత్యంతాభావముగలది)ప్రాతి

భాసిక సర్పము.ఏసర్పముయొక్క అభావము చెప్పబడుతుందో,ఆ సర్పము"నిత్యనివృత్తము"అనబడును.[**"నివృత్తి"**అనగా అభావము.దేనియొక్క అభావము చెప్పబడుతుందో,అది(ఆవస్తువు)**"నివృత్తము"**అనబడును].

**"నాయం సర్పః, కింతురియం రజ్జు"**ఇది సర్పము కాదు మరేమనగా రజ్జువు(త్రాడు)అను యీప్రకారమగు నిత్యనివృత్త సర్పమునకధిష్ఠానమగు రజ్జువుయొక్క అపరోక్షజ్ఞానానంతరము "రజ్జువునందు సర్పముది త్రైకాలిక అభావమున్నది లేక మిథ్యాఉన్నది" అను యీ ఆకారముగలయే పూర్వసిద్ధ విషయరూప నిత్యనివృత్తియొక్క నిశ్చయాత్మక భాధము కలుగుచున్నదో,ఆ బాధము అనగా మిథ్యాత్వనిశ్చయము—పారమార్థిక సత్తచేతగాని లేక వ్యావహారిక సత్తచేతగాని సర్పముయొక్క త్రైకాలిక అభావము యేది గలదో,దానిని విషయము చేస్తుంది.అట్లే,ప్రాతిభాసిక సత్తచేత(ప్రాతిభాసిక సత్తగల)సర్పముయొక్క మిథ్యాత్వమునుగూడ విషయముచేస్తుంది.ఆ నిశ్చయాత్మక వృత్తిజ్ఞానరూప భాధయే నిత్యనివృత్త సర్పముయొక్క నివృత్తిరూపమున్నది.దీనినే**"విషయీరూప నివృత్తి"**అనిగూడ అంటారు.ఈ రీతిగా నిత్యనివృత్త సర్పముయొక్క నివృత్తి కలుగుచున్నది.

అట్లే,పారమార్థికసత్త,వ్యావహారికసత్త మరియు ప్రాతిభాసికసత్త అను మూడు సత్తలను స్వీకరించు సృష్టిదృష్టి వాదానుసారము వ్యావహారిక సత్తగలదియు,లేక పారమార్థికసత్త మరియు ప్రాతిభాసికసత్త అను రెండు సత్తలనుమాత్రము స్వీకరించు దృష్టిసృష్టివాదరీత్యా ప్రాతిభాసిక సత్తగలదియునగు అజ్ఞానము మరియు దాని కార్యరూపప్రపంచము పరమార్థసత్త గల బ్రహ్మమునందు అధ్యస్తమున్నది.అందువలన అజ్ఞానతత్కార్యరూప

ప్రపంచము స్వాధిష్ఠానబ్రహ్మమునందు పారమార్థికసత్తచేత త్రైకాలిక అత్యంత అభావమున్నదని శ్రుతి,యుక్తి మరియు విద్వదనుభవముచేత నిర్ణయింపబడినది.ఆ**"అత్యంతాభావము"**ప్రపంచముయొక్క"నిత్యనివృత్తి" యగును.దీనికే"విషయరూపనివృత్తి"అనిగూడ అంటారు.త్రిసత్తానుసారము వ్యావహారికము లేక ద్విసత్తానుసారము ప్రాతిభాసికమునగు ఉక్త నిత్యనివృత్తమగు యేప్రపంచము గలదో,అది**"నిత్యనివృత్తము"**అనబడును.

సద్గురువు మరియు సచ్ఛాస్త్రముల నాశ్రయించి తత్త్వమస్యాదిమహావాక్యములను చక్కగా విచారించినమీదట నిత్యనివృత్త ప్రపంచమునకధిష్ఠానమగు బ్రహ్మముయొక్క(అహం బ్రహ్మాస్మియను)చరమవృత్త్యాత్మక అప్రతిబద్ధ దృఢాపరోక్ష ప్రత్యగభిన్నబ్రహ్మజ్ఞానము కలిగిన తరువాత "బ్రహ్మమునందు ప్రపంచముది త్రైకాలికఅత్యంతాభావమున్నది లేక మిథ్యాఉన్నది"యను యీ యాకారముగల యేపూర్వసిద్ధ విషయరూప నిత్యనివృత్తియొక్క నిశ్చయరూప బాధము కలుగుచున్నదో,ఆ బాధము,పారమార్థికసత్తచేత ప్రపంచముది యేత్రైకాలిక అత్యంతాభావమున్నదో,దానిని విషయము చేస్తుంది.అట్లే,వ్యావహారికము లేక ప్రాతిభాసిక సత్తగల ప్రపంచముయొక్క మిథ్యాత్వమునుగూడ విషయము చేస్తుంది. ఆ నిశ్చయాత్మక వృత్తిజ్ఞానరూప బాధయే నిత్యనివృత్త ప్రపంచముయొక్క నివృత్తిరూపమున్నది.అదియే"విషయీరూపనివృత్తి"అనిగూడ చెప్పబడుతుంది.

ఇక్కడ ఇంత వివేకమున్నది:—విషయరూపనివృత్తి మరియు విషయీరూపనివృత్తియను భేదముచే నివృత్తి రెండు ప్రకారములు.ఉదా:— ప్రకాశింపబడుటకు యోగ్యమగు ఘటమువలె లేక రూపమువలె(జ్ఞానము కలుగుటకు పూర్వమే ఉండు) పూర్వసిద్ధ నివృత్తి ఉండును. అది

"**విషయరూపనివృత్తి**"యనబడును.అటులనే అధిష్ఠానజ్ఞానము కలుగుటకు(పూర్వమేఉండు)పూర్వసిద్ధ ప్రపంచముయొక్క త్రైకాలికాత్యంతాభావము మరియు మిథ్యాత్వము ఉండును.అది"విషయరూపనివృత్తి"యనబడును .

మరియు,దీపమువలె లేక నేత్రమువలె పూర్వసిద్ధ విషయరూపనివృత్తిని ప్రకాశించగల యే వృత్తిజ్ఞానము కలుగునో,అది "**విషయీరూపనివృత్తి**"యనబడును.ఇట్లు పూర్వసిద్ధ నిత్యనివృత్తియొక్క నిశ్చయజ్ఞానరూప బాధము కలుగును.అనగా పారమార్థికసత్తచే ప్రపంచముయొక్క త్రైకాలికాత్యంతాభావ నిశ్చయము మిథ్యాత్వనిశ్చయము కలుగును.

ఇప్పుడు ప్రశ్నకర్త యొక్క శంకను స్మరిస్తూ చెప్పుచున్నాడు:—ఈ రీతిగా అజ్ఞాన తత్కార్యరూప ప్రపంచముయొక్క(సర్వ అనర్థముయొక్క) "**విషయరూపనివృత్తి**"యేది గలదో,అది ప్రపంచమునకధిష్ఠానమగు బ్రహ్మముయొక్క తత్త్వసాక్షాత్కారము(జ్ఞానము)కలుగుటకు పూర్వమే సిద్ధమైయున్నందున"నిత్యము"న్నది.అందువలన,మోక్షముయొక్క ప్రథమాంశమునకు(సర్వానర్థముయొక్క అత్యంతనివృత్తికి)అనిత్యత్వ ప్రసంగము రాదు.మరియు"**విషయీరూపనివృత్తి**"యగు యే వృత్తిజ్ఞానమున్నదో,అది అధిష్ఠానజ్ఞానముచే జన్యమున్నది.కావున,జ్ఞానము కలుగకుండానే సకలపురుషులకు మోక్షములోని ప్రథమాంశముయొక్క ప్రాప్తిప్రసంగము గూడ రాదు.

ఇప్పుడు మోక్షములోని ద్వితీయాంశమును(పరమానంద బ్రహ్మముయొక్క ప్రాప్తిని)గూర్చి చెప్పుచున్నాడు.ఎట్లు గృహములో పాతిపెట్టబడిన

ధనము(అవని నిక్షిప్త నిధి)నిత్య ప్రాప్తమే అయినప్పటికి,ఒకానొక ఆప్త పురుషుని యుపదేశముచే ఆ నిధియొక్క జ్ఞానము కలుగనంతవరకు (అజ్ఞానదశలో)అది అప్రాప్తమువలెనే ఉంటుంది.ఎప్పుడు ఆప్తునిచే దాని జ్ఞానము కలుగునో,అప్పుడది ప్రాప్తమువలెయగును.ఇదియే నిత్యప్రాప్త ముయొక్క ప్రాప్తి.

అట్లే,పరమానందరూప బ్రహ్మము అందరిచేత ఎల్లప్పుడు సర్వత్ర అహం ప్రత్యయమునకు(అహంవృత్తికి మరియు అహంశబ్దమునకు)విషయమ గుచున్నందున సర్వాత్మయై(అందరియొక్క స్వరూపమై)యున్నది.కా వున,నిత్యప్రాప్తమైయున్నది.అయినప్పటికి,ఎంతవరకు అజ్ఞాతమై యుం డునో,అంతవరకు అప్రాప్తమువలెనే భాసించును.మరల యెప్పుడు సత్క ర్మపరిపాకముచే శ్రోత్రియుడు,బ్రహ్మనిష్ఠుడు మరియు దయాళువగు ఆ చార్యుని ముఖారవిందముద్వారా"తత్త్వమసి"మొదలగు మహావాక్యోపదేశ మును పొందినమీదట**"అహంబ్రహ్మాస్మి"**అను నిశ్చయాత్మక(దృఢ)తత్త్వ జ్ఞానముదయించునో,అప్పుడు"పరమానందరూప బ్రహ్మము నేనే అయి ఉన్నాను"—అని ఈవిధముగా ప్రాప్తమువలె భాసించును.కావున ఇది ని త్య ప్రాప్తమగు బ్రహ్మముయొక్క ప్రాప్తియగును.

ఇక్కడకూడా విషయరూపప్రాప్తి మరియు విషయీరూపప్రాప్తియను భేదముచే ప్రాప్తి రెండుప్రకారములున్నది. పూర్వసిద్ధము మరియు సమీ పములో ఉన్న అజ్ఞాతవస్తువుయొక్క ప్రాప్తి "విషయరూపప్రాప్తి" అనబడు ను.హిరణ్యనిధి దృష్టాంతములో అజ్ఞానకాలములోని ప్రాప్తి మరియు సర్వాత్మయగు బ్రహ్మముది అజ్ఞానదశలోని ప్రాప్తి—**"విషయరూపప్రాప్తి"** యగును.మరియు,పూర్వసిద్ధ వస్తువుయొక్క జ్ఞానరూపప్రాప్తి"విషయీ

**రూపప్రాప్తి**"యగును.పూర్వోక్తనిధియొక్క జ్ఞానరూపప్రాప్తి మరియు బ్రహ్మ ముయొక్క జ్ఞానరూపప్రాప్తి—విషయీరూపప్రాప్తి ఉన్నది.దీనికే నిత్యప్రాప్త ముయొక్క ప్రాప్తి అనిగూడ అంటారు.

**శ్లో॥ఆత్మాతుసతతంప్రాప్తో హ్యప్రాప్తవదవిద్యయా।**

**తన్నాశేప్రాప్తవద్భాతి స్వకంఠాభరణం యథా॥**(ఆత్మబోధ 43)

అర్థము:—ఒకానొక స్త్రీ తనమెడలోని కంఠాభరణము ప్రాప్తమైయుం డగా,పోయినదని భ్రమచేత దుఃఖమునొంది కొంతకాలమునకు ఒకానొక ఆప్తునిద్వారా తన కంఠమందే ఆభరణమున్నదని తెలిసికొని,"**నాకంఠా భరణము దొరికినది**"అని తలంచునట్లు సచ్చిదానందపరమాత్మ ఎల్ల ప్పుడూ లభించువాడే(నిత్యప్రాప్తమే)అయినప్పటికీ అజ్ఞానకారణముచే లభింపనివానివలె(అప్రాప్తమువలె)తోచుచున్నాడు.తదుపరి బహుజన్మ కృత పుణ్యపరిపాకముచే సద్గురువు,సచ్ఛాస్త్రముల నాశ్రయించి తద్వా రా జ్ఞానోదయం కలిగి,దానిచే అవిద్యనశించగా"సచ్చిదానంద పరబ్రహ్మ మును నేనే"అని తెలికొన్నమీదట(నిత్యప్రాప్తమగుబ్రహ్మము)ప్రాప్తించిన ట్టువలె తోచును.

ఈరీతిగా"పరమానందరూపబ్రహ్మప్రాప్తి"యను మోక్షములోని ద్వితీ యాంశముగూడ జ్ఞానముచేత అజన్యమున్నందున(నిత్యమున్నందు న)అనిత్యత్వప్రసంగము సంభవించదు.మరియు దానియొక్క జ్ఞానరూప ప్రాప్తి యేదిగలదో,అది జన్యమున్నందున సకల పురుషులకు బ్రహ్మప్రాప్తి కలిగే సంభవము లేదు గావున,సాధనసహిత జ్ఞానము వ్యర్థముగూడ కా దు.అయితే,మోక్షముయొక్క లక్షణములో"సర్వ అనర్థముయొక్క అత్యం

**తనివృత్తి**"యనునది ప్రథమాంశముగా మరియు"**పరమానందరూప బ్రహ్మప్రాప్తి**"యనునది ద్వితీయాంశముగా చెప్పబడినందున ద్వైతాపత్తి కలుగునుగదా యను శంకకు సమాధానము ఈవిధముగానున్నది.

**"అధిష్ఠానావశేషోహి నాశః కల్పిత వస్తునః।**

**భావస్యైవ హ్యభావత్వం నాశోఽభావస్య భావతా॥**

**భావావస్వభావాభ్యామన్య ఏవ హి కల్పితా।"**(సూతసం.యజ్ఞవై.ఖం.2-8)

అర్థము:—కల్పిత(మిథ్యా)వస్తువుయొక్క నాశనము(ధ్వంసము)అధిష్ఠానముగానే మిగిలిఉంటుంది.అనగా,అధిష్ఠానస్వరూపముగానేఉంటుంది భిన్నంగా ఉండదు.భ్రాన్తికాలంలో అధిష్ఠానము కల్పనాసహితమై ఉంటుంది. భ్రాన్తి నివృత్తికాలంలో కల్పనారహితమై ఉంటుంది.అనగా అధిష్ఠానమే అవశిష్టమై యుండును.ఇదియే కల్పితవస్తువుయొక్క నాశము.ప్రాగభావాత్మక ఘటముయొక్క నాశనము ఉత్పన్న భావరూప(వ్యక్త) ఘటము. భావరూపఘటముయొక్క ధ్వంసము(కారణములోవిలీన)అభావరూపముంటుంది.కాని,కల్పితవస్తువు భావాభావవిలక్షణము.అది వ్యక్తముగాదు,విలీనమునూ కాదు.కేవల అవిద్యచే ప్రతీతమగును,మరియు విద్యచే సర్వథా అసద్రూపమగును.శుక్తియొక్క సాక్షాత్కారానంతరము కల్పిత రజతముయొక్క నాశముది అధిష్ఠాన శుక్తికంటె భిన్నంగా ప్రతీతిగాని, వ్యవహారముగాని ఉండదు.

వేదాన్తసమ్మత వివర్తవాదానుసారము చైతన్యమే—అనాద్యనిర్వచనీయ మాయచేత జగద్రూపముగా భాసిస్తోంది.చైతన్యముయొక్క యథార్థజ్ఞానముచే మాయతత్కార్యము నివర్తింపబడగా చైతన్యమే అవశిష్టమై ఉంటుం

ది.మాయ మరియు దాని కార్యమగు ప్రపంచము కల్పితముగావున దా
ని నివృత్తి(ధ్వంసము)గూడ కల్పితమయ్యే ఉంటుంది.రెండు సద్వస్తువు
లలోనే భేదము చెప్పుటకు వీలుంటుంది,కాని ఒక సద్వస్తువు(చైతన్య
ము)నకు మరియు ఒక మిథ్యావస్తువు(ప్రపంచము)నకు భేదము
సంభవించదు.కావునఅభేదమే సిద్ధిస్తుంది—ద్వైతాపత్తిరాదు.

**శ్లో॥సతోర్హి భేదః పరికల్పనీయో, నాఽసత్సతోర్వాస్తవ భిన్నతా స్యాత్।**

**గఙ్గోదకస్యాఽథ మృగోదకస్య భేదః కథం వాస్తవతాముపైతి॥**

(స్వానుభవాదర్శః 159)

రెండు సద్వస్తువుల యందే భేదమును కల్పించుట సంభవముగాని, కల్పిత అకల్పితములగు రెండు వస్తువులలో వాస్తవ భేదము సంభవించదు.గంగాజలమునకు మరియు మృగజలమునకు వాస్తవ భేదమెట్లు ఘటిల్లును? లేక,

అవిద్యాతత్కార్యరూప ప్రపంచము అనర్థమనబడును.దానియొక్క అత్యంతనివృత్తి మరియు పరమానందరూపబ్రహ్మప్రాప్తి—మోక్షముయొక్క స్వరూపము(లక్షణము).అవిద్యాతత్కార్యము మోక్షములోని ద్వితీయాంశమగు పరమానందబ్రహ్మమునందు అధ్యస్తము.అధ్యస్తముయొక్క అత్యంతనివృత్తి(ధ్వంసము)మోక్షములోని ప్రథమాంశము.ఆ ధ్వంసమునకు అధికరణము(అధిష్ఠానము)బ్రహ్మచైతన్యము.ధ్వంసమునకు ప్రతియోగి కల్పితము(మిథ్యా)అయిఉన్నచో,ఆధ్వంసము అధిష్ఠానముకంటె వ్యతిరిక్తముగా భాసించదు.అధిష్ఠానరూపమే ఉండును.అనర్థముయొక్క అత్యంతనివృత్తికి(ధ్వంసమునకు)ప్రతియోగి అవిద్యాతత్కార్యరూప ప్ర

పంచము.అది కల్పితము(మిథ్యా).కల్పితప్రపంచము(అనర్థము)యొక్క ధ్వంసము(అత్యంతనివృత్తి—మోక్షములోని ప్రథమాంశము)ద్వితీయాంశమగు పరమానందరూపబ్రహ్మ(అధిష్ఠాన)స్వరూపమయ్యే ఉన్నది.దానికి పృథక్ అస్తిత్వమే సిద్ధించుటలేదు.కావున,మోక్షములోని ప్రథమాంశమగు"సర్వానర్థముయొక్క అత్యంతనివృత్తి"ద్వితీయాంశమగు "పరమానందరూపబ్రహ్మప్రాప్తి"చేత అభిన్నమున్నందున ద్వైతాపత్తి సంభవించదు.ఇది శ్రీ పండిత పీతాంబరజీగారు శ్రీవేదాన్త బాలబోధములో చెప్పిన విషయము.చక్కగా మననము చేయండి.

ఈప్రకారముగా అధికారి,సంబంధము,విషయము మరియు ప్రయోజనము—అను అనుబంధచతుష్టయ జ్ఞానముగల ప్రేక్షావత్పురుషుడే(వివేకియే)నిస్సందేహముగా,ఉత్సాహముతో శ్రవణాదులుచేయుటకు గ్రంథమునందు ప్రవృత్తుడగును.కావున,గ్రంథారంభమున అనుబంధ చతుష్టయ నిరూపణము అత్యావశ్యకమైయున్నందున,ఇంతదనుక అనుబంధ చతుష్టయమునుగూర్చి విస్తారముగా తెలిసికుంటూ వచ్చాము.కొన్ని గ్రంథములలో యీ అనుబంధ చతుష్టయ క్రమము వెనుక ముందులుగా గూడ చెప్పబడినది.భ్రమజెంద పనిలేదు.యేనకేనప్రకారేణ అనుబంధచతుష్టయ నిరూపణమునందే ముఖ్యతాత్పర్యము గలదని యెఱుంగవలెను.

**శ్లో॥సంబన్ధశ్చాధికారీ చ విషయశ్చ ప్రయోజనమ్।**

**వినానుబన్ధం గ్రన్థాదౌ మఙ్గలం నైవ శస్యతే॥**(వృద్ధవచనము)

సంబంధము,అధికారి,విషయము మరియు ప్రయోజనము—అను అనుబంధ చతుష్టయమును గ్రంథముయొక్క ప్రారంభమున చెప్పనియె

డల,గ్రంథమునకు మంగళాచరణము రాణించదు.అనగా ప్రారంభించుట వ్యర్థము అని భావము.

ఈనియమానుసారము శ్రీఆద్యగురు శంకరాచార్యులవారు“**సర్వ వేదాన్త సిద్ధాన్త సారసంగ్రహము**” లో ప్రారంభమున ఇట్లు చెప్పియున్నారు.

**శ్లో॥అస్య శాస్త్రానుసారిత్వాదనుబన్ధ చతుష్టయమ్।**

**యదేవ మూలం శాస్త్రస్య నిర్దిష్టం తదిహోచ్యతే॥**6.

**శ్లో॥అధికారీ చ విషయః సంబన్ధశ్చ ప్రయోజనమ్।**

**శాస్త్రారమ్భఫలం ప్రాహురనుబన్ధ చతుష్టయమ్॥**7.

అధికారి,విషయము,సంబన్ధము మరియు ప్రయోజనము—అను నీ యనుబంధ చతుష్టయమును గ్రంథారంభమున తెలియపరచినపుడే ప్రేక్షావత్పురుషుడు(వివేకి,అధికారి)గ్రంథమునందు ఉత్సాహముతో నిస్సందేహముగా ప్రవృత్తుడగును.కావున,ఈగ్రంథము వేదాన్తశాస్త్రముననుస-రించినదగుటచే వేదాన్తశాస్త్రమునకు చెప్పబడిన యనుబన్ధచతుష్టయమే యిచట చెప్పబడుచున్నది. పైన పేర్కొనిన నాల్గు అనుబంధములు శాస్త్రారంభమను ఫలమునకు నిమిత్తములని పండితులు వచించియున్నారు.అనగా,అనుబన్ధ చతుష్టయమును చెబితేనే శాస్త్రారంభము సఫలమగును.లేనిచో నిరర్థకమగునని తాత్పర్యము.

ఈప్రకారముగా శంకరులవారు గ్రంథమును ప్రారంభించి అనుబంధ చతుష్టయమును సవిస్తరముగా వర్ణించినారు.అట్లే,వేదాన్తసారములో గూడ శ్రీసదానన్దయతీన్ద్రులవారు స్పష్టముగా నిరూపించియున్నారు.మరి

యు భాషాగ్రంథములగు శ్రీవిచారసాగరము,శ్రీవేదాన్తబాలబోధములలో గూడ అనుబంధ చతుష్టయము సవిస్తరముగా చెప్పబడినది.కాని,కొన్ని గ్రంథములలో అనుబంధ చతుష్టయమును గ్రంథకర్తలు పృథక్ గాచె-ప్పలేదు.అయినను **"వినాను బన్ధం గ్రన్థాదౌ మఙ్గలం నైవ శస్యతే"** అను అభియుక్తోక్తిని దృష్టియందించుకొని గ్రంథారంభమున మంగళమునందే యనుబంధ చతుష్టయమును నిహితమొనర్చి చెప్పియున్నారు.దాని ని అనుభవజ్ఞులగు ఆచార్యులు,వక్తలు వ్యక్తముచేయవలసిన కర్తవ్యము న్నది.అస్తు—*ఇతి అనుబన్ధచతుష్టయ నిరూపణమ్.*

**—:మధ్య మంగళము:—**

**శ్లో॥గురవే సర్వలోకానాం భిషజే భవరోగినామ్।**

**నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః॥**

**శ్లో॥మాణ్డూక్య కారికా కర్తా యో భాతి బ్రహ్మవిద్వరః।**

**శ్రీగౌడపాదాచార్యం ప్రణమామి ముహుర్ముహుః॥**

**యోగీశ్వరం వేదచూడం వేదాన్తార్థ నిధిం మునిమ్।**

**గోవిందభగవత్పాదాచార్యవర్యముపాస్మహే॥**

**శ్లో॥శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్।**

**సూత్రభాష్యకృతౌ వన్దే భగవన్తౌ పునఃపునః॥**

**శ్లో॥మఙ్గళం గురుదేవాయ భవదుఃఖాపహారిణే।**

**అసజ్ఞానన్దరూపాయ ముక్తిదాత్రేఽస్తు మఙ్గళమ్॥**

**శ్లో॥వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్।**

**దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్॥**



## —:44.అధికారియొక్క కర్తవ్యము:—

**శ్లో॥ఉక్తసాధనసమ్పన్నః తత్త్వజిజ్ఞాసురాత్మనః।**

**ఉపసీదేద్గురుం ప్రాజ్ఞం యస్మాద్బన్ధవిమోక్షణమ్॥**(వి.చూ.33)

విచారసాధనములుగా పూర్వము చెప్పబడిన యేవివేకాది నాల్గు సాధనములు గలవో,వాటిని కలిగియున్న పురుషుడు(అధికారి)తనయొక్క యధార్థస్వరూపమును తెలియగోరినవాడై,అజ్ఞానకల్పిత అహంకారాది దేహాన్తమగు బన్ధముయొక్క అత్యన్తనివృత్తి యెవరివలనగల్గునో,అటువంటి బ్రహ్మానుభూతినొందిన ఉపదేశకర్తయగు శ్రీగురుదేవులను శరణము పొందవలెను.దీనిచే"**అవిద్యాస్తమయో మోక్షః సా సంసార ఉదాహృతః**"(సా చ బన్ధ ఉదాహృతః—అనిగూడ పాఠాన్తరము గలదు)(బ్రహ్మసిద్ధి పృష్ఠము 119; న్యాయ మకరందము పృష్ఠము 289)అవిద్యా ధ్వంసము(బాధ)అగుటయే ముక్తియనబడును.అవిద్యయొక్క విద్యమానమే సంసారము లేదా బన్ధము అనబడును—అని చెప్పబడినట్లుగా గురూపసదనముయొక్క ఫలము బన్ధనివృత్తి(మోక్షము)అని స్పష్టమగుచున్నది.

కావున,అధికారిపురుషుడు ఆత్మజ్ఞానార్థము గురువును అవశ్యము గా శరణువెళ్ళవలయునని శ్రుతిమాత"**తద్విజ్ఞానార్థం స గురుమేవాఽభి గచ్ఛేత్**"(ముం.1-2-12)అని శాసించుచున్నది.కాని,స్వతంత్రముగా ఎప్పుడు గూడ ఆత్మవిచారము చేయరాదని"**ఏవ**"కారముచే చెప్పబడినది."**శాస్త్ర జ్ఞోఽపి స్వాతన్త్ర్యేణ బ్రహ్మజ్ఞానాన్వేషణం న కుర్యాదిత్యేతద్గురుమేవేత్యవ ధారణ ఫలమ్**"అని—పైశ్రుతికి శ్రీశంకరులవారి భాష్యము.శాస్త్రజ్ఞుడయి నప్పటికిని స్వతంత్రతాపూర్వకముగా బ్రహ్మజ్ఞానాన్వేషణము చేయగూడ దు.అని"**గురుమేవ**"అను పదసముదాయములో పఠింపబడిన నిశ్చయా త్మక"**ఏవ**"కారముయొక్క అభిప్రాయము.అయితే,ఎటువంటి విశేషణము లతోగూడిన గురువును ఆశ్రయించి తత్త్వజ్ఞానమును సంపాదించాలి?గు రువులు ఎన్ని విధములు?అను ప్రశ్నకు సమాధానము,శ్రీస్కంధ పురా ణము ఉత్తరఖండములోని ఈశ్వరపార్వతి సంవాదాత్మక **శ్రీగురుగీత**—ఇ ట్లు చెప్పుచున్నది.

**శ్లో॥గురవో బహవః సన్తి శిష్యవిత్తాపహారకాః।**

**తమేకం దుర్లభం మన్యే శిష్యహృత్తాపహారకమ్॥**(గురుగీత.160; కులార్ణవ తంత్రము.13-108).

శిష్యుని ధనమునపహరించే గురువులు పెక్కుమంది గలరు.కాని, శిష్యునియొక్క హృదయగ్రంథిని విచ్ఛిన్నముజేసి హృదయసంతాపము ను హరించే గురువు ఒక్కడైనా లభించుట చాలాదుర్లభమని భావించు చున్నాను.

ఆలస్యము(సోమరితనము)లేని కార్యదక్షుడు,వివేకి,ఆధ్యాత్మజ్ఞాన

సంపన్నుడు,పవిత్రాచరణము మరియు నిర్మలమనస్సుగలవానికి గురుత్వము శోభించును.సద్గురువులు నిర్మలాన్తఃకరణముగల్గి,శాంతము,సాధుస్వభావముగల్గి,మితభాషియై,కామక్రోధాదులు బొత్తిగా లేనివారై,సదాచార సంపన్నులై, జితేన్ద్రియులై యుందురు.

**శ్లో॥సూచకాది ప్రభేదేన గురవో బహుధాస్మృతాః।**

**స్వయం సమ్యక్ పరీక్ష్యాథ తత్త్వనిష్ఠం భజేత్సుధీః॥**(163)

సూచకాది భేదముచే అనేక విధములగు గురువులుంటారని స్మృతులలో చెప్పబడినది. బుద్ధిమంతుడగు అధికారి పురుషుడు స్వయముగా, యోగ్యముగా విచారించి తత్త్వనిష్ఠుడగు గురువునకు శరణు వెళ్ళవలయును.

1.హే దేవి!వ్యాకరణాది(వర్ణాక్షర సమన్విత)బాహ్యలౌకిక శాస్త్రములను అభ్యసించినవాడు సూచక గురువు అనబడును

2.హే పార్వతి!ధర్మాధర్మములను విధానముచేయు వర్ణాశ్రమోచిత విద్యను ప్రవచించువాడు వాచక గురువు అనబడును.

3.పంచాక్షరి మొదలగు మంత్రములను ఉపదేశించువాడు బోధక గురువు అనబడును. ఓ పార్వతీ!తొలుత చెప్పబడిన ఇద్దరికంటె ఇతడు ఉత్తముడని తెలియుము.

4.మోహనము,మారణము,వశీకరణము-ఇత్యాది మంత్రములను తెలియజేయువానిని నిషిద్ధ గురువని తత్త్వదర్శులగు పండితులు చెప్పుదురు.

5.ఓ ప్రియురాలా!ఈ సంసారమనిత్యమనియు,అశాశ్వత దుఃఖాలయమనియు నచ్చజెప్పి వైరాగ్యమార్గమును చూపెట్టువాడు విహిత గురువనబడును.

6.ఓపార్వతీ!తత్త్వమస్యాది మహావాక్యములనుపదేశించి భవరోగము ను నివారించగలుగువాడు కారణ గురువనబడును.

7.ప్రమాణగతము,ప్రమేయగతము అనబడు సర్వసందేహములను మరియు విపరీతభావన(అధ్యాస)ను సమూలముగా నాశనము చేయ గల సమర్థుడును,జన్మ,మృత్యు,భయమును నిర్మూలించువాడును పర మగురువు—సద్గురువు అనబడును.అనేక జన్మార్జిత సుకృతమున్ననే గాని ఇటువంటి మహాగురువు లభించుట దుర్లభము.ఇట్టి గురువు ప్రా ప్తించినచో శిష్యునికి మరలసంసార బంధముండదు.ముక్తుడగునని భావము.

ఓ పార్వతీ!ఈప్రకారముగా లోకంలో అనేకవిధములగు గురువులు న్నారు.వీరందరిలో సర్వప్రయత్నములచే పరమగురువునే ఆశ్రయించి సేవించవలెను.జన్మ ధన్యమగును. మరియు,

చోదకాది భేదముచే దేశిక త్రైవిధ్యమును మరియు తత్త్వజ్ఞానముచే కృతకృత్యత(మోక్షము)ను బ్రహ్మవిద్యోపనిషత్ ఈక్రిందివిధముగా చెప్పు చున్నది. **శ్లో॥చోదకో బోధకశ్చైవ మోక్షదశ్చ పరః స్మృతః।**

**ఇత్యేషాం త్రివిధో జ్ఞేయ ఆచార్యస్తు మహీతలే॥**51.

**శ్లో॥చోదకో దర్శయేన్మార్గం బోధకః స్థానమాచరేత్ ।**

**మోక్షదస్తు పరం తత్త్వం యజ్జ్ఞాత్వాఽమృతమశ్నుతే ॥**52.

బ్రహ్మహత్యాదులవలన కలుగు మహాపాపముచేగాని,అశ్వమేధాది యాగజన్య పరమఅపూర్వము(పుణ్యము)చేగాని ఎవరు లిప్తులుగారో (అంటబడరో),అటువంటి శ్రేష్టపురుషులగు జ్ఞానులు ప్రేరకుడు, బోధకుడు

మరియు మోక్షదాతయని మూడు ప్రకారముల ఆచార్యులుగా ఈసం సారములో(లోకంలో)ప్రసిద్ధినొందినారు.

1.**"అహం బ్రహ్మాస్మి"**(బృ.1-4-10)నేను బ్రహ్మమునై యున్నాను అని ఇట్లు నిరన్తర అనుసంధానము(చింతన,విచారము)చేయాలి అని అజ్ఞపు రుషుడగు అధికారిని బ్రహ్మాభిముఖముగజేసి ప్రేరేపించు(ప్రోత్సహించు) మార్గదర్శకుడగు వేదాన్తి"**చోదకగురువు**"(ఆచార్యుడు) అనబడును.

2.**"తత్ త్వమేవ,త్వమేవ తత్"**ఆ పరబ్రహ్మము నీవే,నీవే ఆ పర బ్రహ్మముఅని అజ్ఞపురుషునికి బోధించి బ్రహ్మప్రాప్తిని కలుగజేయు దేశి కున్ని"**బోధక గురువు**"అంటారు .

3.**"మత్స్వరూపమేవ సర్వం, మామేవ ప్రాప్స్యసి, మద్వ్యతిరిక్తమణు మాత్రమపి న విద్యతే ఇతి పరమోపదేశేన స్వాతిరిక్త భ్రమమోక్షం దదాతీతిమోక్షదః పరమేశ్వరః,పరతత్త్వస్వరూపత్వాత్"**ఈదృశ్యమాన జగ త్తంతా నాస్వరూపమే.నాకంటె భిన్నముగా అణుమాత్రముగూడ లేదు.నా యొక్క యథార్థ స్వరూపమును తత్త్వతః=ఉన్నదున్నట్లుగా తెలుసికొ న్నచో నీవు నన్నే పొందగలవు.మత్స్వరూపము నొందగలవు.నీవు నాకం టె భిన్నుడవు కాదు.నేను నీకంటె వేరు గాదు.నేనే నీవు,నీవే నేను—ఈ ప్రకారమగు పరమోపదేశముచేత స్వాజ్ఞానకల్పిత దేహాదికప్రపంచరూప భ్రమ(చిజ్జడగ్రంథి)ని విచ్ఛిన్నముజేసి స్వస్వరూపస్థితియగు మోక్ష మును ప్రసాదించు పరతత్త్వస్వరూపుడైన పరమేశ్వరుడు"**మోక్షద గురు వు**"అనబడును.దేనినెఱింగినచో ముముక్షువు అమృత స్వరూపుడగునో ఆ యీ పరమేశ్వరాభిన్నసాక్షాత్కారియగు శ్రీగురుదేవుడని యర్థము. (టీక—ఉపనిషద్బ్రహ్మ) మరియు,

**"కులార్ణవ తంత్రము"**లో యీ క్రింది విధంగా చెప్పబడినది.

**శ్లో॥ప్రేరకః సూచకశ్చైవ వాచకో దర్శకస్తథా।**

**శిక్షకో బోధకశ్చైవ షడేతే గురవః స్మృతాః॥**(13-128)

1.ప్రేరకుడు,2.సూచకుడు,3.వాచకుడు,4.దర్శకుడు,5.శిక్షకుడు,మరియు6.బోధకుడు—అని గురువులు ఆరు ప్రకారములుగా ఉంటారని స్మృతులు నుడువుచున్నవి.ఇట్లు **గురు ప్రభేధములు తెలుసుకున్నాము.**

**—:45.గురులక్షణములు-ఉపదేశసాహస్రి:—**

ఇప్పుడు శ్రీజగద్గురు ఆద్యశంకరాచార్యులవారు ఉపదేశించిన **గురు లక్షణములను** అవలోకించెదము.***ఉపదేశసాహస్రి*** గద్యభాగములో—**ఆచార్యశ్చోహాపోహ గ్రహణ ధారణ శమ దమ దయానుగ్రహాది సంపన్నో లబ్ధాగమో దృష్టాదృష్టభోగేష్వనాసక్తః త్యక్తసర్వకర్మసాధనో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితోఽభిన్నవృత్తో దమ్భదర్పకుహక శాఠ్యమాయా మాత్సర్య అనృతాహఙ్కారమమత్వాది దోషవర్జితః కేవల పరానుగ్రహప్రయోజనోవిద్యోపయోగార్థీ।**ఆచార్యుని(గురువుయొక్క)లక్షణములు చెప్పబడుచున్నవి—ఆచార్యశ్చేతి.**ఊహ**:—శిష్యుడు తనకపేక్షిత భావమును వ్యక్తము చేయక పూర్వమే(ప్రశ్నించుటకు ముందే)అతని అభిప్రాయమును తెలిసికొనుట. లేక ఉపదేశించు సమయమున శిష్యుని అంతర్యములో తలెత్తుటకు యోగ్యమైన యుక్తులను కల్పనచేయగల శక్తిని **ఊహ** అంటారు.

**అపోహ**:—శిష్యునిలోని మిథ్యాజ్ఞానమును నాశనముచేయగల లేక స్వసిద్ధాన్తమునకు విరోధి విచారములను నిరాకరించు సామర్థ్యము.

**గ్రహణము:**—శిష్యుడుచేసిన ప్రశ్నలు,ఆక్షేపములను వెంటనే ఆకలనముచేయు(గ్రహించు)శక్తి.

**ధారణము:**— శిష్యుడుచేసిన శంకలను సారాసారవిచారణముచేసి నిరాకరించు సమయమున వాటిని విస్మరించకుండుట.

**శమ,దమ** లక్షణములు పూర్వము షట్సంపత్తి నిరూపణావసరమున చెప్పబడినవి.

**దయ:**—దుఃఖితులను అనుగ్రహించవలెనను కోరిక.

**శ్లో॥యత్నాదపి పరక్లేశం హర్తుం యా హృది జాయతే।**

**ఇచ్ఛా భూమిసురశ్రేష్ఠ! సా దయా పరికీర్తితా॥**(వాచస్పత్యమ్)

**శ్లో॥ఆత్మవత్సర్వభూతేషు యో హితాయ శుభాయ చ।**

**వర్తతే సతతంహృష్టః క్రియాహ్యేషా దయా స్మృతా॥**(మత్స్యపురాణము 145-45)

**శ్లో॥ప్రాణా యథాత్మనోఽభీష్టా భూతానామపి తే తథా।**

**ఆత్మౌపమ్యేన సర్వత్ర దయాం కుర్వన్తి సాధవః॥**(గీత-మధుసూదని 6-32)

**శ్లో॥మోహపత్నీ దయా సాధ్వీ పూజితా చ జగత్ప్రియా।**

**సర్వలోకాశ్చ సర్వత్ర నిష్ఫలాశ్చ యయా వినా॥**(దేవిభాగ.9-1-106/107)

**అనుగ్రహము:**— దుఃఖితుల దుఃఖమును దూరము చేయుటకుగల ప్రవృత్తి. వినీతులై తనను ఆశ్రయించిన శిష్యులను నిరాకరించకుండుట.

**శ్లో॥సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే।**

**అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మను ॥**(వాల్మీకి రామాయణము-యుద్ధకాండము. 18-32)

ఎవ్వడైనను వచ్చి నేను నీ వాడను అని చెప్పుచు ఒక్క మాటు నన్ను శరణుపొందిన చాలును.వానికి సకలప్రాణులనుండి అభయము నిచ్చెదను.ఇది నా వ్రతము—అని శ్రీరామచంద్రుని అభయ వాక్కు.

శంక:—**శ్లో॥నచాధ్యయనశీలస్స్యాన్న వ్యాఖ్యానపరో భవేత్।**(నా.ప.3-73)

సన్న్యాసి అధ్యయనము,వ్యాఖ్యానము(ప్రవచనము)చేయగూడదు—అని నిషేధింపబడినది.అట్లే,

గౌతమ ధర్మసూత్రం 1-3-23,24 లో"**హింసానుగ్రహయోరనారమ్భ**" ఏ ప్రాణినిగూడ హింసించుటగాని,అనుగ్రహించుటగాని,ఇహలోకపరలోక సంబంధమైన యేకర్మలుగాని చేయగూడదని సంన్యాసికి(యతికి)నిషేధము చెప్పబడినది గదా?

సమాధానము:—పై శ్రుతిస్మృతి వచనములు పరివ్రాజకులకు సర్వథా ఉచితమే-కాని,గురుస్థానాలంకృత సన్న్యాసికి మాత్రము లోకంలో కీర్తిని పొందుట,లోకులచే పూజింపబడుట,పాండిత్యమును వృద్ధిజేసికొనుట మొదలగు విషయములలో నిషేధముచెప్పబడినప్పటికినీ,శిష్యులను **అనుగ్రహించి,**సాంసారిక బంధనములనుండి విముక్తులను చేయుటకు అధ్యయనము,అధ్యాపనము చేయుట,శిష్యులను అనుగ్రహించుట మున్నగు విషయములలో విరోధమేమియును లేదు.

గురులక్షణములోని **ఆది** పదముచే అమానిత్వాది గుణములను సంగ్రహించుకోవాలి.'**సంపన్న**'శబ్దముచే పూర్వోక్తగుణములచేయుక్తుడై ఉండ

వలెనని సూచించడమైనది.

**లబ్ధాగమః:—** గురుస్థానమునలంకరించిన ఆచార్యుడు స్వగురువుచే విద్యోపదేశమునొందియుండాలి.గురువునకు"**లబ్ధాగమః**"అను విశేషణమి చ్చుటచే శిష్యుడు తాను యే గురువును ఆశ్రయించదలచెనో,ఆ గురువు యొక్క జ్ఞానమును,సంప్రదాయమునుగూడ శోధించవలెనని సంకేతము చేయనైనది.

**దృష్టాదృష్ట భోగేష్వనాసక్త:— దృష్టభోగములు**=ఈలోకసంబంధమగు భోగములు;అదృష్టభోగములు=పరలోక విషయకభోగములు—వాటి యం దు ఆసక్తిలేనివాడైయుండాలి.అనగా వాటికి సాధనములగు తపోయజ్ఞ దానాదులను,సమస్త కర్మసాధనభూతములైన ధన-దార-పుత్రాదుల సంగ్రహమును,శిఖాయజ్ఞోపవీతాదులను త్యాగముచేసినవాడై యుండాలి. అప్పుడే అతడు భోగములందు అనాసక్తుడగుటకు యోగ్యుడగును.

**బ్రహ్మవిత్:—** మహావాక్యార్థభూత ప్రత్యగాత్మపరమాత్మల ఐక్యవిషయ క నిశ్చయ జ్ఞానము గలవాడు.

**బ్రహ్మణి స్థితః:— "బ్రహ్మైవాఽహమస్మి" యను నిత్యఅపరోక్ష** స్ఫుట అను భూతి నొందినవాడైయుండాలి.అధికారి పురుషునకు ఇటువంటి ఆచా- ర్యుని ఆవశ్యకతయే ఉన్నది.శ్రీశంకరులవారు మనీషాపంచకంలో బ్రహ్మ నిష్ఠుని నిశ్చితాభిప్రాయమును చెప్తూ యజుర్వేదోపనిషద్(బృహదారణ్యకోప నిషద్)లోని"**అహంబ్రహ్మాస్మి**"(1-4-10)యను మహావాక్యార్థమును అభివర్ణి స్తూ శ్లోకమును ప్రవృత్తము చేశారు—***బ్రహ్మైవాహమ్***-అని.

**శ్లో॥బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం,**

**సర్వం చైతదవిద్యయా త్రిగుణయాఽశేషం (సేశం)మయాకల్పితమ్।**

**ఇత్థం యస్య దృఢామతిస్సుఖతరే నిత్యేపరే నిర్మలే,**

**చాణ్డాలోఽస్తు స తు ద్విజోఽస్తు గురురిత్యేషా మనీషా మమ॥**

అహం అనగా అహం శబ్దము మరియు అహం ప్రత్యయము(వృత్తి)ఈ రెంటిచే నుపలక్షిత ఆత్మ,బ్రహ్మైవ=పరిపూర్ణ పరమాత్మయే.మరియు ఈ చేతనాచేతనాత్మక సమస్తజగత్తు చిదేకరసమగు బ్రహ్మమునందు విస్త రింపబడినది.ఎట్లు అధిష్టానమగు సాక్షియందు నిద్రాదోషముచే కల్పిత స్వప్నజగత్తు విస్తరింపబడునో,అట్లే అనాద్యనిర్వచనీయభావరూప ఆవర ణవిక్షేపశక్తులుగల త్రిగుణాత్మకము దేహాద్యధ్యాసకు కారణమునగు అవి ద్యచేత ఈపరిదృశ్యమాన అశేష(సంపూర్ణ)బ్రహ్మాది స్థావరాంతము,ఈశ్వ రసహిత సమస్త జగత్తు అధిష్టానరూప బ్రహ్మాభిన్నమగు నాచేత కల్పిం చబడినది(రచింపబడినది).ఈప్రకారమైన అసంభావనా విపరీతభావనార హిత దృఢప్రజ్ఞ=అప్రతిబద్ధదృఢాపరోక్షజ్ఞానము(అబాధితజ్ఞానము)యేపు రుషశ్రేష్ఠునకు ఉండునో(కలుగునో),అటువంటిజ్ఞాననిష్ఠాగరిష్ఠుడు—చండా లజాతివాడుగాని,ద్విజాతివాడుగాని—అతడు నాకు గురువేయని నా ని-శ్చితాభిప్రాయము.కావున,ఇటువంటి గురువుయొక్క ఆవశ్యకతయే ముముక్షువునకున్నది.

పైన చెప్పబడిన విశేషణములతో యుక్తమైయున్ననూ అతనిచే(గు రువుచే)యథేష్టాచరణము(ఇచ్ఛవచ్చినట్లునడుచుకొనుట)జరగకూడదు. మరేమనగా,

**అభిన్నవృత్తః=అపరిత్యక్త సదాచారః=**శిష్టవిగర్హిత(నిందిత)ఆచరణ లేని

వాడై అనగా లోకవ్యవహారమును ఉల్లంఘించనివాడైయుండాలి.**దంభ ము**=ధర్మధ్వజిత్వము=లోకులచే నేను ధార్మికుడనని ప్రకటించుకొను ట;**కుహకము=ప్రతారణము**=పరవంచన;**శాఠ్యము**=నిష్ఠురత;**మాయ**=పర వ్యామోహనము;**మాత్సర్యము**=గుణములలో దోషమునుచూచుట;**అనృ తము**=మిథ్యాభాషణము(అబద్ధముచెప్పుట);**అహంకారము**=దేహాదులం దు అభిమానము;**మమత్వము**=పుత్ర-శిష్యాదులందు స్వత్వఅభిమాన ము; **దర్పము**=ధనాదినిమిత్తక మదము మరియు ఆదిపదముచే సకల దోషములుగ్రహించాలి.ఈదంభాది సర్వదోషశూన్యుడగు ఆచార్యుని అన్వే షించవలెను.

శంక:—ఉపరోక్తలక్షణములు కలిగియున్న మహాత్ముడు సుకృతపుం జోదయముచే భాగ్యవశమున ప్రాప్తించిననూ పరోపదేశార్ధము ప్రవృత్తము కానిచో ముముక్షువుల కళ్యాణము కాదు గదా?

సమాధానము:—**కేవల పరానుగ్రహ ప్రయోజనః**=కేవలము పరులను అనుగ్రహించుటయేప్రయోజనముగలవాడైయుండవలెను అనగా సంసార సాగరమునుండి విరక్తినొందిన పురుషుణ్ణి అనుగ్రహించి పరమపదవిని ప్రాప్తింపజేయుటయే ఏకైకఉద్దేశ్యము గల్గియుండవలెను.గురువునకు ప రోపదేశ ప్రవృత్తియందు అన్యమగు యే ఆనుషంగిక ప్రయోజనాంతరము యొక్క నిమిత్తముండదు—అని చెప్పుటకు"**కేవలము"**అను విశేషణము జోడింపబడినది.

శంక:—ఒకవేళ యే నిమిత్తము(కారణము)లేకయే(అపేక్షింపకయే)పరా నుగ్రహమునందు ప్రవృత్తుడగునని చెప్పినచో ఉన్మత్తునివలె స్వేచ్ఛాచా

రి యని చెప్పవలసి యుండును?

సమాధానము:—**విద్యోపయోగార్థీ=**'అహైతుక పరానుగ్రహ ప్రవృత్తి'తన ను ఆశ్రయించిన అధికారులగు శిష్యులకు విద్యను బోధించుటయందే ఉం డును.ఉపయోగము అనగా వినియోగము.శిష్యులను ఉద్ధరించుటకే వా రిని అనుగ్రహించి తనయొక్క(గురువుయొక్క)విద్యను వినియోగించుట. ఇట్లు పైనచెప్పబడిన లక్షణములుగల గురువును మోక్షార్థియగు ము ముక్షువు అన్వేషించవలెను.(ఆనందగిరి టీక).ఈప్రకారముగా ఉపదేశ సాహ స్రి(గద్యభాగము)లో శ్రీశంకరులు సూచించిన ఆచార్యుని లక్షణములను యథామతిగ తెలిసికున్నాము.

**శ్లో॥శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిదుత్తమః।**

**బ్రహ్మణ్యుపరతః శాన్తో నిరిన్ధన ఇవానలః॥**

**అహేతుక దయాసిన్ధుర్బన్ధురానమతాం సతామ్।**(వి.చూ.34&35)

**"శ్రోతియశ్ఛన్దోఽధీతే"**(పాణినీసూత్రము.5-2-84) → అనుసరించి**"శ్రోత్రియ"**అన గా ఉపనిషత్తులను అధ్యయనముచేసి,వాటి అర్థమును విచారము చే సినవాడు అని అర్థము;అవృజినః=పాపములు లేనివాడు; అకామహతః= కామములచే పీడింపబడనివాడు;బ్రహ్మవిదుత్తమః=బ్రహ్మవేత్తలలో ఉత్త ముడును;బ్రహ్మణి ఉపరతః=బ్రహ్మమునందు లీనమైనమనస్సు గలవా డును;నిరిన్ధన అనలఇవ=ఇంధనములులేని అగ్నివలె; శాన్తః=శాన్తుడు ను;ఆనమతాం=నమస్కరించుచున్న;సతాం=సత్పురుషులకు;బన్ధుః=బ న్ధువును అగు మహాపురుషుడు గురుస్థానమునకు అర్హుడు.శ్లోకములో **"అహేతుకదయాసిన్ధు"**అను విశేషణమివ్వబడినది.అనగా నిర్నిమిత్తము

(అకారణము)గా ఇతరుల దుఃఖమును పోగొట్టవలెనను ఇచ్ఛయేది గల దో—దానికి సింధువు అనగా ఆశ్రయభూతుడు అని అర్థము.ఈ విశేషణ మును ఇంకా విశదీకరిస్తూ చెప్తున్నారు.

**శ్లో॥శాన్తా మహాన్తో నివసన్తి సన్తో వసన్తవల్లోక హితం చరన్తః ।**

**తీర్ణాః స్వయం భీమభవార్ణవం జనానహేతునాన్యానపి తారయన్తః॥**

**శ్లో॥అయంస్వభావఃస్వతఏవయత్పర శ్రమాపనోద ప్రవణం మహాత్మనామ్।**

**సుధాంశురేషస్వయమర్క కర్కశప్రభాభితప్తా మవతి క్షితిం కిల॥**

(వి.చూ.39&40)(అస్మిన్ గ్రన్థే 270 పృష్ఠే)

వసన్త ఋతువువలె లోకులకు(లోకములకు)హితమును చేయు నట్టియు,శాన్తస్వభావముగలవారును,తాము స్వయంగా భయంకరమై న సంసారసముద్రమును దాటినవారును,కారణమేమియు లేకుండగనే ఇతర జనులనుగూడ దాటించుచున్న గొప్పవారగు సత్పురుషులు భువి లో నివసించుచున్నారు.

కారణములేని ప్రవృత్తి ఉండదు గదా? కారణము లేకుండగనే వీరు యితరులను యెందుకు తరింపజేయుదురు?అను ప్రశ్నకు సమాధాన ము చెప్తూ "**అయం స్వభావః**"ఇది వారికి స్వాభావికగుణమై యున్నది. స్వభావమునకు కారణమేమియని అన్వేషించుట యుక్తము గాదు. పంచదారలోని మాధుర్యమునకు కారణమేమని ప్రశ్నించుటలో అర్థము లేదు గదా! శ్లోకములోని"**ప్రవణ**"శబ్దం భావప్రధానము గలది.అనగా పరు లయొక్క ఏశ్రమ యున్నదో దానిని నివారించుటలోని(తత్పరత)అత్యా సక్తి.ఇది మహాత్ములకు స్వాభావికమేగాన ఈవిషయమున పరప్రేరణాపే

క్ష లేదని భావము.ఇందులకు"**సుధాంశు**"ఇత్యాదికము దృష్టాంతము. ఎట్లు సూర్యునియొక్క కర్కశ(తీక్ష)మైన కిరణములచే మిక్కిలి తపింపబడిన భూమిని,చంద్రుడు తన చల్లని అమృతకిరణములచే శీతలమొనర్చునో,అటువంటి స్వభావముగలవారు మహాత్ములు—అని భావము. కిల= ప్రసిద్ధి ద్యోతకము.

గురువులకు శిష్యులను ఉద్ధరించుటయే ముఖ్యకార్యమని శ్రీవిద్యారణ్య గురుదేవులు'శ్రీవేదాన్తపఞ్చదశి'మంగళశ్లోకములో చెప్పియున్నారు.

**శ్లో॥నమః శ్రీ శఙ్కరానన్ద గురుపాదామ్బుజన్మనే।**

**సవిలాస మహామోహగ్రాహగ్రాసైక కర్మణే॥**

సవిలాసము=సమష్టివ్యష్టి స్థూలసూక్ష్మ ప్రపంచరూప కార్యసహితముగు యే,మహామోహము=బ్రహ్మాత్మస్వరూపమునుకప్పివేయగల మూలాజ్ఞానము(అనబడు),గ్రాహమును=మకరమును(మొసలిని)గ్రాసైకకర్మణే =మ్రింగుట(నివర్తింపజేయుట,నాశనముజేయుట)యే ముఖ్యకార్యముగా గలిగిన శ్రీశంకరానందగురుదేవుల చరణకమలములకు నమస్కరించుచున్నాను.

**శ్లో॥దయాళుం గురం బ్రహ్మ నిష్ఠం ప్రశాన్తం,**

**సమారాధ్య భక్త్యా విచార్య స్వరూపమ్।**

**యదాప్నోతి తత్త్వం నిదిధ్యస్య విద్వాస్,**

**పరం బ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥**(విజ్ఞాననౌక-2)

దయాళువు,బ్రహ్మనిష్ఠుడు మరియు ప్రపంచోపశమరూప కైవల్యస్థితియందు స్థిరమైన మనస్సుగలవాడును అగు శ్రీగురుదేవుని విధి

పూర్వకముగా ఆశ్రయించి నిర్మల నితాంత భక్తిచే మనోవాక్కాయములచే పరిచర్యలుగావించి,గురుదేవుని ప్రసన్నునిజేసికొని పరిప్రశ్నలుగావించి, అతని ముఖారవిందముద్వారా తత్త్వమస్యాది మహావాక్యోపదేశమును శ్రవణముజేసి,పిమ్మట మనన నిధిధ్యాసనములుజేసి ముముక్షు పురుషుడు యేనిత్యమగు(త్రికాలాబాధిత)పరబ్రహ్మతత్త్వమునుపొందుచున్నాడో, ఆ పరబ్రహ్మమే నేనైయున్నాను.

**శ్లో|| శ్రోత్రియో బ్రహ్మనిష్ఠోయః ప్రశాంతః సమదర్శనః|**

**నిర్మమో నిరహఙ్కారః నిర్ద్వన్ద్వో నిష్పరిగ్రహః|**

**అనపేక్షశుచిర్దక్షః కరుణామృతసాగరః||**

**శ్లో||ఏవం లక్షణసంపన్నః స గురుర్బ్రహ్మవిత్తమః|**

**ఉపసాద్యః ప్రయత్నేన జిజ్ఞాసోస్సాధ్యసిద్ధయే||**(స.వే.సి.సా.సంగ్రహము. 251&252)

వేదశాస్త్రములను అవగతిపర్యన్తమభ్యసించినవాడును,నిరన్తరము బ్రహ్మస్వరూపానుసంధానపరుడును,జితేన్ద్రియుడును,దేహేన్ద్రియాదులందు 'నేన'ను భావమును,తద్భిన్నమునందు'నాది'యను భావమును పరిత్యజించినవాడును,శీతోష్ణసుఖదుఃఖాదులను సహించువాడును,సర్వకామనావర్జితుడును,శిష్యులను తరింపజేయ సమర్థుడును,దయాసముద్రుడునగు బ్రహ్మవిదుడు"**సద్గురువ**"నబడును.ఇట్టి గురువును జిజ్ఞాసువు తన లక్ష్యమగు మోక్షసిద్ధికొఱకు ప్రయత్నపూర్వకముగా నాశ్రయించవలెను.

**శ్లో||అవిద్యా హృదయగ్రన్థి బన్ధమోక్షో భవేద్యతః|**

**తమేవ గురురిత్యాహుర్గురు శబ్దార్థ వేదినః||**(స.వే.సి.సా.సం.254)

దేహము,అన్తఃకరణము మరియు వాని ధర్మములను,అట్లే ఇంద్రియ ప్రాణ ధర్మములను అజ్ఞానవశమున ఆత్మయందు ఆరోపింపబడుచున్న వి.ఈ ఆరోపమునకే హృదయగ్రన్థి అనియు,చిజ్జడగ్రన్థి అనియు అంటారు. ఇది యెవరి ఉపదేశమువలన ఛేదింపబడునో(తొలగింపబడునో)అతడు ***గురువ***ని గురుశ బ్దార్థమునెఱిగిన పండితులు చెబుతున్నారు.

**శ్లో॥శివ ఏవ గురుస్సాక్షాద్గురురేవ శివస్స్వయమ్।**

**ఉభయోరన్తరం కిఞ్చిన్నష్టద్రవ్యం ముముక్షుభిః॥**(స.వే.సి.సా.సం.255)

శివుడే సాక్షాత్తుగా గురురూపంలో అవతరించినాడు.కావున శివుడే గురువు.గురువే శివుడు.ఇందులో సందేహంలేదు.అందుచే ముముక్షు వులందరు గురువును శివునిగానే భావించాలి.కాని శివ గురు భేదము ను యెంత మాత్రము యెంచరాదు.

**శ్లో॥బన్ధముక్తం బ్రహ్మనిష్ఠం కృతకృత్యం భజేద్గురుమ్।**

**యస్య ప్రసాదాత్సంసార సాగరో గోష్పదాయతే॥**(స.వే.సి.సా.సం.256)

సంసారబన్ధమునుండి విడుదలనొంది నిరన్తర బ్రహ్మానుసన్ధాన పరా యణుడై,మనుష్యజన్మమునందుచేయదగిన సర్వసంగపరిత్యాగము మొ దలగు సర్వకార్యజాతమును చేసినవాడగుటచే కృతార్థుడైనట్టి సద్గురువు ను ముముక్షువులాశ్రయించవలయును.అట్టి శ్రీగురుదేవుని యనుగ్రహ ముచేసాధకుడు సంసారమహాసముద్రమును గోవుయొక్క అడుగుము- ద్రనువలె అవలీలగా దాటగలడు.

**శ్లో॥శుశ్రూషయా సదా భక్త్యా ప్రణామైర్వినయోక్తిభిః।**

**ప్రసన్నం గురుమాసాద్య ప్రష్టవ్యం జ్ఞేయమాత్మనః॥**(స.వే.సి.సా.సం.257)

శుశ్రూష(సేవ)చేతను,భక్తియుక్తములగు నమస్కృతులచేతను,వినయ విధేయతలచేతను,గురువును ప్రసన్నునిజేసికొని ఆపైన తనకభీప్సితమ గు నాత్మతత్త్వమునుగూర్చి అడుగవలయును.

ఇంతదనుక పూజ్యపాదులగు శ్రీఆదిశంకరులవారు ఉపదేశించిన గు రులక్షణములనుతెలిసికుంటూవచ్చాము.ఇప్పుడు శ్రీసాధునిశ్చలదాసు స్వామీజీవారిచే రచింపబడిన శ్రీవిచారసాగరోక్త (తృతీయతరంగము)గురులక్ష ణములను అవలోకించెదము.

## —:46.శ్రీవిచారసాగరోక్త గురులక్షణములు:—

హిందుస్థాని దోహ(పద్యము):—

**వేదఅర్థకూఀ భలే పిఛానై,ఆతమ బ్రహ్మరూప ఇక జానై।**

**భేదపంచకీ బుద్ధి నసావై,అద్వయ అమల బ్రహ్మ దరసావై॥**

**భవమిథ్యా మృగతృషా సమానా,అనులవ ఇమ భాఖత నహీఀ ఆనా।**

**సోగురు దే అద్భుతఉపదేసా,ఛేదక సిఖా న లుంచితకేసా॥**

1.అధీతవేదుడై=శ్రోత్రియుడై అనగా సకలోపనిషత్తులను అర్థావగతి ప ర్యన్తము చక్కగా విచారించినవాడై యుండాలి.

2.జ్ఞాననిష్ఠుడై(బ్రహ్మనిష్ఠుడై)యుండాలి.అనగా"**శ్రోత్రియంబ్రహ్మనిష్టమ్**" (ముం.1-2-12) అను శ్రుత్యుక్త లక్షణములు కల్గియుండాలి.

3.శిష్యుని బుద్ధియందు ఉదయించు పంచవిధ భేదములను నానా

యుక్తులచే నివర్తింపగల సమర్థుడైయుండాలి.

యద్యపి,"**తత్త్వమసి**"(ఛాం.6-8-7;6-9-4),"**అహంబ్రహ్మాస్మి**"(బృ.1-4-10), "**అహమాత్మా గుడాకేశ సర్వభూ తాశయస్థితః**"(గీత.10-20),"**క్షేత్రజ్ఞం చాపి మాంవిద్ధి సర్వక్షేత్రేషుభారత**"(గీత.13-2)ఇత్యాది జీవేశ్వరుల అభేదమును ప్రతిపాదించు వాక్యములు మరియు"**సర్వం ఖల్విదం బ్రహ్మ**"(ఛాం.3-14-1),"**ఐతదాత్మ్యమిదం సర్వం**"(ఛాం.6-8-7),"**బ్రహ్మైవేదం సర్వం**"(నృసింహోత్తర.తా.ఉ.7-3),"**నేతినేతి**"(బృ.2-3-6),"**నేహనానాస్తి కిఞ్చన**"(బృ.4-4-19;కఠ.2-1-11)"**మత్తః పరతరం నాన్య త్కిఞ్చిదస్తి ధనఞ్జయ**"(గీత.7-7),"**మయా తత మిదం సర్వం**"(గీత.9-4),ఇత్యాది జగద్బ్రహ్మలకు అభేదమును బోధించు వాక్యములు సకలభేదనిరాకరణపూర్వకముగాఅద్వైతసిద్ధికి పరమప్రమాణములుగానున్నవి.అట్లే,"**ఏతస్మిన్నుదరమన్తరంకురుతే అథతస్యభయం భవతి**"(తై.బ్రహ్మానందవల్లి.7-4)"**ద్వితీయాద్వైభయం భవతి**"(బృ.1-4-2)"**మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహనానేవపశ్యతి**"(కఠ.2-1-10)ఇత్యాది శ్రుతులు భేదదర్శనము భయ(సంసార)కారణమని ఘోషించుచున్నవి.కాని,న్యాయమునే(యుక్తులనే)బహుమన్యమానముగా(ప్రధానముగా)విశ్వసించు కుతార్కికులు—1.జీవేశ్వర భేదము,2.జీవులకు పరస్పర భేదము,3.జీవజడ భేదము,4.జడఈశ్వరభేదము,5.జడజడ(జడపరస్పర)భేదము అని పంచభేధములు గలవని,అద్వైతము సత్యముగాదని,ద్వైతమే సత్యమని ప్రలపింతురు.అట్టి పంచభేదములను అనుమానాది యుక్తులచే నిరాకరిస్తూ,కుతార్కిక మతములను ఖండిస్తూ,ముముక్షువును కల్పిత సంసారబంధనములనుండి విముక్తునిజేయు సామర్థ్యము గల్గియున్నవాడే సద్గురువనబడును.

**శ్లో॥మానాభావాదయుక్తేశ్చ న భిదేశ్వరజీవయోః।**

**జీవానామచితాం చైవ నాత్మనో న పరస్పరమ్॥**(భేదధిక్కారము-4)

పంచభేదములను సిద్ధిజేయగల ప్రమాణములుగాని,యుక్తులుగాని అభావమున్నందున భేదముఅప్రమాణికము మరియు యుక్తిరహితము.భేదపంచక నిరాకరణ యుక్తులు ఈక్రింది విధముగానున్నవి.

I.జీవేశ్వరభేదము కల్పితమున్నది (ప్రతిజ్ఞా),అవిద్యామాయారూప ఉపాధి కృతమున్నందువలన(హేతువు), ఘటాకాశమఠాకాశ భేదమువలె (ఉదాహరణము).

II.జీవులపరస్పరభేదము కల్పితమున్నది (ప్ర),సాభాసాన్తఃకరణరూపోపాధికృతమగుటవలన(హే),నానాఘటాకాశముల పరస్పరభేదమువలె.

III.జీవజడభేదము కల్పితమున్నది (ప్ర),సాభాసాన్తఃకరణము మరియు నిరాభాస నామరూపమయ ఉపాధికృతమగుటవలన(హే),స్వప్నగత చరాచర భేదన్యాయమున(ఉ).

IV.ఈశజడములభేదము కల్పితము (ప్ర),సాభాసమాయ మరియు నిరాభాస నామరూపమయఉపాధికృతమగుటవలన(హే),సాక్షి మరియు స్వప్నప్రపంచ భేదమువలె (ఉ).

V.జడజడములపరస్పరభేదము కల్పితము (ప్ర),నామరూపమయ ఉపాధికృతమగుటవలన(హే),రజ్జువునందు కల్పిత సర్పదండాది భేదము వలె (ఉ).

ఈరీతిగా పంచభేదఖండనమునందు పంచప్రకారములయిన అను-

మానప్రమాణరూప యుక్తులు ఇచ్చట సూచించనైనది.ఇంకా అనేక ప్రకారములగు యుక్తులను తెలియగోరువారు భేదధిక్కారాది గ్రంథములందు గనందగును.[ఈవిషయము లోగడ 108 వ పేజిలో అధ్యాసమును పురస్కరించుకొని చెప్పబడినది.ఇక్కడ గురులక్షణ నిరూపణ ప్రసంగమున చెప్పబడుచున్నది.కావున,ప్రకరణభేదముచేతను లేక విషయదార్ఢ్యతకొఱకు పునః ప్రతిపాదనజేయబడినదని భావించగలరు.అంతేగాని, పునరుక్తి దోషముగా తలంచరాదు.సర్వత్ర ఇట్లే ఊహించదగును).

**శ్లో॥పౌనరుక్త్యం న దోషోఽత్ర శబ్దేనార్థేన వా భవేత్।**

**అభ్యాసేన గరీయస్త్వమర్థస్య ప్రతిపాద్యతే॥**(మానసోల్లాసము 8-4)

పునరుక్తినిగూర్చి విస్తారంగా తెలియగోరువారు మాచే రచింపబడిన ***"శ్రీభక్తతుకారాం అభంగవాణి"*** గ్రంథములో పృష్ఠము 308 నుండి గనందగును.]

ఇంకా గురులక్షణాలు(శ్రీవిచారసాగరములో)ఈక్రిందివిధముగా నున్నవి.

4.భేదనిరాకరణముగావించి అద్వితీయము,అమలము అనగా అవిద్యాకామకర్మరూప మలరహిత బ్రహ్మమునుశిష్యునియొక్క ఆత్మస్వరూపముగా దర్శింప(సాక్షాత్కరింప)జేయవలయును. మరియు,

5.అవిద్యాతత్కార్యరూప సర్వసంసారమును మిథ్యారూపముచే ఉపదేశించవలెను.ఇటువంటి అద్భుతఉపదేశము చేయగలవాడు ఆచార్యుడనబడును.

**శ్లో ॥ ఆచినోతి హి శాస్త్రార్థానాచారేస్థాపనాదపి।**

**స్వయమాచరతే యస్తు తస్మాదాచార్య ఉచ్యతే ॥**(ద్వయోపనిషత్.3)

ఎవరు ఉపనిషదాది శాస్త్రములయొక్క తాత్పర్యార్థమును యథాత-థముగ యెఱింగినవాడై,శాస్త్రోక్త సదాచారమును స్వయముగా తాను ఆచరిస్తూ,తనను ఆశ్రయించిన శిష్యులను,భక్తులను సదాచారమునందు ప్రవేశపెట్టి, వారిని ఆచరింపజేయువాడు ***"ఆచార్యుడ"***నబడును. కాని,

**శ్లో॥జటిలోముండీ లుఞ్చిత కేశః,కాషాయామ్బర బహుకృత వేషః।**

**పశ్యన్నపి చ న పశ్యతి మూఢః, హ్యుదర నిమిత్తం బహుకృత వేషః॥**

(చర్పటపఞ్జరికా స్తోత్రము-4)

జడలు కట్టించుకొని,నున్నగాగుండు గీయించుకొని,వెంట్రుకలు పీకివేసి,కాషాయ వస్త్రములుకట్టి, అనేక వేషాలు వేస్తారు.నిజంగా యీ వేషాలు సర్వసంగపరిత్యాగులగు సన్న్యాసులవి.అయితే యీ వేషాలు వేసేవారందఱు నిజమైన సన్న్యాసులు మాత్రము కాదు.ఇందులో కొందఱు పొట్టకూటి కోసం మాత్రమే యీ వేషాలు వేస్తారు.

నిజమైన సన్న్యాసులు ప్రాపంచిక విషయాలను వదిలిపెట్టి,జీవిత పరమార్థం ఏమిటో తెలుసుకొని,దానిని సాధించటానికి సాధనలు చేస్తుంటారు.నిరంతరము పరమాత్మకు సంబంధించిన విషయాలను శాస్త్రాల ద్వారా,గురువులద్వారా తెలుసుకుంటూ,శిష్యులకు బోధిస్తూ,ఆవిషయాలనే విచారణచేస్తూ,ధ్యానిస్తూ ఉంటారు.అట్టివారు"**యదృచ్ఛాలాభ సంతుష్టః**"(గీత.4-22)ప్రారబ్ధవశమున ప్రాప్తమైన దానిచే తృప్తిగల్గి ఉంటారు.దేహపోషణకు ప్రాధాన్యతనివ్వరు.అలాంటి వారికి సమాజంలో గౌరవముంటుంది.వారిని మహాత్ములుగాపరిగణించి,పిలిచి అన్నంపెట్టి తమ జన్మధన్యమైనట్లు భావిస్తారు గృహస్థులు.

అలాంటి గౌరవమర్యాదలు పొందాలన్నా, కడుపునిండా కమ్మని తిండి దొరకాలన్నా కొందరు సోమరులు ఆ వేషాలు వేయాలనుకుంటారు. అయితే అట్టివారు చూస్తూకూడా చూడనివారే.అంటే,మోసగాళ్లుగూడ భగవంతునికి సంబంధించిన మాటలు మాట్లాడుతారు.వేదాలు,ఉపనిషత్తులలో తెలిపిన విషయాలలో రెండుమూడింటిని బండగుర్తులు పెట్టుకొని అక్కడక్కడ కంఠస్థం చేసి,కొన్నికొన్ని పదాలను పుక్కిటపట్టి ఉపన్యాసాలిస్తూ మధ్యమధ్య ఆ శ్లోకాలను వల్లెవేస్తూ ఉంటారు.ఇవి గనుక అసలు చేయకపోతే వారి బండారం బయట పడుతుంది.అందువల్ల వారుకూడ ముఖంపై ప్రశాన్తతను పులుముకొని మహాత్ములలాగా అభినయిస్తూ భగవత్తత్త్వాన్నిఅనర్గళంగా బోధిస్తారు.అయితే వారుచెప్పే విషయాలయొక్క అంతరార్థాన్ని ఎన్నడూఏమాత్రమూ విచారణచేయరు.ఆవిషయాలను ఆచరించరు.వారికి ఎటువంటి అనుభూతికూడ ఉండదు.ఇలాంటివారు బోడిగొట్టుకొని,కొందరిని శిష్యులుగాజేసికొని,వారికి శిఖాఛేదనము(జుట్టుకత్తిరించి) పిలకపెట్టి,సంప్రదాయ చిహ్నములను మాత్రముధరింపజేసి మేము ఆ-చార్యులమని చెప్పుకుని—జనమును ఆకర్షించి,కమ్మని భోజనాలు ఆరగిస్తూ,జనమునుండి ధనమును పోగుజేస్తుంటారు.ఇట్టి వారిని ఆచార్య శం-కరులు మూఢులు అనిచెప్పున్నారు.కావున,ఇట్టివారు ఆచార్య(గురు)ప-దవికి అర్హులుకారు.నిజముగా జననమరణరూపసంసారమునుండి తరించగోరు ముముక్షువులు ఇట్టివారిని ఆశ్రయించి అమూల్య మైనసమయమును వృథాచేయరాదు.దైవవశమున ప్రాప్తించిననూ వారిని వదలి,పూర్వోక్త సద్గురులక్షణములుగల ఆచార్యుని శరణుబొందవలయును.అర్హతలేనివారిని వదలి యోగ్యులనుచేరుట దోషముగాదు—భూషణమే.

**శ్లో॥మధులుబ్ధోయథాభృఙ్గః పుష్పాత్పుష్పాన్తరం వ్రజేత్।**

**జ్ఞానలుబ్ధస్తథా శిష్యో గురోర్గుర్వన్తరం వ్రజేత్॥**(గు.గీ.1-89;కులార్ణవ తం. 13-132)

తేనెను పానముచేయుట యందభిలాషగల భృంగము(తుమ్మెద) ఎట్లు దానికి తృప్తిగల్గునంతవరకు ఒకపుష్పమునుండి మరియొక పుష్పమును ప్రవేశించుచున్నదో,అట్లే,బ్రహ్మజ్ఞానామృతమును గ్రోలుటయందభిలాషగల శిష్యుడుగూడ ఒక గురువుచే పరిపూర్ణుడు కానియెడల మరియొకరిని ఆశ్రయించి ధన్యుడు కావచ్చును.ఈవిషయంలో ఎలాంటి సందేహము తగదు.

*(**ముఖ్యగమనిక:**—ఒకవేళ గురుదేవుడు శ్రోత్రియుడు,బ్రహ్మనిష్ఠుడు మరియు దయాళువైయుండినచో అటువంటి సద్గురువునుగూడ శిష్యుడు వదలి వెళ్ళినచో,వాడు పథభ్రష్టుడై జన్మమరణరూప సంసారమున తగల్కొనును.)*

శ్రీమద్భాగవతైకాదశ స్కంధమున శ్రీఅవధూత-యదుసంవాదంలో అవధూత దత్తాత్రేయులవారికి ఇరువది నలుగురు గురువులున్నట్లు తెలియబడుచున్నది.మరియు జనకులవారికి"అష్టావక్రగీత"యందు అష్టావక్రమునీశ్వరుడు గురువనియు,భారతంలో పంచశిఖుడనియు,శుకబ్రహ్మకైవల్యమున శ్రీవశిష్టమునీంద్రులు గురువనియు,ఉపనిషత్తులో శ్రీయాజ్ఞ్యవల్క్యులు గురువనియు,సిద్ధగీతలో సిద్ధులు గురువులనియు వినబడుచున్నది.కనుక ఒకయోగ్యుడగు గురువుచెంత విద్యనభ్యసించిననూ స్వరూపవిషయంలో ఇంకా సంశయముండినచో నిశ్చయముగా మరియొక గురువునాశ్రయించి ధన్యుడు కావచ్చునని శాస్త్రము నిదర్శనముగా నిలి

చినచో,యిక అయోగ్యుడగు గురువును వదలిపెట్టి యోగ్యుడగు సద్గురువును ఆశ్రయించి ధన్యుడు కావచ్చునని వేరుగా చెప్పవలెనా? లేనిచో నీ జన్మముర్వర్థమైపోవుటయేగాక,పునర్జన్మము నిశ్చయముగాగలుగును. సంశయములేదు."**సంశయాత్మా వినశ్యతి**"అనుగీతావాక్యమే(4-40)ఇందుకు ప్రమాణము.

**శ్లో॥వక్తార మాసాద్యయమేవ నిత్యా, సరస్వతీ స్వార్థసమన్వితాఽసీత్।**

**నిరస్తదుస్తర్కకళఙ్క పఙ్కా నమామి తం శఙ్కరమర్చితాఙ్ఘ్రిమ్॥**

(సంక్షేప శారీరకము 1-7)

నిత్యమగు వేదరూపవాణి(సరస్వతి),ఏ వక్తను ఆశ్రయించుకొని సమస్త దుష్టతర్క కళంకరూప పంకము(బురద)నుండి ముక్తురాలై,అద్వితీయ బ్రహ్మతత్త్వరూప తన వాస్తవిక అర్థయుక్తయై సార్థకమాయెనో,అట్టి సర్వపూజ్యచరణులగు శ్రీశంకరాచార్యుల వారికి నమస్కరించుచున్నాను.

కావున,పూర్వోక్త వివేకాది సాధనచతుష్టయ సంపన్నుడగు పుణ్యపురుషుడు బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానముకొఱకు,శ్రోత్రియుడు,బ్రహ్మనిష్ఠుడు మరియు ఊహాపోహ గ్రహణ ధారణాది పూర్వోక్తలక్షణములుగల సద్గురువును విధిపూర్వకముగా శరణు వెళ్ళవలయునని శ్రుతిస్మృతులు అధికారి పురుషునికి కర్తవ్యమును బోధిస్తూ శాసించుచున్నవి.*ఇతి గురులక్షణ నిరూపణమ్.*

**—:47.గురూపసత్తి ప్రకారము :—**

శ్రుతి:—**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం**

**బ్రహ్మనిష్ఠమ్।**(ముం.1-2-12)మోక్షాభిలాషియగు అధికారి ఇట్లు నిర్వేదము ను(వైరాగ్యమును)పొందవలెను.ఈలోకంలో అనిత్య ఫలసాధనములగు కర్మోపాసనలచేతనిత్యమగుమోక్షము లభించదు—అని విచారించి నిత్యవ స్తువగుబ్రహ్మముయొక్క సాక్షాత్కారము(అపరోక్షబ్రహ్మజ్ఞానము)ను పొం దుటకొఱకై అతడు చేతిలో సమిధలు తీసుకొని శ్రోత్రియుడు మరియు బ్రహ్మనిష్టుడగుశ్రీగురుదేవుని సమీపమునకు వెళ్ళవలయును(ఆశ్రయిం చవలెను).

సమస్తలోకములు కర్మసాధ్యములుగాన**"యత్కృతకం తదనిత్యమ్"** ఏది కర్మసాధ్యమో అది అనిత్యము—అను న్యాయముచే యీసంసార ములో నిత్యమైన పదార్థమెద్దియును లేదు.**"అనిత్యమసుఖంలోకమ్"** (గీత.9-33)ఈలోకము(లు)అనిత్యములు,దఃఖరూపములు.కర్మసాధ్యము లగు ఉత్పాద్యము,వికార్యము,సంస్కార్యము మరియు ప్రాప్యము—అను నవి అనిత్యఫలములు.ఈకర్మలచేనిత్యము,అమరము,అభయము,నిర్వి కారము,అచలము మరియు స్థిరమగు బ్రహ్మరూపమోక్షము లభించదు. ఇట్టి భయశూన్యము,కళ్యాణస్వరూపము,నిత్యమునూ—అగు పదవిని తెలిసికొని,దానిని పొందగోరు శమదమాది సాధనసంపన్నుడు సమిత్పా ణియై అనగా యజ్ఞోపయుక్తమైన ఎండుకట్టెల భారమును చేతిలో తీసికొ ని శ్రోత్రియ బ్రహ్మనిష్ఠ సద్గురుదేవుని శరణువెళ్ళవలెను.ఎండు కట్టెల యొక్కఅభిప్రాయమిది—ఈసంసారమునుండి నేను శుష్కకాష్ఠమువలె నీరసమై అనగా సాంసారికకోరికలు సంపూర్ణముగా పరిత్యజించి విరక్తుడ నై,హే సద్గురుదేవా!నిన్ను శరణుజొచ్చితిని.ఎట్లు ఎండుకట్టెలతో అగ్ని సంబంధమైన తోడనే కాలి భస్మమైపోవునో,అట్లు మీయొక్క అనుగ్రహ

ముచే ప్రాప్తమైన ఆధ్యాత్మజ్ఞానాఅగ్నిచే నాయొక్క సమస్తకర్మలు అనబడు కట్టెలు కాలి భస్మమైపోవును."**జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున**"(గీత.4-37)ఇట్లు,అధికారియగు సాధకుడు ఉపరోక్త విశేషణములుగల సద్గురుదేవున్నే శరణువెళ్ళాలి,అన్యులను గాదు,మరియు స్వతంత్రముగా బ్రహ్మజ్ఞానాన్వేషణము చేయగూడదు—అని **"ఏవ"** శబ్దార్థము.

**"భృగుర్వై వారుణి ర్వరుణం పితర ముపససార,అధీహి భగవో బ్రహ్మ"**(తై.3-1)వరుణుని పుత్రుడగు భృగువు,తన తండ్రిని సమీపించి,హే భగవన్! నాకు బ్రహ్మోపదేశము చేయండి—అని ప్రార్థించెను.

శ్రుతి:—**"ఆచార్యాద్ధ్యేవ విద్యావిదితా సాధిష్ఠం ప్రాపదితి"**(ఛాం.4-9-3) **"ఆచార్యవాన్ పురుషో వేద"**(ఛాం.6-14-2)ఆచార్యుని (శ్రీగురుదేవుని)ద్వారా పొందిన(తెలిసికొన్న)విద్యయే సాధుత్వమునొందును.రాణించును.కళ్యాణకారి కాగలదు.ఆచార్యవంతుడగు పురుషుడే(ఎవడు యోగ్యుడైన సద్గురువును పొందియున్నాడో అతడే)సద్రూప ఆత్మనుపొంది సుఖశాంతులను బడయగలడు.

స్మృతి :—**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।**

**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥**(గీత.4-34)

దేహాదిక అధ్యాసకు కారణమైన అనాద్యనిర్వచనీయ స్వరూపాజ్ఞానమునకువిరోధి(నాశకము)యగు సర్వశ్రేష్ఠ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానము ఎట్లు పొందబడునో—అది తెలుసికొనుము.ఆచార్యులనుజేరి,ప్రణిపాతం అనగా లెస్సగా క్రిందపడడం,దీర్ఘదండనమస్కారముచేసి,పరిప్రశ్న అనగా నాకు బంధం ఎట్లు వచ్చినది?ఈబంధవిముక్తి ఎట్లు లభించును?విద్య అనగా

ఏమిటి?అవిద్య అనగాఏమిటి?అనిప్రశ్నించడంచేత,సేవయా అనగా గురు శుశ్రూష మొదలైన వాటిచేత,వినయంచేత ఆవర్జింప(ఆకర్షింప)బడిన ఆచార్యులు,నీకు అజ్ఞానతత్కార్యమగు బంధమును నాశనము చేయగల ఆత్మజ్ఞానమును ఉపదేశిస్తారు.జ్ఞానినః తత్త్వదర్శినః=జ్ఞానవంతులలో గూ డ కొందరు తత్త్వాన్ని యథాతథముగా(ఉన్నదిఉన్నట్లుగా)అనుభూతిని పొందిన వారుంటారు.అందరికి తత్త్వము బోధపడదు.బోధపడిననూ శ్రుత్యు క్త లక్షణములుగల బ్రహ్మతత్త్వమును ఉన్నదిఉన్నట్లుగా దర్శింప జాల రు.అందుకే"జ్ఞానినః"అను శబ్దముతోపాటు"**తత్త్వదర్శినః**"అను విశేషణ ముగూడ చేర్చబడినది.దీనివలన భగవంతుని అభిప్రాయమెట్లున్నద నగా—యథార్థమైన తత్త్వము(తత్త్వమసిమహావాక్యార్థము)నెఱింగి, అను భూతినొందినవారు మాత్రమే,మరియు అటువంటివారిద్వారా ఉపదేశింప బడిన జ్ఞానమే జీవుని సర్వవిధ బంధములనుండి విముక్తునిజేయ సా మర్థ్యము కలిగియుండును.

సాక్షాత్ భగవంతుడే రామకృష్ణాద్యవతారములెత్తి వసిష్ట సాందీపాదు లను గురువులుగా స్వీకరించెను.లోకమునకు గురు సంప్రదాయమును బోధించుటకే గదా అతడు(భగవంతుడు)గురువులను ఆశ్రయించినాడు. అట్లే,ఉపనిషత్తులనుఅవలోకించినచో నచికేతుడు,సత్యకాముడు, జానశ్రు తి మున్నగువారు యమాచార్యులను,గౌతముడు,రైక్వ మొదలగు వారి ని గురువులుగా గ్రహించియుండిరి.సాక్షాత్ శంకరులేయగు శంకరాచార్యు లుగూడ అనాది గురు సంప్రదాయమును లోకమునకు చాటి చెబుతూ శ్రీ గోవిందభగవత్పాదులను ఆశ్రయించిరి గదా!ఇంతకంటే నిదర్శనము లేమి కావలెను?ఇట్లుండగా,గురువు అవసరమా?లేదా?అని వేరుగ చెప్పవలె

నా? ఎందుకనగా,

**"యథా హిరణ్యనిధిం నిహితమక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సఞ్చరన్తో న విన్దే యురేవమేవేమాః........అనృతేన హి ప్రత్యూఢాః"** భూమిలో పాతిపెట్టబడిన ధనముయొక్క స్థానజ్ఞానము లేనివాడు,ఆ ధనము పైనే ఇటునటు తి రుగుతూ ఉన్ననూ ఆ ధనము నెఱుగజాలనట్లు,ఈసకల అజ్ఞానిజీవులు ప్రతినిత్యము సుషుప్తి కాలములో బ్రహ్మలోకమునకు (హృదయాకాశస్థ బ్రహ్మమును)చేరుకొనుచున్నప్పటికిని *"నేను బ్రహ్మభావమునుపొందినా ను"* అని తెలియజాలకున్నారు.ఏలయన,అనృతాజ్ఞానరూప దోషముచే స్వరూపజ్ఞానమునుండి వంచితులైనందువలన.స్వయముగా తాను బ్ర హ్మమే అయియుండియు *'అహంబ్రహ్మాస్మి'* అని యెఱుగజాలకున్నాడు. ఆహా!ఆశ్చర్యము.ఇదియే అజ్ఞానముయొక్క అద్భుతమహిమ.ఇటువం టి అజ్ఞాతబ్రహ్మమును తెలయపరచి *"తత్త్వమసి,నాసీత్త్వంసంసారి"*అని బోధించగల సమర్థుడు శ్రీగురుదేవుడొక్కడుదప్ప,అన్యులెవరునూ ముల్లో కములలోగూడలేరు.ఈసందర్భంలో శ్రీవేదాన్తపఞ్చదశి తృప్తిదీపప్రకరణ ము 22వ శ్లోకమునుండి 62వ శ్లోకపర్యన్తము **దశముని దృష్టాన్తయుక్త** మగు చిదాభాసుని సప్తావస్థల వర్ణనముద్వారా గురువుయొక్క ఆవశ్య కతను గుర్తించగలరు.విస్తారభయముచే సంకేతమాత్రం చేయనైనది. అందువలన,

హిందుస్థానీ దోహా:—**ఈశ్వరతై గురుమై అధిక,ధారై భక్తి సుజాన।**

**బిన గురుభక్తి ప్రవీనహు,లహై న ఆతమ జ్ఞాన॥**

**వేద ఉదధి బిన గురు లఖై, లాగై లౌన సమాన!**

**బాదర గురుముఖద్వార హ్వై, అమృతసై అధికాన॥**(శ్రీవిచారసాగర్-తృ.తరంగము)

వివేకాది సాధన సంపన్నుడుగు సుజ్ఞాని=అధికారి పురుషుడు నిష్కపట బుద్ధితో ప్రేమపూర్వకముగా పరిచర్యలుచేస్తూ,గురువునందు ఈశ్వరునికంటె అధికభక్తి చేయవలెను.ఏలయన—సకలశాస్త్ర ప్రవీణుడైన పురుషుడుగూడ గురూపదేశము లేకుండా జ్ఞానమును పొందజాలడు.

వేదరూప సముద్రము, గురువు లేకుండా లవణసమానము. క్షారము (ఉప్పు)గా నుండును.ఎట్లు క్షారసముద్రముయొక్క జలము త్రాగునపుడు క్షారతానుభవమై క్లేశము ప్రాప్తించునో,అట్లు గురువును శరణువెళ్ళకుంగా ఎవడు స్వతంత్రముగా వేదార్థ విచారముజేయునో,వాడు భేద రూపమగు క్షారతను=సంశయ,విపరీతములననుభవించి జన్మమరణ రూపమగు ఖేదము నొందును .

ఎట్లు సముద్రజలము స్వభావముచే క్షారమేయైనను,మేఘము ద్వారా మధురమగునట్లు,ఎవరు అనుభవజ్ఞుడగు బ్రహ్మవిద్గురు(ముఖద్వారమున)ముఖారవిందమునుండి వేదార్థమును శ్రవణముచేసి, విచారము జేయునో, వానికి వేదము అమృతము కన్న అధికానంద హేతువగును.

సమ్యక్ ప్రకారముచే సాంసారిక దోషములను దర్శించి అత్యంత విరక్తి నొందిన సాధనచతుష్టయసంపన్నుడగు పురుషుడే వేదాన్త విచారమునకు అధికారియగునని సూచిస్తూ,అతనికి గురూపసదనము(గురువునకు శరణువెళ్ళుట)అనివార్యమనిగూడ శాస్త్రోక్త గురుసంప్రదాయమును ప్రదర్శిస్తూ, తన శ్రేయస్సునుగోరి శ్రీఅర్జునులవారు శ్రీకృష్ణ భగవంతుని గురువుగా స్వీకరించి,శరణుబొందెను.

**శ్లో॥కార్పణ్యదోషోపహత స్వభావః,**

**పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢ చేతాః।**

**యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తాన్మే,**

**శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్ ॥**(గీత. 2-7)

కార్పణ్యము=దైన్యమనెడు—దోషముచే కొట్టబడిన అంతఃకరణముగల నేను మరియు సమస్తజగత్తును ధరింపగల సమర్థమగు(జగదధిష్ఠానమగు)బ్రహ్మమును తెలుసుకొనలేని అవివేకత్వమునొందిన చిత్తముగల నేను,రోగనివృత్తివలె వ్యభిచారి కానిదియు, స్వర్గాదులవలె కర్మసాపేక్షము కానిదియు,దుఃఖలేశముగూడ లేనిదియునగు(ఐకాన్తికము,అత్యన్తికమునగు)శ్రేయస్సును(మోక్షమును)గూర్చి నిన్నడుగుచుంటిని.

"**నాపుత్రాయ ప్రదాతవ్యం నాశిష్యాయ కదాచన**"(బ్రహ్మవిద్యోపనిషత్.47) "**నాప్రశాన్తాయ దాతవ్యం నాపుత్రాయాశిష్యాయ వా పునః**"(శ్వే.6-22) పుత్రుడు కానివానికి,శిష్యుడు కానివానికి ఇట్టి బ్రహ్మవిద్యను ఉపదేశింపకూడదు—అను శాస్త్ర నియమముచే,నీవు పుత్రుడవు కావు శిష్యుడవు కావు. అట్టి నీకెట్లు పదేశింపవలయును?అని యనెదవేమో—నేను నీకు శిష్యుడను నిన్ను శరణుజొచ్చితిని.నన్ను కరుణించి బ్రహ్మవిద్యోపదేశముచే శిక్షింపుము

**కార్పణ్యదోషః**:—కృపణత్వభావమునకు లేక కర్మకు కార్పణ్యమందురు. అనాత్మాధ్యాస యుక్తమైన దైన్యము అని అర్థము.కొంచమైనను తన ధనమునకు హానిగల్గినను సహింపలేనివానికి కృపణుడు(లోభి)అంటారు,ఇది లోకంలోప్రసిద్ధముగదా!అట్లే,ఎవడు స్వల్పమైనను స్వనాశనమును సహింపడో అట్టివాడు కృపణుడు.అజ్ఞాని జీవులు దేహగేహాదులందు అహంకార మమకారాలను వదలలేకున్నారు.జీవభావమును త్యాగము

జేయుటకు సహింపజాలకున్నారు.పరమపురుషార్ధమును పొందకయే శరీరమును త్యాగముచేయుచున్నారు.ఇటువంటి అనాత్మజ్ఞులగు జీవులను కృపణులని బృహదారణ్యకములో గార్గి బ్రాహ్మణమునందు చెప్పబడినది.
**"యోవాఏతదక్షరంగార్గ్యవిదిత్వాఽస్మాల్లోకాత్ప్రైతి స కృపణః"**(బృ.3-8-10) హేగార్గి!ఎవడు మానవజన్మము ప్రాప్తించినను తన జీవభావముయొక్క నాశనమును సహింపక(బాధింపజాలక),నాశరహితమగు నిత్యశుద్ధబుద్ధ ముక్త బ్రహ్మమును(తనయొక్క యథార్థస్వరూపమును) తెలిసికొనక యీ లోకమునుండి వెళ్ళిపోవునో(మరణించునో)వాడు కృపణుడు—అని కృపణ శబ్దముయొక్క భావార్థము.ఈ భీష్మద్రోణాదులందరు—నా తాతలు, గురువులు,తండ్రులు,పుత్ర మిత్ర భాంధవులు నావారు.నా వారినందరిని నేనే స్వయంగా యీ యుద్ధరంగమున చంపినచో నా జీవితమునకు ప్రయోజనమేమిటి?అను యీ స్వాభావిక(అవిద్యక)మమత్వరూప దోషము.దానిచే యుద్ధోద్యోగరూప నాక్షత్రియత్వము ఉపహతమైనది— తిరస్కృతమైనది.

**ధర్మసంమూఢచేతాః:**—నేనుకర్తవ్యవిమూఢుడనైతిని.అనగా,ధర్మనిర్ణయ ప్రమాణమును తెలియజాలకున్నాను.అనగా,వీరిని వధించుట ధర్మమా? లేక వీరిని పాలించుటధర్మమా?అట్లే,యీ పృథ్వీపరిపాలనము ధర్మమా? లేక పూర్వానుభూతమగు వనవాసమే ధర్మమా?అను నీ మొదలగు సంశయములచే వ్యాప్తమైన మనస్సుగలవాడనైతిని—అని అర్జునుని యొక్క అభిప్రాయము.

ఈ"కార్పణ్యదోషోపహతస్వభావః"అను శ్లోకము నందు **"తద్విజ్ఞానార్థం స గురు మేవాభి గచ్ఛేత్"**(ముం.1-2-12); **"భృగుర్వై వారుణిః"**(తై.3-1) ఇత్యాది శ్రుతులచే చెప్పబడిన గురూపసదన విధి,గురుసంప్రదాయము బోధింపబడినది.

కావున,అధికారియగు బ్రహ్మతత్త్వజిజ్ఞాసువు శ్రోత్రియుడు,బ్రహ్మనిష్ఠుడు మరియు దయాళువునగు సద్గురువు నాశ్రయించి,ఈశ్వరునికంటె అధిక భక్తిగలిగి,తనువును మనస్సును ధనమును మరియు వాణిని (వాక్కును)అర్పించి,శ్రద్ధాపూర్వకముగా పరిచర్యలు(సేవలు)గావించినచో,శ్రీగురుదేవులు ప్రసన్నులై,శిష్యునికి ఆత్మతత్త్వోపదేశముజేసి కృతార్థుని గావించును.

ఈశ్వరునియొక్క నిష్కామసేవ(ఉపాసన)చేత ధర్మోత్పత్తి(పుణ్యము) ద్వారా అంతఃకరణశుద్ధిరూప అదృష్టఫలము గల్గును.కాని ఆచార్యులకు చేయు నిష్కామసేవచేతనో,అతడు ప్రసన్నుడైనచో,ధర్మముయొక్క అపేక్షలేకయే ఉపదేశరూప దృష్టఫలమును మరియు పుణ్యోత్పత్తిద్వారా అంతఃకరణ శుద్ధిరూప అదృష్టఫలమును ప్రాప్తించును.అందుకే,గురుసేవ ఈశ్వరుని సేవకంటె గొప్పది.

ధర్మాధర్మముల ఉత్పత్తిద్వారా గలుగునది అదృష్ట ఫలమనబడును. ధర్మాధర్మముల ఉత్పత్తిని అపేక్షింపకయే సాక్షాత్తుగా గల్గునది దృష్ట ఫలమనబడును.

యెవరియొక్క వాణి వేదరూప ప్రమాణముతో సమానమో,అటువంటి బ్రహ్మవేత్తయగు సద్గురువు పూర్వపుణ్యవశమున ప్రాప్తించినచో,ప్రథమమున సాష్టాంగ దండవత్ ప్రణామములాచరించాలి. తదుపరి సేవలలో నియుక్తుడు గావలెను.

**శ్లో॥పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం ఉరసా శిరసా దృశా।**

**మనసా వచసా చైవ ప్రణామోఽష్టాంగ ఉచ్యతే॥**(ప్రపఞ్చసార తన్త్రము 6-114)

మాతాపితరులకు,ఆచార్యులకు,వర్ణ-ఆశ్రమ-విద్యావృద్ధులకు కుమారుడుగాని శిష్యుడుగాని సాష్టాంగ ప్రణామములుచేయుట సనాతన సంప్రదాయము గలదు.రెండు పాదములు,రెండు చేతులు,రెండు జానవులు (మోకాళ్ళు),ఉరస్(ఛాతి,వక్షస్థలము)మరియు నుదురు ఈఐదు అంగములను భూమికి స్పృశింపజేసి,నేను నికృష్టుడను,అజ్ఞానిని,మీ సేవకుడను అను దైన్యమును వ్యక్తముచేయు దృష్టితో,మనస్సులో అదే భావన చేస్తూ,మృదుమధురమైన,వినయము ఉట్టిపడునటువంటి స్తుతి మాటలచే ప్రణమిల్లుట(వందనమాచరించుట)ను సాష్టాంగప్రణామము—అని పెద్దలు చెప్పుచున్నారు.(గంధర్వతంత్రము 16-91&92)లో ఈక్రిందివిధముగా చెప్పబడినది.↓

**శ్లో॥త్యక్త్వా స్వమాసనస్థానం పశ్చాద్గత్వా నమస్కృతః।**

**నిపత్య దండవత్ భూమౌ నిపత్య హృదయేన చ॥**

**తథైవ దండవత్ భూమౌ దండ ఇత్యుచ్యతే బుధైః ॥**

నమస్కరించుటకు యోగ్యులగు వృద్ధులు(పెద్దలు)తటస్థపడినప్పుడు నమస్కారము చేయుటకు అర్హులగు కుమారుడు లేక శిష్యుడు తన స్థానమును వదలి,పెద్దలకు ఎదురుగావెళ్ళి,కర్రను నిటారుగా నిలిపి వదలినచో ఎట్లు తటాలున భూమిపై బడునో,అట్లు భావపూర్వకముగా భూమిపైబడి నమస్కరించుటను దండవత్ ప్రణామమని బుధజనులు(జ్ఞానులు)చెప్పుచున్నారు.

**శ్లో ॥ అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః।**

**చత్వారి తస్య వర్ధన్తే ఆయుర్విద్యాయశోబలమ్ ॥**(మనుస్మృతి.2-121)

ఎవరు ఎల్లపుడు వినమ్రులై జ్ఞానవృద్ధులగు గురువులకు,ఋషి-ముని-తపస్విలకు మరియు పూజ్యులగు పెద్దలకు యథోచిత పరిచర్యలు చేయుచుందురో,వందనమాచరించెదరో—వారికి ఆయువు పెరుగును. విద్యాప్రాప్తమగును.యశస్సు(కీర్తి)లభించును.మానసిక(బుద్ధి)బలమునూ చేకూరును.

**శ్లో॥నమస్కారేణ తుష్యన్తి మహాత్మానః సమన్తతః।**

**నమస్కారేణ లభతే చతుర్వర్గం మహోదయమ్॥**

**శ్లో॥సర్వత్ర సర్వ సిద్ధ్యర్థం నతిరేవ ప్రశస్యతే।**

**నత్వా విజయతే లోకాన్ నత్వా ధర్మః ప్రవర్తతే॥**

**శ్లో॥నమస్కారేణ దీర్ఘాయు రచ్ఛిన్నా లభతే ప్రజాః।**

**చతుర్వర్గం లభేద్భక్తో న చిరాదేవ సాధకః॥**

**శ్లో॥నమస్కారో మహా యజ్ఞః ప్రీతిదః సర్వతః సదా।**

**నమస్కురు మహాదేవీంప్రదక్షిణంచభక్తితః॥**(గంధర్వ తంత్రము 16-71 నుండి 74)

నమస్కారముయొక్క మహిమ ఈవిధంగా వర్ణింపబడినది.నమస్కారముచేత మహాత్ములు సంపూర్ణముగా పరితృప్తులై నమస్కర్తలపై ప్రసన్నతనొంది పైన పేర్కొనిన విధముగా ఆయువును,విద్యను, యశస్సును మరియు బలమును ప్రసాదించి ఆశీర్వదించెదరు.ఉదా:- యుద్ధారంభమున శ్రీయుధిష్ఠిరులవారు కురువృద్ధులు,గురువులునగు భీష్మపితా

మహుడు,ద్రోణాచార్యులు,కృపాచార్యులు మొదలగు పూజ్యులకు నమస్క రించినందున వారు ప్రసన్నులై,శత్రుపక్షమున నుండియుగూడ ధర్మరా జులవారికి"**విజయోఽస్తు**"అని ఆశీర్వాదములు పలికిరి.దానిచే(నమస్కా రముచే)పాండవులను విజయశ్రీ వరించినది.

నమస్కారముచే అభ్యుదయరూప సాలోక్యాది చతుర్వర్గములు లభిం చును.అన్ని దేశకాలములలో సకలప్రయోజనములు సిద్ధించుటకు నమ స్కారమే చాలాప్రశస్యమైనది.నమస్కారముచే సకలలోకములు జయింప బడును.ధర్మమార్గమున ప్రవృత్తుడగును.దీర్ఘాయువు లభించును.అవి చ్ఛిన్న సంతానము ప్రాప్తించును.నమస్కారమే ఒక మహాయజ్ఞమగును. అంతటా ఎల్లప్పుడునూ ప్రియమును(సుఖమును)చేకూర్చునదగును. సాధకుడగు భక్తునికి ధర్మార్థకామమోక్షములను అతిత్వరలో కలుగజే యును.అందువలన ప్రకాశ(జ్ఞాన)స్వరూపిణి,మహామాయ,జగన్మాతయ గు మహాదేవికి భక్తిపూర్వకముగా ప్రదక్షిణముచేసి నమస్కరింపుము. నమస్కారమనగా,

"**స్వాపకర్షబోధానుకూల స్వీయవ్యాపారవిశేషో నమస్కారః**"ప్రణామము నకు యోగ్యులగు గురువు లేక ఈశ్వరుని ఉద్దేశించి,నమస్కర్త తనయొ క్క నికృష్టతను—అనగా నేను అల్పజ్ఞుడను,నీ సేవకుడను—అని తన న్యూనతను వ్యక్తముచేస్తూ,శ్రద్ధా భక్తి పురఃసరసముగా మనో వాక్కాయ ములచే చేయు వ్యాపార(క్రియా)విశేషమునకు నమస్కారమందరు."**ణ- ము= ప్రహ్వత్వే శబ్దే చ**" అని ధాతు పాఠము.ప్రహ్వతా=దీనత,శబ్దము= స్తుత్యాది. అనగా దీనుడై సాష్టాంగముగాదండమువలె భూమిపైబడి,మృ- దుమధుర వాణిచే భావపూర్వకముగా స్తుతిస్తూ(కీర్తిస్తూ)చేయు వ్యాపార

విశేషమునకు నమస్కారము(వందనము)అందురు.

**"శ్రీవాచస్పత్యమ్"**లో నమః శబ్దమునకు"త్యాగము"అని మరొక అర్థముగూడ చెప్పబడినది.**"త్యాగే స్వస్వత్వధ్వంసానుకూల వ్యాపారభేదే। పుష్పవిందం విష్ణవే నమ ఇతి".**త్యాగమనగా,ఏదైనా ఒక వస్తువునందు తనకుగల స్వత్వము=అధికారమును వదలుకొని,యెవరికి ప్రదానము చేయదలచెనో వారియొక్కఅధికారమును ఆపాదించుట—అనగా ఈవస్తువునందు ఇప్పటినుండి నాకు అధికారములేదు.యికముందు దీనియందు నీకే అధికారము గలదు—అని ఆవస్తువును అతనికి అప్పగించుట=త్యాగము లేక దానము అనబడును. ఉదా:—ఈ పుష్పమును విష్ణువు కొఱకు త్యాగము చేయుచున్నాను ఇత్యాదులు.

## —:48.మంత్రరాజప్రకాశోక్త నమః శబ్దార్థములు:—

శ్రీపూజ్యపాదులగు శంకరాచార్యులవారి నలుగురి శిష్యులలో ఒకరు శ్రీపద్మపాదాచార్యులవారు పంచాక్షరీ మంత్రమునకు భాష్యమును చెప్తూ ఏడువిధముల అర్థమును వెలికితీసారు.నమః శబ్దమునకు త్యాగార్థములో:—

**శ్లో॥త్యాగో హి నమసోహ్యచ్య ఆనందః ప్రకృతేస్తథా।**

**ఫలం ప్రత్యయ వాచ్యం స్యాత్ త్యాజ్యం పత్రఫలాదికమ్ ॥**

**త్యజామీదమిదం సర్వం చతుర్ణామిహ సిద్ధయే ।**(మంత్రరాజప్రకాశః 1)

నమః శబ్దమునకు వేదములలో త్యాగము అని అర్థమున్నది.శివాయ అను శబ్దములోని ప్రకృతి అనగా'శివ'యొక్క అర్థము ఆనందము.మరియు'ఆయ'ప్రత్యయార్థము ఫలము.మనము సాధారణముగా పూజచే

యునపుడు పత్రములు,పుష్పములు భగవంతునికి సమర్పించుకుం టాము.అనగా త్యాగము చేస్తాము.అట్లే, శివుని(ఆనంద)ప్రాప్తి కొఱకు ఇదంరూపముచే ప్రతీయమానమగు యీ సమస్తజగత్తును నమః(త్యాగ ము)చేయుచున్నాను."**నమఃశివాయ**"అను శివపంచాక్షరీ మంత్రమునకు సాలోక్య,సామీప్య,సాయుజ్య మరియు సార్ష్టి అనబడు నాలుగు ప్రకారము ల ఆనందము అను ఫలమునుగోరి యీదృశ్యజగత్తును త్యాగము చేయు చున్నాను—అను భావము గలదు. లేక,

**శ్లో॥అథవా నమసోఽర్థ్యః ప్రణామో దైన్యలబ్ధయే ।**

**దైన్యం సేవా తథా జ్ఞప్తిః సిద్ధిః సర్వస్య వస్తునః ॥**

**నమామి దేవదేవేశం సకామోఽకామః ఏవ వా॥** (మంత్రరాజ ప్రకాశః -2)

నమః శబ్దమునకు 'ప్రణామము' ప్రసిద్ధార్థము. నాకు దైన్య భావము లభించుట కొఱకు విష్ణ్వాది దేవతలకుగూడా ఈశ్వరుడగు శివుని కొఱకు ప్రణామము సమర్పించుచున్నాను.దైన్యము=దీనత అనగా సేవ అని అర్థము.కావున,హేశివ!నీయొక్క సేవ లేక భక్తినిజేయు సౌభాగ్యమును కల్పించుము—అనిభావము."**జ్ఞానమిచ్ఛేన్మహేశ్వరాత్**"జ్ఞానంకొఱకు శివు ని అర్థించవలెను.కావున శివునిసేవచే ఆత్మజ్ఞానము లభించును.మరి యు సమగ్రపదార్థములు ప్రాప్తించును.అట్లే,సకలైశ్వర్యములు సిద్ధించు ను.భావమేమనగా,సకాముడై శివునికి ప్రణామము అనగా సేవ,భక్తి చేసినచో సమస్తకామనలు పూర్ణమగును.నిష్కాముడై సేవించినచో జ్ఞాన ముద్వారా ఆత్మస్థితి(బ్రాహ్మీస్థితి)ప్రాప్తమగును.

**శ్లో ॥నఞా నిషిధ్యతే భావవికృతిర్జగదాత్మనః ।**

**మసనం దేవదేవేశ నేహనానాస్తి శబ్దతః ॥**

**శ్లో ॥అయేతి గమయేత్యర్థే తస్మాచ్ఛుద్ధోఽస్మి నిత్యశః।**

**ప్రణామో దేహగేహాదేరభిమానస్య నాశనమ్ ॥**(మంత్రరాజప్రకాశః-3)

**"నమఃశివాయ"**అను శివపంచాక్షరి మంత్రమునకు మూడవ అర్థము ను శ్రీపద్మపాదాచార్యులు ఇట్లు చెప్పుచున్నారు.ఆత్మయొక్క మసనము అనగా పరిణామమే యీజగత్తు—అని సృష్టి శ్రుతులచే తెలియబడుచు న్నది.**ఆత్మనఃఆకాశః** (తై.2-1-1);**యతోవా** (తై.3-1);**సోఽకామయతః** (తై.2-6) ఇత్యాది.మసనము(నమస్ లోని మస్)అనగా పరిణామము అనగా వికా రము.ఇది ఆరువిధములుగా ఉంటుందని శ్రీయాస్కమునీంద్రులు చెప్పి యున్నారు.1.అస్తి,2.జాయతే,3.వర్ధతే,4.విపణమతే,5.అపక్షీయతే,6.వి నశ్యతి.ఈ షడ్భావవికారములు"నమస్"లోని'న'కారముచే నిషేధింపబ డుచున్నవి. కావున,యీ పరిణామశీలమగు జగత్తు దేనియందు నిషేధిం పబడుచున్నదో,ఆ నిషేధమునకు అవధిభూతమైన వస్తువు(అధిష్టాన ము)పరమశివుడు.ఆ దేవదేవేశుడే"నమః"శబ్దార్థము.అందుచే యిచ్చట **"నమః"**శబ్దము సంభోధనార్ధకము.అనగా,హే నమః!(అపరిణామియగు ఓ దేవదేవేశా!)అనియర్థము.జగత్తుయొక్క నిషేధమున**"నేహనానాస్తి కిఞ్చ న"**(బృ.4-4-19; కఠ.2-1-11)అను వేదమే ప్రమాణము.

***భావము:***—'అధ్యారోపఅపవాద'న్యాయముచే—ఎట్లు వేదములు జగ త్తుయొక్క ఉత్పత్తిని చెప్పుచున్నవో,అట్లే వాస్తవిక ఉత్పత్తిని నిషేధము గూడ చేయుచున్నవి.ఓశివ!అపరిణామియగు ఆత్మతత్త్వమును నాకు ప్రసాదించుము.అప్పుడే నేను శ్రుత్యుక్త నిత్య శుద్ధ బుద్ధ ముక్తమగు బ్ర

హ్మ మునగుదును.మరియు యీశరీరము,ఇంద్రియములు,ప్రాణము, మనస్సు బుద్ధి మొదలగు వాటియందలి అహమధ్యాస,అట్లే—గృహారామక్షేత్రములు,పుత్ర ధన దార(భార్య)మున్నగు వాటియందలి మమాధ్యాస యొక్క వినాశరూప ఫలము ప్రాప్తించును.కావున,యీ అభిమాన వినాశనమే వాస్తవిక ప్రణామము(నమస్కారము)అగును.అందువలన,ఓ నమః।ఓశివ!(అపరిణామియగు కళ్యాణస్వరూపా)నన్నుగూడ నీ యథార్థ స్వరూపము వైపుకే (అయ=గతౌ) తీసికెళ్ళుము. ఓంనమః శివాయ.

నిష్కర్ష యేమనగా,శ్రద్ధా,భక్తి గల్గి,ప్రహ్వీభావము అనగా దీన భావము అనగా సేవాభావముచే,అహంకార మమకారములను త్యాగముజేసి,జిజ్ఞాసువై శ్రీగురుదేవులకు లేదాఈశ్వరునికి శరణువెళ్ళుటయే యథార్థముగా ప్రణామము(నమస్కారము)అగును.ఇదియే నమస్కారము యొక్క అంతరార్థము.ఇట్లు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు గురువునకు శరణువెళ్లిన సాధకుడు(అధికారి గురుసానిధ్యములోఉండి తనువు,మనస్సు,ధనము, వాక్కులచే ఆచార్యుల పరిచర్యలు (సేవలు) చేయవలెను.

## —:49.గురు సేవా ప్రకారము :—

**తనువును(శరీరమును)అర్పించి సేవచేయుట**—అనగా,గురువుయొక్క ఆశ్రమమునందు సమ్మార్జనాది(ధూళి,చెత్త మొదలగునవి లేకుండ-ఊకి, నీటితోకడిగి శుభ్రముజేయుట మొదలుకొని)సకల కర్మలు చేయవలెను. మఱియు గురువునకు చరణసంవహనాది శుశ్రూష చేయవలెను. స్నానమునకు నీరు సిద్ధంచేయాలి.గురుదేవులు స్నానంచేసిన పిమ్మట వస్త్రములను ఉతికి శుభ్రముచేయుట,పూజాగదిని శుభ్రపరచి,పూజా సామ

గ్రులను సిద్ధ పరచుట మొదలగు సేవా కర్మలు చేయాలి.ఆశ్రమములోని పశుపక్ష్యాదులకు ఆహారము ఇవ్వాలి.ఫలవృక్షములకు,పూలమొక్కల కు నీరు పెట్టాలి.గురువుగారు శాస్త్రమును విద్యార్థులకు బోధించుటకు పూర్వము ఆసనాదులను సిద్ధపరచాలి.గ్రామమునుండి బిక్ష తీసుకురావాలి.

**శ్లో॥భిక్షాన్నం భోజయేన్నిత్యం నైకాన్నాశీ కదాచన।**

**నివేద్య గురవేఽశ్నీయాద్వాగ్యతస్తదనుజ్ఞయా ॥**(బృహన్నారదీయము 1-29)

**శ్లో ॥సమాహృత్య తు తద్భైక్ష్యం యావదర్థమమాయయా ।**

**నివేద్య గురవేఽశ్నీయాదాచమ్య ప్రాఙ్ముఖః శుచిః॥** (మను.2-51)

శిష్యుడు,తనకు మఱియు గురువునకు సరిపడు బిక్షను మాత్రము నిష్కపటభావముచే తీసికొచ్చి గురువునకు సమర్పించాలి.ప్రతిరోజూ ఒకే గృహమునుండి బిక్షను స్వీకరించగూడదు.వాక్సంయమనము గల్గియుండి శిష్యుడు,గురువుగారు బిక్షను స్వీకరింపుమని అజ్ఞాపించినపుడు మాత్రమే,శుచిర్భూతుడై,పూర్వాభిముఖుడై,ఆచమనాదులుచేసి భిక్షాన్నము ను భుజింపవలెను.

దీర్ఘాయువును గోరువాడు పూర్వాభిముఖుడై,యశస్సును గోరువాడు దక్షిణాభిముఖుడై,ఐశ్వర్యమునుగోరువాడు పశ్చిమాభిముఖుడై,మోక్షమునుగోరువాడు ఉత్తరాభిముఖుడై భోజనముచేయవలెను.అన్నము ను ఆదరపూర్వకముగా గ్రహించాలి. **"అన్నం న నిన్ద్యాత్, తద్వ్రతమ్"** (తై. 3-7);**"అన్నే హీదం సర్వం స్థితమ్"**(ఛాం.1-3-6).అన్నమును నిందించగూడదు.ఇది వ్రతము.అన్నమునందే యీసమస్తజగత్తు స్థితమై(ఆధారపడి)

యున్నది.అన్నమునుచూసి ప్రసన్నుడై,పులకితుడై,ప్రశంసిస్తూ భగవంతుని ప్రసాదమను భావనతో భుజించినచో,ఆ అన్నము శరీరమునకు, మనస్సునకు,ఇంద్రియములకు బలమును,తేజస్సును ఇచ్చును.లేని-చో వినాశనమునకు హేతువగును.పథభ్రష్టుని జేయును.

ఉచ్ఛిష్టమైన అన్నమును యెవరికి యివ్వగూడదు.భోజనము చేయు నపుడు మధ్యలో ఆగిఆగి(చాలాసేపు వ్యవధానమిచ్చి)తినగూడదు.అధి కంగా భుజించగూడదు.అతిభోజనము ఆరోగ్యమునకు,ఆయువునకు బాధ(హాని)కలిగించును.స్వర్గాపవర్గములకు ప్రతిబంధకమగును.మూడు వేళల్లో సంధ్య మరియు గాయత్రీ జపము చేయాలి .

గురువు ఆసనముపై కూర్చున్నప్పుడు శిష్యుడు నిలబడి,గురువు నిలుచున్నపుడు సమీపమునకువెళ్లి, వచ్చుచున్నచో సమ్ముఖమునకు వెళ్ళి, గురువు పోవుచున్నచో, అతని వెనుక పరుగెత్తి వెళ్లి(గురువుతో) మాట్లాడాలి.గురువును పేరుతో ఎప్పుడుగూడ పిలువగూడదు.ఎవరితోనైనా మాట్లాడునపుడుగూడ గురునామమును ఉచ్చరించరాదు.**"మా గురువుగారు"** అని మాత్రమే చెబుతూ మాట్లాడాలి.

గురుశిష్యులు ఎదురెదురుగా కూర్చున్నపుడు, శిష్యుని వైపునుండి గురువు వైపునకు గాలి వీచుచున్నచో,గురువు ఎదుట శిష్యుడు కూర్చొనగూడదు.

**శ్లో॥యావచ్ఛోపాధి పర్యన్తం తావచ్ఛుశ్రూషయేద్గురుమ్ ।**

**గురువద్గురుభార్యాయాం తత్పుత్రేషు చ వర్తనమ్ ॥**(పైఙ్గలోపనిషత్. 4-8)

గురువుయొక్క ఉపాధిరూప శరీరమున్నంతవరకు గురుసేవ చేయుచుండవలెను.ఒకవేళ గురువు గృహస్థుడైనచో గురువునందువలె గురుభార్యయందును,గురుపుత్రులయందును పూజ్య భావన కలిగియుండాలి. కాని,వారికి గురువునకువలె తైలమును మర్దించుటగాని,స్నానము చేయించుటగాని,కాళ్లుపట్టుటగాని,వారి ఉచ్ఛిష్టమును భుజించుటగాని— ఈ పనులు చేయగూడదు.

**శ్లో॥వ్యత్యస్తపాణినా కార్యముపసంగ్రహణం గురోః।**

**సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన చ దక్షిణః॥** (మను.2-72)

విడివిడి చేతులతో శిష్యుడు తన కుడి చేయితో గురువుయొక్క కుడి పాదమును,ఎడమ చేయితో ఎడమ పాదమును స్పృశించి ప్రణామము చేయవలెను.యువకుడైన శిష్యుడు యువతియగు గురుభార్యయొక్క పాదములు తాకి నమస్కరించగూడదు.

**శ్లో॥గురుపత్నీ తు యువతిర్నాభివాద్యేహ పాదయోః ।**

**పూర్ణవింశతివర్షేణ గుణదోషౌ విజానతా ॥**(మను.2-212)

పూర్తిగా ఇరువది సంవత్సరములు దాటినవాడును,మంచిచెడులు విచారించు యోగ్యతగలశిష్యుడు,యువతియగు గురుపత్నియొక్క చరణములంటి ప్రణామము చేయగూడదు.దూరమునుండియే నమస్కరించవలెను.పురుషులందు దోషారోపణచేయుట స్త్రీలయొక్క స్వభావము.కావున,బుద్ధిమంతుడగువాడు స్త్రీలపట్ల చాలా సావధానముగా నుండవలెను.

మనుస్మృతి ఆధారముగా ఇంతదనుక గురుసేవా ప్రకారమును సంక్షే

పముగా తెలుసికున్నాము.విస్తారముగా తెలియగోరువారు అచ్చట గనం దగును. ఇప్పుడు శివోపనిషత్ ఏడవ అధ్యాయము ఆధారముగా గురు సేవా ప్రకారమును తెలుసికొందము.

**శ్లో ॥శివజ్ఞానార్థతత్త్వజ్ఞః ప్రసన్నమనసం గురుమ్।**

**శివః శివం సమాస్థాయ జ్ఞానం వక్తి నహీతరః ॥**

**గురుం చ శివవద్భక్త్యా నమస్కారేణ పూజయేత్ ॥**(7-4,5)

"**అయంఘటః**"ఇది ఘటము(కుండ)ఉన్నది.1.ఇచ్చట"**ఇది ఘటము**" అనునది ఘటవిషయక జ్ఞానము.2.ఈజ్ఞానమునకు విషయము ఘటము.3.ఈ జ్ఞానము ఎవరికి గలిగినదో→ ఉదా:దేవదత్తుడు.ఇతడు జ్ఞాత అనబడును.అనగా 1.జ్ఞానము,2.జ్ఞేయము(జ్ఞానమునకు విషయము-అర్థము),3.జ్ఞాత—ఈ మూడింటిని కలిపి"త్రిపుటి"అంటారు.సకలఘుట, పటాది వ్యావహారిక వస్తువులకు సంబంధించి యీత్రిపుటి ఉంటుంది. కాని,బ్రాహ్మీస్థితిలో(బ్రహ్మమునందు)యీత్రిపుటి ఉండదు."**నచైకం తదన్యద్ ద్వితీయం కుతస్స్యాత్**"(దశశ్లోకి-10)."**ఏకమేవాఽద్వితీయం**"(ఛాం. 6-2-1) అని చెప్పుటగూడ ఆవిద్యకమే.జ్ఞాత జ్ఞానం జ్ఞేయం సర్వం బ్రహ్మమయం. "**సర్వం ఖల్విదం బ్రహ్మ**"(ఛాం.3-14-1)కావున,

శివుడు=కళ్యాణ స్వరూపుడు=మంగళస్వరూపుడు=ఆనంద స్వరూపుడు."**సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ**"(తై.2-1-1)అని చెప్పబడినట్లుగా జ్ఞానముగూడ శివుడే(బ్రహ్మమే).అందువలన శివ(బ్రహ్మ)జ్ఞానము మరియు శివుడు(బ్రహ్మము)వేరుగాదు.కావున,బ్రహ్మమునందు త్రిపుటి ఉండదు. "**శివః కేవలోఽహమ్**"ఇదియే శివునియొక్క తత్త్వము=యథార్థస్వరూ

పము.**"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"**(ముం.3-2-9)అను శ్రుత్యుక్త ప్రకారముగా బ్రహ్మ(శివుని)తత్త్వమును తెలుసికొని,అనుభూత మొనర్చుకున్న గురు దేవులుగూడ బ్రహ్మమే,శివుడే,ఈశ్వరుడే.

శివ జ్ఞానార్థ తత్త్వజ్ఞః=శివజ్ఞానమునకు అర్థము=విషయము శివుడు.అతని తత్త్వము=యథార్థస్వరూపము (దానిని),జ్ఞః=తెలిసికొన్న వాడు=గురుదేవుడు మరియు ప్రసన్న మనస్సుగలవాడు;శివఃశివం స మాస్థాయ=సాక్షాత్ శివుడే(నిర్గుణనిరాకారపరబ్రహ్మమే సాధకానుగ్రహా ర్థము),శివం=గురుదేవునిరూపంలో(మాయికమగుఉపాధినిస్వీకరించి); జ్ఞానం వక్తి=జ్ఞానమును బోధించును.ఇతరులు కారు.

**"స్యాత్పరమేశ్వరస్యాపీచ్ఛావశాన్మాయామయంరూపం సాధకానుగ్రహా ర్థమ్"**(బ్ర.సూ.భాష్యమ్.1-1-20).పరమేశ్వరుడుగూడ సాధకులను అనుగ్రహిం చుటకొఅకు స్వ ఇచ్ఛచేత మాయామయరూపమును(సగుణమగు గురు రూపమును)ధరించును.**"మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద!"**(మ.భా.శాన్తిపర్వము.339-45)ఓనారద!ఈ సంపూర్ణ జగత్తు నాచేతనే రచింపబడినది.ఇదంతా నాయొక్క మాయాస్వరూపముగా తెలుసికొను ము.ఈ సమస్త భూతగణములచే యుక్తుడనగు నన్ను నీవు చూడలేవు. తెలుసుకో లేవు.ఎందుకనగా పారమార్థికదృష్టిచేత నేను సకల గుణము లచే వినిర్ముక్తుడను.

**శ్లో॥దేశికాకృతిమాస్థాయ పశోః పాశానశేషతః ।**

**ఛిత్వా పరం పదం దేవి నయత్యేనమతో గురుః॥**

**శ్లో ॥ సర్వానుగ్రహకర్తృత్వాదీశ్వరః కరుణానిధిః ।**

**ఆచార్యరూపమాస్థాయ దీక్షయా మోక్షయేత్పశూన్ ॥**

**శ్లో॥శివరూపం సమాస్థాయ పూజాం గృహ్ణామి పార్వతి।**

**గురురూపం సమాదాయ భవపాశాన్నికృన్తయే॥**(కులార్ణవ తంత్రము.13-62,63,66)

దేవి పార్వతీ!సాక్షాత్ శివుడనగు నేను దేశిక(గురు)రూపమును ధరించి పశువుల(జీవుల)యొక్క సమస్త భవపాశబంధములను నాశనము చేసి,పరమపదమునకు కొనిపోవుదును.ఇదియే గురువుయొక్క విశిష్టత యని తెలియుము.సర్వానుగ్రహకర్తయగు శ్రీగురుదేవులు సాక్షాత్ కరుణానిధియగుపరమేశ్వరుడే.అట్టి నేను ఆచార్యరూపమును ధరించి శరణుజొచ్చిన శిష్యులకు దీక్షనొసంగి సకలపాశములను త్రెంచి ముక్తిని ప్రసాదించెదను.సర్వవ్యాపకుడనై పరమానంద శివతత్త్వమునందధిష్ఠితుడనై యుండియు తద్వ్యతిరిక్తమగు దేవ,గురురూప సగుణసాకారమునాశ్రయించి భక్తులొనరించు పూజలనందుకొనుచుంటిని.విశేషమేమంటే జీవుల భవపాశబంధనములను తెగటార్చి,విముక్తులను జేయుటకొఱకే నేను గురురూపంలో ప్రకాశించుచున్నాను. **"సవిలాస మహామోహ గ్రాహగ్రాసైక కర్మణే".**(వే.పం.1-1)ఈ శ్లోకార్థముయొక్క అర్థమును పృష్ఠము 482లో తెలుసుకొని వచ్చాము.

**శ్లో॥శ్రీగురుం పరమం తత్త్వం తిష్ఠన్తం చక్షురగ్రతః।**

**మన్దభాగ్యాః న పశ్యన్తి హ్యన్ధాః సూర్యమివోదితమ్॥**(కులార్ణవ తన్త్రము 13-59)

**అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।**(గీత.9-11)

గ్రుడ్డివాడు సూర్యుని చూడజాలనట్లు,గురురూపంలో(మనుష్యరూపం లో) పరతత్త్వమే కండ్లయెదుట కనుపించుచున్నను మందభాగ్యులగు మూఢజనులు నన్ను తెలియజాలకున్నారు.

అందువలన,సాక్షాత్పరమేశ్వరుడే గురురూపంలో ప్రత్యక్షదైవముగా నిలిచియున్నందున,గురువునకు శివునికివలె నమస్కరించి అత్యంత శ్రద్ధతో పూజింపవలెను.శ్వేతాశ్వతర శ్రుతిగూడ ఈవిషయమునే చెప్పుచున్నది.

**శ్లో॥యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ।**

**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః॥**(6-23)

ఎవరికి పరమేశ్వరునియందు అత్యంతభక్తిగలదో,అతడు పరమేశ్వరుని యందువలెనే గురువునందుగూడ అంతటి భక్తిగల్గియుండవలెను.ఎందు కనగా,వేసవిలో మిట్టమధ్యాహ్నము పయనించుచున్న పథికునియొక్క తపింపబడుటచే కలుగు శిరోవేదన శాంతించుటకు జలాశయమును చేరు టకంటె వేరొండు ఉపాయము లేదు. ఆకలితో తీవ్రముగా బాధపడుచున్న పురుషునకు భోజనము తప్ప ఆకలి బాధ శాంతించుటకు మరొక సాధన ము లేదు.అట్లే,గురుదేవుని కృప కలుగకుండా బ్రహ్మవిద్యాప్రాప్తి అత్యంత కఠినమగును.కావున,**"ఈశ్వర్ తే గురు మేఁ అధిక ధారై భక్తి సుజాన"** (వి.సా).ఈశ్వరునికంటెగూడ గురువునందు అధికభక్తి గల్గియున్న ముఖ్యా ధికారికే ఉపనిషత్కథిత తత్త్వము(జీవబ్రహ్మలఏకత్వము)ప్రకాశింపబడు ను.అనగా తెలియబడును—అనుభవగోచరమగును.సరే,ప్రకృతమునను సరించెదము.గురుసేవా ప్రకారమును గురుసాన్నిధ్యంలో శిష్యుడు పాటిం చవలసిన నియమములను శివోపనిషత్ ఈక్రిందివిధముగా నుడువుచున్నది.

శాస్త్రాధ్యయనమునకు పూర్వము,ముగిసిన తరువాత,ప్రశ్నించున పుడు,భోజనము చేయుటకు పూర్వము మరియు తరువాత,భుజించి శయనించునపుడు శిష్యుడు గురువునకు నమస్కరించవలెను.శిష్యుడు ఏదేని కార్యార్థమై గ్రామాంతరమునకు వెళ్ళునపుడు గురువునకు ప్రద క్షిణముచేసి నమస్కరించి వెళ్ళాలి.తిరిగి వచ్చిన పిమ్మట మరల సాష్టాం గ దండవత్ప్రణామము ఆచరించాలి.అట్లే,గురువుగారు గ్రామాంతరము వెళ్ళుటకు పూర్వము మరియు తిరిగి వచ్చినపిదప శిష్యుడు గురువు నకు నమస్కరించవలెను.విశేష పర్వదినములలో పవిత్రమగు పూజాద్ర వ్యములచే నారాధించవలెను.శిష్యుడు ఏదైనా వ్రతదీక్ష,ఉపాసన అనుష్ఠిం చుటకు పూర్వము గురువునకు నమస్కరించి గుర్వాజ్ఞను పొందవలెను. ముగిసినపిమ్మట ఆశీర్వాదములు పొందాలి. గురువుగారు ఉపయోగించు వస్తువులు—పాదరక్షలు,గొడుగు,వస్త్రములు,ఆభూషణములు,జపమాల, దండము,కమండలాది పాత్రలు,శయ్యాసనాదులను శిష్యుడు ఉపయోగిం చగూడదు.వికటహాసము,నిష్ఠీవనము(ఉమ్మివేయుట),గొప్పగా శబ్దము చేయుట,ఆవలించుట,కాళ్లుచాచుట మున్నగునవి గురుసన్నిధిలో చేయ కూడదు.విలువైన వస్త్రములు,రుచికరమైన భోజనములు వర్జించవలెను. గురుదేవుని ఆసనముకంటె శిష్యుడు క్రిందుగా కూర్చోవాలి. గురుమూర్తి శయ్య(పడక)కంటె శిష్యుని పడక తక్కువ ఎత్తులో క్రిందుగా ఉండాలి. గురుదేవుడు విషయాంతరమునందు నిమగ్నమైయున్నపుడు, భుజిం చుచున్నపుడు,యితరులతో మాట్లాడునపుడు,విశ్రాంతి తీసికొనుచు న్నపుడు శిష్యుడు గురువుతో మాట్లాడగూడదు. నిద్రించునపుడు లేపి మాట్లాడగూడదు.గురువు వచ్చుచున్నపుడు లేచి దూరంగా నిలబడాలి.

గురువుగారు పిలిచిన వెంటనే వెళ్లి ఆజ్ఞాపించమని అడుగాలి.గురువు గారు ఎదురుగా ఉన్నపుడు దంతధావనము చేయుట,వంటికి నూనె ప ట్టించుట,ఉన్నతాసనముపై కూర్చొనుట,బట్టలు మార్చుకొనుట,మొదల గు పనులు చేయగూడదు.గురుదేవుడు శిష్యునికి ఏమైనా ప్రసాదించు నపుడు,శిష్యుడు వినమ్రుడై దోసిలిలోగాని,పాత్రలోగాని గురు ముఖము ను వీక్షిస్తూ ప్రేమతో స్వీకరించి,జాగ్రత్తగా భద్రపరుచుకోవాలి.గురువుయొ క్క మాటలను,చేష్టలను అనుకరించి అభినయించరాదు.

గురువుగారు మరియు పరమగురువు(గురువుయొక్క గురువు) ఇద్దరూ సమాన స్థానంలో(ఒకేచోట)ఉపవిష్ఠులైయున్నపుడు నమస్కార ముగాని,పూజ(ఆరాధన)గాని మొదలు పరమగురువునకు ఆచరించాలి. అటుపైన పరమగురువుగారి ఆజ్ఞచేత స్వగురువునకు ఆచరించాలి.గురు వునకుఅర్పించకుండా శిష్యుడు బిక్షనుభుజింపగూడదు.మొదలు తాను భుజించిన పిమ్మట గురువుగార్కి నివేదించగూడదు.శిష్యుడు ఏదైనా కా ర్యార్థమై బయటకు వెళ్ళవలసివచ్చినచో,గురువునకు విషయము తెలిపి, వారిఆజ్ఞను గైకొని వెళ్ళవలయును.కార్యము పూర్తిఅయిన పిదప మళ్ళీ గురువునకు నివేదించవలెను.ప్రతిరోజు శిష్యుడు తననిత్యకర్మలు(సంధ్య; అగ్నిహోత్రము)ముగించుకొని,గుర్వాజ్ఞచే శాస్త్రాధ్యయనము చేయవలెను. గురువునకుసరిపడు నిత్యావసరవస్తువులు—మట్టి(గంగమట్టి),భస్మము, గోమయము(ఆవుపేడ),పవిత్రనదీ(గంగా)జలము,పత్రములు,పుష్పము లు,తైలము,సమిధలు ఇత్యాదులు సమకూర్చపెట్టాలి.ఇంతేగాకుండా గు రువునకు అవసరమగు ఔషధములు,ఆహారపాత్రలు,వస్త్రములు,శయ్యా సనాదులను సర్వప్రయత్నములచే ధనవంతులను అర్థించి తీసుకురావాలి.

**శ్లో॥పర్యటేత్ పృథ్వీం కృత్స్నాం సశైల వనకాననామ్ ।**

**గురుభైషజ్య సిద్ధ్యర్థమపి గచ్ఛేద్రసాతలమ్ ॥**(శివ్.7-29)

గురువునకు కావలసిన ఓషధులకొఱకు—సంపూర్ణ పృథివిని పర్యటించియైనను,పర్వతశిఖరముల నధిరోహించియైనను,కొండలతోకూడిన దట్టమైనఅడవులందు సంచరించియైనను,చివరకు పాతాళమునకు వెళ్ళవలసి వచ్చినను నిస్సంశయముగా,నిర్భయముగా వెళ్ళి తీసికురావాలి.

మరియు,ప్రాణములను అర్పించవలసివచ్చినను గుర్వాజ్ఞను ఖండించగూడదు.గుర్వాజ్ఞను శిరసావహించి పాలించినచో భవసాగరమునుండి తరించగలడు(ముక్తుడగును).ఉల్లంఘించినచో నరకమును పొందగలడు. గురుదేవుడు ఆదేశించిన ప్రతికార్యమును విచారించకుండా ఆచరించాలి. మార్గముగుండా పయనించునపుడు గురువుగారుశ్రమించినచో ప్రయత్నపూర్వకముగా అనునయించి శిష్యుడు విశ్రమింపజేయాలి.ఆకలిదప్పికలు తీర్చాలి.

గురువుగారికి తైలముతో శరీరమర్దనము,అభ్యంగస్నానము చేయించాలి.రాత్రిపూట అంగసంవాహనము,పాదసంవాహనము చేయాలి.ప్రాతఃకాలమున సత్సంగమండపమును సమ్మార్జనాదులు గావించి శుభ్రపరచి అలంకారములచే(పుష్పమాలలచే)సుసజ్జితము చేయాలి.గురుదేవుడు కూర్చొనుటకు ఆసనమువేసి,గ్రంథము మరియు వ్యాసపీఠము మున్నగునవి సిద్ధపరచి, గురుదేవుని రాకకై నిలబడి వేచియుండవలెను.

**శ్లో॥గురోర్నిన్దాపవాదం చ శ్రుత్వా కర్ణౌ పిధాపయేత్ ।**

**అన్యత్ర చైవ సర్వేతు నిగృహ్ణీయాదుపాయతః ॥**(శివో.7-36)(మను.2-200)

**శ్లో॥గురునిన్దాకరం దృష్ట్వా ధావయేదథ వాసయేత్।**

**స్థానం వా తత్పరిత్యాజ్యం జిహ్వాచ్ఛేదాక్షమో యది ॥**(గురుగీత 2-70)

ఎవరైనా దుష్టులు గురువును నిందించునపుడు ఆ స్థానంలో ఉండరాదు.విధిలేక ఉండవలసి వస్తే తన రెండు చెవులను మూసికొనవలెను. గురువుపై అపవాదమును ప్రయత్నముచే నిగ్రహింపవలెను.

గురుదేవున్ని నిందించేవాడినిచూసి—ఒకవేళ వాని జిహ్వాచ్ఛేదనము చేసే సామర్థ్యము లేనిచోఆస్థానమునుండి వానిని దూరంగా తరిమి వేయవలెను.ఒకవేళ వాడు అక్కడే ఉండినయెడల,స్వయంగా తానే ఆ చోటును వదిలి వెళ్ళవలెను.

గురువు శిష్యుని పీడించినను,కొట్టినను తిరిగి గురువునకు అప్రియము చేయరాదు.తిరగబడి అప్రియముగా మాట్లాడినచో శిష్యుడు నరకమునకు వెళ్ళును.గురువే తల్లి,తండ్రి,సాక్షాత్ శివుడేయను నిశ్చయము గలవానికి మోక్షము ఎంతమాత్రమును దూరము లేదు.

**శ్లో॥అజ్ఞానపఙ్కనిర్మగ్నం సముద్ధరతే జనం యః।**

**శివజ్ఞానాత్మహస్తేన కస్తం న ప్రతిపూజయేత్॥**(శివో.7-41)

అజ్ఞానమను బురదలో మునిగిపోతున్న జనులను ఆత్మజ్ఞానమొసంగి యెవరు కరుణచే ఉద్ధరించుచున్నారో,అటువంటి దయాళువగు శ్రీగురుదేవుని యెవరు పూజింపరు?పూజింతురని భావము.ఇట్టి భావనచే ఈశ్వరాభిన్న సద్గురుదేవుని పూజించువాడు సర్వపాప వినిర్ముక్తుడై అంత్య

మున పరమపదవిని పొందగలడు.ఇంకా పెక్కు నియమాలు గలవు. విస్తారభయముచే వ్రాయుటలేదు.తెలియ గోరువారు మనుస్మృతి రెండవ అధ్యాయమును సంపూర్ణముగా,శివోపనిషత్ ఏడవఅధ్యాయమున మరి యు కులార్ణవతన్త్రము పండ్రెండు,పదమూడవ ఉల్లాసములు గనందగును.

**మనస్సును అర్పించు ప్రకారము:**—గురువునందు సాక్షాత్ ఈశ్వర భావన ఉంచుకొని పూజాదికము చేయాలి.శ్రీగురువునందు ఈశ్వరభావన ఉంచుప్రకారమిట్లున్నది.ఎట్లనగా—గురువెప్పుడు శిష్యునిపై వాత్సల్యము చూపునో,అప్పుడు విష్ణురూపుడని భావించాలి.గురువెప్పుడు కోపించు నో,అప్పుడు శివరూపుడని భావించాలి.గురువెప్పుడు రాజసవ్యవహార ములందు తత్పరుడగునో,అప్పుడు బ్రహ్మరూపుడని భావించవలయు ను.గురుదేవుడెప్పుడు శాంతుడుగానుండునో,అప్పుడు శీతలవాహినియ గు పవిత్రగంగారూపుడని భావించాలి.మరియు గురువెప్పుడు వాగ్రూప కిరణములచే అజ్ఞాన(భ్రమ)రూప అంధకారమును దూరము చేయునో, అప్పుడు భాస్కరుని(సూర్యుని)గాభావించవలెను.ఈరీతిగా బ్రహ్మవేత్తయ గు శ్రీగురుదేవులయందు శిష్యుడెప్పటికిని ఈశ్వరభావనయే ఉంచవల యును. స్వప్నమందును దోషదృష్టి రానీయగూడదు.

శ్రీగురు నివాసస్థానము కాశీక్షేత్రము.వారి చరణోదకము విష్ణుపద నిసృత పవిత్రమైన గంగాజలము.సాక్షాత్ విశ్వేశ్వరుడే గురుదేవుడని భా వించవలెను.శ్రీగురుమూర్తియొక్క చరణములే తీర్థరాజమగు ప్రయాగ ము.అట్టి గురుదేవుల శ్రీచరణములకు పునఃపునః నమస్కారములు.ఎ ల్లపుడు సాధకుడు గురుమూర్తియొక్క స్మరణము(ధ్యానము),గురునా మ జపము చేయుచుండవలెను.సదా తూచ తప్పకుండా గుర్వాజ్ఞను

పాలించాలి. ఎప్పుడు సత్యమునే పలుకవలెను. గురువుకంటె అన్యమగు భావన కలలోగూడ తేగూడదు.

సంపూర్ణ బ్రహ్మజ్ఞానము గురుముఖమున స్థితమైయున్నది.అది గురు దేవుని అనుగ్రహమువలన,అతడు ప్రసన్నుడైనపుడు మాత్రమే లభించు ను.అందువలన,పతివ్రత స్త్రీ( కులీన స్త్రీ)సర్వథా సర్వప్రకారములచే తన పతిసేవయందే ఎట్లు సంలగ్నమైయుండునో,అట్లు సాధకుడు నిరంతర ము భక్తియుక్తుడై సద్గురుసేవా,ధ్యానాదులందు నిమగ్నుడై యుండవలె ను.సాధకుడు తన వర్ణాశ్రమధర్మములను,కులధర్మములను,తన యొ క్క ఐశ్వర్యమును,కీర్తిని సంపూర్ణముగాపరిత్యజించి,పునః వాటిని స్వప్న మందైనను స్మరించకూడదు.తన కళ్యాణమునుగోరి,అన్యచింతనము మా ని, కేవలము గురుసేవాతత్పరుడై యుండవలెను.

సాధకుడు మనస్సులో ఇట్లు చింతించవలెను.ఈ శరీరము ఒకనాడు క్రిమి కీటకాదులకు,పశుపక్ష్యాదులకు ఆహారమగును.బంధు మిత్రాదుల చే ఇది కాల్చి బూడిదచేయబడును.భస్మరూపంలో మిగులుతుంది.జల సమాధి చేయబడినచో చేపలు,మొసళ్ళకు ఆహారమగును.జంతువుల కు భోజనమైనచో విష్టారూపములో(మలరూపంలో)మిగులుతుంది.ఇటు వంటి అశాశ్వతమగు దుర్గంధమయ మలమూత్ర కఫ రక్త త్వాగ్మాంస ఆస్థి మున్నగు వాటితోగూడిన హేయమగు శరీరమందు మోజుపడి,దీనిని రక్షించుకొను మిష(సాకు)చేగాని,శారీరక సుఖములకొఱకుగాని శ్రీగురు దేవుని సేవలనుండి వంచితుడను కాగూడదు.దేవతలకుగూడ దుర్లభమ గు గురుసేవాభాగ్యమును కోల్పోగూడదు.శరీరమునుగూడ సమర్పించవ లసి వచ్చినను గురుసేవనుండి వైదొలగను—అను దృఢసంకల్పము బూనవలెను.

**శ్లో॥అద్వైతం భావయేన్నిత్యం సర్వావస్థాసు సర్వదా।**

**కదాచిదపి నో కుర్యాదద్వైతం గురుసన్నిధౌ॥** (గురుగీత.60)

**శ్లో॥నాద్వైతవాదం కుర్వీత గురుణా సహ కుత్రచిత్ ॥**(యోగశిఖోపనిషత్.5-59)

శిష్యుడెంత విద్వాంసుడైనను,జ్ఞానియైనను గురుసాన్నిధ్యంలో ఎప్పుడుగూడ అద్వైతభావన చేయగూడదు."**అద్వైతం పరమార్థతః**"(ఆగమ.17) పారమార్థికముగా ఉన్నది అద్వైతమే.ఈభావన ఎల్లప్పుడు అన్ని అవస్థలయందును ఆంతర్యమున భావనచేయుచుండవలెను.కాని,గురువుతో గాని,గురుసాన్నిధ్యంలో యితరులతోచర్చించునపుడుగాని అద్వైతభావన తీసికురాగూడదు.వ్యావహారిక(కల్పిత)ఔపాధికభేదమును స్వీకరించి గురుసేవలో సమర్పితముగావలెను.ఎక్కడైనా,ఎప్పుడైనా ద్వైతవాదులతో శాస్త్రర్థము చేయునపుడు ఒకవేళ గురువుఆజ్ఞనొసంగినచో శిష్యుడు అద్వైతమునుగూర్చి మాట్లాడవచ్చును.

**శ్లో॥యథా గురుస్తథైవేశో యథైవేశస్తథా గురుః।**

**పూజనీయో మహాభక్త్యా న భేదో విద్యతేఽనయోః ॥**(యో.శి. 5-58)

గురుస్వరూపమేదియో అదియే ఈశ్వరుని స్వరూపము.ఈశ్వరుని స్వరూపమేదియో అదియే గురుస్వరూపము.సచ్చిదానంద రూపముచే యిద్దరికి యిసుమంతయును భేదములేదు.కావున,ఈశ్వరుని యందలి భక్తివలెనే గురువునందుగూడ అత్యధిక భక్తిగలిగి ఆజీవితము పూజించవలెను(సేవించవలెను).

**శ్లో॥ఆజీవితం త్రయః సేవ్యావేదాన్తో గురురీశ్వరః।**

**పూర్వం (ఆదౌ)జ్ఞానాప్తయే పశ్చాత్కృతఘ్నుత్వనివృత్తయే ॥**(దత్తపురా.6-2)

**శ్లో॥యావచ్ఛోపాధిపర్యన్తం తావచ్ఛుశ్రూషయేద్గురుమ్।**

**గురువద్గురుభార్యాయాం తత్పుత్రేషు చ వర్తనమ్॥**(పైంగలోపనిషత్. 4-8)

జీవించియున్నంత వరకు నిత్య నిరంతర ఆదరపూర్వకముగా వేదాన్త చిన్తనము చేయుచుండవలెను.దానిచే జీవుని కళ్యాణమగును.మరియు వేదాన్తశాస్త్రమునుబోధించిన గురుదేవులనుగూడ ఆజీవితము సేవించవలెను.అట్లే,ఎవరి అనుగ్రహముచే గురుశాస్త్రములు లభించినవో,అట్టి ఈశ్వరుణ్ణి చివరి ఘుడియలవరకు ఆరాధించవలెను.

శరీరరూపఉపాధి ఉన్నంతవరకు గురుదేవునియొక్క శుశ్రూష(సేవ) చేయుచుండవలెను.గురువును సేవించిన విధముగానే గురుభార్యను. గురుసంతానమునుగూడ సేవించవలెను.

**ధనార్పణరూపసేవ:**—పత్ని,పుత్రులు,భూమి,పశువులు,వాహనములు, భృత్యులు(దాసదాసీలు),గృహము,ద్రవ్యము,ధాన్యము ఇవన్నియును ధనముగానే వ్యవహరింపబడును.వీటినన్నింటిని విడిచిపెట్టి త్యాగియైన గురువును శరణుబొందవలయును.దీనిని ధనార్పణమందురు.ఇదొక ప్రకారమైన ధనార్పణమేయగును.ఏలయన—గురువు స్వతః త్యాగియగుటవలన,అతనికి లౌకిక ధనముయొక్క అపేక్ష ఉండదు,గావున నతడు అంగీకరించడు.ఆగురువుయొక్క ప్రాప్త్యర్థము సకలధనసంపత్తిని త్యాగముచేయుటవలన,అట్టి త్యాగముగూడ గురువునకే అర్పణ మనబడును.

గురువు గృహస్థుడైన పక్షమున సకలము అతని స్వాధీనము చేయా

లి.భార్య మొదలుకొని వ్రీహిపర్యన్తము సర్వస్వము ధనములోనే అంత ర్భూతములుగావున,భార్యా పుత్రులనుగూడ అర్పణజేయుట—అనగా, తాను సహితము భార్య పుత్రులుగూడ గురుదేవుని సేవలో యథోచిత ముగా నియుక్తులుగావలెనని భావము.దీనికి ప్రకారాంతరమగు ధనా ర్పణమని పేరు.

బ్రహ్మవిద్యాచార్యులు గృహస్థులుగూడ ఉంటారా?అని శంకించవలదు. యాజ్ఞవల్క్య,ఉద్దాలకాది గృహస్థులు బ్రహ్మవిద్యాచార్యులైనట్లు వేదమున తెలియబడుచున్నది.

**వచనార్పణప్రకారము:**—సచ్ఛిష్యుడు ఎల్లపుడూ గురుదేవుని గుణగణ ములను ప్రసంగమునుచూచి కీర్తించుచుండవలెను.కలలోగూడ గురువు యొక్క దోషములను చూడగూడదు.చెప్పగూడదు.ఎప్పుడుగూడ గురు వును నిందించగూడదు. ఒకవేళ గురువును నిందించినచో—

**"స యాతి నరకాన్ ఘోరాన్ యావచ్చన్ద్రదివాకరమ్"**(గురుగీత-56)

అతడు సూర్యచంద్రులున్నంతవరకు ఘోర నరకమున పడియుండును.

**శ్లో॥హుఙ్కారేణ న వక్తవ్యం ప్రాజ్ఞశిష్యైకదాచన।**

**గురోరగ్రే న వక్తవ్యమసత్యం తు కదాచన॥**

**శ్లో॥గురుం త్వంకృత్య హుంకృత్య గురుసాన్నిధ్యభాషణః।**

**అరణ్యే నిర్జలే దేశే సమ్భవేద్బ్రహ్మరాక్షసః॥**(గురుగీత. 58,59)

బుద్ధిమంతుడగు శిష్యుడు ఎప్పుడుగూడ అహంకారయుక్త వచనము

లచే గురువును హుంకరించి(గద్దించి)పలుకరాదు.గురుసాన్నిధ్యంలో ఎప్పుడూ అసత్యము పలుకగూడదు.గురువును"నీవు"అని సంబోధించినగాని,అహంకారయుత శబ్దములు ప్రయోగించినగాని,మరియు శాస్త్రార్థమున గురువును ఓడించి సంతసించునటువంటి శిష్యుడు—ఘోరమైన అరణ్యములో,నిర్జనప్రదేశములలో బ్రహ్మరాక్షసుడై జన్మించును.

ఏవ్యక్తి మునిగణముచేతగాని,సర్పగణముచేతగాని, దేవగణముచేతగాని శపింపబడునో,అతనిని గురుదేవుడు రక్షింపగలడు.పెయ్యేల?మృత్యువునుగూడ పారద్రోలి,తిరిగి ఆయువును ప్రసాదించును.ఉదా:—శ్రీవ్యాస భగవానులు శంకరులవారికి పదహారు సంవత్సరముల అధిక ఆయువు నిచ్చి లోకోద్ధరణ కార్యమునకు ప్రోత్సహించి,ఆజ్ఞాపించెను.మరియు, దీనికి విపరీతముగా గురువుయొక్క ఆక్రోశమునకు యెవడు గురియగునో వానిని—

**శ్లో॥అశక్తా హి సురాద్యాశ్చ అశక్తా మునయస్తథా।**

**గురుశాపేన తే శీఘ్రం క్షయం యాన్తి న సంశయః॥**(గురుగీత-బృహత్ 106)

అమరులగు దేవతలుగాని,మునులుగాని—ఆది పదముచే యక్ష,కిన్నర,గంధర్వులుగాని గురుశాపమునుండి ముక్తుని జేయుటకు అసమర్థులగుదురు. వీరందరిని తత్క్షణమే గురుశాపము నశింపజేయును.ఈ విషయంలో సాధకుడు సంశయింప పనిలేదు. ఎప్పుడైతే దేవతలు,మునులు మున్నగు వారుగూడ గురుశాపోపశమమునందు అశక్తులగుచున్నారో, యిక సామాన్యమానవులు గురుశాపమునుండి రక్షింపగలరా?(కైముతిక న్యాయము)కావున,గురువును ఎప్పుడుగూడ,ఎక్కడగూడ ద్వేషించుట, నిందించుట, చెడుగా ఆలోచించుట మొదలగునవి చేయరాదు.

**శ్లో॥శివేరుష్టే గురుస్త్రాతా గురౌరుష్టే న కశ్చన।**

**లబ్ధ్వా కులగురుం సమ్యగ్గురుమేవ సమాశ్రయేత్॥**(గురుగీత. 44)

శివుడు ఒకవేళ కోపించినచో గురువు రక్షించగలడు.కాని,గురువే కోపించినచో ముల్లోకములలో ఎవరునూ రక్షింపలేరు.కావున,సద్గురువును పొంది, ఎల్లపుడు అతనినే ఆశ్రయించి, అతని శరణములోనే ఉండవలెను.

**శ్లో॥వన్దే గురుపద ద్వన్ద్వం వాఙ్మనశ్చిత్తగోచరమ్।**(45)

**సర్వశ్రుతిశిరోరత్న విరాజితపదామ్బుజః।**

**వేదాన్తామ్బుజసూర్యో యస్తస్మై శ్రీ గురవే నమః ॥**(37)

శ్రీగురుదేవునియొక్క చరణయుగళమునకు నేను ప్రణమిల్లు చుంటిని.నిర్గుణపరమాత్మయన్ననోఅవాఙ్మనసగోచరడు(వాక్కునకుగాని,మనస్సునకుగాని విషయముగానివాడు).కాని,ముముక్షు జనకళ్యాణార్థము నిర్గుణనిరాకార పరమాత్మయే సగుణసాకారమగు గురురూపంలో నవతరించినందున"**వాఙ్మనశ్చిత్తగోచరమ్**"వాక్కునకు, మనస్సునకు మరియు చిత్తమునకు విషయమగుచున్నాడు.అటువంటి శ్రీగురుదేవుని పాదయుగళమునకు నేను నమస్కరించుచున్నాను.

సమస్త శృతిశిరస్సులు=వేదాన్తములు=ఉపనిషత్తుల రహస్యార్థము=ప్రతిపాద్యవిషయము(పరబ్రహ్మతత్త్వము)శ్రీగురుదేవుని చరణకమలముల యనుగ్రహముచేతనే తెలియబడును.కావున,సకలోపనిషత్తులు అనబడు రత్నములు గురుదేవుని పాదారవిందములను విరాజితమై=విభూషితమై(ఆశ్రయించి)ఉన్నవి.సూర్యుడు కమలపుష్పములను వికసింప

జేసి మధువును(తేనెను)మధుపములకు(తేనెటీగలకు,తుమ్మెదలకు) అందజేయునట్లు—శ్రీగురుదేవుడు ఉపనిషదర్థమును వికసింపజేసి(వి స్పష్టముగ విప్పిచెప్పి)ముముక్షుజనులకు అందించి వారిని జననమర ణరూప విపత్తునుండి కాపాడి బ్రహ్మానందమునందజేసి ధన్యులను జే యుచున్నాడు.అటువంటి గురుమూర్తియొక్క చరణద్వంద్వమునకు నేను నమస్కరించుచున్నాను.

**శ్లో॥అజ్ఞాన తిమిరాన్ధస్య జ్ఞానాఞ్జన శలాకయా।**

**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవే నమః॥**(బృహద్గురుగీత.34)

**శ్లో॥యత్సత్యేన జగత్సత్యం యత్ప్రకాశేన భాతి తత్।**

**యదానన్దేన నన్దన్తి తస్మై శ్రీ గురవే నమః॥**(36 బృ.గు.గీ)

ఏదేని నిమిత్తముచే దృష్టి నశించిన గ్రుడ్డివానికి వైద్యుడు ఓషధులచే తయారుచేయబడిన అంజనమును శలాక(పుల్ల)చే కంటిలోవేసి లేక కాటుకపెట్టి దృష్టిదోషమును పోగొట్టి నయనములను ఎట్లు నయముచే యునో,అట్లే శ్రీగురుదేవుడు స్వరూపాజ్ఞానముచే అంధులైన అజ్ఞాని జీవు లకు జ్ఞానమనే అంజనమును ఉపదేశరూప శలాకచే అజ్ఞానాంధకారము ను నశింపజేయును.అటువంటి శ్రీగురుదేవునకు నా నమస్కారము.

ఎవరియొక్క సత్యత్వమును ఆధారముగాజేసికొని ఈజగత్తునకు అస్తి త్వము సిద్ధించుచున్నదో, ఎవరి ప్రకాశముయొక్క సహాయముచే నీ జగత్తు భాసించుచున్నదో, ఎవరియొక్క ఆనందలేశముచే సమస్తప్రాణి కోట్లు ఆనందింపబడుచున్నవో—అటువంటి పరబ్రహ్మస్వరూపుడగు శ్రీ

గురుదేవునికి నాయొక్క ప్రణామములు.

**శ్లో॥శ్రీనాథ చరణద్వంద్వం యస్యాం దిశి విరాజతే।**

**తస్యై దిశే నమస్కుర్యాద్భక్త్యా ప్రతిదినం ప్రియే॥**(50)

హే ప్రియే(పార్వతి)శ్రీనాథుని(గురుదేవుని)యొక్క పాదయుగళము ఏ దిశయందు విరాజమానమై యున్నదో,ఆ వైపునకు ప్రతిదినము భక్తి భావయుక్తమై నమస్కరించవలెను.

**శ్లో॥స్వదేశికస్యైవ శరీరచిన్తనం,భవేదనన్తస్య శివస్య చిన్తనమ్।**

**స్వదేశికస్యైవ చ నామకీర్తనం, భవేదనన్తస్య శివస్య కీర్తనమ్॥**(54)

స్వగురువుయొక్క దేహచింతనము చేయుటయే అనంత గుణగణాలంకృత భగవంతుడగు శివునిస్వరూప చింతనమగును.అట్లే, స్వదేశికుని (గురువు)యొక్క నామసంకీర్తనమే అనంత స్వరూపధారియగు శివుని నామ సంకీర్తన మగును.

అగ్నిసాన్నిధ్యంలోఉంచబడిన వెన్న కరిగి ఎట్లు అవశ్యముగా రూపాంతరము నొందునో,అట్లే,సద్గురు సాన్నిధ్యంలో నివసించు పాపాత్ముడుగూడ సాధువు కాగలడు.ఉదా:—బుద్ధ దేవుని సమక్షములో దురాచారియగు 'అంగుళిమాలి' సదాచారి(సాధువు)గా మారినాడు.

ప్రదీప్త అగ్నిజ్వాలలు ఎట్లు ఎండుకట్టెలను,పచ్చికట్టెలను సకలమును భస్మముచేయునో,అట్లే శ్రీగురుదేవుడు తన కటాక్షవీక్షణములచే శిష్యుని సమస్త పాపములను క్షణమాత్రముననే భస్మము చేయును.

**శ్లో॥దీపదర్శనమాత్రేణ ప్రణశ్యతి తమో యథా ।**

**సద్గురోర్దర్శనాద్దేవి తథాఽజ్ఞానం వినశ్యతి ॥**(కులార్ణవ తంత్రము 13-116)

ఓ దేవీ!దీపమును దర్శించినంత మాత్రముననే ఎట్లు అంధకారము నశించునో,అట్లే,సద్గురుదేవుని దర్శనమాత్రముచేతనే అజ్ఞానరూప అంధకారము సర్వనాశనమగును.

**శ్లో॥యస్మాదనుగ్రహం లబ్ధ్వా మహదజ్ఞానముత్సృజేత్।**

**తస్మై శ్రీ దేశికేన్ద్రాయ నమశ్చాభీష్టసిద్ధయే॥**(గు.గీ.బృహత్.56)

ఏ గురుదేవునియొక్క అనుగ్రహమును అనగా కృపాదృష్టిని పొంది మనుష్యుడు మహాఘోర అనర్థకారియగు అజ్ఞానమునుండి విముక్తుడగుచున్నాడో,అటువంటి శ్రీగురుదేవునికి నా యభీష్ట(మోక్ష)సిద్ధికొఱకు నమస్కారములు.

**శ్లో॥అఖణ్డమణ్డలాకారం వ్యాప్తం యేన చరాచరమ్।**

**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవే నమః ॥**(గు.గీ.బృహత్. 67)

ఈపరిదృశ్యమాన(ప్రత్యక్షానుమానాదులచేగోచరించు)పిండ బ్రహ్మాండాది చరాచర జగత్తునంతటిని అణువణువున వ్యాపించి,సర్వాధిష్టానమై,సృష్టిస్థితిలయములకు కారణముగాచెప్పబడు(తటస్థలక్షణమునకుపలక్ష్యమగు)తత్పదం=పరబ్రహ్మతత్త్వము=శుద్ధచైతన్యము,యేన,దర్శితం=యెవరిచే దర్శింపబడినదో=సాక్షాత్కరింపబడినదో—అటువంటి శ్రీ గురుదేవులకు నాయొక్క నమస్కారము.ఇచ్చట**"పాదోఽస్యవిశ్వాభూతాని"**(త్రి.మ.నా.4-4; ఛాం.3-12-6)మరియు"యతో వా ఇమాని"(తై.3-1)ఇత్యాది శ్రుతులను,అట్లే,

ఈసందర్భంలో శ్రీ మద్భగవద్గీత ఏడవ అధ్యాయము 6& 7 శ్లోకములను మరియు తొమ్మిదవఅధ్యాయము నాలుగునుండి పదవ శ్లోక పర్యంతము గనందగును.

పై"అఖణ్డమణ్డలాకారం"అను శ్లోకమునకు"అధ్యారోపాపవాద" న్యాయ ముద్వారా సంపూర్ణవేదాన్తమును ఘటింపజేసి=అన్వయించి తెలుసుకో వచ్చును.విజ్ఞులకు సూచనమాత్రము చాలును గదా!

**శ్లో॥బ్రహ్మానన్దం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం,**

**ద్వన్ద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।**

**ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం,**

**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి॥**(శ్రీ యోగవాసిష్ఠము యొక్క చరమ శ్లోకము; శుకరహస్యోపనిషత్ 1 ఖం; గురుగీత.2-111))

జ్ఞానోపదేశముద్వారా పరమసుఖమును ప్రసాదించువాడు,అద్వితీయ జ్ఞానమూర్తియును,సుఖదుఃఖాది ద్వంద్వరహితుడును,ఆకాశము వలెనిర్మలము,సర్వవ్యాపకము,సర్వాధారము;తత్త్వమస్యాది (ఛాం.6-8-7) వేదాన్తమహావాక్యములయొక్క లక్ష్యార్థరూపము, ఏకము,ప్రాగ్ ప్రధ్వంసాభావరహితము(త్రికాలాబాధ్యము),శుద్ధము,నిశ్చలము,సకల ధీ(బుద్ధి) వృత్తులకు సాక్షియైనవాడు,సాంసారిక భావనలకు అతీతము,సత్త్వ,రజ, తమములు—అను మూడుగుణములు లేనివాడును మరియు బ్రహ్మానందస్వరూపుడను అగు సద్గురుదేవులకు నమస్కరించుచున్నాను.

హిందుస్తానీ దోహా:—సాత్ సమందర్ మసికరై, లేఖని సబవన రాఈ।

ధరతీ సబకాగజకరై, గురుగుణ లిఖా న జాయ్॥

**శ్లో॥అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే,**

**సురతరువరశాఖా లేఖనీ పత్రముర్వీమ్ ।**

**లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం,**

**తదపి తవ గుణానామీశ పారం న యాతి ॥**(పుష్పదంతాచార్యులు)

సర్వసమర్థుడవగు నోఈశ్వరా!సమగ్రసాధనకలాపమును సమకూర్చుకొని నీయొక్కగుణగణమును వ్రాయబూనినను నీ అనంతగుణముల అంతు జిక్కదు.సముద్రమును సిరాబుడ్డిగజేసికొని,దానిలో నీలాచలపర్వతమంత సిరా(మసి=స్యాయి)ని నింపుకొని,కల్పవృక్షంయొక్కగొప్పశాఖను లేఖనముగా(కలముగా)మార్చుకొని,సంపూర్ణ భూమండలమును కాగితముగా జేసికొని,సాక్షాత్తు విద్యా అధిష్ఠాత్రియగు వాగ్దేవి సరస్వతియే ఎల్లకాలము(అనుక్షణం)వ్రాయబూనినను నీ గుణగణముయొక్క పారమును(అంతమును)చేరుకోజాలదు.అట్లే,ఈశ్వరాభిన్న గురుదేవుని గుణగణముయొక్క అంతమునుగూడ చేరుకోజాలదు—అని అన్వయము.

శ్రీగురుదేవులకు సమమగు వస్తువుగాని,వ్యక్తిగాని ముల్లోకములలో గూడలేదు(లేడు).

**శ్లో॥దృష్టాన్తో నైవ దృష్ట స్త్రిభువనజఠరే సద్గురో ర్జ్ఞానదాతుః,**

**స్పర్శశ్చేత్తత్ర కల్ప్యః స నయతి యదహోస్స్వర్ణతామశ్మసారమ్।**

**న స్పర్శత్వం, తథాపి శ్రితచరణయుగే సద్గురుః స్వీయశిశ్యే,**

**స్వీయం సామ్యం విధత్తే భవతి నిరుపమస్తేనవాఽలౌకికోపి ॥**

శ్రీజగద్గురు శంకరాచార్యులవారు వారి"**శతశ్లోకి"యను గ్రంథారంభము**న సద్గురుదేవునియొక్క యోగ్యతను మరియు మహాత్మ్యమును మొదటి శ్లోకముద్వారా వర్ణించి యున్నారు.ఎందుకనగా!"**యస్య దేవే పరా భక్తి"**(శ్వే.6-23)యెవరికి దేవునియందువలె గురువునందు పరమభక్తి గలదో,వారికే శ్రుత్యుక్త తత్త్వము ప్రకాశింపబడును.జ్ఞానదానముజేయు సద్గురువులకు సదృశముగా శోభించు దృష్టాంతము త్రిభువనములలో యెక్కడనూ దొరుకదు.వ్యావహారికమైన క్షుద్రవిద్యలను నేర్పించు గురువులకు యోగ్యమగు దృష్టాంతము కదాచిత్ యెక్కడైనా దొరుకవచ్చు.కాని"**నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే"**(గీత.4-38) జ్ఞానమునకు సదృశమైన (సమానమైన)పవిత్రమగు వస్తువు యీజగత్తులోలేదు—అని శ్రీకృష్ణపరమాత్మ జ్ఞానముయొక్క పవిత్రతను చెప్పియున్నందున,అటువంటి పరమ పవిత్ర జ్ఞానదానముజేయు శ్రీగురుదేవులను పోల్చి చెప్పుటకు నానా చిత్ర విచిత్రమైన వస్తువులతో నిండియున్న త్రిభువనములలో ఒక్క దృష్టాంతముగూడ దొరకదు.ఒకవేళ లోహము(ఇనుము)ను బంగారముగా మార్చగల్గు పరుసవేధిని సద్గురువులకు దృష్టాంతముగా చెప్పేదమన్నచో,అదియును సరిపడదు.కారణమేమనగా,స్పర్శవేది లోహమును పూర్వస్థాయినుండి ఉచ్చస్థాయికి అనగా సువర్ణముగా మార్చగలదేమోగాని, స్పర్శత్వమును మాత్రము ప్రసాదింపజాలదు.అనగా,తనవలె మరొక లోహమును పుత్తడిగా మార్చగల యోగ్యతను మాత్రము అనుగ్రహింపజాలదు.కాని,సద్గురుదేవుని చరణయగళమును ఆశ్రయించి శ్రద్ధా భక్తి పురఃసరముగా సపర్యలుజేయు శిష్యుని అనుగ్రహించి తన స్వరూపునిగా

మార్చి ధన్యుడిని జేయును.అందుకే,వివిధ విచిత్ర వస్తువులతో,దేవ తిర్యగాది ప్రాణులతో విలసిల్లు త్రిలోకములలోగూడ సద్గురుదేవులకు తుల్యమగు ఉపమానము దొరకదు.ఎట్లు లౌకిక దృష్టాంతము లేదో,అట్లే అలౌకిక(ప్రపంచాతీత)మగు దృష్టాంతముగూడ దొరుకదు.ఎందుకంటే, **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్"**(గీత.7-18),**"బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి"**(ముం. 3-2-9) ఇత్యాది ప్రమాణములచే జ్ఞానియగు సద్గురుదేవుడు సాక్షాత్ పరబ్రహ్మస్వరూపుడుగా ధృవీకరించబడినందున,అలౌకికమైన పరమాత్మకు సమానమైన అన్యవస్తువులేదు. **"హేతు దృష్టాన్తవర్జితమ్"**(బ్ర.బిం.9). కావున,పరబ్రహ్మస్వరూపుడగు శ్రీగురుదేవులకు అలౌకిక దృష్టాంతము గూడ లేదు.సారాంశమేమనగా,సద్గురు సాంగత్యములేనిదే,వారు ప్రసన్నులై అనుగ్రహించనిదే యే సాధకుడుగూడ కృతార్థుడు కాజాలడు.శ్రీ గురుదేవులకు శరణు వెళ్లకుండా,ఆశ్రయించిన పిమ్మట శిష్యుని అధికార విషయంలో గురువునకు నిశ్చయము కలుగనిదే ఎప్పుడుగూడ తత్త్వోపదేశము చేయనెంచడు.(తలపెట్టడు,విచారించడు).కాని,శిష్యుని యోగ్యతను గుర్తించి ఒక్కసారి తత్త్వోపదేశము చేసినచో—అంతే..... శిష్యుని కళ్యాణమయ్యితీరుతుంది.సందియము లేదు.అందువలన,గురూపసదనము(గురువునకు శరణువెళ్ళుట),గురుసేవ,తద్వారా గురువును ప్రసన్నము జేసికొనుట—మరియు వారి ముఖారవిందమునుండి మహావాక్యమును శ్రవణముచేయుట మున్నగునవి పరమపురుషార్థమునకు ఉత్కృష్ట సాధనములని గ్రహించవలెను.

ఇంతదనుక గురుసేవా ప్రకారము,గురువుయొక్క మహాత్మ్యము మరియు ఆవశ్యకతనుగూర్చి విస్తారముగా తెలుసికుంటూ వచ్చాము.శ్రద్ధా

పూర్వకముగా త్రికరణశుద్ధి గలిగి గురుదేవులకు పరిచర్యలుచేసి,అతని ని ప్రసన్నుని జేసికొన్నపిమ్మట శిష్యుడు యేమిచేయవలెనో ఆ ప్రకార మును శ్రీజగద్గురు శంకరులవారు ఈక్రిందివిధముగా ముముక్షువుల యందు కరుణగలవాడై బోధించుచున్నారు.

**శ్లో॥తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వః ప్రశ్రయసేవనైః।**

**ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛేత్ జ్ఞాతవ్యమాత్మనః ॥**(వి.చూ.36)

పూజ్యుల యందతిశయమగు ప్రేమ= భక్తి-ఇది మనో ధర్మము. దాని చేత ప్రహ్వః=వినయమును ప్రదర్శిస్తూ శరీరమువంగినవాడై,దోసిలి యొ గ్గినవాడై,ప్రశ్రయసేవనైః=వినయముట్టి పడునట్లు మృదుమధురముగా మాట్లాడుట=ప్రశ్రయము.సాష్టాంగప్రణామము, పాదసంవహనము(పాద ములొత్తుట),గురుదేవుని ఆజ్ఞప్రకారము మెలగుట మొదలగునవి- సేవనములు. **"భక్త్యా ప్రహ్వః ప్రశ్రయ సేవనైః తమారాధ్య"** అని చెప్పుటచే ఆరాధనముచేయు మనస్సు,వాక్కు,శరీరము అనుమూడు కరణముల ను శుద్ధముగ నుంచుకొనవలెనని చెప్పబడినది.ఇట్లు త్రికరణశుద్ధిచే గు రుదేవులను సేవించి,నిష్కపటమగు ఆ సేవచే ప్రసన్నుడైన,తన విషయ మున అభిముఖముగా నున్న,గురువును—అనుప్రాప్య=ఆయన నిర్దేశిం చిన సమయమున ఆయన సమీపమున యథావిధిగ వినమ్రుడై యుం డి,ఆత్మ యథార్థస్వరూప విషయమున తెలియదగిన విషయమును గూ ర్చి ప్రశ్నింపవలెను.

శిష్యుడు గురువును ప్రార్థింపవలసిన విధానమును భగవత్పాదులు జిజ్ఞాసువులయందు దయచే నిమ్న ప్రకారముచే బోధించుచున్నారు.

**శ్లో॥స్వామిన్నమస్తే నతలోకబన్ధో, కారుణ్యసిన్ధో పతితంభవాబ్ధౌ।**

**మాముద్ధరాత్మీయకటాక్షదృష్ట్యా ఋజ్వ్యాతికారుణ్య సుధాభివృష్ట్యా ॥**37.

స్వామీ!మీ చరణారవిందములకు నమస్కారము.తమకు నమ్రులగు వారలకు తల్లిదండ్రులవలె దుఃఖమును దూరము జేయువాడా! నతలోక =నీకు నమస్కారంచేయు జనులయొక్క దుఃఖమోచకుడువుగావున అటువంటి నీకు నా నమస్కారము అని భావము.ఓ అవ్యాజ(అహేతుక)దయాసముద్రుడా!నేను జన్మజరారోగమరణానర్థసంకులమగు సంసార సముద్రములోబడి కొట్టుమిట్టాడుచుంటిని.మీయొక్క కటాక్ష వీక్షణముల చే నన్ను యీ జన్మాది బంధములనుండి నిర్ముక్తునిజేయుము.బ్రహ్మ సాక్షాత్కారముచే సకలపాపములు దొలగింపబడిన నీపవిత్రకటాక్ష దృష్టి పాతముచే నన్ను సమస్తపాపములనుండి విముక్తినిగావింపజేసి సంసార సాగరమునుండి తరింపజేయుము—అని తాత్పర్యము.శ్రుతిమాతగూడ చెప్పుచున్నది.

**"యస్యానుభవపర్యన్తా బుద్ధిః సత్వేప్రవర్తతే ।**

**తద్దృష్టిగోచరాస్సర్వే ముచ్యన్తే సర్వకిల్బిషైః" ॥**(వరాహోపనిషత్.4-43)

బ్రహ్మానుభూతి నొందినవారి దృష్టి ప్రసరించిన అందరి పాపములును తొలగిపోవును.లోకములో అగాధజలములో పడినవానికి వొడపైన త్రాడునుగాని,కఱ్ఱనుగాని అందించినచో దానిని ఊతగాగొని ఎట్లు పైకి వచ్చునో, అట్లే నిత్య శుద్ధ బ్రహ్మానందానుభవరూప ఋజువైన (సరళమైన)దృష్టిని కరుణతో నీవు నాపై ప్రసరింపజేసినచో,దానిని ఊతగా గైకొని నేను యీ అగాధ భవసాగరమునుండి బయట పడుదును.తరించెదనని భావము.

లేక,సూర్యమండలము,దీపము మున్నగు వాటినుండి కిరణములు పుం జీభూతములై త్రాడువలె బయల్వెడలి అంధకారమును అదృశ్యము గా వించి ఎట్లు వస్తువులను ప్రకాశింప(తెలియ)జేయునో,అట్లే చక్షురింద్రియ ముగూడ తేజోరూపముగాన దానిద్వారా బ్రహ్మనిష్ఠుడగు గురుదేవుని హృదయమునుండి నిసృత(వెలువడు)కారుణ్యదృష్టి(కిరణములు)శిష్యు నిపై సంక్రమించి అజ్ఞాన చీకట్లను టోకార్చి స్వస్వరూపమును అభివ్యక్త ము జేయునని భావము.అతికారుణ్య సుధాభివృష్ట్యా=అత్యంత కారుణ్య ము.అదియే సకలతాపహారకమగుటచే సుధయని (అమృతమని)రూప కము=ఆరోపించబడుచున్నది.అది యే దృష్టియందు పరిపూర్ణముగా వ్యాపించియున్నదో—అది అతికారుణ్య సుధాభివృష్టియగును.ఆ అతి కా రుణ్యమగు అమృతము వర్షించుటచే జన్మమరణములు నివర్తింపబడి పరమశాంతిరూప మోక్షమును బొందునని ప్రసిద్ధము.యుద్ధమున మర ణించిన వానరులను అమృతము కురిపించి ఇంద్రుడు పునరుజ్జీవితుల ను చేసెనని రామాయణమున ప్రసిద్ధము.ఆ అమృతమే అట్టిదనిన, యిక బ్రహ్మనిష్ఠసద్గురుదేవునియొక్క అనుకంప(కరుణ)తోగూడిన అ మృతవృష్టిరూప దృష్టి,అపారము అగాధము అగు జననమరణరూప దుఃఖమును పోగొట్టి జన్మరాహిత్యమును ప్రసాదించగలదనుటలో అతిశ యోక్తిగాని,సందేహముగాని లేదు.

## —:50.సంపూర్ణ శరణాగతి:—

తనను ఉద్ధరించుకొనుటలో ఆలస్యమును ఎంత మాత్రము సహింప లేని శిష్యుడు తనకుగల తీవ్రముముక్షుత్వమును ప్రకటించుచున్నాడు.

**శ్లో॥దుర్వార సంసారదవాగ్ని తప్తం, దోధూయమానం దురుదృష్టవాతైః।**

**భీతం ప్రపన్నం పరిపాహిమృత్యోః శరణ్యమన్యం యదహం న జానే ॥**38.

నలుమూలల వ్యాపించి తాపమును కలిగించుటచే వనమునందలి అగ్ని,దావాగ్ని(దావానలము)అనబడును.అటువంటిదే యీ సంసారము గాన సంసారదవాగ్ని అని చెప్పబడినది.ప్రారబ్ధ(దురదృష్ట)ప్రతికూల వాయువులచే ఉద్ధృతమై నాచే స్వయముగా నివారించుకొనుటకు శక్యము కాని యీసంసార దవాగ్నిలో మాటిమాటికి కంపింపబడుచు యిటునటు దొర్లాడుచుంటిని.మృత్యువునుండి భయపడినవాడను,నిన్ను శరణుజొచ్చినవాడను అగు నన్ను మృత్యువునుండి రక్షింపుము.ఎట్లు కుంభవర్షము కురిసినచో దావానలము చల్లబడి,వనము రక్షింపబడి, వన్యప్రాణులకు ప్రాణదానముజేయబడునో,అట్లే నీయొక్క కటాక్షదృష్టిచే అతికారుణ్యసుధాభివర్షణముచే నా యీ సంసారదవాగ్నిని చల్లార్చి,ఆత్మజ్ఞానమును ప్రసాదించి మృత్యువునుండి కాపాడుము—అని పూర్వశ్లోకముతో అన్వయము.గురువును అభిముఖునిగజేసికొనుటకై—నీవు దప్ప మరొక శరణ మెద్దియును లేదని చెప్పుచున్నాడు.నాకు మీకంటె అన్యమగు రక్షకులెవరును లేకుండుటచే నన్ను ఉపేక్షింపకుడు—అని భావము.

ఇట్లు సర్వస్వమును పరిత్యజించి,సద్గురువే అనన్యగతిగా భావించి, తనకు శరణాగతుడై,వినమ్రుడై,తదనుగుణమగు వాక్కుచే దీనుడై ప్రార్థించగా,దానిచే వ్యంజితమగు శిష్యునియొక్క భక్తినిజూచి"ఇతర మేదియు లేక ఆర్తుడైయున్న ఇతనిని సర్వవిధముల రక్షింపవలెను"అను నభిప్రాయముచేతనకభిముఖమైనట్టియు,కరుణామృతమును కురిపించు సాను

గ్రహకటాక్షములచే తనను పవిత్రునిచేయుచున్న దేశికోత్తముని(గురువును),తనకు బంధమోచనోపాయము నుపదేశింపుమని ధైర్యముగా ప్రార్థించుచున్నాడు.

ఓప్రభూ!సద్గురు శిఖామణీ! ఆధ్యాత్మికాది తాపత్రయముతో గూడిన సంసారదుఃఖరూప దావానలజ్వాలలచే పీడితుడనై మీకు శరణు జొచ్చితిని.బ్రహ్మానందరసామృతముచేగూడి పవిత్రమై అత్యంతశీతలమై యొప్పెడి శ్రుతిసుఖ(చెవులకింపైన)వాక్యామృత ధారలను మీ ముఖకలశము నుండి నాపై వర్షింపజేసి నా తాపము నుపశమింపజేయుడు. ఓ స్వామీ! యెవనిపై మీ కటాక్ష వీక్షణము ఒక్క క్షణమైనను ప్రసరించునో,వాడు ఉపదేశ పాత్రుడై మీయంగీకారమును బడిసినవాడై ధన్యుడగును.

గురుదేవుడు తొందరగా తనను అనుగ్రహించుటకొఱకు పూర్వోక్త "**భీతం ప్రసన్నం**"**ఇత్యాది వచనములను స్పష్టము చేయుచున్నాడు.**

**శ్లో॥కథం తరేయం భవసింధుమేతం కావా గతిర్మే కథమోఽస్త్యుపాయః।**

**జానే న కిఞ్చిత్కృపయావ మాం ప్రభో సంసారదుఃఖ-క్షతిమాతనుష్వ॥**42.

నివారింప శక్యముగాని జటిలమగు యీసంసారదుఃఖజాల సంద్రము నుండి నేనెట్లు తరించగలను?ఒకవేళ ఈవిధముగానే యున్నచో నాకు గతియేమి?నాకు ఏమి ఫలము ప్రాప్తింపనున్నది.అన్నివిధముల దుఃఖమేయని తాత్పర్యము."**దుఃఖమేవసర్వంవివేకినః"** (యో.సూ.2-15).అందువల్ల,సకలదుఃఖ సముదాయరూప యీసంసార సముద్రమును దాటుటకు పాయమేమున్నది.నాకు మాత్రము ఏమియును తోచకున్నది. భీతుడనైన నన్ను రక్షింపుము.ఈ రక్షణమునే"సంసార దుఃఖ క్షతిమాతనుష్వ"

అని చెప్పుచు స్పష్టము చేయుచున్నాడు.ఈ సాంసారిక దుఃఖమును కారణ సహితముగా నశింప జేయుమని యర్థము.

**శ్లో ॥ భగవన్! కరుణాసిన్ధో!భవసిన్ధోర్భవాన్స్తరిః।**

**యమాశ్రిత్యాఽశ్రమేణైవ పరం పారం గతా బుధాః॥** (స.వే.సి.సా.సం.258)

హే కరుణా సిన్ధో! = ఓ కరుణా సముద్రుడా!; భగవన్ = ఓ భగవంతుడా (షడ్గుణైశ్వర్యసంపన్నుడా);భవాన్ = మీరు;భవసిన్ధోః = సంసార సాగరమునకు; తరిః = తెప్ప(నౌక)లాంటివాడవు.సంసారసాగరమును దాటుటకు మీరే నాకు నౌకారూప ఆలంబనము(ఆశ్రయము).అటువంటి మిమ్ములను ఆశ్రయించి యింతకు పూర్వము ఎందరో బుధజనులు ఏమాత్రము ఆయాసము లేకుండా సంసార సముద్రమును దాటివెళ్ళిరి.కావున నన్నుగూడ అటులనే కృతార్థునిజేయ వేడుకొనుచున్నాను.

**శ్లో॥జన్మాన్తర కృతానన్త పుణ్యకర్మఫలోదయః।**

**అద్యసన్నిహితోయస్మాత్త్వత్కృపాపాత్రమస్మ్యహమ్॥**(స.వే.సి.సా.సం.259)

ఓ దేశికోత్తమా!తమకు నాయందు సంపూర్ణానుగ్రహము గలుగుటచే నేడు నా గతజన్మలలోజేసిన అనేక పుణ్యకర్మలన్నియు ఫలించినవని నమ్ముచున్నాను.

**శ్లో॥దుష్పారే భవసాగరే జనిమృతి వ్యాధ్యాది దుఃఖోత్కటే ।**

**ఘోరే పుత్రకళత్రమిత్రబహుళ గ్రాహాకరే భీకరే ॥**

**కర్మోత్తుంగ తరంగ భంగ నికరైరాకృష్యమాణోముహుః।**

**యాతాయాత గతిభ్రమేణ శరణం కిఞ్చిన్న పశ్యామ్యహమ్॥**

(స.వే.సా.సం.292)స్వామీ!నేను సంసారమున జననమరణాదులవలన మహా దుఃఖము ననుభవించుచున్నాను.ఈసంసారము నాకొక సముద్ర మువలె కన్పట్టుచున్నది.దీని యావలి ఒడ్డునుచేరుట మిక్కిలి కష్టతమ ముగా నున్నది.ఇందు పుత్ర మిత్ర కళత్రాదులు అనువారు మొసళ్లవలె పీడించుచున్నారు.పుణ్యపాపకర్మలు అను పెద్ద తరంగములు ఇహపర లోకములందు రాకపోకలను కలిగించుచున్నవి. కావున,ఎంత మాత్రము విశ్రాన్తిని పొందజాలకున్నాను.ఇట్టియెడ నన్ను చేరదీసి రక్షించువారు యెవరును గానరాకున్నారు.

**శ్లో॥కేన వా పుణ్యశేషేణ తవ పాదామ్బుజద్వయమ్ ।**

**దృష్టవానస్మి మామార్తం మృత్యోస్త్రాహిదయాదృశా॥**(293)

పూజ్యుడవగు నో గురుసత్తమా!నా పూర్వపుణ్యముచే తమ పాదపద్మ ములను దర్శించగలితిని.తమరు భక్తులను పరిపాలించుటకు అవతరించి న భగవత్స్వరూపలని నా దృఢవిశ్వాసము.కాన,తాము దయాదృష్టిని నా పై ప్రసరింపజేసి జన్మమరణరూప సంసారసముద్రమునుండి పరిరక్షింపుము.

**శ్లో॥వదన్తమేవం తం శిష్యం దృష్ట్వైవ దయయా గురుః।**

**దద్యాదభయ మేతస్మై మా భైషేతి ముహుర్ముహుః ॥**(స.వే.సి.సా.సం.264)

**"కథం తరేయం భవసింధుమేతం"**ఇత్యాది వాక్యములచే సూచితమగు శిష్యునియొక్క భయమును వెంటనే తొలగింపవలెనను అభిలాషతో పర మకారుణికుడగు శ్రీగురుదేవుడు అభయ ప్రదానము చేయుచున్నాడు.

**శ్లో॥మాభైష్ట విద్వంస్తవ నాస్త్యపాయః,**

**సంసార సిన్ధోస్తరణోఽస్త్యుపాయః।**

**యేనైవ యాతా యతయోఽస్యపారం,**

**తమేవ మార్గం తవ నిర్దిశామి ॥**(వి.చూ.45)

హే విద్వాన్=ఓవిద్వాంసుడా!మాభైష్ట=భయపడకుము;తవ=నీకు; అపాయః=అపాయము;నాస్తి=లేదు."**నీవు భయపడకుము**" అని శ్రీగురు దేవుడు అభయమొసంగినాడు.పూర్వోక్త వివేకాది సాధనములను సంపా దించుకొని,గురుకరుణలేనిదే జన్మమరణదుఃఖమును తరించుట శక్యము గాదను నిశ్చయముతో నన్ను శరణుజొచ్చితివి.కావున తెలియదగిన విషయము నీకు తప్పకుండా తెలియును నాయనా! అని సూచించుటకై '**విద్వన్**'అని సంబోధించినాడు."**తద్విజ్ఞానార్థం**"(ముం.1-2-12)అను శాస్త్ర విధి ప్రకారముగా నీవు ఆచరించుచున్నావు నాయనా!కావున,"**నహి కళ్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి**"(గీత.6-40)మంచి పని చేయువాడెన్నటికిని చెడిపోడు—అను స్మృతివాక్యానుసారము నీకు అపాయమేమియును లే దు.అందువలన,"**కథంతరేయం**","**కావాగతిర్మే**"ఈభయంకరమగు సంసార సముద్రమునుండి నెనెట్లు తరింతును?నాకు గతియేమి?అని భయము జెందకుము.ఇట్లు ముందుగ ఓదార్చి,"**కతమోఽస్త్యుపాయః**"అను ప్రశ్న కు సమాధానముగ"**సంసారసిన్ధోస్తరణేఽస్త్యుపాయః**"సంసార సముద్రము నుండి తరించుటకు ఉపాయమున్నది నాయనా! అని చెప్పుచున్నాడు. ఆ విషయమున విశ్వాసము దృఢమగుటకై ఆ ఉపాయమును సప్రమా ణముగ చెప్పుచున్నాడు.ఏ ఉపాయముచే ప్రయత్నశీలురగు సన్న్యాసు

లు యీ సంసార సముద్రముయొక్క అంతమును(ఆవలి తీరమును) చేరుకొనిరో, ఆ మార్గమునే నీకు ఉపదేశింతును.

**శ్లో॥వేదాన్తార్థ విచారేణ జాయతే జ్ఞానముత్తమమ్।**

**తేనాత్యన్తిక సంసార దుఃఖనాశో భవత్యను॥**(వి.చూ.47)

ఆ ఉపాయ విశేషమును గురుదేవుడుపదేశించుచున్నాడు.వేదాన్తార్థము="**వేదాన్తో నామ ఉపనిషత్ప్రమాణమ్**".పరమ ప్రామాణికములగు ఉపనిషత్తులే వేదాన్తములనబడును.వేదములయొక్క చివరి భాగములగు ఉపనిషత్తులయొక్క యే అర్థము=తాత్పర్య విషయము=ఉపక్రమోపసంహారము మొదలగు తాత్పర్యనిర్ణాయకములగు షట్(ఆరు)లింగములచే ఉపనిషత్తులలో ప్రతిపాద్యవిషయము=సజాతీయ,విజాతీయ స్వగత భేదరహితము,నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త స్వభావమును అగు యే పరమాత్మస్వరూపమున్నదో—దానియొక్క,విచారేణ=తన్నిర్ణయమునకు అను-కూలమగు మానసవ్యాపారముచేత(శ్రవణ,మనన,నిదిధ్యాసనముచేత), ఉత్తమం=సంశయ విపరీతభావనలచే మిశ్రితముకాని,జ్ఞానం=నిర్ణయము కలుగును.తేన=ఆనిర్ణయము(జ్ఞానము)చేత,అత్యన్తిక సంసారదుఃఖనాశః=జన్మమరణరూప సంసారదుఃఖముయొక్క సమూల నాశనము; అను=జ్ఞానము కలిగిన వెంటనే; భవతి= కలుగును.

అధికారియై విధిపూర్వకముగా తనను శరణుజొచ్చిన జిజ్ఞాసువును ఆదరించి పరమగోప్యమగు బ్రహ్మవిద్యను అవశ్యముగా బోధించవలసిన నియమమును శాస్త్రము—ఆచార్యునికి అవశ్యకర్తవ్యముగా బోధించుచున్నది.

**తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమాన్వితాయ।**

**యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్॥**

(ముం.1-2-13)

సమ్యక్=శాస్త్ర విధిననుసరించి;ఉపసన్నాయ=గురు సమీపమునకు వచ్చినటువంటి;ప్రశాన్తచిత్తాయ=దర్పము మొదలగు దోషములు తొలగింపబడినవాడును;శమాన్వితాయ=బాహ్యేన్ద్రియములుతత్తద్విషయాలనుండి ఉపరమింపబడినవాడును(శమముగలవాడును)=అనగా సంపూర్ణముగా బాహ్యప్రపంచమునుండి విరక్తుడైనవాడును అగు అధికారి శిష్యునికి,శ్రోత్రియుడు బ్రహ్మనిష్టుడునగు గురువు ఆ విజ్ఞానమును ఉపదేశించవలెను.ఎటువంటి విజ్ఞానమును?ఏ పరావిద్యద్వారా"యత్తదద్రే**శ్యం..."**(ముం.1-1-6)అదృశ్యము=బుద్ధీన్ద్రియములకు(జ్ఞానేంద్రియములకు) విషయము కానివాడును;అగ్రాహ్యం=కర్మేంద్రియములకు విషయము-కానివాడును;అగోత్రం=గోత్రము(కులము)లేనివాడును;అవర్ణం=వర్ణించదగిన స్థూలత్వాది లేక శుక్లత్వాది ద్రవ్యధర్మములు లేనివాడును; సంసారి జీవులకువలె శబ్దమునుగ్రహించు శ్రోత్రేంద్రియముగాని,రూపమును విషయముచేయు నేత్రేంద్రియముగాని—ఉపలక్షణముగా యే యింద్రియములు లేనివాడును;నిత్యః=అవినాశియును;విభుః=బ్రహ్మాది స్థావరాంతము సర్వప్రాణులరూపంలో తానే అయియున్నందున ఆకాశమువలె సర్వవ్యాపకుడును;స్థూలత్వమునకు కారణము(ప్రయోజకము)లగు శబ్దాది ధ-ర్మములు లేనివాడుగాన అత్యన్త సూక్ష్మమైనవాడును;శబ్దాదిగుణరహితుడగుటచే అవ్యయుడు=నాశరహితుడును(అవయవ రహితుడగుటచే శరీరమువలె నాశనములేనివాడును)మరియు స్థావరజంగమరూప సమస్త ప్రపంచమునకు కారణమును—అగు ఏఅక్షరపురుషుణ్ణి అధికారి జి-

జ్ఞాసువు తెలుసికొనునో,అటువంటి పరబ్రహ్మతత్త్వమును(గురువు-శిష్యునికి)ఉపదేశించవలెను.పురుషుడనగా (పూర్ణత్వాత్,పురిశయనాద్వా పురుషః)=సంపూర్ణవిశ్వమును పూర్తిగా వ్యాపించియున్నందున మరియు శరీరమునందు,అట్లే బ్రహ్మాండమునందు అసంగభావముచే శయనించి యున్నందున అక్షరబ్రహ్మము పురుషుడనబడుచున్నాడు. తన వాస్తవిక స్వభావమునుండి ఎప్పుడుగూడ విచలితుడు కానందున అక్షరుడనబడుతున్నాడు.అనగా అవయవరహితుడగుటచే శరీరమునకు వలె అవయవ అన్యథాభావరూప పరిణామము(షడ్భావవికారము)లు లేనందున అనగా అశరీరి అయినందువలన పరబ్రహ్మము—అక్షరుడగును. అందుకే అక్షతుడు మరియు అక్షయుడు అనబడును. ఇటువంటి అక్షరపురుషుణ్ణి యే విజ్ఞానముచేత ముముక్షు సాధకుడు తెలుసికొనగలుగునో, అటువంటి బ్రహ్మవిద్యను ఆచార్యుడగు అంగీరసుడు శౌనకునికి చక్కగా బోధించెను.అందువలన,అన్యమగు ఆచార్యులందరుగూడ పూర్వోక్త రీతిచే వారిని సమీపించిన శిష్యులకు అదేవిధముగా బ్రహ్మవిద్యోపదేశము చేయాలి—అను శ్రుతి సంకేతమును స్పష్టీకరిస్తూ భగవాన్ భాష్యకారులు"ప్రోవాచ"అను పదమునకు"ప్రబ్రూయాత్"అని అర్థము చెప్పియున్నారు.ఎందుకంటే,న్యాయపూర్వకముగా తనను ఆశ్రయించిన శిష్యునికి బ్రహ్మవిద్యనుపదేశించి అవిద్యారూప మహాసముద్రమునుండి తరింపజేయుట ఆచార్యునికి కర్తవ్యము(నియమము)న్నది.

. శ్రీమన్మహాభారతము శాన్తిపర్వము 308 వ అధ్యాయములో వశిష్ఠుడు మరియు కరాలుడను పేరుగల జనకునికి జరిగిన సంవాదములో శ్రీ వశిష్టభగవానుడుఉపదేశమునకు అధికారి మరియు అనధికారిని గూర్చి

వర్ణిస్తూ:—

ఓ రాజా!వేదములయందు ఎవనికి శ్రద్ధ లేదో అటువంటి వానికి ఆత్మ జ్ఞానోపదేశము చేయకూడదు.ఆత్మజ్ఞాన పిపాసియై జిజ్ఞాసుభావముచే శరణుజొచ్చినవాడే ఉపదేశమును వినుటకు అధికారియగును.32.

ఎవడు అసత్యవాదియో,పరవంచకుడో,నీచుడు,కపటస్వభావము గల వాడో,నేనే పండితుడనని అభిమానించువాడు,ఇతరులను కష్టపెట్టు వాడు—అగు మనుష్యునికి ఉపదేశమివ్వగూడదు.అయితే,ఈజ్ఞానోపదేశమును ఎవరికి అవశ్యముగా నీయదగునో- అదిగూడా వినుము. 33.

గురుశాస్త్రములపట్ల అకుంఠిత శ్రద్ధగలవానికి,అమానిత్వాది గుణములుగలవానికి,ఎప్పుడునూ పరనిందజేయనివానికి,విశుద్ధాన్తఃకరణముగల సాధకునికి,సూక్ష్మబుద్ధిగల విద్వాంసునికి,శాస్త్రోక్త కర్మలనాచరించువానికి,క్షమాశీలునికి,సకలప్రాణులకు హితమునుచేకూర్చు స్వభావము గలవానికి,ఏకాన్తవాసి,శాస్త్రవిధిని ఆదరించువాడును,వివాదము చేయనివానికి,బహుశ్రుతుడు(అనేకశాస్త్రములను శ్రవణము చేసినవానికి,విజ్ఞునికి,ఎవరికిని అపకారము చేయనివానికి మరియు బాహ్యేంద్రియ అంతరింద్రియ నిగ్రహముగల పురుషునికే ఈఆత్మజ్ఞానోపదేశమును ప్రదానము చేయవలెను. 34. 35.

పైన పేర్కొనిన సద్గుణములు ఎవనియందు బొత్తిగాలేవో,వానికి ఉపదేశించగూడదు.విశుద్ధ పరబ్రహ్మస్వరూపజ్ఞానమును ఒకవేళ గుణహీనుడగు పురుషునికి ప్రదానముచేసినచో,అది వానికి కళ్యాణకారి కాజాలదు.మరియు కుపాత్రునికి ఉపదేశించిన వక్తకుగూడా కళ్యాణకారి కాజాలదు.36.

ఓనరేంద్రా!ఎవడు శాస్త్రోక్త వ్రత,నియమాలను పాలించడో,అతడు రత్న పూరితమగు యీ సంపూర్ణ పృథ్వీరాజ్యమును అర్పించెదనన్ననూ,అత నికి ఆత్మజ్ఞానోపదేశము చేయగూడదు.కాని,ఎవడు జితేన్ద్రియుడగు అధి కారి పురుషుడో, అతనికి నిస్సంకోచముగా యీ ఉత్తమ జ్ఞానోపదేశము జేయుట నీకు ఉచితమగును. 37.

అట్లే, శ్రీ మద్భాగవతము తృతీయ స్కంధము ముప్పది రెండవ అధ్యాయములో కపిల భగవానుడు తన తల్లియగు దేవహూతికి తత్త్వజ్ఞానోపదేశము చేసినపిమ్మట, ఈక్రింది విధంగా చెప్తున్నాడు.

**శ్లో॥నైతత్ఖలాయోపదిశే న్నావినీతాయ కర్హిచిత్।**

**న స్తబ్ధాయ న భిన్నాయ నైవ ధర్మధ్వజాయ చ ॥**39.

**శ్లో॥న లోలుపాయోపదిశే న్న గృహారూఢ చేతసే।**

**నాఽభక్తాయ చ మే జాతు న మద్భక్త ద్విషామపి॥**40.

**శ్లో॥శ్రద్ధధానాయ భక్తాయ వినీతాయానసూయవే ।**

**భూతేషు కృత మైత్రాయ శుశ్రూషాభిరతాయ చ॥** 41.

**శ్లో॥బహిర్జాతవిరాగాయ శాన్తచిత్తాయ ధీయతే।**

**నిర్మత్సరాయ శుచయే యస్యాఽహం ప్రేయసాం ప్రియః॥** 42.

**శ్లో॥య ఇదం శృణుయాదమ్బ శ్రద్ధయా పురుష స్సకృత్ ।**

**యో వాఽభిదత్తే మచ్చిత్త స్సహ్యేతి పదవీం చ మే ॥** 43.

హే అమ్బ!(ఓ తల్లీ!)నాచే చెప్పబడిన సర్వవేదాన్తార్థరూప యీ పరమగోప్యతత్త్వమును అధికారికి మాత్రమే బోధించదగినది.కాని,అన ధికారికి కాదు.ఖలునికి=పరులను కలవరపెట్టి దుఃఖింపజేయు దుష్టు నికు,అవినీతిపరునికి,స్తబ్ధాయ=మూర్ఖునికి,భిన్నాయ=దురాచారునికి, ధర్మధ్వజాయ=డాంబికునికి,విషయలోలునికి,ఎల్లప్పుడూ పుత్ర భార్యా దుల యోగక్షేమముల పైనే ఆసక్తిని చూపువాడికి,నిరంతరము ధనార్జన మే లక్ష్యముగా భావించువానికి,నా భక్తుడు కానివానికి(పూర్తిగా భగవం తుని మరచిపోయే వానికి),భగవంతుని మీద యే మాత్రము భక్తి, శ్రద్ధ లేకుండుటయేగాక,భగవంతుని మీద భక్తి గలవారిని ద్వేషించే వారికి—ఈ తత్త్వజ్ఞానమును ఉపదేశించగూడదు.

అయితే,ఈ బ్రహ్మవిద్యను యెవరికి ఉపదేశించదగినది?అను ప్రశ్నకు సమాధానము చెప్పు:—శ్రద్దధానాయ=శ్రద్ధగలవానికి,శుశ్రూషాత్వరాన్వి తాయ=సేవచేయుటలో అత్యంతాసక్తిగలవానికి,బహిర్జాతవిరాగాయ=బా హ్యేన్ద్రియ విషయవిరక్తి(దమము)గలవానికి,భగవంతుని భక్తిగలవానికి, నీతిపరునికి,ఇతరుల ఔన్నత్యము గాంచి అసూయజెందని వానికి, సకల భూతములను(ప్రాణులను)ప్రేమించు వానికి,శాన్తచిత్తాయ=శమము గల వానికి, వేదశాస్త్రములను చదివినవానికి,పరులయెడల మాత్సర్యము లే నివానికిని,శారీరకంగానూ,మానసికంగానూ నిర్మలంగా,శుచిగా ఉండేవా రికిని, ఎల్లప్పుడూ పరమాత్మనే పూజించు వారికిని, తన కిష్టమైన సకల వస్తువులకంటె నాయందే అత్యధిక ప్రీతిగలవానికి—ఈ తత్త్వశాస్త్రమును ఉపదేశించవచ్చును.

హే అమ్బ!నాచే చెప్పబడిన యీ అష్టాధ్యాయములలోని తత్త్వజ్ఞాన

మును ఏ పురుషుడు భక్తి శ్రద్ధలతో ఒక్కసారియైననూ శ్రవణము చేసినా గాని,యితరులకు చెప్పినాగాని,అతడు నాయందే చిత్తమును సమర్పించి నవాడై,వైరాగ్యసంపన్నుడై,నన్నే ఉపాసిస్తూ అంత్యమున నన్నే చేరుకొనును.ముక్తుడగునని తాత్పర్యము.

మరియు, శ్రీ యోగవాశిష్ఠము స్థితిప్రకరణము ముప్పది తొమ్మిదవ సర్గలో శ్రీవాల్మీకిమహర్షులవారు పరమ కరుణతో—ఇట్లు బోధించిరి. ఎవని బుద్ధి పరిపూర్ణముగా శాస్త్రాదిజన్య పరిజ్ఞానము లేనిదగునో,అటువంటి వానికి **"సర్వం ఖల్విదం బ్రహ్మ; బ్రహ్మైవేదం సర్వం "**(ఛాం.3-14-1; నృసింహో. 7-3)అను ఉపదేశము శోభించదు.ఎందుకనగా,అర్ధవ్యుత్పన్న పురుషునకు దృశ్యసంబంధమగు(భోగ)దృష్టియే ఉండును.గాన,అతనికి ఎల్లప్పుడూ దృశ్యభావనయే కలుగుచుండును.అందువల్ల,అతడు తత్త్వబోధ నుండి వంచితుడగును.(చ్యుతుడగును). 21.

కాని,తత్త్వబోధరూప పరమదృష్టిని పొందినవానికి వైషయిక స్పృహ ఉండదుగాన,అతనికి"ఇదంతయూబ్రహ్మమే"యను ఉపదేశము నిశ్చయముగా ఉపకరించును. 22.

ప్రశ్న:—అయితే,అర్ధవ్యుత్పన్న(శాస్త్రాదిజన్యపరిజ్ఞానము పరిపూర్ణముగాలేని అనగా ఆపాతజ్ఞానంగల)పురుషునకు ఏ విధముగా ఉపదేశము చేయాలి?

సమాధానము:—మొదలు శిష్యుణ్ణి శమదమాది గుణములచే విశుద్ధము చేయాలి.అనగా"త్వంపదార్థశోధన"గావించాలి.తదనంతరము శుద్ధమగు నీవు సర్వవ్యాపకమగు బ్రహ్మముచే నభిన్నుడువు"తత్త్వమసి"

(ఛాం.6-8-7)**"సర్వం ఖల్విదం బ్రహ్మ"**అని బోధించాలి.(యో.వా.4-39-23; మహో. 5-104)

**శ్లో॥అజ్ఞస్యార్ధప్రబుద్ధస్య సర్వం బ్రహ్మేతి యో వదేత్।**

**మహానరకజాలేషు స తేన వినియోజితః॥**

అజ్ఞానికిగాని లేక అర్ధప్రబుద్ధునికి(అనధికారికి)గాని"అంతయూ బ్రహ్మ **మే"**యని ఉపదేశించువాడు,ఆ అజ్ఞానిని మహానరకజాలములో పడద్రోసి న వాడగును. (యో.వా.4-39-24; మహో. 5- 105)

ఎవని బుద్ధి ప్రబుద్ధమైనదో,భోగేచ్ఛ క్షీణించినదో,ఆశలు(కామనలు) నశించినవో—అటువంటి మహాత్మునియందు అవిద్యారూపమలము ఉం డదు.అందువలన,అతనికి"తత్త్వమసి"(ఛాం.6-8-7)**"సర్వం ఖల్విదం బ్రహ్మ"** (ఛాం.3-14-1)అని ఉపదేశించుట ఉచితము. (యో.వా.4-39-25; మహో. 5-106)

**శ్లో॥అపరీక్ష్య యః శిష్యం ప్రశాస్యతి విమూఢధీః।**

**స ఏవ నరకం యాతి యావదాభూతసంప్లవమ్॥**

ఎవనికి తత్త్వజ్ఞానము కలుగలేదో(అతత్త్వజ్ఞాని),అతడు మరొక అనధి కారిని శిష్యునిగా జేసుకొని,వానిని పరీక్షించకుండగనే ఉపదేశించినచో,ఆ అతత్త్వజ్ఞాని—ఇతరులను మోసగించువాడు ప్రళయపర్యన్తము నరకము న బడును. 26.

శ్రీకృష్ణభగవంతుడు శ్రీఅర్జునుల వారికి సంపూర్ణ గీతా శాస్త్రమును బోధించిన మీదట బ్రహ్మవిద్యా సంప్రదాయ విధిని చెప్తూ:—

**శ్లో॥ఇదం తే నా తపస్కాయ నాభక్తాయ కదాచన।**

**న చాశుశ్రూషవే వాచ్యం న చ యోఽభ్యసూయతి ॥**(శ్రీమద్భగవద్గీత.18-67)

ఓ అర్జునా! సర్వజ్ఞుడను,పరమ ఆప్తుడను,పరమేశ్వరుడనగు నేను సర్వశాస్త్రములయొక్కరహస్యార్థరూప ఈగీతాశాస్త్రమును నీయొక్క జన్మ మరణరూప సంసారనివృత్తికొఱకు ఉపదేశించితిని.ఇటువంటి గీతాశాస్త్ర మును, శబ్దాది విషయములనుండి శ్రోత్రాది ఇంద్రియములను నిగ్రహింప లేని అతపస్కునకు ఎట్టి అవస్థలోనూ(ఎట్టి పరిస్థితిలోనూ,ఎటువంటి సంకటము ప్రాప్తించిననూ)ఉపదేశించ కూడదు.

ఏపురుషుడు ఇంద్రియనిగ్రహము గలవాడైననూ,బ్రహ్మ విద్యోపదేష్ట యగు గురువునందును,ఈశ్వరునియందునూ భక్తిలేనివాడగుచో—అటు వంటి అభక్తపురుషునికిగూడా ఈగీతాశాస్త్రమును ఎప్పుడుగూడా ఉపదే శించగూడదు.

ఏపురుషుడు ఇంద్రియనిగ్రహముగల్గియు,గురువునందు,ఈశ్వరుని యందునూ భక్తిగల్గియుండియూ గురువునకు యథోచిత సేవచేయనివా డగుచో—అటువంటి పురుషునికిగూడ ఈగీతాశాస్త్రమును ఎప్పుడుగూ డా ఉపదేశించగూడదు.

ఓ అర్జునా!ఏపురుషుడు ఇంద్రియనిగ్రహముగల్గి, గురువు మరియు ఈశ్వరునియందు భక్తిగల్గి యుండి,గురుశుశ్రూషా పరాయణుడైననూ, సర్వజ్ఞుడనూ,సర్వవ్యాపకుడనూ,సర్వస్వరూపుడనూ,వైషమ్య నైర్ఘృణ్యాది దోషరహితుడనూ—అగు నాపట్ల అసూయగలవాడగుచో—అటువంటి వాని కిగూడా ఈగీతాశాస్త్రమును ఉపదేశించగూడదు.అనగా,భగవాన్ వాసుదే వుడనగు నన్ను ఒక పరిచ్ఛిన్న దేహధారిగనూ,అల్పజ్ఞుడుగనూ,ఆత్మ

ప్రశంసాదిదోషములు గలవానిగనూ తలంచి,నాయొక్క ఈశ్వరత్వమును, ఉత్కృష్టతనూ సహింపజాలనివాడై నన్ను ద్వేషించునో—అటువంటి పురుషునికి ఈ గీతాశాస్త్రమును బోధించగూడదు.

శ్లోకంలోని'కదాచిత్'అను పదమును అతపస్కునికి, అభక్తునికి, సేవ చేయనివానికి మరియు అసూయపరునికి—సర్వత్ర సంబంధమును తెలియవలెను.ఈగీతాశాస్త్రమును ఎవరికి ఉపదేశించవలెననగా,ఏపురుషుడు మనస్సుతోపాటు శ్రోత్రాది సకలఇంద్రియనిగ్రహరూప తపస్సుగలవాడో,గురువు మరియు ఈశ్వరునియందు అవ్యభిచారియగు భక్తిగలవాడో,గురుసేవారూప శుశ్రూషాపరాయణుడో మరియు పరమేశ్వరుడనగు నాయందు అనురాగము గలవాడో—అటువంటివానికి సంసార తారకమగు యీ గీతాశాస్త్రమును ఉపదేశించవలెను.ఒక్కొక్క విశేషణము లేకున్నాగూడ గీతాశాస్త్రోపదేశము చేయుటకు అర్హుడు కాదు—అని చెప్పుటకే శ్లోకంలో నాల్గుసార్లు 'న' కారము ప్రయోగించబడినది.

ఋగ్వేద సంహితా భాష్యారంభమున ఉపోద్ఘాత ప్రకరణములో శ్రీసాయణాచార్యులవారు ఇట్లు చెప్పియున్నారు.అధికారి పురుషునికే బ్రహ్మవిద్యను ఉపదేశించాలి,అన్యులకు కాదు.ఎవడు విధిపూర్వకముగా వేదవేదాంగములను అధ్యయనముచేసి ఆపాత(ప్రాథమిక)వేదార్థజ్ఞానమును పొందలేదో,విషయాభిముఖ ప్రవృత్తిగల అనాత్మజ్ఞుడో,వైరాగ్యము లేనివాడో,చిత్తశుద్ధి-వినయము లేనివాడో,అట్టివానికి బ్రహ్మవిద్యోపదేశము చేయగూడదు.ఇంకా,సప్రమాణపూర్వకముగా శ్రీసాయణాచార్యులవారు ఈ క్రింది విధంగా అనుగ్రహించిరి.

**విద్యా హ వై బ్రాహ్మణమాజగామ గోపాయ మాం శేవధిష్టేఽహమస్మి।**

**అసూయకాయానృజవేఽతాయ మా మా బ్రూయా వీర్యవతీ తథా స్యామ్॥**

**యమేవ విద్యాశుచిమప్రమత్తం, మేధావినం బ్రహ్మచర్యోపపన్నమ్।**

**అస్మా ఇమాముపసన్నాయ సమ్యక్,పరీక్ష్య దద్యాద్వైష్ణవీమాత్మనిష్ఠామ్॥"**

(శాట్యాయనీయోపనిషత్)

**"విద్యాభిమానినీదేవతా బ్రాహ్మణముపదేష్టారమాచార్యమాజగామ।అగత్య చైవం ప్రార్థయామాస"**శిష్యులకు ఉపదేశించు ఆచార్యుడగు బ్రాహ్మణని వద్దకు విద్యాభిమానిదేవతవచ్చి ఈవిధంగా ప్రార్థించినదాయెను.ఓ బ్రాహ్మణోత్తమా!పురుషార్థ హేతువగు నేను నిన్ను నిధివలె నాశ్రయించితిని.అట్టి నన్ను అనధికారికి ఉపదేశించక రక్షింపుము.ఎవడు నిర్మలమైన అంతఃకరణముగలవాడో,అభిమానశూన్యుడో,ఆత్మతత్త్వమును తెలుసికొనుటకు జాగరూకుడైయున్నాడో,సూక్షాతి సూక్ష్మమగు ఆత్మయాథాత్మ్యమును తెలుసికోగల సూక్ష్మబుద్ధిగల మేధావియో,ఎవడు కఠరుద్రోపనిషత్ 5, 6, 7లో చెప్పబడిన అష్టవిధమైథునమునకు విపరీతమగు బ్రహ్మచర్యము గలవాడో,ఎవడు విధిపూర్వకముగా గురుసమీపమునకేతెంచి,శరణుబొంది,ఉపయుక్తమగు సేవజేసి గురువును ప్రసన్నునిగాజేసికొని,వినమ్రుడై బ్రహ్మతత్త్వజిజ్ఞాసువై పరిప్రశ్నలుజేయునో—అటువంటి అధికారిని పరీక్షించి(అతని యోగ్యతను విచారించి)వైష్ణవీ విద్యను(బ్రహ్మవిద్యను)ఉపదేశించవలెను

మోక్షహేతువునగు నాయందు, ఉపదేష్టవగు నీయందు ఎవనికి శ్రద్ధ, ఆదరభావములేదో,ఎవడు అసూయగలవాడో,ఆర్జవము(సరళ స్వభావ

ము)లేనివాడో,ఇంద్రియ మనంబులను జయించలేని మూర్ఖుడో,ఎవడు స్నానాచమనాది ఆచారనియమహీనుడో,అటువంటి శిష్యాభాసులకు(శిష్యునివలె మాత్రము కన్పట్టువారలకు)నన్ను ఉపదేశింపకుము.ఇట్లు, అనధికారులకు బోధించక నన్ను రక్షించినపుడే,నేను నీ హృదయమున స్థిరపడి ఫలము నిచ్చుదాననగుదును.

**య ఆతృణత్యవితథేన కర్ణావదుఃఖం కుర్వన్నమృతం సంప్రయచ్ఛన్।**

**తం మన్యేత పితరం మాతరం చ తస్మై న ద్రుహ్యేత్కతమచ్చనాహ॥**

(సంహితోపనిషత్.3-6)

ఇట్లు ఆచార్యునికి నియమము చెప్పిన పిదప,ఇప్పుడు శిష్యునికి నియమము చెప్పబడుచున్నది.దేవత్వమును లేక మోక్షమును ప్రసాదించు=అమృతస్వరూపమగు సత్యవాణి(అవితథవాణి)యగు వేదవాక్యములను,శిష్యులయొక్క యోగ్యతానుసారము,వారికి ఆయాసము(దుఃఖము)కలుగని విధముగా,మందప్రజ్ఞులగు బ్రహ్మచారులకు ఒక ఋక్కునుగాని,అర్ధ ఋక్కునుగాని,అదియునుగూడ ధారణ చేసికోలేని అతి మందప్రజ్ఞులకు ఒక పాదముగాని,పాదైక దేశమునుగాని వినిపించి(అధ్యయనము చేయించి), వారిని ఉద్ధరించుటయే ముఖ్యకర్మగా భావించి, అమృతత్వ మార్గమును చూపించు ఆచార్యుణ్ణి,నిజమైన సచ్ఛిష్యుడు తనకు ముఖ్యమగు తల్లిదండ్రులుగా భావించవలెను.పూర్వసిద్ధ జన్మదాతలగు మాతాపితరులు నికృష్టమగు మనుష్యశరీరమును ప్రధానము చేసినందున అముఖ్య తల్లిదండ్రులగుదురు.కావున,ముఖ్యమగు మాతాపితృరూప ఆచార్యునికి ఎప్పుడునూ,ఎక్కడనూ,ఏవిధమైన ద్రోహము చేయకూడదు.

**అధ్యాపితా యే గురుం నాద్రియన్తే విప్రా వాచా మనసా కర్మణా వా।**

**యథైవ తే న గురోర్భోజనీయాస్తథైవ తాన్న భునక్తి శ్రుతం తత్॥**(శాట్యా)

గురువుయొక్క ముఖారవిందముద్వారా విద్యాభ్యాసము(వేదాధ్యయనము)చేసియునూ,వినయోక్తులచే గురువుయొక్క హితచింతన పూర్వకముగా గురుశుశ్రూషచేత గురువును ఆదరించని శిష్యాభాసులగు అధమ విప్రులు,గురువునకు భోజనము ఈయదగినవారు కారు.అనుభవ యోగ్యులు కానివారియందు గురువు కృపనుజూపడు.అనగా గురుదేవుని కృపకు పాత్రులు కారు.ఎట్లు వారు గురువుచే రక్షింపదగినవారు కారో, అట్లే,ఆ అధమ శిష్యులను గురువుచే ఉపదిష్టమైన వేదవాక్యములు గూడ రక్షింపవు. ఫలప్రదములు కావు—అని భావము."**ధర్మ ఏవ హితో హన్తి, ధర్మో రక్షతి రక్షితః**"(మనుస్మృతి.8-15)అను నియమము అనువర్తించును.

**యస్తే న ద్రుహ్యేత్కతమచ్చనాహ తస్మై మా బ్రూయా నిధిపాయ బ్రహ్మన్॥**

(శాట్యా)

కావున,భో ఆచార్య!ఎవనిని శుచిత్వాదిగుణయుక్తమగు ముఖ్యశిష్యుడని భావించెదవో,ఎవడు బ్రహ్మచర్యాది సద్గుణసంపన్నుడై విధపూర్వకముగా నిన్ను శరణుజొచ్చునో,ఎవడు అతిసూక్ష్మమైన బ్రహ్మతత్త్వమును గ్రహించగల కుశాగ్రబుద్ధిగల్గియుండునో,ఎవడు ఉపదేష్టవగు నిన్ను,విద్యానిధిరూప నన్ను అనాదరించడో,ద్రోహము తలపెట్టడో, అటువంటి నీ విద్యానిధిని పరిపాలించు ముఖ్య(అధికారియగు)శిష్యునికే, బ్రహ్మన్= వేదవిద్యానిధిరూప నన్ను—ఉపదేశింపుము.

**గురురేవ పరో ధర్మో గురురేవ పరా గతిః।**

**ఏకాక్షరప్రదాతారం యో గురుం నాభినన్దతి।**

**తస్య శ్రుతం తథా జ్ఞానం స్రవత్యామఘటామ్బువత్॥**(శాట్యా)

**"ధర్మో విశ్వస్యజగతః ప్రతిష్ఠా,ధర్మే సర్వం ప్రతిష్ఠితమ్"**(మహానారాయణోపనిషత్)సమస్తజగత్తుకు ధర్మమే ఆధారము,అధిష్ఠానం.ఆ జగదధిష్ఠానము పరబ్రహ్మమే. బ్రహ్మమునెఱిగినవాడు బ్రహ్మవిత్ అనబడును. **"బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి"**(ముం.3-2-9)బ్రహ్మవేత్త బ్రహ్మమే యగుచున్నాడని శ్రుతివాక్యము.కావున బ్రహ్మస్వరూపుడగు శ్రీ గురుదేవులే ధర్మము యొక్క పరాకాష్ట,పరమగతియగును.అట్టి శ్రీగురుదేవుడు తన ముఖారవిందమునుండి"ఓమిత్యేకాక్షరంబ్రహ్మ"(ధ్యా.బిం.9;గీత.8-13)అను శ్రుతిస్మృతి ప్రసిద్ధమగు బ్రహ్మస్వరూప ఏకాక్షరమైనను బోధించినాగాని,శిష్యునిచే అతడు జీవితాంతం పూజింపదగినవాడగును.అట్లుండగా,ఒకవేళ శిష్యుడు సద్గురువును ఆదరించనిచో అతడు కృతఘ్నుడనబడును.తాను గురువుద్వారా విన్నది,తెలిసికున్నది-సంపూర్ణ జ్ఞానం పచ్చికుండలో పోసిన నీటివలె నిరర్థకము కాగలదు.

ఈప్రకారముగా విద్యాదేవతచే ప్రార్థింపబడినందున ఆచార్యుడైనవాడు ముఖ్యశిష్యునికే వేదవిద్యోపదేశము చేయాలి—అను నియమమును వేదమే విధించినది.

విద్యాసంప్రదాయ విషయంలో మనుస్మృతి ఈక్రిందివిధంగా చెప్పుచున్నది.

**శ్లో॥నా పృష్టః కస్యచిద్బ్రూయాన్నచాన్యాయేన పృచ్ఛతః।**

**జానన్నపి హి మేధావీ జడవల్లోమాచరేత్॥**(సన్యాసోపనిషతు 2-102)

**శ్లో॥అధర్మేణ చ యః ప్రాహ యశ్చాధర్మేణ పృచ్ఛతి ।**

**తయోరన్యతరః ప్రైతి విద్వేషం వాధిగచ్ఛతి॥**

**శ్లో॥ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషా వాపి తద్విధా।**

**తత్ర విద్యా న వక్తవ్యా శుభం బీజమివోషరే ॥**(మనుస్మృతి. 2-110,111,112.)

అడగకుండా ఎవరికీ జ్ఞానమును(విద్యను)బోధించగూడదు.అన్యాయముగా(కపటభావముతో)అడిగినవాడికినీ ఉపదేశించగూడదు. అటువంటి సందర్భములలో సర్వము తెలిసినవాడైననూ ఏమి తెలియని వానివలె ఉండవలెను.ఎందుకంటే,అధర్మముగా అడిగినవాడైననూ,సమాధానము చెప్పినవాడైననూ—ఇద్దరిలో ఎవరో ఒకరు మరణింతురు.లేదా వారిద్దరిలో పరస్పరము విద్వేషమైనా కలుగుతుంది.ఎవరికి విద్యను బోధించినచో ధర్మముగాని,ధనముగాని మరియు సేవగాని లభించదో, అటువంటి వానికి విద్యను బోధించినచో—ఉషర(ఎడారి)భూమిలో మంచివిత్తనములు నాటినచో ఎట్లు నిష్ఫలములగునో, అట్లు వ్యర్థమై పోవును.

ఉపరోక్త శాస్త్రనియమములను దృష్టిలో ఉంచుకొని శ్రీ శంకర దేశికులు ఉపదేశసహస్రి పార్థివ ప్రకరణము డెబ్బదిరెండవ శ్లోకములో ఇట్లు సెలవిచ్చియున్నారు.

**శ్లో॥ప్రశాన్తచిత్తాయ జితేన్ద్రియాయ ప్రహీనదోషాయ యథోక్తకారిణే ।**

**గుణాన్వితాయానుగతాయ సర్వదా ప్రదేయమేతత్సతతం (సకలం) ముముక్షవే ॥**

ఎవని చిత్తము శాంతించినదో=ఇహపరభోగములనుండి ఉపశమించినదో,ఎవడు తన సకలేంద్రియములపై విజయమును పొందినాడో,ఎవని

మనోగత రాగద్వేషాది సమస్తదోషములు ఉపక్షీణమైనవో,గురుశాస్త్రముల ఆదేశానుసారము ప్రవర్తించునో(ఆచరించునో),శాస్త్రములో చెప్పబడిన ఆ-త్మజ్ఞానమునకు ఆవశ్యకమైన గుణములు వినమ్రత,కరుణ మొదలైన వాటితో యుక్తుడైయుండునో,ఎల్లప్పుడూ శ్రీగురుదేవుని అనుసరిస్తూ,అ-తని అడుగుజాడలలో నడుచుకొనువాడై,గురుశుశ్రూషాతత్పరుడై,ఉత్క టమగు మోక్షేచ్ఛగలవాడైయుండునో—అటువంటివానికి సమస్తవేదాన్త రహస్యములను,బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానమును(బ్రహ్మవిద్యను)ఉపదేశించ వలెను.కాని,అయోగ్యులగు అనధికారులకు బోధించగూడదు.ఇది శాస్త్ర ముయొక్క శాసనము—ఆదేశము.

సంసారదుఃఖమువలన భయకంపితుడై శరణుజొచ్చిన శిష్యునికి మొదట గురుదేవుడు అభయప్రదానము చేయవలసిన కర్తవ్యమును పూర్వము తెలిసికుంటూ వచ్చాము.ఆ తరువాత శిష్యుణ్ణి తన సాన్నిధ్య ములో గాయత్ర్యాది జపము,అగ్నిహోత్రాదికర్మలు,యథోచిత పరిచర్యలు, దైవోపాసనరూప అనుష్టానములు మున్నగునవిచేయించి,ఆధ్యాత్మ విద్య కు కావలసిన అంతఃకరణశుద్ధి,చిత్తైకాగ్రత మరియు శమాది సాధనాల ప్రాప్తి-ఇత్యాదులు కలుగజేసి,శిష్యుణ్ణి యోగ్యునిగా తీర్చిదిద్దాలి.పిమ్మట అతని యోగ్యతను పరీక్షించి,ఆపైన పైనవివరించిన శ్రుతిస్మృతులలో చెప్పబడిన అధికారియై తనను ఆశ్రయించిన మోక్షార్థియగు శిష్యునికి అవశ్యముగా బ్రహ్మవిద్యను ఉపదేశించవలెను—ఇట్టి విధిననుసరించి, సద్గురువు తన కర్తవ్యముగా భావించి,శిష్యునికి మోక్షసాధనమగు బ్రహ్మా త్మైకత్వ ప్రతిపాదక మహావాక్యోపదేశమును చేయవలయును.

ఓ పండితుడా!నీవు మృత్యుభయమును విడువుము.వాస్తవంగా

విచారించినచో నీవు సత్యజ్ఞానానన్ద బ్రహ్మస్వరూపుడవు.ఇట్టి నీకు మరణమెన్నటికిని సంభవింపనేరదు.నీవు భ్రాన్తిచే దేహేన్ద్రియ సంఘాతమును నీ స్వరూపంగా భావించుకొని దేహధర్మమగు మరణము 'నాకు' గలదని విపరీతంగాఆరోపించుకొనుచున్నావు.నిద్రించువానికలవరింతవలె **నన్ను మృత్యువునుండి కాపాడుమా!**అను నీ వాక్యము అసత్యమేయగును.

నిద్రాదోషముచే ఆవరింపబడినవాడై సర్పము మొదలగు క్రూరజంతువులు తనను పీడించుచున్నటుల స్వప్నమునుజూచి"అయ్యో!మరణించితిని,ఇక బ్రతుకను,ప్రాణములు పోవుచున్నవి.నన్ను రక్షించువారెవరు?"అని బిగ్గరగా కేకలుపెట్టును.ప్రక్కనే పడుకున్న తండ్రి మున్నగువారు అతనిని చేతితో తట్టి మేల్కొలిపి"ఏమిరా?అబ్బాయి!ఏదో పలుకుచున్నావు,కలవరించుచున్నావు?"అనియడుగగా ఏమియు లేదని చెప్పును.వాని స్వప్నవాక్యములన్నియు అర్థరహితములే యగుచున్నవిగదా!

ఒకడు మందాంధకారములో తాడుయొక్క నిజరూపమును తెలియక సర్పమని భ్రమజెంది"పాము పాము పాము"అని బిగ్గరగా అఱచుచూ భయముతో గడగడ వణకుచుండెను.ఇంతలో ఒక ఆప్తుడు,ధైర్యవంతుడు దీపము తీసుకుని వచ్చి ఆ పాము దగ్గరకు వెళ్ళి చూసి, ఏమిరా?పాము పాము అని కేకలువేయుచుంటివి.ఇది పాము కాదురా తాడు.అని యథార్థమును తెలుపగా,భ్రాన్తపురుషునియొక్క ఆక్రందనాదికమంతయును భ్రమమాత్రముగానే మిగులుచున్నది.

నిద్రయందు కలగనినవాని వచనములవలెను,తాడునుజూచి పామని భ్రమపడినవాని మాటలవలెను,నీవు"ఆత్మకు జననమరణాది సంసార



రజ్జుసర్పసంగతి పుట. 215

భ్రాన్త్యాప్రతీతః సంసారో వివేకాన్నతు కర్మభిః।

నహి రజ్జురగారోపో ఘంటాఘోషాన్నివర్తతే॥



రజ్జుసర్పసంగతి. పుట. 216

దుఃఖము గలదని"చెప్పినదంతయు అజ్ఞానవిలాసమే యగుచున్నది. కావున నీవు ఆత్మయాథాత్మ్యమును బాగుగా విచారించి భయమును పరిత్యజింపుము.

నీవు అనిత్యములగు దేహాదులయొక్క జన్మమరణాది ధర్మముల ను అజ,అజర,అమరమగు ఆత్మయందు ఆరోపించుకొని"నేను జన్మమ రణములుగలవాడ"నని దుఃఖించుచున్నావు.ఇదంతయు అజ్ఞానవిలా సము(కార్యము)గావున,ఇట్టి భయమును వీడి నీ స్వరూపానందమును అనుభవింపుము.

**శ్లో॥అజ్ఞానయోగాత్పరమాత్మనస్తవ హ్యనాత్మబన్ధస్తత ఏవ సంసృతిః।**

**తయోర్వివేకోదిత బోధవహ్నిరజ్ఞానకార్యం ప్రదహేత్సమూలమ్॥**(వి.చూ.49)

పరమాత్మవేయగు నీకు,అజ్ఞానయోగాత్=అనాదియైన అవిద్యా సంబ న్ధమువలన,అనాత్మబన్ధః=అనాత్మలగు స్థూలసూక్ష్మ కారణశరీరములం దు ఆత్మత్వబుద్ధి,దానివల్లనే జన్మము వృద్ధాప్యము మరణము సుఖము దుఃఖము జడత్వము మొదలగు ధర్మముల అధ్యాసరూపమగు సంసా రము.ఆ ఆత్మానాత్మల-వివేకము అనగా భేదజ్ఞానము,దానివలన గల్గు, బోధవహ్ని అనగా సాక్షాత్కారరూప అగ్ని,సమూలం=అజ్ఞనరూపమగు బీ జముతో గూడినదియు,అజ్ఞానజనితమును అగు అహంకారం మొదలుకొ ని దేహమువరకునుగల బంధమును,దానివలన గల్గిన జన్మమరణాది రూప సంసారమును,ప్రదహేత్=పూర్తిగా భస్మముచేయును.ఈవిధము గా సంసారమునకు కారణము అనాత్మబంధము,దానికి కారణము నీకు గల అజ్ఞానసంబంధము.అది నివర్తించుటకు ఉపాయము పరమాత్మ జ్ఞా

నము;దానికి కారణము ఆత్మానాత్మవివేకము—అని చెప్పినట్లయినది. అజ్ఞానమువలన గల్గిన బంధమునుండి విముక్తి గావలెనన్నచో జ్ఞానము తప్ప మరియే ఉపాయమునులేదు.కావున వేదాన్తవిచారమువలన గల్గు ఉత్తమజ్ఞానము సంసారదుఃఖనాశకమనుటలో ఉపపత్తి చూపబడినది.

ఇట్లు,తనను శరణుజొచ్చిన వానికి ప్రథమమున అభయప్రదానము జేయుట గురువుయొక్క కర్తవ్యముగాన,ఇంతదనుక భయనివృత్తిని జేస్తూ ఇంచుక ఊరట గల్గించుటకొఱకు సామాన్యరీతిగా గురువుగారు శిష్యునికి,సంసారహేతువు స్వరూపావరక అజ్ఞానమును,దాని నివృత్త్యు పాయము(జ్ఞానము)ను,దానికి కారణమగు ఆత్మానాత్మవివేకమును (విచారమును)సంగ్రహముగా నామమాత్రంగా బోధించిరి.

## —:51.పరిప్రశ్న:—

ఇట్లు శ్రీగురుదేవులు బోధించగా—నపుడు శిష్యడు చక్కటి వివేకము గలవాడు గావున,వినమ్రుడై విచారపూర్వకముగా పరిప్రశ్నలు చేయుచున్నాడు.

హే గురువర్యా!తమరు ఆత్మకు జన్మమరణాది దుఃఖము లేదని, అది కేవలం అజ్ఞానకల్పిత మిథ్యాఆరోపణ మాత్రమేయని సెలవిచ్చి, దానిని సమర్థించుటకై రెండు దృష్టాంతములను చూపితిరి.స్వప్నంలో కనుపించు సర్ప వ్యాఘ్రాది దుష్ట జంతువులు,కలగన్న వానికి మాత్రమే కనుపించును.ఇతరులకు అగుపడవు.కావున అతని వచనములన్ని యు భ్రాన్తిసిద్ధములనుటలో సంశయము లేదు.అట్లే తాడును జూచి పాము అని భ్రమజెందిన వానికి మాత్రమే భయము గల్గును,కాని ఇత రులకు కలుగనేరదు.కావున అతని ఆక్రందనాదికమంతయు అయథా

ర్థమనుట యథార్థము.ఇక ఆత్మకుగల జననమరణాది దుఃఖమన్ననో సకల ప్రాణులకు అనుభవసిద్ధమై యున్నది.ఈ విషయంలో యెవరికినీ భేదాభిప్రాయము లేదు.కావున,ఇట్టి దుఃఖమంతయు మిథ్యయనుట మందప్రజ్ఞుడనగు నాకు అసమంజసముగ తోచుచున్నది.

**శ్లో।।ప్రత్యక్షేణానుభూతార్థః కథం మిథ్యాత్వమర్హతి।**

**చక్షుషోవిషయం కుంభం కథం మిథ్యా కరోమ్యహమ్।।**

**శ్లో।।విద్యమానస్య మిథ్యాత్వం కథం ను ఘటతే ప్రభో!**

**ప్రత్యక్షం ఖలు సర్వేషాం ప్రమాణం ప్రస్ఫుటార్థకమ్।।**(స.వే.సి.సా.సం.271&72)

స్వామీ!లోకంలోప్రత్యక్షము,అనుమానము,ఉపమానము,శబ్దము, అర్థాపత్తి మరియు అనుపలబ్ధి—అను షట్ప్రమాణములు సుప్రసిద్ధములు.వాటన్నిటిలో ప్రత్యక్షము ప్రబలమైనదిగదా!అలాంటపుడు,ప్రత్యక్షగోచరములగు విషయములన్నియు అసత్యములనుట కడువిచిత్రముగనున్నది.

**శ్లో।।మర్త్యస్య మమ జన్మాది దుఃఖభాజోఽల్పజీవినః।**

**బ్రహ్మత్వమపి నిత్యత్వం పరమానన్దతా కథమ్।।**

**శ్లో।।క ఆత్మా కస్త్వనాత్మా చ కిము లక్షణమేతయోః।**

**ఆత్మన్యనాత్మధర్మాణాం ఆరోపః క్రియతే కథమ్।।**

**శ్లో।।కిమజ్ఞానం తదుత్పన్న భయత్యాగోఽపి వా కథమ్।**

**కిము జ్ఞానం తదుత్పన్న సుఖప్రాప్తిశ్చ వా కథమ్।।**

**శ్లో।।సర్వమేతద్యథా పూర్వం కరామలకవత్స్ఫుటమ్।**

**ప్రతిపాదయ మే స్వామిన్! శ్రీగురో! కరణానిధే! ॥**

(స.వే.సి.సా.సం.273 నుండి 276)

హే గురుదేవా!జన్మజరామరణాది దుఃఖములననుభవించుచున్నట్టి యు,స్వల్పకాలము మాత్రము జీవించునట్టియు నేను, సత్యజ్ఞానానంద బ్రహ్మస్వర పుడనెట్లగుదును?మరియు ఆత్మ అనగా యేమి?అనాత్మ అనగా యేమి?ఆత్మ మరియు అనాత్మలయొక్క ప్రత్యేక లక్షణములేవి? ఆత్మయందు దేహేన్ద్రియాదులు,వాని ధర్మములు ఎట్లారోపింపబడుచు న్నవి?అజ్ఞానమనగా నేమి?తజ్జన్య దుఃఖమును వదలుటెట్లు?జ్ఞానమ నగా నేమి?దానివలన సుఖమెట్లు గల్గును?ఈవిషయములన్నిటిని చే- తిలోని ఉసిరికాయవలె విస్పష్టముగ తెలియగోరుచున్నాను.కావున మీ- రు నాపై కరుణామృతవర్షమును కురిపించి నా సంశయములన్నిటిని నివర్తింపజేసి నన్నునుగ్రహింప ప్రార్థన.

శ్లో॥శుష్కవేదాన్తదన్తీశ బృన్దసన్తాపకేసరి।
అసజ్ఞానన్దయోగీన్ద్రో గురుర్విజయతేతరామ్॥

శ్లో॥అతీతవైరాగ్యమఖణ్డబోధ,కదాను మే సిద్ధ్యతి హే దయళో।
సమాధియోగస్య పరస్య నిష్ఠా,సర్వేషు భూతేషు సమత్వబుద్ధిః॥

**—:గురుప్రసన్నతా,ఉపదేశవిషయే ఆశ్వాసః:—**

**శ్లో॥ధన్యః కృతార్థస్త్వమహో వివేకీ, శివప్రసాదస్త్వయి విద్యతే మహాన్।**
**విసృజ్య తు ప్రాకృత లోకమార్గం, బ్రహ్మోపగన్తుం యతసే యతస్త్వమ్॥**

(స.వే.సి.సా.సం.277)

నాయనా!నీవు మిక్కిలి ధన్యుడవు.నీ జన్మము సఫలమైనది.సామాన్యజనులందరు తుచ్ఛమైన సాంసారిక విషయాలయందే ప్రాకులాడుచుందురు.నీవుమాత్రము అలాగాక బ్రహ్మసాక్షాత్కారముకొఱకు సర్వస్వమును పరిత్యజించి ఆత్మానుభూతికై పరితపించుచుంటివి.ప్రయత్నము చేయుచుంటివి.దీనిచే పరమేశ్వరానుగ్రహము నీయందు సంపూర్ణముగా గలదని స్పష్టమగుచున్నది. ధన్యో ఽసి వత్స! ధన్యోఽసి!

లోకంలో శివానుగ్రహములేనిదే,తలచిన కార్యము నెరవేరదు.మోక్షముకొఱకు ప్రయత్నింపవలెనని బుద్ధిపుట్టదు.వేదాన్తశ్రవణము చేయుటకు ఇచ్ఛయే జనించదు.ముక్తిమాట బొత్తిలకే లేదు.ఇట్టియెడ సకల సద్గుణసంపన్నుడవగు నీయందు శివానుగ్రహము కలదనుటలో సందియము లేదు.

పరమేశ్వరుని అనుగ్రహముచేతనే శ్రీశుకుడు,నారదుడు,జనకుడు మొదలగు వారెందరో మహానుభావులు సంసారసాగరమును తరించియున్నారు.అనేక జన్మములందు పరమభక్తితో పరమేశ్వరుని ఆరాధించిననే గాని మోక్షదాయకమగు భగవదనుగ్రహము కలుగనేరదు. ప్రసంగవశమున భగవదనుగ్రహమునకు పాత్రులై పరమపదసోపానమును అధిరోహించిన ప్రహ్లాదాది పరమభాగవతోత్తములను స్మరించినచో మన జన్మ ధన్యమగునుగదా!

**శ్లో॥ప్రహ్లాద నారద పరాశర పుణ్డరీక**

**వ్యాసామ్బరీష శుకశౌనక భీష్మ దాల్భ్యాన్।**

**రుక్మాఙ్గదార్జున వసిష్ఠ విభీషణాదీన్**

**పుణ్యానిమాన్పరమభాగవతాన్ స్మరామి॥**

అర్థం స్పష్టమ్.

మానవులకు బహుజన్మ సుకృతవశమున గలిగిన భగవదనుగ్రహ మువల్లనే ఆత్మానాత్మ వివేకము ఏొడముచున్నది.**"ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైత వాసనా"**(అవ.గీ).అట్లు గలిగిన వివేకమువల్లనే నీవు ముక్తి కొఱకు ప్రయత్నించుచుంటివి.మోక్షముకొఱకు ప్రయత్నించుటయే వివేక ముయొక్క పరమప్రయోజనము.

మనుష్యుడు తాను పురుషుడుగాను,బ్రాహ్మణుడుగాను జన్మించుట కు పరమప్రయోజనము ప్రత్యగభిన్నపరమాత్మ యాథాత్మ్యజ్ఞానమును ఏొందటయే.మోక్షముకొఱకు ప్రయత్నించుటయే.కావున,అట్లు చేయకు న్నచో సర్వసాధనలు,ప్రయత్నములు నిష్ఫలమే యగుచున్నవి.

**శ్లో॥ప్రశ్నస్సమీచీన తరస్తవాయం యదాత్మ తత్త్వావగమే ప్రవృత్తిః।**

**తతస్తవైతత్సకలం సమూలం నివేదయిష్యామి ముదాశృణుష్వ॥**

(స.వే.సి.సా.సం.282)

నాయనా! నీయొక్క ప్రశ్న చాలా ఉత్కృష్టమైనది. నా హృదయము ప్రపుల్లితమైనది.చాలా ఆనందము కలుగుచున్నది.నీవు ఆత్మస్వరూప మును తెలిసికొనుటకు అత్యంత ఆసక్తుడవైయున్నావు.కావున ఆత్మ తత్త్వమంతయు సయుక్తికము,సప్రమాణపూర్వకము మరియు అనుభ వానుసారముగా నీకు బోధించెదను. ప్రసన్నచిత్తుడవై శ్రద్ధతో వినుము.

**శ్లో॥యస్య ప్రసాదాదహమేవ సర్వం,మయ్యేవ సర్వం పరికల్పితం చ।**

**ఇత్థం విజానామి సదాత్మరూపం, తస్యాంఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్॥**



**శుక్లాం బ్రహ్మవిచారసారపరమామాద్యాం జగద్వ్యాపినీం,**

**వీణా పుస్తకధారిణీమభయదాం జాడ్యాన్ధకారాపహామ్॥**

**హస్తేస్ఫాటికమాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం,**

**వన్దే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదామ్॥**

**శ్లో॥యదత్ర సౌష్టవం కిఞ్చిత్తద్గురోరేవ మే నహి।**

**యదత్రాసౌష్టవం కిఞ్చిత్తన్మమైవ గురోర్నహి॥**

ఇతి *అనుబంధ చతుష్టయము* అనబడు *అద్వైత వేదన్త భూమిక* సమాప్తమ్।

॥ఇతి శమ్॥

ఓం

## —:శ్రీ సద్గురుపాదుకాస్తవము:—

శ్రీ సమంచితమవ్యయం పరమప్రకాశమగోచరం

భేదవర్జిత మప్రమేయ మనన్తమాద్యమకల్మషమ్।

నిర్మలం నిగమాన్తమద్వయమప్రతర్క్యమబోధకం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥1॥

నాదబిన్దుకళాత్మకం దశనాదభేద వినోదకం

మంత్రరాజవిరాజితం నిజమణ్డలాన్తర్భాసితమ్।

పంచవర్ణమఖణ్డమద్భుత మాదికారణమచ్యుతం

ప్రాతరేవహి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥2॥

వ్యోమవద్బహిర న్తరస్థిత మక్షరం నిఖిలాత్మకం

కేవలం పరిశుద్ధమేకమజన్మ హి ప్రతిరూపకమ్।

బ్రహ్మతత్త్వ వినిశ్చయం నిరతానుమోక్షసుబోధకం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥3॥

బుద్ధిరూపమబుద్ధికం త్రితయైకకూటనివాసినం

నిశ్చలం నిరతప్రకాశక నిర్మలం నిజమూలకమ్।

పశ్చిమాన్తరఖేలనం నిజశుద్ధసంయమిగోచరం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥4॥

హృద్గతం విమలం మనోజ్ఞవిభాసితం పరమాణుకం

నీలమధ్య సునీలసన్నిభమాదిబిన్దునిజాంశుకమ్।

సూక్ష్మకర్ణికమధ్యమస్థిత విద్యుదాది విభాసితం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురు పాదుకామ్॥5॥

పంచపంచహృషీకదేహమనశ్చతుష్కపరస్పరం

పంచభూతసకామషట్కసమీరశబ్దముఖేతరమ్।

పంచకోశ గుణత్రయాది సమస్తధర్మ విలక్షణం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥6॥

పంచముద్రసులక్ష్యదర్శనభావమాత్రనిరూపణం

విద్యుదాది ధగద్ధగిత్వరుచిర్వినోద వివర్ధనమ్।

చిన్ముఖాన్తరవర్తినం విలసద్విలాసమమాయకం

ప్రాతరేవ హిమానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥7॥

పంచవర్ణ శుచిర్విచిత్ర విశుద్ధతత్త్వ విచారణం

చంద్రసూర్యచిదగ్ని మణ్డలమణ్డితం ఘునచిన్మయమ్।

చిత్కళాపరిపూర్ణమన్తర చిత్సమాధినిరీక్షణం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥8॥

హంసచార మఖణ్డనాద మనేకవర్ణమరూపకం

శబ్దజాలమయం చరాచరజన్తుదేహనివాసినమ్।

చక్రరాజమనాహతోద్భవమేకవర్ణమతః పరం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥9॥

జన్మకర్మ విలీనకారణ హేతుభూతమభూతకం

జన్మకర్మనివారకం రుచిపూరకం భవతారకమ్।

నామరూపవివర్జితం నిజనాయకం శుభదాయకం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥10॥

తప్తకాంచనదీప్యమాన మహాణుమాత్రమరూపకం

చన్ద్రికాన్తరతారకై రివముజ్జ్వలం పరమాస్పదమ్।

నీలనీరదమధ్యమస్థితవిద్యుదాది విభాసితం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥11॥

స్థూలసూక్ష్మ సకారణాన్తరఖేలనం పరిపాలనం

విశ్వతైజసప్రాజ్ఞచేతసమన్తరాత్మ నిజాంశుకమ్।

సర్వకారణమీశ్వరం నిటలాన్తరాళవిహారకం

ప్రాతరేవ హి మానసాన్తర్భావయేద్గురుపాదుకామ్॥12॥

॥ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచిత శ్రీ సద్గురుపాదుకాస్తవ స్సంపూర్ణః॥

ఓం

శ్రీ లక్ష్మీధరకవి విరచిత

**శ్రీ అద్వైత మకరన్దః**

శ్లో॥కటాక్షకిరణాచాన్త నమన్మోహాబ్ధయే నమః।

అనన్తానన్ద కృష్ణాయ జగన్మఙ్గళమూర్తయే॥1॥

శ్లో॥అహమస్మి సదా భామి కదాచిన్నాహమప్రియః।

బ్రహ్మైవామతః సిద్ధం సచ్చిదానన్దలక్షణమ్॥2॥

శ్లో॥మయ్యేవోదేతి చిద్వ్యోమ్ని జగద్గన్ధర్వపత్తనమ్।

అతోఽహం న కథం బ్రహ్మ సర్వజ్ఞం సర్వకారణమ్॥3॥

శ్లో॥న స్వతః ప్రత్యభిజ్ఞానాన్నిరంశత్వాన్నచాన్యతః।

నచాశ్రయవినాశాన్మే వినాశః స్యాదనాశ్రయాత్॥4॥

శ్లో॥న శోషప్లోషవిక్లేదచ్ఛేదాశ్చిన్నభసో మమ।

సత్త్యైరప్యనిలాగ్న్యమ్భః శస్త్రైః కిముత కల్పితైః॥5॥

శ్లో॥అభారూపస్య విశ్వస్య భానం భాసన్నిధేర్వినా।

కదాచిన్నావకల్పేత భా చాహం తేన సర్వగః॥6॥

శ్లో॥నహి భానాదృతే సత్త్వం నర్తే భానం చితోఽచితః।

చిత్సంభేదోఽపి నాధ్యాసాదృతే తేనాహమద్వయః॥7॥

శ్లో॥న దేహో నేన్ద్రియం చాహం న ప్రాణో న మనో న ధీః।

మమతాపరిరబ్ధత్వాదాక్రీడత్వాదిదం ధియః॥8॥

శ్లో॥సాక్షీ సర్వాన్వితః ప్రేయానహం నాహం కదాచన।

పరిణామపరిచ్ఛేద పరితాపైరుపప్లవాత్॥9॥

శ్లో॥సుప్తేహమి న దృశ్యన్తే దుఃఖదోష ప్రవృత్తయః।

అతస్తస్యైవ సంసారో నమే సంసర్తు సాక్షిణః॥10॥

శ్లో॥సుప్తః సుప్తిం న జానాతి నాఽసుప్తే స్వప్న జాగరౌ।

జాగ్రత్స్వప్నసుషుప్తీనాం సాక్ష్యతోఽహమతద్దశః॥11॥

శ్లో॥విజ్ఞానవిరతిః సుప్తిస్తజ్జన్మ స్వప్న జాగరౌ।

తత్సాక్షిణః కథం మే స్యుర్నిత్యజ్ఞానస్య తే త్రయః॥12॥

శ్లో॥షడ్వికారవతాం వేత్తా నిర్వికారోహమన్యథా।

తద్వికారానుసంధానం సర్వథా నావకల్పతే॥13॥

శ్లో॥తేన తేన హి రూపేణ జాయతే లీయతే ముహుః।

వికారి వస్తు తస్యైషామనుసంధాతృతా కుతః॥14॥

శ్లో॥న చ స్వజన్మ నాశం వా ద్రష్టుమర్హతి కశ్చన।

తౌ హి ప్రాగుత్తరాభావ చరమప్రథమ క్షణౌ॥15॥

శ్లో॥న ప్రకాశేఽహమిత్యుక్తిర్యత్ప్రకాశైక నిబంధనః।

స్వప్రకాశం తమాత్మానమప్రకాశం కథం స్పృశేత్॥16॥

శ్లో॥తథాప్యాభాతి కోఽప్యేష విచారాభావజీవనః।

అవశ్యాయశ్చిదాకాశే విచారార్కోదయావధిః॥17॥

శ్లో॥ఆత్మాజ్ఞానమహానిద్రా జృమ్భితేఽస్మిఞ్జగన్మయే।

దీర్ఘస్వప్నే స్ఫురన్త్యేతే స్వర్గమోక్షాది విభ్రమాః॥18॥

శ్లో॥జడాజడవిభాగోఽయమజడే మయి కల్పితః।

భిత్తిభాగే సమే చిత్ర చరాచర విభాగవత్॥19॥

శ్లో॥చేత్యోపరాగరూపా మే సాక్షితాపి న తాత్త్వికీ।

ఉపలక్షణమేవేయం నిస్తరఙ్గచిదమ్బుధేః॥20॥

శ్లో॥అమృతాబ్ధేర్న మే జీర్ణిమృషాడిణ్డీరజన్మభిః।

స్ఫటికాద్రేర్న మే రాగః స్వాప్నసంధ్యాభ్రవిభ్రమైః॥21॥

శ్లో॥స్వరూపమేవ మే సత్త్వం న తు ధర్మో నభస్త్వవత్।

మదన్యస్య సతోఽభావాన్నహి సా జాతిరిష్యతే॥22॥

శ్లో॥స్వరూపమేవ మే జ్ఞానం  న గుణః స గుణో యది।

అనాత్మత్వమసత్త్వం వా జ్ఞేయాజ్ఞేయత్వయోః పతేత్॥23॥

శ్లో॥అహమేవ సుఖం నాన్యదన్యచ్చేన్నైవ తత్సుఖమ్।

అమదర్థం నహి ప్రేయోమదర్థం న స్వతః ప్రియమ్॥24॥

శ్లో॥నహి నానా స్వరూపం స్యాదేకం వస్తు కదాచన।

తస్మాదఖణ్డ ఏవాస్మి విజహజ్జాగతీం భిదామ్॥25॥

శ్లో॥పరోక్షతాపరిచ్ఛేద శాబల్యాపోహనిర్మలమ్।

తదసీతి గిరా లక్ష్యమహమేకరసం మహః॥26॥

శ్లో॥ఉపశాన్తజగజ్జీవ శిష్యాచార్యేశ్వరభ్రమమ్।

స్వతః సిద్ధమనాద్యన్తం పరిపూర్ణమహం మహః॥27॥

శ్లో॥లక్ష్మీధరకవేః సూక్తి శరదమ్భోజసంభృతః।

అద్వైత మకరన్దోఽయం విద్వద్భృఙ్గైర్నిపీయతామ్॥28॥

॥ఇతి శ్రీ లక్ష్మీధరకవి విరచిత శ్రీ అద్వైత మకరన్దః సమాప్తః॥

॥ ఓం శ్రీ కృష్ణార్పణమస్తు॥

ఓం సహనావవతు సహనౌ భునక్తు సహవీర్యం కరవావహై।

తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై॥

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

